స్యముగా మద్యపానమును జేసి పుత్రాదులతోఁగూడ సహవాసమును జేయుచుండఁగా దైవయోగముచేత తెలిసికొనిరేని పుత్రాదులు ప్రాయశ్చిత్తార్హులగుదురు. అట్టిసాంగత్యమును మూడుదినములు మాత్రముచేసిన పుత్రాదులు ఒకదినముపవాసమును జేసి మరుదినముపంచగవ్య ప్రాశనను జేసినమొదల పరిశుద్ధుడగును, పదిదినములట్టివానితో సాంగత్యమును జేసినపిమ్మట మద్యపానమును జేసినట్లు తెలిసెనేని వేయిపర్యాయములు గాయత్రీజపమును జేసి పిమ్మట నొకరాత్రియంతయు నుపవాసమును జేసి పంచగవ్య ప్రాశనను జేసినమొదల పరిశుద్ధుఁడగును, పదునైదుదినములట్టి వానితో సాంగత్యముగలిగినమొదల ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించి పిమ్మట పంచగవ్యప్రాశనను జేయవలయును, అట్టిపాపాత్మునితో తెలియక యొక్కమాసము సాంగత్యము గలిగినమొదల చాంద్రాయణమునాచరించి పిమ్మటపంచగవ్య ప్రాశనము జేయవలయును. మద్యపానమును జేసినవానితో ఐదుమాసములు సహవాసమును జేసినవాఁడు స్నానమును జేసి శుద్ధమనస్కుఁడై పదిగోవులను దానముచేయవలయును. పిమ్మటపూర్వోక్తప్రకారముగ పంచగవ్యప్రాశనను జేయవలయును, దైవయోగమువలన నారుమాసములు మద్యపాయితో సహవాసమును జేసినవాఁడు కేశవపనమును జేయించికొని నూరుగోవులను దానముచేయవలయును, పూర్వోక్తప్రకారముగఁ బంచగవ్యప్రాశనను జేయవలయును, మద్యపానమును జేసినవానితోఁ గూడఁదొమ్మిదిమాసములు సహవాసమును జేసినవాఁడు పైఁజెప్పఁబడిన ప్రకారము వపనమును జేయించుకొని పరిశుద్ధుఁడై యలంకారమును జేసికొని రెండువేలగోవులను దానము సేయవలయును, పిమ్మటఁ బంచగవ్యప్రాశనమును జేయవలయును, ఇట్లుచేసెనేని పరిశుద్ధుఁడగును, మద్యపానమును జేయునట్టి పాపాత్మునియొక్క పత్నీపుత్రాదులతో నొకసంవత్సరము దనుక సహవాసముసేసెనేని యట్టిపాపాత్ముని పత్నీపుత్రాదులును, నతనితో సహవాసము జేసినవాఁడును మద్యపానమును జేసినవారలే యగుదురు, అట్టివారలతో బ్రాహ్మణులు సహవాసమును జేయఁగూడదు (అనఁగానట్టిపాపాత్ములను కులములోనుండి బహిష్కృతను జేయవలయు ననుట) వారిలో అట్టిపాపాత్మునియొక్క పత్నీపుత్రాలకాచరణాంత ప్రాయశ్చిత్తమును జేయించవలయును, సహవాసమును జేసినవాఁడు సంవత్సరానంతరమందు వీఁడు మద్యపానమును జేసినవాఁడని తెలిసికొని దేహశుద్ధిఁ గోరుచున్నవాఁడై బ్రాహ్మణసభను గల్పించి యాస కులయొక్క యాజ్ఞచేత [illegible] పూర్వోక్తముగ నూరుగోవులను

బ్రాహ్మణులకు దానముచేయవలయును. పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేసి కొని పునరుపనయన సంస్కారమును బొందవలయును. అనంతరమందుబ్ర హ్మోపదేశ గాయత్ర్యుపదేశములను బొందవలయును. ఇట్టి ప్రాయశ్చి త్తమును దేహసంశుద్ధికొఱకుఁ జేసికొననియెడల నెట్టిపుణ్యకర్మలనుజేసినను ఫలమును బొందఁజాలఁడు. ప్రాయశ్చిత్తమును జేసికొనక మునుపే మరణ మునుబొందెనేని యతనిపుత్రాదులు దహనాదిసంస్కారములను జేయఁగూ డదు. కావున శీఘ్రముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయునని కాత్యా యనుఁడుజెప్పె. ఇట్లని హేమాద్రియను పండితునిచే రచింపఁబడిన ప్రాయ శ్చిత్తాధ్యాయమునందు మద్యపానమును జేసినవానితో సాంగత్యమునుజేసిన పత్నీపుత్రాదులకు ప్రాయశ్చిత్తవిధానముసమాప్తము॥

——— ❋ సువర్ణస్తేయప్రాయశ్చిత్తం. ❋ ———

(౨౦) అథసువర్ణస్తేయప్రాయశ్చిత్తమాహ_బ్రైంగః॥ శ్లో॥ సమక్షం వాపరోక్షంవా బలాచ్చౌర్యేణవాపునః । పరస్వానాముపాదానం స్తేయ ఇ త్యుచ్యతేబుధైః॥❋॥ కూర్మపురాణే॥ శ్లో॥ సమక్షంవాపరోక్షంవా బలా చ్చౌర్యేణవాపునః। యోన్యస్యహరతేవిత్తం తమాహుః స్తేయినంబుధాః। పర కీయంసువర్ణంయస్మహాపాపసముద్భవం। తద్ధరేద్బ్రాహ్మణోయస్స మహా పాతకినాంవరః॥ సువర్ణం జతంతామ్రంపారక్యంయోహరేద్ద్విజః। సయా తినరకంఘోరం పునరావృత్తివర్జితం॥❋॥ సువర్ణస్యప్రమాణమాహ । రజత తామ్రకాంస్యధాన్యవస్త్రాదీనాంచ సారం దే॥ శ్లో॥ సువర్ణస్యప్రమాణం చమన్వాద్యైః పరిభాషితం। వక్ష్యేశృణుధ్వంవిప్రేంద్రాః ప్రాయశ్చిత్తోక్తి సాధనం। గవాక్షగతమార్తండ రశ్మిమధ్యేప్రదృశ్యతే । త్రసరేణుప్రమాణం తురజఇత్యుచ్యతెబుధైః॥ త్రసరేణ్వష్టకంలిక్షాతత్త్రియంరాజసర్షపం॥ గౌర సర్షపంతత్త్రియం తత్త్రియంయవఉచ్యతే। యవత్రయంకృష్ణలంస్యా న్మాష స్సాఛత్తస్యపంచకం। తద్ద్వయంరూపకంప్రోక్తం నిష్కంతత్పంచకంవిదుః। మాషషోడశమానంతు సువర్ణమితికథ్యతే। పలంసువర్ణాశ్చత్వారస్తానిచత్వా రిమైద్రుమః । చత్వారింశద్ద్రుమాణాంచభారఇత్యుచ్యతేబుధైః । సువర్ణేనయ దాక్రీతం రజతంధర్మమార్గతః । యావాన్రజతరాశిశ్చతద్రాజతముదాహృ తం। హృత్వాబ్రహ్మస్వమజ్ఞానా ద్ద్వాదశాబ్దంతుపూర్వవత్ । కపాలధ్వజ హీనంతు బ్రహ్మహత్యావ్రతంచరేత్। గురూణాంయజ్ఞకర్తౄణాంధర్మిష్ఠా నాంతథైవచ। శ్రోత్రియాణాంద్విజానాంతు హృత్వాహేమకథంభవేత్। కృ తాత్మదాహేవాదేహేచ సంపూర్ణంలేపమేధ్యఘృతం। కారీషాచ్ఛాదితోదగ్ధ

స్తేయపాపాత్ప్రముచ్యతే॥ *॥ బ్రహ్మాండపురాణే॥ శ్లో॥ అజ్ఞానాద్బ్రాహ్మ
ణో హృత్వా బ్రహ్మస్వం ప్రణయాదివా। కపాలధ్వజహీనం తు బ్రహ్మహత్యా
వ్రతం చరేత్। యద్వాం సే ముసలం ధృత్వా విప్రస్యాత్మశిరోరుహాన్। గ
త్వా రాజానమాచక్షీద్ధత స్తేనైష మస్తకే। మృతశ్శుద్ధిమవాప్నోతి నాన్యథా
శుద్ధిరిష్యతే॥ *॥ తదాహాపస్తంబః। స్తేనః ప్రకీర్ణకేశోంసే ముసలమాధాయ
రాజానం గత్వా కర్మాచక్షీత తేనైనం హన్యాద్వధే మోక్షః॥ *॥ అల్పసువర్ణా
పహరణే ప్రాయశ్చిత్తమాహ। గౌతమధర్మే॥ బ్రహ్మస్వం యస్తు హృత్వా చ ప
శ్చాత్తాపమవాప్నుయాత్। పునర్దత్వా తు విప్రేభ్యః ప్రాయశ్చిత్తవిధిః కథం। తత్ర
సాంతపనం కృత్వా ద్వాదశాహోపవాసతః। శుద్ధిమాప్నోతి విప్రేంద్రా అ
న్యథా పతితో భవేత్। త్రసరేణుసమం హేమ హృత్వా కుర్యాత్సమాహితః।
ప్రాణాయామద్వయం సమ్యక్తేన శుద్ధ్యతి సత్తమాః। ప్రాణాయామత్రయం కృ
త్వా హృత్వా లిక్షాప్రమాణకం। ప్రాణాయామాశ్చత్వారో రాజసర్ష
పమాత్రతః। గౌరసర్షపమాత్రం తు హృత్వా హేమ విచక్షణైః। స్నాత్వా చ వి
ధివత్కార్యం గాయత్ర్యష్టసహస్రకం। యవమాత్రసువర్ణస్య స్తేయే శుద్ధ్యే
ద్ద్విజః॥ ఆసాయం ప్రాతరారభ్య గాయత్రీం వేదమాతరం। హేమకృష్ణ
లమాత్రం తు హృత్వా సాంతపనం చరేత్। మాషమాత్రసువర్ణస్య ప్రాయశ్చి
త్తం తు కథ్యతే। గోమూత్రపక్వయవభుగ్దేవార్చనపరాయణః॥ మాసత్రయే
శుద్ధస్స్యాచ్చాంద్రాయణపరాయణః॥ రూపమాత్రసువర్ణస్య స్తేయం కృత్వా
ప్రమాదతః। జపేద్ద్విలక్షం గాయత్రీమన్యథా దోషమాప్నుయాత్। నిష్కమా
త్రసువర్ణస్య హరణే విప్రసత్తమాః। బ్రహ్మహత్యావ్రతం కృత్వా షడబ్దం శు
మాప్నుయాత్। కించిన్న్యూనసువర్ణస్య స్తేయే తు ద్విజసత్తమాః॥ గోమూ
త్రపక్వయవభుగబ్దేనైకేన శుద్ధ్యతి। సంపూర్ణస్య సువర్ణస్య స్తేయం కృత్వా
నీశ్వరాః। బ్రహ్మహత్యావ్రతం కుర్యాద్ద్వాదశాబ్దం సమాహితః। రత్నా
మనుష్యస్త్రీభూమిధేన్వాదికేష్వపి। సువర్ణసదృశేష్వేషు ప్రాయశ్చిత్త
ముచ్యతే॥ *॥ మార్కండేయపురాణే॥ విప్రస్వహరణే క్షత్రియాదీనాం ప్రా
యశ్చిత్తం విశినష్టి॥ శ్లో॥ స్తేయం కృత్వా సురాం పీత్వా రాజా యో ధర్మవ
త్సలః। విప్రస్వహరణే రాజా స్వర్ణమాత్రమథాధికం। మృత్వా నరకమాప్నో
త్యహో వశ్యం సద్విజాః। పశ్చాత్తాపసమాయుక్తో బ్రహ్మహత్యావ్రతం చ
రేత్। తేభ్యశ్చ దత్వా తద్ధనం పశ్చాచ్చాంద్రాయణద్వయం। కృత్వా శుద్ధిమ
వాప్నోతి నాన్యథా జనసల్లభః॥ *॥ కౌర్మే॥ శ్లో॥ అజ్ఞానాద్బ్రాహ్మణో హృ
త్వా ప్రాణాంస్స్వర్గముత్తమం। [illegible] ధర్మిష్ఠానాం

వచ। శ్రోత్రియాణాంద్విజానాంతువిధవానాంవిశేషతః ॥ పూర్వవద్ఘృతలిప్తాంగః కుర్వన్ సూర్యావలోకనం। కారీషచ్ఛాదితోదగ్ధస్తేయపాపాత్ప్రముచ్యతే ॥ లైంగే॥ బ్రహ్మస్వంక్షత్రియోహృత్వా అశ్వమేధేనశుద్ధ్యతి। ఆత్మతుల్యంసువర్ణంవా దద్యాద్వాగోసవంచరేత్। బ్రహ్మస్వంక్షత్రియోహృత్వాపశ్చాత్తాపమవాప్యచ। పునర్దత్వాతువిప్రేభ్యః ప్రాయశ్చిత్తవిధిఃకథం। తత్రసాంతపనంకృత్వాద్వాదశాహోపవాసతః। శుద్ధిమాప్నోతివిప్రేంద్రాఅన్యథాపతితోభవేత్॥

(౨౧) బంగారమును దొంగిలించువానికిఁ బ్రాయశ్చిత్తము॥ సర్వజనులును జూచుచుండఁగా బలాత్కారముచేతనైనను, ఎవ్వరును జూడకుండునటులఁ జౌర్యముచేతనైనను బరులద్రవ్యము నపహరించుట దొంగతనమనఁబడునని లైంగపురాణమునందుఁ జెప్పఁబడియె. సమక్షమమునందైననసమక్షంబుననైనను, బలాత్కారముగనైనను, చౌర్యముచేతనైనను బరులద్రవ్యము నపహరించుట దొంగతనమనఁబడును. పరులద్రవ్యమునపహరించుట మహాపాతకంబనఁబడును. ఈదొంగతనమున బ్రాహ్మణుఁడు మిగుల దూష్యుఁడగును. సువర్ణమును, వెండిని, తామ్రమును, దొంగలించినవాఁడు ఘోరముగునరకమునుబొందును. ఇట్లని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. సువర్ణప్రమాణము మన్వాదులచే నిర్ణయింపఁబడియె. అదియెట్లనినగవాక్షములయందు, (అనఁగా కిటికీలయందు) ప్రవేశించినకిరణములయొక్క మధ్యయందలిరజము, త్రసరేణుప్రమాణమని యెఱుఁగనగును. ఎనిమిదిత్రసరేణువులు లిక్షయనఁబడును. మూఁడులిక్షలు రాజసర్షపమనఁబడును. మూఁడు రాజసర్షపములొక్క గౌరసర్షపము. మూఁడు గౌరసర్షపము లొక్కయవయనఁబడును. మూఁడు యవలుకృష్ణలనఁబడును. అయిదుకృష్ణలములు మాషయనియెఱుంగనగును. రెండుమాషలొక్కరూపకమగును. అయిదురూపకము లొక్కనిష్కమగును. పదునారుమాషలప్రమాణముగల బంగారము స్వర్ణమనఁబడును. నాలుగుసువర్ణములొక్కపలము. నాలుగుపలములొక్కధ్రువము. ఇరువదినాలుగుధ్రువలు భారమనఁదగును. ధర్మమార్గానుసారముగ సువర్ణముచేత క్రీతమయినరజతమెంతరాశియగునో యదిరాజత మనఁబడును. అజ్ఞానముచేత బ్రాహ్మణద్రవ్యము నపహరించిన బ్రాహ్మణుఁడు పండ్రెండుసంవత్సరములు బ్రహ్మహత్యావ్రతమును కపాలధారణ శూన్యముగఁ జేయవలయును. గురువులయొక్కయు, యజ్ఞముఁ జేయువారలయొక్కయు, ధర్మిష్ఠులయొక్కయు, శ్రోత్రియులయొక్కయు, ద్రవ్యమునపహరించువాఁడు ప్రా

తకులలో నత్యధికుఁడగును. అట్టిమహాపాతకుఁడు, తనశరీరమునందు నేతిని బూసి యెరుపిడకలనుబోగుసేసి యందునిప్పునుదగిలించి దానియందు తనశరీరమునర్పించవలయును. ఇట్లుసేసెనేని యట్టిపాపమునుండి తొలఁగినవాఁడగునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడెను. అజ్ఞానముచేత బ్రాహ్మణద్రవ్యము నపహరించిన బ్రాహ్మణుఁడు కపాలధ్వజహీనముగ బ్రహ్మహత్యావ్రతము నాచరింప వలయును. అట్లుగాదేని ముసలమును (అనఁగా రోకలిని) భుజమునందుఁబెట్టికొని తలవెండ్రుకలను విరియఁబోసికొని రాజుదగ్గరకుఁబోయి యారోకలిచేత నెత్తిఃపోడిపించుకొని వచ్చెనేని పరిశుద్ధుఁడగునని బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడె. ఆపస్తంబుఁడును నీయర్థమునే బోధించునట్టి సూత్రమునువచించె. కొంచమగు సువర్ణమును దొంగలించినందుకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు. బ్రాహ్మణద్రవ్యము నపహరించినవాడు పశ్చాత్తాపమునుబొంది తానపహరించిన ద్రవ్యమునుమరలనిచ్చిబ్రాహ్మణులయొద్దకుఁబోయి నేఁజేసినపాపమునకుఁ దగినప్రాయశ్చిత్తమును విధింపుఁడని యడుగవలయును. అట్లు బ్రాహ్మణులనడిగి వారియనుమతమువలన సాంతపనమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. పిమ్మట పదిరెండుపవాస వ్రతముల నాచరించవలయును. ఇట్లుసేసెనేని పరిశుద్ధుఁడగును కాదేనిపతితుఁడగును. త్రసరేణు ప్రమాణముగల బంగారము నపహరించినవాడు పశ్చాత్తాపమునబొంది మరల నాద్రవ్యమునిచ్చి రెండుప్రాణాయామములను జేసికొనినయెడల పరిశుద్ధుఁడగును. లిక్షాప్రమాణముగల బంగారము నపహరించినవాఁడు మూడుప్రాణాయామముల నాచరించవలయును. రాజసర్షప పరిమాణముగల బంగారము నపహరించినవాఁడు నాలుగుప్రాణాయామములను జేయవలయును. గౌరసర్షపపరిమాణముగల బంగారము నపహరించినవాఁడు స్నానమునుజేసి యెనిమిదివేల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. యవపరిమాణముగల బంగారము నపహరించినవాఁడు ప్రాతఃకాలము మొదలుకొని సాయంకాలము వఱకును నడతెగక గాయత్రీజపమును జేయవలయును. కృష్ణలపరిమాణముగల బంగారము నపహరించినవాఁడు సాంతపనకృచ్ఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. మాషమాత్రసువర్ణము నపహరించినవాఁడు గోమూత్రముచేత పక్వముచేయఁబడిన యవలను మూడుమాసములు భుజించవలయును. అట్లు భుజించి జీవించుచు సర్వకాలములయందును దేవతా[illegible] ప్రమాదవశమునఁ

రూపమాత్రసువర్ణము నపహరించినవాఁడు లక్షపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. ఇట్లు చేయఁడేని పతితుఁడగును. బ్రాహ్మణుని యొక్క సువర్ణమును నిష్కమాత్ర పరిమాణముగలదాని నపహరించిన యెడల బ్రహ్మహత్యావ్రతము నాచరించి షడబ్దకృఛ్రము నాచరించవలయును. నిష్కప్రమాణమునకు కొంచెముతక్కువగలదియగు బంగారము నపహరించినవాఁడు బ్రహ్మహత్యావ్రతమును పదిరెండుసంవత్సరము లాచరింపవలయును. రత్నములు, ఆసనము, మనుష్యుడును, స్త్రీలు, భూమి, గోవు, మొదలగువాని నపహరించినవానికి నిష్కమాత్రసువర్ణమును దొంగిలించినవానికి విధించినప్రాయశ్చిత్తమును విధించవలయును. ఇప్పుడు చెప్పినప్రాయశ్చిత్తములు అజ్ఞానముచేత దొంగతనమును ప్రమాదవశముగా చేసినవానివిషయమనియును దెలియవలయుననియును గౌతమధర్మములయందుఁ జెప్పఁబడియె. దొంగతనము జేసినవాఁడును, మద్యపానమును జేసినవాఁడును, అధర్మపరుఁడయిన రాజును, స్వర్ణమాత్రమయిన నంతకంటె నధికముగానయినను బ్రాహ్మణులబంగారము నపహరించినరాజును, మరణానంతరమందు నరకమును బొందును. కావున నట్టిపాపమును జేసినవాఁడు పశ్చాత్తాపమునుబొంది బ్రహ్మహత్యావ్రతము నాచరించవలయును. మఱియు నాద్రవ్యమును మఱలనిచ్చి రెండుచాంద్రాయణముల నాచరించవలయును. ఇట్లు చేసినజనుఁడు పరిశుద్ధుఁడగును. లేనియెడల నరకమునందుఁ బడునని మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడియె. అజ్ఞానమువలన క్షత్రియుఁడు బ్రాహ్మణులయొక్కయు, గురువులయొక్కయు, ధర్మాత్ములయొక్కయు, శ్రోత్రియులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు, విధవయొక్కయు, స్వర్ణమును, అపహరించినయెడల పాపాత్ముఁడగును. కావున నట్టిపాపాత్ముఁడు, మునుపటివలెనే నేతిచేత శరీరమును దడిపికొని పేడపిడకలనిప్పునందుచుమికి మృతుఁడయ్యెనేని పరిశుద్ధుఁడగునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడె. క్షత్రియుఁడు బ్రాహ్మణద్రవ్యము నపహరించెనేని యశ్వమేధయాగమును జేసినయెడల పరిశుద్ధుఁడగును. అట్లుగాదేని తనశరీరమునకుసమానముగనుండునంత బంగారమును తూచి దానముచేయవలయును. అట్లుగాదేని గోసవమును జేయవలయును. మఱియును క్షత్రియుఁడు బ్రాహ్మణద్రవ్యము నపహరించెనేని పశ్చాత్తాపమునుబొంది మరల నాద్రవ్యమునిచ్చి ప్రాయశ్చిత్తవిధానమును బ్రాహ్మణులవలనఁ దెలిసికొని సాంతపనమును జేయవలయును. పిమ్మట పదిరెండుదినము లుపవాసమును జేయవలయు

ను. ఇట్లు చేసెనేని పరిశుద్ధుఁడగునని లింగపురాణమునందుఁ జెప్పఁబడెను.

—— (*) పునరపి రాజ్ఞాం స్తేయప్రకారమేవాహ. (*) ——

(౨౧) శివరహస్యే॥ శ్లో॥ అన్యాయాద్విప్రగ్రామేషు అనాథేభ్యో ధ
నం హరేత్ । అదండ్యేభ్యశ్చ యద్విత్తం తత్స్తేయం భూభుజామిహ । తదపి
స్తేయమేవేత్యుక్తం పూర్వవత్కృత్వా శుద్ధిమాప్నుయాత్॥ శ్లో॥ సురామపి
యవాజ్ఞానాత్పిబేద్రాజా సకృద్ద్విజాః । అగ్నిదగ్ధాం సురాం కృత్వా పీత్వా
మృత్వా తతశ్శుచిః । అథవా ప్రముఖ్యానాం ద్వ్యయుతం ధేనుమాచరేత్।
స్తేయం కృత్వా సురాం పీత్వా మృత్వా రాజా విశుద్ధ్యతి। ద్విజేభ్యో ద్వ్యయు
తం దాన మితియత్తదసాంప్రతం । వర్ణచతుష్టయనారీణాం మద్యపానసంభ
వేనమరణాంత.। కింతు త్యాగ ఏవ వరం। న పోషణోపాయః । క్షత్త్రియశూద్ర
స్త్రీణాం కేచిద్వధమిచ్ఛంతి। సువర్ణస్తేయస్యైవ మేవ వేదితవ్యం॥*॥ తదాహ
కాత్యాయనః॥ శ్లో॥ విప్రాదీనాంతు నారీణాం స్తేయం వా పానమేవవా। సం
భవేద్యది దైవేన నేచ్ఛంతిమరణం బుధాః। త్యాజ్యా ఏవ స్త్రియోపిస్యుర్నపో
ష్యా ధర్మలిప్సుభిః । క్షత్రియాదేర్వధః ప్రోక్తో విప్రాణాం గర్హితం స్మృతమి
తి॥ లైంగే॥ శ్లో॥ సురాపానం వణిక్కృత్వా సువర్ణం వా ద్విజన్మనాం । హృత్వే
తి శేషః। క్షత్రవచ్ఛుద్ధిమాప్నోతి శూద్రో మాసల్యమర్హతి॥ స్కాందే శ్లో॥ సు
రాం పీత్వా సువర్ణం వా హృత్వా యది వణిక్పతిః। రాజవచ్ఛుద్ధిమాప్నోతి ద్వ్య
యుతం వా గవాం చరేత్॥ నాగరఖండే॥ శ్లో॥ ఊరుజస్తు సురాం పీత్వా హృ
త్వా స్వర్ణం ద్విజన్మనాం । క్షత్రవద్వా శుద్ధిస్స్యాదథవా ద్వ్యయుతం గవాం
దద్యాదితి శేషః । సచ్ఛూద్రస్తు సురాం పీత్వా హృత్వా హేమ ద్విజన్మనాం
రాజ్ఞా దండ్యస్స్వధర్మేణ ముసలేన హతశ్శుచిః॥ స్కాందే॥ శ్లో॥ పాదజస్తుయ
దా హృత్వా సువర్ణం పూర్వజన్మనాం। సురాం పీత్వా సకృత్ జ్ఞాత్వా మాసల్యా
వధమర్హతి॥ విష్ణుధర్మోత్తరే॥ శ్లో॥ అంఘ్రిజో యస్సురాం పీత్వా హృత్వా
హేమ ద్విజన్మనాం । తత్ స్త్రీణాం త్యాగ ఏవ స్యాత్ సోపి మాసల్యమర్హతి
రాజవిజయే॥ శ్లో॥ పాదజో యది మోహేన సురాం పీత్వా ద్విజన్మనాం । హృ
త్వా హేమకథం తస్య రాజ్ఞా మాసల్య ఇష్యతే। తత్ స్త్రీణాం త్యాగ ఏవ స్యా
ద్వధో వా మునిచోదితః॥ ఇతి హేమాద్రి విరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తా
ధ్యాయే క్షత్రియాదీనాం ప్రస్వహరణే సురాపానే చ ప్రాయశ్చిత్తం॥

(౨౧) మరల రాజులకు దొంగతనప్రకారమును జెప్పుచున్నాఁడు.
అన్యాయముగ బ్రాహ్మణాగ్రహారములయందుఁ బ్రవేశించి అనాథలగువా
రి ధనము నపహరించినను, శిక్షార్హులుగాని వారివలన ద్రవ్యము నపహ

చినను, రాజులు దొంగతనముచేసినవారగుదురు. ఇట్టి దొంగతనమును జేసి నరాజుపైఁజెప్పఁబడిన ప్రకారము ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మఱియును రాజగువాఁడజ్ఞానమువలన మద్యపానమును జేసినయెడల మద్యమును తామ్రాదిపాత్రలయందుఁబోసి యెఱ్ఱగా కాచి పానముచేసి మరణమునుబొందెనేని పరిశుద్ధుఁడగును. దొంగతనమును జేసినరాజు, సురాపానమును జేసినరాజు మరణమునుబొందినపిదపఁ బరిశుద్ధులగుదురు. అట్లుగాదేని బ్రాహ్మణులకు రెండువేలగోవులను దానము చేసినయెడలఁ బరిశుద్ధుఁడగునని కొందఱుసెప్పిరిగాని యిదియుచితమైన శాస్త్ర సంప్రదాయముగాదు. ఇట్టిపాపములను జేసినరాజు మరణముచేతనే పరిశుద్ధుడగునుగాని మఱియొకదానిచేత పరిశుద్ధుఁడుగానేరడని శివరహస్యమునందు జెప్పబడియె. నాలుగువర్ణములవారియొక్కయు స్త్రీలుమద్యపానమును జేసిరేని మరణాంతప్రాయశ్చిత్తమును జేయింపఁగూడదు. మఱిమెట్టులనిన నట్టిస్త్రీలయొక్క పోషణాదులను వదలి కులములో జేరకుండునటుల వెడలఁగొట్టవలయును. బ్రాహ్మణేతరస్త్రీలకు మరణాంతక ప్రాయశ్చిత్తమును విధించవచ్చునని కొందఱందురు. దొంగతనమునందును నిటులనేయని యెఱుంగనగును. ఇట్లనికాత్యాయనుడు వచించె. వైశ్యుడు సురపానమును జేసినను, సువర్ణమును దొంగలించినను, క్షత్రియునకువలెనే ప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఈకృత్యములను శూద్రుడు మౌసల్యవధకు నర్హుఁడగునని లింగపురాణమునందు జెప్పబడియె. కోమటి, సురాపానమును జేసినను, సువర్ణమునపహరించినను, రాజునకువలెనే ప్రాయశ్చిత్తమును విధింపవలయును. కాదేని రెండువేలగోవులను దానముచేయవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె. నాగరఖండమునందును నీయర్థమే వివరింప బడియె. సచ్ఛూద్రుడుసురాపానమును, జేసినను, సువర్ణము నపహరించినను మౌసల్యవధను బొందవలయు ననియును నాగరఖండమునందు జెప్పబడియె. శూద్రుడు బ్రాహ్మణులసువర్ణము నపహరించినను, మద్యపానమును జేసినను మౌసల్యవధకు దగినవాడని స్కాందపురాణమునందు జెప్పబడియె. విష్ణుధర్మోత్తరమందును నిటులనేజెప్పి యీకృత్యములను శూద్రస్త్రీలు సేసినయెడల వారల బరిత్యజించుటయే యుచితమనియును జెప్పె. రాజవిజయమను గ్రంథమునందును నిటులనే చెప్పబడియె. ఇట్లని హేమాద్రిచేత రచింపబడిన ధర్మశాస్త్రమునందు ప్రాయశ్చిత్తాధ్యాయమునందు క్షత్రియాదులకు విప్రద్ర

వ్యవహారణమునందును, సురాపానమునందును విధింపబడిన ప్రాయశ్చిత్తవిధానము ముగిసెను.

## రజతాదిస్తేయప్రాయశ్చిత్తమ్.

(౨౨) అథరజతాదిస్తేయ ప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ శ్లో॥ సువర్ణేవపరిమాణేన క్రీతంయద్రాజతంభవేత్। తావద్ధరేద్విజోయస్సస్తేనఇత్యుచ్యతేబుధైః॥ స్కాందే॥ శ్లో॥ రాజతంయేనయత్కించితం పూర్వమానేవ ధర్మతః। తద్ధృత్వాముఖజస్సమ్య గజ్ఞానాద్రాజనందన। స్తేనఇత్యుచ్యతేసద్భిః ప్రాయశ్చిత్తీభవేద్ద్విజః॥ చతుర్వింశతిమతే॥ శ్లో॥ అజ్ఞానాద్రాజతంహృత్వాపూర్వంజోయదిదైవతః। సమ్యత్వాపూర్వవద్రాజకశుద్ధిమాప్నోతి... తం॥ మహాచారదిత్యే॥ శ్లో॥ సువర్ణమానాదన్యస్మిన్ రజతేస్తేయకర్మణి। ... ర్యాత్సాంతపనంసమ్యగన్యథాపతితోభవేత్। దశనిష్కాంతపర్యంతమూర్ధ్వం నిష్కచతుష్టయాత్। హరేచ్చేద్రాజతంవిద్వాన్కుర్యాచ్చాంద్రాయణంద్విజః। దశాదిశతనిష్కాంత రజతస్తేయకర్మణి। చాంద్రాయణద్వయంప్రోక్తం తత్పాపపరిశోధనం। శతాదూర్ధ్వంసహస్రాంతం ప్రోక్తంచాంద్రాయణత్రయం। సహస్రాదధికస్తేయే బ్రహ్మహత్యావ్రతంచరేత్॥ స్కాందే॥ శ్లో॥ సువర్ణాదధికస్తేయే రజతస్యవిశాంపతే। కుర్యాత్సాంతపనంసమ్యగన్యథాదోషభాగ్భవేత్। దశనిష్కాంతపర్యంత మూర్ధ్వంనిష్కచతుష్టయాత్। హరేచ్చేద్రజతంవిద్వాన్ కుర్యాచ్చాంద్రాయణంశుభం। శతదూర్ధ్వం సహస్రాంతం ప్రోక్తంచాంద్రాయణత్రయం। సహస్రాదధికస్తేయే బ్రహ్మహత్యావ్రతంచరేత్। క్షత్రియవిశాంరజతస్తేయే విప్రప్రాయశ్చిత్తాద్ద్విగుణం వేదితవ్యం॥ శూద్రస్యతుమాసల్యఏవ। తత్రత్రీణాంరజతాదిసంభవే త్యాగఏవపూర్వవన్నమరణాది॥ ఇతి హేమాద్రౌరజతాదిస్తేయప్రాయశ్చిత్తం॥

(౨౨) రజతాదిస్తేయప్రాయశ్చిత్తము॥ సువర్ణప్రమాణముగల బంగారముచేతగొనఁదగిన వెండి రాజతమనబడును. అంత పరిమాణముగల వెండినపహరించి నపుడది దొంగతనమనియును, అట్టివాఁడు దొంగయని చెప్పబడునని లింగపురాణమునందు జెప్పఁబడియె॥ స్కాందమునందును నిట్లనే చెప్పబడియె. మఱియునిట్టి పాపకృత్యమును జేసినవాఁడు ప్రాయశ్చిత్తీయగుననియును జెప్పబడియె॥ బ్రాహ్మణుఁడగువాఁడజ్ఞానమువలన బంగారమునపహరించిన యెడల స్వర్ణాపహారమునకు జెప్పఁబడినచందముగ మరణాంతిక ప్రాయశ్చిత్తముచేత [illegible] చతుర్వింశతిమతమునందుఁ జెప్ప...

మె* సువర్ణ మానముకంటె నితరమగుపరిమాణముగలవెండిని నపహరించి నబ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తార్థముగ సాంతపనము నాచరించవలయును. అట్లుచేయ డేనిపతితుఁడగును. పదివరహాలపరిమాణము మొదలుకొని పధునాలుగువరహాలకులోఁబడిన పరిమాణముగలవెండిని నపహరించినబ్రాహ్మణుఁడుతత్పాపశాంతికొఱకు రెండుచాంద్రాయణముల నాచరించవలయును; నూరు మొదలుకొని వేయికిలోపలదొంగిలించినవాఁడు మూడుచాంద్రాయణములనాచరించవలయును. వేయికధికముగదొంగలించినవాఁడు బ్రహ్మహత్యావ్రతమును జేసినయెడల బరిశుద్ధుఁడగుననియును, మహానారదీయమునందు జెప్పఁబడియె* సువర్ణప్రమాణమునకధికమయిన వెండిని దొంగలించినవాడుతద్దోషశాంతికొఱకుసాంతపనమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయును. నాలుగువరహాలకుగొనదగినది మొదలు పదివరహాలకుఁగొనదగినదానికిలోపలనుండునట్టి వెండిని దొంగలించినవాఁడు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. నూరు మొదలుకొని వేయికిలోపలదొంగలించినవాడు మూడుచాంద్రాయణముల నాచరించవలయును. వేయికధికముగ దొంగలించినవాఁడు బ్రహ్మహత్యావ్రతమునునాచరింపవలయును. క్షత్రియవైశ్యులీకృత్యములను జేసినయెడల బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమునకు ద్విగుణమగుప్రాయశ్చిత్తమునాచరింపవలయును. శూద్రునకుమాసల్యవధనేనిర్ణయింపవలయును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులస్త్రీ లీకృత్యములను జేసినయెడల మరణాంతకప్రాయశ్చిత్తమునువదలి త్యాగమునుమాత్రముచేయవలయునని స్కాందపురాణమునందు జెప్పఁబడియె* ఇట్లని హేమాద్రియందు రజతాదిస్తేయప్రాయశ్చిత్తము సమాప్తమయ్యె॥

## ——— తామ్రస్తేయ ప్రాయశ్చిత్తం. ———

(౨౩) అథతామ్రస్తేయప్రాయశ్చిత్తమాహ॥స్కాందే॥శ్లో॥హృత్వా విప్రః పంచపలంతామ్రంపారక్యమాదరాత్। స్తేనఇత్యుచ్యతేసద్భిర్నసంభాష్యఃకదాచన। పలప్రమాణంపూర్వముక్తం॥*॥లింగపురాణే॥శ్లో॥ ముఖజోలోభతస్తామ్రంపారక్యంవైశతంపలం। స్తేయీమహద్భిగదితస్తస్య నాస్తిహినిష్కృతిః॥*॥ గారుడపురాణే॥ శ్లో॥ అనాథానాంచనారీణాం విధవానాంద్విజన్మనాం। గురూణాంకర్మనిష్ఠానాంసాధూనాంతామ్రమాదరాత్ స్నేహేనవాబలాత్కారాద్విప్రోహృత్వాశతంపలం॥తస్యాన్యానిష్కృతిర్నాస్తిమరణాంతవధాదృతే। పలద్వయేపంచగవ్యంపీత్వాశుద్ధి మవాప్నుయాత్। ప్రాజాపత్యంపంచపలేతత్పంచదశపలేస్మృతం। వింశత్పలేతుచాంద్రంస్యాత్సం

చాశత్పలకైస్త్రయః। తామ్రే షష్టిపలే ప్రోక్తం మాసం కృత్వాఘమర్షణం। కంఠద ఘ్నజలే స్థిత్వా శుద్ధి మాప్నోతి పూర్వజః తామ్రే శీతిపలే రాజత స్తేయం కృత్వా తు పూర్వజః॥ త్రిః పరిక్రమణం కృత్వా భువశ్చాంద్రం తతః పరం। హృత్వా శత పలం తామ్రం స్వర్ణస్తేయసమం విదుః। శతపల తామ్రస్తేయీ ద్విజః స్వర్ణస్తేయ వత్ప్రాయశ్చిత్తం కుర్యాత్। మరణాంతం ప్రాయశ్చిత్తం స్వర్ణస్తేయినస్సఉక్తం అతో మరణాంత మేవ ప్రాయశ్చిత్తం॥ ద్రవ్యయుత ధేను దానాదిక మేవ తు త్రియవి శో స్తామ్రస్తేయ ప్రాయశ్చిత్తం నతు సువర్ణస్తేయాదివత్॥*॥ ఇతి హేమాద్రౌ తామ్రస్తేయ ప్రాయశ్చిత్తం॥

(౨౩) తామ్రమును దొంగలించిన యెడఁ జేయదగిన ప్రాయశ్చిత్తము॥

బ్రాహ్మణుడు పరులసంబంధమయిన తామ్రమును నైదుపలములు దొంగలించి నయెడల నది దొంగతనమనబడునని స్కాందపురాణమునందు జెప్పఁబడియె॥ బ్రాహ్మణుడగువాడు లోభమువలన తామ్రమును నూరుపలములు దొంగలించినయెడల గొప్పదొంగతనమనబడును. ఇట్టి పాపమునకు నిష్కృతి లేదని యెఱుంగవలయునని లింగపురాణమునందు జెప్పబడియె* అనాథలగుస్త్రీలయొక్కయు, బ్రాహ్మణవిధవస్త్రీలయొక్కయు, గురువులయొక్కయు, కర్మనిష్ఠులయొక్కయు, సాధువులయొక్కయు, నూరుపలముల తామ్రమును, స్నేహముచేతనైనను, బలాత్కారముచేతనైనను దొంగలించిన బ్రాహ్మణునకు నిష్కారము లేదని యెఱుఁగవలయును. కావున నట్టివానికి మరణాంతిక ప్రాయశ్చిత్తమును విధించవలయును. రెండుపలముల తామ్రమును దొంగలించినవాడు పంచగవ్యప్రాశనమును జేసిన యెడల పరిశుద్ధుడగును. మఱియును ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరింపవలయును. పదిపలములను దొంగలించినవానికి తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఇరువదిపలముల తామ్రమును దొంగలించిన యెడల చాంద్రాయణము నాచరింపవలయును. ఏబదిపలముల తామ్రమునుదొంగలించినవాడు మూడుచాంద్రాయణముల నాచరించవలయును. అరువదిపలముల తామ్రము నపహరించినవాఁడొక్కమాసమఘమర్షణవ్రతము నాచరింపవలయును. అది యెట్లనిన కంఠదఘ్నజలమునం దొక్కమాసము దనకనివసించిన యెడల పరిశుద్ధుఁడగును. ఎనబదిపలముల తామ్రమును దొంగలించిన బ్రాహ్మణుఁడు మూడుపర్యాయములు భూచాంద్రాయణమును జేయవలయును. నూరుపలముల తామ్రమును దొంగలించినవాఁడు స్వర్ణమును దొంగలించినవానికి సమమైన పాపముగలవాడగును. కావున స్వర్ణస్తేయికిఁ దగిన ప్రాయశ్చిత్తమును జేయించవలయును. స్వర్ణమును దొంగలించినవానికి మరణాంత

ప్రాయశ్చిత్తముచేయబడినదిగనుక నూరుపలములతామ్రమును దొంగలించిన వానికి మరణాంతికప్రాయశ్చిత్తమును విధింపవలయునని గారుడపురాణము నందుజెప్పఁబడియె* ఇట్లని హేమాద్రియందు తామ్రస్తేయ ప్రాయశ్చిత్త ముముగిసె॥

## కాంస్యస్తేయ ప్రాయశ్చిత్తం.

(౨౮) అథకాంస్యస్తేయప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥శ్లో॥ కాంస్యం యత్నాపనంభూతం పారక్యంయదిలోభతః। స్తేయంకృత్వాద్విజోయస్తుస పాపఫలమశ్నుతే॥*॥ లైంగే॥శ్లో॥ కాంస్యస్తేయీమహాపాపీరౌరవం నరకం వ్రజేత్। పశ్చాద్భవతిపాపాత్మాకారుకోజాయతేభువి। కాంస్యస్తేయీస దాశుద్ధశ్చగ్మనాచ్ఛాదితోయథా। మృద్వాదుఃఖమవాప్నోతిపూర్వవజ్జాయ తేభువి॥*॥ మహాభారతే॥శ్లో॥ కాంస్యంహృత్వాద్విజోలోభాత్పార క్యంద్విజ హేతుకం। మహాంతంనరకంగత్వాహీనవర్ణస్సజాయతే॥*॥ చతుర్వింశతిమతే। శ్లో॥ కాంస్యపిత్తళముఖ్యేషుఆయసాంతేషుపంచసు। సహస్రేషట్సమానంతుపా రక్యంపరికీర్తితం। ప్రాయశ్చిత్తంతులోహానాంస్తేయేరజతవత్స్మృతః। కాం స్యపిత్తళయోస్తేయేవర్ణత్రయస్యరజతస్తేయవత్ప్రాయశ్చిత్తం పలసంఖ్యా యావేదితవ్యం। ననిష్కాదిప్రమాణేన। శూద్రస్యతురాజ్ఞాతత్తద్గురులఘు క్రమేణాంగుళిచ్ఛేద నాదికంకారయితవ్యం। నమారణం। ద్రవ్యస్యాల్పత్వాత్। తత్రత్రైవర్ణికానామేవంసంభవేప్రాయశ్చిత్తంకరణీయం॥*॥ ఇతిహేమాద్రివి రచితేధర్మశాస్త్రేప్రాయశ్చిత్తాధ్యాయే కాంస్యస్తేయప్రాయశ్చిత్తం॥*॥

(౨౮) కంచునుదొంగలించినవానికిప్రాయశ్చిత్తము.॥ పరులసంబంధ మయినకంచును లోభమువలనదొంగలించినబ్రాహ్మణుఁడు దొంగయనబడును నికూర్మపురాణమునందుఁజెప్పబడియె* కంచునుదొంగలించినవాడుమహాపా పియనియును, రౌరవమనునరకమును బొందుననియును, నరకములననుభవిం చినపిమ్మట కారుకుఁడైపుట్టుననియును, కంచునుదొంగలించినవాఁడు సతతము నునపరిశుద్ధుడనియును, మరణానంతరమందు నరకమునుబొందుననియును, మరలతొల్లిటిజన్మనేపొందుననియును లింగపురాణమునందు జెప్పఁబడియె* కంచునుదొంగలించినవాడు మహాపాపియగును. మఱియునట్టివాడుమరణా నంతరమందునరకమునుబొంది హీనవర్ణస్థుఁడైపుట్టునని మహాభారతమునందు జెప్పబడియె* కంచు, పిత్తళి, ఇనుము మొదలగు నైదువిధములలోహముల లోదేన్నినైనను నూరువరహాలచేతగొనదగినంతదొంగలించినయెడల రజతా పహర్తకు విధించినప్రాయశ్చిత్తమును విధించవలయును. కంచుయొక్కయు

పిత్తళిమొకటియు, దొంగతనమును పలములచేత నిర్ణయింపవలయునని చ
తుర్వింశతిమతమునందు జెప్పఁబడెను. ఇట్టిపదార్థమును దొంగలించిన స్త్రీల
కును ప్రాయశ్చిత్తమును జేయవలయును. ఇట్లని హేమాద్రియనుపండితవరు
నిచే జేయఁబడిన ధర్మశాస్త్రమునందు ప్రాయశ్చిత్తాధ్యాయమునందు కాం
స్యస్తేయప్రాయశ్చిత్తము॥

## —— ధాన్యస్తేయప్రాయశ్చిత్తమ్. ——

(౨౫) అథధాన్యస్తేయమాహ॥ మరీచిః॥ శ్లో॥ బ్రాహ్మణోద్రవ్యలోభే
నపారక్యంధాన్యమాహరేత్ ॥ ద్రోణంవాప్రస్థమాత్రంవాహృత్వా సంకష
మశ్నుతే॥ లైంగ॥ శ్లో॥ ముషిత్వాయోద్విజోలోభాద్బలాద్వాచౌర్యతోపివా।
పారక్యంధాన్యమతులం మృత్వానరకమశ్నుతే॥ తదంతేభువమాసాద్యకష్ట
స్థోమూషకోభవేత్॥ * ॥ ధాన్యప్రమాణమాహ॥ కూర్మపురాణే॥ పురాణంపా
శ్లో॥ పూరణంపష్టిభిర్బీజైస్తద్ద్వయంకోశఉచ్యతే। కోశద్వయంతులింగంస్యాత్త
స్సృతిస్తద్ద్వయంస్మృతం॥ అంజలిస్తద్ద్వయంరాజన్ తద్ద్వయంపూరుషంస్మృ
తం। మానస్తద్ద్వయసంభూతస్తద్ద్వయంకుడుపంస్మృతం। కుడుబద్వితయః
ప్రస్థం ద్రోణస్తేషాంచతుష్టయం॥ ద్రోణానాంవింశతిఃఖారీ ధాన్యమానస
మీరితం। ద్రోణద్వయంతుభారం స్యాజ్జ్ఞేయంతత్పలసంఖ్యయా॥ ఆఢ్యస్తేయే
దశప్రోక్తం సావిత్రీపఠనంముదా। అంజలౌశతగాయత్రీ జపఃపాపప్రణా
శః॥ సహస్రంపూరుషేప్రోక్తం మానేహ్యయుతముచ్యతే॥ లక్షంతుకుడు
పేప్రోక్తం ప్రస్థేలక్షద్వయంచరేత్॥ ద్రోణేతుదశలక్షంస్యాత్ ఖార్యాంధాన్యే
థాశృణు। సువర్ణస్తేయినఃప్రోక్తం ప్రాయశ్చిత్తంద్విజైర్యథా॥ తత్తథాచ
రణీయం స్యాదన్యథాపతితోభవేత్॥ శ్లో॥ గోధూమతిలమాషాణాం స్తేయే
తద్ద్విగుణంచరేత్॥ సూక్ష్మతండులశాలీనాం స్తేయేతద్ద్విగుణంస్మృతం॥ శ్లో॥
మాకముద్గవ్రీహీణాంకోద్రవాణాంతథైవచ॥ యావనాళకుళుత్థానాం
మేపూర్వవదాచరేత్॥ బ్రాహ్మణోయదిలోభేనమోహమత్తారికాద్వయః
ఘృతాక్తదేహస్స హసాకారీషేణాగ్నినాతదా। దగ్ధశుద్ధిమవాప్నోతినాన్య
థాగతిరస్తిహి॥ రాజవైశ్యయోరేవం ప్రాయశ్చిత్తంధాన్యాదిస్తేయే విధే
నీయం॥ శూద్రాణాంతుమాసల్యమేవప్రాయశ్చిత్తం। రాజవైశ్యయోర్ద్వా
దిసంస్కారబలవత్తయాదోష బాహుళ్యాత్ప్రాయశ్చిత్తంవిప్రప్రాయశ్చి
త్తవదుక్తం॥ ఇతిహేమాద్రౌధాన్యస్తేయ ప్రాయశ్చిత్తం॥

(౨౫) ధాన్యస్తేయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాఁడుద్రవ్యలో
భముచేత పరులసంబంధమయినధాన్యమును, స్వల్పమయినను, కుంచమయి

సదొంగలించినయెడల మరణానంతరమందు నరకమునుబొందవలయునని మరీచి వచించెను. బ్రాహ్మణుడగువాడు, బలాత్కారముగానయినను, చౌర్యమువలననైనను, పరులసంబంధమయినధాన్యమును దొంగలించినవాడు నరకమునుబొందును. పిమ్మట గోడలయందు జరుగునట్టి యెలుకమైళ్ళట్టునని లింగపురాణమునందు జెప్పబడియె* అరువదిధాన్యపుగింజలుపూరణమనియును, రెండుపూరణములొక్క-కోశమనియును, రెండుకోశములొక్క-లింగమనియును, రెండు లింగములొక్క-చేరయనియును, రెండుచేర లొక్క-యంజలియనియును, రెండుదోసిళులొక్క-పూరుషమనియును, రెండుపూరుషములొక్క-మానమనియును, రెండుమానము లొక్క-కుడుపమనియును, రెండుకుడుపములుప్రస్థమనియును, నాలుగుప్రస్థము లొక్క-ద్రోణమనియును, ఇరువది ద్రోణములొక్క-ఖారియనియును, రెండుద్రోణములు భారమనియును జెప్పబడును. దోసెడుధాన్యపుమానకుల బడినధాన్యమును దొంగలించినవాడు ప్రాయశ్చిత్తార్థము పదిపర్యాయములు గాయత్రీమంత్రపఠనమును జేయవలయును. దోసెడుధాన్యమును దొంగలించినవాడు నూరుపర్యాయములుగాయత్రీమంత్రమునుజపించవలయును. పూరుషప్రమాణముగల ధాన్యమును దొంగలించినవాడు వేయిపర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. కుడుపప్రమాణముగల ధాన్యమును దొంగలించినవాడు లక్షపర్యాయములు గాయత్రీమంత్రపఠనమును జేయవలయును. ప్రస్థపరిమాణముగలధాన్యమును పహరించినవాడు రెండులక్షలపర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. ద్రోణప్రమాణముగల ధాన్యమునపహరించినవాడును, ఖారీప్రమాణముగల ధాన్యమునుదొంగిలించినవాడును, సువర్ణాపహర్తకు విధింపబడినప్రాయశ్చిత్తమును నాచరించవలయును. అట్లుగాదేని పతితుడగును. ఇట్లని కూర్మపురాణమునందు జెప్పబడియె. గోధుమలు, యవలు, మినుములునని యెడు ధాన్యమును దొంగలించినయెడల ధాన్యాపహర్తకు జెప్పబడిన ప్రాయశ్చిత్తమునకుద్విగుణముగ ప్రాయశ్చిత్తమునాచరింపవలయును. సన్నబియ్యముగలధాన్యమునుదొంగిలించినపుడు దీనికిద్విగుణమనియె యుంగవలయును. జొన్నలు, ఉలవలు మొదలగువానిని దొంగిలించినపుడు పూర్వముచెప్పబడినచొప్పున నాచరింపవలయును. బ్రాహ్మణుడగువాడు లోభముచేత రెండుఖారికలధాన్యమును దొంగలించినయెడల నేతిచేతశరీరమునుదడిపికొన్నియెరుపిడకలనిప్పుచేత దగ్ధుడయ్యేనేని పరిశుద్ధుడగును. రాజవైశ్యులును నట్టి ప్రాయశ్చిత్తమునే యాచరింపవలయును. శూద్రుడీకృత్యమును జేసినయెడ

లమాసల్యవధను బాంధవులయును. రాజవైశ్యులకు వివాహాదిసంస్కారము లుగలిగియున్నవిగనుక దోషబాహుళ్యముగలవారగుదురు. అదికారణముగ బ్రాహ్మణులకు విధించిన కఠినప్రాయశ్చిత్తమునే విధించవలయును. ఇట్లని హేమాద్రియందు ధాన్యస్తేయప్రాయశ్చిత్తము॥

## వస్త్రస్తేయప్రాయశ్చిత్తమ్.

(౨౬) వస్త్రస్తేయప్రాయశ్చిత్తమాహ సాటంజె॥ శ్లో॥ వస్త్రం ముష్ణాతి యో విప్రః పారక్యం శాస్త్రగర్హితం॥ అజ్ఞానాజ్జ్ఞానతో వాపి తస్య దోషో మహాన్ భవేత్॥ లైంగే॥ విప్రో యదిహ పారక్యం వస్త్రమజ్ఞానతః ఖలు॥ తదా దోషమవాప్నోతి తంత్యజేదంత్యజం యథా॥ శివపురాణే॥ శ్లో॥ యో విప్రో దుర్జనాసక్తః పరవస్త్రం ముషేద్యది। తస్యైవ పుణ్యనాశస్స్యాదితి శాస్త్రేషు నిశ్చితం। తదంతే నరకం యాతి జాయతే వస్త్రహీనవాన్॥ కౌర్మే॥ శ్లో॥ విప్రో ముష్ణాతి యో వస్త్రం పారక్యం కర్మగర్హితం। యమలోకముపాగమ్య తతస్తీత్వాన్యజన్మని॥ పుసభూవముపాగమ్య బహువృతో వివస్త్రవాన్॥ తథాపి తారతమ్యేన ప్రాయశ్చిత్తమాహ దేవస్వామీ॥ శ్లో॥ స్థూలతంతుకృతం వస్త్రం సూక్ష్మతంతువినిర్మితం। చిత్రవస్త్రం తథా నీలీరక్తం కౌసుంభరంజితం॥ పట్టవస్త్రం తు కౌశేయమూర్ణామయమతః పరం॥ శ్వేతవస్త్రమితి ప్రోక్తం తద్వస్త్రానుసారతః। ప్రాయశ్చిత్తం ప్రకర్తవ్యం స్తేయదోషనివృత్తయే॥ స్థూలతంతుకృతే వస్త్రే స్తేయం కృత్వా తు పూర్వజః॥ పశ్చాత్తాపసమాయుక్తః ప్రాజాపత్యం సమాచరేత్॥ సూక్ష్మతంతుకృతే వస్త్రే పరాకం మునిచోదితం చిత్రవస్త్రం ముషిత్వా తు తప్తకృచ్ఛ్రద్వయం చరేత్॥ నీలీమయే సూక్ష్మవస్త్రే చరేచ్చాంద్రాయణవ్రతం। కౌసుంభవసనస్తేయే కుర్యాచ్చాంద్రాయణద్వయం। మూల్యాధికే పట్టవస్త్రే కౌశేయే చ మునీశ్వరాః॥ సద్యః పతతి పాపాత్మా ఘృతాక్తోగ్నిం విశేత్తదా॥ సువర్ణస్తేయనం ప్రాహుస్తన్మాసల్యం విదుర్బుధాః॥ నాన్యథా గతిరస్తీహ తస్య భూయిష్ఠపాపినః॥ పునర్దత్వా తు తద్వస్త్రం పశ్చాత్తాపసమన్వితః। ప్రాజాపత్యత్రయం కృత్వా శుద్ధిమాప్నోతి పూర్వజః। ఉక్తం యత్ క్షత్రియాదీనాం తథా సర్వం సమాచరేత్। తథా విప్రాదిదారాణాం వస్త్రస్తేయే యథాక్రమం। విప్రాణాం యత్ప్రాయశ్చిత్తముక్తం॥ తదర్ధం తద్దారాణాం క్షత్రియాదీనాం చ॥ తద్దారాణామేనం ప్రాయశ్చిత్తమర్ధార్ధక్రమేణ యోజనీయం॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే వస్త్రస్తేయప్రాయశ్చిత్తం॥



(౨౭) వస్త్రములను దొంగిలించినందుకు ప్రాయశ్చిత్తము॥ పరులసొ

బంధమయినవస్త్రమును దొంగిలించినబ్రాహ్మణుఁడు తెలిసియపహరించినను, తెలియకనపహరించినను, మహాదోషముగలవాఁడగునని స్కాందపురాణమునందుఁజెప్పఁబడియె. బ్రాహ్మణుఁడు పరులసంబంధమయినవస్త్రమును అజ్ఞానముచేతనపహరించినను మహాపాపియగును. అట్టిపాపాత్మునినంత్యజాతివానినివదలినచందముగ వదలవలయునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు దుర్జనసాంగత్యమునవలంబించి పరులవస్త్రమునపహరించినయెడల, ఆబ్రాహ్మణునియొక్క పుణ్యమంతయునునశించును. మఱియునుమరణానంతరమందు నరకమునుబొందును. అనంతరమందువస్త్రహీనుఁడైపుట్టుననియును శివపురాణమునందుఁజెప్పబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు పరులవస్త్రమునపహరించినయెడల నరకలోకమునుబొందును. పరజన్మయందుపునర్భువుఁడైపుట్టును. (పునర్భువుఁడనఁగా విధవయగు దాసిపుత్రుఁడు) అట్లుపుట్టి యనేకములగు వస్త్రములుగలవాఁడును, వస్త్రహీనుఁడునునగునని కూర్మపురాణమునందుఁజెప్పఁబడె. స్థూలములగుతంతువులచేనిర్మింపఁబడినవస్త్రము, సూక్ష్మతంతువులచే నిర్మింపఁబడినవస్త్రము, చిత్రవస్త్రము, నల్లనివస్త్రము, కౌసుంభవస్త్రము, పట్టువస్త్రము, నారవస్త్రము, లోమములతో నేయఁబడినవస్త్రము, తెల్లనివస్త్రము, అనువస్త్రములలో నేవిధమైనవస్త్రమును దొంగలించునో దానికిఁదగినప్రాయశ్చిత్తమునువిధించవలయును. స్థూలతంతువులచేనిర్మింపఁబడివస్త్రమును దొంగలించినబ్రాహ్మణుఁడు పశ్చాత్తాపమునుబొంది ప్రాజాపత్యవ్రతమునాచరింపవలయును. సూక్ష్మతంతువులచే నిర్మింపఁబడినవస్త్రమును దొంగిలించినవాఁడు ప్రాయశ్చిత్తార్థముగ పరాకకృఛ్రమును నాచరించవలయును. చిత్రవస్త్రమునుదొంగిలించినవాఁడు రెండుతప్తకృఛ్రముల నాచరించవలయును. నీలివస్త్రమునుదొంగిలించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. కౌసుంభవస్త్రమునుదొంగిలించినవాఁడును చాంద్రాయణవ్రతమును నాచరించవలయును. అధికమైనవెలగలపట్టువస్త్రమునైనను, కౌశేయమునైనను దొంగలించినయెడలపతితుఁడగును. కావుననట్టిపతితుఁడు తనదుశరీరమును నేతితోఁదడిపికొని మేరుపిడకలనిప్పునందుఁబ్రవేశించవలయును. ఇట్టిదుష్కృత్యమును జేసినవాఁడు సువర్ణమును దొంగలించినవానికి సమానుఁడనియును, నట్టివానికి మౌసల్యవథయే యుత్తమమయినదనియును నెఱుంగవలయును. తెలివితేమితనముచేత దొంగలించినవాఁడు మరలనావస్త్రమునుఇచ్చి పశ్చాత్తాపమునుబొందుచు మూఁడుప్రాజాపత్యముల నాచరించవలయును. క్షత్రి

యాను లిట్టికృత్యములను జేసినపు డిప్పుడు సెప్పినప్రాయశ్చిత్తములనే విధింప వలయును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులయొక్క స్త్రీలిట్టిదుష్కృత్యములను జేసి నయెడల పైనఁజెప్పఁబడినప్రాయశ్చిత్తమునందు సగమును బ్రాయశ్చిత్తార్థముగ విధింపవలయునని దేవస్వామి చేతఁజెప్పఁబడియె. ఇట్లని హేమాద్రియను పండితునిచేఁ జేయఁబడిన ధర్మశాస్త్రమునందలి బ్రాయశ్చిత్తాధ్యాయమునందువస్త్రమును దొంగలించినవానికిఁ జేయఁదగినవిధానము సమాప్తము॥

## గురుతల్పగమనప్రాయశ్చిత్తమ్.

(౨౭) అథగురుతల్పగమనప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శ్లో॥ గురుతల్పగతానాంతు ప్రాయశ్చిత్తమిహోచ్యతే॥ జననీచ సపత్నీచ రాజపత్నీ గురో స్తథా। మాతులానీస్వభగినీస్వసా జ్యేష్ఠస్యనాయికా॥ శ్వశ్రూః కనిష్ఠభార్యాచ ఆత్రేయీచ పతివ్రతా। ఏకాదశసమాస్త్వేతాః స్వమాత్రా రాజవల్లభ। పూజ్యాశ్చ వందనీయాశ్చ పోష్యావస్త్రాదిభూషణైః। ద్విజో నద్రోహకృత్తా సాంకర్మణామనసాగిరా। జననీసర్వలోకానాంపూజ్యావంద్యా మహత్తరా॥ అజ్ఞానాన్మాతరంగత్వా తత్సపత్నీమథాపివా॥ స్వయమేవస్వముష్కం తుచ్ఛింద్యాత్పాపముదాహరన్॥ హస్తేగృహీత్వాతన్ముష్కంసగచ్ఛేన్నైరృతీందిశం॥ గచ్ఛన్నేవాగ్రతస్సంస్థంకదాచిన్నవిచారయన్॥ అపశ్యన్పృష్ఠతో గచ్ఛేత్ప్రాణాంతంయస్సశుద్ధ్యతి॥ మరుప్రపతనంవాపి కుర్యాత్పాపముదాహరన్॥ భవిష్యోత్తరే॥ శ్లో॥ రాజక్షోభమహాతీర్థే సంగ్రామే దేశవిప్లవే। బహ్వీష్వన్యాసు వారీషు స్థితాసుస్మరపీడితః। మాతరంవాసపత్నీంవా స్వదారభ్రాంతిమావిశన్॥ పశ్చాజ్జ్ఞాత్వాతుమాతేతిపశ్చాత్తాపముపావిశన్॥ స్వయమేవాసినాముష్కం ఛిత్వాపాపముదాహరన్। హస్తేగృహీత్వాతంముష్కంసగచ్ఛేన్నైరృతీందిశం॥ అపశ్యన్పృష్ఠతోగచ్ఛేత్ప్రాణాంతంయస్సశుద్ధ్యతి॥ రేతస్సేకాత్పూర్వమేవనివృత్తోయదిమాతరం॥ బ్రహ్మహత్యావ్రతంకుర్యాద్రేతస్సిక్త్వాగ్నిదాహనం। జ్వలితాంసూర్మిమాలింగ్య మృతశ్శుద్ధిమవాప్నుయాత్॥ బ్రహ్మాండే॥ శ్లో॥ మహాతీర్థేషుసంగ్రామే జనక్షోభేమహాభయే। తత్రరాజన్సతీసంఘే మహాసంశసముద్భవే॥ కామాతురస్స్వపత్నీతిమాతరంవాస్వపత్నుజాం। గత్వాపకృత్స్యదారేషుపూర్వచిహ్నవివర్జితాం॥ మాతరంసహసాబుద్ధ్వాపశ్చాత్తాపసమన్వితః। అసినాతీక్ష్ణధారేణశిశ్నంసవృషణంకృత్।ఛిత్వాంజలౌసమాధాయనపశ్చాదవలోకయన్। స్మరన్నారాయణం సమ్యక్పురస్థమవిచారయన్॥ నైరృతీందిశమాగచ్ఛన్మధ్యేమృత్వాసశుద్ధ్యతి॥ ఆలింగ్యజ్వలితాంసూర్మింమృత్వాశుద్ధిమవాప్నుయాత్। రేతస్సేకాత్పూర్వ

పస్వామా తేతిప్రబోధయుక్ । బ్రహ్మహత్యావ్రతంకుర్యా త్కపాలధ్వజవర్జితం। కారీష వహ్నినాదగ్ధశ్శుద్ధిమాప్నోతిమాతృగః॥ మరణాదిత్యర్థః॥

(౨౨) గురుభార్యనుపొందినవానికి ప్రాయశ్చిత్తము॥ ఇప్పుడు గురుభార్యనుబొందినవానికిఁ బ్రాయశ్చిత్తవిధిని జెప్పెదను. తల్లి, సవతితల్లి, రాజభార్య, గురుభార్య, మేనమామభార్య, తనదుఅక్క, చెలియలు, అన్నభార్య, తమ్మునిభార్య, రజస్వలయైయున్నయాఁడుది, పతివ్రతయగు నాఁడుది, ఈపదునొకండుమందియును మాతృసమానులు. కావునఁ బూజ్యలును, నమస్కరింపఁదగిన వారనియును, వస్త్రాదిభూషణములచేతఁ బోషింపఁదగిన వారనియును, నెఱుంగవలయును. అందువలనబ్రాహ్మణుఁడగువాఁడు మనోవాక్కాయములలోనెద్దానిచేనయినను నట్టిస్త్రీల కపకారంబును జేయఁగూడదు. సర్వలోకములయందును దల్లియగునది మిగులఁ బూజ్యురాలు. అజ్ఞానమువలనఁ దల్లినైనను, సవతితల్లినైనను, బొందెనేని తనదువృషణములను దానేకోసికొని హస్తమునందుఁబెట్టికొని తనదు పాపమును నుచ్చరించుచు ముందుభాగముగని ఋఋతిదిక్కునకుఁ బోవలయును. మఱికొంతసేపు పశ్చాద్భాగమునకుఁ బోవలయును. ఇట్లు మరణముగలుగువఱకును బోవుచుండవలయును. ఇట్లుచేయలేనియెడల తనదుపాపము నుచ్చరించుచు మరుప్రపతనమునుజేసి మృతినొందవలయునని స్కాందపురాణమునందుఁజెప్పఁబడియె. రాజక్షోభమునందైనను, మహాతీర్థమునందైనను, యుద్ధమునందయినను, దేశోపద్రవమునందైనను, అనేకులగు స్త్రీలయందభిలాషగలవాఁడై, తల్లినైనను, సవతితల్లినైనను, తనదుభార్యయనుభ్రాంతిచేతఁ బొంది పిమ్మటఁ దల్లియని తెలిసికొనినయెడల పశ్చాత్తాపమును బొందవలయును. పిమ్మట స్వయముగానే తనదుఖడ్గముచేత వృషణములను ఛేదించుకొని యావృషణములను హస్తమునందు ధరించుకొని నిఋఋతిదిక్కునకుఁబోవలయును. మరల పశ్చాద్భాగమునకు రావలయును. ఇట్లువచ్చుచుఁ బోవుచుఁ దనదుపాపము నుచ్చరించవలయును. ఇవ్విధముగఁ జేయుచు మృతినొందినయెడల పరిశుద్ధుఁడగును. సంభోగమును జేయుచుండగ రేతస్సేకముగాకమునుపు తల్లియని తెలిసికొని యాకృత్యమును చాలించెనేని బ్రహ్మహత్యావ్రతము నాచరించుటచేతఁ బరిశుద్ధుఁడగును. రేతస్సునుతల్లియొక్క కుక్షియందు విడిచినపిమ్మటఁ దల్లియని తెలిసికొనెనేని యగ్నియందు శరీరమును గాల్చుటచేతఁ బరిశుద్ధుఁడగును. అట్లుగాదేనిమండుచున్నయినపస్తంభమును గౌగలించుకొని మరణమునుబొందినయెడల పరిశుద్ధుఁడగునని భవి

ష్యోత్తరపురాణమునందుఁ జెప్పఁబడియె. మహాతీర్థములయందైనను, యు
ద్ధకాలమునందైనను, జనక్షోభయందైనను, మిగుల భయంకరమైన కాలము
నందయినను, స్త్రీలందఱునుగుంపుగాఁజేరియుండఁగా నర్ధరాత్రియందు కా
మాతురుఁడై తనదుభార్యయను భ్రాంతిచేతఁ దల్లినైనను, తనదుకులము
నందుఁబుట్టినదానినైనను, బొందుచున్నసమయమునందు తల్లియనిగాని త
కులమునందుఁ బుట్టినవారనిగాని తెలిసికొనినయెడల, అట్టి దుష్కృత్యము
వదలి పశ్చాత్తాపమును బొందవలయును. పిమ్మటఁదనదుఖడ్గముచేత వృ
ణములతోఁగూడ శిశ్నమును ఛేదించవలయును. అట్లుఛేదించుకొని యా
శ్నమును దోసిలియందుఁబెట్టికొని పూర్వోక్తప్రకారముగ నారాయణస్మ
రణను జేయుచు నడవవలయును. అట్లుచేయుసమయమునందు మరణము
బొందెనేని పరిశుద్ధుఁడగును. అట్లుగాదేని మండుచున్న యినపస్తంభము
కౌగిలించుకొని మృతుఁడయ్యెనేని పరిశుద్ధుఁడగును, రేతస్సేకమునకుఁ బూ
ర్వమునందే తల్లియని తెలిసికొని యాదుష్కృత్యమును జాలించినయెడల
పాలిధ్వజధారణరహితముగ బ్రహ్మహత్యావ్రతముచేతఁ బరిశుద్ధుఁడగు
అట్లుగాదేని పేరుపిడకలనిప్పుచేత దహనమునుబొందెనేని పరిశుద్ధుఁడగు
ని బ్రహ్మాండపురాణమునందుఁజెప్పఁబడియె.

—— ❋ అథ రాజదండప్రకారమాహ. ❋ ——

(౨౮) లింగపురాణే॥ శ్లో॥ విచార్యమాతృగంవిప్రం స్వయమేవన
రతః॥ నచారేభ్య ఇత్యర్థః॥ శ్లో॥ భగాకారమయఃకృత్వా తాపయిత్వా
తాశనే। రేఖయేద్భ్రుత్యైవర్ణ్యైణలలాటే మాతృగామినః। ఆరోహ్యాద్రాస
యానంనిస్సాణంధ్వనయన్ జనైః॥ తద్వృత్తంపూర్వవద్ధృత్వా ధర్మవ్యా
థాచరేత్॥ తత్పత్నీవ్యథవాదద్యాత్త్రాసుదోషానచేద్యది॥ అటిత్వానగరీ
ర్వ్యాంజనోయంగురుతల్పగః॥ ఇత్యుచ్చైర్భాషయన్ భృత్యైః పురద్వార
పాగమన్। తత్రైవనాపితేనాశు వ్యాసినాతీక్ష్ణధారయా॥ ఛేదయిత్వా
న్ముష్కంనిధాయాశుతదంజలౌ। ధృత్వాసపాపీముష్కంతద్గృహీత్వా
తీందిశం। గచ్ఛన్ పాపీన్ పరిత్యజ్య తతశ్శుద్ధిమవాప్నుయాత్ ॥ అథ
సూర్మిమాతస్య వహన్నా రాజాప్రయత్నతః। తైలేనసూర్మిమాలిప్యభృ
రాలింగయేన్ముదా॥ మృతశ్శుద్ధిమవాప్నోతి సరాజాదోషభాఙ్నహి। మర
పతనంవాపి నాన్యథాశుద్ధిరిష్యతే। రేతస్సేకాత్పూర్వమేవ స్వమా
త్వాబ్రహ్మహత్యావ్రతంక పాలధ్వజవర్జితం కృత్వాశుద్ధిమాప్నోతినా
స్సేతుదర్శనాదిభిః॥ [illegible] స్వ్యమేవ ప్రాయశ్చి

యోజనీయం। శూద్రస్యతుమహాన్త్యమేవప్రాయశ్చిత్తం। పాపశంకిన్యాస్త స్యా స్త్రియాస్సుతాదిస్సార్వరామేత్యల్పకుటీం కృత్వాతత్రమాతరమవస్థా ప్యమయా రాండప్రమాణైః కబళైః ప్రత్యహంపోషయేత్। నమాతృత్యాగింతి కార్యా॥ సంసర్గజాదోషగుణాభవంతీతి శాస్త్రనిషేధాత్। మృతాచేత్ప్రతి తత్ప్రాయశ్చిత్తార్ధేన శరీరశుద్ధింకృత్వాపరలోకక్రియాంకుర్యాత్॥ తదాహా పస్తంబః॥ శ్లో॥ గురోరప్యవలిప్తస్యకార్యాకార్యమజానతః। ఉత్పథంప్రతిప న్నస్య పరిత్యాగోవిధీయతే ఇతివన్మాతృపరిత్యాగోనవిగర్హితః। తస్యాశ్శు శ్రూషానిత్యం కార్యాపతితాయాఅపి॥ సపత్నీరాజస్త్రీగమనాదిష్వేవం ప్రాయశ్చిత్తంవేదితవ్యం॥

(తా) ఇఁకను మాతృగామియగువానికి రాజుచేయవలసిన శిక్షను జెప్పుచున్నాఁడు॥ రాజగువాఁడు తనరాజ్యమునం దెవ్వఁడైనను మాతృగామికలఁడాయని తలఁచి స్వయముగానే విచారించవలయును. ఈవిషయము నందు చారులను నమ్మఁగూడదు. ఇట్లు విచారించి మాతృగామియగువానిని రూఢిగాఁదెలిసికొనవలయును. తెలిసికొనినపిమ్మట నట్టిపాపియొక్క మోము నందు భగాకారముగఁ గాలిపించవలయును. పిమ్మట గాడిదెనెక్కించి తన దుభటులచే నిస్సాణమను వాద్యమును మ్రోగింపఁజేయుచు గ్రామమునం దుఁద్రిప్పవలయును. అట్టిపాపాత్మునియొక్క ద్రవ్యమును, వానిభార్యాదు లీదోషమునందేకీభవించక యున్నయెడల వారలకిప్పించవలయును. వారీ దోషమునందేకీభవించి యున్నయెడల ఆద్రవ్యమును వారికివ్వక ధర్మార్థము గ నుపయోగించవలయును. అట్లు గాడిదెమీఁదనెక్కించి పట్టణమందంతట నుద్రిప్పునపుడు వీఁడుగురుతల్పగుఁడని యెల్లవారికిని దెలిపించవలయును. పి మ్మటఁ బురద్వారముదగ్గరకుఁ దీసికొనిపోయి మంగలవానిచేబిలిపించి మంగల కత్తిచేత వానిశిశ్నమును వృషణములతోఁగూడ ఛేదించవలయును. కోసి యాపాపాత్మునియొక్క హస్తమునందుఁబెట్టి నిఋతిదిక్కునకునడిపిం చవలయును. అట్లు చేయుచున్నసమయమునందాపాపి మరణమునుబొందె నేని పరిశుద్ధుఁడగును. అట్లుగాదేని రాజగువాఁడు, ఇనపస్తంభమును నిప్పు నందెఱ్ఱగఁగాచి యాలింగనమును చేసికొనునట్లు చేయవలయును. ఇట్లు చే సినపిమ్మట నప్పాపాత్ముఁడుమరణమునుబొందెనేని పరిశుద్ధుఁడగును. ఇవ్వి ధముగఁ జేయుటకు వీలుగలుగనేని మరుప్రపతనమును జేయింపవలయును. అట్టి పాపాత్ముఁడు రేతస్సేకముగాకమునుపు తల్లియని తెలిసికొనినయెడల కపాలధ్వజవర్జితముగ బ్రహ్మహత్యావ్రతమును జేయింపవలయును. క్షత్రి

యవైశ్యులిట్టిదోషకృత్యమును జేసినయెడల బ్రాహ్మణులకు విధించినప్రాయశ్చిత్తమునే విధించవలయును. శూద్రులీదుష్కృత్యమును జేసినయెడల మౌసల్యవధను జేయించవలయును. ఇట్టిపాపకృత్యములగాం దభిలాషగలిగినస్త్రీని దానికుమారులితరులు, తమగ్రామమునకైనను, గృహమునకైనను సమీపమునందుండునట్టి తోటలయందొకకుటీరమును వేసి యాకుటీరమునందట్టితల్లిని నివసింపఁజేసి నెమలిగ్రుడ్లులకు సమానమయిన యోదనకబళముచేతఁ బ్రతిదినమందును బోషింపవలయును. అట్టియాడుదానిని మాతృభావనను జేయఁగూడదు. మాతృబుద్ధివలన బెంచినకొడుకులు దోషవంతు లగుదురు. పోషింపకవదలుట మహాపాతకమునకుఁ గారణము. కావునఁబోషణమాత్రము చేయవలయును. అటువంటితల్లి మరణమునుబొందెనేని ప్రాయశ్చిత్తార్థముచేత శరీరశుద్ధినిగల్పించి పిమ్మటఁ బరలోకక్రియలను జేయవలయును. కార్యాకార్యములను దెలియక దుర్మార్గప్రవర్తకులగు గురువులను వదలుటవలనఁ బాతకములేదని యాపస్తంబమునివరుఁడు సెప్పెను గనుక యిట్టిదుష్కృత్యములను జేసిన తల్లినివదలుటవలనఁ బాపములేదనియభిప్రాయము. అట్లు వదలిపెట్టఁదగినదయ్యును, తల్లియగుటచే మిగులఁ బతితురాలయ్యును, వదలిపెట్టఁగూడదు. మఱియును శుశ్రూషను నిత్యమును జేయవలయును. సవతితల్లియును, రాజభార్యయు, అనువారియొక్క గమనమందును నిటులనే ప్రాయశ్చిత్తమును జేయవలయును. ఇట్లని లింగపురాణమునందుఁ జెప్పఁబడినది.

——❋ మాతృభిన్నస్త్రీగమనప్రాయశ్చిత్తము. ❋——

(౭౯) అథమాతృగమనవదన్యస్త్రీగమనే విశేషమాహ ॥ కూర్మపురాణే॥ రేతస్సేకాత్పూర్వమేవ నివృత్తో యదిమాతరం । బ్రహ్మహత్యావ్రతం కుర్యాద్రేతస్సేకేత్వగ్నిదాహనం॥ సవర్ణోత్తమవర్ణస్త్రీగమనేఽప్యవిచారతః ॥ బ్రహ్మహత్యావ్రతంకుర్యాద్ద్వాదశాబ్దంసమాహితః ॥ అమత్యాభ్యాసతశ్చైస్సవర్ణాంచోత్తమాంచవా॥ కారీషవహ్నినాదగ్ధ శ్శుద్ధింయాతిద్విజోత్తమః। సవర్ణోత్తమవర్ణాసు నివృత్తోవీర్యసేచనాత్॥ బ్రహ్మహత్యా వ్రతంకుర్యాత్ షడబ్దంవిధిపూర్వకం । క్షత్రియాంపితృభార్యాంతు గత్వావిప్రఃప్రసన్ననే॥ బ్రహ్మహత్యావ్రతంకుర్యాత్ షడబ్దాన్విష్ణుతత్పరః ॥ వైశ్యాయాంపితృపత్న్యాంతు షడబ్దంవ్రతమాచరేత్॥ గత్వాశూద్రాం గురోర్భార్యాంత్రియబ్దంవ్రతమాచరేత్ । మాతృష్వసారంచపితృష్వసారమాచార్యభార్యాంశ్వశురస్యపత్నీం । ఆచార్యపుత్రీమథమాతులానీంపుత్రీం నగచ్ఛే

కామతోఽయః॥ దినద్వయే బ్రహ్మహత్యావ్రతం కుర్యాద్యథావిధి। ఏకస్మిన్నేవ దివసే బహువారే త్రైవార్షికం। ఏకవారం కృతేప్యబ్దం వ్రతం కృత్వా విశుధ్ధ్యతి॥ దినత్రయే గతో వహ్నౌ దగ్ధశ్శుద్ధ్యతి నాన్యథా॥ చండాలీం పుల్కసీం చైవ స్నుషాం చ భగినీం తథా। మిత్రప్రియాం శిష్యపత్నీం యస్తు వై కామతో వ్రజేత్॥ బ్రహ్మహత్యా వ్రతం కుర్యాత్ షడబ్దం ధ్వజవర్జితం। ఏతాసాం మాతృవ్యతిరిక్తానాం పాపశంకావతీనాం త్యాగ ఏవ వరం। అన్యథా సంసర్గతో దర్శనతోపి దోషగుణా భవంతి॥ తదాహ కాత్యాయనః। పతితాం చ పుత్రీం గమనా న్మాతరం పోషయేత్సుతః। కుటీరం వలయాకారం సూక్ష్మం కుర్యాత్ప్రయత్నతః॥ తత్ర తాం సన్నివేశ్యాశు చతుర్భిః కబళైర్నృప। మయూరాండప్రమాణైస్తైః ప్రత్యహం రంధ్రమార్గతః। యావత్తాం మ్రియతే మాతా తావద్గత్వా ప్రయత్నతః॥ పతితస్య యదుక్తం తత్ప్రాయశ్చిత్తార్థమాచరేత్॥ పరలోక క్రియాం సర్వ్యాం కృత్వా శుద్ధిమవాప్నుయాత్॥ అకృత్వా దోషమాప్నోతి పుత్ర స్తత్పాపశుద్ధయే। ఏతాసామన్యనారీణాం త్యాగ ఏవ విధీయతే॥ రాజన్యవైశ్యయోరేవం ప్రాయశ్చిత్తం విధీయతే॥ వర్ణత్రయస్యాపి పాపినాం భార్యామాతేతి గీయతే। తద్దారేషు యదాగచ్ఛే ద్వర్ణత్రయమకామతః॥ తత్రాపి మాతృవచ్ఛుద్ధ్యా ప్రాయశ్చిత్తం సమాచరేత్। శూద్రస్య మాసలం ప్రాహు రితి శాస్త్రేషు నిశ్చితం॥ కామస్సర్వధనాహారీ కామః పుణ్యవినాశకృత్ । కామః పాపకరో లోకే కామోనర్థప్రదాయకః। కామశ్శత్రుర్మనుష్యాణాం తస్మాత్కామం పరిత్యజేత్॥ సంసారేస్మిన్ మహాఘోరే మోహనిద్రాసమాకులే॥ మోహారిం శరణం యాంతి కృతార్థాస్తే న సంశయః। పుత్రదారగృహక్షేత్రధనధాన్యవిమోహినీం॥ లబ్ధ్వైవ వాం మానుషీం వృత్తిం కరే గర్వం తు మా కృథాః॥ సంత్యజ్య కామం క్రోధం చ లోభం మోహం మదం తథా । పరాపవాదం నిందాం చ యజత్వాం భక్తితో హరిం । మాతా హరిః పితా చైవ జ్యేష్ఠభ్రాతా జనార్దనః॥ గురుర్విష్ణుః ప్రసన్నాత్మా రాజా ప్రత్యక్షదైవతం॥ తద్దారాస్తు తథాజ్ఞేయా స్తాసు ద్రోహం న కారయేత్॥ ఆపస్తంబః॥ గురుతల్పగామీ సవృషణం శిశ్నం పరివాస్యాం జలావాధాయ దక్షిణాం దిశ మనావృత్తి వ్రజేత్ ॥ జ్వలితాం వా సూర్మిం పరిష్వజ్య సమాప్నుయాదితి॥ దోషస్మరణాత్తేషాం దారేషు ద్రోహబుద్ధిః కార్యా॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే గురుతల్పగమనప్రాయశ్చిత్తమ్॥

(౭౯) తల్లికంటె నన్యలగు స్త్రీలను బొందినవానికి ప్రాయశ్చిత్తము॥

రేతస్సేకము గాకమునుపు లేనిదు భార్యగాదనియును, తల్లియనియును దెలి

సిక్కోని యట్టిపాపకర్మను వదలినవాఁడు, కపాలధ్వజధారణరహితముగ బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. సవర్ణస్త్రీలతోనైనను, ఉత్తమవర్ణస్త్రీలతోనైనను, అజ్ఞానమువలననను గాఁ తనదు భార్యయనియెడు భ్రాంతిచేత సంభోగక్రియలను జేసినవాఁడు పదిరెండుసంవత్సరములు బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును, సవర్ణస్త్రీలతోనైనను, ఉత్తమవర్ణస్త్రీలతోనైనను, బుద్ధిలేనివలన సంభోగక్రియలను అభ్యాసపూర్వకముగాఁ జేయుబ్రాహ్మణుఁడు ఏరుపిడకలనిప్పుచేతఁ దనదుశరీరమును దగులఁబెట్టవలయును. సవర్ణస్త్రీనైనను, ఉత్తమవర్ణస్త్రీనైనను, బొందువాఁడు వీర్యమును వదలకమునుపు, అట్టి దుష్కృత్యమును జాలించినయెడల, ఆరుసంవత్సరములు బ్రహ్మహత్యావ్రతమును, కపాలధ్వజధారణరహితముగ నాచరింపవలయును. సవతితల్లియయిన క్షత్రియ స్త్రీతో అవివేకమువలన నొకరుపర్యాయము సంభోగించిన బ్రాహ్మణుఁడు, నారాయణ భజనతత్పరుఁడై తొమ్మిది సంవత్సరములు కపాలధ్వజరహితముగ బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. సవతితల్లియగు వైశ్యస్త్రీనిబొందినబ్రాహ్మణుఁడు, ఆరుసంవత్సరములు బ్రహ్మహత్యావ్రతమును నాచరింపవలయును. తండ్రిభార్యయగు శూద్ర స్త్రీనిబొందిన బ్రాహ్మణుఁడు మూఁడుసంవత్సరములు బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. పినతల్లులను, తండ్రితోఁబుట్టువులగు స్త్రీలను గురుభార్యను, భార్యయొక్కరుతల్లిని, గురుపుత్త్రికను, మేనమామభార్యను, తనదుపుత్త్రికను, కామాతురుఁడై పొందినయెడల శాస్త్రోక్తప్రకారము బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. ఈ స్త్రీలతో నొకరుదినమునందే యనేకపర్యాయములు భోగించిన యెడల మూఁడుసంవత్సరంబులు బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. ఒకరుపర్యాయము మాత్రమే భోగించిన యెడల నొకసంవత్సరము బ్రహ్మహత్యావ్రతము నాచరింపవలయును. మూఁడుదినము లీస్త్రీలను బొందినవాఁడు, అగ్నియందు శరీరమును గాల్చినయెడలఁ బరిశుద్ధుఁడగును. చండాల స్త్రీని, చండాలజాతిస్త్రీని, కోడలిని, తనదుతల్లిగర్భమునఁ దనకంటె ముందుగఁబుట్టినయాఁడుదానిని, స్నేహితునిభార్యను, శిష్యునిభార్యను, కామాతురుఁడై పొందినవాఁడు, ఆరుసంవత్సరములు కపాలధ్వజరహితముగ బ్రహ్మహత్యావ్రతము నాచరించవలయును. తల్లికంటెనన్యులగు స్త్రీలు పాపకృత్యములనఁగా బరపురుషసంసర్గాదులను జేసినయెడల దర్శనస్పర్శనాదులను జేయక వదలవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. పుత్త్రునితో సంభోగించి

నదియును, పతితురాలునునగు తల్లిఁ బాపకృత్యము జేయనిపుత్రుఁడు వలయాకారముగ నొక్కకుటీరమును వేసి యాకుటీరమునందట్టితల్లిని బ్రవేశపెట్టి నెయ్యలిగ్రుడ్లకు సమానములగు నాలుగుకబళములను బెట్టి పోషించుచుండవలయును. ఆయన్నకబళములను మోమునుజూచుచు బెట్టక యాకుటీరముసందలి రంధ్రమునసుండి యివ్వవలయును. ఇవ్విధముగ నాపాపాత్మురాలుమరణమును బొందుదనుక చేయుచుండవలయును. మరణానంతరమందు ప్రాయశ్చిత్తార్థముచేత దేహశుద్ధినిగావించి పరలోకక్రియలను జేయవలయును. ఇట్లు చేయు పుత్రుఁడు మిగులఁ బాపవంతుఁడగును. కావుననట్టివానికిఁ బతితప్రాయశ్చిత్తమును విధించవలయును. ఇటువంటియన్యస్త్రీలను ముఖావలోకనమును జేయక వదలవలయును. ఈవిధముగా నే రాజవైశ్యులకును ప్రాయశ్చిత్తమును విధించవలయును. బ్రాహ్మణేతరులగు ముగ్గురకును స్వపుత్రులయొక్క భార్య తల్లియని చెప్పఁబడును. కావున బ్రాహ్మణస్త్రీలను కామాతురులై క్షత్రియవైశ్యశూద్రులలో నెవ్వఁడైనఁ బొందెనేని యట్టివానికి మాతృగమనప్రాయశ్చిత్తమును జేయవలయును. శూద్రునకుమాసల్యావధనువిధించవలయును. కామము సకలధనములను హరించును. కామము పుణ్యమును నశింపఁజేయును. కామము పాపమును జేయునది. కామము మిగులననర్థమునుగలుగఁజేయును. కామము మనుష్యులకు శత్రువువంటిది. కావున కామమును దానినివదలవలయును. మిగుల భయంకరమైనదియును, మోహనిద్రాసమాకులమైనదియును, నగు సంసారమునందున్నవారలు నారాయణస్మరణను జేయుచు పరిశుద్ధులగుదురు. ఓ మూఢులారా పుత్రదార గృహక్షేత్రారామాదులయందు మోహమునవలంబించి గర్వమును బొందకుఁడు. కామక్రోధలోభమోహమదములను, పరాపవాదబుద్ధిని, పరనిందను వదలినారాయణుని సేవింపుఁడు. తల్లిహరివంటిది. తండ్రి దైవము. అగ్రజుఁడు జనార్దనునివంటివాఁడు. గురుఁడువిష్ణుతుల్యుఁడు. రాజుప్రత్యక్షదైవము. ఇప్పుడు చెప్పినవారియొక్క భార్యలునట్టివారలేయని యెఱుంగవలయును. కావున నిట్టివారలకు ద్రోహమును జేయఁగూడదని కాత్యాయనుఁడు వచించె. గురుతల్పగామియగువాఁడు వృషణములతోఁగూడ శిశ్నమును ఛేదించికొని వెనుకభాగముగా దక్షిణదిక్కునకుఁ బోవలయును. ప్రజ్వలించుచున్న యినపస్తంభము నాలింగనమును జేసికొనవలయును. కావున గురువులగువారి భార్యలకు ద్రోహమును జేయఁగూడదు. అనఁగా వారిభార్యలను బొందరాదనుట.

ఇట్లని యూపస్తంబమునివరుఁడువచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు గురుతల్పగ మనపాపప్రాయశ్చిత్తము సమాప్తము.

——(*) తత్సంయోగిప్రాయశ్చిత్తమ్. (*)——

(౩౦) అథతత్సంయోగి ప్రాయశ్చిత్తమాహ॥ కూర్మపురాణే॥ శ్లో॥ మహాపాతకిసంసర్గి ప్రాయశ్చిత్తంనిగద్యతే। ప్రాయశ్చిత్తవిశుద్ధాత్మాసర్వకర్మఫలంలభేత్॥ యస్యయేనథ వేత్సంగో బ్రహ్మహాదిచతుర్ష్వపి॥ సతద్వ్రతంతునిర్వర్త్యశుద్ధిమాప్నోత్యసంశయః॥ అజ్ఞానాత్పంచరాత్రంతు సంగమేద్యః కరోతియః॥ కాయకృచ్ఛ్రంచరేత్సమ్యగన్యథాపతితోభవేత్॥ ద్వాదశరాత్రసంసర్గేమహాసాంతపనంస్మృతం॥ సంగంకృత్వార్ధమాసేతు ఉపవాసాన్దశాచరేత్॥ పరాకంమాసిసంయోగే చాంద్రంమాసత్రయేవ్రతంకృత్వాషణ్మాససంగంతు కుర్యాచ్చాంద్రాయణత్రయం॥ కించిన్న్యూనాబ్దసంగేతు షణ్మాసంవ్రతమాచరేత్॥ అబ్దస్యత్రిగుణంప్రోక్తం జ్ఞానాత్సంగే యథాక్రమం॥ యస్తుసంవత్సరంత్వేతైశ్శయనాసనభోజనైః। వసేచ్ఛేత్సపతంవిద్యాత్పతితంసర్వకర్మసు॥ మహాపాతకినస్త్యాజ్యాస్సర్వదావిప్రసత్తమైః॥ మహాపాతకినోలోకే దర్శనాత్పాపదాయినః॥ స్పర్శాన్నరకదానిత్యాస్మరణాల్లోకదారిణః॥ సత్సంగతిస్సదానౄణాం కామధేనూపమాస్మృతా॥ అతస్సత్సంగతిఃకార్యా నృభిఃపుణ్యాభిలాషిభిః॥ పుణ్యామేవసదాకుర్యాత్పుణ్యామేవసదాస్మరేత్॥ పుణ్యామేవ సదాపశ్యేత్తస్మాత్పుణ్యాధికఃసహి అతోమహద్భిస్సంసర్గః కర్తవ్యోలోకలిప్సుభిః॥ దుస్సంగంవర్జయేన్నిత్యంసురాభాండోదకంయథా॥ ఇతిహేమాద్రివిరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే మహాపాతకిసంసర్గప్రాయశ్చిత్తం॥ ఇతి పంచమహాపాతక ప్రాయశ్చిత్తం॥

(౩౦) మహాపాతకిసంసర్గప్రాయశ్చిత్తము॥ ప్రాయశ్చిత్తముచేతఁబరిశుద్ధుఁడయినవాఁడు సర్వకర్మలఫలమును బొందఁగలవాఁడు. బ్రహ్మహత్య మొదలుగాఁగల మహాపాపములను నాల్గింటిని జేసినవారలకును బ్రహ్మహత్యాది పాపములను జేసినవారలకెట్టిప్రాయశ్చిత్తము విధింపఁబడినదో యట్టిప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఈమహాపాతకులతో నైదుదినములు సాంగత్యమును జేసినవాఁడు కాయకృచ్ఛ్రమును జేయవలయును. అట్లుగాదేని పతితుఁడగును. పది రెండు దినములు సాంగత్యమును జేసిన యెడల మహాసాంతపనమును జేయవలయును. పదునైదుదినములు సాంగత్యమును జేసిన యెడల పదియుపవాసముల నాచరించ వలయును. మాసము దినములు

సాంగత్యముచ జేసినయెడల పరాకకృఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. మూఁడుమాసములు సాంగత్యమును జేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. కొంచెముదినములు తక్కువయగు సంవత్సరకాలము సాంగత్యమును జేసినయెడల ఆరుమాసవ్రతము నాచరింపవలయును. ఒక్కసంవత్సరకాలము సాంగత్యమును జేసినయెడల పదునెనిమిదిమాసములు ప్రాయశ్చిత్తవ్రతము నాచరింపవలయును. సంవత్సరకాలమును శయనాసన భోజనాదుల నట్టిపాతకులతో సాంగత్యమును జేసినవాఁడుగూడ మహాపాతకుఁడగును. అదికారణముగ పతితుఁడగును. కావున నీమహాపాతకుల సాంగత్యమును కొంచెమైనను జేయఁగూడదు. ఇట్టి మహాపాతకులయొక్క దర్శనమును జేయఁగూడదు. ఒకవేళఁ జేసినయెడల నారాయణస్మరణను జేయుఁగూడదు. వారినిస్పృశింపఁగూడదు. స్మరించుటవలనఁగూడ పాపముసిద్ధించును. సజ్జనసాంగత్యము సకల జనులకును కామధేనుతుల్యమయినదని యెఱుంగవలయును. అందువలన సర్వకాలముల యందును సజ్జనసాంగత్యమును జేయవలయును. సర్వకాలములయందును, పుణ్యమునే జేయువలయును. పుణ్యకార్యములనే యెప్పుడును స్మరింపవలయును. పుణ్యకార్యములనే సర్వకాలములయందును జూడవలయును. పుణ్యకార్యములకంటె నధికమయిన కార్యమొండెద్దియునులేదు. అదికారణముగ సర్వకాలములయందును సజ్జనసాంగత్యమును జేయుచు దుర్జనసాంగత్యమును వదలవలయును. ఇట్లు కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రిచేత రచింపఁబడిన ధర్మశాస్త్రమునందలి ప్రాయశ్చిత్తాధ్యాయమునందు మహాపాతకి సంసర్గప్రాయశ్చిత్తము, ఇట్లని మహాపాతకప్రాయశ్చిత్తముసమాప్తము.

## * గోవధప్రాయశ్చిత్తమాహ. *

(౩౧) అథేదానీముపపాతకప్రాయశ్చిత్తంవదన్ గోవధప్రాయశ్చిత్తమాహ మార్కండేయః॥ శ్లో॥ సర్వేషామేవవర్ణానాం బ్రాహ్మణః పరమో గురుః। తథాచతుష్పాజ్జంతూనాం గావోమాతేతి ప్రగీయతే। విప్రహత్యాచగోహత్యాసమమేవద్వయంనృణాం॥ పురాచతుర్ముఖో బ్రహ్మసృష్ట్యాదౌ సృష్టవాంశ్చగాః॥ యజ్ఞాన్వేదాంశ్చవిప్రాంశ్చ అరణీంస్రుక్స్రువాదికాన్। సృష్టవాన్యజ్ఞరక్షార్థంమహీపాలానతః పరం॥ విప్రాయజ్ఞాశ్చగావశ్చధృతవంతిపృథివీమిమాం। గోహింసాంయోనరః కుర్యాన్నిష్కారణతయాధునా॥ తస్యైవనిష్కృతిర్నాస్తిప్రాయశ్చిత్తశతైరపి॥ గోసవధనకారణంహాన నెపలమైత్రికంచ। కలి

యుగత్రయోరభావాన్మధుపర్కేచగోహింసనంగర్హితమేవ । అగ్న్యాధే
యంగవాలంభంసన్న్యాసంపలపైతృకం॥ దేవరేణసుతోత్పత్తింకలౌపంచవి
ర్జయేత్॥ యజ్ఞార్థంపిత్రర్థమేవగోహింసనం । నాన్యత్ర ॥ తథాహగౌతమః
శ్లో ॥ గోహింసాంముఖజఃకృత్వా మహాపాపమవాప్నుయాత్ ॥ తద్వద్విప్ర
హింసాంచమహతాంగర్హితంద్వయం॥ హింసాదశవిధా॥ తథాహగౌతమః
శ్లో॥ క్రూరరజ్జ్వాకంఠబంధో దారుబంధస్తథాగళే॥ నిరాగారేస్థలేబంధస్తథా
గ్రాసవిపీడనం। తాడనంరజ్జుదండాద్యైస్తథాసంచారరోధనం ॥ శృంగచ్ఛే
దస్తథా దాహో ద్విపాదందోహనంతథా । వత్సేష్వతేషుక్షీరాణాంమా
నంచస్మవత్సకః॥ ఇతిదశధాహింసాగవాంప్రోక్తామనీషిభిః। ఏతాభిర్గాంయ
దాహింసేత్తదాగోవధఇష్యతే॥ గోమూత్రంగోమయంక్షీరందధిసర్పిరితీరి
మహాపాతకినాంచైవతథైవక్షుద్రపాపినాం । పాపంచతుర్విధంప్రోక్తం
షట్చాంద్రాయణంమహత్తరం। ఉపపాతకమిత్యేతచ్ఛుద్ధాపరికీర్తితం । ఉ
స్యైతస్యపాపస్యపంచగవ్యంవిశోధనం ॥ దర్శనంస్పర్శనంసేవామహాపాప
నాశనం। గౌశ్చయస్యగృహేనాస్తి సాహామూర్తంపాపనాశినీ॥ తద్గృహం
ద్రభూమిస్స్యాద్గృహస్థస్సచపాపకృత్ ॥ అహింసాసత్యమస్తేయంశౌచమి
ంద్రియనిగ్రహః॥ స్వాధ్యాయదయాళుత్వంషడ్విధంగృహమేధినాం। గావస్తి
వసదాతిష్ఠేత్తత్క్షేత్రంకాశికాసమం ॥ నసంతితత్రపాపానితథాబాల
గ్రహాః॥ విప్రైస్సదారక్షణీయాగౌర్యథాధర్మరూపిణి । నమసాచార్యాసే
వ్యానత్యాజ్యాజ్ఞానసాపిగౌః॥ తథాసంపాద్యబహుభిర్ధనైర్వాపాపముక్త
పీనాంధేనుంయదావిప్రోహింసేచ్చేల్లగుడాదిభిః । మహాపాపమవాప్నో
కంచాధిగచ్ఛతి॥ తదంతేభువమాసాద్యచండాలత్వమవాప్నుయాత్॥ చండీ
ఖండే॥ శ్లో॥ గోహంతాయోభవేల్లోకేరజ్జుపాషాణవేష్టనైః ॥ అరణ్యేవా
హేనాపిరోషాద్వాకామకారతః। యమాలయముపాగమ్యనరకంచానుభూ
యచ॥ తదంతేభువమాసాద్యజాయతేహ్యాస్యరోగవాన్॥లైంగే శ్లో॥ యో
జోమదలోభేనమత్సరాదీర్ష్యయానృప। గాంహన్యాద్యస్యకస్యాపివివిధైస్స
లాశయే ॥ రజ్జుదండాశ్మభిర్ఘోరైఃకంఠరోధనపీడయా ॥ భవేత్తస్యమహాదో
ప్రాయశ్చిత్తీభవేద్ధ్రువం॥ సాంప్రతం॥ గాంహత్వాముఖజోఽజ్ఞానాన్మహ
హతావృతః॥ నరకాన్నివర్తేతప్రాయశ్చిత్తంవినాప్రభో॥ పశ్చాత్తాపస
యుక్తఃపరాకంకృచ్ఛ్రమాచరేత్। అకామతఃపరాకంస్యాజ్జ్ఞాత్వాచాంద్రా
యణంస్మృతం॥ కామతోగోవధేచైవశుద్ధిర్దృష్టామనీషిభిః ॥ నాగరఖండే
శ్లో॥ అకామతఃకామతోవావిప్రోహన్యాత్తుగాంశుభాం। తస్యైవశుద్ధిమ

పరాకశ్చాంద్రభక్షణం॥ ఉపోష్యరజనీమేకాంపంచగవ్యేనశుధ్యతి। అన్యథా దోషమాప్నోతిహ్యారోగీభవేద్ధ్రువం॥ విష్ణుధర్మోత్తరే॥శ్లో॥ స్వాంపారకీం చ ధేనుంయోముఖజోమత్సరాన్వితః॥ హన్యాద్దండాదిభిఃపాపీతస్యదేహవిశుద్ధయే॥ అజ్ఞానేతుపరాకస్స్యాజ్జ్ఞానేచాంద్రస్యభక్షణం ॥ యోహన్యాద్రోగిణీం వృద్ధాంపరాకంకృచ్ఛ్రమాచరేత్ । యువతీంగాంద్విజోహన్యాత్తుకార్యాచ్చాంద్రాయణంసకృత్॥ ఉపోష్యరజనీమేకాంపంచగవ్యంపిబేత్తతః ॥ ఇతిహేమాద్రివిరచితగోవధప్రాయశ్చిత్తం॥

(౩౧) గోవధప్రాయశ్చిత్తము॥ ఇప్పుడు పపాతకప్రాయశ్చిత్తమును జెప్పుచు ముందుగ గోవధప్రాయశ్చిత్తమును విధించుచున్నాఁడు. అన్ని వర్ణములవారలకును బ్రాహ్మణుఁడుగురువు. చతుష్పాజ్జంతువులన్నిటిలోగోవుతల్లియని చెప్పఁబడును. అందువలన గోహత్యబ్రహ్మహత్యకుసమానమని యెన్నఁబడును. తొల్లినాలుగుమోములుగల దేవుఁడు సృష్ట్యాదియందు గోవులను సృజించె. యజ్ఞములను, వేదములను, బ్రాహ్మణులను, అరణిని, సృక్స్రువాదికమును, రాజులను, యజ్ఞసంరక్షణకొఱకు నిర్మించెను. అందువలన బ్రాహ్మణులును, యజ్ఞములును, గోవులును, భూమిని పరిశుద్ధముగఁజేయును. నిమిత్తముగ గోవధను జేసినవాఁడు ప్రాయశ్చిత్తముచేతఁగూడ పరిశుద్ధుఁడుగాఁడు. గోమేధమనుపేరుగల యజ్ఞమునందుమాత్రము దోషయుతము గాదు. పితృశ్రాద్ధాదికమునందు గోమాంసమును వండుటయును దోషముగాదు. కలియుగమునందీరెండును నిషేధింపఁబడినవి గనుక యిక్కార్యములయందుఁగూడ గోవధను జేయఁగూడదు. అగ్న్యాధేయమును, గవాలంభమును, సన్యాసమును, పలపైతృకమును, మరిదివలన, వదినెయగునది బిడ్డలనుగనుటయునను నైదునుగలియుగమునందుఁ జేయఁగూడదనిమాఠరాండెయమునివరుఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు గోవధను జేసిన యెడల మహాపాపియని చెప్పఁబడును. ఆప్రకారమే బ్రాహ్మణవధయును మిగులఁ బాపమును గలుగఁజేయునని గౌతముఁడువచించె. అతికఠినమగు త్రాడుచేత గొంతుబిగియఁగట్టుటయు, కంఠమునందుగుదిబండనుగట్టుటయును, గృహములేనిచోటఁ గట్టివేయుటయు, కసవును వేయక పోవుటయును, రజ్జుదండాదులచేతఁ గొట్టుటయును, సంచారమును లేకుండునటులఁజేయుటయును, కొమ్ములు నఱికివేయుటయును, నీళ్లుపోయకపోవుటయును, రెండుపూటలను పాలుపిండుటయును, దూడచచ్చిపోయిన పిమ్మటఁ బాలుపిండుటయు ననుపనియును గోవధలని యెఱుఁగవలయును. కావున నిట్టికృత్యముల

నుజేసినవాఁడు గోవధనుజేసినవాఁడేయని యభిప్రాయము. గోమూత్ర
ము, గోమయము, గోక్షీరము, ఆవుపెరుగు, ఆవునెయ్యి, అనునైదును, మ
హాపాతకులకును, ఉపపాతకులకును, ప్రాయశ్చిత్తకృత్యములయందుపయో
గించవలయును. శుష్కమనియును, ఆర్ద్రమనియును, మహత్తరమనియును,
ఉపపాతకమనియును పాపము నాలుగువిధములు. ఈనాలుగువిధములగు
పాపములును, పంచగవ్యప్రాశనములేక పరిశుద్ధతను బొందఁజాలవు. గో
వుయొక్కదర్శనస్పర్శనాదులు మహాపాతక నాశనము. గోమాహాత్మ్యము
లేనివాని గృహము రుద్రభూమి యనఁబడును. అహింసయు, అసత్యము
దొంగతనములేకయుండుట, పరిశుద్ధత, ఇంద్రియనిగ్రహము, సర్వభూత
దయాళుత్వము, అను నాలును లేని మానవుఁడు మహాపాతకుఁడనఁబడును. గో
వు, ఏగృహమునందుండునో యాగృహము కాశీక్షేత్రమని యెఱుఁగవల
యును. అట్టిగృహమునందు పాపములుండవు. అక్కడ బాలగ్రహాదులు
గలుగనేరవు. కావున బ్రాహ్మణుఁడగువాఁడు సర్వకాలములయందును గో
సంరక్షణము జేయవలయును. గోవు సతతమును నమస్కరింపఁ దగినద
యును, సేవింపఁదగినదనియును నెఱుఁగవలయును. గోవును మనసుచేత
నవమానమును బొందింపఁగూడదు. పాపవిమోచనము కొఱకు గోవును స
పాదింపవలయును. గోవునులగుడాదులచేతఁ గొట్టినవాఁడు మహాపా
తకుఁడనఁబడును. కావున నట్టివాఁడు ఘోరనరకమును బొందును. పిమ్మట
చండాలుఁడై భూలోకమునందు జన్మించును. ఇట్లని గౌతమమునివరుఁడు
తెల్పె. రజ్జుపాషాణవేష్టనములచేతగోవును, అరణ్యమునందైనను, గృహ
మునందైనను, రోషముచేతఁగాని, బుద్ధిపూర్వకముగఁగానిచంపినవాఁడు
దేహానంతరమందు ఘోరమగునరకమునందుఁబడును. పిమ్మటభూలోకమున
కుష్ఠరోగముగలవాఁడైపుట్టును. ఇట్లనిచండికాఖండమునందుఁజెప్పఁబడియె.
దలోభముచేతనైనను, మాత్సర్యముచేతనయినను, ఈర్ష్యచేతనైనను,
దండాదులమూలకముగ, నరణ్యమునందయినను, మడుగునందయినను సం
రించుచున్నగోవునుజంపినబ్రాహ్మణుఁడు మహాపాతకుఁడనఁబడును. కా
ప్రాయశ్చిత్తీయుఁడని లింగపురాణమునందుఁజెప్పఁబడియె. బ్రాహ్మణు
జ్ఞానమువలన మిగులమదయుక్తుఁడైగోవునుజంపెనేని ప్రాయశ్చిత్తము
కొనవలయును. అట్లుగాజేసినరకలోకమునుండినివర్తిగలుగనేరదు. గో
త్యను, అజ్ఞానమువలనఁజేసినవాఁడు పశ్చాత్తాపయుక్తుఁడై పరాకకృ
నుప్రాయశ్చిత్తార్థముగనాచరింపవలయును. తెలిసిగోహత్యనుచేసినవా

చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. ఇట్లని సాపర్ణమను గ్రంథమునం దుఁ జెప్పఁబడియె. బుద్ధిపూర్వకముగా నైనను, అజ్ఞానముచేత నైనను, బ్రాహ్మణుఁడు గోవును జంపినయెడల ప్రాయశ్చిత్తార్థముగ పరాకకృచ్ఛ్రమును, చాంద్రభక్షణమును జేయవలయును. పిమ్మట నొకదినము పవాసమును జేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. అట్లుగాఁ జేనిదోషరహితుఁడగును. మఱియు నునర్భరోగముగలవాఁడగును. ఇట్లని నాగరఖండమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడు మాత్సర్యముగలవాఁడై తనగోవు నైనను, పరులగోవు నైనను, దండాదులచేత జంపినయెడల పాపాత్ముఁడగును. అట్టిపాపమును నివర్తింపఁజేయుట కొఱకు, అజ్ఞానముచేత జేసినయెడల పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. తెలిసిచేసినయెడల చాంద్రాయణము నాచరించవలయును. రోగముగలగోవును, ముసలిగోవును, చంపినవాఁడు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. మంచివయసుగలగోవును జంపినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. పిమ్మట నొకరోజు యుపవాసమును జేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్లని విష్ణుధర్మోత్తరమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచిత గోవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— ❋ నిమిత్తగోవధ ప్రాయశ్చిత్తం. ❋ ——

(౩౨) అథ నిమిత్తగోవధప్రాయశ్చిత్తమాహ॥ కార్ష్ణ్యః॥ శ్లో॥ అనాథారస్థలెబంధశ్చర్మరజ్జుభిరేవచ। చర్మదాహైర్నదీతోయలంఘనైబహుతాడనైః। గృహదాహైనముక్తిశ్చనిమ్నోన్నతభువస్థలె। చారమెద్యాదిపాశ్చియానరాపుఃరోగవామిహ॥ నాళికేరఫలోత్థచర్మనిర్మితరజ్జవశ్చన్నగజ్జవఃకరీటభూతచరోమోద్భవాఅపి॥ జలసంపూర్ణనద్యుత్తరణే తాడనాని। గృహదాహేక రజ్జ్వోనవినిర్ముక్తాః। లాంగూలచ్ఛేదనచర్మదాహశృంగచ్ఛేదనాదీని గోహననిమిత్తాని। కించ। పరప్రేరణయా తాడనంతృషార్తానాంన జలనిరీక్షణంవ్యాకృష్య తృప్తికాలేడపేక్షా। దస్యుభిర్నీయమానాసుప్రభుస్సన్నిధానరూపం। ఏవమాదీనిగోహనననిమిత్తాని ఏతైర్నిమిత్తైరనుమరణేతత్పాలకస్య హననదోషస్సంభవతి॥ తదాహ కాత్యాయనః॥ శ్లో॥ నారికేళోద్భవారాజకరజ్జవశ్చన్నసంభవాః॥ కత్తృణఖిగృహదాహైనముక్తాఃకంఠసంశ్రితాః॥ లాంగూలశృంగయోశ్చేదశ్చర్మదాహస్తథైవచ। పరప్రేరణయాదండైస్తాడనంబహువారతః॥ శృంగమధ్యేనాసికాయాంభగస్థానెచ తాడనం॥ తృషార్తానాంగవాంస్వామీనదద్యాజ్జలమాదరాత్॥ ఉపేక్షాదస్యుహరణేప్రభూణాంనాపిసూచనం॥ నిమ్నోన్నతస్థలెచైవ సంచారోయదివాభవేత్॥ అనాథారస్థలెబంధోని

రాహో ఽగవామిహ। ఏతైర్నిమిత్తైరన్యైశ్చ పాతనైర్భిత్తివృక్షయోః॥ యదా మ్రియేత యా ధేను ర్హత్యా తత్స్వామినో భవేత్॥ అతస్స్వామీ పరావృత్య కుర్యాత్తద్రక్షణం ముదా। తత్పోషణే మహత్పుణ్య మనంతం పరికీర్తితం। తదుపేక్షా మహత్పాప మనంతం జన్మజన్మసు। అగ్నిహోత్రస్య యా ధేను ర్యా ధేనుశ్శంభుతోషణే। అభిషేకార్థమిత్యర్థః॥ శ్లో॥ యా ధేనుర్గుర్విణీ రాజ్ఞః యా ధేనుః కపిలాత్మికా। ఏతైర్నిమిత్తైస్సా ధేను ర్హతా యది యమాజ్ఞయా। తత్స్వామీ మునిభిః ప్రోక్తో గోహా తత్ర న సంశయః॥ అగ్నిహోత్రాదిధేనూనా మికావాపీమి త్రజైః॥ హతా తత్పాపమోక్షార్థం పరాకో మునిచోదితః॥ ఇతరాసాం గవాం రాజ న్నిమిత్తై రేభిరగ్రతః॥ హననం ప్రాప్యతేష్వైవా తత్స్వామినశ్చాంద్రభక్షణం। అశక్తా రోగవృద్ధాభ్యాం హతా హ్యేత్రైః ప్రమాదతః॥ వృద్ధశబ్దేన వార్ధకముచ్యతే। తత్స్వామిన స్తప్తకృచ్ఛ్రము నిభిః పరికీర్తితం। అగ్నిదాహే విషాణస్య చ్ఛేదరోగనివృత్తయే। యది దైవాన్మృతిః ప్రాప్తా ప్రాజాపత్యం విశుద్ధిదం। దారుణాగురుణా కంఠ లగ్నేన యదియా చ గౌః॥ మృతా తద్దోషశాంత్యర్థం పరాకం కృచ్ఛ్రమీరితం। పత్సు వా మధ్యదేశే తు బంధనే తాడనేఽపి వా। క్రిమ్యాదిశోధనే కాలే మృతా యా ధేనురగ్రతః॥ ప్రాజాపత్యద్వయం ప్రోక్తం మునిభి స్తత్త్వదర్శిభిః। ఔషధం రోగమోక్షాయ కర్తాను గ్యాద్గవామిహ॥ తేనౌషధేన యా ధేను ర్మృతిమాపన్నుదుస్తరాం॥ తత్ర చాంద్రాయణం ప్రోక్తం ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥ తక్రక్షీరఘృతైర్భేద రక్షణాయో గవాం గృహీ॥ కుర్యాత్తద్విపరీతం చే న్మృతా యా ధేనురగ్రతః। తత్రైవ హత్యా మహతీ తప్తకృచ్ఛ్రత్రయం చరేత్। పతనేర్నృపక్షాణాం శంకితానాం నృపోత్తమ॥ తత్ర బద్ధా చ యా ధేనుర్మృతా తత్పానే యదా। తదా తద్దేహశుద్ధ్యర్థం ప్రోక్తం చాంద్రద్వయం ద్విజైః॥ కాశిన్యాజ్జుబంధేన యా చ గౌర్నిధనం గతా। పరాకం పాపముక్త్యర్థం వహ్నిదాహే వ్యామోచనే॥ పరాక స్తత్రయో క్తవ్యా నిమ్నోన్నతభువస్థలే। తత్రాపి పరాక ఇత్యర్థః॥ ఏతాసాం గవామేతై ర్నిమిత్తై ర్హననం ప్రాప్తం చేత్తద్దోషోపశాంత్యర్థం తత్తత్ప్రతిపదోక్తం ప్రాయశ్చిత్తం లోకనా దృశ్యాత్తత్రేతరార్త్తా నో నెచ్ఛంతి। తత్ర మహాంతం దోషమాహ। గౌతమధర్మే॥ శ్లో॥ ఏభిర్నిమిత్తైస్స్వకృత్యైర్యదా యత్రైవ ధేనవః॥ పంచత్వం యది గచ్ఛంతి స్వామినః పశ్యతో ఽత్రితః। హత్యా ప్రాప్తా మహతీ లోకద్వయవిగర్హితా। యస్య దోషాస్య యాల్పోప్తి కంత తత్కుర్యాద్ద్విమంకమే॥ అన్యథా లోకసాప్యశ్చ తప్త ప్రాయశ్చిత్తం రాజ్ఞః। వర్జ్ఞాతే మనుజలోకే తత్ర తస్య దానప్రజ్ఞాను యః।

లకమాసాద్య మాతంగత్వమవాప్యతే॥ తదంతే భువమాసాద్య భిల్లోభవతి గర్హితః। తస్మాదేతద్విశుద్ధ్యర్థం కుర్యాన్నిష్కృతిముత్తమాం। విప్రహత్యాచ మహతీ తథా ధేనువిహింసనం॥ ఉభయోర్యాహత్యాచేత్తత్కర్తుర్నాదితాగతిః। అప్రమత్తతయా రాజన్ ధేనుస్సైవ మాతృవత్సదా॥ పోషణీయా పాలనీయా వర్జ్య స్త్రీభిరిహాదరాత్। క్షత్రియవైశ్యయోరప్యేవం ప్రాయశ్చిత్తం నిమిత్తగోహనన ఏవేదితవ్యం। శూద్రాణామేతాసాం న శుద్ధిర్నేహస్తచ్ఛేదః॥ నిమిత్తహననే శతరూపకేణ దండః। విప్రస్త్రీణామేతాసాం హననే విప్రస్యార్ధం ప్రాయశ్చిత్తం॥ క్షత్రియవైశ్యస్త్రీణాం స్వజాతీయపురుషాణాం ప్రాయశ్చిత్తార్ధం కల్పనీయం। శూద్రస్త్రీణాం శూద్రవదాజ్ఞా రాజ్ఞా కర్తవ్యా॥ న స్త్రీణీతి విచారణీయం॥ తదాహ హైంగః॥ శ్లో॥ బాహుజోరుజపాదాబ్జజాతానాం హననే గవాం॥ నిమిత్తైర్వాథ సాక్షాద్వా ప్రోక్తా విప్రస్య నిష్కృతిః। నిమిత్తహననే తాతవిప్రాణాం సముదీరితం। తతరర్తివ్యంస్యపైశ్యవైశ్యస్త్రీణామర్ధమీరితం। విప్రస్త్రీణాం తథాప్రోక్తం శూద్రాణాం పాణిపీడనం। తత్ స్త్రీణాంచ తథాకార్యం నిమిత్తేన శతం విదురితి॥ ఇతి హేమాద్రౌ నిమిత్తగోవధప్రాయశ్చిత్తం॥

(3౨) నిమిత్తగోవధప్రాయశ్చిత్తము॥ కొబ్బరినార మొదలగువానిచే చేనబడిన త్రాడుచేత గొంతు, ఒరుచుకొనునట్లు బంధించుట. ఆధారము లేనిస్థలమునందు గట్టివేయుట, గృహాదిదహనకాలములయందు మెడనుండు త్రాడును వదలకుండుట, నదీజలమును దాటునప్పుడు కొట్టుట, నిమ్నోన్నతములగు ప్రదేశమునందు సంచరింపజేయుట, మేత వేయకపోవుట, పసుపేరణచే గొట్టుట, తోకను కత్తిరించుట, కొమ్ములను దెగగొట్టుట, దప్పిగొన్న సమయమునందుదకమును బోయకపోవుట, రోగము గలిగియున్నప్పుడు మందును ప్రయోగించకుండుట, దొంగలపహరించినప్పుడు ప్రభువుతో విన్నవించకుండుట, మొదలుగాగలవి గోవధకు గారణములని కూర్మపురాణమునందు జెప్పబడెను. కాత్యాయనుడును నీవిషయములనే జెప్పి మఱియు ట్లనియె. ఇట్టివిషయములు గోమరణమునకు గారణములు. కావున నిట్టి కృత్యములను, గోవుల విషయమై ప్రయోగింపగూడదనియును, గోవును జక్కగా పోషించుటవలన మిగుల బుణ్యము గలదనియును, గోవును జక్కగా పాడకపోవుట మహాపాపమనియును, ఇట్టివిషయములను, కపిలధేనువిషయమై చేసిన యెడల పాపము ద్విగుణితమగుననియును, కపిలధేనువును జక్కగా పాడుటచేత బుణ్యము ద్విగుణితమగుననియును, గోసంరక్షణయందనాదరణను జేసినవాడు గోహత్యను జేసినవాడే యగునని

యును, అట్టివాడు ఘోరనరకములయందుబడుననియును, హోమధేనువునై
నను, శివలింగాభిషేచనమునకు సంపాదించిన గోవువిషయమై యట్టిక్రూరకృ
త్యములను జేసినవాడు మహాపాతకుడగుననియును, అట్టి పాపాత్ముడు పరాక
కృచ్ఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయుననియును నెఱుంగవలయు
ను. అన్యములగు గోవులను, ఇప్పుడు చెప్పబడిన క్రూరకృత్యములచేత జంపిన
వాడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. రోగముచేతనైనను, ము
సలితనముచేతనైనను, అశక్తములగు గోవులను ప్రమాదముచేతజంపినవానికి
తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తము విధింపబడినది. అగ్నిదాహమునందును, కొమ్ము
లను ఛేదించుటయందును, రోగనివృత్తికొఱకు జేయదగిన ప్రయత్నములయం
దును, దైవయోగముచేత మరణము సంభవించెనేని ప్రాజాపత్యముచేతనే
శుద్ధతగలుగును. గుణబంధనముగొంతుకు గట్టుటచేత గోవుమరణమును బొందె
నేని యట్టిపాపముశాంతినిబొందుటకు పరాకకృచ్ఛ్రము నాచరించవలయు
ను. మధ్యదేశాదులయందు తాడనాదులచేత గోవుమరణమును బొందినయెడ
లతత్పాపశాంతికొఱకు రెండుప్రాజాపత్యములను ప్రాయశ్చిత్తార్థముగనా
చరించవలయును. గోవునుసంపాదించినవాడు రోగాదులుగలిగినయెడల
ఆరోగనివారణకొరకు దగినప్రయత్నములను జేయవలయును. అట్లుప్రయ
త్నించిరోగనివృత్తికొరకు ఔషధమునుప్రయోగించుచున్నసమయమునం దా
గోవుమరణమునుబొందినయెడల ప్రాయశ్చిత్తార్థము చాంద్రాయణవ్రతము
నాచరింపవలయును. తక్రక్షీరఘృతములచేత గోసంరక్షణను జేయవలయు
ను. అట్లుచేయునపుడు మరణమునుబొందెనేని తత్పాపశాంతికొఱకు తప్త
కృచ్ఛ్రము నాచరింపవలయును. గోడలు, వృక్షములు, రాళ్ళు మొదలగునవి
పడుస్థలమునందు గోవును గట్టివేయగూడదు. అట్టిస్థలములయందుగట్టివే
సినపుడు గోడలుమొదలగునవి పడుటవలన మరణమునుబొందెనేని తత్పా
పశాంతికొఱకు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. కఠినముగ
గొంతునందు దారమును వేసి కట్టుటచేత గోవుమరణమును బొందెనే
పాపశాంతికొఱకు పరాకకృచ్ఛ్రము నాచరింపవలయును. గృహదహన
కాలమునందు కట్టివేసియున్న గోవును విడువనియెడల తత్పాపశాంతికొ
ఱకుపరాకకృచ్ఛ్రము నాచరింపవలయును. నిమ్నోన్నతమగు ప్రదేశమునం
దుగట్టివేయుటచేత గోవుమరణమునుబొందెనేని తత్పాపశాంతికొఱకుప
రాకకృచ్ఛ్రము నాచరింపవలయును. ఇప్పుడు చెప్పబడిన కారణములచేత
గోవులుమరణమును బొందినయెడల గోదానములు ప్రాయశ్చిత్తములను

జేసికొననేని మహాపాపులగుదురు. కావున ముఖ్యముగ ప్రాయశ్చిత్తమును నాచరింపవలయును. అట్లు ప్రాయశ్చిత్తముల నాచరించనివారు ఘోరనరకములయందుఁ బడుదురు. పిమ్మటఁ జండాలురై పుట్టుదురు. భిల్లజన్మమైనను వచ్చును. బ్రహ్మహత్యగోహత్యలు రెండును సమానములేయని యెఱుంగవలయును. కావున గోవులను, తల్లులనుగాపాడినట్లు ప్రమాదములేక కాపాడవలయును. ఇట్లని గౌతమకాత్యాయనులు వచించిరి. క్షత్రియవైశ్యులకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. క్షత్రియవైశ్యస్త్రీ లిట్టి ఘోరకృత్యమును జేసినయెడల పురుషులకువిధించిన ప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రులైనను, శూద్రస్త్రీలయినను, గోహనననిమిత్తము లు చేసిన యెడల హస్తచ్ఛేదమును జేయవలయును. శూద్రస్త్రీవిషయములో స్త్రీగదాయని విచారింపఁ గూడదు. బ్రాహ్మణస్త్రీ లిట్టికృత్యమును జేసిన యెడల బ్రాహ్మణులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధింపవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రియను గ్రంథమునందు గోవధప్రాయశ్చిత్తము.

——⁕ గోవత్సహననప్రాయశ్చిత్తమ్. ⁕——

(౩౩) అథగోవత్సహననప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ శ్లో॥ వత్సశ్చత్రివిధః ప్రోక్తో బాలః పౌగండకో యువా। ఏతేషాం హననే ప్రోనిమిత్తైరుత వా స్వయం। చండాలత్వ వాప్నోతి త్రిషుజన్మసుపంచసు॥ అతో వత్సాః పోషితవ్యా విప్రైర్లోకైశ్చ సభిస్సదా। యావత్తృణభక్షణం నో వ్వదరపూరణం నజానాతి తావద్వత్సబాలః॥ మాతరం త్యక్త్వా స్వేచ్ఛయా సంచరమాణః పౌగండకో వత్సః। గర్భధారణసుఖం జ్ఞాత్వా యోనదుద్భిస్సహ సంచరతి స యువా॥ వత్సజననానంతరంగాః॥ ఏతేషాం హననే పృథక్ పృథగ్గోహం ప్రాయశ్చిత్తమాహ॥ ⁕ కౌర్మే॥ శ్లో॥ సబాలోదరపూర్త్యర్థం యావత్కాలం తృణాశనః॥ ఊధస్యం మాతరం త్యక్త్వా సంచరన్ స్వేచ్ఛయా నృప। పౌగండకస్స విజ్ఞేయస్సంచరన్ మత్తమత్తవత్॥ గోవృషైస్సహ యః క్రీడన్ స యువా త్రివిధస్స్మృతః। సా గౌర్యా వత్ససూర్జ్ఞేయా మహాపాతకనాశినీ। ఏతేషాం త్రివిధానాంచ మధ్యే యో యోనిహన్యతే। యేనహన్యత ఇత్యర్థః॥ ఛందోవత్పురాణానీ తి కృత్వా సంధిసౌష్ఠవం నవిచారణీయం॥ తదాహ॥ నారదీయే॥ రాజా యో హన్యతే తత మాహుః రాత్మయాషో యజ్ఞోనంతదక్షిణ ఇతి॥ లైంగే॥ శ్లో॥ వత్సానాం త్రివిధానాంచ ఏకం హన్యాద్ద్విజో యది తత్త్వాప ఫలం భుక్త్వా చండాలత్వమవాప్నుతే। బాలం హన్యాద్ద్విజో యస్తు క్షీరాదాన

నిమిత్తకైః ప్రాజాపత్యద్వయం సాక్షాన్నిమిత్తై రేకముచ్యతే। కృత్వా శుద్ధి
మాప్నోతి హ్యన్యథా పశుఘాతకః॥ స్కాందే॥ యోబాలవత్సం కామేన నిమిత్తై
ర్వా స్వయం హనేత్॥ తత్ర దేహవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యద్వయం చరేత్॥ ని
మిత్తై ర్వా యదా హన్యాత్ క్షీరాదానాదిభిః క్రమాత్। నిమిత్తపాప
శోన్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్॥ విప్ర స్త్రీణాం తదర్ధం స్యాద్బాలవత్స
విహింసనే॥ క్షత్రియాణాం ద్విగుణితం వైశ్యానాం త్రిగుణం భవేత్। తత్త్రిస్త్రీ
ణాం తదర్ధం స్యాత్పాదజం దండమేచ్ఛతే॥ పౌగండకం తు యో వత్సం నిమిత్తై
ర్వా స్వయం హనేత్॥ తత్ర దేహవిశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రం చరేత్పురా॥ శివ
ధర్మోత్తరే॥ శ్లో॥ మౌనమిశ్రేణ పౌగండో వత్సోయది నిహన్యతే॥ తస్య దేహవి
శుద్ధ్యర్థం చరేత్తప్తం ముదా సహ॥ పశ్చాత్పాపవిశుద్ధ్యర్థం పంచగవ్యం
తతః॥ శివధర్మోత్తరే॥ శ్లో॥ పౌగండకం సదోన్మత్తం గోవత్సం స్వగృహే
వా॥ నిమిత్తైః పూర్వజైర్వ్యాప్య హన్యాద్వై విప్రచోదితః॥ తద్దోషపరిహా
ర్థం చరేత్తప్తం యథావిధి॥ పంచగవ్యం తతః పశ్చాత్ప్రభేదజ్ఞాననాశనం। క్ష
త్రియాణాం ద్విగుణితం వైశ్యానాం త్రిగుణం తథా॥ విప్రాంగనాదీనాం తత్
ప్రాయశ్చిత్తార్థం కల్పనీయం। పాదజం తేన దండవత్॥ గారుడపురాణే
శ్లో॥ యువానం గోవృషం హన్యా త్పూర్వజస్స్వయమాదరాత్॥ నిమిత్తై
ర్వాథ రాజేంద్ర పరప్రేరణయాథవా। మహాంతం నరకం గత్వా జాయతే
పసూచిమాన్॥ వృషస్య శృంగద్వయం సూచకం। తద్వద్యూనో వత్సస్య చ
తుర్గుదస్థానే సూరణాంకురవదంకుర ద్వయం భవేదిత్యర్థః॥ భవిష్యోత్తరే
శ్లో॥ యువానం గోవృషం హత్వా పూర్వజో బాహుజో వణిక్॥ మహాంతం న
రకం భుక్త్వా జాయతే సోర్శవాన్ భువి॥ స్కాందే॥ శ్లో॥ అరణ్యే జలమధ్యే
వా స్వగృహే యో ద్విజాధమః॥ యువానం గోవృషం హన్యాన్నిమిత్తై
ర్వా స్వయం। తత్తత్పాపఫలం భుక్త్వా జాయతే భువి రోగవాన్॥ తస్య
దోషశాంత్యర్థం కుర్యాచ్చాంద్రాయణం వ్రతం। గోదానం చ తతః కుర్యా
త్పంచగవ్యమనంతరం॥ కృత్వా శుద్ధిమవాప్నోతి నీరోగో జాయతే భువి।
ప్రస్త్రీణాం తదర్ధం స్యాత్ప్రాయశ్చిత్తమితీరితం। క్షత్రియవైశ్యానాం తద
నానాం ద్వైగుణ్యం త్రైగుణ్యం తత్తదర్ధం చ యోజనీయం॥ అత ఊర్ధ్వం హ
నే గోవధప్రాయశ్చిత్తవత్సర్వం వర్ణస్త్రీవివేకతయా యోజనీయం॥ ఇతి హే
మాద్రివిరచితే గోవత్సహననప్రాయశ్చిత్తం॥

(33) ఆవుదూడను జంపినదోషనివృత్తి కొఱకు ప్రాయశ్చిత్తము
దూడ మూసియును, పౌగండకమనియు, పెయ్యయనియు, గోవత్సమనియు

నామధేయములు. ఈమూఁడువిధములయిన గోవత్సలలో నెద్దానిఁజంపినను మూఁడుజన్మలవఱకైనను, అయిదుజన్మలవఱకైనను, చండాలుఁడై పుట్టును. అదికారణముగ బ్రాహ్మణుఁడగువాఁడు బహూపధోపాయములచేత గోవత్సను బోషించవలయును. తృణభక్షణనుజేయు సామర్థ్యమునిచ్చువఱకును బాలయని చెప్పఁబడును. తల్లినివదలి స్వేచ్ఛగాఁదిరిగి మరల గృహమునకురాఁదగినకాలమువచ్చిన గోవత్సము పోగండకమని చెప్పఁబడును. గర్భధారణసుఖమును దెలిసి వృషభములతోఁగూడఁ దిరుగుసమయము యువయనఁబడును. ఇప్పుడాంధ్రభాషయందుఁ గ్రమముగ లేదూడయనియును, తరిపిదూడయనియును, పెయ్యయనియును జెప్పఁబడుచున్నవి. ఒకయీతయీనినపిమ్మట గోవనిచెప్పఁబడును. ఇట్లని మార్కండేయమునివరుఁడు చెప్పె. ఈవిషయమే కౌర్మపురాణమునందును జెప్పఁబడియె. రాజగువాఁడు నాలుగువిధములగు భేదములుగల గోవులలోనే గోవునుజంపినను, తత్పాపశాంతికొఱకు, అపరిమితమయిన దక్షిణగల యజ్ఞమును జేయవలయునని నారదీయమునందుఁ జెప్పఁబడె. మూఁడువిధములయిన వత్సలలో నెద్దానినైనను, ద్విజులుచంపిరేని యాపాపఫలమననుభవించినపిమ్మటఁ జండాలత్వమునుబొందును. పాలయందభిలాషచేత గోవత్సమును జంపినవాఁడు తత్పాపశాంతికొఱకు రెండుప్రాజాపత్యకృఛ్రములు నాచరించవలయును. అట్లుప్రాయశ్చిత్తము నాచరించనివాఁడు పశుఘాతకుఁడగునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. లేదూడను క్షీరాభిలాషచేతఁ బూర్వోక్తములగు నిమిత్తములచేతఁ జంపినవాఁడు తత్పాపశాంతికొఱకు రెండు ప్రాజాపత్యములనాచరింపవలయును. క్షీరాదానాదులచేతనైనను, అన్యములగునిమిత్తములచేతనైనను, జంపినయెడల తత్పాపశాంతికొఱకుఁ బ్రాజాపత్యకృఛ్రము నాచరింపవలయును. ఈమహత్కృత్యమును జేసిన బ్రాహ్మణస్త్రీలకుఁబురుషులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయును. ఈవిషయమునందు క్షత్రియవైశ్యులకుఁ బ్రాయశ్చిత్తమును ద్విగుణితముగ విధింపవలయును. క్షత్రియవైశ్యస్త్రీలకు క్షత్రియవైశ్యులకు విధించినప్రాయశ్చిత్తమునందర్ధభాగమునువిధించవలయును. పోగండకవయస్సునందున్నగోవునుస్వయముగా పూర్వోక్తములగు నిమిత్తములచేత జంపినయెడల తత్పాపశాంతికొఱకు తప్తకృఛ్రము నాచరించవలయును. ఇట్లని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. ఈప్రకారముగానే విష్ణుధర్మోత్తరమునందును జెప్పి ప్రాయశ్చిత్తానంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయుననియును జె

ప్పఁబడియె. మిగుల మదించినదియును, పౌగండకవయస్సునందున్నదియును
నగు గోవత్సమును పూర్వోక్తములగు నిమిత్తములచేత గోకులమునందై
నను, గృహమునందైనను, జంపినబ్రాహ్మణుఁడు తత్పాపశాంతికొఱకుతప్త
కృచ్ఛ్రమునాచరించవలయును. అనంతరమందుఁ బంచగవ్యప్రాశనముఁ జేయవల
యును. ఈవిషయమునందు క్షత్రియులకు ద్విగుణితముగాను, వైశ్యులకు
త్రిగుణితముగాను బ్రాహ్మణాదికుల స్త్రీలకు వారివారిపురుషులకు విధింపఁబ
డినప్రాయశ్చిత్తమునందు సగమును విధింపవలయును. శూద్రుఁడీదుష్కృ
త్యమును జేసినయెడల నూఱువరహాలను శిక్షార్థముగ రాజుదండుగను బుచ్చు
కొనవలయును. ఇట్లని శివధర్మోత్తరమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడ
గువాఁడు పరప్రేరణచేతనైనను, స్వయముగానైనను, చక్కనివయస్సుగ
వృషభమును పూర్వోక్తములగు నిమిత్తములచేతఁ జంపినయెడల గొప్పదగు
నరకమును బొందును. కొమ్ములువచ్చినపిమ్మట వృషభమని చెప్పఁబడును. ఈ
ప్రకారముగా యువయను సంజ్ఞగల గోవునకు గుదస్థానమునందు కుర్వ
యము సూరణాంకురములవలె గలుగుననుట. ఇట్లని గరుడపురాణమునం
దుఁ జెప్పఁబడియె. బ్రహ్మక్షత్రియవైశ్యులలో నెవ్వఁడైనను, మంచివయస్సు
గలవృషభమును, పూర్వోక్తములగు నిమిత్తములచేతఁ జంపెనేని ఘోరన
రకమునందుఁబడి యనేకములగు సంకటములనుబొందినపిమ్మట సర్వరోగము
గలవాఁడై పుట్టును. ఇట్లని భవిష్యోత్తరపురాణమునందుఁ జెప్పఁబడె. అ
ణ్యమునందైనను, జలమధ్యమునందైనను, స్వగృహమునందైనను, పూర్వోక్త
ములగు నిమిత్తములచేత వయోవంతమైన వృషభమును జంపినవాఁడు త
త్పాపఫలమును ముందుగ నరకలోకమునందనుభవించి పిమ్మట భూలో
కమునందు రోగవంతుఁడైపుట్టును. కావునఁ దద్దోషశాంతికొఱకు చాంద్రా
యణవ్రతము నాచరించవలయును. పిమ్మట గోదానమును జేసి పంచగవ్య
ప్రాశనమును జేయవలయును. ఇట్లు చేసికొనినయెడల పాపరహితుఁడగు
ను. మఱియు రెండవజన్మయందు రోగరహితుఁడగును. బ్రాహ్మణస్త్రీలీ
దుష్కృత్యమును జేసినయెడల బ్రాహ్మణులకు విధించినప్రాయశ్చిత్తమునందు
సగమును విధించవలయును. క్షత్రియులకు ద్విగుణముగా విధింపవలయును.
వైశ్యులకు త్రిగుణితముగ విధింపవలయును. వారిస్త్రీలకు వారికివిధింపఁబడి
ప్రాయశ్చిత్తమునందు సగమును విధింపవలయును. ఇంతకంటెను పరిగ
హననవిషయమై గోవధప్రాయశ్చిత్తమువలె సర్వవర్ణస్త్రీ వివేకత్వముచే
యోచించుకొనవలయును. ఇట్లని [illegible] మునందుఁ జెప్పఁబడియె.

ఇట్లని హేమాద్రియందు గోవత్సహననప్రాయశ్చిత్తము సమాప్తము.

——* వృషహననప్రాయశ్చిత్తమ్ *——

(౩౮) అథవృషహనన ప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే ॥ శ్లో॥ ఏకాదశే
హ్నిసంప్రాప్తే పితృోర్మరణసంభవే ॥ ప్రైశాచత్వస్య ముక్త్యర్థ ముత్సృష్టో
యోవృషః పరైః ॥ హన్యతే యది రాజేంద్ర వ్యంకితశ్శివముద్రయా ॥ శివద్రోహీ
తి విఖ్యాతస్సర్వకర్మబహిష్కృతః ॥ మృత్వా నరకమాసాద్య చండాలత్వమవా
ప్నుయాత్ ॥ తస్యైవ నిష్కృతిర్నాస్తి కారీషదహనాదృతే ॥*॥ స్కాందే॥
శ్లో॥ పితౄర్థం తు కామ్యార్థం జనైరుత్సృష్టముత్తమం ॥ శివలింగాంకితం స
వ్యక్షివరూపంజనాధిప । వృషంహత్వా తదా విప్రః కేదారక్షేత్రభక్షణాత్ ।
పరప్రేరణయా వాపి హ్యరణ్యే గ్రామ ఏవ వా ॥ రజ్జుదండాదిభిస్సవ్యక్సహాయై
రుపదిష్టవాన్ ॥ తదుపాయప్రదో మర్త్యస్సదోషైత్తుపరాయణః॥ హంతా
తస్య మహాపాపశ్చత్వారః పాపభాగినః । రాజతాడనదండ ఉత్సృష్ట్యా గ్విచా
ర్యబహువార్తయా ॥ తేషాం ఫాలేషు కర్తవ్యం తప్తలింగం నృపోత్తమైః ॥ ని
స్సారణం వాదయుక్ భృత్యైర్వృషహం తేతి సర్వతః ॥ అటిత్వా నగరీం సర్వాం
నిర్వాస్యా విషయాద్బహిః । తదా ప్రభృతి తే సర్వే తీర్థం తీర్థం విగాహ్య చ ॥ అ
శేషేషు చ దేశేషు చరిత్వా ప్రత్యహం ముదా ॥ పశ్చిమే ద్వారకామేత్య హం
సద్వారం తథోత్తరే । తథైవ పూర్వదిగ్భాగే గంగాసాగర సంగమం ॥ తథై
వ దక్షిణే భాగే చాపాగ్రం గంధమాదనే । ఏవం క్రమేణ కర్తవ్యం భూపరిక్రమ
ణం తదా ॥ చాపకోటిముపాగమ్య తత్ర స్నాత్వా దినత్రయం । పశ్చాత్తాప
సమాయుక్తస్సభామాగత్య వాగ్యతాః ॥ తయానుజ్ఞామవాప్యాథ చరేయుశ్చాం
ద్రభక్షణం । పంచగవ్యం తతః పీత్వా గాం దద్యుర్ద్విజపుంగవే । ఏతే శుద్ధిం గ
చ్ఛంతి వృషఘ్నా రఘునందనేతి॥ * ॥ బ్రహ్మకైవర్తే ॥ శ్లో ॥ యో విప్రో వృ
షభం హన్యాచ్ఛివలింగాంకితం తనా ॥ ఫాలే తప్తశివం కృత్వా నిస్సారణం ధ్వ
నత్తుక్షస్స్వయం ॥ త్రివారం క్ష్మాం పరిక్రమ్య బ్రహ్మచర్యవ్రతే స్థితః। పశ్చాచ్చా
పాగ్రమాగమ్య గంధమాదనపర్వతే ॥ తత్ర స్నాత్వా త్రిరాత్రం చ రామలిం
గం నిరీక్షయేత్ ॥ పశ్చాత్తాపముపాగమ్య సభాం నత్వా తదాజ్ఞయా ॥ చాం
ద్రాయణం తదా కుర్యాద్దద్యాద్విప్రాయ గాం శివాం । పంచగవ్యం తతః పీత్వా
శుద్ధో భవతి నాన్యథా॥ రాజా హన్యాత్పూర్వముక్తం వృషభం శివలాంఛితం॥
దద్యాదాత్మసమం హేమసహస్రం వా గవాం చరేత్ । విప్రాంగనా పరిత్యా
జ్యా పోషణీయాన్నదానతః ॥ రాజస్త్రీణాం శతం ప్రోక్తం గవాం దానం ద్విజ
న్మసు । వైశ్యస్య రాజవత్ప్రోక్తం తత్ స్త్రీణాం చ తథైవ చ॥ శూద్రో హన్యా

ద్యుత్రహతస్రగ్రతంసిఖనేచ్ఛవి । సహసేనౌథవాదండ్యాదన్యథా దోషమాప్నుయాత్ ॥ ఇతి హేమాద్రివిరచితే వృషభహనన ప్రాయశ్చిత్తం ॥

(౩౮) వృషభహననప్రాయశ్చిత్తము॥ తల్లిదండ్రులు మృతిబొందిన పదునొకండవదినమునందు తల్లిదండ్రులకుఁ బైశాచత్వము వోవుటకొఱకు వృషోత్సర్జనమును జేయవలయును. అట్లు చేయువృషభమునకు శివముద్రను వేయవలయును. అట్టిశివముద్రగల వృషభమును జంపినవాఁడు శివద్రోహి యనంబడును. ఇట్టిశివద్రోహి సర్వకర్మబహిష్కృతుఁడును, ప్రాయశ్చిత్తవిధిలేనివాఁడునునగును. కావునట్టివాఁడు మరణానంతరమందు నరకమును బొందును, పిదపఁ జండాలుఁడై పుట్టును, కావునట్టి పాపాత్మునకేరుపిడకలయందుఁ గాల్చి వేయుటకంటె నన్యమగు ప్రాయశ్చిత్తము లేదని కూర్మపురాణమునందుఁ జెప్పబడెను. తల్లిదండ్రులకొరకైనను, కామ్యముకొరకైనను, శివముద్రను వేసి వదిలిపెట్టిన వృషభము శివరూపమని యెఱుఁగవలయును. అట్టివృషభము కేదారక్షేత్రభక్షణమును జేయుచున్నదని కోపముచేతనైనను, పరులుప్రేరేపించుటచేతనయినను, అరణ్యమునందైనను, గ్రామమునందైనను, రజ్జుదండాదులచేతనయినను జంపినబ్రాహ్మణుఁడు మహాపాతకుఁడనఁబడును. అట్టివృషభమును జంపుటకుఁదగినయుపాయమును బోధించినవాఁడును, చంపుచున్నసమయమునందుఁ జూచుచునూరకున్నవాఁడును, చంపుటకుఁదగినసాధనములను దెచ్చియిచ్చినవాఁడును, చంపినవాఁడును, సమానపాపఫలమును బొందువారగుదురు, కావునట్టిపాపకృత్యమును జేసినవారలను రాజగువాఁడు పిలిపించి చక్కగవిచారించి యాపాపాత్ములయొక్క ఫాలభాగమునందు లింగాకారముగఁ గాల్పించవలయును. పిమ్మటనిస్సాణమును వాద్యమును మ్రోగించుచు గ్రామమునందంతటను వీరువృషభమునుజంపిన పాపాత్ములని చాటింపును జేయించవలయును, అనంతరమందు గ్రామమునందుండకుండునట్లుల వెళ్లఁగొట్టవలయును. పిమ్మట నప్పాపాత్ములు సర్వతీర్థములయందును స్నానమును జేయవలయును. మఱియును ఋషిప్రతిష్ఠితములయిన దేవాలయములను దర్శించవలయును, పశ్చిమదిక్కునందలి ద్వారకను, ఉత్తరదిక్కునందలి హంసద్వారమును, దక్షిణదిక్కునందుండునట్టి గంధమాదనమునందలి చాపాగ్రమును, దర్శించవలయును, ఇవ్విధముగా భూపరిక్రమణమును జేయవలయును, గంధమాదనమునందలి చాపకోటిని బొంది మూఁడుదినములు స్నానమును జేయవలయును, పిమ్మట పశ్చాత్తాపమును బొంది సభలోనికిఁ బోయి వాఙ్నియమమునవలంబించవలయును. అనంతరమందు సభవారి

యనుజ్ఞనుబొంది చాంద్రాయణవ్రతము నాచరించవలయును, అట్లుచాంద్రాయణవ్రతమునాచరించినపిమ్మట పంచగవ్యప్రాశనను జేసిగోదానమును జేయవలయును. ఇట్లుచేసినయెడల పరిశుద్ధుఁడగునని స్కాంద పురాణమునందుఁ జెప్పఁబడెను. శివలింగాంకితమగు వృషభమునుజంపిన బ్రాహ్మణునియొక్క ముఖమునందు శివలింగాకారముగ రాజగువాఁడు కాల్పించవలయును- పిమ్మటనప్పాపాత్ముఁడు మూఁడుపర్యాయములు భూప్రదక్షిణమునుజేయుచు బ్రహ్మచర్యవ్రతము నవలంబించవలయును. అనంతరమందు గంధమాదన పర్వతమునందలి చాపాగ్రమునుబొంది యచ్చోటస్నానమునుజేసి మూఁడుపర్యాయములు రామలింగేశ్వరుని దర్శించవలయును. అనంతరమందుఁ బశ్చాత్తాపయుక్తుఁడై బ్రాహ్మణసభకు నమస్కారమును గల్పించి యాసభికుల యొక్క యనుమతమునుబొంది చాంద్రాయణవ్రతము నాచరించవలయును. పిమ్మటనొక్క గోదానమును జేయవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్లుసేసెనేని పరిశుద్ధుఁడగును, శివచిహ్నాముద్రితమయిన వృషభమునురాజగువాఁడు జంపెనేని తనకుసమానమగుబంగారమును దానముచేసి వేయిగోవులను దానముచేయవలయును, బ్రాహ్మణస్త్రీయిట్టి దుష్కృత్యమును జేసినయెడల కులములోనుండిబహిర్గతముచేసి యన్నమునుమాత్రము పెట్టుచుఁబోషించవలయును, రాజస్త్రీలిట్టి దుష్కృత్యమును జేసినయెడల నూరుగోవులను దానముచేయించవలయును. వైశ్యునకు రాజతుల్యముగఁ బ్రాయశ్చిత్తమును విధింపవలయును, వైశ్యస్త్రీలకు నునటులనేవిధించవలయును. శూద్రుఁడగువాఁడు వృషభమునుజంపెనేనియట్టివానినిజంపిభూమియందుఁ బాతిపెట్టవలయును. అట్లుగాదేని వేయివరహాలు శిక్షగావిధింపవలయును. ఇట్లుచేయనియెడల రాజునకు మహాపాపము సంభవించునని యెరుఁగవలయునని బ్రహ్మకైవర్తమునందుఁ జెప్పఁబడెను. ఇట్లని హేమాద్రివిరచితమైన వృషభహనన ప్రాయశ్చిత్తముసమాప్తము॥

—— * బలీవర్ధహనన ప్రాయశ్చిత్తమ్ * ——

(౩౫) అథబలీవర్ధహననప్రాయశ్చిత్తమాహ॥ శివధర్మోత్తరే శ్లో॥ అనడ్వాన్‌హన్యతేవిప్రైరశ్మదండశిలాదిభిః । గృహేవావిపినేతోయే భారోద్వహనకర్మణి । జ్ఞానతోఽజ్ఞానతోవాపి రోషాద్వామత్సరాదపి । తేషాం తునిష్కృతిర్నాస్తితప్తకృచ్ఛ్రైస్త్రిభిర్వినా ॥ వారాహే ॥ శ్లో॥ జలమధ్యాభారవాహకృషికాలేచదామనే ॥ గృహేజలేవనేవాపి అనడ్వాన్యేనహన్యతే॥ పాదాదితాడనేచైవ శృంగచ్ఛేదేచవాహనే। లాంగూలఖండనేవాపి ని

మిత్తైః పూర్వచోదితైః । ఏతైరన్యతమైర్వాపి విప్రోహన్యాద్ధురంధరం । త
స్యైవనిష్కృతిరియం ప్రదిష్టా మునిపుంగవైః । తప్తకృచ్ఛ్రత్రయం కృత్వా పం
చగవ్యం పిబేత్తతః ॥ ఏతస్మాచ్ఛుద్ధిమాప్నోతి నాన్యథాశుద్ధిరిష్యతే ॥ భవి
ష్యోత్తరే॥ శ్లో॥ అనడ్వాన్యస్యసంయుక్తో వనిమిత్తైరుతవానృప ॥ హన్యతేనో
దుష్టాత్మా ప్రాయశ్చిత్తీభవేత్తదా ॥ రాజా తం సమ్యగాలోచ్య దండయేచ్ఛ
తరూపతః । పశ్చాత్తాపసమాయుక్తస్తప్తకృచ్ఛ్రత్రయం చరేత్ । పంచగ
వ్యేనపూతాత్మా శుద్ధిమాప్నోతి నైష్ఠికీం । రాజాహన్యాదనడ్వాహమాయు
ధైర్బహుభిర్యదా । తదానరకమాప్నోతి ప్రాయశ్చిత్తార్ధమర్హతి । విప్ర
ప్రాయశ్చిత్తార్ధం కుర్యాదిత్యర్థః ॥ శ్లో॥ వణిక్పుత్రస్తు వాణిజ్యే హ్యనడ్వాహం
యః బాహనేత్ । నిమిత్తైరాత్మనావాపి క్షత్రియస్యార్ధమర్హతి । శూద్రోహ
న్యాద్బలీవర్దం నిమిత్తైరుత కామతః ॥ శతరూప్యేణ తం దండ్యాదథవాహస్తమో
చనం । హస్తచ్ఛేదనమిత్యర్థః ॥ తత్ స్త్రీణాం తదర్ధం ప్రాయశ్చిత్తం యోజనీ
యం । బాల్యతారుణ్యాదికం పూర్వముక్తం । బాలపౌగండ కుమారావస్థా
సు యత్ర యత్ర హననం తత్ర తత్ర ప్రాయశ్చిత్తం పూర్వవత్కల్పనీయం । భా
వాహ్యనడుద్ధననైడుక్తప్రాయశ్చిత్తం విశోధనం ॥ ఇతి హేమాద్రివిరచితబలీవర్ద
వధప్రాయశ్చిత్తం ॥

(౩౫) బలీవర్దహనన ప్రాయశ్చిత్తము ॥ గృహమునందైనను, అర
ణ్యమునందయినను, ఉనకమునందయినను, బరువును మోయుసమయమునంద
యినను, తెలిసియయినను, తెలియకనయినను, రోషమువలనగాని, మత్స
రమువలనగాని, రజ్జుదండశిలాదులచేత బలీవర్దమును జంపినవానికి ప్రాయశ్చి
త్తము లేదు. అయినను మూడుతప్తకృచ్ఛ్రముల నాచరింపవలయునని శి
రోమోత్తరమునందు జెప్పఁబడియె. జలమధ్యయందయినను, భారమును వహిం
చుసమయమునందయినను, కృషికాలమునందయినను, గృహాదిదహనకాలమ
నందయినను, శృంగచ్ఛేదసమయమునందయినను, వాహనమును కుపయోగిం
చుసమయమునందయినను, లాంగూలఖండన కాలమునందైనను, పాదతాడ
నాదులచేతనైనను, రజ్జుదండాదులచేతనైనను, బలీవర్దనమును జంపినవాం
డు మహాపాపాత్ముఁడనఁబడును. ఇట్టిపాపాత్ముఁడు తనదు పాపనివృత్తికొరకు
తప్తకృచ్ఛ్రత్రయమును ప్రాయశ్చిత్తార్థముగనాచరించి పంచగవ్యప్రాశనము
జేయవలయును. ఇట్లు చేసినయెడల పరిశుద్ధుఁడగునని వారాహమునందు
జెప్పఁబడె. పూర్వోక్తములయిన నిమిత్తములచేత బలీవర్దమును జంపినయెడల
పాపాత్ముఁడగును. అట్టిపాపాత్ముని గాంచినవాఁడు సకల గణాచారించినను

రూపాయీలశిక్షను విధించవలయును. పిమ్మటనప్పాపాత్ముఁడు పాపనివృత్తికొఱకు మూడుతప్తకృచ్ఛ్రముల నాచరించవలయును. అనంతరమందు బంచగవ్యప్రాశనను జేయవలయును. రాజగువాడు వృషభమును పూర్వోక్తములగు నిమిత్తములచేతజంపినయెడల నరకలోకమునుబొందును. కావున బ్రాహ్మణునకువిధింపబడిన ప్రాయశ్చిత్తమందు సగమునువిధించవలయును. ఇట్లనిభవిష్యోత్తరమునందు జెప్పబడియె. వైశ్యుడు వర్తకాదివ్యాపారములయందు వృషభమునుజంపినయెడల క్షత్రియునకువిధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు సగమునువిధింపబడినది. శూద్రుఁడగువాఁడు, పూర్వోక్తములగునిమిత్తములచేతనైనను, కోరికచేతనైనను, వృషభమునుజంపినయెడల నూరు రూపాయీలను శిక్షార్థముగవిధించవలయును. అట్లుగావానిచేతులనుదెగగొట్టించవలయును. శూద్రస్త్రీలకు శూద్రులకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. ఈవృషభమునందు బాల్యతారుణ్యాదికమునుగుఱించి పూర్వోక్తప్రకారముగ యోచించవలయును. భారమును మోయుటకు దగినవయస్సుగల వృషభమునుజంపినయెడల నిప్పుడుచెప్పినప్రాయశ్చిత్తమును, విధించవలయునని యెఱుంగనగునని తాత్పర్యము॥

## గజవధప్రాయశ్చిత్తమ్.

(౩౬) అథగజవధప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ శ్లో॥ సహాయైస్సాధనోపాయైర్వాప్యర్వావిప్రసత్తమః। అరణ్యేవాధ్వవాసేవాహస్తైదద్యవిచారయన్॥ పశ్చాన్నరకమాప్నోతిజాయతెగజచర్మవాన్। తద్దోషపరిహారార్థం తప్తకృచ్ఛ్రంచరేద్బుధః॥ కౌర్మె॥ శ్లో॥ ఉపేక్షాహననేతస్యసహాయైర్హనసాధనైః॥ వాక్యైరంగీకృతైర్వాపి యోవిప్రోహస్తినంహనేత్ ॥ రాజాతు దండయేత్పశ్చాచ్ఛతరూప్యేణదండతః। పశ్చాన్నరకమాసాద్యదుష్టవ్యాధియుతోభవేత్। పశ్చాత్తాపసమాయుక్తస్తప్తకృచ్ఛ్రంవిశుద్ధయే ॥ ఉపోష్యరజనిమేకాంపంచగవ్యేనశుద్ధ్యతి ॥ తదర్థంకరిపోతెచతదర్ధంగర్భమోచనే। తత్స్త్రీణాంతుతదర్ధంస్యాత్ప్రాయశ్చిత్తముదీరితం ॥ లక్ష్మీకామోరాజాయుద్ధాదన్యత్రనహాస్తివధంకుర్యాత్తదాహ॥ దేవీపురాణే॥ శ్లో॥ సాంపరాయే గజంహన్యాద్యదిస్వహననేపతేత్। తదాతస్యనదోషస్స్యాదిత్యాహభగవాన్యమః। గజయుద్ధేగజంహన్యాదన్యథాదోషభాగ్భవేత్॥ లక్ష్మీఃక్షీయేతతస్యాథ పరత్రనరకంవ్రజేత్॥ స్కాందె॥ సంపత్కామోయుద్ధకాలాదన్యత్రకరిణాంహననం। నకుర్యాద్యదిదుష్టాత్మాతస్యసంపద్వినశ్యతి। మృత్వానరకమాప్నోతి సాంపరాయెనదోషభాక్॥ ఆత్మాభిముఖమాయాంతంహంతుంస్వం యదిగ

చ్ఛతి॥ తదాహ న్యాద్గజం రాజానదోష స్తస్యతత్రహి ॥ రాజాపశ్చాత్ప్రకుర్వీత ప్రాజాపత్యద్వయంముదా॥ యుద్ధాదన్యత్ర గజహనన వేదితవ్యం ॥ యుద్ధే హత్వాతు తాత్కాలికగోదానాచ్ఛుద్ధిః॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ యుద్ధాదన్యత్రయో రాజా ప్రమాదాద్ధస్తినంహనేత్ ॥ తత్పాపశోధనం రాజా ప్రాజాపత్యద్వయంచరేత్॥ యుద్ధేగోదానమాత్రేణ శుద్ధో భవతినిశ్చయః॥ తదర్ధంకరిపోతేస్యాత్తదర్ధంగర్భమోచనే । వైశ్యానాంతుతదర్ధంస్యాత్తత్త్రీన్ప్రాణాంతదర్ధకం॥ శూద్రంవైదండయేద్రాజాశతనిష్కంహరేత్తువా॥ ప్రోతిస్యాదంగుళిచ్ఛేదోగజేస్యాద్ధస్తహారణం॥ ఇతి హేమాద్రివిరచితేగజవధప్రాయశ్చిత్తం॥

(౩౮) ఏనుగునుజంపినవానికిప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు, సహాయములచేతనైనను, సాధనోపాయములచేతనైనను, వాక్కులచేతనైనను, అరణ్యమునందుగాని, మార్గమునందుగాని, వాపియందుగానివిచారించక యేనుగును జంపినయెడల మరణానంతరమందు నరక లోకమును బొందును. పిమ్మటగజచర్మగలవాడై పుట్టును. అట్టిదోషముపరిహారమగుటకు దత్ప్రకృఛ్రమునాచరించవలయునని లింగపురాణమునందు జెప్పబడియె. ఎవ్వడయినను గజమునుజంపుచున్నపుడు పేక్షను జేసినను, తగుసహాయములనుసంపాదించియిచ్చినను, మాటలచేతనంగీకారమునుబొందినను, దోషవంతుడగును. కావుననట్టిపాపాత్ముని రాజగువాడు నూరురూప్యములచేత దండించవలయును. అట్లు రాజదండననుబొందినను నరకమునుబొంది పిమ్మటదుష్టవ్యాధిగలవాడైపుట్టును. కావుననట్టిదోషముపోవుటకొఱకు పశ్చాత్తాపమునుబొందినవాడగుచు తప్తకృఛ్రమును జేసికొనవలయును. అనంతరమందొకయుపవాసమును జేసి యొక్కదినముపవాసమును జేసి పంచగవ్యప్రాశనను జేసినయెడలపరిశుద్ధుడగును. ఏనుగుశిశువునుజంపినయెడల పెద్దయేనుగును జంపినపుడు విధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమును విధింపవలయును. ఏనుగుయొక్క గర్భములోనిశిశువునకు హానినిగలుగజేసినయెడల శిశుహననప్రాయశ్చిత్తమునందలిసగమును ప్రాయశ్చిత్తార్థముగవిధింపవలయును. ఆడయేనుగులనుజంపినయెడల మగయేనుగులనుజంపినపుడు విధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయునని కూర్మపురాణమునందు జెప్పబడియె. యుద్ధములయందేనుగునుజంపినయెడల దోషములేదు. అట్లుగాక వేరొకసమయమునందేనుగునుజంపినయెడల దోషముగలుగును. యుద్ధములయందు గూడ గజయుద్ధమునందు గజములను జంపినపక్షమున దోషములేదు. యుద్ధాదులు లేనపుడే

నుగునుజంపినయెడల సంపదనశించిపోవును. ఇట్లని దేవీపురాణమునందు జెప్పబడియె. సంపదనుగోరువాడు యుద్ధములేనిసమయమునం దేనుగునుజంపగూడదు. అట్లుగాక వేరొండుసమయమునందు క్రోధాదులచేత నేనుగునుజంపిన వానిసంపదశూన్యముగనశించిపోవును. మఱియునట్టిరాజు మరణానంతరమందునరకమునుబొందును. యుద్ధమునందయ్యేనేనిదోషముగలుగనేరదు యుద్ధములయందు దాత్మాభిముఖముగదనునుజంపుటకువచ్చుచున్నయేనుగునుజంపవలయును. అట్లుచంపినరాజునకుదోషముగలుగనేరదు. అయిననుపిమ్మటబ్రాజాపత్యకృఛ్రముమునాచరించవలయును. ఇట్లనిస్కాందపురాణమునందు జెప్పబడియె. యుద్ధములేనిసమయమునందు రాజగువాడుప్రమాదమువలన నేనుగునుజంపెనేని తత్పాపశాంతికొఱకు రాజగువాడుతెండుప్రాజాపత్యముల నాచరించవలయును. యుద్ధమునందుజంపినరాజునకు గోదానముమాత్రముచేతనే పరిశుద్ధుడగును. ఏనుగుశిశువునుజంపినయెడల నిప్పుడుసెప్పబడిన ప్రాయశ్చిత్తమునందు సగమునాచరించవలయును. గర్భమోచనమునందు దీనియందుసగమునుబ్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. ఇట్టికృత్యమునువైశ్యుడుసేసినయెడల రాజునకువిధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. వైశ్యస్త్రీలకువైశ్యులకువిధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. శూద్రుడీదుష్కృత్యమునుజేసినయెడల నూరువరహాలనుశిక్షగావిధించవలయును. ఇట్లనిమార్కండేయపురాణమునందుజెప్పబడె. ఇట్లని హేమాద్రిచేరచింపబడిన ధర్మశాస్త్రమునందలి గజవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— * అశ్వవధప్రాయశ్చిత్తమ్. * ——

(32) అథాశ్వవధప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శ్లో॥ అశ్వహంతాభవేద్విప్రోలోకవేదబహిష్కృతః। పూర్వోక్తైర్వానిమిత్తైశ్చసహైర్వ్యధసాధనైః। సవిప్రోనరకంయాతికాలసూత్రంసుదారుణం॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ ప్రమయిత్వాహయంవిప్రోనిమిత్తైర్బహుభిర్యదా। హన్యాత్స్వయంవారాజేంద్రగృహేవాకాననేవనే॥ సపశ్చాన్నరకంయాతియావదాభూతసంప్లవం। తస్యైవనిష్కృతిరియంవ్యాసేనపరిభాషితా॥ స్వయంహన్యాత్త్రిడబ్దంస్యాన్నిమిత్తైరర్ధమీరితం। గృహదాహాదిభిర్వాపిజ్ఞాత్వాతద్ద్విగుణంచరేత్। తదర్ధంబడబాయాంచతదర్ధంగర్భమోచనే॥ శిశౌపౌగండకేచైవబడబార్ధంసమాచరేత్॥ మహానారదీయే॥ శ్లో॥ జనసంఘేమహారణ్యేస్వగృహేయదిపూర్వజః॥ దివాజనసభీత్యాతుహయంహన్యానిమిత్తజైః। మ

హంతం నరకం గత్వా యమపాశనిబంధనం । పునర్భవముపాగమ్య జాయతే గ్రంధిమాన్సదా॥ బాలం పౌగండకం వాపి యువానం యది కామతః । అశ్వం హన్యాద్ద్విజో యస్తు ప్రాయశ్చిత్తీ భవేత్తదా। కుర్యాత్తదాత్మశుద్ధ్యర్థం షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ । బడబాయామర్ధముక్తం తదర్ధం బాలమారణే ॥ గృహదాహాదిభిశ్చార్ధం తదర్ధం గర్భమోచనే ॥ రాజా యో యది హంతా స్యాద్యుద్ధాదన్యత్ర వాజినం । స రాజా నరకం గత్వా వ్యాధియుక్తో భవేద్భువి ॥ తస్యైవ నిష్కృతిర్దృష్టా విప్రస్యార్ధం మనీషిభిః। విశస్తు రాజవత్ప్రోక్తః శూద్రం దండ్యాద్యథావిధి। దత్తత్రీణి గ్రాణాం తత్తదర్ధం క్రమేణ యోజనీయం । శూద్రం పూర్వోక్తదండమేత్ । శతరూపకం వా హస్తచ్ఛేదో వా సర్వత్రాధ్యాహార్యః ॥ రాజ్ఞస్త్వపరిపాతనే వధః కర్తవ్యః॥ నాన్యథా॥ మార్కండేయే॥ శ్లో॥ అశ్వయుద్ధే యదా ప్రాప్తే స్వయమారుహ్య వాజినం । తదా హన్యాద్ధయం తత్ర నాస్య దోషసంభవః॥ ప్రాయశ్చిత్తమిదం కృత్వా శుద్ధిమాప్నోత్యనుత్తమాం॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే అశ్వవధ ప్రాయశ్చిత్తమ్॥

(౩౭) అశ్వవధప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడగువాడు పూర్వోక్తములగు నిమిత్తములచేత గుఱ్ఱమును జంపినయెడల ఘోరమగు నరకమును బొందునని స్కాందపురాణమునందు జెప్పబడెను. బ్రాహ్మణుడు బహువిధప్రయత్నములచేత గుఱ్ఱమును బోషించి రాజగృహమునందైనను, వనమునందైనను జంపినయెడల ప్రళయకాలముదనుక నరకలోకమునందు బడును. స్వయముగానే జంపినయెడల షడబ్దప్రాయశ్చిత్తము నాచరించవలయును. గుఱ్ఱమును జంపుటకు దగిన సాధనములనిచ్చినయెడల పైన జెప్పబడిన ప్రాయశ్చిత్తమునందు సగమునాచరింపవలయును. గృహదాహాదినిమిత్తములచేత దానికద్విగుణము ప్రాయశ్చిత్తము నాచరించవలయును. ఆడుగుఱ్ఱమును జంపినయెడల మగగుఱ్ఱమును జంపుటకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. గుఱ్ఱపుశిశువును జంపినను, పౌగండకవయస్సునందున్న శిశువును జంపినను, ఆడుగుఱ్ఱమును జంపినందుకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. ఇట్లు మార్కండేయపురాణమునందు జెప్పబడెను. బ్రాహ్మణుడగువాడు, స్వగృహమునందైనను, జనసంఘమునందైనను, మహారణ్యమునందైనను, గుఱ్ఱమును జంపినయెడల యమపాశబద్ధుడై ఘోరనరకమునందు బడును. పిమ్మట గ్రంథిమద్రోగముగలవాడై పుట్టును. బాలహయమునైనను, పౌగండకవయస్సునందున్న గుఱ్ఱమునైనను, యౌవనవంతమగుగుఱ్ఱ

నైనను జంపినబ్రాహ్మణునకు షడబ్దకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును విధించవలయును. ఆడుగుఱ్ఱమును జంపినవానికి ప్రాయశ్చిత్తమునం దర్ధమును విధించవలయును. బాలాశ్వమును జంపినవాని కాడుగుఱ్ఱమును జంపినవానికి విధించినదానియం దర్ధమును విధించవలయును. గృహదాహాదులచేత జంపినయెడల పైదానియందు సగమును విధించవలయును. గర్భమోచనయందు దీనిలో సగమును విధించవలయును. రాజగువాడు యుద్ధముకంటె వ్యతిరిక్తమయిన విషయములయందు గుఱ్ఱమును జంపినయెడల మరణానంతరమందు ఘోరనరకమును బొందిపిమ్మట వ్యాధియుక్తుడై పుట్టును. కావుననట్టి పాపము పోవుటకొఱకు బ్రాహ్మణులకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. వైశ్యునకును రాజునకువలెనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. అన్యజాతివారి భార్యలకు పురుషులకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. శూద్రునకు పూర్వమునందువలెనే శిక్షను విధించవలయును. అనగా నూరురూపాయీలను దండుగ విధించుటయైనను, హస్తచ్ఛేదమునైనను జేయవలయును. ఇట్లని మహానారదీయమునందు జెప్పబడియె. అశ్వయుద్ధము ప్రాప్తమయినపుడు రాజగువాడు గుఱ్ఱము నధిష్ఠించి వేఱొండు గుఱ్ఱమును జంపినయెడల దోషములేనివాడగును. ఇట్టిసమయమునకు వ్యతిరిక్తమగు సమయమునందు గుఱ్ఱమును జంపిన రాజు దోషవంతుడగును. కావుననట్టివాడు పూర్వోక్తమయిన ప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుడగును. ఇట్లని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. ఇట్లు హేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రమునందలి ప్రాయశ్చిత్తాధ్యాయమునందలి యశ్వవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

## ✱ ఉష్ట్రవధప్రాయశ్చిత్తమ్. ✱

(౩౮) అథోష్ట్రవధప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శ్లో॥ పట్టణే వావనే రాజన్ ప్రమాదాద్వా క్రమేళకం। ఉపాయైర్హననే యోగ్యైర్మేళయిత్వాసురాత్మభిః॥ హత్వా పశ్చాత్తదాజ్ఞాత్వా రౌరవం నరకం వ్రజేత్ ॥ తదంతే భువమాసాద్య కుబ్జో జాయతే ద్విజః । కుత్సితశరీర ఇత్యర్థః ॥ శివధర్మోత్తరే॥ శ్లో॥ క్రమేళకం ద్విజో హత్వా మేళయిత్వాసురాత్మభిః॥ యత్రైవ స్థగనోపాయైర్వ్యాప్రియాతి యమాలయం। తదంతే భువమాసాద్య వక్రాంగో జాయతే తతః॥ తద్దోషపరిహారార్థం ప్రాజాపత్యత్రయం చరేత్ ॥ ఏతత్సహాయమాత్రేణాప్యుక్తం, స్వయంహననే విశేషమాహ ॥ బ్రహ్మాండపురాణే॥ శ్లో॥ ఉష్ట్రం జ్ఞాత్వా ద్విజో హన్యాద్దండాద్యైర్గళపీడయా॥ యమలోకము ప్రాగమ్య భు

క్త్వా వ్రతత్రైవ యాతనాః॥ తతస్తు భువమాసాద్య జాయతే వక్రకుక్షిమాన్ ॥ తత్పాపస్య విశుద్ధ్యర్థమబ్దం కుర్యాత్ప్రయత్నతః। పౌగండే శిశౌ చ శావర్థం తదర్థం గర్భమోచనే॥ క్షత్రియో యుధి సంహన్యాత్ తత్ర మేళకమధర్మతః ॥ అధర్మోనామ రాజ్ఞాం యుద్ధాదన్యత్ర హననం॥ నారదీయే॥ శైవా ॥ యుద్ధాదన్యత్రయో రాజా దండాద్యైశ్చ హ్యబుద్ధితః। క్రమేళకం హన్యాదత్ర హ్యారణ్యే నిర్జనేఽపి వా॥ గ్రామేవాకారణం త్యక్త్వా శస్త్రైర్ద్రవ్యైర్భృత్యైశ్చోదితైః॥ సగత్వా నరకం పాపీ పశుహంతా భవేద్భువి। కారణం యుద్ధమేవ పూర్వోక్తం । తద్దోషపరిహారార్థం కార్యకృచ్ఛ్రైర్విశోధనం। విశస్తుతత్తథా ప్రోక్తం ప్రాయశ్చిత్తం విచక్షణైః శూద్రో హన్యాత్ప్రమత్తం రాజాదండమేనం తు మారయేత్॥ తత్ర త్రీణ్యబ్దాంతరర్థం స్యాచ్ఛిశావర్ధం ప్రచోదితం ॥ తదర్ధం గర్భసంత్యాగే శిశుపౌగండకే క్రమాత్। శిశుపౌగండకాదిస్వరూపం పూర్వమేవ పశుహనన ప్రాయశ్చిత్తప్రకరణేభిహితం॥ ఇతి హేమాద్రివిరచితే ఉష్ట్రవధప్రాయశ్చిత్తం॥

(౩౮) ఒంటెను జంపినవానికి ప్రాయశ్చిత్తమును విధించుచున్నాడు।

పట్టణమునందైనను, వనమునందైనను, బుద్ధిమాంద్యముచేతనైనను, బుద్ధిపూర్వకముగనైనను, హననోపాయములుగలదురాత్ములను బహుమందినిగుంపుగగూర్చి యొంటెనుజంపినరాజు ఘోరనరకమునుబొందును. పిమ్మటవికారమయినయాకారముగలవాడై జన్మించుననియును స్కాందపురాణమునందు జెప్పబడెను. దురాత్ములననేకులనుబోగుచేసి హననోపాయములచేత బ్రాహ్మణుడగువాడు, ఒంటెనుజంపినయెడల ఘోరనరకమునుబొందును. అనంతరమందు భూలోకమునందు వంకరశరీరముగలవాడై జనించును. కావుననట్టిదోషము శాంతినిబొందుటకొఱకు మూడుప్రాజాపత్యముల నాచరించవలయును. ఇదిసహాయముగామాత్రముండినందుకు విధింపబడినప్రాయశ్చిత్తము. ఇట్లు శివధర్మోత్తరమునందు జెప్పబడె. బ్రాహ్మణుడగువాఁడు బుద్ధిపూర్వకముగదండాద్యుపాయములచేతనైనను, గళపీడచేతనైనను, ఒంటెనుజంపినయెడల ఘోరనరకములనుబొందును. పిమ్మటభూలోకమునుబొంది వంకరకముపుగలవాడైపుట్టును. అట్టిపాపముశాంతినిబొందుట కఱ్ఱకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేయవలయును. పౌగండకవయస్సుగలయుష్ట్రమునైనను, శిశువునైనను, జంపినయెడల పెద్దయొంటెనుజంపినపుడు విధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమును ప్రాయశ్చిత్తార్థముగవిధింపవలయును. గర్భమోచనమునందు దీనిలోసగమును విధించవలయును. క్షత్రియుఁడగువాఁడు యుద్ధములయందుదప్ప దక్కినసమయములయందు దొంటెనుజంపినయెడల ప్రాయశ్చిత్త

యడగునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడినది. యుద్ధముకంటెనన్యములగుస్థలములయందు రాజగువాడు, బహువిధములగుదండాదులచేత, అరణ్యమునందైనను, నిర్జనప్రదేశమునందైనను, జలమునందైనను, నిపాతరణముగశస్త్రాదులచేతనైనను, భృత్యాదులచేతనయినను, ఒంటెనుజంపినయెడల మరణానంతరమందునరకలోకమును బొందును. పిమ్మట పశుఘాతుడైనట్టును. కావుననట్టిదోషముశాంతినిబొందుటకు కామకృతప్రాయశ్చిత్తమును విధించవలయును. వైశ్యునకునిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రుడీమహత్కృత్యమును జేసినయెడల శిక్షించవలయునుగాని మరణమును బొందింపగూడదు. వారివారిస్త్రీలకును, బాలురకును, సగముప్రాయశ్చిత్తమునువిధించవలయును. ఒంటెయొక్కగర్భమును నాశమునుబొందించినను, ఒంటెయొక్కశిశువునుజంపినను, పౌగండకవయస్సునందున్న ఒంటెనుజంపినను, పెద్దయొంటెకు విధింపబడినప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఇట్లనినారదీయమునందు జెప్పబడినది. ఇట్లని హేమాద్రివిరచితమయిన యుష్ట్రవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

## —— ఖరహననప్రాయశ్చిత్తమ్. ——

(౩౯) అథఖరహననప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ పశుబుద్ధ్యాఖరంహత్వా విప్రోనిశిమహాపథే ॥ పశ్చాజ్జ్ఞాత్వాఖరఇతినిమిత్తైర్వాసురాత్మభిః॥ సఏవనరకస్థాయీయావదాభూతసంప్లవం। పశ్చాద్భవతిచండాలోభువమాసాద్యభూమిప। రాజవిజయే॥ శ్లో॥ అజ్ఞాత్వాపశుబుద్ధ్యాయోవిప్రోహన్యాత్ఖరంయథా। నిమిత్తైస్సంగదోషాద్వాసహాయైర్వాథనావోచితైః। అంధకారేమహాఘోరేహత్వాపశ్చాన్మహాఖరః॥ ఇతిమత్వాసపాపీస్యాల్లబ్ధ్వాదోషంమహత్తరః। చండాలత్వమవాప్నోతిత్రిషుజన్మసుభూమిప॥ నహింస్యాన్మృగచండాలంకర్మణామనసాగిరా॥ కూర్మపురాణే॥ శ్లో॥ విప్రస్తుమృగచండాలంనహింస్యాత్కామకారతః । నిమిత్తైరుతవాచావైర్యస్సహాయైర్హననోద్యతైః॥ సోనుభూయమహత్పాపంమాతంగత్వమవాప్నుయాత్॥ తస్యైవనిష్కృతిర్దృష్టామునిభిర్బ్రహ్మవాదిభిః॥ స్వయంహత్వాతుచాంద్రంస్యాత్పరాకంసహసంగతః॥ నిమిత్తైర్వ్యావకంప్రోక్తమంగీకారేసువర్చసంసువర్చసంపంచగవ్యం । రాజాహన్యాత్ఖరంమోహాద్భృత్యైర్వాతైఃప్రమాదజైః॥ తస్యదేహవిశుద్ధ్యర్థంపరాకఃపరికీర్తితః॥ విశస్త్రఘాతయోః క్తవ్యంప్రాయశ్చిత్తం నృపోత్తమ। శిశౌపౌగండకేచైవరాజార్ధంపరికల్పయేత్॥ రాజ్ఞాతశ్చైవదుర్వృత్తరాజవత్సవణిక్పతిః। తత్త్రిస్త్రీణాంతుతదర్ధార్ధంయోజనీయంవి

చతుర్ణైః। శూద్రోదండ్యాశ్చతేరూప్యంనవభోమునిభిస్మృతః। రాసభభేద హననేచప్రాయశ్చిత్తమేవంయోజనీయం। బాల్యపౌగండకౌమారాదిపూర్వముక్తం। తత్తత్తారతమ్యేనహననేప్రాయశ్చిత్తంయోజనీయం॥ రాసభభేదాబహవస్సంతి। తేషాంమధ్యేబహుసంచారతయావర్తమానఏవఖరః॥ ఇతి హేమాద్రివిరచితేఖరహననప్రాయశ్చిత్తం॥

(౩౯) గాడిదెనుజంపినందుకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు మార్గమునునడచుచు నర్ధరాత్రియందు గాడిదెనుజంపినపిమ్మట గాడిదెయని తెలిసికొనెనేని పశ్చాత్తాపమును బొందినను మరణానంతరమందు ఘోరనరకమునుబొందును. పిమ్మటచండాలుడైపుట్టునని మార్కండేయపురాణమునందు జెప్పఁబడియె. బ్రాహ్మణుడగువాడజ్ఞానముచేత గాడిదెనుజంపువారికి సాధనసహాయములను జేసిన యెడల ఘోరనరకమునందు బడును. అనంతరమందుమూడుజన్మలదనుక చండాలుడైపుట్టును. కావున స్వర్గచండాలమగు గాడిదెకు మనోవాక్కాయముల చేతగూడ నపకారమునే యగూడదని రాజవిజయమనుగ్రంథమునందు జెప్పబడియె. బుద్ధిపూర్వకముగ బ్రాహ్మణుడగువాడు మృగచండాలమగు గాడిదెనుజంపుటకు దగినసహాయములను జేసిన యెడల ఘోరనరకములననుభవించి పిమ్మటజండాలుడైపుట్టును. కావుననిట్టిపాపమునకు దగినప్రాయశ్చిత్తము విధింపబడియె. ఎట్లనిన స్వయముగ గాడిదెనుజంపినవానికి జాంద్రాయణమును బ్రాయశ్చిత్తముగా విధింపవలయును. గాడిదెనుజంపుటకు దగినసాధనముల నొసగినవానికి యావకముచువిధించవలయును. అట్టిదుష్కృత్యమున కంగీకారమునుబొందినయెడల సువర్ణసమప్రాయశ్చిత్తమును విధించవలయును. సువర్ణసమనగా పంచగవ్యమని యెఱుంగనగును. రాజగువాడజ్ఞానమువలన భృత్యుల చేతనైనను, అస్త్రములచేతనైనను, ప్రమాదముచేతనైనను, జంపినయెడల దేహశుద్ధికొఱకును, పాపోపశమనముకొఱకును పరాకకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. వైశ్యునకును ఈప్రాయశ్చిత్తమునే విధించవలయును. గాడిదెశిశువును జంపినను. పౌగండకవయస్సునందున్న గాడిదెను,జంపినయెడల రాజునకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందుసగమువిధింపవలయును. వైశ్యులకును, రాజశిశువులకునుసిటుల నే విధించవలయును. వారివారి స్త్రీలకుబురుషులకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. శూద్రుడిట్టి దుష్కృత్యమును జేసినయెడల నూరురూపాయీలనుశిక్షార్థముగ దండుగనైకొనవలయును. [illegible] జంపిన యెడల పూర్వ

క్తప్రకారముగ శిశ్వాదిభేదములనెఱిఁగి ప్రాయశ్చిత్తమును విధించవలయును. గాడిదెజాతియందనేకభేదములు గలవు. వానిలో మిగులసంచారమునందుఁ బ్రవర్తించుచున్నదానికే గాడిదెయని పేరు. ఇట్లని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితఖరహననప్రాయశ్చిత్తము సమాప్తము.

## ✽ మహిషీవధప్రాయశ్చిత్తమ్ ✽

(౪౦) అథ ఖానీ. మహిషీవధప్రాయశ్చిత్తమాహ ॥ లైంగే ॥ శ్లో॥ మహిషీ. యోద్విజో రాజావణిక్శూద్రజయేవవా । హన్యాద్దండాదిభిః క్రూరై ర్నిమిత్తైస్తవాస్వయం। సమహానరకంయాతి కాలసూత్రంసుదారుణం॥ తదం తేభువమాసాద్యలాలాలపనవాన్భవేత్ ॥✽॥ కౌర్మే॥ శ్లో॥ మహిషీమాస్య జోయస్తు చాహంజోరుజపాదజాః॥ గృహదాహాదిభిర్రాజన్నిమిత్తైర్బహుభి ర్యదా॥ఘ్నంతిభృత్యైస్స్వయంవాపి తత్రైవనిరయంగతాః॥ మహాంతంనర కంఘక్త్వాస్యుర్లాలావదనాస్తుతె॥✽॥ శివధర్మోత్తరే॥ శ్లో ॥ రాజపుత్రోవణి గ్వాపిముఖజఃపాదసంభవః । వనమధ్యజలెగేహెమహిషీంయదితత్రవై ॥ వి హింసంతితదాకూరాః ప్రవిశంతియమాలయం। పునర్భువముపాగమ్యాహ్యా ర్ద్రాస్స్యాస్సంభవంత్యతః । తద్దోషశమనాయాలం మహాసాంతపనంస్మృతః॥ పంచగవ్యవిధానేన పంచ వ్యం భవేత్తతః ॥ శుద్ధిమంతస్తదాతేన్యా రన్యా థాశుద్ధచేతసః ॥ సాచెద్గర్భాగ్నిబాలవత్సాశుద్ధి. సాయాంనరాధిప॥విప్రఃకు ర్యాత్తదాజ్ఞాత్వామహాసాంతపనద్వయం । రాజాసాంతపనంకుర్యాదూరు జఃక్షత్రియార్ధతః ॥ పాదజఃపాదమాత్రంతు ప్రాయశ్చిత్తం యథాక్రమం॥ తత్త్రైసైణాంతత్తదర్ధంప్రాయశ్చిత్తం। బాలపౌగండకకౌమారాదీనిపూర్వ వద్విచారణీయాని । స్వయంహననేపూర్ణం ప్రాయశ్చిత్తం విప్రాదీనాం ॥ గృహదాహాదినిమిత్తైస్స్యతాయదితదర్ధం ప్రాయశ్చిత్తం ॥ అస్మదీయామ హిషీత్యుపేక్షయాప్రాయశ్చిత్తమకుర్వాణః పుర్వోక్తం నరకంగత్వా నీచత మోభవతి దోషబాహుళ్యాత్ప్రాయశ్చిత్తమా చరణీయం వర్ణత్రయేణ పంచగవ్యమాత్రం॥ఇతి హేమాద్రివిరచితేధర్మశాస్త్రేమహిషీవధప్రాయశ్చిత్తం॥

(౪౦) మహిషీవధ ప్రాయశ్చిత్తము ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యశూ ద్రులలో నెవ్వఁడైనను, క్రూరములగు దండాది నిమిత్తముల చేత మహిషిని జంపిన యెడల కాలసూత్రమను పేరుగల గొప్పదగు నరకమును బొందును పిమ్మట జొల్లుతోఁగూడి నోరుగలవాఁడై పుట్టును, ఇట్లని లింగపురాణమునందు జెప్పఁబడియె. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులలో నెవ్వఁడైనను, గృహ దాహాదినిమిత్తముల చేతనయినను, భృత్యాదుల చేతనయినను, స్వయముగనే

కములగు కారణములచేతనయినను, మహిషినిజంపినయెడల నరకమునుబొందును. అనంతరమందు జొల్లుతోఁగూడిన నోరుగలవాఁడై పుట్టునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడినది. బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రులలో నెవ్వఁడయినను, వనమధ్యమందైనను, ఉదకమునందయినను, గృహమునందైనను మహిషినిజంపెనేని యమాలయమును బొందును. పిమ్మట జొల్లునోటివాఁడై పుట్టును. కావున నాదోషముశాంతిని బొందుటకు గొప్పదగు సాంతపన ప్రాయశ్చిత్తమును విధించవలయును. అనంతరమందు పంచగవ్య ప్రాశనము జేయవలయును, ఇట్లు చేసికొనినపిమ్మట పరిశుద్ధుఁడగును. కాదేని పాపముతోఁ గూడియగును, అద్వ్యాసముతో గూడతోఁ గూడియుండు కాలమునందుఁ జంపఁబడెనేని యట్టి బ్రాహ్మణుఁడు మహాసాంతపనవ్రతమును నాచరింపవలయును, ఇట్టిదుష్కృత్యమును జేసిన క్షత్రియునకు సాంతపన ప్రాయశ్చిత్తమును విధించవలయును. వైశ్యునకు రాజునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధింపవలయును. శూద్రునకు వైశ్యునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును వారివారిస్త్రీలకు వారివారికి విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. బాలవృద్ధ కాశాసురాదులను పూర్వోక్తప్రకారముగ విచారించు కొనవలయును. బ్రాహ్మణాదులు స్వయముగాఁ జంపినపుడు పూర్ణ ప్రాయశ్చిత్తమును విధించవలయును- గృహదాహాదినిమిత్తములచేత నర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును- నాశమును జేగదాయని ప్రాయశ్చిత్తమును జేసికొనని ప్రాయశ్చిత్తమును జేసికొననివారు పూర్వోక్తమయిన నరకమునుబొంది కిరాలినీచుడగును - దోషబాహుళ్యముగలదు గనుక ప్రాయశ్చిత్తమును నాచరించవలయును- మఱియును మూఁడువర్ణముల వారును పంచగవ్యప్రాశనమును జేయవలయును- ఇట్లని శివధర్మోత్తరమునందుఁ జెప్పఁబడినది. ఇట్లు హేమాద్రి విరచిత ధర్మశాస్త్రమునందు మహిషీవధ ప్రాయశ్చిత్తము సమాప్తము ॥

——✻ మహిషవధప్రాయశ్చిత్తమ్ ✻——

(౮౧) అథమహిషవధప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ మహిషంకామకాశేనరజ్జుదండాశ్మపాతనైః॥ యోఽపిప్రవనమధ్యేవాగృహే దాహజలాప్లవే ॥ నిహన్యాద్దుష్టసంగాద్వా హ్యంధకారాగమేనిశి । సోఽనిధనంగత్వా నరకం ప్రాప్యదారుణం ॥ పునశ్చ్యుతః సుపాగవ్యాజాయతే ఖిల్లజన్మవాన్ ॥ ✻॥ కౌర్మే ॥ శ్లో॥ మహిషంప్రాయద్యోయస్తు గోషేణవస

తావృతః ॥ హన్యాత్స్వమిత్రైర్బహుభిర్భృత్యైర్వగ్రైస్తథాపివా । అరణ్యేగృహదాహేవా కృషికాలేజలోద్భవే ॥ మహాంతంనరకంగత్వాభుక్త్వాతత్రైవయాతనాః ॥ పునర్గత్వాసజగతీంభిల్లజన్మసమశ్నుతే। ౫॥ లైంగే। శ్లో॥ మహిషంకృషికాలేతు తాడనైరశ్మపాతనైః ॥ గృహేవా గృహదాహేవా యోహింస్యాత్పూర్వజోఽరుషా ॥ మృత్వానుభూయనరకం మ్లేచ్ఛోభవతిభూతలే ॥ తస్యైవనిష్కృతిరియందృష్టామానపరాయణైః॥అజ్ఞానాత్తుప్రకృచ్ఛ్రంస్యాత్ప్రాయశ్చిత్తంనిమిత్తతః ॥ పరప్రేరణయావాపి జ్ఞాత్వావాద్విగుణంచరేత్ । బాలేపాదంచపౌగండే హ్యర్ధంయూనిప్రపూర్ణతా॥ రాజావణిక్స్వదజోవాకారణైర్వాసిపాతనైః ॥ భారవాహనిమిత్తాద్వానిమ్నోన్నతమహాపథి ॥ మహిషందండఘాతైర్వాహన్యాద్యదిహపాతకీ ॥ నరకంచానుభూయాథమ్లేచ్ఛజాతిర్భవేత్తదా ॥ అకామతస్తుప్రకృచ్ఛ్రం ప్రాజాపత్యంనిమిత్తతః ॥ జ్ఞాత్వాతద్ద్విగుణంప్రోక్తం బాలేపాదంవిశోధనం ॥ పౌగండేర్ధంతదాజ్ఞేయంయూనిపూర్ణమతఃపరం ॥ బాహుజోరుజయోశ్చైవం ప్రాయశ్చిత్తంవిశోధనం ॥ పాదజేపాదకృచ్ఛ్రంస్యాత్తత్తత్త్రీణాంతథాపృథక్ ॥ అర్ధార్ధార్ధేనమానేన యోజనీయంయథాక్రమం ॥ విప్రస్తుమహిషంహత్వాభిల్లోవైజాయతేతదా ।రాజాచపౌల్కసోభూయాద్వణిగ్వైణవజాతిమాన్ ॥ శూద్రస్సంకరతామేతి మహిషంయోహనేద్రుషా ॥ తత్తన్నారీతథాభూయాత్తద్వైవాహాత్తత్పరిగ్రహాత్ ॥ అతోనహింస్యాన్మహిషంవిప్రోవాన్యోపివానృప ॥ – ॥ ఇతి హేమాద్రి విరచితే మహిషవధ ప్రాయశ్చిత్తం॥

(౪౧) మహిషవధప్రాయశ్చిత్తము ॥ తాడు, కఱ్ఱ, తాయి, మొదలగువానిని బ్రయోగించి బ్రాహ్మణుఁడగువాఁడు దున్నపోతును, వనమధ్యమునందయినను, గృహదహనకాలమునందయినను, జలోపద్రవమునందైనను, దుష్టజనసాంగత్యము చేతనయినను, అంధకారమునందయినను, జంపెనేని మరణానంతరమందు ఘోరమగు నరకమును బొందును, పిమ్మట నెఱుకవాఁడై పుట్టును, ఇట్లని మార్కండేయుఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు పూర్వోక్తములగు ననేకములగు నిమిత్తములచేత కృషికాలమునందయినను, జలోపద్రవమునందయినను, అరణ్యమునందయినను, గృహదహనకాలమునందయినను, కోపావృతుఁడై మహిషమును స్వయముగా దున్నపోతునుజంపినను, భృత్యాదులచేతఁ జంపించినను, ఘోరనరకములను బొంది పిమ్మట భూలోకమునం దెఱుకవాఁడై పుట్టును. ఇట్లనికూర్మపురాణమునందుఁ జెప్పఁబడెను. తాడనములచేతను, రాళ్ళనురువ్వుటచేతను, కృషికాలమునందయి

నను, గృహమునందయినను, గృహదహన కాలమునందయినను, బ్రాహ్మణుఁ
డగువాఁడు దున్నపోతును జంపిన యెడల మరణానంతరమందు ఘోరనరక
మునుబొంది పిమ్మట మ్లేచ్ఛుఁడై పుట్టును, కావుననిట్టి పాపమును బోఁగొట్టు
కొనుటకొఱకు మునులచేత ప్రాయశ్చిత్తము చెప్పఁబడినది. అదియెట్లనిన,
అజ్ఞానమువలన నిట్టిపాపకృత్యము నాచరించిన యెడలతప్తకృచ్ఛ్రము నాచరిం
చవలయును, పరప్రేరణచేత జ్ఞానపూర్వకముగఁ జంపినయెడల ప్రాయ
శ్చిత్తమును ద్విగుణముగనాచరించవలయును, చిన్నదున్నపోతును జంపినయె
డల పైనఁజెప్పఁబడిన ప్రాయశ్చిత్తమునందు నాల్గవభాగము నాచరింపవల
యును, పౌగండక వయస్సునందున్న దున్నపోతును జంపినయెడల అర్థతప్త
కృచ్ఛ్రప్రాయశ్చిత్తమునాచరించవలయును, క్షత్రియ వయిశ్య శూద్రులలోనె
వ్వఁడైనను, నిష్కారణముగ ఖడ్గముమొదలగు నాయుధములను బ్రయోగిం
చుటచేతనయినను, భారవాహ నిమిత్తమువలన నయినను, నిమ్నోన్నతమ
గు గొప్పమార్గమునందయినను, దండపాతాదుల చేతనయినను, మహిష
మును జంపినయెడల పాపాత్ముఁడగును. అదికారణముగ నరకలోకమున
దుఃఖములననుభవించి, పిమ్మట మ్లేచ్ఛజాతి యందుఁబుట్టును, అనపేక్షితుఁ
డై యిట్టికృత్యమును జేసినయెడల తప్తకృచ్ఛ్రప్రాజాపత్యము నాచరించవల
యును, తెలిసి యిట్టి దుష్కృత్యమును జేసినయెడల తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చి
త్తమును ద్విగుణితముగ నాచరించవలయును, బాలవయస్సునందున్నదున్న
పోతునుజంపినయెడల పైనఁజెప్పఁబడిన ప్రాయశ్చిత్తమునందు నాల్గవభాగ
మువరింపవలయును, పౌగండకవయస్సునందున్న దున్నపోతును జంపినయె
డల తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమునందర్ధమును నాచరించవలయును, పడుచుత
నముగల వయస్సుగల దున్నపోతును జంపినయెడలపూర్ణముగప్రాయశ్చిత్త
మునాచరింపవలయును, ఈ ప్రాయశ్చిత్తమునందు శూద్రునకు నాల్గవభాగ
మును విధింపవలయును. అన్త్యాజాతివారి స్త్రీలకు పురుషులకు విధింపఁబడి
నప్రాయశ్చిత్తమునందర్ధమును విధింపవలయును - బ్రాహ్మణుఁడు మహిష
మును జంపినయెడల ఘోరనరకములను బొంది పిమ్మటభిల్లుఁడైపుట్టును, రా
జు చండాలుఁడైపుట్టును, కోమటియిట్టి దుష్కృత్యమును జేసినయెడల సంకర
త్వమునుబొందును-వారివారి స్త్రీలిట్టిదుష్కృత్యములను జేసినయెడల పురుష
లుద్భవించెడు నీచజాతియందే యాఁడువారలైపుట్టుదురు. కావునమహిషము
ను జంపఁగూడదని యెఱుంగనగును. ఇట్లని లింగపురాణమునందుఁజెప్పఁబడె

మె. ఇట్లని హేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రమునందు మహిషవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

——* అజబస్తవధప్రాయశ్చిత్తమ్. *——

(౪౨) అథాజబస్తవధప్రాయశ్చిత్తమాహ॥ మహారాజవిజయే। శ్లో॥ అజంబస్తం ద్విజోహన్యాత్ కారణేనవినానృప। నరకంచానుభూయాశు తతస్సూనుర్భవేత్కలౌ। లైంగ॥ శ్లో॥ బ్రాహ్మణోఽనిర్నిమిత్తేన బస్తాజౌహనేద్యది। నరకంకాలచక్రంతు హ్యనుభూయమహత్తరం। పునస్స్వామపగమ్యాశు సూనుర్భవతిపూర్వజః। యజ్ఞార్థంహంతి చేద్విప్రో హ్యనంతంఫలమశ్నుతే॥*॥ గారీకాండే॥ శ్లో॥ యజ్ఞార్థంహంతియోవిప్రో హ్యజంమేషంసుపుణ్యధీః। సయాతి బ్రహ్మణస్థానం పునరావృత్తిదుర్లభం॥ కారణేనవినారాజన్నజంబస్తంనహింసయేత్॥ యోవిప్రోధర్మముల్లంఘ్య పాపమేతత్సమాచరేత్। సయాతినరకంఘోరం సూనుజన్మాభవేత్ హ॥ *॥ కౌర్మే॥ శ్లో॥ యాగార్థంహంతియోవిప్రః పశుంలోకపరాయణః॥ సయాతిబ్రహ్మసదనం బ్రహ్మణాసహముచ్యతే। బస్తంవాపిహనేద్యస్తు సయాతీంద్రపదంధ్రువం। యాగార్థంహింసనంప్రోక్తం తయోర్బ్రహ్మవిసృష్టయోః। నిష్కారణేనతంహన్యాద్యమలోకంసుదారుణం॥ గత్వాభువముపాగమ్య సూనుర్భవతిచాశుయః॥ తద్దోషపరిహారార్థం ప్రాజాపత్యద్వయంచరేత్॥ విప్రస్సంగార్థితేంగత్వా నిమిత్తైర్వ్యాదిహింసయేత్॥ ప్రాజాపత్యద్వయంకుర్యాత్తథాబస్తవధేనృప॥ బాలేపాదంతుపౌగండే హ్యర్థంయూనియథాక్రమం॥ విప్రస్త్రీణాంతదర్ధంస్యాద్బస్తమేషవధేనృప। ప్రాజాపత్యభువోభర్తా వణిక్కుర్యాత్తథైవచ॥ శూద్రేశీఘ్రాప్రకర్తవ్యా క్షత్రస్త్రీణాంతదర్ధకం। బాలపౌగండయూనాంయథాక్రమంయోజనీయం॥*॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే అజబస్తవధప్రాయశ్చిత్తం॥

(౪౨) ఆడుమేకను, మగమేకను జంపిన పాపము నశించుటకొఱకు ప్రాయశ్చిత్తవిధానము॥ నిష్కారణముగ బ్రాహ్మణుఁడగువాఁడు, ఆడుమేకనైనను, మగమేకనైనను, జంపినయెడల నరకలోకమునుబొంది పిమ్మట సూనరియైపుట్టును. (సూనరియనఁగా మృగాదులనువధించి వంటచేయువాఁడనుట) ఇట్లని మహారాజవిజయమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు నిర్నిమిత్తముగ నాడుమేకనైనను, మేకపోతునైనను చంపినయెడల కాలచక్రమను పేరుగల నరకమును బొందును. పిమ్మట భూలోకమునందు సూనరియైపుట్టును. బ్రాహ్మణుఁడగువాఁడు యజ్ఞము కొఱ

కుఁ జంపినయెడల, అపరిమితమగు ఫలమునుబొందును. ఇట్లని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు యజ్ఞముకొఱకు ఆఁడుమేకనైనను, మగమేకనైనను జంపినయెడల పునరావృత్తిరహితమగు బ్రహ్మలోకమును బొందును. కారణరహితముగఁ బైనఁజెప్పఁబడిన జంతువులను జంపఁగూడదు. ఇట్టిధర్మమునతిక్రమించి హింసనుజేసిన బ్రాహ్మణుఁడగువాఁడు ఘోరనరకములనుబొంది పిమ్మట సూనరియైపుట్టునని గౌరీకాండమందుఁ జెప్పఁబడియె. కూర్మపురాణమునందును నిటులనే చెప్పఁబడియె. మఱియు నీవిషయమునందొకవిశేషము చెప్పఁబడియె. ఏమనఁగ నిష్కారణముగ నాఁడుమేకనైనను, మగమేకనైనను జంపినయెడల దోషము గలుగును. కావున తద్దోషపరిహారార్థముగ ప్రాజాపత్యద్వయము నాచరించవలయును. బ్రాహ్మణుఁడు సంగాదినిమిత్తములచేత జంపినను ప్రాజాపత్యద్వయము నాచరింపవలయును. ఈరెండువిధములగు వానిలో బాలవయస్సునందున్న దానిని జంపినయెడల పైనజెప్పఁబడిన ప్రాయశ్చిత్తమునం దొకభాగము నాశ్రయించవలయును. పౌగండకవయస్సైనయెడల సగము నాచరించవలయును. పదుపదానిని సంహరించిన యెడల పైనజెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును సర్వమును నాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలకు, పురుషులకువిధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయును. క్షత్రియవైశ్యులిట్టిదుష్కృత్యము నాచరించిన యెడల నొకప్రాజాపత్యము నాచరించవలయును. శూద్రుఁడిట్టిదుష్కృత్యమును జేసినయెడల శిక్షను రాజగువాఁడు విధించవలయును. ఈమూఁడుజాతిపురుషులకును విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందర్ధభాగమును వీరిస్త్రీలకు విధింపవలయును. స్త్రీలవిషయమునందుఁగూడ బాలపౌగండక యౌవనాదులను జేయవలయును. ఇట్లు కూడ కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రియను పండితునిచేత రచింపఁబడిన ధర్మశాస్త్రమునం దజబస్తవధప్రాయశ్చిత్తము సమాప్తము.

——✻ ద్రుమాలతాచ్ఛేదప్రాయశ్చిత్తమ్. ✻——

(౪౩) అథద్రుమచ్ఛేద ప్రాయశ్చిత్తమాహ॥ గౌరీకాండే॥ శ్లో॥ ఇంధనార్థం ద్రుమచ్ఛేదీ గ్రామేవారణ్యమధ్యతః॥ కృష్ణాగ్రం వానరశ్రేష్ఠ సయాతిన రకం ధ్రువం। ఏతత్సాధారణవృక్షవిషయం॥ యాజ్ఞీయవృక్షచ్ఛేదనేవిశేషమాహ॥ కౌర్మే॥ శ్లో॥ వైకంతతశ్చఖదిరః కింశుకోశ్వత్థఏవచ। ఔదుంబరశ్చ న్యగ్రోధశ్శమీబిల్వస్తథైవచ॥ శ్లేష్మాతకస్సనాశఏతేయాజ్ఞీయవృక్షకాః॥ చూతశ్చతింత్రిణీవృక్షః కపిత్థామలకౌతథా। కోవిదారతరుశ్చైవ నింబవృక్షో

ధంద్రుమః॥ జంబూతరుర్నదీవృక్షో హ్యశోకతరురేవచ । ఏతేవన్యాః॥ శ్లో॥
చంపకః పనసశ్చైవ మాతులుంగోర్జునస్తథా॥ జంబీరైరండవృక్షాశ్చనారికే
ళశ్చఖర్జురః। దాడిమోబదరీవృక్షః కురంటశ్చిరంటకా॥ గుంజావృక్షశ్చవకు
ళోనీపవృక్షస్తథైవచ। ఏతేహ్యారామజాః॥ భల్లాతకోబృహత్పర్ణో యేయేవృ
క్షామహోన్నతాః। తథైవనీచవృక్షాయే ఫలవంతశ్చపుష్పితాః॥ వన్యావృ
క్షాఅమీరాజన్నేతేభ్యోయదిహింసనం। తస్యైవతారతమ్యేనప్రాయశ్చిత్త
మిహోచ్యతే। కృష్యర్థంయజ్ఞపాత్రార్థంయశ్ఛింద్యాత్కంటజంసకృత్ । త
స్యైవనిష్కృతిర్నాస్తి కథితామునిసత్తమైః॥ ఇంధనార్థంద్రుమచ్ఛేదీ తస్యదో
షోపశాంతయే । ప్రాజాపత్యం కృతంకృత్వా శుద్ధిమాప్నోత్యనుత్తమాం।
కృష్యర్థంవృక్షషట్కాపి ప్రాజాపత్య ద్వయంచరేత్॥ కృష్యర్థ మింధనార్థం
వా యజ్ఞవృక్షవిభేదనే। పరాకంతత్రకుర్వీత శుద్ధోభవతివృక్షహా॥ వైకంక
తతరుచ్ఛేదీ ప్రాజాపత్యంసమాచరేత్ । ఖదిరేకింశుకేచైవ పరాకశ్శుద్ధిరీరి
తః॥ ఔదుంబరేచన్యగ్రోధేపరాకఃపూర్వవచ్ఛుచిః । బిల్వాశ్వత్థౌ యదా
ఛింద్యాత్తదాచాంద్రాయణంచరేత్॥ శ్లేష్మాతకేశమీవృక్షే దేవదారుతరౌ
తథా । మయూరపాదవృక్షేచ ఛేదనేతప్తముచ్యతే॥ భల్లాతకేబృహత్పర్ణే
యేయేచఫలపుష్పితాః । తథైవనీచవృక్షాయే తేషాంభంగేవనేపివా । ప్రా
జాపత్యంవనచ్ఛేదే నీపవృక్షసమాకులే। భల్లాతకేబృహత్పర్ణే కాయకృచ్ఛ్రం
సమాచరేత్॥ తింత్రిణీచూతయోశ్ఛేదే బహుజంతూపకారణాత్ । కపిత్థా
మలకచ్ఛేదీసమ్యక్చాంద్రాయణంచరేత్॥ కోవిదారతరూణాంచ ప్రాజాపత్యం
విశోధనం । మధుద్రుమేజంబునరేప్రాజాపత్యంచపూర్వవత్ । నదీవృక్షే
హ్యశోకేచ పూర్వవచ్ఛుద్ధిరీరితా। ఖర్జూరేనారికేళేచ తాళహింతాళయో
స్తథా। తప్తకృచ్ఛ్రంచరేద్విద్వాన్ ఛేదదోషోపశాంతయే॥ వనచ్ఛేదీమ
హాపాపీ కుర్యాచ్చాంద్రస్యభక్షణం । జంబీరమాతులుంగాదీన్ ఛిత్త్వా
పాపవిశుద్ధయే । సమ్యక్స్నాత్వా శుచిర్భూత్వా గీతాశాస్త్రం పఠేత్క్ర
మాత్॥ పుష్పారామస్యవిచ్ఛేదీ దేవద్రోహీతిగద్యతే। తద్దోషపరిహారార్థం
గాయత్రీలక్షమాచరేత్॥ తటాకకూపకాసార ఛేదనేపి న్సత్తమః॥ పూర్వ
వత్తద్ద్రఢంకృత్వా కాయకృచ్ఛ్రంసమాచరేత్ । ఏతదల్పతటాకచ్ఛేదవిష
యం। మహాతటాకచ్ఛేదవిశేషమాహ॥ దేవలః॥ శ్లో॥ బహుధాన్యోద్భవే
రాజన్ తటాకేతువిభేదితే॥ బ్రహ్మహత్యావ్రతంకృత్వా కపాలధ్వజవర్జితం॥
పునస్సంస్కారకస్తత్పశ్చాచ్ఛుద్ధిమాప్నోతిపార్థివః । అన్యథాపతితంవిద్యా
న్నాలపేత్తంకదాచన ॥ అల్పాన్యల్పతటాకాదిభేదనే బ్రహ్మహత్యాః । తో

త్తంపాదార్ధహీనాదిక్రమేణయోజనీయం॥ నాత్రపునస్సంస్కారః। తథాచపునః॥ అల్పాత్యల్పతటాకాది ఛేదనేపూర్వజో మహాన్। పునస్సంస్కారసహితంకృచ్ఛ్రంపాదార్ధసంఖ్యయా॥ విష్ణ్వాలయంతథాశంభో రాలయంశక్తిసంస్థితం। విభేదనేద్విజఃపాపీపునశ్శుద్ధ్యై చరేత్సకృత్। చాంద్రాయణంపరాకంచ తద్ద్వయంపూర్ణశూన్యయోః। దేవాధిష్ఠితాలయచ్ఛేదనేచాంద్రాయణం। శూన్యాలయచ్ఛేదనేపరాకమిత్యర్థః। ఏవంరేణుకాలయాదిష్వపి జ్ఞాతవ్యం॥ కాశీచాపాగాదిషుక్షేత్రేషు దేవాధిష్ఠితేషుశూన్యేషు వాచ్ఛేదనే బృహత్తటాకప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్॥ రాజాపణిగవ్యేత్యేతేషాం పూర్వోక్తానాంవిభేదనే। తత్రప్రాయశ్చిత్తంద్విగుణంచరేత్। పాదజస్య తత్రద్గురులాఘవతయాసహస్రశతదశక్రమేణదండమేదాజా సమ్యగ్విచార్యతత్తత్స్థిరాణాం తత్తద్విచ్ఛేదనేతత్తదర్ధప్రాయశ్చిత్తంకల్పనీయం॥ ఇతి హేమాద్రౌద్రుమాలయాదివిచ్ఛేదప్రాయశ్చిత్తం॥

(౪౩) ద్రుమాలయచ్ఛేదప్రాయశ్చిత్తము॥ వంటకట్టెలకొఱకు, గ్రామమునందైనను, అరణ్యమునందైనను వృక్షములను నఱికిన యెడల ఘోరనరకమునందుఁబడి సంకటములను జెందును. కృష్యర్థముగ నిట్టికృత్యముఁజేసినను నరకలోకమునందుఁబడి దుఃఖములను జెందును. ఇది సామాన్యవృక్షవిషయమని గౌరీకాండమునందుఁ జెప్పఁబడెను. వైకంతకము, ఖదిరము, కింశుకము, అశ్వత్థము, ఔదుంబరము, న్యగ్రోధము, శమి, బిల్వము, శ్లేష్మాతకము, సరళము, అనునవియజ్ఞీయవృక్షములు, చూతవృక్షము, తింత్రిణీవృక్షము, కపిత్థము, ఆమలకము, కోవిదారము, నింబవృక్షము, మధుద్రుమము, జంబూవృక్షము, నదీవృక్షము, అశోకము, మొదలగు వృక్షములు వన్యవృక్షములు, సంపెగవృక్షము, పనసవృక్షము, మాతులుంగవృక్షము, అర్జునవృక్షము, జంబీరవృక్షము, ఏరండవృక్షము, నారికేళము, ఖర్జూరవృక్షము, దాడిమవృక్షము, బదరీవృక్షము, కురంటకచిరంటకములు, గుంజావృక్షము, వకుళము, నీపవృక్షము, అనునవియారామవృక్షములు, భల్లాతకము, బృహత్పర్ణము, మఱియు నితరములును, మహోన్నతములును నగు వృక్షములును, అట్టులనే స్వల్పములైన వృక్షములును, ఫలవంతములును, పుష్పితములును నగు వృక్షములును, అనునవి వన్యవృక్షములు. ఈలాటివృక్షములను ఛేదించిన యెడల నయ్యైవృక్షములకు తారతమ్యానుసారముగ ప్రాయశ్చిత్తము నాచరించ వలయును. కృషికొఱకైనను, యజ్ఞపాత్రలకొఱకైనను, తద్గేహాసను, వంటకట్టెలకొఱకైనను, వృక్షమును ఛేదించినయెడలను,

శాంతికొఱకు ప్రాజాపత్యము నాచరించిన యెడలఁ బరిశుద్ధుఁడగును. కృషికొఱకు వృక్షచ్ఛేదమును జేసిన యెడల మహాపాపియగును. తత్పాపశాంతికొఱకు ప్రాజాపత్యద్వయము నాచరింపవలయును. కృషికొఱకైనను, వంటకట్టెలకొఱకైనను, యజ్ఞవృక్షములను ఛేదించినయెడల పరాకకృఛ్రము ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. వైకంకతవృక్షమును ఛేదించినవాఁడు ప్రాజాపత్యకృఛ్రము నాచరించవలయును. ఖదిరవృక్షమునైనను, కింశుకవృక్షమునైనను ఛేదించినయెడల పరాకకృఛ్రము నాచరించవలయును. ఔదుంబరన్యగ్రోధములను ఛేదించినపుడుగూడ పరాకకృఛ్రము నాచరింపవలయును. బిల్వాశ్వత్థవృక్షములను ఛేదించిన యెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. శ్లేష్మాతకశమీవృక్షములను దేవదారువృక్షములను, మయూరపాదవృక్షములను, ఛ్చేదించినయెడల తప్తకృఛ్రము నాచరింపవలయును. భల్లాతక, బృహత్పర్ణాదివృక్షములనుచ్ఛేదించినయెడలను, మఱియును నన్యములగు వృక్షములను ఛ్చేదించినను ప్రాజాపత్యము నాచరించవలయును. మఱియును భల్లాతకబృహత్పర్ణవృక్షములవిషయమై కాయకృఛ్రము నాచరించవలయును. తింత్రిణీచూతవృక్షములను, కపిత్థామలకములను ఛ్చేదించినయెడల చాంద్రాయణము నాచరించవలయును. కోవిదారనింబవృక్షములను నరికినపక్షమునకు ప్రాజాపత్యము నాచరించవలయును. మధుమద్రిమజంబూవృక్షములను ఛ్చేదించినపుడుగూడ ప్రాజాపత్యకృఛ్రము నాచరింపవలయును. నదీవ్రత్యాశోక వృక్షములను ఛ్చేదించిన యెడల పరాకకృఛ్రము నాచిరింపవలయును. ఖర్జూర, నారికేళ, తాళ, హింతాళ, వృక్షములను ఛ్చేదించినయెడల తప్తకృఛ్రము నాచరించవలయును. వనమును ఛ్చేదించినవాఁడు మహాపాపియగును. కావున తత్పాపశాంతికొఱకు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. జంబీరమాతులుంగాదులను ఛ్చేదించినయెడల తత్పాపశమనముకొఱకు గీతాశాస్త్రమునుపఠించవలయును. పుష్పారామమునకు విచ్ఛేదమును జేసినయెడల శివద్రోహియని చెప్పఁబడును. కావున తద్దోషపరిహారముకొఱకు నొకలక్షపర్యాయములు గాయత్రీజపము నాచరించవలయును. తటాకకూపకాసారచ్ఛేదనమునందు బ్రాహ్మణునకు కాయకృఛ్రప్రాయశ్చిత్తమును విధించవలయును. ఇదియల్పతటాకచ్ఛేదవిషయమని యెఱుంగవలయును. ఇట్లని గౌరీకాండయందుఁజెప్పఁబడియె. తటాకచ్ఛేదనమునందు ప్రాయశ్చిత్తాదికము బహుప్రకారములుగ విధింపఁబడినది. ఎట్లనిన గొప్పదగు తటాకము ఛ్చేదించినయెడల

కపాలధ్వజధారణరహితముగ బ్రహ్మహత్యావ్రతము నాచరించవలయును. ఇట్లు బ్రహ్మహత్యావ్రతము నాచరించిన పిమ్మట పునరుపనయన సంస్కారమును బొందఁగనే పరిశుద్ధుఁడగును. ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొననివాఁడు పతితుఁడగును. కావున నట్టివానితో సంభాషింపఁగూడదు. అల్పాల్పతటాకభేదనమునందీ బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమునందు నాల్గవభాగము త్రిభాగము మొదలగు క్రమములననుసరించి ప్రాయశ్చిత్తవ్రతము నాచరించవలయును. ఇట్లు దేవలుఁడువచించె. బ్రాహ్మణుఁడగువాఁడల్పాల్పతటాకాదిచ్ఛేదనమునందు పాదార్ధసంఖ్యానుసారముగ కృచ్ఛ్రమును పునస్సంస్కారరహితముగ నాచరించవలయును. విష్ణ్వాలయమును, శివాలయమును బడఁగొట్టిన బ్రాహ్మణుఁడగువాఁడు మరల నాదేవాలయమునుబాగుచేసి పిమ్మట ప్రాయశ్చిత్తము నాచరించవలయును. దేవాధిష్ఠితమయిన దేవాలయమునకు విచ్ఛిన్నమును గలుగఁజేసినవాఁడు చాంద్రాయణవ్రతమునాచరించవలయును. శూన్యాలయమునకు విచ్ఛేదమును గలుగఁజేసినవాఁడు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. ఈక్రమము రేణుకాద్యాలయముల విషయమునందును నిటులనే గ్రహింపవలయును. కాశీ, ధనుష్కోటి, దేవాధిష్ఠిత దేవాలయమును, దేవుఁడులేని దేవాలయము, అనువానిని బడఁగొట్టినవాఁడు బృహత్తటాకచ్ఛేదమునకు విధించిన ప్రాయశ్చిత్తమును విధింపవలయును. క్షత్రియవైశ్యులీ దుష్కృత్యములను జేసినయెడల బ్రాహ్మణులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునకు ద్విగుణమధికముగ విధించవలయును. వారిస్త్రీలకు వారివారికి విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునం దర్ధమును విధించవలయునని మనువచించె. ఇట్లు హేమాద్రియందు ద్రుమాలయాదిచ్ఛేదనమునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తవిధానముసమాప్తము.

—— * అనాశ్రమవాసి ప్రాయశ్చిత్తమ్. * ——

(౪౪) అథానాశ్రమవాసినః ప్రాయశ్చిత్తమాహ॥ కుమారవిజయే

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోథభిక్షుకః॥ చత్వార ఆశ్రమాస్త్వేపంచమోనోపపద్యతే। వానప్రస్థాశ్రమస్త్వేషాం కలౌ నాస్తీహ దుస్తరాత్। ఆశ్రమాస్త్రివిధా రాజన్ పరలోకప్రదాయినః॥ బ్రహ్మచారీ బ్రహ్మచర్యం కృత్వా భార్యాం సముద్వహేత్। కుర్యాద్యాగాదికాన్ ధర్మాన్ ప్రత్యవాయశంకయా॥ నత్యజేదిహ కర్మాణి త్యక్త్వా పాపం సమశ్నుతే॥ స్నానం సంధ్యాం జపం హోమం బ్రహ్మయజ్ఞం చ తర్పణం। ఔపాసనం దేవపూజాం వైశ్వదేవ [illegible] ధర్మశాస్త్రేషు

రణం॥ ఏవంగృహీతదారస్స్యాత్సర్వాన్ కామానవాప్నుయాత్॥ పరలో
కమవాప్నోతి పునరావృత్తిదుర్లభం॥ అతఃపరంతుసన్యాసః కార్యోవిద్వద్భి
రాదరాత్॥ నకాంచనంప్రగృహ్ణీయాన్నై కభిక్షాంసమాశ్రయేత్ ॥ నచ
ర్యాల్లోకవార్తాంవా ప్రణవంనిత్యమాచరేత్। ఏవంయఃకురుతేనిత్యం పరంని
ర్వాణమశ్నుతే॥ గృహస్థస్యయదారాజన్ పత్నీనాశోభవేదిహ। తదాప్ర
భృత్యయంవిప్రో హ్యనాశ్రమఇతీరితః॥ దానవ్రతేషుశ్రాద్ధేషుసత్యానైమిత్తికే
షుచ। నాధికారోభవేత్తస్య తస్మాదుద్వాహయేత్పునః॥ పంచాశద్వర్షా
దూర్ధ్వం వివాహోనసమీచీనః। మహాదోషసంభవాత్। తదాహగౌత
మః॥ శ్లో। పంచాశద్వత్సరాదూర్ధ్వం నకార్యం పాణిపీడనం। కలేర్యుగస్య
దుష్టత్వాత్త్యాజ్యమాహుర్మనీషిణః। యువానంవృద్ధమేనారీ స్వప్నేప్యంగీ
కృత్యాపి సర్వదా। వ్యభిచారాత్కులంనశ్యేత్ కులనాశాత్కులాంగనాః॥ భ్ర
శ్యంతిసంకరీభూతా స్సంకరోనరకాయవై॥ నరకాన్ననివర్తంతే తస్మాద్గ
ర్హంతిపండితాః॥ కళత్రంయస్యనాస్త్యేవ మ్రియతేతత్పరిత్యజేత్॥ తదాప్ర
భృత్యసౌవిప్రో హ్యనాశ్రమ ఇతీరితః॥ అగ్నిపూర్వోగృహస్థస్స్యాత్ సోమయా
జీవిశేషతః॥ తయోర్యదిమృతాభార్యా తజ్జన్మవిఫలంభవేత్। తస్మాదనాశ్ర
మేనాసౌనకర్తవ్యోద్విజన్మభిః॥ అగ్నిహీనోయదావిప్రః పతితోనాయదాంగ
నా। తమోన్నభాషణంకుర్యాన్నపశ్యేచ్ఛుభకర్మసు। అనాశ్రమీద్విజోవిప్రః
యావజ్జీవతిభూతలే॥ మాసిమాసిసహస్రేషు ప్రాజాపత్యంవిశుద్ధయే॥ కుర్య
దితిశేషః॥ అన్యథాదోషమాప్నోతి మృత్యులోకమశ్నుతే॥ యద్యశక్తస్త
థాకర్తుం కుర్యాద్వానృత్యపంతరం॥ తతశ్శుద్ధిమవాప్నోతి పరలోకాంశ్చ
విందతి॥ నై.గౌ। శ్లో॥ అనాశ్రమస్యయావంతిదినానిమాసతత్త్వమాః॥ మాసి
మాసిహరేత్యంతి గణయిత్వాతిదాన్మజః॥ తావత్కృచ్ఛ్రాణికుర్వీతమాసియ
మాణేహ్యనాశ్రమే॥ కుర్యాత్తతఃపరంకర్మ పరలోకసుఖాప్తయే॥ ఏవంక
రోతియఃపుత్రస్సపుత్రఇతిగణ్యతే॥ పిత్రాలోకమవాప్నోతి గయాయాంపిం
డదోయథా॥ ఇతిహేమాద్రిపరిచిత్సైనాశ్రమవాసినఃప్రాయశ్చిత్తం॥

(౪౪) ఆశ్రమరహితుండైయుండువానికి ప్రాయశ్చిత్తము॥ బ్రహ్మచర్య
ము, గార్హస్థ్యము, వానప్రస్థము, యత్యాశ్రమము, అని యాశ్రమములు
నాలుగువిధములు. కలియుగమునందు దుర్లభమగుటచేత వానప్రస్థాశ్రమ
ము పరిత్యజింపఁబడినది. కావునఁగలియుగమునందుఁ బుణ్యలోకములను గో
లుకొనఁజేయునట్టి యాశ్రమములు మూఁడేయని యభిప్రాయము. బ్రహ్మచా
రియగువాఁడు బ్రహ్మచర్యాశ్రమమును నవలంబించి పిమ్మట వివాహమును జేసి

కొనవలయును. వివాహానంతరమందు ప్రతిదినమునందును పాపము గలుగు నని యెడు భయముచేత యాగాదిధర్మకార్యములనాచరించవలయును. అందువలన యాగాది ధర్మకార్యములను వదలఁగూడదు. అట్లు వదలుటచేతఁ బాపము సంభవించును. గృహస్థుఁడగువాఁడు దినదినమందును, స్నానమును, సంధ్యావందనమును, జపమును, హోమమును, బ్రహ్మయజ్ఞమును, తర్పణమును, ఔపాసనమును, వైశ్వదేవమును, అతిధిపూజను, సాయంసంధ్యను, హోమమును, ధర్మశాస్త్రవిచారణను జేయవలయును. ఇట్లు చేసినయెడల సర్వములగు నభిలాషలు నొదీమను. పునరావృత్తిరహితమగు పుణ్యలోకమును బొందును. అటుపిమ్మట విద్వాంసులగు వారాదరపూర్వకముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. యత్యాశ్రమమునవలంబించినవాఁడు బంగారమును గ్రహింపఁగూడదు. మఱియు ననేకభిక్షునుగూడ గ్రహింపఁజనదు. లోకవార్తలయందుఁ జెవినివ్వఁగూడదు. సర్వకాలములయందును బ్రణవమును నాచరించవలయును. ఇవ్విధమగు ధర్మము నాచరించిన యతి మోక్షపదమును బొందును. గృహస్థునకు భార్య మరణమును బొందెనేని యని మొదలుకొని యనాశ్రమియగును. అట్టివానికి దానవ్రతములయందును, శ్రాద్ధములయందును, నిత్యనైమిత్తికములయందును, అధికారము గలుగనేరదు. కావున వివాహమును మరల ముఖ్యముగఁ జేసికొనవలయును. ఏబదిసంవత్సరములుగడచినపిదప వివాహమును జేసికొనఁగూడదు. అట్లుగఁ జేసికొనెనేని మిగులఁ బాపముగలవాఁడగును. ఇట్లని కుమారవిజయమునందుఁ జెప్పఁబడియె. కలియుగముదోషబాహుళ్యముకలది కావున, ఏబదిసంవత్సరములు గడచినపిదప వివాహమును జేసికొనఁగూడదు. తాము ముసలివారలయ్యును స్త్రీలోలురై కలియుగమునందుఁ బడుచు వానిఁ బొందఁగోరుదురు. వ్యభిచారమును స్త్రీలు సేయుటవలనఁ గులము నశించును. కులాంగనలు భ్రష్టలగుదురు. సంకరము నరకమునకుఁ గారణమగును. నకరమును బొందినవాఁడు మరలఁ బుణ్యలోకమును బొందుననుట దుర్లభము. అందువలననే సంతతులు నరకమును బొందింతురు. భార్యమరణమును బొందినపిదప గృహస్థునియొక్కయు సోమయాజియొక్కయు జన్మవ్యర్థమగును. మఱియు నే యాశ్రమమును లేనివారగుదురు. భార్యలేనివాఁడును, భర్తలేనియాఁడుదియును, ధర్మకర్మలయందుఁ జూడఁదగినవారుగారు. అనాశ్రమియైయెంతకాలము మానవుఁడు బ్రతికియుండునో యంతకాలమును నెలకొకటి ప్రాజాపత్యమును ప్రాయశ్చిత్తార్థము [illegible] చేసికొనఁజేసి దోషము

గలవాఁడును, నరకలోకమును బొందువాఁడును, నగును. అట్లు చేసికొనుట
కు సామర్థ్యములేనివాఁడయ్యెనేని మరణానంతరమందతని పుత్రాదులైన నా
చరించవలయును, ఆనంతరమందు శుద్ధుఁడై పుణ్యలోకములను బొందును. ఇట్ల
ని గౌతమమునివరుఁడు వచించె. సంద్రియయగువాఁడెన్నిమాసము లనాశ్రమియై
యుండి మరణమును బొందునో యన్నిమాసములకును నన్ని కృచ్ఛ్రములనాచ
రించి యనంతరమందు దహనాది సంస్కారమును జేయవలయును. ఇట్లు చే
సినవాఁడే పుత్రుఁడని యెన్నఁబడును. అట్టివానియొక్క తండ్రిగయాశ్రాద్ధము
చేసినవలెనే యుత్తమలోకమును బొందును. ఇట్లని లింగపురాణము నందుఁ
జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివివేచితమయిన ధర్మశాస్త్రమునందనాశ్రమ
వాసి ప్రాయశ్చిత్తము సమాప్తము ॥

❋ భృతకాధ్యాపన ప్రాయశ్చిత్తమ్ ❋

(౮౫) అథభృతకాధ్యాపన ప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండపురాణే ॥ శ్లో ॥ వేదమూల్యంధనమిదంమాసిమాసిద్విజోత్తమాః ॥ గృహీత్వా యఃపఠేద్వేదంసభృతాధ్యాపకస్స్మృతః ॥ భృతింగృహీత్వాయోఽప్రత్యహంపాఠయేచ్ఛ్రుతిం ॥ సవిప్రోభృతకాధ్యాయీ సర్వకర్మబహిష్కృతః॥ లింగపురాణే ॥ శ్లో ॥ మాసిమాసిప్రగృహ్ణీయాన్మూల్యం యత్పరిభాషయా। భృతకంతద్విజానీయాత్పరలోకవిగర్హితం । తద్గృహీత్వాద్విజోయస్తుజీవయేత్పఠతేశ్రుతిం । సవిప్రోభృతకాధ్యాయీ తస్మాత్ఖంనావలోకయేత్ ॥ కార్ష్ణే ॥ శ్లో ॥ యోవిప్రోభృతకంకృత్వా మాసిమాసప్రచోదితం । శిష్యానధ్యాపయేద్వేదం సాక్షాన్నారాయణాత్మకం । సవైనారాయణద్రోహీ సర్వదాసూతకీభవేత్ । నయోగ్యోహవ్యకవ్యేషు నదానేషుమునీశ్వరాః ॥ వేదాక్షరాణియావంతి పఠితానిద్విజాతిభిః । తావంతిహరినామానికీర్తితానినసంశయః ॥ మాసంగృహీత్వాభృతకంయఃపఠేద్వేదమాదరాత్ ॥ సవైనారాయణద్రోహీ సర్వదాతంపరిత్యజేత్ ॥ విష్ణుధర్మోత్తరే ॥ శ్లో॥ వేభ్యో గృహీత్వాభృతకంశిష్యేభ్యోయఃప్రకీర్తయేత్। దినేదినేబ్రహ్మహత్యాపాపంససమవాప్నుయాత్ ॥ మరీచిః ॥ శ్లో ॥ ద్విజేభ్యోవాన్యజాతిభ్యో గృహ్యత్వాభృతకంపఠేత్ ॥ సఏవనరకస్థాయీ యావదాభూతసంప్లవం॥ శాఖాంపురాణాంవదేద్యస్తు భృతకంపాపరూపిణం ॥ కృత్వాసంవత్సరంవాపి హ్యైరణ్యకమథాపివా ॥ బ్రహ్మహత్యామవాప్నోతి సకృత్విర్నహీదృశ్యతే॥ బ్రహ్మహంతృసమస్సోపి భృతకంయస్సమాహరేత్ ॥ జాబాలిః ॥ శ్లో ॥ అబ్దంయోభృతకంకృత్వా వేదపాఠంద్విజాతయే । తస్యచాంద్రద్వయంప్రోక్తం

శాఖామాత్రంవదేద్యది ॥ అబ్దద్వయముపదేద్యస్తు భృత్వా గాల్యంద్విజన్మనే॥
తస్యపాపవిశుద్ధ్యర్థంప్రోక్తంచాంద్రచతుష్టయం । అబ్దత్రయే తు షట్చాంద్రం
కుర్యాద్దేహవిశుద్ధయే ॥ అతఊర్ధ్వంనశుద్ధిస్స్యాద్బ్రహ్మహా పరికీర్తితః॥
మహారాజకజమే ॥ శ్లో ॥ అబ్దేచాంద్రద్వయంప్రోక్తం భృతకంయోవదేద్ద్వి
జః । అబ్దద్వయంవదేద్యస్తు సతుపాపవిశుద్ధయే॥ పశ్చాత్తాపసమాయుక్తః
కుర్యాచ్చాంద్రచతుష్టయం । అబ్దత్రయేవిశుద్ధిస్స్యాత్షడ్భిశ్చాంద్రైర్యథాక్రమం।
అతఊర్ధ్వంబ్రహ్మహంతాలింగాచెచిహ్నవర్జితః ॥ నాందీమే ॥ శ్లో ॥ ప
ఞ్చాభైక్ష్యపృథాపాకీ బ్రాహ్మణానాంచనిందకః ॥ ఆదేశీవేదవిక్రేతా పంచై
తేబ్రహ్మఘాతకాః ॥ యోభృత్వాభృతకంవిప్రో వత్సరత్రయమాదరాత్। వే
దపాఠయేద్విజాతిభ్యోవకేద్ధర్మ సమన్వితః । బ్రహ్మహత్యాసమంపాప మవా
ప్నోతిబుధోత్తమః ॥ అతఃపరం బ్రహ్మహంతా లలాటేతాంకవర్జితః ॥ బ్ర
హ్మహత్యావ్రతంకుర్యాత్ కపాలధ్వజవర్జితం ॥ తతశ్శుద్ధిమవాప్నోతి వేద
హంతానచాన్యథా ॥ వసిష్ఠః ॥ శ్లో॥ వేదమూల్యంగృహీత్వా యోద్విజో
వేదంవదేద్యది । చతుర్షష్టిషుశిష్యేభ్యో బ్రహ్మహంత్రసమోభవేత్॥ బ్ర
హ్మహత్యావ్రతంకృత్వా ద్వాదశాబ్దంవిమత్సరః । తతశ్శుద్ధిమవాప్నోతికపా
లధ్వజవర్జితం ॥ బ్రహ్మాండే॥ శ్లో ॥ బ్రహ్మహావేదవిక్రేతా హ్యశక్తోవ్రత
చారణే। తతోదేహవిశుద్ధ్యర్థం గవాంద్వ్యయుతమాచరేత్ ॥ పశ్చాద్ద్వ
యోఃపునఃకర్మకర్తవ్యంవిధిచోదనాత్ ॥ మరీచిసంహితాయాం॥శ్లో॥ఆచార్య
ఋత్విజోబ్రహ్మతులాయాం గోతులాంగలె । విశ్వబింబేపద్మేచ చర్మధే
న్వాంమహాఘటే॥ తథాచసోమవిక్రేతా కాలపూరుషవిగ్రహీ॥తథైవభూ
కాధ్యాయా కల్పపాదపసంగ్రహీ॥ హిరణ్యాధేనుహర్తాచ హిరణ్యాశ్వప్రతి
గ్రహీ ॥ హిరణ్యరథహారీచ హేమహస్తిరథగ్రహీ । ధరాంగృహ్ణాతికల్పి
తాంవహ్నావ్యైవిప్రసత్తమః ॥ ఉక్తేష్వేతేషుదానేషు ఆచార్యోయది మోహ
వేత్ । తులాదిసప్తదానేషు ఆచార్యబ్రహ్మఋత్విజః ॥ ప్రాయశ్చిత్తాదికం
కృత్వాపునఃకర్మ సమాచరేత్ ॥ యాపతుర్యోఃపునఃకర్మ ఆచార్యబ్రహ్మఋ
త్విజః ॥ తాంచష్ఛద్రానసంభాష్యా శుభకర్మవివర్జితాః । పునఃకర్మవిహీ
నాయేకుర్యుర్యాగాదికంసకృత్ ॥ నప్రాప్నుయుస్తస్యఫలంకృతైర్దానశతై
రపి ॥ అకృత్వైవంపునఃకర్మమియంతేయదిదైవతః॥ తత్రాపికర్మకర్తవ్యంచా
న్యథాలోకమాప్నుయుః ॥ ఏతేషామృత్విజాంవిద్వాన్నాచార్యాణాంవిశేష
తః । పునఃకర్మప్రకర్తవ్యంవిద్వద్భిశ్శుభలిప్సుభిః ॥ ఇతి హేమాద్రి విరచితే
స్మార్తే ప్రాయశ్చిత్తాధ్యాయే భృతకాధ్యాపకప్రాయశ్చిత్తం ॥

(౮౫) జీతమునుబుచ్చికొని వేదవేదాంగములను జెప్పినదోషపరిహారకప్రాయశ్చిత్తము॥ నెలనెలకును జీతమునుగ్రహించి వేదమును జెప్పువాఁడు భృతకాధ్యాపకుఁడనఁబడును. ఇవ్విధముగజీతమును గ్రహించి వేదమును జెప్పువాఁడు సకలపుణ్యకర్మలకును బహిష్కృతుఁడగును, ఇట్లు బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడియె. లింగపురాణమునందును నిటులనే లింగీకరింపఁబడి మఱియునట్టి పాపాత్ముని ముఖమునుగూడఁ జూడఁగూడదని చెప్పఁబడియె. ప్రతినెలకుజీతమునుగ్రహించి శిష్యులకు వేదమును బోధించువాఁడునారాయణద్రోహియనఁబడును. మఱియునట్టి బ్రాహ్మణుఁడు సర్వకాలములయందును సూతకముగలవాఁడగును, అదికారణముగనతఁడు హవ్యకవ్యములను జేయుటకును, జేయించుటకును దగినవాఁడుగాఁడు, వేదాక్షరములనెన్నింటి నుచ్చరించునో యన్ని పర్యాయములు హరినామసంకీర్తనను జేసినవాఁడగను ఒక్కనెలదినములైనను జీతమునుబుచ్చికొని వేదమును జెప్పువాఁడుగూడనారాయణద్రోహియనఁబడును, కావుననట్టివానిని బరిత్యజింపవలయును, ఇట్లని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. జీతమునుగ్రహించి యెన్నిదినములు శిష్యులకు పాఠమును జెప్పునో యన్నిబ్రహ్మహత్యలు సేసినవాఁడగునని విష్ణుధర్మోత్తరమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణులవలననైనను, ఇతరులవలననైనను, జీతమునుగ్రహించి వేదమును జెప్పువాఁడుమహాప్రళయకాలము వఱకును నరకలోకమునందుఁబడును, జీతమునుగ్రహించియొక్కశాఖనుపూర్ణముగా చెప్పునోయట్టివాఁడును, సంవత్సరకాలము, అరణ్యకమును జెప్పినవాఁడును, బ్రహ్మహత్యకుఁ దుల్యమైనపాపమునుబొందుననిమరీచిమునివరుండు చెప్పె. ఒకసంవత్సరము జీతమునుగ్రహించి యొక్కశాఖనుమాత్రము శిష్యులకుఁజెప్పినబ్రాహ్మణుఁడు ప్రాయశ్చిత్తార్థముగఁ జాంద్రాయణవ్రతమునాచరింపవలయును. రెండుసంవత్సరములకాలము జీతమునుగ్రహించి వేదమునుజెప్పువాడు తత్పాపనివృత్తికొఱకు నాల్గుచాంద్రాయణముల నాచరించవలయును, మూఁడుసంవత్సరముల కాలముచెప్పినవాఁడు, ఆఱుచాంద్రాయణముల నాచరించవలయును. మూఁడుసంవత్సరములకంటె నధికకాలము జీతమును గ్రహించి శిష్యులకు వేదమును జెప్పినవానికిఁ బ్రాయశ్చిత్తమే లేదనియును, బ్రహ్మహత్యను జేసినవానికి దుల్యుఁడనియును నెఱుంగవలయునని జాబాలివచించె. మహారాజవిజయమునందును నిటులనే చెప్పఁబడియె, మఱియులలాటమునందు చిహ్నాంకితమైన బ్రహ్మహంత యగుననియును జెప్పఁబడియె. పంక్తియందు భేదమును జేయువాఁడును, వ్యర్థముగపాకమును

జేయువాఁడును, బ్రాహ్మణులను నిందించువాఁడును, ఏదేశమునందును స్థిరముగనుండనివాఁడును, వేదమును విక్రయించువాఁడును, బ్రహ్మఘాతకులనఁబడుదురు. మూఁడుసంవత్సరములకాలము జీతముగ్రహించి శిష్యులకు వేదమును జెప్పువాఁడు బ్రహ్మహత్యకుఁ దుల్యమగు పాపముఁ బొందును. అటుపిమ్మటఁ గూడ జీతముగ్రహించినవాఁడు లలాటమునందు చిహ్నవర్జితముయిన బ్రహ్మహంత యగును. కావునఁ గపాలధ్వజధారణరహితముగ బ్రహ్మహత్యావ్రతమునాచరించవలయును. అట్లు చేసిన యెడల పరిశుద్ధుఁడగునుగానిచో నెడల పరిశుద్ధుఁడుగానేరడని నారదీయమునందుఁ జెప్పఁబడియె. నాలుగు సంవత్సరములకాలము జీతముగ్రహించి శిష్యులకు వేదమును జెప్పినవాఁడు పదిరెండుసంవత్సరములు కపాలధ్వజధారణ రహితముగ బ్రహ్మహత్యావ్రతమునాచరించెనేని పరిశుద్ధుఁడగునని వసిష్ఠమునివరుఁడు వచించె. బ్రహ్మహత్యను జేసినవాఁడును, వేదమును విక్రయించినవాఁడును, ప్రాయశ్చిత్తవ్రతమునాచరించు సామర్థ్యము లేనియెడల నిరువది వేలగోవులను దానముచేసి పునరుపనయనాది సంస్కారములను జేసికొనినయెడల అపరిశుద్ధుఁడగును. ఇట్లని బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడియె. తులాదానము, గోదానము, లాంగలదానము, విశ్వబింబదానము, సముద్రదానము, చర్మధేనుదానము. మహాకూటదానము, మొదలగు దానము లేదు దానములను బట్టినవాఁడును, సోమవిక్రేత, కాలపురుష ప్రతిగ్రహీతయును, భృతకాధ్యాపకుఁడును, కల్పపాదపసంగ్రహీతయును, హిరణ్యధేనుహర్తయును, హిరణ్యాశ్వ ప్రతిగ్రహీతయు, హిరణ్యరథహర్తయును, హిరణహస్తిరథగ్రాహియును, భూగృహీతయును, కల్పలతాధర్తయును, పాపవంతులని కీర్తింపఁబడినవి. ఇట్టివారు ప్రాయశ్చిత్తమును జేసికొని పునరుపనయన సంస్కారమును బొందవలయును సంభాషింపఁదగినవారు గారు. ఇవ్విధముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనినపిదప పరిశుద్ధులగుదురు. ఇట్లని మరీచిసంహితయందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రమునందలి ప్రాయశ్చిత్తాధ్యాయమునందు భృతకాధ్యాపన ప్రాయశ్చిత్తము సమాప్తము॥

——* భృతకాధ్యయన ప్రాయశ్చిత్తమ్ *——

(౪౬) అథభృతకాధ్యయన ప్రాయశ్చిత్తమాహ ॥ బ్రహ్మకైవర్తే॥ శ్లో॥ శిష్యో యస్తుధనందత్వా భృతకంపూర్వవత్పఠేత్ । శాఖాసమాప్తిపర్యంతం సచండాలసమోభవేత్ ॥ లైంగే॥ శ్లో॥ భృతకాధ్యయనోనేదం శిష్యోదత్వాధనం [illegible] । [illegible] పాతకీస్యాన్నసంశయః॥

మహాభారతే ॥ శ్లో ॥ భృతకాధ్యాపనంకుర్యాద్ద్విజోయస్తథనేచ్ఛయా। శాఖామాత్రంతదర్ధంవాసచండాలత్వమాప్నుయాత్॥ పాద్మే॥ శ్లో॥ అంతేవాసీధనందత్వాభృతకాధ్యయనంచరేత్ ॥ సవిప్రోనరకంయాతిబహుక్లేశసమన్వితం ॥ నరకాత్ భీకరాత్ భుక్త్వాతదంతేభిల్లజాతిమాన్ ॥ భవేదితిశేషః॥ శ్లో॥ మాసంపఠిత్వాభృతకంప్రాజాపత్యంసమాచరేత్॥ మాసద్వయేపరాకంస్యాచ్చాంద్రంమాసత్రయేస్మృతం। షణ్మాసేతుషడబ్దంస్యాద్వత్సరేతత్త్రయంచరేత్॥ అబ్దద్వయేతుపూర్ణంస్యాత్ ॥ పాకోర్మంస్యాత్తతఃపాపీతువిప్రహ॥ బ్రహ్మహత్యావ్రతంకుర్యాద్ద్వాదశాబ్దంసమాహితః । అథవాత్రిఃపరిక్రమ్యాపంచాశతోటివిస్తృతాం॥ భూమిమితిశేషః॥ శ్లో॥ తతశ్శుద్ధిమవాప్నోతి భృతకాధ్యయనోద్విజః॥ఇతిహేమాద్రివిరచితేభృతకాధ్యయనప్రాయశ్చిత్తం

(౮౬) భృతకాధ్యయనప్రాయశ్చిత్తము॥ ఒకశాఖనుసంపూర్ణముగజీతమిచ్చి యధ్యయనమునుజేసినవాడు చండాలత్వమునుబొందనగునని బ్రహ్మకైవర్తమునందుజెప్పబడియె. జీతమునిచ్చి వేదమునుజెప్పికొన్నవాడు పాతకుడని లింగపురాణమునందుజెప్పబడెను. ఒకశాఖనైనను, ఒకశాఖలోసగమునైనను, జీతమిచ్చినవాడు చండాలత్వమునుబొందునని మహాభారతమునందుజెప్పబడియె. జీతమునిచ్చివేదమునుజదివినవాడు ఘోరనరకములనుబొందును. పిమ్మటభిల్లుడైపుట్టును. ఇట్లనిపాద్మమునందుజెప్పబడియె. ఒకమాసముదినములుజీతమునిచ్చి వేదమునుజదివినవాడు ప్రాజాపత్యమునాచరింపవలయును. రెండుమాసములయ్యేనేని పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. మూడుమాసములయ్యేనేని చాంద్రాయణము నాచరించవలయును. ఆఱుమాసములయ్యేనేని షడబ్దకృచ్ఛ్రమునాచరించవలయును. ఒకసంవత్సరమయ్యేనేని షడబ్దకృచ్ఛ్రత్రయమునాచరింపవలయును. రెండుసంవత్సరములయ్యేనేని పూర్ణప్రాయశ్చిత్తమునాచరింపవలయును. మఱికొందఱు రెండుసంవత్సరములకాలముజీతమిచ్చి వేదమునుజదివినవాడు బ్రహ్మఘ్నదోషమునుబొందును. కావుననట్టివాడు కపాలధ్వజధారణరహితమగు బ్రహ్మహత్యావ్రతమునాచరింపవలయును. అట్లుగాదేని మూడుపర్యాయములుభూప్రదక్షిణమునుజేయవలయును. ఇట్లుసేసినయెడలపరిశుద్ధుడగునని స్మృతిబోధించుచున్నది. ఇట్లనిహేమాద్రివిరచితమయిన భృతకాధ్యయనప్రాయశ్చిత్తము॥

## అధీతవిస్మృతి ప్రాయశ్చిత్తమ్.

(౮౭) అథాధీతవిస్మృతిప్రాయశ్చిత్తమాహ ॥ దేవలధర్మే॥ శ్లో॥ వేదాంతంమంత్రశాస్త్రంవా వేదంవాతత్వమేవవా॥ గురోరధీత్యయోవిప్ర

విస్మృత్యయదివర్తతే॥ గర్వేణవాభిమానేనహ్యైశ్వర్యమదవత్తయా॥ సఏవన
రకస్థాయీపతితస్సర్వకర్మసు॥ పద్మపురాణే॥ శ్లో॥ వేదంవాతస్యతత్త్వంవా
తంత్రంవామంత్రమేవవా॥ గురోరధీత్యసకలంవిస్మృత్యమదవత్తయా॥ సఏవ
శాస్త్రహంతాస్యాత్సర్వకర్మసుగర్హితః। పతితస్యైవయత్పాపంతత్పాప
ఫలమశ్నుతే॥ గారుడపురాణే॥ శ్లో॥ వేదాన్వాపితదంతంవా తత్త్వంమంత్ర
మథాపివా॥ విస్మృత్యయోద్విజోగర్వాద్వర్తతేయద్యహర్నిశం॥ ప్రత్యహం
గోవధేపాపంసమాప్నోతినసంశయః॥ మాసమాత్రేపరాకంస్యాత్తప్తంమా
సద్వయేస్మృతం। ఋతుత్రయేతుచాంద్రంస్యాదబ్దేహ్యౌద్దాలకంచరేత్। వ
ర్షద్వయేమహాపాపీపతితంతత్పరంవిదుః॥ ప్రాయశ్చిత్తవిశుద్ధాత్మాదక్షిణాం
గురవేదదేత్॥ సవ్యపాదంపునర్ధృత్వాహ్యభ్యస్యేత్పూర్వవత్క్రమాత్। అ
న్యథాదోషమాప్నోతినరకంచాధిగచ్ఛతి॥ ఇతిహేమాద్రౌఅధీతవిస్మృతిప్రా
యశ్చిత్తం॥

(౪౭) చదివినవేదమును మరిచిపోయినందుకు ప్రాయశ్చిత్తము ॥ వేదాంతమునైనను, మంత్రశాస్త్రమునైనను, వేదమునైనను, తత్త్వమునైనను, గురువులవలనజదివి గర్వముచేతనైనను, అభిమానముచేతనైనను, ఐశ్వర్యమదముచేతనైనను, మరచిపోయినయెడల నరకమునుబొందినవాడగును. మఱియుసర్వకర్మలయందును పతితుడగునని దేవలధర్మమునందు జెప్పబడెను. వేదమునైనను, వేదముయొక్కతత్త్వమునైనను, తంత్రమునైనను, మంత్రమునైనను, గురువువలనగ్రహించి మరిచిబోయినవాడు శాస్త్రహంతయును, సర్వకర్మలయందును బహిష్కృతుడునునగును. మఱియును పతితుడుపొందునట్టిపాపమునుబొందునని పద్మపురాణమునందుజెప్పబడెను. వేదములనైనను, వేదాంతమునైనను, తత్త్వమునైనను, మంత్రమునైనను, చదివిమరిచిపోయినవాడుప్రతిదినమందును గోవధకుదుల్యమయినపాపమునుబొందును. మఱచిపోయి యొక్కమాసముదినములుండెనేని ప్రాయశ్చిత్తార్థముగ బరాకకృచ్ఛ్రమునాచరించవలయును. రెండుమాసములయ్యెనేని తప్తకృచ్ఛ్రమునాచరించవలయును. ఆఱునెలలయ్యెనేని చాంద్రాయణము నాచరింపవలయును. ఒకసంవత్సరమయ్యెనేని యౌద్దాలకవ్రతము నాచరించవలయును. రెండుసంవత్సరములయ్యెనేని మహాపాపియును, పతితుడునునగునని యార్యులువలుకుదురు. ఇవ్విధముగ వేదమునుమరిచినవాడు ప్రాయశ్చిత్తముచేత పరిశుద్ధమైనయాత్మతత్త్వముగలవాడై గురునకుదక్షిణనొసంగి సవ్యపాదమునుధరించిమునుపటివలెనే వేదాభ్యాసమునుజేయవలయును. అట్లుగాదేనిపాపము

తుడగును. మఱియునరకలోకమును బొందువాడునగునని గారుడపురాణ మునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రియందు నిర్ణయింపబడిన యతీతవిస్మృతప్రాయశ్చిత్తముసమాప్తము॥

## గుర్వధిక్షేప ప్రాయశ్చిత్తమ్.

(౪౮) అథగుర్వధిక్షేపప్రాయశ్చిత్తమాహ॥ పద్మపురాణే॥ శ్లో॥ జనితాచోపనేతాచయస్తువిద్యాంప్రయచ్ఛతి॥ శ్వశురశ్చాగ్రజోభ్రాతాపంచైతేగురవస్స్మృతాః॥ అన్నదాతాభయత్రాతాక్రతావాధానదాయకః। మాతులశ్చపితృవ్యశ్చధర్మశాస్త్రోపదేశకృత్ ॥ పురాణసంహితావక్తానీతిశాస్త్రోపదేశకృత్॥ బుద్ధిప్రదఃకుబుద్ధీనామాచార్యస్స్మృతః కర్మసు॥ ఏతేవైగురవోలోకేపూజ్యావంద్యాశ్చసాదరం। ఏతేభ్యోనాపకుర్వీతహ్యేతద్వాక్యంనలంఘయేత్॥ స్కాందే॥ శ్లో ॥ జనితాచోపనేతాచ యస్తువిద్యాంప్రయచ్ఛతి। శ్వశురశ్చాగ్రజోభ్రాతాపంచైతేగురవస్స్మృతాః॥ ఏతేసర్వేవందనీయాఃపూజ్యాభక్త్యాచసాదరం॥ ఏతేభ్యోనాపకుర్వీతనావమన్యేతకర్హిచిత॥ స్కాందేనాగరఖండే॥ శ్లో॥ జనితాచోపనేతాచయస్తువిద్యాంప్రయచ్ఛతి। త్రయస్తేగురవఃప్రోక్తాఉపాధ్యాయాస్తథాపరే। త్రిషుద్రోహంనకుర్వీతకర్మణామనసాగిరా। పితురభావేజ్యేష్ఠభ్రాతృపితృవ్యాదిరుపనీత్వాగాయత్రీప్రదానకృద్గురుః॥ అతఏవపితాభ్రాతావాగురుః। వేదాంతోపదేశకృత్పరమగురుః॥ తస్మాత్త్రయోగురవః॥ ఇతరేవంద్యాః। అతఏవత్రయాణాంమధ్యే ఏకంవానోపేక్షయేత్॥ నద్రుహ్యేన్నోదాసీతచ॥ తథైవనారదః ॥ శ్లో॥ గురుంత్వంకృత్యహుంకృత్యయోవదేన్మూఢధీర్నరః। సారణ్యేనిర్జలేదేశేభవతిబ్రహ్మరాక్షసః॥ స్కాందే। గౌరీకాండే॥ శ్లో॥ పితరంవాగురుంవాపి జ్యేష్ఠభ్రాతరమేవవా। త్వంకారంవాథహుంకారం కృత్వాపుత్రసపాపభాక్॥ తదంతేనరకంగత్వాభుక్త్వాతత్రమహాద్భయం। తదంతేభువమాసాద్య రాక్షసత్వంభజేదిహ। తద్దోషపరిహారార్థంనాచికేతవ్రతంచరేత్॥ దేవీపురాణే॥ శ్లో ॥ నాచికేతఃపురారాజన్గురుముద్దాలకంప్రతి। ప్రతిభాష్యతథాగత్వాదృష్ట్వాయమపురంమహత్॥ పునర్గత్వాభువఃపృష్ఠంపితరంప్రణిపత్యచ । తద్వాక్యేనతతఃపశ్చాద్దేహశుద్ధ్యర్థమాదరాత్॥ చచారమండలంతత్రగవాంక్షీరందినేదినే॥ పీత్వాశుద్ధిమవాపాథమండలాద్విప్రసత్తమః। తతఃపరంవిశుద్ధాత్మాపితరంప్రణతోభవత్॥ పితరముద్దిశ్యేత్యర్థః॥ అథవాదేహశుద్ధ్యర్థం షడబ్దంకృచ్ఛ్రమాచరేత్। కలౌయుగేనాచికేతవ్రతస్యాతి దుష్కరత్వాత్షడబ్దం ప్రాజాపత్యకృచ్ఛ్రంకుర్యాత్॥ ఇతిహేమాద్రివిరచితే గుర్వధిక్షేపప్రాయశ్చిత్తం॥

(౪౭) గురువులనునిందించినందుకు ప్రాయశ్చిత్తము॥ జన్మమునుగలుగ జేసినవాడును, ఉపనయనమును జేసినవాడును, విద్యను జెప్పినవాడును, భార్యయొక్కతండ్రియును- తనకంటెముందుగబుట్టినయన్నయును, ననునైదుగురునుగురువులనిచెప్పబడుదురు. అన్నమును బెట్టికాపాడినవాడును, భయమునుబోగొట్టినవాడును, యజ్ఞమునందాధానమునొసంగినవాడును, మేనమామయనువాడును, పినతండ్రిపెదతండ్రులును, ధర్మశాస్త్రమునుపదేశించినవాడును, పురాణసంహితను జెప్పినవాడును, నీతిశాస్త్రమునుపదేశించినవాడును, దుర్బుద్ధులనుబోగొట్టి మంచిబుద్ధుల నుపదేశించినవాడును, సర్వకర్మలయందును నాచార్యత్వమునువహించినవాడును, గురువులనియెన్నబడుదురు. కావునవీరిలోనెవ్వనికి నపకారమును జేయగూడదు. మఱియువీరివాక్యమును గూడనతిక్రమింపగూడదని పద్మపురాణమునందు జెప్పబడియె. స్కాందపురాణమునందును నిటులనే చెప్పబడియె. పుట్టించినవాడును, ఉపనయనమును జేసినవాడును, విద్యనొసంగినవాడును ననుముగ్వురును గురువులనబడుదురు. తండ్రిలేనిసమయమునందు జ్యేష్ఠభ్రాతయైనను, పితృవ్యుడుమొదలగువారెవరైననుపనయనమును జేయవచ్చును. కావున గాయత్రీమంత్రదానమును జేసినవారగుదురుగాన గురువులని యెన్నబడుదురు. అందువలన నేతండ్రియైనను, భ్రాతయైనను గురువని యెన్నబడును. వేదాంతోపదేశమును జేసినవాడు పరమగురువనబడును. అదికారణముగ గురువులు ముగ్గురని యెన్నబడును. ఇతరులు ననుసరింపదగినవాడుగాడు. కావునముగ్గురిలోపల నొక్కడైనను పేడచేయదగినవాడుగాడు. ఇట్లని స్కాందపురాణాంతర్గత నాగరఖండమునందు జెప్పబడియె. గురువును బరిహసించినవాడు నిర్జలమైనయరణ్యమునందు బ్రహ్మరాక్షసుడై పుట్టునని నారదుడువచించె. తండ్రియైనను, గురువైనను, జ్యేష్ఠభ్రాతయైనను, త్వంకారహుంకారములచేత నవమానమును బొందించినవాడు పాపవంతుడగును. మఱియును మరణానంతరమందు ఘోరనరకమునందు బడి యక్కడ ననేకములగు కష్టములను బొంది పిదప భూలోకమునందు బ్రహ్మరాక్షసుడై పుట్టును. కావున నట్టిదోషమునివర్తించిపోవుటకు నాచికేతవ్రతమునాచరించవలయునని స్కాందపురాణాంతర్గతమైన గౌరీకాండయందు జెప్పబడియె. పూర్వమునందు నాచికేతుడను రాజు, ఉద్దాలకుడను పేరుగలగురువునుదిరస్కరించి మరణానంతరమునందు నరకమును బొందెను. పిమ్మటగొన్ని దినములకు భూలోకమునకువచ్చి తండ్రియొక్కయనుమతమును బొంది నలుబదిదినములు గోక్షీరములను మాత్రము పానము చేయుచు సంచరించె. పిమ్మటను

లుబదిదినము లుదకమునుమాత్రమును పానమును జేసిసంచరించెను. అనంతర మందు తండ్రియొక్క యనుమతమును బొంది నమస్కారమును జేసిపరిశుద్ధుడ య్యె. ఇట్లు చేయుటకు సామర్థ్యము లేనివాడు దేహశుద్ధికొఱకు షడబ్దకృచ్ఛ్రము నాచరించవలయును. కలియుగమునందు నాచికేతవ్రతము నాచరించుట దుర్లభము. కావునకలియుగమునందు షడబ్దప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరిం చవలయును. ఇట్లని దేవీపురాణమునందు జెప్పబడె. ఇట్లని హేమాద్రివిరచితమై నగుర్వధిక్షేపప్రాయశ్చిత్తముసమాప్తము॥

అజ్ఞానప్రాయశ్చిత్తమ్.

(౪౮) అథాజ్ఞానప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయపురాణే॥శ్లో॥ విప్రస్తుసతుకులేభూత్వా వేదశాస్త్రాధికారవాన్। అయంగురురియంమాతా జ్యేష్ఠోయంమాతులోపివా। అయంవిద్వానిదంశాస్త్రమాచారోమునిచోదితః। వేదోయందైవతంచేదమిదంతీర్థమియంనదీ॥ ఇతీవసర్వంసహసాశీలంవిస్మృ తవానిహ॥ ఉన్మత్తఇవవర్తేతసోఽనభిజ్ఞఃప్రకీర్తితః ॥ లింగపురాణే॥ శ్లో॥ మాతంపితరంశ్వశ్రూంగురూన్ దేవాంస్తథానలం । విప్రంగాంయతినంనా రీంశపన్నై వసర్వదానరః॥ యోవర్తేతసదాతాతసవిప్రోజ్ఞఇతీరితః। తస్యైవ నిష్కృతిర్దృష్టామునిభిర్ధర్మవిత్తమైః॥ ప్రత్యహందోషశాంత్యర్థంమహాపాతక నాశనం॥ తండులాన్ప్రస్థమాత్రేణపాచయిత్వాచరుంముదా॥ భక్షయేద్దైవ తోద్దేశేమండలేనవిశుద్ధ్యతి। అన్యథాదోషమాప్నోతియథాశూద్రస్తథైవసః॥ ఇతిహేమాద్రివిరచితాజ్ఞానప్రాయశ్చిత్తం॥

(౪౯) అజ్ఞానప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణకులమునందుబుట్టి వేదశా స్త్రాధికారముగలబ్రాహ్మణుడు, ఇతనుగురువనియును, ఇదితల్లియనియును, ఇతనుజ్యేష్ఠుడనియును, ఇతనుమేనమామయనియును, ఇతనువిద్వాంసుడనియు ను, ఇదిశాస్త్రమనియును, ఇదియాచారమనియును, ఇదివేదమనియును, ఇది దైవతమనియును, ఇదితీర్థమనియును, ఇదినదియనియును, తెలియకయున్మత్తు డైసంచరించువాడు, అజ్ఞానియనిచెప్పబడునని మార్కండేయపురాణమునం దుజెప్పబడియె. తల్లిని, తండ్రిని, భార్యయొక్కతల్లిని, గురువులను, దేవతల ను, అగ్నిహోత్రుని, బ్రాహ్మణుని, గోవును, యతిని, స్త్రీని, సర్వకాలము లయందునుదిట్టుచు దిరుగునట్టిమానవు డజ్ఞానియనిచెప్పబడును. అట్టివాడుత ద్దోషశాంతికొఱకు దేవతోద్దేశమునందు నలుబదిదినములదనుక ప్రతిదినమును ప్రస్థమాత్రము తండులములను పచనమును జేసికొనిభుజించవలయును. ఇట్లు చేయనియెడలదోషవంతుడును, శూద్రప్రాయుడునునగునని లింగపురాణము

నందుజెప్పబడినది. ఇట్లని హేమాద్రివిరచితాజ్ఞానప్రాయశ్చిత్తముసమాప్తము॥

—— తండులాద్యపణ్యవిక్రయప్రాయశ్చిత్తమ్. ——

(౫౦) అథతండులాద్యపణ్యవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ శివపురాణే॥ శ్లో॥ తండులాశ్చతిలామాషాఃఫలంపుష్పంతథాగుడం। నాగవల్లీదళంపూగంచూర్ణంకర్పూరమేవచ। కస్తూరీకుంకుమంచూలం దుగ్ధందధిఘృతంతథా। కృష్ణాజినంచరుద్రాక్షాఃబ్రహ్మసూత్రంకమండలుః। తామ్రంకాంస్యంతథావస్త్రంకంబళంరోచనంతథా । లవణంతింత్రిణీశాకః పక్వమన్నంమునీశ్వరాః। ఇమాన్యపణ్యానివిప్రాణాం। ఏతేషామేకైకవిక్రయే బ్రహ్మఘ్నత్వంభవతి॥ కార్పాసతామ్రకాంస్యత్రపుసీసాయఃపిండవిక్రయేపాంచాలజాతిర్మాన్ భవేత్। తదాహమహానారదీయే॥ శ్లో॥ కార్పాసతామ్రకాంస్యాదిసీసాయఃపిండవిక్రయే। పాంచాలజాతిమాన్విప్రోనరకంప్రతిపద్యతే॥ తండులాంశ్చతిలాన్మాషాన్ఫలపుష్పగుడాన్యపి। నాగవల్లీదళంపూగంచూర్ణం కర్పూరమేవచ॥ కస్తూరీంకుంకుమంచూలందుగ్ధందధిఘృతంతథా । కృష్ణాజినంచరుద్రాక్షాన్ బ్రహ్మసూత్రంకమండలుం। తామ్రంకాంస్యంతథావస్త్రం కంబళంరోచనం తథా। తింత్రిణీంలవణంచూలంశాకమన్నంద్విజోయది ॥ విక్రయిత్వాయదా జీవేత్సతుశూద్రోనసంశయః। ఏతానివిక్రయిత్వాతుహవ్యకవ్యానిచాదరాత్ పితరోనోపతిష్ఠంతిశ్రాద్ధకర్తామహానపి। స్వారామసంభవాన్ క్రీత్వాఉచితవ్యయమాచరేత్॥ అన్యథాదోషమాప్నోతిప్రాజాపత్యంసమాచరేత్ ॥ ధనస్యసంగ్రహార్థంతుద్విగుణంకృచ్ఛ్రమాచరేత్॥ ఉచితవ్యయసిద్ధ్యర్థంగవ్యంవిప్రోనవిక్రయేత్। షణ్మాసంలోభతఃక్రీత్వాశూద్రోభవతినిశ్చయః ॥ తత్రక్రీత్వాద్విజగృహేష్వైత్యకాదీనిసంచరేత్। భోక్తారోదోషవంతస్తుకర్తాస్యాత్పాతకీభువి॥ విప్రస్తుపశుమాత్రంచగోరసంవిక్రయేద్యది । తస్యదేహవిశుద్ధ్యర్థంతప్తకృచ్ఛ్రముదీరితం ॥ మాసంపీవిక్రయిత్వాతు చాంద్రాయణముదాహృతం। ఋతుద్వయంతువిక్రీయమండలంయావకంచరేత్ ॥ ఋతుత్రయేయదిక్రీత్వాబ్రహ్మఘ్నస్తస్యవైధ్రువం। షణ్మాసంగోరసంపక్త్వాపీత్వాశుద్ధిమవాప్నుయాత్। అబ్దమాత్రంపయఃక్రీత్వాతావత్పీత్వాశుచిర్భవేత్ । తద్గృహేయోద్విజఃక్రీత్వాపూర్వవన్మాససంఖ్యయా । కుర్యాద్దేహవిశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తంయథాక్రమం॥ షణ్మాసంతత్రయఃక్రీత్వాతావుభౌసమపాపినౌ ॥ తయోరుక్తవిధానేనప్రాయశ్చిత్తంవిశోధనం॥ కృష్ణాజినంచరుద్రాక్షాన్ బ్రహ్మసూత్రంకమండలుం॥ తామ్రంకాంస్యంతథావస్త్రం కంబళంరోచనంతువా। విక్రయిత్వాద్విజోయస్తు మాసంమాసద్వయంతువా ॥ మాసేపూర్ణేపరాత్

స్స్యాద్ద్వితీయేచాంద్రభక్షణం। మాసత్రయేతుసంపూర్ణే మండలంయావకం చరేత్॥ షణ్మాసంవిక్రయిత్వాతుపతితస్స్యాన్నసంశయః॥ కేశానాంవపనం కృత్వాపునర్మౌంజీవిధానతః॥ కృత్వాషణ్మాసపర్యంతంవిప్రముష్టింగవేషితం భుక్త్వాశుద్ధిమవాప్నోతినాన్యథాతస్యనిష్కృతిః॥ లవణంపక్వమన్నంవద్విజో మాసంతువిక్రయేత్॥ సమాద్రయోనిమాసాద్యశూద్రవద్వర్ధతేతథా॥ తస్యైవ నిష్కృతిరియంవత్సరంయావకంచరేత్॥ తస్యోపనయనంభూయఃకృత్వాశు ద్ధిమవాప్యతే॥ రౌరవంనరకంయాతివిప్రోయద్యన్నవిక్రయీ॥ఇతిహేమాద్రివి రచితాపణ్యావిక్రయప్రాయశ్చిత్తం॥

(౫౦) తండులములుమొదలుగాగలవియును. విక్రయింపదగనివియు నునగువస్తువులను విక్రయించుటవలనగలిగిన దోషనివారణార్థకప్రాయశ్చిత్త ము॥ తండులములు, నువ్వులు, మినుములు, ఫలములు, పుష్పములు, గుడ ము, తమలపాకులు, పోకచెక్కలు, చూర్ణము, కర్పూరము, కస్తూరి, కుం కుమము, మూలము, పాలు, పెరుగు, నెయ్యి, కృష్ణాజినము, రుద్రాక్షలు, బ్రహ్మసూత్రము, కమండలు, తామ్రము. కాంస్యము, వస్త్రము, కంబళము రోచనము, లవణము, చింతపండు, శాకము, పక్వాన్నము, అనువస్తువులు విక్రయింపదగనివి. ఈవస్తువులలో నేవస్తువునువిక్రయించినను బ్రహ్మఘ్నదో షమునుబొందును. కార్పాసము, తామ్రము, కాంస్యము, పిత్తళి, సీసము, ఇనుము, అనువస్తువులనువిక్రయించినవాడు పాంచాలజాతియందు బుట్టునని శివపురాణమునందుజెప్పబడియె. మహానారదీయమునందుగూడ నీవస్తువులేవి క్రయింపదగవనిచెప్పబడియె. మఱియును, ఇట్టివస్తువులనువిక్రయించినవాడు శూద్రతుల్యుడగుననియును, ఇతనియొక్క హవ్యకవ్యముల నీతనిపితృదేవతలు గ్రహింపరనియును, చెప్పబడియె. స్వారామసంభవములగు వస్తువులనుగాని యుచితవ్యయమునుజేయవలయును. అట్లుగాదేని దోషవంతుడగును. అట్టిదో షనివృత్తికొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. ధనమునుసం పాదించుటకొఱకువిక్రయించినయెడల ద్విగుణముగకృచ్ఛ్రవ్రతము నాచరించవ లయును. ఉచితవ్యయసిద్ధికొఱకైనను గవ్యమునువిక్రయింపగూడదు. లోభ మువలననాలుమాసములదనుక నీవస్తువులనువిక్రయించువాడు నిశ్చయముగ శూద్రుడేయగును. విప్రగృహమునందీవస్తువులనుగొని శ్రాద్ధాదులనాచరింప గూడదు. అట్లునేసినయెడలభోక్తలు శేషవంతులగుదురు. శ్రాద్ధకర్తపాతకి యగును. బ్రాహ్మణుడగువాడొకమాసముదినములు గోరసమునువిక్రయిం చినయెడలపాపనివృత్తికొఱకు తప్తకృచ్ఛ్రము నాచరించవలయును. మాసము

దినములువిక్రయించినవాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. నాలుగుమాసములకాలమువిక్రయించినవాడునలుబదిదినములు యావకాహారుడు కావలయును-ఆఱుమాసములువిక్రయించినవాడుబ్రహ్మహత్యకుతుల్యమయిన పాపమునుబొందును. తత్పాపశాంతికొఱకు, ఆఱుమాసములు గోరసమునుపచనమునుజేసి త్రాగినయెడల పరిశుద్ధుడగును. సంవత్సరకాలము గోక్షీరమునుకొని(త్రా)గినవాడపరిశుద్ధుడగును. గోరసమునకుబదులెనే దీనికిమాససంఖ్యానుసారముగప్రాయశ్చిత్తమునుజేసికొనవలయును. కృష్ణాజినము, దర్భలను, యజ్ఞోపవీతమును, కమండలువును, తామ్రమును, కాంస్యను, ఆప్రకారముగానేవస్త్రమును, కంబళమును, రోచనమును, ఒకటిమాసమైనను, రెండుమాసములైనను, విక్రయించినవాడుపాపాత్ముడగును. ఒకటిమాసముపూర్ణమైనపిమ్మట పరాకకృచ్ఛ్రమునాచరించవలయును. రెండుమాసములయ్యేనేని చాంద్రభక్షణమునాచరించవలయును. మూడుమాసములుసంపూర్ణములయినపిమ్మట నలుబదిదినములు యావకాహారుడుగావలయును. ఆఱుమాసములువిక్రయించినవాడు పతితుడగును. కావుననట్టివాడుకేశవపనమునుజేయించికొని మరలమౌంజీబంధనమునుజేసికొని యారుమాసములపర్యంతమును, విప్రముష్టినిగవేషితమునుజేసినయెడల పరిశుద్ధుడగునుగాని మఱియొకవిధముచేత నతడుపరిశుద్ధుడుగానేరడని యభిప్రాయము. ఉప్పును, పక్వాన్నమును, మాసముదినములు విక్రయించినబ్రాహ్మణుడు శూద్రత్వమునుబొందును. అట్టివాడుతద్దోషపరిహారముకొఱకు సంవత్సరకాలము యావకాహారమును జేయవలయును. పిమ్మటనుపనయనమునుజేసి పరిశుద్ధతనుబొందును. అన్నమునువిక్రయించువాడు రౌరవనరకమునుబొందునని మహానారదీయమునందుజెప్పబడియె. ఇట్లనిహేమాద్రివిరచితాపణ్యవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

——(*)నిందితార్ఘోపజీవనప్రాయశ్చిత్తమ్. (*)——

(౫౧)అథనిందితార్ఘోపజీవనప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ శ్లో॥ అశ్వోథేనుర్మనుష్యశ్చ రాసభఃకుంజరస్తథా॥ కన్యానారీమేషబస్తౌక్షుస్త్రకంబ్రహ్మసూత్రకం॥ లవణంపలలంచర్మలశునంగృంజనంతథా॥ శుంఠీపిప్పలిమారీచాన్ లవంగైలాహరిద్రకాన్॥ ఔషధానీహయావంతిమత్స్యకుక్కుటసూకరాన్॥ హింగుజీరకవస్త్రాని తామ్రం కాంస్యాదికంతథా।ఏతాన్మూల్యైశ్చ్యైకజఃక్రీత్వాసలాభైర్మూల్యసంఖ్యయా। తేభ్యశ్చద్విగుణైర్మూల్యైరల్పమూల్యమథాపివా॥ విక్రయిత్వాత్మభరణంకుర్యాద్యదిహపాపభాక్॥ మృత్వానరకమాసా

ద్వ్యక్రమికూపెపతత్యధః॥ తస్మాదేతద్విశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్త మిహోచ్యతే॥ సకృద్వాథద్విర్వారంవా బహువారమనేకశః। తప్తంపరాకంచాంద్రంచ యావకంవర్ణమాచరేత్ । తస్యోపనయనంభూయః పంచగవ్యేనశుద్ధ్యతి॥ ఇతి హేమాద్రివిరచితే నిందితార్థోపజీవనప్రాయశ్చిత్తం॥

(౫౧) నిందితార్థోపజీవన ప్రాయశ్చిత్తము॥ అశ్వము, ధేనువు, మనుష్యుఁడు, గాడిదె, ఏనుఁగు, కన్నియ, స్త్రీ, మేక, గొఱ్ఱె, పుస్తకము, యజ్ఞోపవీతము, లవణము, పలలము, చర్మము, లశునము, గృంజనము, శొంఠి, పిప్పలి, మిరియములు, లవంగములు, ఏలకులు, పసుపు, మొదలగు సౌషధములను, మత్స్యము, కుక్కుటము, సూకరము, ఇంగువు, జీలకఱ్ఱ, మొదలగువస్తువులను, తామ్రము, కాంస్యము, మొదలగులోహములను, బ్రాహ్మణుఁడగువాఁడుకొని ద్విగుణితలాభమునకు విక్రయించినను, తక్కువవెలకమ్మినను, దోషవంతుఁడగును. కావుననిట్టిపాపకృత్యము నాచరించినవాఁడు మాసాదిక్రమముగ తప్తకృఛ్రము, పరాకకృఛ్రము, చాంద్రాయణము, సాంవత్సరికయావకాహారమును, ఆచరించవలయును. కావున నిట్టివాఁడు పునరుపనయనసంస్కారమునుబొంది పంచగవ్యప్రాశనమును జేసినయెడల పరిశుద్ధుఁడగునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడెను. ఇట్లని హేమాద్రివిరచితనిందితార్థోపజీవన ప్రాయశ్చిత్తము సమాప్తము.

——— ❋ వృధాకృషీవలప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౫౨) అథవృధాకృషీవలప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ శ్లో ॥ వత్సరస్యాగ్నిహోత్రార్థం కుటుంబభరణంతథా। యావతాధాన్యజాలేన తావతాకృషిమాచరేత్॥ ధాన్యేగృహగతేపశ్చాద్భాగంవింశతమవ్యయం॥ కృత్వాతిథిభ్యస్సత్కారీవైశ్వదేవపరాయణః । దగ్ధంచపూర్ణమాసంచాప్యగ్నిహోత్రందినేదినే। సంవత్సరేపశుంకృత్వాశుద్ధిమాప్నోతిపూర్వజః॥ కృషిదోషేణమహతాకదాచిన్నవిలిప్యతే॥ అన్యథాదోషమాహ ॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ వృధాకృషింద్విజఃకృత్వాధాన్యంతద్విక్రియేతవా । భోగార్థంసంచితార్థంవా మహాపాపంసమశ్నుతే॥ వత్సరేధాన్యవిక్రేతాకృషింకృత్వాథయోద్విజః॥ తస్యదేహవిశుద్ధ్యర్థం మునిభిశ్చాంద్రమీరితం॥ ద్వితీయేద్విగుణంప్రోక్తం తృతీయేపతితోభవేత్ ॥ వత్సరత్రయంకృష్యద్భవంధాన్యం ద్విజోధనార్థంవిక్రీయపతిత ప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధిమాప్నోతీత్యర్థః ॥ ఇతి హేమాద్రివిరచితే వృధాకృషీవలస్యప్రాయశ్చిత్తం॥

(౫౨) వ్యర్థముగా భూమినిదున్నువానికిఁ బ్రాయశ్చిత్తము॥ ఒకట

సంవత్సరకాలమగ్నిహోత్రాది కృత్యముల నెరవేర్చుటకొఱకును, కుటుంబమును బోషించుటకొఱకును దగిన ధాన్యమునకుఁగా భూమిని దున్నవలయును. ధాన్యము గృహమునకుఁ దెచ్చినపిమ్మట నిరువదవభాగమును వ్యయముచేయవలయును. మఱియు సర్వకాలములయందును నతిథిసత్కారమును జేయవలయును. వైశ్వదేవపరాయణుండు గావలయును. ప్రతిదినము సంధ్యను నగ్నిహోత్రవ్రతముల నాచరించవలయును. ఇంతియగాక దర్శపూర్ణమాసవ్రతముల నాచరించవలయును. పిదప సాంవత్సరికపశువును జేసెనేని బ్రాహ్మణుండగువాడు పరిశుద్ధుడగును. ఇట్లు చేసినయెడల కృషిదోషమును బొందడని లింగపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుండగువాడు నిరర్థకముగ కృషిచేసి భోగముకొఱకైనను, సంచితముకొఱకైనను ధాన్యమును విక్రయించినవాడు మహాపాపమును బొందును. సంవత్సరకాలముదనుక ధాన్యమును విక్రయించినవాడు తద్దోష నివారణము కొఱకు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. రెండుసంవత్సరము లీకృత్యమును జేసినవాడు రెండు చాంద్రాయణవ్రతముల నాచరించవలయును. మూడుసంవత్సరములకాలము విక్రయించినవాడు పతితప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితమైనధర్మశాస్త్రమునందు వృథాకృషీవలప్రాయశ్చిత్తము సమాప్తము.

——* నిందితధనాదానప్రాయశ్చిత్తమ్. *——

(౫౩) నిందితాద్ధనాదానప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ శ్లో॥ బ్రహ్మహంతాసురాపీచ స్తేయీగుర్వంగనాగమః॥ మహాపాతకినశ్చైతే తత్సంయోగీచ పంచమః॥ కుండశ్చగోళకశ్చైవ తథాసోమలతాక్రయీ॥ పరివిత్తిఃపరీవేత్తా పరివిన్నశ్చవైతథా॥ తథాపరివిదానశ్చ దత్తాగ్నిః కీకసానుగః। స్మృతివిక్రయికశ్చైవపరార్థంకాశికాగమః॥ ధర్మవిక్రయికశ్చైవ తథాశూద్రాపతిర్ద్విజః। నామవిక్రయికశ్చైవకానీనోవృషలీపతిః॥ తథైవ భృతకాధ్యాయీతులాస్వకృతశుద్ధిమాన్॥ తులాస్వితిబహువచనం దూష్యరత్నాదితులోపలక్షణం॥ షోడశమహాదానోపలక్షణంవా॥ శ్లో॥ దుశ్చర్మాక్షయరోగీచ కునఖీశ్యావదంతకః। గ్రామణీశ్చారువాకశ్చ గాయకోనర్తకస్తథా॥ పరదారాభిగామీచభిషగ్గవలకస్తథా। ఏతేవైనిందితారాజన్ హవ్యకవ్యేషుసర్వదా॥ నసంభాష్యాస్సదావిప్రైః పరలోకపరాయణైః॥ ఏతేభ్యోయాజనాద్రాజన్నుతపుణ్యేపరిగ్రహాత్॥ యాగార్థంనిత్యలాభార్థంసప్రతిగ్రహాణంచరేత్॥ దృష్ట్వా... స్తుండమాలోకే తస్సంభాష్యద్విజభాషణం। ను

ర్యాదితి శేషః॥ స్పృష్ట్వా సచేలస్స్నాయీత చాంద్రం ధాన్యపరిగ్రహే ॥ స హైవభోజనం కృత్వా చాంద్రద్వయముదీరితం । స్వర్ణమాత్రం ద్విజోయస్తు ప్రతిగృహ్యానుకర్మసు॥ యోజయేద్యదిమూఢాత్మా షడబ్దం కృచ్ఛ్రమాచరేత్॥ ఇతి హేమాద్రౌ నిందితధనాదానప్రాయశ్చిత్తం॥*॥

(౫౩) నిందితధనాదాన ప్రాయశ్చిత్తము ॥ బ్రహ్మహత్యను జేసినవాఁడును, సురాపానమును జేసినవాఁడును, దొంగతనమును జేసినవాఁడును, గురుభార్యాగమనమును జేసినవాఁడును మహాపాతకు లనఁబడుదురు. వీరియొక్క-సహవాసమును జేసినవాఁడును మహాపాతకుఁడని యెఱుంగవలయును. కుండుఁడు, గోళకుఁడు, యజ్ఞమును విక్రయించినవాఁడును, పరివిత్తిపరివేత్తలును, పరిపిన్నుఁడును, పరివిదానుఁడును, దత్తాగ్నికలవాఁడును, కీకసములననుసరించినవాఁడును, స్మృతులను విక్రయించువాఁడును, ఇతరులనిమిత్తము కాశికిఁబోవువాఁడును, ధర్మమును విక్రయించినవాఁడును, శూద్రస్త్రీని భార్యనుగా గ్రహించినవాఁడును, పేరును విక్రయించుకొన్నవాఁడును, కాసీనుఁడును, వృషలీపతియును, భృతకాధ్యాయియును, రూప్యరత్నాదిలోపములను గనిపెట్టువాడును, దుశ్చర్మముగలవాడును, క్షయరోగముగలవాడును, కుత్సితమైనగోళ్ళుగలవాడును, పుప్పిదంతములుగలవాడును, గ్రామణియును, చారువాకుడును, గాయకుడును, నర్తకుడును, పరదారాభిగమనమును జేయువాడును, వైద్యుడును, దేవలుడును, ననువారు హవ్యకవ్యములయందు నిందితులనబడుదురు. ఇట్టివారితో బ్రాహ్మణులు సర్వకాలములయందును సంభాషింపగూడదు. ఇట్టివారివలన యాగముకొఱకును, నిత్యలాభముకొఱకును, ప్రతిగ్రహమును జేయగూడదు. ఇట్టిపాపాత్ములనుజూచినను, సంభాషించినను, సూర్యునిజూడవలయును. అట్టివారలస్పృశించినయెడల సచేలస్నానమును జేయవలయును. వీరివలన ధాన్యమునుగ్రహించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. ఇట్టిపాపాత్ములతోఁగూడి భోజనమును జేసినవాఁడు రెండుచాంద్రాయణముల నాచరించవలయును. ఇట్టి పాపాత్ములయొక్క పుణ్యకర్మలయందు స్వర్ణమును గ్రహించినవారు, షడబ్దకృచ్ఛ్రము నాచరించవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితమైన ధర్మశాస్త్రమునందునిందితధనాదాన ప్రాయశ్చిత్తము సమాప్తము.

——* వార్ధుష్యజీవః ప్రాయశ్చిత్తమ్. *——

(౫౪) అథవార్ధుష్యజీవనప్రాయశ్చిత్తమాహ॥ వృద్ధహారీతః॥

శ్లో॥ వృద్ధేరపిచయావృద్ధిశ్చక్రవృద్ధిరుదాహృతా ॥ మాసిమాసి చయావృద్ధిస్సాశిఖావృద్ధిరుచ్యతే॥ తాభ్యాంజీవేద్యదావిప్రస్సవార్ధుషిక ఉచ్యతే । పైతృకాదీఃకర్మాణి దేవకార్యాణియానిచ॥ తానిసర్వాణివిప్రేంద్ర నిష్ఫలంయాంతిసర్వదా॥ ధర్మశాస్త్రవిరుద్ధేన జీవయేద్యదిపూర్వజః॥ అస్వర్గ్యంలోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్నతు॥ ధర్మోవిప్రస్యపాథేయం స్వర్గారోహణకర్మణి॥ విప్రేంద్రనిష్ఫలంయాంతి తానిసర్వాణిసర్వదా॥ తస్మాదిదంపరిత్యాజ్యంవార్ధుష్యంప్రసత్తమైః॥ తస్యైషానిష్కృతిర్దృష్టా పారాశర్యేణచక్షుషా। మాసంజీవేద్యదావృద్ధ్యాతదాపారాకముచ్యతే॥ మాసద్వయేచతప్తం స్యాచ్చాంద్రంమాసత్రయేస్మృతం । షణ్మాసేతుమహాచాంద్రం వత్సరేద్విగుణంచరేత్॥ పతితస్స్యాత్పరంవిప్ర స్సర్వకర్మబహిష్కృతః ॥ సంవత్సరాదూర్ధ్వం వార్ధుష్యజీవనః పతితప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధిమాప్నోతి॥ *॥ ఇతి హేమాద్రివిరచితే వార్ధుష్యజీవనప్రాయశ్చిత్తం॥

(౫౪) వడ్డీవలనజీవించువానికిఁ బ్రాయశ్చిత్తము॥ వడ్డీకివడ్డీఁకట్టిన యెడల, ఆవడ్డీచక్రవడ్డీ యని చెప్పఁబడును. నెలనెలకునుదీసికొను వడ్డీశిఖావడ్డీ యని చెప్పఁబడును. ఈరెండువిధములయిన వడ్డీచేత జీవించువాఁడు వార్ధుషికుఁడనఁబడును. ఇట్టివానియొక్క పితృకర్మలును, దేవకార్యములును, మఱియు నితరములగు పుణ్యకార్యములును నశించును. బ్రాహ్మణుఁడగువాఁడు ధర్మశాస్త్రవిరుద్ధముగ జీవింపఁదగదు. స్వర్గఫలమునివ్వనిదియును, లోకవిద్విష్టమును నగు ధర్మమును నాచరింపఁగూడదు. ధర్మమనునది బ్రాహ్మణునకు స్వర్గారోహణకర్మయందు పాథేయమని యెఱుంగవలయును. వడ్డీవలన జీవించువానియొక్క పుణ్యకర్మలన్నియును నిష్ఫలములగును. అందువలన బ్రాహ్మణుఁడగువాఁడు వడ్డీవలనజీవించుటను వదలవలయును. ఒక్కమాసముదినములు వడ్డీచేత జీవించినవాఁడు ప్రాయశ్చిత్తార్థముగ పరాకకృచ్ఛ్రమునాచరించవలయును. రెండుమాసములయ్యేనేని తప్తకృచ్ఛ్రము. మూఁడుమాసములయ్యేనేని చాంద్రాయణము నాచరింపవలయును. ఆఱుమాసములకు మహాచాంద్రము. సంవత్సరమయ్యేనేని మహాచాంద్రమును ద్విగుణముగఁ జేయవలయును. సంవత్సరానంతరమందు పతితుఁడగును, కావున వానికిపతితప్రాయశ్చిత్తమును. జేయవలయునని పరాశరమతానుసారముగ నృసింహపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లుహేమాద్రివిరచితమగు నవార్ధుష్యజీవనప్రాయశ్చిత్తము సమాప్తము.

——— * హింసాయంత్రవిధానప్రాయశ్చిత్తమ్. * ———

(౪౪) అథహింసాయంత్రవిధానప్రాయశ్చిత్తమ్ తత్ర స్కాందే॥ గౌరీకాండే॥ శ్లో॥ మనుష్యపశుపక్ష్యాది హింసనే యంత్రకృత్రిమం॥ మార్గేరణ్యేజలేవాపి పర్వతేచైత్యవృక్షకే॥ దేవాలయె సభాయాంచ హింసార్థం యంత్రధారణం॥ యంత్రస్వరూపమాహ॥ గజబంధనేషువసుఖననం। అశ్వపశుమనుష్యబంధనే మార్గేషుశ్వభ్రనిర్మాణం॥ అరణ్యేపశుపక్షిహింసనార్థం జాలవాగురాస్తరణం॥ పర్వతేషువ్యాఘ్రభల్లూకవరాహాదిహింసార్థందాహః॥ జలేషుమనుష్యమారణార్థంశంక్వాదిస్థాపనం॥ గృహేషుమూషికాదిహననార్థంఫలకాదిభిర్యంత్రవిధానం॥ వృక్షేషుశుకశారికాచటకాదిహననార్థంగ్రీవారజ్జ్వాదికరణం। ఏతానియంత్రవిధానాని శాస్త్రగర్హితాని॥ ఏతానిద్విజస్సంగదోషాత్స్వయంవాకృత్వానరకమాప్నోతి॥ * ॥ తదాహ గౌతమః॥ శ్లో॥ పర్వతేవాజలేవాపి గృహేవారణ్యదేశతః॥ ద్విజఃకుర్యాత్సంగదోషాద్ధింసాయంత్రవిధారణం। సవైనరకమాసాద్య పునర్యయుర్జాయతేభువి। తస్యదోషవిశుద్ధ్యర్థం పరాకద్వయమీరితం॥ సంవత్సరాత్పరంరాజకర్చాం ద్రవ్యముదాహృతం। అతఃపరంనశుద్ధస్స్యాద్వృథావ్యాధస్తథైవసః॥ సంవత్సరాత్పరంపోత్రియంత్రనిర్మాణేపతిత ప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధిమాప్నోతి॥ *॥ ఇతిహేమాద్రివిరచితే ధర్మశాస్త్రేప్రాయశ్చిత్తాధ్యాయే హింసాయంత్రవిధానప్రాయశ్చిత్తం॥ ఇత్యుపపాతకప్రాయశ్చిత్తప్రకరణం॥*॥

(౪౪) హింసాయంత్రవిధాన ప్రాయశ్చిత్తము॥ మార్గము, అరణ్యము, జలము, పర్వతము,రథ్యావృక్షము, దేవాలయము, సభ, మొదలగువానియందు, మనుష్య,పశు, పక్ష్యాది, హింసకొఱకు యంత్రములననిర్మించుట దోషమనఁబడును. గజబంధనమునందు భూఖననము, అశ్వ,పశు, మనుష్యబంధనమునకుగాను మార్గములయందు గోతులను నిర్మించుట, అరణ్యమునందుపశుపక్షిహింసకొఱకు జాలవాగురములను పరచుట, పర్వతములయందు వ్యాఘ్రభల్లూకాదులను జంపుటకొఱకు దాహము, జలములయందు మనుష్యులను జంపుటకొఱకు శంక్వాదులనుపాతుట, గృహములయందు మూషికాదులను జంపుటకు దారుఫలకాదులచేత యంత్రములననిర్మించుట, వృక్షములయందు శుకశారికాదులనుబట్టుటకొఱకు గ్రీవారజ్జ్వాదికరణము, అనునవి బ్రాహ్మణులకుఁ దగిన కృత్యములుగావు. ఇట్టికృత్యములను జేసినవారు నరకలోకమును బొందుదురని స్కాందపురాణాంతర్గతగౌరీకాండయందుఁ జెప్పఁబడె. పర్వతమునందైనను, జలమునందైనను, గృహమునందైనను,అర

న్యప్రదేశమునందైనను, బ్రాహ్మణుఁడగువాఁడు సంగదోషము వలన హింసాయంత్ర నిర్మాణమును జేసిన యెడల నరకమును బొందును. మఱియు రెండవజన్మయందు వేటవలన జీవించువాఁడై జీవించును. అట్టి దోషనివృత్తికొఱకు పరాకకృఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయును. ఇట్టి దుష్కృత్యముల నొక్కసంవత్సరము దనుక చేసినవాఁడు మూఁడుచాంద్రాయణముల నాచరించవలయును. సంవత్సరానంతరమందుగూడ నిట్టిదుష్కృత్యములను జేసినవాఁడు సాధ్యాద్వ్యథుఁడగును. సంవత్సరానంతరమందుగూడ నిట్టిదుష్కృత్యముల నాచరించువాఁడు పతితప్రాయశ్చిత్తమును జేసికొనిన యెడల పరిశుద్ధుఁడగునని గౌతమమునివరుఁడు వచించె. ఇట్లని హేమాద్రి విరచిత ధర్మశాస్త్రము నందలి ప్రాయశ్చిత్తాధ్యాయమునందు హింసాయంత్రవిధానప్రాయశ్చిత్తము సమాప్తము.

—* సంకలీకరణప్రాయశ్చిత్తమ్. *—

(౫౬) అథసంకలీకరణ ప్రాయశ్చిత్తమాహ ॥ బ్రహ్మాండపురాణే॥ శ్లో॥ అజ్ఞాతకులనామాన మన్యదేశాదుపాగతం బ్రాహ్మణంక్షత్రియంవాపి వైశ్యంపాదజమేవవా॥ భ్రామయిత్వానరంవిప్ర స్త్ర్యాదివిధాభి రాదరాత్॥ విక్రయిత్వానరః పాపీ జీవమేద్యదిమోహితః। మహాపాతకిసంజ్ఞస్స్యాత్ స హత్వానరకమశ్నుతే॥ ౧॥ త్రైంగః॥ శ్లో॥ మోహయిత్వాపథిస్థం త్రైరన్యదేశాదుపాగతం॥ అజ్ఞాతకులనామానంవిక్రయేద్యః పూర్వజః॥ న తస్యనిష్కృతిర్దృష్టా బ్రహ్మహత్యాంచవిందతి॥ నృసింహపురాణే॥ శ్లో॥ పూర్వజః పూర్వజం వాపి బాహుజోరుజపాదజాన్। వశీకృత్యైషధైస్సంత్రైర్విక్రయేద్యదిపాపధీః। న తస్యపునరావృత్తిర్యమలోకాత్కథాచన॥ స్కాందే॥ శ్లో॥ ముఖజః పాపధీస్మర్త్యం రాజానంవావణిక్పతిం। శూద్రంవాభ్రామయిత్వాతు హత్యౌషధాద్యైర్వశీకృతైః॥ విక్రయిత్వాపరస్మైతం యమలోకంసగచ్ఛతి। పునర్భువముపాగమ్య సూనురేవభవేత్పునః॥ విప్రోప్రపంచలాత్కృత్వా కుర్యాదాత్మవిశోషణం। తస్యైషానిష్కృతిర్దృష్టా మనునారదగాలవైః॥ క్షత్రియేతునసబ్ధంస్యాద్వైశ్యేపాదోనమాచరేత్॥ శూద్రేత్వర్థంసంకరేతు పాదం కృత్వావిశుద్ధ్యతి॥ విప్రంయః క్షత్రియోహృత్వా విక్రయేత్పాపబుద్ధిమాన్॥ బ్రహ్మహత్యావ్రతంకృత్వా శుద్ధిమాప్నోతిపాతకీ। అథవాగోసహస్రంతు దత్వాశుద్ధిమవాప్నుయాత్॥ తదర్ధేనైవశుద్ధస్స్యాన్నూరజోవిప్రవిక్రమే॥ శూద్రోవిక్రయతేవిప్రం మాసల్యంతస్యనాన్యథా॥ సంకరోవిక్రయేద్విప్రం శూద్రవన్మాసలంచరేత్॥ సంక[illegible] శూద్రవన్మాసల్యమర్హతి॥

విశేషమాహ॥ గారుడపురాణే॥ శ్లో॥ బాలేచాంద్రాయణంప్రోక్తం పౌగండే తద్ద్వయంచరేత్। తరుణేతుమహాచాంద్రం ప్రౌఢేప్రోక్తంతుతత్త్రయం॥ జీర్ణేతువిక్రయంకృత్వా సహస్రంకృచ్ఛ్రమాచరేత్। విప్రజాత్యాదిస్త్రీణాం మనుష్యవిక్రయప్రాప్తౌ తత్తత్ప్రాయశ్చిత్తార్ధం వేదితవ్యం॥ ఇతిహేమాద్రౌమనుష్యవిక్రయప్రాయశ్చిత్తం॥*॥

(౫౮) సంకలీకరణప్రాయశ్చిత్తము॥ అజ్ఞాతకులనామధేయములుగలవాఁడును, దూరదేశమునుండి వచ్చినవాఁడును, నగు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులలో నెవ్వనినైనను, ఔషధాదులచేత మోసమును బొందించి విక్రయించినవాఁడు మహాపాతకి సంజ్ఞగలవాఁడగును. అట్టి మరణానంతరమందు నరకలోకమును బొందునని బ్రహ్మాండ పురాణమునందుఁ జెప్పఁబడియె. అన్యదేశములనుండివచ్చినవానిని, ఔషధములచేతను, మంత్రములచేతను మోహమును బొందించి విక్రయించిన బ్రాహ్మణుఁడు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమునకుఁ దుల్యమైనప్రాయశ్చిత్తమును బొందినయెడల పరిశుద్ధుఁడగునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు, బ్రాహ్మణునైనను, క్షత్రియ వైశ్యశూద్రులను, ఔషధములచేతను, మంత్రములచేతను విక్రయించిన యెడల నట్టివానికి పునరావృత్తిరహితమగు పాపలోకమును బొందునని నృసింహపురాణమునందుఁ జెప్పఁబడియె. పాపబుద్ధిగల బ్రాహ్మణుఁడు, రాజునైనను, కోమటినైనను, శూద్రునైనను, ఔషధాదులచేత భ్రాంతినిబొందించి విక్రయించిన యెడల మహాపాపవంతుఁడగును. అదికారణముగ నరకలోకమును బొందును. పిమ్మట సూనరియై పుట్టును. బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణునికపటము వలన విక్రయించి యాత్మపోషణమును జేయునెడల తత్పాపనివృత్తి మనునారదగాలవాదులచేతఁ జెప్పఁబడియె. క్షత్రియునియందు షడబ్దకృచ్ఛ్రము నాచరింపవలయును. వైశ్యునియందు పాదోనప్రాయశ్చిత్తము నాచరింపవలయును. శూద్రునియందు సగము, సంకరునియందు పాదమును జేసిన యెడల పరిశుద్ధుఁడగును. క్షత్రియుఁడు బ్రాహ్మణుని హరించినయెడల బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమును జేసినగాని పరిశుద్ధుఁడగును. అట్లు గాదేని వేయిగోవులను దానముచేసిన యెడల పరిశుద్ధుఁడగును. వైశ్యుఁడు బ్రాహ్మణుని విక్రయించినయెడల క్షత్రియునకుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రుఁడు బ్రాహ్మణుని విక్రయించిన యెడల మాసల్యావధకుఁబాతుకుఁడగును. సంకరజాతివాఁడు శూద్రునివిక్రయించినపుడును మాసల్యావధకర్హుఁడగునని సారం.

దపురాణమునందుఁ జెప్పఁబడియె. బాలవయస్సుగల బ్రాహ్మణునియందు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. పౌగండవయస్సుగల బ్రాహ్మణునియందు రెండుచాంద్రాయణము లాచరించవలయును. తరుణునియందు మహాచాంద్రమును విధించవలయును. ప్రౌఢునియందు మూఁడుమహాచాంద్రముల నాచరించవలయును. ముసలిబ్రాహ్మణునియందు వేయికృఛ్రములనాచరించవలయును. విప్రజాత్యాది స్త్రీలయొక్క విక్రయమునందు, అవ్వియ్యేప్రాయశ్చిత్తములయందు సగము నాచరించవలయునని గారుడపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు మనుష్యవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము.

——※ ఆత్మవిక్రయ ప్రాయశ్చిత్తమ్. ※——

(౪౭) అథాత్మవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ స్కాండే॥ పాతాళఖండే॥ శ్లో॥ పానమక్షాస్త్రియశ్చైవ మృగయాచోగ్రదండనం॥ అతీవపరుషంవాక్యం సర్వస్వందానమేవచ॥ ఏతాస్సప్తవ్యసనాని॥ అథపరాణివ్యసనసమానాని॥ శ్లో॥ అనృతంగంధపుష్పాణాంసేవనందోషచారణం। సదాతాంబూలవస్త్రాణాం భోగోయందోషసాధనం॥ ఋణంకృత్వా ఘృతంక్రీత్వా ప్రత్యహంభోజనేస్పృహా॥ స్వస్యాకించన్యమజ్ఞాత్వా ఋణంకృత్వావ్యయం చరేత్॥ ఏవంభోగాసక్తచిత్తః క్రీత్వాత్మానంనవర్తమేత్॥ వర్షంవాథతదర్థంవాభవదాధీనమాచరే॥ ఇతీవసంవిదంకృత్వా వర్తయేద్యదిపాపధీః॥ నిత్యకర్మాణికామ్యాని ఇష్టాపూర్తాదికానిచ। సర్వంతస్యైవభవతి స్వయంవైనిష్ఫలోభవేత్॥ అగ్నౌదగ్ధం జలేమగ్నం భూమౌనిపతితంచయత్॥ తత్సర్వం పరలోకాయ దద్యాత్తేనష్టంవినశ్యతి॥ పతితస్సభవేత్పాపీభ్రష్టశ్శాస్త్రైర్నిత్యకర్మణాం॥ నరకేనియతంవాసః పాపకారీభవేద్యతః॥ తస్యైవ నిష్కృతిర్దృష్టా మునిభిర్ధర్మకోవిదైః॥ హిరణ్యగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్త వత్సర్వంకుర్యాత్॥ ఇతి హేమాద్రివిరచితాత్మవిక్రయణప్రాయశ్చిత్తం॥

(౪౭) ఆత్మవిక్రయ ప్రాయశ్చిత్తము॥ కల్లుద్రాగుట, ద్యూతమాడుట, వ్యభిచారమును జేయుట, వేటాడుట, కఠినముగదండించుట, అతిపరుషములగు మాటలాడుట, సమస్తధనమును దానముసేయుట, అనునవి సప్త వ్యసనములనఁబడునని స్కాందపురాణాంతర్గత పాతాళఖండమందుఁ జెప్పఁబడెను. అసత్యమాడుట, అపరిమితముగ గంధపుష్పాక్షతాదులను సేవించుట, దోషచారణము, సర్వకాలములయందును తాంబూలాదుల ననుభవించుట, ఋణమునుజేసి ఘృతాదులను ప్రాశనముసేయుట, తాను దరిద్రుఁ

(౧౭) హేమాద్రిప్రాయశ్చిత్తకాండము- తెనుగుతాత్పర్యసహితము. గర్భా

డని తెలియక ఋణమును జేసి వ్రయము జేయుట. తనను విక్రయించుకొని జీవించుట, సంవత్సరకాలమయినను, అర్ధసంవత్సరకాలమైనను నొకనికి పని చేయుదునని ముందుగ ద్రవ్యమును గొనుట, అను దుష్కృత్యములను జేయువానియొక్క- హవ్యకవ్యాదికర్మలన్నియును నిష్ఫలమగును. అగ్నియందు దగ్ధమైనదియును, ఉదకమునందుఁ బడిపోయినదియును, భూమియందుఁ బడిపోయినదియును, పరలోకమున కుపయోగించును. ద్యూతాది దుర్వ్యసనములయందు నష్టమైనద్రవ్యము పరలోకసుఖముకొఱ కుపయోగనుగానేరదు. మఱియు ద్యూతాది పాపకర్మలను జేయువాఁడు పతితుఁడగును. అదికారణముగ నరకలోకమునందుఁబడి యధికకష్టములనుబొందును. కావున నీపాపమునకొఱకు హిరణ్యగర్భ ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమునకుఁ దుల్యమగుప్రాయశ్చిత్తము నాచరించవలయును. అట్లుగా నాప్రాయశ్చిత్తమునే యాచరించవలయుననియును సారాందవురాణాంతర్గత పాతాళఖండమునందు జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితాత్మ విక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము.

## ❋ సుతవిక్రయప్రాయశ్చిత్తమ్. ❋

(౧౮) అథసుతవిక్రయ ప్రాయశ్చిత్తమాహ ॥ కూర్మపురాణే॥ శ్లో॥ యోవిప్రోధనలోభేన స్వసుతంవిక్రయేద్యది॥ సవైపిశాచతాంయాతి యావదాభూతసంప్లవం॥✻॥ లైంగే॥ శ్లో॥ గృహదాహోదారనాశో దేహస్పీడాసుతాత్మనోః॥ రాజాహరతిసర్వస్వం పశవశ్చైవనాశితాః ॥ బాంధవైశ్చపరిత్యాగో హ్యన్నవస్త్రవిహీనతా॥ అష్టాకష్టాఇమేరాజన్ సంభూతేష్వేషుమానవః । సుతంనవిక్రయేత్సోపి సవైపైశాచజన్మవాన్॥ అహోకష్టమహోకష్ట మహోకష్టందరిద్రతా॥ తత్రాపిపుత్రదారాణాంచాహుశ్యమతికష్టతా । ఔరసంవాసపత్నీజం నద్విజోవిక్రయంచరేత్ ॥ సఏవనరకంభుక్త్వా పిశాచత్వమవాప్నుయాత్॥✻॥ గారుడపురాణే॥ శ్లో॥ ఆసత్సుధనలోభాద్వామహాకష్టేమెషుభూమిప॥ ఔరసంవాన్యజంవాపిద్విజోయదివానిక్రయేత్॥ సఏవనరకాన్భుక్త్వా పిశాచత్వమవాప్నుయాత్॥ తద్దోషపరిహారార్థం మహాసాంతపనంచరేత్॥ బాలేసాంతపనంప్రోక్తం పౌగండేతద్ద్వయంస్మృతం॥ కౌమారేప్రౌఢకాలేతు మహాసాంతపనత్రయం। స్త్రీణామర్ధంవిక్రయిత్వావిప్రక్షత్రియవైశ్యయోః । తత్స్త్రీణాంచతదర్ధంస్యాచ్ఛూద్రేతద్ధనమాహరేత్॥✻॥ ఇతిహేమాద్రివిరచితే సుతవిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౯) సుతవిక్రయ ప్రాయశ్చిత్తము॥ ధనాభిలాషచేత కుమారునివి

క్రయించిన బ్రాహ్మణుఁడు బ్రహ్మాండప్రళయము దనుక పిశాచత్వమును బొం దియుండునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. గృహదాహము, భా ర్యానాశము, కుమారులకును దనకును రోగములచేత బాధగలుగుట, రాజ గువాఁడు సర్వస్వమునుహరించుట, దొంగలుపశువులను హరించుట, బంధు వులందఱును విడిచిపెట్టుట, అన్నవస్త్రములులేకపోవుట, అనునవియిట్టికష్ట ములని చెప్పఁబడును. దరిద్రమనునది సకలకష్టములను గలుగఁజేయును. ఇ ట్టికష్టములు గలిగినప్పుడు పుత్రులు, భార్యలు, అనేకులు గలిగియుండుట మ హాకష్టము. ఇట్టికష్టములయందు పుత్రునినైనను, సపత్నీపుత్రునినైనను విక్ర యించినవాఁడు ప్రళయకాలము దనుక పిశాచత్వమును బొందునని లింగపు రాణమునందుఁ జెప్పఁబడెను. ఆపదలయందును, మహాక్షామములయందు ను, ధనలోభమువలనఁ దనపుత్రునినైనను, ఇతరుల పుత్రులనైనను విక్ర యించినబ్రాహ్మణుఁడు ఘోరములగు నరకములనుబొంది పిమ్మట పిశాచ త్వమునుబొందును. అట్టిపాపము శాంతినిబొందుటకొఱకు మహాసాంతపన ము నాచరింపవలయును. బాలునివిక్రయించిన యెడల సాంతపనప్రాయ ముఁ నాచరింపవలయును. పౌగండక వయస్సునందున్నవానిని విక్రయించినవాఁ డు రెండుసాంతపనముల నాచరించవలయును. కౌమారవయస్సునందును, ప్రౌఢవయస్సునందును నున్నవానిని విక్రయించినవాఁడు మహాసాంతపనము నాచరించవలయును. స్త్రీలకిప్రాయశ్చిత్తమునందు దర్ధమును విధించ వలయు ను. క్షత్రియవైశ్యులకును నీప్రాయశ్చిత్తమునందు సగమునే విధించవలయు ను. వారిస్త్రీలకు వారికివిధించిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవ లయునని గరుడపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితధ ర్మశాస్త్రమునందు సుతవిక్రయప్రాయశ్చిత్తవిధానము సమాప్తము.

——* పత్నీవిక్రయప్రాయశ్చిత్తమ్. *——

(౫౯) అథపత్నీవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవస్వామీ॥ శ్లో॥ పూ ర్వోక్తేష్విహకష్టేషు మహదాపత్సుభూమిప। నపత్నీంవిక్రయేద్విప్రోదుష్ట మపిసతీమపి । గర్భేత్యాగోవిధీయత ఇతిసర్వత్రానుషంగః । కలౌయుగేవ్య భిచారే స్వదృష్టేగర్భధారణ మేవదుష్టత్వం॥ వ్యభిచారమాత్రేపోషణమేవన త్యాగః॥ స్కాందే॥ శ్లో॥ ఆపత్స్వపిహాకష్టేషుమహాక్షామెజనక్షయే। ధర్మ పత్నీంసపత్నీంవా వ్యదుష్టాందుష్టచారిణీం ॥ నవిక్రయేద్ద్విజఃకామా స్వ స్మైన్మత్సరాతురః॥ యదివిక్రీయవక్రైత మహాంతంనరకంవ్రజేత్ ॥ భవిష్యో త్తరే॥ శ్లో॥ సతీంసపత్నీమపి ... విక్రయేత్॥ భస్మాంతమది ప్ర

త్యజ్యావర్తమేదిహకర్మణి॥ యమలోకముపాగమ్య రౌరవే నరకే వసేత్ ॥ పునర్భవముపాగమ్య దారహీనోభవేద్ధ్రువం । ఏతద్దోషవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్॥ సత్యాంతువిక్రయే చాంద్రం పరాకమసతీక్రయే ॥ బాలికాయాః షడబ్దం స్యాత్ప్రౌఢాయాం నాస్తి నిష్కృతిః । ఏతదజ్ఞానవిషయం। జ్ఞాత్వా చేద్ద్విగుణం చరేత్॥ క్షత్రియవైశ్యయోర్విప్రవత్ప్రాయశ్చిత్తం॥ శూద్రేతు ధనం రాజా సర్వస్వం గృహ్ణీయాత్॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే పత్నీవిక్రయప్రాయశ్చిత్తం॥

(౪౯) ఇకను పత్నీవిక్రయ ప్రాయశ్చిత్తము ॥ పూర్వోక్తములగు కష్టములయందును గొప్పవగు నాపదలయందును, భార్యనైనను, సపత్నినైనను, విక్రయించిన బ్రాహ్మణుడు మహాపాపమును బొందును. గర్భమునందు మాత్రము త్యాగము విధింపబడుచున్నదని సర్వస్థలములయందును సంబంధించుకొనవలయును. కలియుగమునందు వ్యభిచారము జూడబడినను, గర్భధారణ మయ్యెనేని దోషముగాని లేనియెడల మిగుల దోషముగాదని చెప్పవలయును. వ్యభిచారము మాత్రము చేసినయెడల పరిత్యాగమును జేయక పోషణను మాత్రము చేయవలయునని దేవస్వామియనువాడు వచించె. ఆపత్తులయందును, అధికములగు కష్టములయందును, మహాక్షామమునందును, జనక్షయకాలమునందును, ధర్మపత్నినైనను, సవతి ధర్మపత్నీసపత్నులు దుష్టస్వభావము గలవారైనను, కాకపోయినను, బ్రాహ్మణుడు విక్రయింపగూడదు. ఒకవేళ మత్సరాతురుడై విక్రయించెనేని గొప్పదగునరకమును బొందునని స్కాందపురాణమునందు జెప్పబడినది. బ్రాహ్మణుడగువాడు ధర్మపత్నినైనను, సపత్నినైనను గుఱించి ధర్మరహితముగ సంచరించిన బ్రాహ్మణుడు మరణానంతరమందు రౌరవమను నరకమును బొందును. రెండవజన్మమందు భార్యలేనివాడగును. కావున నట్టిదోషము నివర్తించిపోవుటకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. విస్పష్టముగ విక్రయించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును విక్రయించుటకు దగిన ప్రయత్నమును జేసినయెడల పరాకకృచ్ఛ్రము నాచరింపవలయును. బాలికను విక్రయించినయెడల షడబ్దకృచ్ఛ్రము నాచరించవలయును. ప్రౌఢురాలిని విక్రయించినవానికి ప్రాయశ్చిత్తమే లేదు. ఇదియంతయును నజ్ఞానవిషయము. తెలిసిచేసినయెడల పైన చెప్పబడిన ప్రాయశ్చిత్తమును ద్విగుణముగ నాచరించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధింపవలయును. శూద్రుడట్టి దుష్కృత్యము నాచరించినయెడల

రాజగువాఁడు వానిధనమును సర్వమును గ్రహించవలయునని భవిష్యోత్తర పురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రాంతర్గతప్రాయశ్చిత్తాధ్యాయమునందు పత్నీవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము.

## —— మాతృవిక్రయప్రాయశ్చిత్తమ్. ——

(౬౦) అథమాతృవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ శివపురాణే ॥ శ్లో॥ మాతరంతత్సపత్నీంవా భగినీంభ్రాతృబాంధవీం॥ పితృవ్యపత్నీంవిధవాం స్నుషాంవామాతులాగ్రణీం॥ విప్రోవైమత్సరాసక్త్యా వ్యభిచారాదిశంకయా। నవిక్రమేత్పుత్రోభ్రాతా విక్రయేద్యదిదోషభాక్॥ లైంగే ॥ శ్లో ॥ మాతరంభగినీంభ్రాతృబాంధవీంస్వస్నుషామపి। సపత్నీంవిధవాంతత్ర స్వపత్నీం మాతులాగ్రణీం। పితృవ్యపత్నీంభ్రాతృజాయాం గురుపత్నీంతథాపివా। వ్యభిచారాదివార్తాభిర్మత్సరాద్వాజనాధిప॥ ఏతాసువిప్రోనద్రుహ్యేత్సతిదోషేమహత్యపి॥ నవిక్రమేద్ద్విజోలోభా స్పృష్ట్వానరకమశ్నుతే॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ శృణురాజన్ప్రవక్ష్యామి దోషబుద్ధిమిమామిహ॥ యోవిప్రోమాతరంభ్రాత్రీం తత్సపత్నీంసహోదరీం। స్వసారంవిధవాంసాధ్వీం పైతృవ్యాంస్వస్నుషామపి॥ మాతులానీంగురోర్దారాన్వ్యభిచారేమహత్యపి జనవాదాద్దోషబుద్ధ్యానద్రుహ్యేద్వైకదాచన। మాతరంతత్సపత్నీంవా విక్రమేత్పతితోభవేత్॥ భగినీంవాస్వసారంవా విక్రయేద్యదిపాపధీః। నిష్కారణతయారాజన్ కారీషవధమర్హతి। విధవాంమాతులానీం వాస్నుషాంపితృవ్యసంభవాం॥ విక్రయిత్వాద్విజోమోహా దన్యదేశగతోయది। మాసాంతపనంచాంద్రం షడబ్దంభూపక్రమాత్॥ యథాక్రమంయోజనీయం గర్భేత్యాగోవిధీయతే। మాతరంనస్యాద్ద్విజోవ్యక్తం పూర్వవచ్ఛుద్ధిమాచరేత్। గురుదారవిక్రయేకారీషవధఏవ॥ వయస్తారతమ్యంపూర్వవద్భావితవ్యం। తత్రతత్రవిక్రయేతత్తత్ప్రాయశ్చిత్తంయోజనీయం। క్షత్రియవైశ్యయోర్ద్విత్రిగుణప్రాయశ్చిత్తం। శూద్రేషుతద్ధనస్వీకారః॥ సర్వత్రగర్భేస్వదేశాదన్యదేశేత్యాగఏవ। నమాత్రోః॥ పూర్వవద్భావితవ్యం॥ ఇతి హేమాద్రివిరచితే మాతృవిక్రయప్రాయశ్చిత్తం॥

(౬౦) మాతృవిక్రయప్రాయశ్చిత్తము॥ తల్లినైనను, సవతితల్లినైనను, విధవయగుకోడలినైనను, భగినినైనను, భ్రాతృభార్యనైనను, మాతులాగ్రణినైనను, పితృవ్యులయొక్కభార్యలనైనను, బ్రాహ్మణుఁడగువాఁడు మత్సరాసక్తుఁడై వ్యభిచారమును జేయువారనియెడు సందేహముచేత విక్రయించినచో నరకమునొందునని శివపురాణమునఁ జెప్పఁబడియె. తల్లినైనను,

భగినినైనను, భ్రాతృభార్యనైనను, కోడలినైనను, విధవయగునాపత్నినైనను, మాతులాగ్రణినైనను, పితృవ్యపత్నినైనను, గురుపత్నినైనను, వ్యభిచారాదివార్తచేతనైనను, మాత్సర్యముచేతనైనను, గుఱించియపకారమును జేయఁగూడదు, విక్రయింపనుగూడదు. ఒకవేళవిక్రయించినయెడలనుమహాదోషవంతుడగునని లింగపురాణమునందుఁజెప్పఁబడె. తల్లినైనను, తోఁబుట్టువులనైనను, విధవయగు కోడలినైనను, సాధ్వురాలగు పితృవ్యరాలినైనను, మేనమామ భార్యనైనను, గురుభార్యనైనను, గురించి వ్యభిచారమును జేయుచున్నారని యెడు లోకాపవాదముచేతనయినను దోషబుద్ధిచేతనయినను ద్రోహమును జేయఁగూడదు. తల్లినైనను, సవతితల్లినైనను, విక్రయించినవాఁడు పతితుఁడగును, భగినినైనను, చెలియలినైనను నిష్కారణముగవిక్రయించినయాభార్తృఁడు కారీషవధనుగురించి తగినవాఁడగును. విధవయగుమేనమామభార్యనయినను, విధవయగుకోడలినయినను, పినతండ్రి పెదతండ్రి పినతల్లి పెదతల్లి మొదలగువారల పుత్రికనయినను బ్రాహ్మణుఁడగువాఁడజ్ఞానమువలన విక్రయించి యన్యదేశములకుఁ బోయినయెడల క్రమముగ మహాసాంతపనమును, చాంద్రాయణమును, షడబ్దకృచ్ఛ్రమును, భూప్రదక్షిణమనువాని నాచరించవలయును. పైఁజెప్పఁబడిన స్త్రీలు గర్భధారణచేత దూషితలయితేని పరిత్యజించవలయును. తల్లినిమాత్రము పరిత్యాగమును జేయరాదు. పూర్వోక్తమైన ప్రాయశ్చిత్తము నాచరింపవలయును. గురుభార్యను విక్రయించువానికి కారీషవధను జేయవలయును. వయస్తారతమ్యమును పూర్వోక్తప్రకారముగ యోచించవలయును. వారివారినివిక్రయించినయెడల వారివారికిఁదగినప్రాయశ్చిత్తమును విధించవలయును, క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకువిధించిన ప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రుఁడిట్టికార్యమును జేసిన యెడల వారిధనమును సర్వమును, రాజగువాఁడు స్వీకరింపవలయును. ఇప్పుడు చెప్పఁబడినస్త్రీలు వ్యభిచారమును జేసి గర్భమును ధరించితేని స్వదేశమునుండి వెడలఁగొట్టవలయును, తల్లినిమాత్రమట్లుచేయక పూర్వోక్తప్రకారముగ నాచరింపవలయునని మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు మాత్రాదివిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

——— ❋ పుత్రీవిక్రయప్రాయశ్చిత్తమ్ ❋ ———

(౬౧) అథ పుత్రీవిక్రయప్రాయశ్చిత్తమాహ। మార్కండే॥ శ్లో॥ వివాహార్థ్యవివాహాత్ప్రాక్కన్యాం గౌరీముథాపివా। రోహిణీంపుష్పిణీంవాపి

యోऽత్రః కన్యకాధనం । వివాహార్థమితివ్యాజం కృత్వాస్వీకరణంచరేత్ ॥ పిత
రోనరకంయాంతి స్వయంపత్నీసమన్వితాః ॥ రౌరవేనరకేఘోరేపతత్యాచం
ద్రతారకం । జామాతుఃరతిమాత్రంస్యాత్సావైకింకరణీభవేత్ ॥ గౌతమధ
ర్మే ॥ శ్లో॥ అష్టవర్షాభవేత్కన్యా నవవర్షాతురోహిణీ । దశవర్షాభవేద్గౌరీ
అతఊర్ధ్వంరజస్వలా । క్రయక్రీతాతుయానారీ నసాపత్నీవ్యభిధీయతే । న
దైవోగ్యాహవ్యకవ్యేషు దాసీంతాంమునయోవిదుః ॥ కన్యాదానే విశేషమా
హ ॥ మార్కండేయపురాణే ॥ శ్లో॥ సంబంధినంమాణవకంశ్రోత్రియంచవ్యా
ధివర్జితం । ఆహూయదద్యాత్తస్మైతాం బ్రాహ్మేణశుద్ధయే । మాతృ
తఃపితృతశ్చైవ సప్తసప్తచసప్తచ । పితౄనుద్ధరతేపూర్వాంశ్చాద్గృహస్నాణి
లీయతే । కూర్మపురాణే ॥ శ్లో ॥ వస్త్రైర్వాంఛాం సంత్యజ్యశక్త్యాలంకృత్య
స్వాంసుతాం । కులజాయసుశీలాయస్నాతకవ్రతచారిణే । అరోగాయశ్రు
తవతేయోదద్యాత్తాంకృత్స్నపుష్యమే । పితరోముక్తిమాయాంతి స్వర్గంచబ్రహ్మ
ణఃపదం । ఏతస్యైవపత్నీత్వేతు పితరోనిరయంగతాః । కుంభీపాకంస్వయం
యాతి కన్యావిక్రయిణఃఫలం । వివాహార్థంయకంవా వ్యాజమాశ్రిత్యధనస్వీ
కారఏవమూల్యంకన్యాశుల్కం ॥ తదేవాహ ॥ దేవలధర్మే॥ శ్లో ॥ వివాహా
ర్థంధనంగృహ్ణాతి యఃకంవావ్యాజమాశ్రితః । తదేవవిక్రయోమూల్యంయోని
ప్రస్తున్నసంత్యజేత్ ॥ తస్యైవ ప్రకృతిర్నాస్తి త్రిభిశ్చాంద్రాయణైర్వినా । రో
హిణీవిక్రయేరాజన్ మహాచాంద్రాయణంస్మృతం ॥ గౌరీవిక్రయణేతాత
మహాసాంతపనంస్మృతం ॥ రజస్వలావిక్రయణే కారీషవధఏవహి । ఏతా
సాంచచతస్రూణాం మూల్యంధృత్వావివాహమేత్ ॥ సతత్రపిపాపిభుంజీరన్
తత్తత్పాపాధర్మమాప్నుయుః ॥ తదాహాపస్తంబః ॥ దోషేణవామీమాంస
మానస్యామీమాంసితస్యవాపాపంస్యాత్ హీనతస్యభక్షయతీతివిజ్ఞాయతే ॥
అత్రకన్యాశుల్కస్వీకారమేవదోషః ॥ అతఏవకన్యామూల్యస్వీకారమేవ
విక్రయోగాన్యః ॥ ॥ ఇతిహేమాద్రివిరచితేకన్యాదివిక్రయప్రాయశ్చిత్తం ॥

(౬౧) ఇకను పుత్రికావిక్రయప్రాయశ్చిత్తము ॥ వివాహధనమునే
పముచేత వివాహానంతరమైదయినను, వివాహమునకుఁబూర్వము నందైనను,
కన్నియనైనను, గౌరినైనను, రోహిణినైనను, పుష్పిణినైనను, విక్రయించిన
ధనమును స్వీకరింపఁగూడదు. ఇట్టికార్యమును తండ్రులు చేసినయెడల నరక
మునుబొందుదురు. అనఁగానాచంద్రార్కముగ రౌరవాదినరకములనుబొం
దియుండుదురని సారంగపురాణమునందుఁ జెప్పఁబడియె. ఎనిమిదిసంవత్సర
ముల వయస్సుగలయామెది కన్యయనఁబడును. తొమ్మిది సంవత్సరముల వయ

స్సుగలయాడుది రోహిణియనఁబడును. పదిసంవత్సరముల వయస్సుగలయాడుది గౌరియనఁబడును. అటుపిమ్మట రజస్వల యనఁబడును. క్రయమునిచ్చి కొనిన యాడుదానిని హవ్యకవ్యాదిక్రియలయం దుపయోగింపఁ గూడదని గౌతమధర్మములయందుఁ జెప్పఁబడియె. సంబంధముగలవాఁడును, బ్రహ్మచారియును, శ్రోత్రియుఁడును, వ్యాధివర్జితుఁడును, నగువానిని బిలిచి స్నాతకవ్రతము నాచరింపఁజేసి యనంతరమందు కన్యాదానమును చేయవలయును. కన్యాదానమును జేయువాఁడు మాతృకులము నందేడ్వురను, పితృకులమునం దేడ్వురను నుద్ధరించును. పిమ్మట బ్రహ్మలోకమునుఁ బొందునని మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడియె. వస్త్రాద్యఖిలవస్తువుల శక్త్యనుసారముగ నాభరణములచేత నలంకరించి తనదు కుమార్తెను, కులమునందుఁ బుట్టినవాఁడును, రోగరహితుఁడును, వేదమును జదివినవాఁడును, నగువానికివ్వవలయును. అట్లు చేసిన యెడల పితృదేవతలు ముక్తిఁ బొందుదురు. ఇవ్విధముగఁ గన్యాదానమును జేసినవాఁడు గూడ బ్రహ్మలోకమునుఁ బొందును. ఇవ్విధముగఁ గన్యాదానమును జేయనివానియొక్క పితృదేవతలు నరలోకమునుఁ బొందుదురు. తానును కుంభీపాకమను పేరుగల నరకమునుఁ బొందును. వివాహమునం దేదైన నొకనెపమునుగల్పించి స్వీకరించినధనము కన్యాశుల్కమనఁబడునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. వివాహకాలమునం దేదైన నొకనెపమునుగల్పించి ధనమును స్వీకరించి కన్యాదానమును జేయువానికిఁ బ్రాయశ్చిత్తము లేదు, అయినను మూఁడు చాంద్రాయణముల నాచరించిన యెడల పరిశుద్ధుఁడగును. రోహిణియగు నాడుదానిని విక్రయించినవాఁడు మహాచాంద్రాయణము నాచరించవలయును. గౌరీవిక్రయమునందు మహాసాంతపనము నాచరించవలయును. పదిసంవత్సరముల వయస్సతిక్రమించిన పుత్రికను విక్రయించినవానికి కారీషవధయే ప్రాయశ్చిత్తమని యెఱుంగవలయును. ద్రవ్యమునుగ్రహించి కుమార్తెనిచ్చిన వానియింట భుజించు వారు పాపఫలమును బొందుదురని దేవలధర్మమునందుఁ జెప్పఁబడియె, ఆపస్తంబుఁడును నిటులనే చెప్పె కన్యామూల్యస్వీకారమే విక్రయించుటయని యెఱుంగవలయును. ఇట్లు హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు కన్యాదానవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము.

—— * ధేనువిక్రయ ప్రాయశ్చిత్తమ్. * ——

(౬౨) అథ ధేనువిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ శివపురాణే । శ్లో ॥
సంపాద్య బహుధా యత్నైః శైవా విప్రాః ప్రతిగ్రహాత్ । విక్రయేద్యది మూఢా

త్వా రౌరవంనరకంవ్రజేత్॥ లైంగే॥ శ్లో॥ ధేనుంసంపాద్యవిప్రోయ మగ్నిహోత్రార్థమాదరాత్। దుగ్ధాభావేరుషాయుక్తోవిక్రయేద్యదిపాపధీః॥ సవైనరకమాసాద్యచండాలత్వమవాప్నుయాత్॥ బాల్యేపౌగండకేవాపిధేనుంవాద్రవ్యలోభతః। విక్రయేద్యదిమూఢాత్మా దహత్యాసప్తమంకులం। బాల్యేచాంద్రంతుపౌగండే మహాచాంద్రముదీరితం। యువతీంవిక్రయిత్వాతు తప్తకృచ్ఛ్రత్రయంవిదుః॥ ధేనుంద్విజోవిక్రయిత్వాగోసూక్త మండలంపఠేత్॥ ఆసాయంప్రాతరారభ్య స్నాత్వాభుంజన్ఫలంముదా। మండలేనవిశుద్ధస్స్యాత్పంచగవ్య-తతఃపరం॥ భూసూక్తమిత్యర్థః॥ గారిళాను-భినీష మేదినిఘంటుః॥ ఇతిహేమాద్రివిరచితే ధేనువిక్రయప్రాయశ్చిత్తం॥

(౬౨) ధేనువిక్రయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడగువాఁడనేకవిధములగు ప్రయత్నములచేతఁ బరిగ్రహించిన ధేనువును విక్రయించినయెడల రౌరవమనుపేరుగల నరకమును బొందునని శివపురాణమునందుఁ జెప్పఁబడె. బ్రాహ్మణుఁడగువాఁడగ్నిహోత్రముకొఱకు ధేనువును సంపాదించి పాలనివ్వలేదనే నెపముచేత కోపవంతుఁడై విక్రయించిన యెడల నరకలోకమును బొందును, పిమ్మటఁ జండాలుఁడై పుట్టును, బాల్యవయస్సునందైనను, పౌగండవయస్సునందైననునున్న ధేనువును ద్రవ్యాశచేత విక్రయించినవాఁడేడుతరములవనుక కులమువారలఁ బతితులను జేయును. బాల్యమునందైన యెడల చాంద్రాయణము నాచరింపవలయును. పౌగండమునందు మహాచాంద్రాయణవ్రతమును జేయవలయును. యువతిని విక్రయించినయెడల మూఁడు తప్తకృచ్ఛ్రములనాచరించవలయును. ధేనువును విక్రయించిన బ్రాహ్మణుఁడు మండలదినములు గోసూక్తమును బఠించవలయును, ప్రాతఃకాలము మొదలుకొని సాయంకాలము దనుక ఫలములనే భుజించవలయును, ఇట్లు నలుబది దినములు చేసి పిమ్మట పంచగవ్య ప్రాశనను జేసినయెడల పరిశుద్ధుఁడగునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచిత ధేనువిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము.

——* గజవిక్రయప్రాయశ్చిత్తమ్ *——

(౬౩) అథగజవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ శ్లో॥ గజంక్రీత్వాతుధృత్వావా వ్యవహారతయాద్విజః। నతస్యపునరావృత్తి ర్యమలోకాత్కదాచన॥ లైంగే॥ శ్లో॥ సంపాద్యనాగంధృత్వా వావిప్రోలోభపరాయణః॥ విక్రయేద్యదిదోషాత్మా నతస్యపునరుద్భవః॥ స్కాందే॥ శ్లో॥ హస్తినంప్రతిగృహ్యైవ [illegible] త్వాపునః [illegible]

ద్యమలోకమవాప్నుయాత్॥ బాలవిక్రయణే చాంద్రం పౌగండే తద్ద్వయం స్మృతం॥ యువానం విక్రయిత్వా తు దశత ప్తం సమాచరేత్ ॥ స్త్రీణామర్ధం మునిశ్రేష్ఠ ప్రాయశ్చిత్తం మనీషిభిః॥ ధేనుగజవిక్రయే స్త్రీణామర్ధం ప్రాయశ్చిత్తము క్తం॥ క్షత్రియవైశ్యయోరేవం ప్రాయశ్చిత్తం। శూద్రే తు సహజమేవ। కేచిదర్ధం శూద్రవైశ్యయోర్వదంతి॥ ఇతి హేమాద్రివిరచితే గజవిక్రయప్రాయశ్చిత్తం॥

(౬౩) గజవిక్రయప్రాయశ్చిత్తము॥ ద్విజుడు, ఏనుగును కొనినయైనను, వ్యవహారత్వము చేత ధరించినయైనను, పిమ్మట విక్రయించినయెడల ఘోరానరకమును బొందునని కూర్మపురాణమునందు జెప్పబడియె. ఏనుగును సంపాదించిన బ్రాహ్మణుడు లోభపరాయణుడై విక్రయించినయెడల పునరావృత్తిరహితముగ నరకలోకమునందు వాసమును జేయునని లింగపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడగువాడేనుగును ప్రతిగ్రహించి యల్పక్రయమునకు విక్రయించెనేని యమలోకమును బొందును. బాలగజమును విక్రయించినయెడల చాంద్రాయణమునాచరించవలయును. పౌగండగజమును విక్రయించినయెడల రెండు చాంద్రాయణములనాచరించవలయును. యౌవనముగల యేనుగును విక్రయించినవాడు పదితప్తకృఛ్రములనాచరించవలయును. స్త్రీలకీవిషయమునందు బురుషులకు విధించిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. ఈకృత్యము శూద్రునకు సహజము. మఱికొందఱు శూద్రులకును స్త్రీలకును సగము ప్రాయశ్చిత్తమును విధింపవలయునని చెప్పుచున్నారని స్కాందపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచిత గజవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

అనడుద్విక్రయప్రాయశ్చిత్తమ్.

(౬౪) అథానడుద్విక్రయప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ అనడ్వాహం యదా విప్రో విక్రీణీయాద్యది మోహతః॥ స పాపీ నరకం యాతి యావత్సప్తతం సుదారుణం॥ లైంగే॥ శ్లో॥ అనడ్వాన్ పూర్వజేనాద్య ద్రవ్యలోభపరేణ వా। విక్రీయతే మహాఘోరో నరకస్సంభవేదిహ॥ కౌర్మే॥ శ్లో॥ అనడ్వాహం ద్విజో ధృత్వా గృహీత్వా వా నరోత్తమాత్ ॥ ద్రవ్యలోభేన మహతా విక్రమేద్యది పాపధీః ॥ మహాంతం నరకం గత్వా భవేద్భువి విహింసకః॥ తస్య దోషస్య శాంత్యర్థం తప్తకృఛ్రం సమాచరేత్ ॥ పోషయిత్వా స్వగృహే వత్సం స్వధేనూదరసంభవం॥ తం విక్రయిత్వా మోహేన కుర్యాచ్చాంద్రాయణం బుధః ॥ బాల్యే పౌగండకే చైవ ప్రాజాపత్యం విశోధనం ॥ విప్రస్త్రీణామేవమేవ

ప్రాయశ్చిత్తార్ధమాచరేత్ ॥ క్షత్రియవైశ్యయోశ్శవమేవ వేదితవ్యం । తత్తత్ స్త్రీణామర్ధం॥ పాదజెఘనస్వీకారః ॥ ఇతి హేమాద్రివిరచితే౽నడుద్విక్రయప్రాయశ్చిత్తం॥

(౭౪) అనడుద్విక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడగువాడు మోహమువలన నెద్దును విక్రయించినయెడల నసిపత్రమను పేరుగల దారుణనరకమును బొందునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడు లోభమువలన నెద్దును విక్రయించినయెడల ఘోరమగునరకమును బొందునని లింగపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడగువాడెద్దును ప్రతిగ్రహించి ద్రవ్యలోభముచేత విక్రయించినయెడల గొప్పదగునరకమును బొంది పిమ్మట భూలోకమున హింసకుడై పుట్టును. కావున నట్టి పాపమును నివర్తించిపోవుటకొ అనుతప్తకృఛ్రము నాచరించవలయును. తనదు ధేనువుయొక్క యుదరమువలన బుట్టినవత్సమును గృహమునందు వృద్ధినిబొందించి పిమ్మట ద్రవ్యాశచేత విక్రయించినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. బాల్యపౌగండకవయస్సులయందు విక్రయించినయెడల ప్రాజాపత్యకృఛ్రము నాచరింపవలయును. బ్రాహ్మణస్త్రీలీకృత్యమును జేసినయెడల పైనజెప్పబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. శూద్రుడీదుష్కృత్యమును జేసినయెడల రాజగువాడు వానిధనమును సర్వమును గ్రహించవలయునని కూర్మపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందలి యనడుద్విక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

## మహిషీవిక్రయప్రాయశ్చిత్తమ్.

(౭౫) అథమహిషీవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ బ్రహ్మాండపురాణే శ్లో॥ మహిషీం పోషయిత్వాతు స్వగృహే పుత్రవత్సదా॥ విప్రోయదిహతాం పశ్చాద్విక్రయేత్పాపధీర్నరః॥ నరశబ్దో జాతిమాత్రసాధారణః॥ శ్లో॥ సయాతి నరకం ఘోరం కాకోలం నామనామతః॥ లైంగె॥ శ్లో॥ మహిషీం స్వగృహే తాం పోషయిత్వాస్వసూనువత్॥ విప్రోయదిహలోభార్త్తో విక్రయేదన్యచోదితః॥ స దీపనరకస్థాయీ కృతంపాపమనుస్మరన్॥ స్కాందె॥ శ్లో॥ మహిషీం స్వగృహే జాతాం క్రీత్వావా రాజనందన॥ ప్రతిగృహ్యద్విజోయస్తు విక్రయేద్ధనలోభతః॥ యమలోకమనుప్రాప్య నరకం యాతి దారుణం ॥ గృహజాం విక్రయే ప్రాజాపత్యచాంద్రాయణం స్మృతం। వణిగ్భావేన తాం క్రీత్వా విక్రయేత్తద్ద్వయం చరేత్॥ ప్రతిగృహ్య ద్విజస్సన్ తాం నడబ్దం విక్రయే స్మృతం ॥ తత్ స్త్రీణాం తులద

ర్ధం స్యాత్। క్షత్రియాణాం ద్విజో క్తవత్॥ వైశ్యానాంతు త్రవత్ప్రోక్తంపాదజె తద్ధనంహరేత్॥ ఇతి హేమాద్రివిరచితే మహిషీవిక్రయ ప్రాయశ్చిత్తం॥

(౬౫) మహిషీవిక్రయప్రాయశ్చిత్తము॥ స్వగృహమునందుబిడ్డనుబోషించినవిధముగ మహిషినిబోషించి పిమ్మట ద్రవ్యాశ చేత విక్రయించినమానవుడు పాపవంతుడగునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. మఱియునట్టివాడు కాకోలమను పేరుగల ఘోరనరకమును బొందునని యును ఎనుమును స్వయముగనిజగృహమునందు బెంచిలోభార్తుడై పిమ్మట విక్రయించినయెడల నరకలోకమును బొందునని లింగపురాణమునందు జెప్పబడియె. స్వగృహమునందు బుట్టిన యెనుమును విక్రయించిన బ్రాహ్మణుడును, ఎనుమును బ్రతిగ్రహించి ధనాశ చేత విక్రయించిన బ్రాహ్మణుడును, యమలోకమును బొంది ఘోరమగు నరకమును బొందును. కావున తత్పాపశాంతికొఱకు స్వగృహమునందు బుట్టిన యెనుమును విక్రయించినవాడు చాంద్రాయణవ్రతమునాచరించవలయును. వర్తకవ్యాపారమూలకముగ నెనుమును గొని విక్రయించినవాడు రెండు చాంద్రాయణములనాచరింపవలయును. ప్రతిగ్రహమును జేసిన యెనుమును విక్రయించిన బ్రాహ్మణుడు షడబ్దకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమునాచరింపవలయును. బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. క్షత్రియులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. వైశ్యనకు క్షత్రియులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును శూద్రుడీదుష్కృత్యమును జేసినయెడల వానిధనమును సర్వమును హరించవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు మహిషీవధప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— మహిషవిక్రయ ప్రాయశ్చిత్తమ్. ——

(౬౬) అథమహిషవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శ్లో॥ మహిషం స్వగృహే జాతం విక్రమేత్పూర్వజో యది। నరకం సోనుభూయాథ హీనజాతిర్భవేద్ధ్రువం॥ లైంగే॥ శ్లో॥ మహిషం పోషయిత్వా చ వయసి స్థావిరే సతి। కామాదేవా నరశ్రేష్ఠ ద్విజో యది హ విక్రమేత్ ॥ మహాంతం నరకం గత్వా హీనజాతిః ప్రజాయతే॥ బ్రహ్మాండే॥ శ్లో॥ మహిషం వర్ధయిత్వా వా క్రీత్వా వా ప్రతిగృహ్య వా॥ ద్విజో యది హ లోభేన విక్రమేత్ కథంచన। మహాంతం నరకం గత్వా హీనజాతిస్తతో భవేత్॥ మహిషవిక్రయప్రాయశ్చిత్తం త్వనడుద్విక్రయప్రాయశ్చిత్తవదున్నేయం ॥ ఇతి హేమాద్రి విరచితే మహిషవిక్రయ ప్రాయశ్చిత్తం॥

(౬౬) మహిషవిక్రయప్రాయశ్చిత్తము॥ స్వగృహమునందు బుట్టినదున్నపోతునువిక్రయించినబ్రాహ్మణుఁడు మరణానంతరమందునరకలోకమునందుకష్టములననుభవించి పిమ్మటహీనజాతియందు బుట్టునని స్కాందపురాణమునందు జెప్పబడియె. ముందుగమహిషమునుపోషించి కౌమారాద్యవస్థలయందువిక్రయించినబ్రాహ్మణుడు గోష్పదగునరకమునుబొంది పిమ్మట హీనజాతియందుబుట్టునని లింగపురాణమునందు జెప్పబడియె. మహిషమునువృద్ధినిబొందించికొనియైనను, ప్రతిగ్రహించియైననువిక్రయించినబ్రాహ్మణుడు గోష్పదగునరకమునుబొంది పిమ్మటహీనజాతియందుబుట్టునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. మహిషవిక్రయమును జేసినవానికి, ఎద్దునువిక్రయించినవానికివిధించినప్రాయశ్చిత్తమునేవిధించవలయును. ఇట్లుసి హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు మహిషవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— అజబస్తవిక్రయప్రాయశ్చిత్తమ్. ——

(౬౭) అథాజబస్తవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే నాగరఖండే శ్లో॥ అజంబస్తం ద్విజో యస్తు సంపాద్య బహుయత్నతః । పశ్చాత్తద్విక్రయేత్పాపీ నరకం యాతి దారుణం। తత్పాపపరిశుద్ధ్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్॥ స్కాం॥ శ్లో॥ విప్రః ప్రయత్నతో రాజన్ సంపాద్య మాంసగృహ్య వా। పశ్చాత్తద్విక్రయేత్పాపీ నరకం యాతి రౌరవం॥ లైం॥ శ్లో॥ నారీ వా విక్రయేద్యా తు తదర్ధం పరికీర్తితం॥ ఇతి హేమాద్రివిరచితే౽జబస్తవిక్రయ ప్రాయశ్చిత్తం॥

(౬౭) అజబస్తవిక్రయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడనేకములగుప్రయత్నములను జేసి మేకనైనను, గొఱ్ఱెనైనను సంపాదించిపిమ్మట ద్రవ్యాశ చేతవిక్రయించినయెడల ఘోరమగునరకమునుబొందును. కావునదత్పాపశాంతికొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించవలయునని స్కాందపురాణాంతర్గతనాగరఖండమునందు జెప్పబడె. స్కాందపురాణమునందునన్నిటులనేచెప్పబడియె. ఈకృత్యమును స్త్రీలుచేసినయెడల నర్ధప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరింపవలయునని లింగపురాణమునందు జెప్పబడియె. ఇట్లుసి హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు, అజబస్తవిక్రయ ప్రాయశ్చిత్తంవిధిసమాప్తము॥

—— ఖరవిక్రయ ప్రాయశ్చిత్తమ్. ——

(౬౮) అథఖరవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ శ్లో॥ రాసభం విక్రయేద్విప్రః పశుచండాలమాదరాత్॥ స వై చండాలతాం యాతి నరకం చానుభూయ చ॥ స్కాం॥ శ్లో॥ రాసభం పూర్వజో లోభాత్ త్రీన్ త్వాల్ప ద్రవ్యమూల్యతః॥ [illegible] సచండాలత్వమా

సాద్యయావద్బ్రహ్మలయంగతః ॥ తావత్కాలంతదానీత్వా భవేత్కండూతి మాన్భువి॥ త్రై-గ్ర.శ్లో॥ రాసభంః క్రమేనోహిహాత్రీః కాల్వాల్పద్రవ్యమాల్యతః॥ సచండాలత్వమాసాద్య పశ్చాత్కండూతిమాన్భవేత్ ॥ ప్రాజాపత్యంబాల భావేకౌమారేతప్తమాచరేత్॥ యూనికుర్యాత్షడబ్దంతు తతశ్శుద్ధోభవేద్ద్విజః॥ స్త్రీణామేతదర్ధంః క్షత్రియవైశ్యయోర్విప్రవత్॥ పాదశేసర్వస్వహరణం॥ ఇతిహేమాద్రివిరచితే రాసభవిక్రయప్రాయశ్చిత్తం॥

(౬౮) ఖరవిక్రయప్రాయశ్చిత్తము॥ పశుచండాలమగు రాసభమును విక్రయించిన బ్రాహ్మణుడు చండాలత్వమును బొందిమరణానంతరమందు ఘోరమగునరకమును బొందునని దేవీపురాణమునందు జెప్పబడినది. బ్రాహ్మణుడగువాడు ద్రవ్యాభిలాషచేత నల్ప క్రయమునకు రాసభమునుకొని యధికలాభముకొఱకు విక్రయించినయెడల బ్రహ్మప్రళయమువఱకును నరకలోకమునందుండి పిమ్మటకండూతిగలవాడై పుట్టునని స్కాందపురాణమునందు జెప్పబడె. లింగపురాణమునందును నటులనేచెప్పబడినది. మఱియు బాలరాసభమును విక్రయించినవానికి తద్దోషనివారణముకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. కౌమారవయస్సుగలరాసభమును విక్రయించినయెడల తప్తకృచ్ఛ్రము నాచరించవలయును. యౌవనవయస్సునందున్నరాసభమును విక్రయించినయెడల షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును జేసికొనిన యెడల పరిశుద్ధుడగును. ఈదుష్కృత్యమును స్త్రీలుచేసినయెడల సగముప్రాయశ్చిత్తమును జేయించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రుడీదుష్కృత్యమును జేసినయెడల వానియొక్కసకల ధనమును స్వీకరించవలయుననియును లింగపురాణమునందే జెప్పబడినది. ఇట్లుని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు రాసభవిక్రయ ప్రాయశ్చిత్తవిధానముసమాప్తము.

—— * ఉష్ట్రవిక్రయ ప్రాయశ్చిత్తమ్. * ——

(౬౯) అథోష్ట్రవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ శ్లో॥ ఉష్ట్రీంద్విజాతిస్సంపాద్య క్రీత్వావాలఘుమూల్యతః। విక్రయే త్రింశనాధిక్యాత్కాలసూత్రంప్రపద్యతే॥ స్కాందే॥ శ్లో॥ స్తేయంకృత్వాథవా క్రీత్వాద్విజఃకుర్యాత్క్రయవిక్రయే॥ వినయంగాదిపాపాత్మా నరకంయాతిదారుణం॥ భవిష్యోత్తరే॥ శ్లో॥ క్రమేళకంద్విజోయస్తుసంపాద్యబహుయత్నతః॥ విక్రయేన్నిష్కృతిర్నాస్తి కాలసూత్రాద్యయంకరాత్। బాల్యేపరాకం సంప్రోక్తం

పౌగండే తప్తమీరితం । యౌవనే చాంద్రం షడబ్దం వా కృత్వా శుద్ధిమవాప్నుయాత్। విప్రస్త్రీణాం తదర్ధం స్యాత్పూర్ణం క్షత్రవిశామపి । పాదజే తు ధనాదానమేవమేవ ప్రచోదితం॥ ఇతి హేమాద్రివిరచితే ఉష్ట్రీవిక్రయప్రాయశ్చిత్తం॥

(౬౯) ఉష్ట్రీవిక్రయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు, ఒంటెను తక్కువక్రయమునకు సంపాదించి ద్రవ్యాశచేత, ఎక్కువక్రయమునకు విక్రయించిన యెడల కాలసూత్రమను పేరుగల నరకమును బొందునని లింగపురాణమునందు జెప్పబడియె. దొంగతనముగానైనను, క్రయమునకైనను నొంటెను సంపాదించి విక్రయించిన పాపాత్ముడగు బ్రాహ్మణుడు దారుణమను పేరుగల నరకమును బొందునని స్కాందపురాణమునందు జెప్పబడియె. భవిష్యోత్తరమునందును నిటులనే జెప్పబడియె. పతియును బాల్యమునందు విక్రయించిన యెడల పరాకప్రాయశ్చిత్తమును విధించవలయుననియును, పౌగండవయస్సునందు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును విధించవలయుననియును, యౌవనవయస్సుగల యొంటెను విక్రయించిన చాంద్రమునైనను షడబ్దకృచ్ఛ్రమునైనను నాచరింపవలయుననియును, బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయుననియును, క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకువిధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయుననియును, శూద్రుడీ దుష్కృత్యమును జేసిన యెడల వాని ధనమును సర్వమును గ్రహించవలయుననియును, భవిష్యోత్తరమునందే జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు, ఒంటెను విక్రయించిన దోషము నివర్తించుటకు ప్రాయశ్చిత్తవిధానము సమాప్తము.

—— హరిణీవిక్రయప్రాయశ్చిత్తమ్. ——

(౭౦) అథ హరిణీవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ శ్లో॥ అరణ్యజాం వా గృహజాం విప్రో యది హా విక్రమేత్॥ హారిణీం ద్రవ్యలోభేన స యాతి బ్రహ్మహంతృతాం॥ మాత్స్యే॥ శ్లో॥ దేవాలయే గృహే వాపి పోషయిత్వా మృగాంగనాం। ద్విజస్తాం విక్రయేద్యస్తు స మహాపాతకీ భవేత్॥ విక్రయేద్యది హింసార్థం స చండాలత్వమాప్నుయాత్॥ చతుర్వింశతిమతే॥ శ్లో॥ అరణ్యజాం వా గృహజాం విప్రో హింసార్థమాదరాత్॥ విక్రయేద్యది పాపాత్మా భవేచ్చండాలజన్మవాన్॥ తస్య వై నిష్కృతిర్నాస్తి యమలోకాత్కదాచన। రాజవిజయే॥ శ్లో॥ బ్రాహ్మణస్సముపాదాయ హారిణీం వనసంభవాం। క్రీత్వా వా రాజరాజేంద్ర హింసార్థం విక్రయేద్యది॥ స వై నరకమాసాద్య తత్ర భుక్త్వా [illegible] చండాలత్వమవాప్నుయా

త్॥ తత్పాపశోధనార్థాయ నవరాత్రిం ప్రాహపద్మభూః॥ ప్రాతస్స్నాత్వా యథాచారం నిత్యకర్మ సమాప్యచ ॥ రహస్థానముపావిశ్య స్వగృహ్యాగ్నావిధానతః॥ అగ్నీంధనాదిపాత్రాంతే పిష్టాజ్యసహితైస్తిలైః ॥ విరజాహోమవిధినాకృత్వా హోమసహస్రకం । జయాదింశ్చతతో హుత్వా హోమశేషం సమాపయేత్। ఫలాహారః ప్రకర్తవ్యో హోమకర్మఫలాప్తయే । సాయంసంధ్యాముపాసీత తతశ్చౌపాసనంచరేత్। అగ్నింసంరక్షయేద్ధీమాన్యావద్దీక్షాసమాప్యతే॥ ఏవంపంచదినంకృత్వా విరజాహోమమాదరాత్ । భవేద్విప్రోవిశుద్ధాత్మాతస్మాత్పాపాత్ప్రముచ్యతే ॥ సహస్రమిత్యత్రతిలాన్ జుహోమీతిసంకల్ప్య చతుర్వింశతిభిర్వాక్యైః పృథక్పృథక్సంఖ్యాకర్తవ్యా॥ తైర్వాక్యైస్తిలైస్సహస్రసంఖ్యాభవతి ॥ ఏతయాసంఖ్యయా పంచరాత్రం పంచసహస్రం జుహుయాదితి వేదితవ్యం॥ ఇతిహేమాద్రిపరిగణితే హరిణీవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౦) ఇకను హరిణీవిక్రయ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ అరణ్యమునందైనను, గృహమునందైనను బుట్టినలేడిని ద్రవ్యలోభముచేత విక్రయించిన బ్రాహ్మణుడు బ్రహ్మహత్యకు దుల్యమైన పాపమును బొందునని లింగపురాణమునందు జెప్పబడెను. దేవాలయమునందైనను, గృహమునందైనను, పెంచినమృగాంగనను విక్రయించినబ్రాహ్మణుడు మహాపాతకుడగునని యును, చండాలత్వమును బొందునని యును, మాత్స్యపురాణమునందు జెప్పబడెను. అరణ్యమునందైనను, గృహమందైనను, బుట్టినహరిణినిమిగులనాదరముతో హింసకులకు విక్రయించినబ్రాహ్మణుడు పాపాత్ముడైనరకమునుబొందును. పిమ్మట జండాలుడైపుట్టును. అట్టివానికిప్రాయశ్చిత్తమెందును లేదని చతుర్వింశతిమతమునందు జెప్పబడెను. బ్రాహ్మణుడగువాడు వనమందుబుట్టినహరిణీనికొని హింసకులకు నితరులకు విక్రయించిన యెడల నరకలోకమునుబొంది ఘోరములగు కష్టములను బొందును. మఱియును పిమ్మట భూలోకమునందు జండాలుడైపుట్టును. కావున నట్టిపాపముపోవుటకొఱకు ప్రాయశ్చిత్తము నాచరించవలయును. అదియెట్లనఁ బ్రాతఃకాలమునందు స్నానమునుజేసి నిత్యకర్మలను సమాప్తిబొందించి రహస్యస్థానమునందు బ్రవేశించి స్వకీయమగు గృహ్యాగ్నియందు, అగ్నీంధనాదిపాత్రాంతమందు పిష్టాజ్యసహితములగు తిలలచేత విరజాహోమవిధిచేత హోమసహస్రకమునుజేసి పిమ్మట జయాదిహోమములనుజేసియనంతరమందు హోమశేషమును సమాప్తిని బొందించవలయును. హోమక

ర్మఫలాప్తికొఱకు ఫలాహారమును జేయవలయును. సాయంసంధ్యావందనమును జేయవలయును. అనంతరమందగ్నిసంరక్షణను జేయవలయును. ఇవ్విధముగ దీక్షముగియునంతవఱకును జేయవలయును. ఈప్రకారమైదుదినములువిరజాహోమమును మిగుల నాదరముతోఁ జేసినయెడల పరిశుద్ధుడై పాపరహితుడగును. సహస్రహోమస్థలమునందు "తిలాన్ జుహోమి,, అనిసంకల్పమునుజేసి చతుర్వింశతియగు వాక్యములచేత వేరువేరుగ సంఖ్యనుజేయవలయును. ఆవాక్యములచేత తిలలతోగూడ సహస్రసంఖ్యయగుచున్నది. యీప్రకారమైదుదినములైదువేలహోమమును జేయవలయునని రాజవిజయమునందుజెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రమునందు హంసీవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము.

———— రురువిక్రయప్రాయశ్చిత్తమ్. ————

(౭౧) అథరురువిక్రయప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ శ్లో॥ యజ్ఞార్థంకల్పితఃపూర్వంబ్రహ్మణాపద్మయోనినా। యస్మిన్ దేశేమృగః కృష్ణస్సదేశఃపుణ్యవాసహ॥ తంక్రీత్వావాగృహీత్వావా పూర్వజోధనతృష్ణయా। విక్రయేత్వాకర్మభ్యస్సచండాలత్వవానిహ। తస్మాన్నవిక్రయేద్ధీమాన్ రురుం స్వప్నేపినారద। విక్రయేద్యదిమూఢాత్మాప్రాయశ్చిత్తీభవేత్తదా॥ లైంగే॥ శ్లో॥ బ్రహ్మణాకల్పితరురుంసంపాద్యహాయత్నతః॥ పూర్వాజస్సంగదోషేణవిక్రయేద్యదిపాపినే। మహాంతంనరకంగత్వా చండాలస్సభవేదిహ॥ తస్యహైనిష్కృతిర్నాస్తితిప్రజాస్మసుభూమిప॥ స్వగృహ్యాగ్నౌ విధానేనదశరాత్రమతంద్రితః॥ కూశ్మాండైర్గణహోమైశ్చ సహస్రంజుహుయాత్తిలాన్॥ ఏతైశ్శుద్ధిమవాప్నోతి నాన్యథాతస్యపాపినః॥ సహస్రంకూశ్మాండహోమః॥ తదర్ధంగణహోమః॥ తమగ్నిందశరాత్రమజస్రంధృత్వా దశరాత్ర ఫలాహారంస్థండిలేశయనంచకృత్వాశుధ్యతి॥ ఇతి హేమాద్రివిరచితే రురువిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౧) రురువను భేదముగలహరిణమును విక్రయించుటకు ప్రాయశ్చిత్తము॥ పద్మసంభవుడగు బ్రహ్మదేవునిచేత తొల్లియజ్ఞముకొఱకు కృష్ణమృగము, ఏదేశమునందు సృజింపబడినదో యాదేశము పుణ్యదేశమని యెఱుంగవలయును. ఆటువంటి మృగమునుకొని బ్రాహ్మణుడగువాడు ద్రవ్యాశచేత విక్రయించిన యెడల చండాలత్వమును బొందును. అందువలన రురునామకమృగమును బ్రాహ్మణుడగువాడు విక్రయింపగూడదు. ఒకవేళబుద్ధిలోపముచేత విక్రయించినయెడల ప్రాయశ్చిత్తమును జేసికొనవలయు

నని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. బ్రహ్మచేత కల్పింపబడిన రురుమృగమును బహుప్రయత్నములచేత సంపాదించిన బ్రాహ్మణుడు దుస్సాంగత్యమువలన విక్రయించెనేని గొప్పదగునరకమును బొందును. పిమ్మట చండాలుడై పుట్టును. అట్టివానికి మూడుజన్మలయందును నిష్కృతిగలుగనేరదు. అయినను ప్రాయశ్చిత్తముచేత నిష్కృతిగలుగును. అదియెట్లనినబదిదినములు ప్రమాదరహితుడై స్వగృహ్యాగ్నివిధానముచేత వేయికూశ్మాండహోమములను, గణహోమములను జేయవలయును. ఇట్లు చేసినయెడల పరిశుద్ధుడగును. అనగా కూశ్మాండహోమములను వేయింటిని జేయవలయును. గణహోమములైదునూఱులు సేయవలయును. ఆయగ్నినిపదిదినములు కాపాడుచుస్థండిలశాయియై ఫలములనుమాత్రము భుజించుచునుండవలయును. ఇట్లు చేసినయెడల పరిశుద్ధుడగునని లింగపురాణమునందు జెప్పబడె. ఇట్లని హేమాద్రి విరచిత ధర్మశాస్త్రమునందు రురువిక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము॥

(*) అశ్వవిక్రయప్రాయశ్చిత్తమ్. (*)

(౭౨) అథాశ్వవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మకైవర్తే॥ శ్లో॥ ఉత్తమాశ్వంగృహేజాతం క్రీత్వామూల్యైరనేకశః॥ పోషయిత్వాచిరంకాలంవిప్రస్తంవిక్రయేద్యది। కాలకూటముపాగమ్యయమలోకేభయంకరే। పునర్భవముపాగమ్యవ్యాధోభవతికాననే॥*॥ పాద్మే॥ శ్లో॥ మెరుమందరతుల్యానిపాపానివివిధానిచ। రుద్రజాప్యపరిహారేణ్ణకన్యాహయవిక్రయీ। హయవిక్రయిణఃపాపంయత్రకుత్రనహీయతే॥ తస్మాదేతత్పరిత్యాజ్యం పూర్వజైఃపాపభీరుభిః॥*॥ శివపురాణే॥ శ్లో॥ కన్యాందాసీంహయంవిప్రః పోషయిత్వాప్రయత్నతః॥ తానేతాన్విక్రమేత్వాపి వ్యాధోభవతికాననే॥*॥ విష్ణుధర్మోత్తరే॥ శ్లో॥ కన్యాంహయంచదాసీంచస్వగృహేసంభవాన్ శుభాన్॥ పోషయిత్వాద్విజోలోభాత్పశ్చాదేతాంశ్చవిక్రమేత్। సభుక్త్వాయాతనాస్సర్వాఃపశ్చాద్వ్యాధోభవేదిహ॥ తస్యదేహవిశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తమిదంశుభం॥ ఉత్తమాశ్వంద్విజఃకస్మైవిక్రయిత్వాచరేద్విధిం। సాధారణహయేరాజన్తత్తప్తకృచ్ఛ్రం విశోధనం॥ బడబావిక్రయేతాతప్రాజాపత్యంసమాచరేత్॥ బాల్యేపరాకం పౌగండేతప్తం యౌవనేహయావకం। తదర్ధంవిప్రనారీణాంప్రోక్తం రాజవైశ్యయోః। తత్స్త్రీణాంచతదర్ధంస్యాత్పాదకమూల్యమాహరేత్। ఏవంవిప్రోభవేత్పూతః పాపాదస్మాద్విశాంపతే॥*॥ ఇతిహేమాద్రివిరచితేఽశ్వవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౨) అశ్వవిక్రయప్రాయశ్చిత్తము॥ గృహమునందుబుట్టినయుత్తమాశ్వమునైనను, క్రయముచేతసంపాదించినయశ్వమునైనను, చిరకాలము పోషించి ద్రవ్యాశచేతవిక్రయించినయెడల యమలోకమునందు కాలకూటమను పేరుగలనరకమునుబొందును. పిమ్మటవ్యాధుడైపుట్టునని బ్రహ్మకైవర్తమునందుజెప్పబడియె. నానావిధములును, మేరుమందరతుల్యములునునగు పాపములు రుద్రదేవతాకమంత్రమునుపఠించుటచేతనశించును. పంచాక్షరీమంత్రమునుజపించుటచేత హయవిక్రయకన్యావిక్రయ జన్యపాపములుశాంతినిబొందనేరవు. కావునకన్యావిక్రయ హయవిక్రయములను జేయగూడదని పాద్మమునందుజెప్పబడియె. బ్రాహ్మణుండగువాడుకన్యకను, దాసిని, గుఱ్ఱమును, బహుప్రయత్నములచేతపోషించి ద్రవ్యాశచేతవిక్రయించినయెడలమరణానంతరమందు కొంతకాలమునరకమననుభవించి పిమ్మటనరణ్యమునందు వ్యాధుడై పుట్టునని శివపురాణమునందుజెప్పబడియె. స్వగృహమునందు బుట్టినకన్యను, హయమును, దాసిని, చిరకాలము పోషించినబ్రాహ్మణుడు లాభముకొఱకువిక్రయించినయెడల ఘోరనరకములయందుపడి దుఃఖములననుభవించిపిమ్మటవ్యాధుడైపుట్టును. కావునతత్పాపనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నుత్తమాశ్వమును విక్రయించినబ్రాహ్మణుడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. సాధారణహయమును విక్రయించినయెడల తప్తకృఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. బడబను విక్రయించినయెడల ప్రాజాపత్యకృఛ్రము నాచరించవలయును. బాల్యమునందుపరాకమును, పౌగండమునందుతప్తకృఛ్రము, యౌవనమునందుహయాంతకమును నాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమునువిధించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమునేవిధించవలయును. క్షత్రియవైశ్యులకు స్త్రీలకుపురుషులకువిధించినప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. శూద్రుడీనుష్కృత్యమును జేసినయెడల వానిధనమునుసర్వమును హరించవలయును. ఇట్లుప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధులగుదురని విష్ణుధర్మోత్తరమునందుజెప్పబడియె. ఇట్లని హేమాద్రియందలి యశ్వవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

——(*) దుష్టమృగవిక్రయప్రాయశ్చిత్తమ్. (*)——

(౭౩) అథదుష్టమృగవిక్రయ ప్రాయశ్చిత్తమాహ॥ శంభురహస్యే శ్లో॥ సింహవ్యాఘ్రశ్చ భల్లూకః కిటిశ్శల్లక ఏవచ॥ శశభక్షఖడ్గినో వై చ తేష్వ

గా దుష్టసంజ్ఞితాః॥ ఏతాన్ గృహీత్వా దుష్టాత్మా జాలైః శ్వభిశ్చశంకుభిః వ్యాధసంసర్గతామేత్య విప్రో లోకవిగర్హితః। తానాదాయను దారాజక్ష విక్రయేద్యావిలీలయా। తస్య దేహవిశుద్ధ్యర్థం పరాకం మునిచోదితం। ఏతేన శుద్ధిమాప్నోతి నాన్యథా శుద్ధిరిష్యతే॥ ఇతి హేమాద్రివిరచితే సింహాది దుష్టమృగవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౩) దుష్టమృగవిక్రయప్రాయశ్చిత్తము ॥ సింహము, వ్యాఘ్రము, భల్లూకము, కిటి, శలలము, శరభము, ఖడ్గము, అనునవి దుష్టమృగములనబడును. జాలముల చేతను, శ్వభ్రముల చేతను, శంకువుల చేతను నిట్టి దుష్టమృగములను గ్రహించిన బ్రాహ్మణుడు వ్యాధసాంగత్యము గలవాడగుటచేత నింది తుడగును. మఱియు నిట్టి మృగములను గ్రహించి ద్రవ్యాదులకొఱకు విక్రయించి నచో బ్రాహ్మణుడు తత్పాపశాంతికొఱకు పరాకకృచ్ఛ్రము నాచరించవలయు నని యును నిట్లు చేసిన యెడల పరిశుద్ధుడగునని యును శంభురహస్యమునందు జెప్పబడె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు సింహాదిదుష్టమృగవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— ఆరణ్యకమృగపక్షి విక్రయప్రాయశ్చిత్తం. ——

(౭౪) అథారణ్యకమృగపక్షివిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ శ్లో॥ టిట్టిభం చక్రవాకం చ హంసం కారండవం తథా। మయూరం సారసం చైవ చమరీమృగమేవ చ। వార్షం చ మృగనాభిం చ కపోతం జాలపాదకం॥ శుకం చాషం బలాకం చ శింశుమారం చ కచ్ఛపం ॥ శారికాం చ భరద్వాజం మేచాన్యే పక్షిణ స్తథా। ఏతాన్యో ద్రవ్యలోభేన ద్విజో యది హ విక్రయేత్ ॥ తస్యైవ శుద్ధి రుదితా ద్వాదశాహమభోజనం । మకరం నకులం కాకం కుక్కుటం మూషికం తథా। మార్జారం నాకులం సర్వం భారద్వాజం కపిం తథా ॥ డోకాం చ టకం శ్వానం విక్రయేద్యది పూర్వజః॥ సుపర్ణ గృధ్ర శ్యేనాంశ్చ శివాంకంకం సృగాలకం। కృచ్ఛ్రార్ధమాచరేద్విద్వాన్ జ్ఞాత్వా తద్ద్విగుణం చరేత్॥ ఇత్యారణ్యకమృగపక్షివిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౪) ఆరణ్యకమృగపక్షివిక్రయప్రాయశ్చిత్తము॥ టిట్టిభమును, చక్రవాకమును, హంసమును, కారండవమును, మయూరమును, సారసమును, చమరీమృగమును, వార్షమును, మృగనాభిని, కపోతమును, జాలపాదకమును, శుకమును, చాషమును, బలాకమును, శింశుమారమును, కచ్ఛపమును, శారికను, భరద్వాజమును, ఇంకననేకములగు పక్షులను ద్రవ్యలోభము చేత విక్రయించిన యెడల పాపవంతుడగును. అట్టి పాపమునివృత్తించి పోవుట

కొఱకు పదిరెండుదినముల భోజనవ్రతము నాచరించవలయును, మకరమును, నకులమును, కాకమును, కుక్కుటమును, మూషికమును, మార్జారమును, నాకులమును, సర్పమును, భారద్వాజమును, కపినీ, డేరికను, చటకమును, శ్వానమును, సుపర్ణగృధ్రశ్యేనములను, శివచిహ్నాంకితములగు మృగాదులను బ్రాహ్మణులగువారు విక్రయించినయెడల పాపవంతుడగును. కావునదత్పాపశాంతికొఱకు కృచ్ఛార్ధమును ప్రాయశ్చిత్తముగ నాచరింపవలయును. ఈదుష్కృత్యమును దెలిసిచేసినయెడల ద్విగుణప్రాయశ్చిత్తము నాచరింపవలయునని దేవీపురాణమునందు జెప్పబడియె. ఇట్లు నియారణ్యకమృగపక్షివిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

## —— గోధూమతిలమాషవిక్రయప్రాయశ్చిత్తమ్. ——

(౭౫) అథగోధూమతిలమాషవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ గోధూమాశ్చతిలామాషాహవ్యకవ్యశుభప్రదాః స్వకృషిప్రాపితా రాజన్ పితృప్రీతికరాశ్శుభాః ॥ ద్విజోయదిహాలోభేనసంవయార్థంహివిక్రయేత్। నతస్యైవనిష్కృతిర్నాస్తియమలోకాత్కదాచన॥ లైంగే॥ శ్లో॥ గోధూమతిలమాషాన్యోస్వకృషేరుద్భవాన్ సమాన్। ధర్మశాస్త్రం పరిత్యజ్యవిప్రోయదిహవిక్రయేత్॥ తస్యాన్యాయనిష్కృతిర్నాస్తియమలోకాత్సుదారుణాత్ మహారాజపిజయే॥ శ్లో॥ తిలాన్ గోధూమమాషాంశ్చ స్వకృషేరుద్భవాన్ ద్విజః॥ విక్రయేద్ధనలోభేనమహాంతంనరకంవ్రజేత్ । గోధూమవిక్రయేరాజన్ ప్రాజాపత్యంసమాచరేత్॥ మాషాణాంతప్తమాత్రంచతిలానాంచాంద్రభక్షణం। ఏతత్ప్రాయశ్చిత్తంభారీప్రమాణేయోజనీయం। అల్పవిక్రయేతదర్ధంతత్పత్నీనాంతదర్ధం। రాజ్ఞాంవిప్రవత్ప్రాయశ్చిత్తం। వైశ్యస్యసహజత్వ। శూద్రాదీనాంచనదోషః ॥ ఇతిహేమాద్రివిరచితే గోధూమతిలమాషవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౫) గోధూమతిలమాషవిక్రయప్రాయశ్చిత్తము ॥ గోధూమములు, తిలలు, మాషములు, అనునవిహవ్యకవ్యములయందు శుభప్రదములు. స్వకీయమగుకృషిచేత నీధాన్యములను పండించినయెడల పితృప్రీతికరములగును. ఇట్టిధాన్యములను బ్రాహ్మణుడగువాడువిక్రయించెనేని పునరావృత్తి హీనముగ యమలోకమునందుదుఃఖములనుబొందునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. స్వకీయమగుకృషివలనఫలింపజేసిన గోధూమతిలమాషయవలను బ్రాహ్మణుడగువాడు ధర్మశాస్త్రములనతిక్రమించి ద్రవ్యాశచేతవిక్రయించినయెడల [illegible] పురాణమునందు

జెప్పఁబడియె. స్వకీయమగుకృషివలనఁబుట్టిన తిలగోధూమమాషములనువిక్ర యించినబ్రాహ్మణుఁడు మిగుల పాపవంతుఁడగును. అదికారణముగ నరక లోకమునుబొందును. కావుననట్టిపాపమునివర్తించిపోవుటకొఱకు ప్రాయ శ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనినగోధూమములను విక్రయించిన యెడల ప్రాజాపత్యకృఛ్రము నాచరింపవలయును. మాషములను విక్రయిం చినయెడల తప్తకృఛ్రము నాచరించవలయును. తిలలనువిక్రయించెనేని చాం ద్రాయణవ్రతము నాచరింపవలయును. ఈప్రాయశ్చిత్తము పుష్కలముధాన్య మును విక్రయించినయెడలనని తెలియవలయును. అల్పవిక్రయమునందు తదర్థ మును నాచరింపవలయును. ఈకృత్యమునుబ్రాహ్మణస్త్రీలువిక్రయించినయె డల, అర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును. రాజులకు బ్రాహ్మణులకువి ధించినప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయును. వైశ్యులకీకృత్యము సహజముగనుక ప్రాయశ్చిత్తమువిధింపనక్కరలేదు. శూద్రాదులకును దో షములేదు. ఇట్లని మహారాజవిజ్ఞానమునందుఁ జెప్పఁబడియె. ఇట్లు హేమా ద్రివిరచిత ధర్మశాస్త్రమునందు గోధూమతిలమాషవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము.

——✻ ముద్గతండులవిక్రయప్రాయశ్చిత్తమ్. ✻——

(౭౬) అథముద్గతండులవిక్రయ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండే యపురాణే॥ శ్లో॥ ముద్గాశ్చతండులారాజన్ సర్వజంతూపకారకాః। బ్ర హ్మణాలోకరక్షార్థం సృష్ట్వాదౌసృష్టవానిమాన్। హవ్యకవ్యేషుశస్తాస్స్యు ర్విప్రాణాంచవిశేషతః॥ ద్రవ్యస్యసంచయార్థంవా వ్యతలోభపరాయణః॥ విక్రయేద్యస్తుమూఢాత్మా నరకంప్రతిపద్యతే॥ మరీచి॥ శ్లో॥ ముద్గాశ్చతండు లారాజన్ బ్రహ్మణానిర్మితాఃపురా। తాన్విక్రయిత్వాయోవిప్రో ద్రవ్యలో భపరాయణః। నరకంప్రతిపద్యాశుకష్టజాతిర్భవేదిహ। గౌతమధర్మే। శ్లో॥ తండులాంశ్చైవముద్గాంశ్చ విప్రోలోభపరాయణః। విక్రయేద్యస్తుమూఢా త్మా ప్రాయశ్చిత్తీభవేదిహ। ప్రాజాపత్యంతండులేషు తప్తంముద్గేషుశస్య తే। ఖారికాయామేవమేవ తదర్ధంచతదర్ధకే। ఏకవారవిక్రయేప్రాయశ్చిత్త మిదం। ద్వివారేద్విగుణం। అభ్యాసేచతుర్గుణం॥ అతఃపరం ద్విజశ్శూద్ర తు ల్యఇత్యర్థః। తత్ స్త్రీణాంతదర్ధం। క్షత్రియాణాంవిప్రవత్ప్రాయశ్చిత్తం వై శ్యస్యసహజమేవ। శూద్రాదీనాంనదోషః॥ ఇతిహేమాద్రివిరచితేధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే ముద్గతండులవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౬) ముద్గతండుల విక్రయప్రాయశ్చిత్తము॥ పెసలు,తండులములు

మొదలగునవి సకల జంతువులకును జీవనాధారములు, బ్రహ్మదేవుఁడు జగత్తులను సృజించుకాలమునందు ముందుగ జీవనాధారములగు నీధాన్యాదుల నుసృజించె. కావున బ్రాహ్మణాదులకు హవ్యకవ్యాదిక్రియలయందలియుత్తమములు. కావున వీనిని ద్రవ్యాశచేత విక్రయించినయెడల నరకమునుబొందు నని మార్కండేయ పురాణమునందుఁ జెప్పఁబడియె. మరీచిమునివరుఁడును నిటులనేవర్ణించిచెప్పె. బ్రాహ్మణుఁడగువాఁడు తండులమునైనను, పెసలనైనను, ద్రవ్యాశచేత విక్రయించినయెడల పాపవంతుఁడగును. అదికారణముగ నరకమునుబొందును. కావునఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనినఁ దండులములను విక్రయించినవానికి ప్రాజాపత్యకృచ్ఛ్రమును విధించవలయును. పెసలను విక్రయించినయెడల తప్తకృచ్ఛ్రమునాచరించవలయును. ఈప్రాయశ్చిత్తము పుట్టెడు పరిమాణముగల తండులాదులు విక్రయించినపుడని యెఱుంగవలయును. అంతకుఁ దక్కువపరిమాణముగల తండులాదులను విక్రయించినపుడు ప్రాయశ్చిత్తమునుగూడఁ దగ్గించుకొనవలయును. ఈప్రాయశ్చిత్తమునొక్కతూరి విక్రయించినవానికని తెలియవలయును. రెండుపర్యాయములు విక్రయించినవానికి ప్రాయశ్చిత్తమును ద్విగుణముగ నాచరింపవలయును. క్షత్రియులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. వైశ్యులకీకృత్యముసహజమేగనుక ప్రాయశ్చిత్తములేదు. శూద్రులకును దోషములేదని గౌతమ ధర్మములయందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రాంతర్గతప్రాయశ్చిత్తాధ్యాయమునందు ముద్గతండుల విక్రయ ప్రాయశ్చిత్త విధానము సమాప్తము.

——* వ్రీహ్యాదిధాన్యవిక్రయప్రాయశ్చిత్తమ్. *——

(౪౪) అథవ్రీహ్యాదిధాన్యవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ హైంగః॥ శ్లో॥ వ్రీహయశ్చణకారాజక శ్యామాకాః కోద్రవా స్తథా। ప్రియంగవః కులత్థా శ్చయావనాళా మహాన్నతాః॥ ఏతాని కృషిజాతాని స్వోద్భవాని నృపోత్తమ। ఏతేషాం విక్రయం కృత్వా నిత్యకర్మసమాచరేత్॥ నిత్యకర్మవదర్శపౌర్ణమాసాగ్రయణష్టునపి తాబ్దికాదికం తదర్థం తేషాం విక్రయేన దోషః। ద్రవ్యసంచయార్థం విక్రయే దోషమాహ॥*॥ కార్ష్మే॥ శ్లో॥ సక్రయిత్వా ద్విజో ధాన్యం నిత్యలోపేనదోషభాక్। ఆత్మనశ్శోభభోగార్థం వహంతం సరకం వ్రజేత్॥ వరాహపురాణే॥ శ్లో॥ ద్విజశ్చవిక్రయేద్ధాన్యం లోపశ్చేన్నిత్యకర్మణాం। అథ ఖాదోషమాసాద్య మృత్వా నరకమశ్నుతే। సర్వేషాం ధాన్యజాలానాం వి

క్రమేతుపృథాద్విజః । ఆత్మపుత్ర స్వదారాణాం భోగార్థంయదివాపునః।
ప్రాయశ్చిత్తమిదంకృత్వా శుద్ధిమాప్నోతిపూర్వజః । అర్ఘేపరాకోపిప్రా
ణామనర్ఘేచాంద్రమీరితం । ఏకస్మిన్వత్సరే తాతప్రాయశ్చిత్తమితీరితం । ద్వితీ
యేద్విగుణంప్రోక్తం తృతీయేశూద్రవత్తతః। తత్పత్నీనాంతథాప్రోక్తంక్షత్రి
యోవిప్రవచ్చరేత్ ॥ అన్యథాదోషమాప్నోతి యథాశూద్రస్తథైవసఃఇతి॥
ఇతి హేమాద్రివిరచితే నానాధాన్యవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౭) వ్రీహ్యాదిధాన్యవిక్రయప్రాయశ్చిత్తము॥ వడ్లు, శనగలు, నెవ్వరిధాన్యము, ఆళ్లు, కొఱ్ఱలు, ఉలవలు, జొన్నలు, మొదలగునవి కృషిజాతములని యెఱుంగవలయును. వీనిని విక్రయించి నిత్యకర్మను, ఆచరించవలయును. ఈధాన్యములను దర్శపౌర్ణమాసాగ్రయణ, పశుపిత్రాబ్దికాదికముకొఱకు విక్రయించినయెడల దోషములేదని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇప్పుడు చెప్పఁబడిన ధాన్యాదులను ద్రవ్యాశచేత విక్రయించి యాద్రవ్యము చేత నిత్యకర్మల నాచరించువాఁడు గోష్పదగు నరకమును బొందునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు నిత్యకర్మల నాచరించుట కొఱకు ధాన్యమును విక్రయించుట వలన దోషములేదు. అట్లుగాక ద్రవ్యమును సంపాదించుట కొఱకు విక్రయించినవాఁడు నరకమును బొందును సకలధాన్యములను, వ్యర్థముగానైనను, ముఖ్యముగ భార్యాపుత్రాద్యుపభోగముకొఱకైనను విక్రయించినవానికిఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును. అర్ఘ్యమునందు పరాక కృఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. అనర్ఘమునందు చాంద్రాయణవ్రతము నాచరించ వలయును. ఒకసంవత్సర మివ్విధముగ విక్రయించినవానికీ ప్రాయశ్చిత్తమును విధించవలయును. రెండుసంవత్సరములయ్యేనేని యీ ప్రాయశ్చిత్తమును ద్విగుణముగ విధించవలయును. మూఁడుసంవత్సరము లీకృత్యమును జేసినవాఁడు శూద్రుఁడగును. ఈకృత్యమును జేసిన బ్రాహ్మణస్త్రీలకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. క్షత్రియునకు బ్రాహ్మణునకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. కానేని క్షత్రియుఁడును శూద్రుఁడగునని వరాహపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు నానావిధధాన్యవిక్రయప్రాయశ్చిత్తవిధానము సమాప్తము.

—— ❀ గుడవిక్రయప్రాయశ్చిత్తమ్. ❀ ——

(౭౮) అథగుడవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ శ్లో॥

డంసంపాద్యయత్నేన దేవకార్యేషుశుద్ధిదం । పలమాత్రంద్విజో దత్వా దేవలోకముపావిశేత్॥ లైంగే॥ శ్లో॥ పూర్వజో బహుభిర్యత్నైః కేదారారామసంభవం । గుడంసంపాద్యబహుధా నకుర్యాత్తస్య విక్రయం॥ మహాంతంనరకంభుక్త్వా యమలోకేసుదారుణం । పునశ్చ్భవముపాగమ్య సరఘాజాయతేధ్రువం॥ పాద్మే॥ శ్లో॥ స్వారామసంభవంవిప్రో గుడంసంపాద్య భూరిశః॥ పశ్చాల్లోభపరీతాత్మా విక్రయిత్వాయమంవ్రజేత్ । భూలోకముపసంగమ్య జాయతేమధుమక్షికా। తస్యనిష్కృతిరుత్పన్నా పలానాం శతవిక్రయే। ప్రాజాపత్యం శతాదూర్ధ్వం సహస్రేచాంద్రమీరితం ॥ తతోధికం విక్రయిత్వా మహాపాపమవాప్నుయాత్॥ చాంద్రాయణద్వయంకృత్వా సహస్రాదధికేద్విజః । శుద్ధిమాప్నోతి రాజేంద్ర నాన్యథాగతిరస్తిహీతి। విప్రాంగనానాంవిప్రస్యార్ధం॥ క్షత్రియాణాంప్రవత్ప్రాయశ్చిత్తం । వైశ్యానాం స్వజాతివిహితమేవ॥ ఇతి హేమాద్రివిరచితే గుడవిక్రయ ప్రాయశ్చిత్తం॥

(౭౮) గుడవిక్రయప్రాయశ్చిత్తము॥ దేవకార్యములయందు శుద్ధిని కలుగఁజేయునట్టి గుడమును మిగులఁ బ్రయత్నముచేత సంపాదించి ఫలమాత్రమిచ్చిన యెడల దేవలోకమును బొందునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు నానావిధములగు ప్రయత్నములచేత కేదారారామములయందుఁ బుట్టిన గుడమును సంపాదించి విక్రయించిన యెడల యమలోకమునందు గొప్పదగు నరకమును బొందును. అనంతరమందు, ఈగయై పుట్టునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు స్వకీయమగు నారామమునందుఁ బుట్టిన గుడమును విక్రయించిన యెడల ఘోరనరకములను బొందును. అనంతరమందు భూలోకమునందీగయైపుట్టును. కావునఁ దత్పాపశాంతికొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నూరుపలములకంటె నధికముగ గుడమును విక్రయించిన యెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. వేయిపలములకంటె నధికముగ విక్రయించినయెడల చాంద్రాయణవ్రతమునాచరించవలయును. అంతకంటె నధికముగ విక్రయించినయెడల మహాపాపమును బొందును. కావున రెండుచాంద్రాయణవ్రతముల నాచరించ వలయును. ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును జేసికొననియెడల నెన్నటికిని దిరుగనినరకమునుబొందును. బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. క్షత్రియులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. వైశ్యాదులకు [illegible]

జేసిన యెడల దోషములేదని పాద్మమునందుఁ జెప్పఁబడె. ఇట్లని హేమాద్రి విరచితమైన ధర్మశాస్త్రము నందలి గుడ విక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము॥

—— ❋ లవణవిక్రయ ప్రాయశ్చిత్తమ్ ❋ ——

(౪౯) అథలవణ విక్రయప్రాయశ్చిత్తమాహ ॥ వారాహే ॥ శ్లో॥ కుడుబంవాల్పమాత్రంవా ప్రస్థంవాథతతోఽధికం । ద్విజఃక్రీత్వావిక్రయేత్తద్యది పణ్యావివృద్ధయే । సఏవనామధారీస్యాద్బైడాలోవిప్రఉచ్యతే । యమలోకముపాగమ్య స్వేదరోగీభవేద్భువి ॥ అసంభాష్యోహ్యపాంక్తేయో బైడాలోవిప్రఉచ్యతే॥ బ్రాహ్మణాఃదశవిధాః॥ శ్లో॥ బైడాలశ్చకపాలశ్చ తంతువాయస్తపోదరః ॥ తక్షకస్స్వర్ణకారశ్చ కార్పాసస్స్వచ్ఛయావణిక్ । శూద్రాపతిఃకర్మహీనోదశధావిప్రసంజ్ఞితాః । తంతుమాత్రధరాస్త్వేతేనసంభాష్యాఃకదాచన ॥ చతుర్వింశతిమతే॥ శ్లో॥ ముఖజోలవణంక్రీత్వావణిగ్భిస్సహలాభతః । పశ్చాత్తద్విక్రయేద్యస్తు సఏవయమమందిరే ॥ స్థిత్వాబహుదినంతత్ర స్వేదరోగీజాయతేభువి॥సతుబైడాలవిప్రస్స్యాదసంభాష్యఃకదాచన । తస్యదేహవిశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తంమనూదితం ॥ లవణంవిక్రయేత్ప్రస్థం తప్తకృచ్ఛ్రద్వయంస్మృతం ॥ మాసంతద్విక్రయంకృత్వా తప్తకృచ్ఛ్రచతుష్టయం । ఋతుమాత్రక్రయేతాత తస్యచాంద్రముదాహృతం॥ ఋతుత్రయేద్వయంప్రోక్తం వత్సరేపతితోభవేత్ ॥ పశ్చాత్తాపసమాయుక్తఃపతితస్యయదస్తిహి । తతుర్యాదితిశేషః । తస్యాపనయనంభూయో నాన్యధాశుద్ధిరీరితా ॥ తత్పత్నీనాంతదర్ధంస్యాత్ క్షత్రియాణాంద్విజోక్తవత్। విట్శూద్రయోస్స్వభావస్స్యాదసౌలవణవిక్రయః ॥ ఇతిహేమాద్రివిరచితేలవణవిక్రయప్రాయశ్చిత్తం ॥

(౪౯) లవణ విక్రయ ప్రాయశ్చిత్తము ॥ ఉప్పునొక్క కుడుపమునైనను, అంతకు నల్పము నైనను, ప్రస్థమాత్రము నైనను, అంతకంటె నధికముగా నైనను, విక్రయించిన యెడల నట్టివిప్రుఁడు నామమాత్ర ధారియనియును, బైడాలవిప్రుఁడనియును జెప్పఁబడును, అట్టివాఁడు యమలోకమునుబొంది పిమ్మట స్వేదరోగముగలవాఁడై పుట్టునని వారాహమునందుఁ జెప్పఁబడియె. మఱియునట్టివాఁడు సంభాషింపఁ దగనివాఁడనియును, అపాంక్తేయుఁడనియును బైడాలవిప్రుఁడనియును జెప్పఁబడె. బైడాలుఁడనియును, కపాలుఁడనియును, తంతువాయుఁడనియును, తపోదరుఁడనియును, తక్షకుఁడనియును, స్వర్ణకారుఁడనియును, కార్పాసుఁ డనియును,

వణిక్కనియును, శూద్రాపతియనియును, కర్మహీనుఁడనియును, బ్రాహ్మణు లుపదివిధములు. యీపదిమందియును యజ్ఞోపవీత మాత్ర ధారులుగాని బ్రాహ్మణత్వ సంపదగలవారుగారనియును ఇట్టివారలతో సంభాషింపఁగూడదనియును స్మృతివచించుచున్నది బ్రాహ్మణుఁడగువాఁడు వణిక్కులతోఁ గూడఁజేరి లవణమునుగాని యధికద్రవ్యలాభముల కొఱకు విక్రయించిన యెడల యమలోకమునం దనేకదినములు నానావిధములగు దుఃఖములను బొందును. పిమ్మటఁజెమటగల శరీరముగలవాఁడగును, అట్టిబ్రాహ్మణుఁడు బైడాలవిప్రుఁడనఁబడును, కావుననట్టివానితో సంభాషింపఁగూడదు, అదికారణముగనట్టి పాపముశాంతిని బొందుటకొఱకు మనూక్తప్రాయశ్చిత్తమునుజేసికొనవలయును, అదియెట్లనినఁ బదునైదుదినములు లవణమునువిక్రయించినవాఁడు తప్తకృచ్ఛ్రవ్రయమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును, మాసముదినములు లవణమును విక్రయించినవాఁడు నాలుగు తప్తకృచ్ఛ్రముల నాచరించవలయును, మూఁడుమాసములీ కృత్యమును జేసినవాఁడు చాంద్రాయణ వ్రతము నాచరింపవలయును, ఆఱుమాసముల కాలమైనను సంవత్సరకాలమైనను లవణమును విక్రయించినవాఁడు పతితుఁడగును, కావునఁబతితప్రాయశ్చిత్తమునే విధించవలయును. మరలను ఁనయన సంస్కారమునుబొందవలయును, బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును, క్షత్రియులకు బ్రాహ్మణులకు విధించినప్రాయశ్చిత్తమునే విధించవలయును, వైశ్యశూద్రులకు ప్రాయశ్చిత్తమక్కరలేదని చతుర్వింశతి మతమునందుఁ జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితమైన ధర్మశాస్త్రము నందలి లవణ విక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము ॥

### —* కార్పాసవిక్రయప్రాయశ్చిత్తమ్. *—

(౮౦) అథకార్పాసవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురాణే ॥ శ్లో ॥ కృషేఃప్రాప్తముత క్రీతంవణిక్త్వ్యతయాద్విజః ॥ తద్విక్రయిత్వాదుష్టాత్మా నరకంప్రతిపద్యతే ॥ తతోభువముపాగమ్య హస్తయోశ్శ్వేతవాన్ భవేత్॥ మార్కండేయే ॥ శ్లో ॥ కార్పాసంకృషిసంభూతం క్రీత్వావాణిజ్యతోద్విజః ॥ విక్రయిత్వా తతఃపశ్చా న్నరకం ప్రతిపద్యతే ॥ తతోనుభూయసుచిరం భువంగత్వాతుపాపవాన్ । జాయతేహస్తరోగీస నసంభాష్యః కదాచన ॥ లైంగే ॥ శ్లో ॥ యఃక్రీత్వాబహుకార్పాసం యద్వాస్వకృషిసంభవం । ద్విజో ... ద్విక్రియ్యాదపాపధీః ॥ సగత్వానరకం

ఘోరం జాయతేశ్వేతపాణికః ॥ పూర్వవన్నిష్కృతిర్దృష్టా మునిభిస్తత్వదర్శిభిః ॥ లవణవిక్రయేవిప్రస్య యత్ప్రాయశ్చిత్తముక్తంతదేవాత్రాపియోజనీయం ॥ స్త్రీణాంక్షత్రియాణామేతదర్ధం ॥ ఇతిహేమాద్రివిరచితేకార్పాసవిక్రయప్రాయశ్చిత్తం ॥

(౮౦) కార్పాసవిక్రయప్రాయశ్చిత్తము ॥ కృషిచేయుటవలననుత్పన్నమైన ప్రత్తినైనను, కొనిన ప్రత్తినైనను విక్రయించిన బ్రాహ్మణుండునరకలోకమునుబొందును. పిమ్మట హస్తములయందు శ్వేతవర్ణము గలవాఁడై పుట్టునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. మార్కండేయపురాణమునందును నిటులనే చెప్పఁబడి యట్టివాఁడు సంభాషింపనర్హుఁడు గాఁడనియును జెప్పఁబడియె. లింగపురాణమునందును నిటులనే చెప్పబడియె. మఱియులవణవిక్రయమునందు ప్రాయశ్చిత్తమును విధించినట్లుగా ప్రాయశ్చిత్తమును విధించవలయును, బ్రాహ్మణస్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును, క్షత్రియులకును నర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును, వైశ్యశూద్రుల కక్కఱలేదు. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి కార్పాస విక్రయప్రాయశ్చిత్తము సమాప్తము ॥

—* నీలీవిక్రయ ప్రాయశ్చిత్తమ్ *—

(౮౧) అథనీలీవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ లైంగే॥ శ్లో॥ నీలీంయః పూర్వజఃక్రీత్వావణిగ్భిఃపాపకర్మభిః । పలంవావింశతిపలంశతంవాథ తతఃపరం । విక్రయేద్యదిపాపాత్మా ససద్యఃపతితోభవేత్ । సగత్వా నరకంఘోరంతంతువాయద్విజోభవేత్ ॥ మహానాదీయే ॥ శ్లో॥ ముఖజోవిప్రతాంత్యక్త్వా వణిగ్భిస్సహపాపకృత్ । క్రీత్వానీలీంఖనైర్వాపివిక్రయేద్యదిలోభతః॥ తస్యాన్యాంప్రకృతిర్నాస్తియమలోకాత్కదాచన । తతఃపునర్భువంగత్వా ద్విజస్స్యాత్తంతువాయకః । స్కాందే ॥ శ్లో॥ నీలీంసంపాద్య విప్రోయో ధనైర్వానిమయేనవా ॥ క్రీత్వాతద్విక్రయేత్పశ్చా న్మహాంతంనరకంవ్రజేత్॥ అనుభూయమహద్దుఃఖం తంతువాయద్విజోభవేత్ ॥ అతఃపశ్చాత్తాపయుక్తః ప్రాయశ్చిత్తంవిశుద్ధిదం ॥ తప్తంచాంద్రాయణంకృత్వాపునస్సంస్కారపూర్వకం ॥ శుద్ధిమాప్నోతినహాతీం నాన్యథాశిఖివాహన ॥ విప్రస్త్రీణాంతదర్ధం ॥ క్షత్రియవైశ్యయోర్విప్రవత్ ॥ వైశ్యస్యాపిగర్హితత్వాత్ ॥ ఇతిహేమాద్రివిరచితే ధర్మశాస్త్రే నీలీవిక్రయప్రాయశ్చిత్తం ॥

(౮౧) నీలివిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు వైశ్యుల సహవాసముచేత నీలివిక్రయమునకు కొనినదైనను తనదుచేనియందు పండించినదై

నను ద్రవ్యమునధికముగ సంపాదింప వలయునని యెడు సంకల్పముతో విక్రయించినయెడల పతితుఁడగును. మఱియును ఘోరనరకములనుబొంది తంతువాయబ్రాహ్మణుఁడై పుట్టునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు విప్రత్వమును వదలి వర్తకులతోఁగూడి పాపవర్తనుఁడై నీలివిక్రయమునకుఁగాని లాభముకొఱకు మరల విక్రయించిన యెడల పాపవంతుడగును. అట్టిపాపాత్ముఁడు పునరావృత్తి రహితముగ యమలోకమునందుండును. అంతట గొన్నిదినములకు తంతువాయబ్రాహ్మణుఁడై పుట్టునని మహానారదీయమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడు నీలిని సంపాదించి ధనమునకు విక్రయించినను, వస్త్రాంతరముల చేత మార్చుకొనినను గొప్పదగు నరకమును బొందును, నరకలోకమునందు గొప్పవగు కష్టములననుభవించి పిమ్మట తంతువాయ బ్రాహ్మణుడై పుట్టును, అందువలన పశ్చాత్తాపమును బొందినవాఁడై పరిశుద్ధతను గలుగజేయునట్టి ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, ఎట్లనిన తప్తకృచ్ఛ్ర చాంద్రాయణము నాచరించినయెడల పరిశుద్ధుడగును, స్త్రీలకీప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును, క్షత్రియ వైశ్యులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమును విధింపవలయును, వైశ్యులకుగూడ నీలివిక్రయము నిందితమయినది. ఇట్లని స్కాందపురాణమునందు జెప్పబడె. ఇట్లని హేమాద్రివిరచితమైన ధర్మశాస్త్రమునందు నీలివిక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము॥

—* పలాండులశునాదివిక్రయప్రాయశ్చిత్తమ్ *—

(౮౭) అథ పలాండులశునాదివిక్రయప్రాయశ్చిత్తమాహ॥ భవిష్యోత్తరే॥ శ్లో॥ పలాండుంలశునంగృంజంకళంజంపూర్వజో నరః ॥ క్రీత్వాస్వారామజంవాపివిక్రయేద్యదిమోహతః ॥ ధనలాభో బహుర్భవేదితి మోహాత్ అజ్ఞానమతియావత్ ॥ తదేవాహ॥ గౌతమః॥ శ్లో॥ కళంజంగృంజనంవిప్రః పలాండుంలశునంతథా ॥ సంపాద్యబహుధామూల్యైర్వణిగ్భావముపాశ్రితః ॥ విక్రీణీయాద్యది తానిహ్యవిచార్యమహాద్భయం। కృతాంతవశగోభూత్వాచిరంకాలంసపాపధీః ॥ భవేత్కార్పాసకోవిప్రః దశజన్మసుపంచసు ॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ విప్రైఃకళంజంలశునం పలాండుంగృంజనంతథా ॥ సంపాద్యమానిబహుధా విక్రయేత్తానిసర్వదా ॥ నరకంయాతిదుష్టాత్మా కార్పాసాఖ్యోభవేద్భువి ॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి చాంద్రాయణ చతుష్టయాత్ ॥ ఔషధార్థంపి బిల్వంచగవ్యంచైకోపవాసతః । ఏతస్మాచ్ఛుద్ధిమాప్నోతి నాన్యథాగతిరస్తిహి ॥ గృంజనకీర్యజనసస్యపర్ణచూర్ణంవిశేషతః॥

కళంజంసురాలేపనంకృత్వా హ్యన్నాదజనకోవటకవిశేషః॥ తద్విక్రయేవిప్ర శ్చాంద్రాయణచతుష్టయంకృత్వాశుధ్యతి। ఔషధార్థంసంభవేఏకాహము పోష్యపంచగవ్యంపీత్వాశుద్ధిమాప్నోతి ॥ ఇతిహేమాద్రివిరచితేధర్మశాస్త్రేప లాండులశునగృంజన విక్రయప్రాయశ్చిత్తం॥

(౮౨) పలాండులశునాదివిక్రయ ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు, పలాండువునైనను, లశునమునైనను, గృంజనమునైనను, కళంజమునైనను ద్రవ్యలాభముకొఱకు విక్రయించినయెడల పాపవంతుడగునని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె. గౌతమమునివరుడును నిటులనే చెప్పి యిట్టిపాపాత్ముడు పదునైదుజన్మలదనుక కార్పాసకుడై పుట్టునని వచించె. మార్కండేయమునివరుడును నిటులనే చెప్పి యిట్టిపాపాత్ముడు నాలుగుచాంద్రాయణములచేత పరిశుద్ధుడగుననియును, రోగనివారణకొఱకు కిట్టివస్తువులను సేవించినయెడల పంచగవ్యప్రాశనను చేయవలయును, ఇంతకంటెబరిశుద్ధుడగుటకు వేరొకకారణమేదియును లేదనియనువచించె. ఇట్లనిహేమాద్రివిరచితమైన ధర్మశాస్త్రమునందు పలాండులశునగృంజన విక్రయప్రాయశ్చిత్తము సమాప్తము॥

## హింగ్వాదివిక్రయ ప్రాయశ్చిత్తమ్.

(౮౩) అథహింగ్వాదివిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ కౌర్మే । శ్లో॥ రామఠంస్వర్ణబంధంవాఏలాంవాజీరకద్వయం। అజామోదంపిప్పలీంచజాతీపత్రంతదుద్భవం। అన్యానిసూక్ష్మద్రవ్యాణిసర్షపాదీనియానిచ॥ ద్విజఃక్రీత్వాథసంపాద్యవిక్రయేద్యదిలోభతః॥ యదిజ్ఞానముపాగమ్యామాసేతప్తం సమాచరేత్॥ మాసద్వయేపరాకంస్యాత్తారయంపశ్చాద్వృతుత్రయే । చాంద్రంతువత్సరేప్రోక్తమభ్యాసేతద్వయంచరేత్॥ ఏతద్ధింగుస్వర్ణబంధవ్యతిరిక్తవిషయం తయోర్ద్వయోర్విశేషమాహ॥ మాత్స్యే॥ శ్లో ॥ రామఠంస్వర్ణబంధంవసామాణిణీంచద్విజోత్తమః॥ సంపాద్యమూల్యతోదిగ్భ్యో విక్రయేద్యదిలాభతః॥ పలద్వయేపరాకస్స్యాత్ప్రాజాపత్యంచతుష్టయే ॥ దశకేతప్తకృచ్ఛ్రంస్యాత్తతశ్చాంద్రాయణంస్మృతం॥ మాససంఖ్యావూర్వవత్ ॥ వత్సరాదూర్ధ్వమభ్యాసేచాంద్రచతుష్టయం। పునస్సంస్కారశ్చస్వర్ణబంధనం నామయత్తాపితస్వర్ణాదిస్పర్శమాత్రేణసర్వం జలప్రాయంభవతితత్స్వర్ణబంధనం॥ ఇతిహేమాద్రివిరచితే ధర్మశాస్త్రేప్రాయశ్చిత్తాధ్యాయే హింగ్వాదివిక్రయ ప్రాయశ్చిత్తమ్॥

(౮౩) హింగ్వాదివిక్రయప్రాయశ్చిత్తము॥ ఇంగువ, స్వర్ణబంధము,

ఏలకులు, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, ఈపేరుగల ఓమము, పిప్పళ్ళు, జాపత్రి, మొదలుగాగలసూక్ష్మవస్తువులను, ఆవాలుమొదలగువానిని, బ్రాహ్మణుడగువాఁడుసంపాదించి లాభముకొఱకువిక్రయించినయెడల పాపవంతుడగును. కావునయిట్టిదుష్కృత్యమును జేసినయెడల ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నీదుష్కృత్యమును మాసముదినములుచేసినయెడల తప్తకృఛ్రము నాచరించవలయును. రెండుమాసములయ్యేనేని పరాకకృఛ్రము నాచరించవలయును. ఆరుమాసములయ్యేనేని కాయకృఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. సంవత్సరమయ్యేనేని చాంద్రాయణవ్రతము నాచరించవలయును. ఈకృత్యమభ్యాసముగనుండెనేని రెండుచాంద్రాయణవ్రతముల నాచరించవలయునని కూర్మపురాణమునందు జెప్పబడియె. ఈప్రాయశ్చిత్తము, ఇంగువ, స్వర్ణబంధముఅనువానికంటె నితరములగువస్తువులనువిక్రయించినపుడనియెఱుఁగవలయును. ఆరెండువస్తువులనుగుఱించియును, మరికొన్నిటనిగుఱించియును విశేషముగజెప్పుచున్నాడు. అదియెట్లనిన, ఇంగువను, స్వర్ణబంధమును, సాంబ్రాణిని, బహుప్రయత్నములుచేసి సంపాదించి ద్రవ్యార్జనకొఱకు విక్రయించినయెడల ప్రాయశ్చిత్తీయుడగును. రెండుపలములను విక్రయించినయెడల పరాకకృఛ్రమునాచరించవలయును. నాలుగుపలములను విక్రయించినయెడల ప్రాజాపత్యకృఛ్రమునాచరించవలయును. పదిపలముల య్యేనేని తప్తకృఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. అంతకుమిగిలెనేని చాంద్రాయణవ్రతమునాచరించవలయును. మాససంఖ్యను పూర్వమునందువలెనే గ్రహించవలయును. సంవత్సరానంతరమందుగూడ నీకృత్యమును, అభ్యాసముతో జేయుచున్నయెడల నాలుగుచాంద్రాయణముల నాచరించవలయును. పునస్సంస్కారమునుగూడ జేసికొనవలయును. స్వర్ణబంధమనగా తాపితస్వర్ణాది స్పర్శమాత్రముచేతనే సర్వమును జలప్రాయమగుచున్నదోయది స్వర్ణబంధనమనబడునని మాత్స్యపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి ప్రాయశ్చిత్తాధ్యాయమునందు హింగ్వాదివిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

## ——— రసవిక్రయప్రాయశ్చిత్తమ్. ———

(౮౪) అథరసవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శ్లో॥ రసం క్రీత్వాద్విజోలోభాద్దేశాంతరముపాగతః ॥ పునస్తద్విక్రయేల్లోభాత్సపాపీ రౌరవంవ్రజేత్॥ లైంగే॥ శ్లో॥ శుభోర్వ్యాం యదావిప్రః క్రీత్వాలోభమపాశ్రితః॥ పక్వాన్నం విక్రయిత్వాతు సవైపాతకీ నరాధమః ॥ తంకదానాల పెద్ద

ద్వాన్యదినిర్నానుపామహి। రసోద్భవాన్యౌషధాని క్రీత్వా విక్రయిత్వావాత
త్పాపమవాప్నుయాత్॥ పరాశరసంహితాయాం॥ శ్లో॥ పూర్ణచంద్రోద
యంచైవవసంతకుసుమాకరం। ఆనందభైరవంచైవమృగాంకంరాజపూర్వకం
భూపతించాగ్నిపుత్రంచస్వర్ణభస్మలతైవచ। జ్వరాంకుశంవిదాహంచగ్రహ
ణీవటకంతథా॥ అన్యాన్యౌషధజాలానిశంభువీర్యోద్భవానివై ॥ గంధకంపా
ర్వతీబీజంసిందూరంహరితాలకం। అభ్రకంతాళకంచైవకుసుమంచాత్మసంభ
వం॥ లాక్షాతైలంచాశ్వగంధంకూశ్మాండాఖ్యఘృతంతథా॥ చించాదిలేహనం
చైవపిప్పల్యాదిఘృతంతథా। విప్రస్త్వేతానిసర్వాణి క్రీత్వాతానినవిక్రయేత్॥
యదిక్రీత్వావిక్రయేద్వాససద్యఃపతితోభవేత్॥ అసంభాష్యోహ్యపాఙ్క్తేయ
స్సర్వకర్మబహిష్కృతః॥ పశ్చాత్తాపసమాయుక్తో విప్రైరుదకృతాంతభీః॥
మండలంనియమంకృత్వాప్రాతస్స్నాత్వాయథావిధి। సూర్యోదయాదాస్తమ
యాదుపవిశ్యసుఖాసనే॥ న్యాసంధ్యానంపురఃకృత్వాజపేన్మంత్రం త్రియంబ
కం। మధ్యాహ్నేపూర్వవత్స్నాత్వామాధ్యాహ్నికమథాచరేత్। పునరాగ
త్యతత్స్థానంజపకర్మసమాచరేత్ । సాయంకాలేఫలాహారస్స్వపేద్భూమౌ
జితేంద్రియః॥ తతఃప్రాతస్సముత్థాయపూర్వవజ్జపమాచరేత్ ॥ ఏతత్త్రయం
యథాభూయాన్మండలేరాజవల్లభ॥ తతశ్శుద్ధిమవాప్నోతిరసవిక్రయజాదిహ
నాన్యథాశుద్ధిరుదితాపూర్వజైర్బహువిత్తమైః॥ ఇతిహేమాద్రివిరచితేరసవి
క్రయప్రాయశ్చిత్తం॥

(౮౪) ఇకనురసవిక్రయప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మ
ణుడగువాడు పాదరసమునుక్రయమునకుసంపాదించి లోభమువలననధికద్ర
వ్యలాభముకొఱకు విక్రయించినయెడల రౌరవాదినరకములను బొందునని
స్కాందపురాణమునందుజెప్పబడియె. పాదరసమునుదొలుతగొనియనంతర
మందు ద్రవ్యలాభముకొఱకువిక్రయించినవాడు పాపాత్ముడగును. కావునన
ట్టివానితోనెప్పటికిని సంభాషణాదికమునుజేయఁగూడదు. రసోద్భవములగు
నౌషధములనుగొని మరలవిక్రయించినను పాపాత్ముడేయగుననియును లింగ
పురాణమునందుజెప్పబడియె. పూర్ణచంద్రోదయము, వసంతకుసుమాకర
ము, ఆనందభైరవము, రాజమృగాంకము, భూపతి, అగ్నిపుత్రము, స్వర్ణ
భస్మము, జ్వరాంకుశము, విదాహము, గ్రహణీవటకము, మఱియునితరము
లగు నౌషధములుగొన్నియును రసమిశ్రితములనబడును. గంధకము, పార్వతీ
బీజము, సిందూరము, హరితాలకము, అభ్రకము, తాళకము, కుసుమము,
లాక్షాతైలము, అశ్వగంధము, కూశ్మాండాఖ్యఘృతము, చించాదిలేహనము

పిప్పల్యాదిఘృతము, అనువానిని, ఇవిగాక యిఁకఁబైనజెప్పబడినవానిని బ్రాహ్మణు డగువాఁడు కొని విక్రయించినయెడల పతితుఁడగును. కావుననిట్టివాఁడు సంభాషింపఁదగినవాఁడు గాఁడనియును, అపాంక్తేయుఁడనియును, సర్వకర్మబహిష్కృతుఁడనియుననఁబడును. ఇట్టిదుష్కృత్యమును జేసినబ్రాహ్మణుండు పశ్చాత్తాపసమాయుక్తుఁడై నలుబదిదినములునియమమును జేసి. యథాశాస్త్రముగ బ్రాతఃకాలమునందు స్నానమును జేసి సూర్యోదయముమొదలుసాయంకాలమువఱకును సుఖాసనమునందుఁగూర్చుండి మున్ముందుగన్యాసధ్యానములను జేసికొని పిమ్మట త్ర్యంబకమంత్రమును జపించవలయును. మధ్యాహ్నకాలమునందుముందుగస్నానమును జేసి మాధ్యాహ్నికకృత్యము నాచరించవలయును. అట్లు సేసికొని తొల్లిటిస్థానమునందుఁగూర్చుని మఱలమునుపటిమంత్రమునేజపించవలయును. సాయంకాలమునందు ఫలాహారుఁడును, స్థండిలశాయియును, జితేంద్రియుఁడును, మరలప్రాతఃకాలమునందు నిద్రను మేల్కాంచి పూర్వమునందువలెనే జపమును జేయవలయును. ఇవ్విధముగనలుబదిదినములలో మూడులక్షలపర్యాయములు జపమును జేయవలయును. ఇవ్విధముగ జేసినయెడల రసవిక్రయజన్యపాపము శాంతమగునని పరాశరసంహితయందు జెప్పఁబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందలి రసవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

—(*) హారిద్రాదిమూలద్రవ్యవిక్రయప్రాయశ్చిత్తమ్. (*)—

(౮౩) అథహారిద్రాదిమూలద్రవ్యవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ శ్లో॥ హారిద్రాంశ్శృంగబేరంచ సూరణంమూలకంతథా। ముస్తాదీన్ద్విజోహృత్వాక్రీత్వావా మూల్యతస్స్వయం॥ విక్రీయేద్యదిలోభాత్మాసమాద్రసమతాంవ్రజేత్॥ సాహందే॥ శ్లో॥ మూలకంసూరణంశుంఠీంహారిద్రాదీనియాని చ। వాణిజ్యభావమాశ్రిత్య విక్రయేద్యదిపాపధీః॥ పలాదిదశపర్యంతంవిక్రయిత్వానదోషభాక్। తతఃపరంమహాన్దోషః ప్రాజాపత్యంసమాచరేత్॥ తత్ స్త్రీణామర్ధముక్తం స్యాద్వృద్ధానాంతేచాంద్రముచ్యతే॥ మరీచవిక్రయేరాజన్ప్రాయశ్చిత్తమిదంశృణు॥ పలాదిదశపర్యంతవిక్రయేతప్తమాచరేత్॥ తతశ్శతపలంక్రీత్వావిక్రయేద్యదిపూర్వజః॥ బుధస్తత్ర మోపరాకంస్యాద్వృషే చాంద్రముదీరితం॥ ఇతి హేమాద్రివిరచితేహారిద్రాదిమూలద్రవ్యవిక్రయప్రాయశ్చిత్తం॥

(౮౩) ఇట్లనిహారిద్రాదిమూలద్రవ్యవిక్రయప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ పసుపు, అల్లము, కంద, ముల్లంగి, తుంగముస్తలు, అనువానిని

క్రయమునకుగాని మరలనధికద్రవ్యముకొరకు విక్రయించినయెడల శూద్రతు ల్యుడగునని లింగపురాణమునందు జెప్పబడియె. మూలకమును, సౌవర్చలవణ ము, శుంఠి, పసుపు, అనువానిని వాణిజ్యభావమునాశ్రయించి విక్రయించిన బ్రాహ్మణుడుపాపవంతుడగును. ఈవస్తువులనొకపలముమొదలు పదిపలము లలోపలవిక్రయించినయెడల దోషములేదు. అంతకంటెనధికముగ విక్రయిం చినయెడల ప్రాయశ్చిత్తార్థముగ ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును. ఇట్టికృత్యము నొక్క-సంవత్స రమునకుగూడ పెమ్మటజేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవల యును. మిరియములనొక్క-పలముమొదలు పదిపలములలోపల విక్రయించిన వానికి తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును విధించవలయును. నూరుపలములమిరియ ములనువిక్రయించినబ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తార్థముగ పరాకకృచ్ఛ్రమునా చరించవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివి రచితధర్మశాస్త్రమునందు హరిద్రాదిమూలద్రవ్యవిక్రయప్రాయశ్చిత్తముస మాప్తము॥

## క్రముకాదివిక్రయప్రాయశ్చిత్తమ్.

(౮౬) అథక్రముకాదివిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయ పురాణే॥ శ్లో ॥ క్రముకఃకదళీమాతులింగందాడిమమేవచ । నాళికేరంచఖ ర్జూరంకపిత్థంతింత్రిణీఫలం। జంబూనిచూతజంబీరంతాళహింతాళజంతథా॥ పనసంబదరీవృక్షఫలముర్వారుకంతథా।ఏతాన్యన్యానియఃక్రీత్వావిక్రయేన్మూఖ జోయది।తస్యదేహవిశుద్ధ్యర్థం పరాకంకృచ్ఛ్రమీరితం।గణయిత్వాపలానీహ పూర్వోక్తానినరాధిప। శతాదూర్ధ్వంసహస్రాంతం విక్రయిత్వైందవంచరే త్॥ తత్స్త్రీణాంతుతదర్ధంస్యాదేవంసర్వత్రనిశ్చితం॥ ఇతిహేమాద్రివిరచితే క్రముకాదిఫలవిక్రయప్రాయశ్చిత్తం॥

(౮౬) క్రముకాదివిక్రయప్రాయశ్చిత్తము ॥ క్రముకము, కదళీఫల ము, మాతులుంగము, దాడిమము, నాళికేరము, ఖర్జూరము, కపిత్థము, తిం త్రిణీఫలము, నేరేడుఫలములు, మామిడిఫలములు, నిమ్మఫలములు, తాళఫల ములు, హింతాళఫలములు, పనసఫలము, బదరీఫలములు, దోసఫలము, అ నువానినికొని మారుబేరమునుబెట్టి విక్రయించినబ్రాహ్మణునకు ప్రాయశ్చి త్తార్థముగ పరాకకృచ్ఛ్రమునువిధించవలయును. నూరుపలములకంటెనధికము గవిక్రయించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. బ్రాహ్మ ణస్త్రీలకు బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవ

లయునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిర చితధర్మశాస్త్రమునందలి క్రముకాదిఫలవిక్రయ ప్రాయశ్చిత్తవిధానము సమాప్తము॥

——(*) చర్మవిక్రయప్రాయశ్చిత్తమ్(*) ——

(౮౬) అథచర్మవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ శ్లో॥ వ్యాఘ్రచర్మరురోశ్చర్మ ఐణేయంవల్కలాదికం ॥ ద్విజఃక్రీత్వాస్వయంపశ్చాద్విక్రయేద్యదిలోభతః॥ సచండాలసమోజ్ఞేయోమృత్వాయమపురంవ్రజేత్।తత్రభుక్త్వామహద్దుఃఖం చర్మకారోభవేద్భువి॥మహారాజవిజయే॥ శ్లో॥ అజినంతౌరవంవ్యాఘ్రచర్మవల్కలంచవిక్రయేత్।ద్విజోయమపురంగత్వాసభవేచ్చర్మకారకః।తస్యైవనిష్కృతిరియంప్రాజాపత్యంవిశోధనం। ఏకవారేపంచగవ్యంద్వివారేయావకంభవేత్॥ త్రివారేబహువారేవాప్రాజాపత్యం సమాచరేత్।అభ్యాసేద్విగుణంప్రోక్తం వర్షాదూర్ధ్వంపతత్యసావితి॥ ఇతి హేమాద్రివిరచితేచర్మవిక్రయ ప్రాయశ్చిత్తం॥

(౮౭) చర్మవిక్రయప్రాయశ్చిత్తము॥ పెద్దపులిచర్మము, రురువనే మృగముయొక్కచర్మము, లేడియనుజంతువుయొక్కచర్మము, నారచీరలుమొదలగునవి, ఈవస్తువులనుగొనిబ్రాహ్మణుడగువాడు విక్రయించినయెడల చండాలతుల్యుడగును. మరణానంతరమందు యమలోకమునుబొంది పిమ్మటభూలోకంబున జర్మకారుడైపుట్టునని దేవీపురాణమునందు జెప్పబడినది. రురుమృగముయొక్కచర్మము, వ్యాఘ్రచర్మము, వల్కలము, అనువానినివిక్రయించినబ్రాహ్మణుడు యమలోకమునుబొంది పిదపచర్మకారకుడైపుట్టును. కావున తత్పాపశాంతికొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించవలయును. ఈకృత్యమునందభ్యాసముగలిగిచేయుచున్నయెడల నీప్రాజాపత్యకృచ్ఛ్రమును ద్విగుణితముగనాచరించవలయును. సంవత్సరానంతరమందుగూడ నీకృత్యమును జేసినయెడలపతితుడగునని మహారాజవిజయమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితమైనధర్మశాస్త్రమునందలిచర్మవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

——(*) దాసీవిక్రయప్రాయశ్చిత్తమ్ (*)——

(౮౮) అథదాసీవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవలధర్మే॥ శ్లో॥ దాసీంక్రీత్వాద్విజోయస్తుమహత్కష్టాదిసంభవే॥ పునస్తాంవిక్రయేద్యస్సరౌరవం నరకంవ్రజేత్॥ గౌతమః॥ శ్లో॥ సంపాద్యదాసీంవిప్రోయంరూపలావణ్యసంయుతాం। యువతీంవిక్రయేద్యస్తుసచండాలసమోభవేత్॥ మార్కండేయపురాణే॥ శ్లో॥ ద్విజస్సంపాద్యయోదాసీంగృహకృత్యసుఖాప్తయే। పశ్చాత్తాం

విక్రయేద్యత్నాత్సచండాలోభవేద్ధ్రువి॥ తస్యనిష్కృతిరుత్పన్నా సాంతపనంజెప్పుమభిచోదితే॥ బాలికావిక్రయేచాంద్రంపౌగండెతద్ద్వయంచరేత్॥ యువతీవిక్రయేతాతపడబ్దంకృచ్ఛ్రమాచరేత్॥పంచగవ్యంపిబేత్ప శ్చాచ్ఛుద్ధిమాప్నోతిపూర్వజః। తత్ స్త్రీణాంతదర్ధకం॥క్షత్రియాణాంవైశ్యానాం చవిప్రవత్ప్రాయశ్చిత్తం॥ఇతి హేమాద్రివిరచితెదాసీవిక్రయప్రాయశ్చిత్తం॥

(౭౮) దాసీవిక్రయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడుముందుగదాసీనిద్రవ్యమునిచ్చికొని క్షామాదులుగలిగినపుడుపోషింపజాలక మరలవిక్రయించినయెడల మరణానంతరమందు రౌరవాదినరకములనుబొందునని దేవలధర్మమునందు జెప్పబడెను. రూపలావణ్యాదులుగలదాసినిసంపాదించి బ్రాహ్మణుడగువాడు మరలవిక్రయించినయెడల చండాలుడగునని గౌతమమునివరుడువచించెను, బ్రాహ్మణుడగువాడుసుఖావాప్తికొఱకుదాసినికొని పిమ్మటవిక్రయించినయెడలచండాలుడగును. కావునదత్పాపశమనముకొఱకు ప్రాయశ్చిత్తమునాచరించవలయును. అదియెట్లనినబాలికనువిక్రయించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. పౌగండవయస్సునందు విక్రయించినయెడల రెండుచాంద్రాయణముల నాచరించవలయును. యువతీవిక్రయము నంపుషడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణులకు విధించినప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకు విధించినప్రాయశ్చిత్తమునే విధించవలయునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితమైనధర్మశాస్త్రమునందలి దాసీవిక్రయప్రాయశ్చిత్తవిధానముసమాప్తము

## దంతనఖవిక్రయప్రాయశ్చిత్తమ్.

(౭౯) అథదంతనఖవిక్రయప్రాయశ్చిత్తమాహ। మార్కండేయపురాణె॥ శ్లో॥ దంతంకరిసముద్భూతమశ్వజంకీటజంతథా। నఖంవ్యాఘ్రసముద్భూతంసంపాద్యద్విజనాయకః॥ పశ్చాత్తాన్విక్రయేన్మోహాద్వ్యవహారపథేనృప॥ యమలోకముపాగమ్యస్థిత్వాతత్రచిరంరుదక్॥ భవేద్భూమాసపాపీయాన్ దంతకారతనుర్మహాన్॥ లైంగె॥శ్లో॥దంతముశ్వసముద్భూతంకరిదంతంచపోత్రిజం।నఖంవ్యాఘ్రిసముద్భూతంక్రీత్వాపశ్చాత్స్వయంపునః।విక్రయాతద్విజోయస్సదంతకారోభవేద్ధ్రువి॥ప్రాయశ్చిత్తమిదంతస్యశోధకం మునిచోదితం।హస్తిదంతేతుశప్తంస్యాదశ్వదంతె తుయావకం।ప్రాజాపత్యంకిటెదకం తెత్రిరాత్రంపనఖవిక్రయే॥తత్ స్త్రీణాంతదర్ధకం॥ ఇతి హేమాద్రివిరచితెదంతనఖవిక్రయప్రాయశ్చిత్తం॥

(౮౯) దంతనఖవిక్రయప్రాయశ్చిత్తము ॥ ఏనుగుయొక్కయు, గుఱ్ఱముయొక్కయు, అడవిపందియొక్కయు, దంతములనైనను, పులిగోళ్లనైనను, బ్రాహ్మణుడగువాడు మిగులప్రయత్నములచేత సంపాదించి పిమ్మటను వ్యక్తుడై వర్తకవ్యాపారమునవలంబించి వైవానినివిక్రయించినయెడల మరణానంతరమందు చిరకాలము యమలోకమునందు దుఃఖములననుభవించుచుండును. పిమ్మటభూలోకమునందు దంతకాంచశరీరముగలవాడై పుట్టునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె. లింగపురాణమునందును నిట్లనే చెప్పబడియె. మఱియును ప్రాయశ్చిత్తవిధానముగూడజెప్పబడెను. అదియెట్లనిన నేనుగుదంతములనువిక్రయించినయెడల తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమునాచరించవలయును. అశ్వదంతములనువిక్రయించినయెడల యావకాహారుడుగావలయును. అడవిపందియొక్కదంతములనువిక్రయించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించవలయును. గోళ్ళనువిక్రయించినయెడల త్రిరాత్రకృచ్ఛ్రమునాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలివ్విధముగజేసినయెడల సగముప్రాయశ్చిత్తమునువిధించవలయుననియును లింగపురాణమునందే చెప్పబడియె. ఇట్లనిహేమాద్రివిరచితమయిన ధర్మశాస్త్రమునందు దంతనఖవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము॥

——(*) ఉపకేశవవిక్రయప్రాయశ్చిత్తమ్ (*)——

(౯౦) అథోపకేశవిక్రయప్రాయశ్చిమాహ॥ గారుడపురాణే॥ శ్లో॥ ఉపకేశాన్ బహూన్ క్రీత్వా విప్రో వాణిజ్యకర్మణి। పునస్తాన్విక్రయేల్లోభాద్భల్లూకో జాయతే భువి॥ లైంగే॥ శ్లో॥ వణిగ్భావముపాశ్రిత్య పూర్వం జోథన లోభతః। క్రీత్వోపకేశాన్ సుగుణాన్ పశ్చాత్తాన్విక్రియేద్యది। సపాపమనుభూయాశుభల్లూకో భువిజాయతే। తస్యదోషవినాశాయ మాసైతప్తమదీరితం। మాసత్రయేతుచాంద్రం స్యాన్మహాచాంద్రంతువత్సరే। వపాన్ దూర్ధ్వం త్రినకీత్వాశాస్త్రతుల్యోభవేదిహ॥ తత్ స్త్రీణాంతుపూర్వవత్॥ఇతి హేమాద్రి విరచితేఉపకేశవిక్రయప్రాయశ్చిత్తం॥

(౯౦) ఉపకేశవిక్రయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు వాణిజ్యకర్మమునందు ప్రవేశించి చమరీమృగాదులయొక్క కేశములనువిక్రయించినయెడల భల్లూకమైపుట్టునని గారుడపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడగువాడు వణిగ్భావమునవలంబించి సుగుణములయొక్క క్రయవిక్రయాదివ్యాపారములను జేసినయెడల పాపవంతుడగును. అవికారణముగభల్లూకమైపుట్టును. అట్టి పాపముపోవుటకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయు

ను. అదియెట్లనిన నీకృత్యము నొకటిమాసముదినములు చేసినయెడల తప్త
కృఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. మూడుమాసములవ్యాసేనిచాం
ద్రాయణవ్రతము నాచరించవలయును. సంవత్సరకాల మాచరించినయెడల
మహాచాంద్రము నాచరించవలయును. సంవత్సరానంతరమందుగూడ నిట్టి
కృత్యమును జేసినయెడల శూద్రతుల్యుడగును. వారిస్త్రీలకు బూర్వోక్తప్ర
కారముగ నాచరించవలయునని లింగపురాణమునందు జెప్పబడెను. ఇట్లని హే
మాద్రివిరచితమైన ధర్మశాస్త్రమునందుపకేశ విక్రయప్రాయశ్చిత్తవిధాన
ముసమాప్తము॥

—— (*) అన్నవిక్రయప్రాయశ్చిత్తమ్. (*) ——

(౯౧) అథాన్నవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ విష్ణుధర్మోత్తరే॥ శ్లో॥
దేవాలయే మహామార్గే స్వగృహే రాజవేశ్మని। అన్నంపక్త్వా ద్విజో యస్తు వి
క్రయేద్యది పాపధీః। శాకకోశాదికాంశ్చైవ హ్యుపదంశమథాపివా। భక్ష్యా
న్నానావిధాన్ రాజన్ ద్రవ్యలోభపరాయణః॥ మహాంతంనరకంగత్వా తేం
హీనోభవేద్భువి॥ లైంగే॥ శ్లో॥ భక్ష్యాన్నానావిధాన్ కామ్యాన్ శాకకోశా
దికాంస్తథా॥ ఉపదంశంతథాప్యంధః పక్త్వామార్గే శివాలయే। పూర్వజః
స్వగృహేన్నభక్ష్యా విక్రయేద్ద్రవ్యలోభతః॥ యమలోకముపాగమ్య భవేద్భూ
మౌదరిద్రవాన్। ఉపదంశే లఘుః ప్రోక్తో మాసంమాసద్వయం చవా॥ కోశేషు
పంచరాత్రంస్యాచ్ఛాకే యావకముచ్యతే। అన్నేమాసద్వయం రాజన్ షడ
బ్దం కృచ్ఛ్రమాచరేత్॥ షణ్మాసే తద్ద్వయం ప్రోక్తం వర్షాణాం తే పతితో భవేత్
వర్షాణాం తే పతిత ప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి। తత్ స్త్రీణాంపూర్వ
వద్వేదితవ్యం।ఇతి హేమాద్రివిరచితే అన్నవిక్రయప్రాయశ్చిత్తం॥

(౯౧) అన్నవిక్రయప్రాయశ్చిత్తము॥ దేవాలయము, గొప్పదగుమా
ర్గము, స్వగృహము, రాజగృహము, అనుప్రదేశములయందు, అన్నమును
వండి విక్రయించినబ్రాహ్మణుడు మహాపాపవంతుడగును. మఱియును శాక
కోశాదులను, ఊరుగాయలు మొదలగువానిని విక్రయించినను మహాపాపవం
తుడగును, ఇట్టిపాపకృత్యములనాచరించుటచేత గొప్పదగునరకమునుబొంది
పిమ్మట భూలోకమునందు హీనుడైపుట్టునని విష్ణుధర్మోత్తరమునందు జెప్ప
బడె. లింగపురాణమునందును నిటులనే జెప్పబడియె. మఱియు ప్రాయశ్చిత్తవి
ధానముగూడ జెప్పబడియె. అదియెట్లనిన నొకటిమాసమైనను, రెండుమాస
ములైనను, ఊరుగాయనువిక్రయించినయెడల విధులుచెప్పబడినది. శాకకో
శవిక్రయమును జేసినయెడల నైదుదినములు యావకాహారమును జేయవలయు

ను. రెండుమాసములన్నమునువిక్రయించినయెడల షడబ్దకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమునాచరించవలయును. ఆరుమాసములన్నమునువిక్రయించినయెడల రెండు షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తములనాచరించవలయును. సంవత్సరకాలానంతరముకూడ నివ్విధముగజేసినయెడల పతితుడగును. కావున సంవత్సరానంతరముకూడ నీదుష్కృత్యమును జేసిన యెడల పతితప్రాయశ్చిత్తమును జేయవలయును. వారిస్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధించవలయుననియును లింగపురాణమునందు జెప్పబడియె. ఇట్లుహేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందన్నవిక్రయప్రాయశ్చిత్తము॥

## (*) గోరసవిక్రయప్రాయశ్చిత్తమ్. (*)

(౯-౨) అథగోరసవిక్రయప్రాయశ్చిత్తమాహ॥సూతప్రోక్తే॥శ్లో॥ పయోదధిఘృతంచ స్తుకీలాలంగోమయంతథావిక్రయేత్పూర్వజోయస్తునారీవావిప్రనందినీ। సద్యఃపతతివిప్రాసౌమాచతుర్భ్యోభవేదిహ॥మహానారదీయే॥శ్లో॥కీలాలంగోమయంరాజన్పయోదధిఘృతంచయత్।నవనీతంతథామస్తుతైలంక్రీత్వాతథామధు। విక్రయేద్యదిమూఢాత్మాపూర్వజోధనసంగ్రహీ। ఏరండతైలమథవాసద్యఃపతతిపాతకీ॥ స్కాందే॥శ్లో॥మధుదుగ్ధంఘృతంమస్తు కీలాలంగోమయందధి॥ తైలమైరండకంచైవక్రీత్వావాగృహసంభవం॥ విక్రీయమాసంచైవాత్రోద్విమాసంవాతపాదరః॥ మాసత్రయేసాచికస్స్యాత్షణ్మాసేమాద్రతాంవజేత్। మాసేతుపరాకంచ ద్వితీయేచాంద్రముచ్యతే॥ తృతీయేకృచ్ఛ్రరాజేంద్రషణ్మాసేతుషడబ్దకం। అతఃపరంపతత్యత్రద్విజోయోగవ్యవిక్రయీ। సంవత్సరాదూర్ధ్వంగవ్యతైలమధువిక్రయేప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధోభవతి। తత్స్త్రీణాంతదర్థం। ఇతిహేమాద్రివిరచితేగోరస విక్రయప్రాయశ్చిత్తం॥

(౯-౨) గోరసవిక్రయప్రాయశ్చిత్తము॥ ఆవుయొక్క-పాలు, పెరుగు, మీగడ, మజ్జిగ, నెయ్యి, పేడ, అనువస్తువులను విక్రయించినయెడల బ్రాహ్మణుడుతత్క్షణమునందేపతితుడగును. ఈకృత్యముబ్రాహ్మణులభార్యలుపుత్రికలుమొదలగువారిలలో నెవ్వరుచేసినను పతితులగుదురని సూతప్రోక్తమునందు జెప్పబడియె. మహానారదీయమునందును నిటులనేచెప్పబడియె. మఱియునేరండతైలవిక్రయమువలనకూడ నిట్టిదోషముగలుగుననియును గూడ జెప్పబడియె. మధు, దుగ్ధము, ఘృతము, మీగడ, కీలాలము, గోమయము, దధి, ఏరండతైలము, అనువానినికొనినదైనను, లేకతనయింటియందుత్పన్నమైయున్నను విక్రయించిన



మాసములు

విక్రయించినయెడల బైడాలబ్రాహ్మణుడనబడును. రెండుమాసములీకృత్యము నుజేసినయెడల తపోదరుడగును. మూడుమాసములు విక్రయించినయెడల సౌచికుడనబడును. ఆరుమాసములువిక్రయించినయెడల శూద్రత్వముంబొందును. కావుననిట్టిపాపముశాంతినిబొందుటకు ప్రాయశ్చిత్తమునాచరించవలయును. మాసముదినములీకృత్యమునుజేసినయెడల తప్తకృఛ్రప్రాయశ్చిత్తమునుజేయువలయును. రెండుమాసములవ్యాసేని చాంద్రాయణమునాచరించవలయును. మూడునెలలీకృత్యమునుజేసినయెడల వడబ్దకృచ్ఛప్రాయశ్చిత్తమునాచరించవలయును. ఇంతకాలమునకు మిగిలియును నీకృత్యమునుజేసినయెడలపతితుడగును. సంవత్సరానంతరమందు గవ్యతైలమధువిక్రయమునందు ప్రాయశ్చిత్తమునుజేసికొనినయెడల పరిశుద్ధుడగును. స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమునువిధించవలయునని స్కాందపురాణమునందుజెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందలిగోరసవిక్రయప్రాయశ్చిత్తముసమాప్తము.

## (*) మధుమాంసవిక్రయప్రాయశ్చిత్తమ్. (*)

(౯౩)అథమధుమాంసవిక్రయప్రాయశ్చిత్తమాహ।సౌపర్ణే॥శ్లో॥ మధుమాంసవిహంగానాం మహాద్రవ్యసమాగమే। క్రీత్వాస్వయంద్విజోమోహాత్పశ్చాత్తద్విక్రయేద్యది। రాజ్ఞాదండ్యస్సపాపీయాంచ్ఛతం సంవ్యాగ్వచార్యేచ॥ మృత్వానరకమాసాద్యభువిచండాలజన్మవాన్॥ లైంగే॥శ్లో॥ మాంసంమధువిహంగానాం సూనువృత్తిముపాశ్రితః। మహద్ద్రవ్యంభవేదస్య విక్రయే భాగ్యవానహం। ఇతిమత్వాద్విజోయస్తుక్రీత్వాతద్విక్రయేత్పునః। మహాపాపమవాప్నోతి రాజాతందండయేచ్ఛతం। ఏకాహంవిక్రయేద్యస్తు మధుమాంసద్వయంముదా।తప్తకృఛ్రంచరేదత్రపంచగవ్యాశతఃపరం। పంచరాత్రంద్విజోయస్తువిక్రయేత్తద్ద్వయంసకృత్ । చాంద్రంతస్యవిశుద్ధ్యర్థంపంచగవ్యంచపూర్వవత్ మాసమేకంద్విజోయస్తువిక్రయేత్పిశితంమధు। రాజ్ఞాసహస్రందండ్యస్స్యాత్షడబ్దంకృచ్ఛ్రమాచరేత్॥ తస్యోపనయనంభూయస్సావిత్రీచాసమేవచ। ద్విజస్త్ర్యజేదిదంకర్మలోకద్వయవిగర్హితం। తత్ స్త్రీణామేవముక్తం॥ క్షత్రియవైశ్యయోరేవమేవవేదితవ్యం॥ ఇతిహేమాద్రివిరచితేమధుమాంసవిక్రయప్రాయశ్చిత్తం॥

(౯౩) మధుమాంసవిక్రయప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడగువాడుమధువును, పక్షులయొక్కమాంసమునుకొని ద్రవ్యలాభముకొఱకువిక్రయించినయెడల రాజగువాడు నూరురూపాయలనపరాధమునువిధించవలయును. ఇట్టిదుష్కృత్యమునుజేసినబ్రాహ్మణుడు మరణానంతర

మందునరకమునుబొంది పిమ్మటజండాలుడైపుట్టునని సౌపర్ణమునందుజెప్పబడినది. మద్యమునైనను, పశువులయొక్క మాంసమునైనను విక్రయించినబ్రాహ్మణుడును, అట్టివ్యాపారమునందు భాగస్థుడైయున్నబ్రాహ్మణుడును, మహాపాపమునుబొందును. అందువలనరాజు వాడు నూఱురూపాయలనుదండుగగాగ్రైకొనవలయును. ఒక్కదినముమధుమాంసములను విక్రయించినబ్రాహ్మణుడు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. పిమ్మటపంచగవ్యప్రాశనను జేయవలయును. ఐదుదినములీకృత్యమును విక్రయించినయెడల చాంద్రాయణవ్రతమునాచరించవలయును. పిదపపంచగవ్యప్రాశననుజేయవలయును. ఒక్కనెలదినములు మద్యమాంసవిక్రయమును జేసినయెడలరాజగువాడు సహస్రదండనను జేయవలయును. అనంతరమందు పాపపరిహారముకొఱకు షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయును. పిమ్మటపునరుపనయనమును జేసికొనవలయును. సావిత్రీదానమును జేయవలయును. ఇట్టి దుష్కృత్యమును బ్రాహ్మణుడగువాడువదలవలయును. ఈకృత్యమును బ్రాహ్మణస్త్రీలుచేసినయెడల సిట్టిప్రాయశ్చిత్తమునేవిధించవలయును. క్షత్రియవైశ్యులకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయునని లింగపురాణమునందు జెప్పబడినది. ఇట్లనిహేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు మధుమాంసవిక్రయ ప్రాయశ్చిత్తవిధానము సమాప్తము॥

(*) సాలగ్రామాదివిక్రయప్రాయశ్చిత్తమ్. (*)

(౯౪) అథసాలగ్రామాదివిక్రయప్రాయశ్చిత్తమాహ॥ శివపురాణే॥ శ్లో॥ ప్రతిమాంలక్షణోపేతాం సాలగ్రామంశివంతథా। చక్రపాణించరాజేంద్రద్విజస్సంపాద్య యత్నతః॥ తదర్చనంపరాకృత్వాభుక్తిముక్తిఫలప్రదం। విక్రయేదాత్మభోగార్థంతస్యపాపఫలంశృణు॥ ఆద్వాదశాబ్దపర్యంతంయమలోకస్సుదారుణః॥ మార్కండేయః॥ శ్లో॥ ప్రతిమాంశివలింగంచ చక్రపాణింద్విజోత్తమాః సంపాద్యబహుభిర్యత్నైరకృత్వా తత్తదర్చనం। విక్రయేద్యదిపాపాత్మా రౌరవంనరకంవ్రజేత్॥ ఆద్వాదశాబ్దపర్యంతంతిష్ఠత్యత్రనసంశయః॥ దేవలః॥ శ్లో॥ సాలగ్రామం శైవలింగంప్రతిమాంచక్రపాణినః ద్విజస్సంపాద్య సహసాతత్తత్పూజాపరాయణః। పశ్చాన్నాస్తిక్యభావేనలోకసాదృశ్యగౌరవాత్॥ విక్రయేద్యదిమూఢ్యేనసపాపీనరకంవ్రజేత్॥ పశ్చాదుద్భూయలోకేస్మిన్ నాస్తికోభవతిధ్రువం॥ మార్కండేయః॥ శ్లో॥ లక్ష్మీనృసింహంరామం చగోపాలంశ్రీధరంతథా।లక్ష్మీనారాయణంచైవ దధివామనమేవచ॥ హి... ...రిణేః॥ సాలగ్రామ...

లారూపాస్తత్తచ్చక్రాంకితాద్విజః ॥ శివలింగంచక్రపాణింప్రతిమాంయదివిక్రయేత్ ॥ రామాదివిక్రయే రాజన్ చరేచ్చాంద్రాయణవ్రతం। లక్ష్మీనారాయణేచైవతద్ధ్వదధివామనే । మహాచాంద్రంప్రకుర్వీత లక్ష్మీనృహరివిక్రయే॥ పరాకంజపహోమార్థం చరేద్విప్రో విచారయన్ । శివేచస్ఫాటికేచైవ క్రీతమారకతేద్విజః । మాసందీక్షాముపక్రమ్య ప్రాతస్స్నాత్వాయథావిధి॥ సూర్యోదయంసమారభ్య యావదస్తంగతోరవిః । తావజ్జపంప్రకుర్వీతసంఖ్యాయావత్సమాప్యతే ॥ ప్రత్యహందశసాహస్రం శైవమంత్రంషడక్షరం। ఫలాహారంప్రకుర్వీత యదామందాయతేరవిః । సంధ్యాదికంసమాప్యైవ స్థండిలేకేవలేస్వపేత్ । పరేద్యుఃప్రాతరుత్థాయ యథాపూర్వం సమాచరేత్। మాసాంతేశుద్ధిమాప్నోతి శివద్రోహీనచాన్యథా ॥ ప్రతిమాంచక్రపాణించ విక్రయిత్వాచరేద్విధుం ॥ స్త్రీణామేతదర్ధం ॥ క్షత్రియవిట్పాదజానాంమహాపాతక ప్రాయశ్చిత్తిర్భవతి ॥ ఇతి హేమాద్రి విరచితే సాలగ్రామాదిప్రాయశ్చిత్తం ॥

(౯౪) సాలగ్రామాదివిక్రయ ప్రాయశ్చిత్తము॥ సకల లక్షణముల తోఁగూడిన ప్రతిమనైనను, సాలగ్రామమునైనను, శివునినైనను, చక్రపాణినైనను, బహుప్రయత్నముచేత సంపాదించిన బ్రాహ్మణుఁడు భుక్తిముక్తిప్రదమగుపూజను జేయక ధనాశచేత విక్రయించినయెడల మిగులఁ బాపవంతుఁడగును. మరణానంతరమందు పదిరెండుసంవత్సరములు ఘోరమగు నరకమునుబొందునని శివపురాణమునందుఁ జెప్పఁబడియె. దేవవిగ్రహము నైనను, శివలింగమునైనను సంపాదించిన బ్రాహ్మణోత్తములు పూజాదికమునువదలి ధనాభివృద్ధికొఱకు విక్రయించినయెడల పదిరెండు సంవత్సరములు రౌరవమను నరకమును బొందునని మార్కండేయ మునివరుఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు ముందుగ సాలగ్రామమునైనను, శివలింగమునైనను, విష్ణుదేవునియొక్క ప్రతిమనైనను నానావిధములగు ప్రయత్నములచేత సంపాదించి కొంతకాలము పూజాదికమును జేసి పిమ్మట నాస్తికత్వమును బొంది యావిగ్రహాదులను విక్రయించెనేని పాపవంతుఁడగును గనుక రౌరవమును పేరుగల నరకమునుబొందును; అనంతరమందు భూలోకమునందు నాస్తికుఁడైపుట్టునని దేవలుఁడువచించె. లక్ష్మీనృసింహ, రామ, గోపాల, శ్రీధర, విగ్రహములు, సాలగ్రామ శిలారూపములు, తప్తచక్రాంకిత విగ్రహములు, శివలింగములు, విష్ణువిగ్రహము, రామాదివిగ్రహములు, అనువానిని విక్రయించినయెడల మహాపాపవంతుఁడగును, కావునఁదత్పాపశాంతికొ

టకు ప్రాయశ్చిత్తము నాచరించవలయును. అదియెట్లనిన రామాదివిగ్రహములను విక్రయించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించ వలయును. లక్ష్మీనారాయణ విగ్రహమును, వెన్నముద్దల కృష్ణుని విగ్రహమును విక్రయించినవాఁడును చాంద్రాయణవ్రతమును నాచరించ వలయును, లక్ష్మీనృసింహవిగ్రహమును విక్రయించినవాఁడు మహాచాంద్రాయణము నాచరించ వలయును, స్ఫటికముచేఁజేయఁబడిన శివలింగమును విక్రయించినవాఁడు తత్పాపోపశమనముకొఱకు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. మాసదీక్షనవలంబించి ప్రాతఃకాలమునందు యథావిధిగ స్నానమునాచరించి సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువఱకును, ఆరక్షరములుగల శైవమంత్రమును పదివేలపర్యాయములు జపించవలయును- క్షుద్బాధపోటకొఱకు ఫలములనుమాత్రము భుజించవలయును,సంధ్యావందనాదికమును జేసి స్థండిలమునందు శయనించవలయును, ఇవ్విధముగఁ బ్రతిదినమును ముప్పదిదినములు వ్రతమునాచరించవలయును, ఇవ్విధముగఁ జేసినయెడల శివలింగమును విక్రయించినపాపము శాంతమగును. విష్ణువిగ్రహమును విక్రయించినవాఁడు చాంద్రాయణ వ్రతమునాచరించవలయును. ఈకృత్యమును స్త్రీలు చేసినయెడల నీప్రాయశ్చిత్తమునందు సగమును విధించ వలయును, ఈదుష్కృత్యము రాజవైశ్య శూద్రులుసేసినయెడల మహాపాతక ప్రాయశ్చిత్తము నాచరించవలయునని మార్కండేయ మునివరుఁడువచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి సాలగ్రామాది విక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము.

——✽ పుష్పవిక్రయప్రాయశ్చిత్తమ్. ✽——

(౯౪) అథపుష్పవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ కార్ష్ణే ॥ శ్లో ॥ సుంగంధీనిసుపుష్పాణి జాతీకుందముఖాన్యపి । చంపకాశోకపున్నాగం వకుళంకేతకీంతథా । స్వేరామసంభవానీహ క్రీత్వావా లాభలోభతః ॥ విక్రమేత్పూర్వజో మోహాన్మహాపాపమవాప్నుయాత్॥ మరీచిః॥ శ్లో॥ చంపకాశోకపున్నాగ జాతీకుందముఖాన్యపి। వకుళంకైతకంపుష్పం కరవీరంకురంటకం॥ ద్విజస్స్వారామభూతాని క్రీత్వాపుష్పాణిలాభతః । విక్రయేద్యది పాపాత్మా కాలసూత్రమవాప్నుయాత్। ఏకవారేపరాకస్స్యాద్ద్వ్యభ్యాసేచాంద్రముచ్యతే । స్వారామసంభవపుష్ప విక్రయేత్వేవంప్రాయశ్చిత్తం । క్రీత్వావిక్రయేద్విగుణం । యాచిత్వా- ముషిత్వా- విక్రయేత్త్రిగుణం । తులసీమరువబిల్వపత్రాదివిక్రయే ప్రత్యహంపరాకః ॥ సంవత్సరాదూర్ధ్వంపతితఏవ॥ ఇ

తి హేమాద్రివిరచితే పుష్పవిక్రయప్రాయశ్చిత్తం॥

(౯౫) పుష్పవిక్రయప్రాయశ్చిత్తము॥ మంచిగంధముగల పుష్పములను, జాజిపువ్వులను, మల్లెపువ్వులును, చంపకాశోకపున్నాగ పుష్పములను, వకుళపుష్పములను, కేతకీపుష్పములను, మఱియు నుద్యానవనమునందుఁబుట్టినపుష్పములను, కొనిద్రవ్యలోభమువలన విక్రయించిన బ్రాహ్మణుఁడు మిగులఁబాపమును బొందునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు, సంపగపుష్పములను, అశోకపుష్పములను, పున్నాగపుష్పములను, జాతీపుష్పములను, మల్లెపుష్పములను. వకుళపుష్పములను, కేతకీపుష్పములను, కరవీరపుష్పములను, గోరింటపువ్వులను,కొనివిక్రయించినయెడల పాపవంతుఁడగును, మరణానంతరమందు కాలసూత్రమను నరకమును బొందును, ఇట్టికృత్యము నొకతూరి చేసినయెడల పరాకకృచ్ఛ్రము నాచరించవలయును, ఈకృత్యము నభ్యాసముగఁజేయుచున్నవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును, ఉద్యానవనమునందుఁ బుట్టినపుష్పములను విక్రయించినయెడలను నీప్రాయశ్చిత్తమునే యాచరించవలయును, ఉద్యానవనమునందలి పుష్పములను కొనివిక్రయించిన యెడల రెండు చాంద్రాయణములనాచరించవలయును, యాచించియైనను, దొంగలించియైనను విక్రయించినయెడల మూడు చాంద్రాయణముల నాచరించవలయును, తులసీమరువబిల్వపత్రాదులను విక్రయించినయెడల దినదినమందును పరాకకృచ్ఛ్రము నాచరించవలయును- ఇట్టికృత్యమును సంవత్సరానంతరమందుఁ గూడఁ జేసినవాఁడు పతితుఁడగును. ఇట్లని మరీచి మునివరుండు వచించె. ఇట్లనిహేమాద్రియను పండితవరునిచే రచింపఁబడిన ధర్మశాస్త్రమునందలి పుష్పవిక్రయప్రాయశ్చిత్తము సమాప్తము.

——❋ రత్నాదివిక్రయ ప్రాయశ్చిత్తమ్. ❋——

(౯౬) అథరత్నాదివిక్రయ ప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ మౌక్తికంపుష్యరాగంచ పద్మరాగంప్రవాళకం । గోమేధికంమహారత్నం రత్నం గారుత్మతంతథా ॥ ఇంద్రనీలంచవజ్రంచ నవధారత్నమీరితం॥ ఏతానిబహుధామూల్యై స్సంపాద్యాస్స్యు సముద్భవః ॥ విక్రయేదర్థలోభేన రత్నద్రోహీనిగద్యతే ॥ పరాశరః॥ శ్లో॥ మౌక్తికంపద్మరాగంచ పుష్యరాగం ప్రవాళకం । గోమేధికం మహారత్నం వజ్రంగారుత్మతంతథా ॥ ఇంద్రనీలమితిప్రోక్తం నవధారత్నముత్తమం । ద్విజస్సంపాద్యవసుభిర్మూషిత్వావానరాధిప ! విక్రయేద్యదిపాపాత్మా సగచ్ఛేద్యమయాతనాం ! స్తేయంకృత్వాద్వి

జ్ఞాయస్తు విక్రయేదేకవారకం। తస్య దేహవిశుద్ధ్యర్థం షడబ్దం కృచ్ఛ్రమీరితం॥ తస్యోపనయనం భూయః స్తేయదోషోపశాంతయే । అమూల్యరత్నవిక్రయే తద్ద్విగుణం । సాధారణరత్నానాం క్రీత్వా విక్రయే ప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః ॥ శ్లో॥ అమూల్యరత్నజాతీనాం షడబ్దం విక్రయే స్మృతం । రత్నే సాధారణే రాజన్ తప్తకృచ్ఛ్రం సమాచరేత్ ॥ స్తేయప్రాయశ్చిత్తముక్త్వా కృత్వా పునరుపనయనానంతరం షడబ్దకృచ్ఛ్రం కృత్వా శుద్ధిమాప్నోతి ॥ రత్నే సాధారణే తప్తకృచ్ఛ్రం కృత్వా శుద్ధిమాప్నోతి ॥ ఇతి హేమాద్రివిరచితే రత్నవిక్రయప్రాయశ్చిత్తం॥

(౯౭) రత్నాదివిక్రయప్రాయశ్చిత్తము॥ మౌక్తికము, పుష్యరాగము పద్మరాగము, ప్రవాళము, గోమేధికము, మహారత్నము, రత్నము, గారుత్మతము, ఇంద్రనీలము, వజ్రము, అనుతొమ్మిదియును రత్నములనఁబడును. ఈతొమ్మిదివిధములగు రత్నములలో నేదైనను బ్రాహ్మణుఁడగువాఁడు బహుప్రయత్నములచేత సంపాదించి విక్రయించినయెడల రత్నద్రోహియని చెప్పఁబడునని గౌతముఁడువచించె. ఈతొమ్మిదివిధములగు రత్నములలోనేదానినైనను బ్రాహ్మణుఁడు క్రయముచేతనైనను, దొంగతనము చేతనైనను సంపాదించి విక్రయించినయెడల ననేకములగు నరకములను బొందును. దొంగతనముచేత రత్నమును సంపాదించి యొక్కతూరి విక్రయించిన బ్రాహ్మణుఁడు తత్పాపశాంతికొరకు షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరింపవలయును. పునరుపనయన సంస్కారమును బొందవలయును, అమూల్యమగు రత్నమును విక్రయించినయెడల నీప్రాయశ్చిత్తమును ద్విగుణితముగఁ జేయవలయునని పరాశర మునివరుఁడు వచించె. అమూల్యములగు రత్నములను విక్రయించినబ్రాహ్మణుఁడు షడబ్ద కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును విధించవలయును. సాధారణ రత్నవిక్రయ ప్రాయశ్చిత్తమునందు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, స్తేయ ప్రాయశ్చిత్తము నిదివఱకుఁ జెప్పఁబడిన ప్రకారము పునరుపనయనమును జేసికొని షడబ్దకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమునాచరించవలయును, సాధారణ రత్నమును దొంగతనముచేత సంపాదించి విక్రయించినవానికి తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయునని గౌతమ మునివరుఁడువచించె. ఇట్లని హేమాద్రియందలి రత్నాదివిక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము.

——✻ రుద్రాక్షవిక్రయ ప్రాయశ్చిత్తమ్. ✻——

(౯౮) అథరుద్రాక్షవిక్రయ ప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ దశ

వాపూర్వజో రాజన్ రుద్రాక్షాన్ శతమేవవా ॥ సహస్రందశసాహస్రంసం పాద్య బహుయత్నతః ॥ తతోలోభాతురఃపశ్చా ద్విక్రీణీయాద్విధర్మతః ॥ తస్యాన్యాయనిష్కృతిర్నాస్తిత్రిః పరిక్రమణాద్భువః ॥ అథవాకార్మికాగ్రేతు ప్రత్యహంస్నానమాచరేత్॥ మాసైనైవవిశుద్ధస్స్యాద్దస్యధాపతితోభవేత్॥ ఏతత్సహస్రరుద్రాక్ష విక్రయవిషయం । అతఊర్ధ్వమృతుమాత్రేణ శుద్ధ్యతీత్యర్థః । ఏవంపద్మాక్షభద్రాక్ష విక్రయే ప్రాయశ్చిత్తం వివేచనీయం పుత్రజీవివిక్రయేప్రాజాపత్యమాత్రం ॥ ఇతిహేమాద్రివిరచితే రుద్రాక్షవిక్రయప్రాయశ్చిత్తం ॥

(౯౭) రుద్రాక్షవిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడగువాఁడు నానావిధములగు ప్రయత్నములుసేసి పది, నూరు, వేయి, ఈసంఖ్యగల రుద్రాక్షలను సంపాదించి పరలద్రవ్యాశచేత విక్రయించినయెడల మూఁడుపర్యాయములు భూప్రదక్షిణమును జేయవలయును, అట్లుగాదేని మాసము దినములదనుక ప్రతిదినమందును ధనుఃకోటియందు స్నానమును జేయవలయును, ఇదివేయిరుద్రాక్షలను విక్రయించినవానివిషయము. వేయింటికధికముగ విక్రయించినయెడల నాలుమాసములు ధనుఃకోటియందు స్నానమును జేసినయెడల పరిశుద్ధుఁడగును. ఇటులనేపద్మాక్ష భద్రాక్షలను విక్రయించుటయందును ప్రాయశ్చిత్తమును దెలిసికొనవలయును, పుత్రజీవి విక్రయమునందు ప్రాజాపత్యమును మాత్రమాచరించవలయునని గౌతమమునివరుఁడు వచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు రుద్రాక్షవిక్రయ ప్రాయశ్చిత్తము.

## —* సువర్ణవిక్రయప్రాయశ్చిత్తమ్. *—

(౯౮) అథసువర్ణవిక్రయ ప్రాయశ్చిత్తమాహ ॥ విష్ణుపురాణే శ్లో॥ అష్టాపదంసువర్ణంచాప్యథసాధారణంచవా ॥ వణిగ్భావంద్విజోధృత్వా విక్రీణీత్వత్యహంముదా । తస్యాన్యాయనిష్కృతిర్నాస్తిస్తేయినఃపాపసంకటాత్ ॥ అష్టసులోహేషుశోభితంయత్సు వర్ణంఖాదిరాంగారవద్భాతితదష్టాపదం । తత్సువర్ణంమధ్యమం సాధారణం । రూపకాదికమధమం। యేతేషాం విక్రయేవిప్రస్తేయీభవతి । సువర్ణాదిపరిమాణం సువర్ణస్తేయ ప్రకరణే ఒభిహితం ॥ కాత్యాయనః ॥ శ్లో॥ ద్విజోమాసంసువర్ణేన వర్తయేత్క్రియావిక్రయైః ॥ సువర్ణఘాతీవిజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః । ఋతుత్రయేప్రవర్తేత స్సోర్ఘకాలఇతీరితః ॥ వత్సరంయదివర్తేత సువర్ణస్తేయ ఉచ్యతే ॥ జాబాలిః॥ శ్లో॥ ద్విజస్యాష్టాపదేశుద్ధిర్మాసం చాంద్రాయణవ్రతాత్ ॥ సాధారణసువ

ర్ణేతు ప్రాజాపత్యం సమాచరేత్ ॥ రూపకే వ్యవహారేతు తప్తకృచ్ఛ్రముదీరితం । ఏతన్మాసేష్వజాతీనాం ప్రాయశ్చిత్తం ప్రరూపితం । సంవత్సరంవరేద్యస్తుసువర్ణస్తేయినస్సమః ॥ సంవత్సరాదూర్ధ్వం స్తేయప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమవాప్నోతి నమాసల్యా ॥ ఇతి హేమాద్రివిరచితే సువర్ణవిక్రయప్రాయశ్చిత్తమ్॥

(౧౪) సువర్ణవిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడగువాఁడు వర్తకవ్యాపారము నవలంబించి యష్టాపదమునైనను, సువర్ణమునైనను, సాధారణసువర్ణమునైనను, విక్రయించినయెడల మహాపాపియగునని విష్ణుపురాణమునందు చెప్పబడె. సువర్ణప్రమాణము సువర్ణస్తేయప్రకరణమందు జెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు సంవత్సరకాలముసువర్ణముయొక్క క్రయవిక్రయాది వ్యాపారములయందు ప్రవర్తించినయెడల సువర్ణస్తేయిగఁ జెప్పఁబడును. అట్టివాఁడు సకలకర్మలకును బహిష్కృతుఁడగును. ఆఱుమాసములపర్యంతమిట్టి దుష్కృత్యమును జేసినవాఁడర్ధశీలుఁడని చెప్పఁబడును, సంవత్సరకాల మీకృత్యమును జేసినవాఁడు సువర్ణస్తేయుఁడని చెప్పఁబడునని కాత్యాయన మునివరుఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁ డష్టాపదమును విక్రయించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును, సాధారణ సువర్ణమును విక్రయించినవాఁడు ప్రాజాపత్యవ్రతము నాచరించవలయును రూపకవ్యవహారమునందు తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము నాచరించ వలయును, ఈప్రాయశ్చిత్తము నెలదినములు విక్రయించిన వానికని యెఱుంగ వలయును, సంవత్సరకాల మీకృత్యమును జేసినవానికి సువర్ణస్తేయికి సమముగు ప్రాయశ్చిత్తమును విధించవలయునని జాబాలివచించె. సంవత్సరానంతరమందు గూడ బంగారమును విక్రయించినవానికి స్తేయ ప్రాయశ్చిత్తమునయినను మాసల్యావధనమునను విధించవలయును. ఇట్లని హేమాద్రి విరచిత ధర్మశాస్త్రమునందలి సువర్ణస్తేయ ప్రాయశ్చిత్తము సమాప్తము॥

——❋ రజతవిక్రయప్రాయశ్చిత్తమ్. ❋——

(౧౫) అథరజతవిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ జాబాలిః ॥ శ్లో॥ దశనిష్కంసమారభ్య శతనిష్కాంతమాదరాత్ । వణిగ్భావముపాగమ్య విక్రీణేద్రజతంద్విజః । స్వర్ణస్తేయసమంపాప మవాప్నోతి నరాధిప॥ గాలవః॥ శ్లో॥ శతనిష్కంసహస్రంవా ద్విజఃక్రీత్వాప్రవర్తతే । తస్యాన్యాయిమహాప్రాణ్నేస్త్రీస్వర్ణస్తేయసమాదిహ । మాసంవాఋతుమాత్రంవా వర్తమే ద్రజతంస్మణా । ప్రాజాపత్యాంచతప్తంచ చాంద్రాయణమనుక్రమాత్। మాసం

రజతవ్యవహారే ప్రాజాపత్యంప్రాయశ్చిత్తం । మాసద్వమేతత్తు॥సంవత్స రాదధశ్చాంద్రం । సంవత్సరాదూర్ధ్వంసుఃర్ణస్తేయి ప్రాయశ్చిత్త వతః‌ర్యాత్ ॥ ఇతిహేమాద్రివిరచితే రజతఃక్రయప్రాయశ్చిత్తం ॥

(౯౯) రజతవిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడు పదినిష్కము లు మొదలుకొని నూరునిష్కములవరకును పరిమితిగల వెండినివిక్రయించెనే నిసువర్ణమునకు సమమైన ప్రాయశ్చిత్తవ్రతము నాచరించవలయుననిజాబాలివచించె. శతనిష్కమునైనను, సహస్రనిష్కమునయినను, వెండిని విక్రయించిన బ్రాహ్మణునకు సువర్ణస్తేయ ప్రాయశ్చిత్తమును విధించవలయును, రజతవ్యాపారమునందు మాసముదినములయినను, అరుమాసములయినను ప్రవర్తించినయెడల క్రమముగ ప్రాజాపత్య కృఛ్రి చాంద్రాయణముల నాచరించవలయును, రెండు నెలలు రజత వ్యాపారము నందు ప్రవర్తించిన యెడల తప్తకృఛ్రము, సంవత్సరమునకు లోపల చాంద్రాయణవ్రతమునాచరించవలయును, సంవత్సరా నంతర మైదు సువర్ణస్తేయమునకు సమమైన ప్రాయశ్చిత్తమును విధించవలయు... ...వచించె. ఇట్లని హేమాద్రియను పండితవరునిచేత రచింపబడిన ధర్మశాస్త్రమునందలి రజత విక్రయ ప్రాయశ్చిత్తము॥

——✻ తామ్రకాంస్యాది విక్రయప్రాయశ్చిత్తమ్. ✻——

(౧౦౦) అథతామ్రకాంస్యాది విక్రయప్రాయశ్చిత్తమాహ॥ పరాశరః॥ శ్లో॥ తామ్రంకాంస్యంద్విజఃక్రీత్వా త్రపుపిత్తళకంతథా । తానిపశ్చాద్విక్రయిత్వా మాసంవాఋతుమేవవా । నతస్యఘనరావృత్తి ర్యమలోకాతఃదాచన॥ దేవస్వామీ॥ శ్లో॥ తామ్రంకాంస్యంపిత్తళకం త్రపుక్రీత్వాద్విజాధమః ॥ పలాదిదశపర్యంతం విక్రమేద్యదిపాపధీః ॥ నతస్యపునరావృత్తి స్తామ్రమఘాతీభవేద్భువి ॥ ప్రాజాపత్యంశతపలే చాంద్రంచైవతతఃపరం । కాంస్యేతథైవవిజ్ఞేయం ప్రాయశ్చిత్తంవిశారదైః ॥ త్రపుపిత్తళయోశ్చైవ ప్రాజాపత్యంతువత్సరే ॥ తామ్రవిక్రయేకాంస్యవిక్రయేచ ప్రాజాపత్యం సంవత్సరాత్ప్రాగ్విధితవ్యం । అతవూర్ధ్వంరజతస్తేయప్రాయశ్చిత్తంకుర్యాత్॥ త్రపుపిత్తళవదయో విక్రయేప్రాయశ్చిత్తం ॥ ఇతిహేమాద్రవిరచితే తామ్రకాంస్యాది విక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౦) తామ్రకాంస్యాదివిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుండు,తామ్రమునైనను, కాంస్యమునైనను, సీసమునయినను, పిత్తళినయినను, కొని పిమ్మట ద్రవ్యలాభముకొఱకు వర్తకవ్యాపారము నవలంబించి మాస

ము దినములైనను, ఆఱుమాసములకాలమైనను విక్రయించిన యెడల యమలోకమునుండి పునరావృత్తి లేనివాఁడగునని పరాశరుఁడువచించె. బ్రాహ్మణుఁడు తామ్ర, కాంస్య, సీస, పిత్తళకములనుకొని యొకపలము మొదలు పదిపలముల వరకును విక్రయించెనేని పాపవంతుఁడగును, అట్టివానికి యమలోకమునుండి పునరావృత్తిలేదు. మఱియును తామ్రఘాతియని చెప్పఁబడును, ఈవస్తువులను నూఱుపలములు విక్రయించినయెడల ప్రాజాపత్య కృచ్ఛ్రమునాచరించవలయును. అంతకంటె నధికముగ విక్రయించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును, కాంస్యవిక్రయమునందును నివ్విధముగానే ప్రాయశ్చిత్తమును విధించవలయును, త్రపుపిత్తళములను సంవత్సరకాలము విక్రయించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించవలయును- తామ్రకాంస్యములను సంవత్సరమునకు లోఁబడినకాలమునందు విక్రయించినను ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును, సంవత్సరానంతరమందు గూడ నీకృత్యమును జేసినయెడల రజతస్తేయమునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునువిధించవలయును, సీసమునకును, పిత్తళికిని, విధించిన ప్రాయశ్చిత్తమునే యినుమును విక్రయించినపుడును విధించవలయునని దేవస్వామివచించె. ఇట్లని తామ్రకాంస్యాది విక్రయప్రాయశ్చిత్తము॥

——*శస్త్రాదివిక్రయప్రాయశ్చిత్తమ్.*——

(౧౦౧) అథశస్త్రాదివిక్రయప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ ఖడ్గం కుంతంధనుర్బాణం ఖేటంక్రీత్వాద్విజాధమః॥ విక్రయేద్యదితాఙ్పశ్చాద్రౌరవంనరకంవ్రజేత్ । తస్యాన్యానిష్కృతిర్నాస్తి జన్మనఃకారుకోద్భవాత్॥ పశ్చాత్తాపమవాప్యాథయదీచ్ఛేచ్ఛుద్ధిమాత్మనః ॥ ప్రాజాపత్యంద్వయంచైవషణ్మాసేవత్సరేస్మృతం । తతస్సంవత్సరాదూర్ధ్వం కారుకస్యసమోభవేత్॥ మరీచిః॥ శ్లో॥ ధనుఃకుంతంచఖడ్గంచఖేటకంవాద్విజాధమః ॥ క్రీత్వావిక్రీయవర్తేతయమలోకానహీయతే ॥ యదీచ్ఛేచ్ఛుద్ధిరుదితా మనునాధర్మశాసినా । ప్రాజాపత్యంతుషణ్మాసేతద్ద్వయంవత్సరేస్మృతం। తతఃపరంకారుకస్యాపిప్రాయశ్చిత్తంనిరర్థకం॥ఇతి హేమాద్రివిరచితేశస్త్రాదివిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౧) శస్త్రాదివిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు, ఖడ్గము, కుంతము, ధనుస్సు, బాణము, ఖేటము, అనునాయుధములనుకొని వర్తకవ్యాపారము నవలంబించి విక్రయించినయెడల మరణానంతరమందు రౌరవమను నరకమును బొందును, అట్టివానికి ప్రాయశ్చిత్త మేదియును లేదు, మఱియు నట్టివాఁడు కారుకుఁడై పుట్టును, కావున పశ్చాత్తాపమును పొంది ప్రాయ

శ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుఁడగును. అదియెట్లనిననాఱుమాసము లీకృత్యమును జేసినయెడల రెండుప్రాజాపత్యకృఛ్రముల నాచరించవలయును. సంవత్సరానంతరమందుఁగూడ నీకృత్యమును జేసినవాఁడు కారుకునకు సమానుఁడగునని దేవలుఁడువచించె. ధనుస్సును, కుంతమును, ఖడ్గమును, ఖేటకమును, బ్రాహ్మణుఁడుకొని విక్రయించిన యెడల యమలోకమునుబొంది మరలరానేరడు. కావుననట్టిపాపాత్ముఁడు తనదుపాపమును నివర్తించుకొనవలయునని తలఁచినయెడల నారుమాసములలోపలనయ్యేనేని ప్రాజాపత్యకృఛ్రము నాచరించవలయును. సంవత్సరకాలమయ్యేనేని రెండుప్రాజాపత్యకృఛ్రముల నాచరించవలయును. సంవత్సరానంతరమందుఁగూడ నీకృత్యమును జేసినవాఁడు కారుకునకు సమానుఁడగును. కావున నట్టివానికి ప్రాయశ్చిత్తమునుజేసియును నిరర్థకమగునని మరీచిమునివరుఁడు వచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి శస్త్రాదివిక్రయ ప్రాయశ్చిత్తము సమాప్తము.

—— ॥ గృహోపకరణవిక్రయప్రాయశ్చిత్తమ్. ॥ ——

(౧౦౨) అథగృహోపకరణవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ వ్యాసః॥ శ్లో॥ ఉలూఖలంచముసలం దృషదంచోపలంతథా। పీఠంకుండలీంచైవ తథాసంమార్జనీమపి॥ తుషంకాష్ఠంచకారీషం గోమయంశూర్పమేవవా। విక్రయిత్వాద్విజోమోహాత్ యమలోకమవాప్నుయాత్॥ గౌతమః॥ శ్లో॥ తుషంకాష్ఠంచకారీషం గోమయంశూర్పమేవవా। సంమార్జనీంతథాపీఠంవేణుపాత్రంబృహత్ఫలం। ఉలూఖలంచముసలందృషదంచోపలంతథా। పూర్వజోయదివిక్రీయాత్ ప్రాజాపత్యంసమాచరేత్। అబ్దాచాంద్రంతథాశుద్ధిర్నాన్యథాశుద్ధిరీరితా॥ ఇతి హేమాద్రివిరచితే గృహోపకరణవిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౨) గృహోపకరణవిక్రయప్రాయశ్చిత్తము॥ రోలు, రోకలి, గుండ్రాయి, మొదలగువానిని నూరుకొనియెడురాయి పీఠమును, కుండలిని, మార్జనిని, ఉముక, కాష్ఠము, పిరుకిడక, గోమయము, చేట, అనియెడువస్తువులనువిక్రయించిన యెడల నరకలోకమునుబొందునని వ్యాసుఁడు వచించె. గౌతముఁడును నిటులనేచెప్పి ప్రాజాపత్యకృఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయుననిచెప్పె. మఱియు సంవత్సరానంతరమందుఁగూడ నీకృత్యమును జేసినయెడల చాంద్రాయణవ్రతమునాచరించవలయుననియె. ఇట్ల

ని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి గృహోపకరణ విక్రయప్రాయశ్చిత్తము.

## ——* కస్తూర్యాదివిక్రయప్రాయశ్చిత్తమ్. *——

(౧౦౩) అథకస్తూర్యాదివిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ శ్లో॥ కస్తూరీంకుంకుమంగంధం కర్పూరంనాగకేసరం । గోరోచనంగంధదారుముశీరంముస్తకంతథా । సంపాద్యపూర్వజోయస్తు విక్రమేత్సహి పాపభాక్॥ మహాంతంనరకంగత్వా జాయతేగంధమూషకః॥ జాతుకర్ణిః॥ శ్లో॥ గోరోచనంగంధదారుముశీరంముస్తకంతథా । కస్తూరీంకుంకుమంగంధం కర్పూరంనాగకేసరం। విక్రమేత్పూర్వజఃపాపీ స్వధర్మమనువర్తయన్। అనుభూయమహాదుఃఖంజాయతేగంధమూషకః ॥ తస్యదేహవిశుద్ధ్యర్థం పరాకంవత్సరేస్మృతం॥ తప్తంకేతఃపరంజ్ఞేయ మేతత్కృత్వావిశుద్ధ్యతి॥ ఇతి హేమాద్రివిరచితే కస్తూర్యాదివిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౩) కస్తూర్యాదివిక్రయప్రాయశ్చిత్తము॥ కస్తూరి, కుంకుమము, గంధకము, కర్పూరము, నాగకేసరము, గోరోచనము, గంధదారువు, వట్టివేళ్ళు, తుంగముస్తలు, అనియెడు వస్తువులను నానావిధములగు ప్రయత్నములచేత సంపాదించి విక్రయించినబ్రాహ్మణుఁడు ఘోరనరకములను బొందును. పిమ్మట గంధమూషకమైపుట్టునని మార్కండేయ మునివరుఁడు చెప్పె. జాతుకర్ణియును నిటులనే చెప్పి యీకృత్యమున సంవత్సరకాలముచేసెనేని పరాకకృచ్ఛ్రము నాచరించవలయునసియును, సంవత్సరానంతరమందు తప్తకృచ్ఛ్రము నాచరించవలయునసియును జెప్పె ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందు కస్తూర్యాదివిక్రయప్రాయశ్చిత్తము.

## ——* వస్త్రవిక్రయప్రాయశ్చిత్తమ్. *——

(౧౦౪) అథవస్త్రవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ మనుః॥ శ్లో ॥ కంబళంపట్టవస్త్రంచకౌశేయంచిత్రవస్త్రకం ॥ సూక్ష్మతంతుకృతంవాసో విక్రమేత్పూర్వజఃక్రమాత్॥ హారీతః॥ శ్లో ॥ కంబళంపట్టవస్త్రంచ సూక్ష్మతంతుకృతంతథా । చిత్రవస్త్రంచకౌశేయంవిక్రమేద్యదిలోభతః ॥ ద్రవ్యార్థీక్యైతుచాంద్రంస్యాద్వత్సరేతద్వ్యయంభవేత్॥ ద్రవ్యహీనేపరాకంస్యాత్సూక్ష్మమూల్యేతుయాపకం । సర్వత్రసంవత్సరాత్ప్రాగేవప్రాయశ్చిత్తంవేదితవ్యం । అతఊర్ధ్వంద్విరావృత్తిః॥ ఇతి హేమాద్రివిరచితే వస్త్రవిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౪) వస్త్రవిక్రయప్రాయశ్చిత్తము॥ కంబళము, పట్టవస్త్రము

కౌశేయము, చిత్రవస్త్రికము, సూక్ష్మతంతుకృతమైనవస్త్రము, అనువాని నివిక్రయింపఁగూడదని మనువువచించె. హారీతుఁడును నిటులనే వచించి సంవత్సరకాలమీకృత్యము నధికద్రవ్యలాభముకొఱకుఁ జేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును, స్వల్పద్రవ్యమునకు విక్రయించిన యెడల పరాకకృఛ్రము నాచరించవలయుననియును, సూక్ష్మద్రవ్యమునకు విక్రయించిన యెడల యావకాహారుఁడు గావలయుననియును వచించె. మఱియు సంవత్సరకాలములోపల నయ్యేనేని యీప్రాయశ్చిత్తము నాచరించవలయుననియును, సంవత్సరానంతరమందయ్యేనేని యీప్రాయశ్చిత్తమును ద్విగుణీతముగఁ జేయవలయుననియునువచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు వస్త్రవిక్రయప్రాయశ్చిత్తము.

## ధర్మవిక్రయప్రాయశ్చిత్తమ్.

(౧౦౫) అథధర్మవిక్రయప్రాయశ్చిత్తమాహ॥ యమః॥ శ్లో॥ స్నానాదినిత్యకర్మాణి ఇష్టాపూర్తానికానిచ॥ తటాకారామకాసార నిర్మాణాదీనితాన్యపి॥ కాశిక్షేత్రాదికానిహ తేషాంయోవిక్రయంచరేత్॥ గాలవః॥ శ్లో॥ కాశీయాత్రాతటాకాది వననిర్మాణమేవచ। స్నానాదినిత్యకర్మాణి ఇష్టాపూర్తాదికానిచ॥ ఉపోషణవ్రతాదీని శ్రౌతస్మార్తాదికానిచ॥ ఏతేషాంవిక్రయంకృత్వా మాఘస్నానపురస్సరం। సపాపీనరకంయాతి పునరావృత్తిదుర్లభం। యదీచ్ఛేదాత్మనశ్శుద్ధిం పశ్చాత్తాపసమన్వితః॥ చాంద్రాయణత్రయంకృత్వా పునస్సంస్కారకృత్తథా। పంచగవ్యంతతఃపీత్వా శుద్ధిమాప్నోతినైష్ఠికీ॥ ఇతిహేమాద్రివిరచితే ధర్మవిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౫) ధర్మవిక్రయప్రాయశ్చిత్తము॥ స్నానాదినిత్యకర్మలు, ఇష్టాపూర్తాదికములు, తటాకారామకాసారనిర్మాణములు, కాశీక్షేత్రాదివాసములు, ఉపవాసవ్రతాదులు, మాఘస్నానాదులు, అనువానినివిక్రయింపఁగూడదని యముఁడువచించె. గాలవుఁడును నిటులనేవచించి యొకవేళ నిట్టికృత్యము నాచరించినయెడల నీపాపశాంతికొఱకు పశ్చాత్తాపమునుబొంది మూఁడుచాంద్రాయణముల నాచరించి పిమ్మట పంచగవ్యప్రాశనను జేసెనేని పరిశుద్ధుఁడగుననియె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందలి ధర్మవిక్రయప్రాయశ్చిత్తము.

## శ్రుతిస్మృత్యాదివిక్రయప్రాయశ్చిత్తమ్.

(౧౦౬) అథశ్రుతిస్మృత్యాదివిక్రయప్రాయశ్చిత్తమాహ॥ వసిష్ఠః॥ శ్లో॥ శ్రుతింస్మృతింధర్మశాస్త్రం పురాణంజ్యోతిషంతథా। వైద్యంకా

వ్యంనాటకంచ ప్రబంధంస్వకృతంద్విజః । విక్రయేద్యదిపాపాత్మాపుస్తకంఫలకంచవా॥ మహాంతంనరకంభుక్త్వా జాయతేసనిరక్షరః॥ గౌతమః॥ శ్లో॥ వైద్యంకావ్యంనాటకంచ ప్రబంధంస్వకృతంద్విజః । శ్రుతింస్మృతింధర్మశాస్త్రం పురాణంజ్యోతిషంతథా॥ పుస్తకంఫలకంవాపి తత్సాధనమథాపివా। విక్రయేద్యదిలోభార్తో మహాంతంనరకంవ్రజేత్॥ పునర్భవముపాగమ్యవేదశాస్త్రవిహీనవాన్॥ యదీచ్ఛేదాత్మనశ్శుద్ధిం పశ్చాత్తాపపరాయణః॥ చాంద్రాయణంపరాకంచ కృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ ఏతత్సకృదాచరణవిషయం। అభ్యాసేద్విగుణం ॥ ఇతిహేమాద్రివిరచితే శ్రుతిస్మృత్యాదివిక్రయప్రాయశ్చిత్తః॥

(౧౦౬) శ్రుతిస్మృత్యాది విక్రయప్రాయశ్చిత్తము॥ శ్రుతి, స్మృతి, ధర్మశాస్త్రము, పురాణము, జ్యోతిషము, వైద్యము, నాటకము.తనచేఁజేయఁబడిన ప్రబంధము, పుస్తకము, ఫలకము, అను వానిని విక్రయించినబ్రాహ్మణుఁడు గొప్పదగు నరకమును బొందుననియును, పిదప వేదశాస్త్రవిహీనుఁడై పుట్టుననియును, వసిష్ఠుఁడువచించె. గౌతముఁడును నిటులనే వచించి యిట్టి పాపకృత్యము నాచరించినవాఁడు పశ్చాత్తాపపరాయణుఁడై చాంద్రాయణవ్రతము నాచరించవలయు ననియును, ఇది సకృదాచరణవిషయమనియును, అభ్యాసమునందు ద్విగుణముగ నాచరించవలయు ననియును వచించె. ఇట్లని హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు శ్రుతిస్మృత్యాదివిక్రయప్రాయశ్చిత్తము.

——* నామవిక్రయప్రాయశ్చిత్తమ్. *——

(౧౦౭) అథనామవిక్రయ ప్రాయశ్చిత్తమాహ॥ జాబాలిః॥ శ్లో॥ ఆత్మనశ్చసుతస్యాపి దారాణాంభ్రాతురేవచ॥ మాతుఃపితుర్వారాజేంద్రనామధేయంమహత్తరం । విక్రయిత్వా ద్విజో మోహాత్పరస్మైధనచాయినే॥ ధనశబ్దః క్షేత్రధాన్య పశ్వారామాద్యుపలక్షణం । ఏతేషాంమధ్యేయద్వా తద్వాగృహీత్వాపూర్వోక్తానాం సుతాదీనాం నామధేయంవిక్రయిత్వా ప్రోజీవేద్యది॥ తదాసమమహాపాతకీతుల్యఇత్యర్థః॥ తదేవాహ। కూర్మపురాణే॥ శ్లో॥ మాతుఃపితుస్స్వసుర్వాపి ఆత్మనశ్చసుతస్యవా । దారాణాం నామధేయంచ విక్రయిత్వాధనంబహు॥ ఆదాయజీవేద్యో విప్రస్ససద్యఃపతితోభవేత్॥ తేనయానీహకర్మాణి కృతానిమనుజాధిప । తానిసర్వాణికర్మాణి ధనదంప్రవిశంత్యహో। తస్యాన్యాఃపప్రవృత్తిర్నాస్తి కాయకృచ్ఛ్రాదిహ। పునస్సంస్కా[illegible]త్మశుద్ధి[illegible]పూర్వజః। కాయకృ

చ్ఛ్రితంకృత్వా పునస్సంస్కారానంతరం శుద్ధోభవతి॥ ఇతి హేమాద్రి
విరచితే నామవిక్రయప్రాయశ్చిత్తం॥

(౧౦౪) నామవిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు పశుగ్రామ ధనాగారాదులను గ్రహించి, ఆత్మపితృభ్రాతృసుతాదులయొక్క, గొప్పవగు నామములను విక్రయించినయెడల మహాపాతకుఁడగునని జాబాలి వచించె. కూర్మపురాణమునందును నిటులనే చెప్పఁబడియె. మఱియు నిట్టివాఁడు మహాపాతకుఁడనియును, పతితుఁడును నగుననియును, అట్టివానికి కాయకృచ్ఛ్రశతములచేతఁగూడ నిష్కృతి లేదనియును, పునస్సంస్కారముచేత పరిశుద్ధుఁడగుననియును, ముందుగ నూరుకాయకృచ్ఛ్రములను జేసి యనంతరమందు పునస్సంస్కారమును బొందవలయు ననియును జెప్పఁబడె. ఇట్లు హేమాద్రి విరచిత ధర్మశాస్త్రమునందలి నామవిక్రయప్రాయశ్చిత్తము॥

—— * నానావస్తువిక్రయప్రాయశ్చిత్తమ్. * ——

(౧౦౫) అథనానావస్తువిక్రయప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ కటకంభూషణంకాచం తులాస్థూలంభవైణవం। భాండాని చకరండాని సిందూరంకజ్జళంతథా ॥ కంచుకంగంధపాత్రాణిసుధాంభూతించచందనం। ఏవంముఖానిద్రవ్యాణి క్రీత్వావై స్వకృతానివా । విక్రయేద్యదిలోభేన సవిప్రో నరకంవ్రజేత్ ॥ గాలవః॥ శ్లో॥ భూషణంకటకంకాచీం సిందూరం కజ్జళంతథా । కంచుకంగంధపాత్రాణి సుధాంభూతించచందనం। భాండానిరజ్జుదారూణి స్వగృహోత్థాని వై ద్విజః । విక్రయిత్వాతదాదోష మవాప్యనపునర్భవః ॥ పరాకంయావకంకృచ్ఛ్రం కృత్వాశుద్ధిమవాప్నుయాత్ । సంవత్సరాదూర్ధ్వంద్విగుణముక్తం । స్త్రీణాంతదర్ధం॥ ఇతి హేమాద్రౌ నానావస్తువిక్రయప్రాయశ్చిత్తం ॥ ఇతి హేమాద్రివిరచితే ధర్మశాస్త్రే ప్రాయశ్చిత్తాధ్యాయే సంకలీకరణప్రాయశ్చిత్తం ॥

(౧౦౬) నానావస్తువిక్రయప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు హస్తాభరణములు, ఇతరములగు భూషణములు, కాచమణులు, (లేక కాచాభరణములు) పాదాభరణములు, వేణుసంబంధమైన యాభరణములు, బాండములు, కరండములు, సిందూరము, కజ్జళము, కంచుకము, గంధపాత్రములు, సున్నము, భూతి,చందనము, మొదలగుద్రవ్యముల నింటియందు పనిజేసినవైనను, కొనినవైనను, అధికద్రవ్యలాభముకొఱకు విక్రయించినయెడల నరకమును బొందునని దేవలుఁడు వచించె. గాలవుఁడును నిటులనే వచించి ప్రాయశ్చిత్తక్రమమును గూడఁ జెప్పె. ఎట్లనిననిట్టి దుష్కృత్యమును సంవత్సరము

నను లోపలఁజేసిన యెడల యావకాహారుఁడై పరాకకృచ్ఛ్రము నాచరించవలె
యుననియును, సంవత్సరానంతరమందుఁ గూడ నీచుఁడు కృత్యమును జేసినవాఁ
డీ ప్రాయశ్చిత్తమును ద్విగుణముగ నాచరించ వలయు ననియును, స్త్రీలీదు
ష్కృత్యమును జేసిన యెడల పురుషులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందు
సగమును విధింపవలయుననియును వచించె. ఇట్లని హేమాద్రియందలి నానా
వస్తువిక్రయ ప్రాయశ్చిత్తము॥

※ మలినీకరణనిక్షేపహరణప్రాయశ్చిత్తమ్ ※

(౧౦౯) అథమలినీకరణప్రాయశ్చిత్తమాహ ॥ సువర్ణరజత తామ్ర
కాంస్యత్రపుసీసహరణప్రాయశ్చిత్తం స్వర్ణస్తేయ ప్రకరణేభిహితం తత్త
న్మానంచ ॥ అథనిక్షేపహరణప్రాయశ్చిత్తమాహ॥ గార్గ్యః॥ శ్లో॥ నిక్షేపం
స్వగృహే క్షిప్తం రక్షణీయం వనాంతరే । దేవాలయే బహిర్దేశే స్థాపితం య
త్ర కుత్ర వా । బ్రాహ్మణో ద్రవ్యలోభేన హ్యంజనాదభిరావహ్రైః ॥ హృత్వా
నరకమవాప్నోతి యావదాభూతసంప్లవం । తేనవిప్రో యదాజీవేద్దేవర్షిపితృ
కార్యకృత్ ॥ సర్వంనిక్షేపదాతుశ్చ సంతతిశ్చ నసంశయః ॥ నిక్షేపప్రమాణ
మాహ ॥ మహారాజవిజయే ॥ శ్లో ॥ రూపకాణాంహీనవకం నిష్కద్వయ
ముదాహృతం । నిష్కద్వయంవరాహస్స్యాత్సువర్ణంతచ్చతుష్టయం॥ పలం
సువర్ణాశ్చత్వారోవారస్స్యాత్తచ్చతుష్టయం । తచ్చత్వారింశత్తుభారస్స్యా
ద్వణిజాంభారముద్వహన్ ॥ భారద్వయంమహాసూతిస్తద్ద్వయంనిఖనంస్మృ
తం ॥ తచ్చత్వారిమహారాజ నిక్షేపః పరికీర్తితః । నిక్షేపంతంద్విజోహృత్వా
తత్క్షణాత్పతితోభవేత్ । తత్పత్నీచతదాత్మానో మాతరఃపితరస్తథా ।సర్వే
తస్య తత్క్షణాయామేననిక్షేపితఃక్షితౌ । పునఃప్రత్యర్పయేత్తస్మై నతేనసపా
దోషభాక్ ॥ సగ్వాభావేతురాజ్ఞేవా దత్వాదోషైర్నలిప్యతే. అగ్నౌదగ్ధంవి
లెమగ్నం భూమౌనిపతితంచయత్ । తత్సర్వంపరలోకాయద్యాతేనష్టంవిన
శ్యతి ॥ నిక్షేపహరణేవిప్రఃపతితస్స్యాన్నసంశయః॥ పునర్దత్వాతదాతస్మై
సవిప్రశ్చాంద్రమాచరేత్ ! అభావేతస్యహారణే చాంద్రాయణచతుష్టయం।
తస్యైవ ఘనసంభూయః పంచగవ్యమనంతరం॥ ద్విజస్స్వద్దోషభవేదేవమన్య
థా పాతకీభవేత్ । తదర్థంరజతనిక్షేపే తామ్రకాంస్యేతదర్ధకం । త్రపుసీ
సయోఃపాదంచరేత్కృచ్ఛ్రం యథాక్రమం । రాజానిక్షేపహారీస్యాద్బ్రా
హ్మణాద్ద్విగుణంచరేత్ । వైశ్యస్తురాజవత్తుర్యాచ్ఛూద్రోమాసత్రయమర్హ
తి । తత్తత్స్త్రీణాం తదర్ధప్రమాణేన ప్రాయశ్చిత్తం వేదితవ్యం। తామ్రకాం
స్యాదినిక్షేపహారణే రజతనిక్షేపప్రాయశ్చిత్తార్ధం ॥ ఇతి హేమాద్రివిరచితే

నిక్షేపహరణప్రాయశ్చిత్తము.॥

(౧౯) మలినీకరణములయందు నిక్షేపహరణప్రాయశ్చిత్తము॥ స్వర్ణస్తేయప్రకరణమందు సువర్ణ రజత, తామ్ర, కాంస్య, త్రపు, పిత్తళాదులను హరించుటకు ప్రాయశ్చిత్తము చెప్పఁబడినది, వనాంతరమందును, గృహమునందును, దేవాలయాదికమునందును, స్థాపనజేసిన ద్రవ్యమును జనాదిసాధనములచేత హరించినవాఁడు ప్రళయకాలమువరకు నరకలోకమునందుఁబడి దుఃఖములను జెందును. మఱియునట్టి ద్రవ్యముచేత చేసిన పుణ్యకర్తల స్నియును నిక్షేపమును జేసినవానిని బొందును, ఇట్లని గార్గ్యమునివరుడు వచించె- రూపకములయొక్క నవకము నిష్కమనఁబడును, రెండు నిష్కములు వరాహమగును, నాలుగు వరాహములు సువర్ణమనఁబడును, నాలుగు సువర్ణములు పలమనబడును, నాలుగు పలములు వారమనబడును, నాల్గు వారములు భారమని యెఱుంగనగును, రెండు భారములు మహాసూతియనఁబడును, రెండు మహాసూతులు నిఖనమనఁబడును నాలుగు నిఖనములు నిక్షేపమనఁబడును, అట్టి నిక్షేపమును హరించిన బ్రాహ్మణుఁడును. మఱియునట్టి వాని భార్యయు, పుత్రాదులును, తల్లిదండ్రులును, నిక్షేపమును జేసినవానికి సంతానమగును, అట్టి నిక్షేపము లభించెనేని దానినివరల నిక్షేపకర్తకిచ్చిన యెడలఁ గొంచెమయినను దోషములేదు, నిక్షేపకర్తయొక్క సంతతియందెవ్వరును లేనపుడు రాజునకు సమర్పించవలయును, ఇట్లు చేసిన యెడల దోషమేమియును లేదు. అగ్నియందు దగ్ధమైనదియును, ఉదకమునందుఁబడినదియును, భూమియందు జారిపడిపోయినదియును, పరలోకమున నుపయోగించును, ద్యూతమునందోడిన ద్రవ్యమేలోకమునందును నుపయోగించదు, నిక్షేపహరణమును జేసిన బ్రాహ్మణుఁడు పతితుఁడగును, ఒకవేళ హరించెనేని మరల నొసంగి చాంద్రాయణము నాచరించవలయును, ఆ ద్రవ్యమును బాతిపెట్టిన వారియొక్క సంతతి మొదలయినవి లేనపుడు తానే యపహరించిన యెడల నాలుగు చాంద్రాయణముల నాచరించవలయును, పిమ్మట పునరుపనయన సంస్కారమును బొంది పంచగవ్యప్రాశనను జేయవలయును, ఇవ్విధముగఁ జేసిన బ్రాహ్మణుఁడు పరిశుద్ధుఁడగును, లేని యెడల పాతకుఁడగును. రజతనిక్షేపహరమునందిప్పుడు చెప్పబడిన ప్రాయశ్చిత్తమునందు సగము నాచరింప వలయును. తామ్ర కాంస్యములయందు రజతమునకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును, త్రపుపిత్తళములయందు సువర్ణనిక్షేపహరణమునందు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు నాల్గవభాగమును విధించవ

లయును, క్షత్రియుడీకృత్యమును జేసినయెడల బ్రాహ్మణునకువిధించినప్రాయశ్చిత్తమునకు ద్విగుణమధికమగు ప్రాయశ్చిత్తమును విధించవలయును, వైశ్యునకు క్షత్రియునకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును, శూద్రునకు మాసల్యావధను విధింపవలయును, స్త్రీలకు వారివారిజాత్యైపురుషులకువిధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగము ప్రాయశ్చిత్తమును విధించవలయును, తామ్రకాంస్యాది నిక్షేపహరణమునందు రజతనిక్షేపహరణమునకు విధింపబడిన ప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయునని మహారాజవిజయమునందు జెప్పబడియె. ఇట్లు హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు నిక్షేపహరణ ప్రాయశ్చిత్త విధానము సమాప్తము ॥

—* ధేనుహరణప్రాయశ్చిత్తమ్. *—

(౧౨౯) అథధేనుహరణప్రాయశ్చిత్తమాహ॥ శ్లో॥ ధేనుంద్విజోవా రాజావా పరకీయాం యదాహరేత్ । గోహంతాసహివిజ్ఞేయో రాజాగోసవమాచరేత్॥ గాలవః ॥ శ్లో ॥ ముఖజోబాహుజోవాపి హ్యూరుజఃపాదజోపివా ॥ నారీవాయదిమోహేన పారకీంధేనుమాహరేత్॥ గారుడపురాణే॥ శ్లో॥ పారకీంబ్రాహ్మణోధేనుం హరేద్బాహుజ ఏవవా ॥ గోహంతాసహివిజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతః ॥ నారదీయె ॥ శ్లో॥ కపిలాంసూయమానాంగాం హోమధేనుమథాపివా। విప్రోవా రాజతనయోవణిగ్వాపాదజోపివా । హృత్వానరకమాప్నోతి రోగీస్యాత్పూర్వవత్తదా । చాంద్రాయణద్వయంప్రోక్తంకపిలాహరణేద్విజే॥ చాంద్రకతుసూయమానాయాంహోమధేనావడబ్దకం। ప్రాజాపత్యకృచ్ఛ్రరూపం షడబ్దమిత్యర్థ ॥ శ్లో॥ రాజ్ఞస్తద్ద్విగుణంప్రోక్తమూరుజేతత్త్రియంస్మృతం ॥ పాదజేహస్తినిచ్ఛేదో నారీణామర్ధముచ్యతే । విప్రాంగనాయావిప్రప్రాయశ్చిత్తార్ధం । ఇతరాంగనానాం తత్తత్ప్రాయశ్చిత్తార్ధం ॥ ఇతి హేమాద్రివిరచితే గోహరణప్రాయశ్చిత్తం॥

(౧౨౯) ధేనుహరణప్రాయశ్చిత్తము ॥ పరులధేనువును బ్రాహ్మణుడైనను రాజైనను హరించినయెడల గోహంతయనబడును, అట్టికృత్యమును జేసినరాజు గోసవమునాచరింపవలయునని స్మృతివచించుచున్నది. బ్రాహ్మ క్షత్రవైశ్యశూద్రులలో నెవ్వడయినను, స్త్రీయైనను పరులధేనువునపహరించినయెడల పాపవంతుడగునని గాలవమునివరుడు వచించె. గారుడపురాణమునందును నిటులనేచెప్పబడియె. బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులలో నెవ్వడైనను, కపిలధేనువునయినను, ప్రసవాసన్నమైన గోవునైనను, హోమధేనువు

నై నసుహరించిన యెడల పాపవంతుడగును. మరణానంతరమందునరకమును బొందును. కపిలధేనువునుహరించిన యెడల రెండుచాంద్రాయణముల నాచరించవలయును. ప్రసవాసన్నమైన ధేనువునుహరించినవాడు చాంద్రాయణవ్రతమునాచరించవలయును. సామాన్యధేనువు నపహరించెనేని షడబ్దకృఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ప్రాజాపత్యకృఛ్రస్వరూపము షడబ్దనియర్థము. ఈప్రాయశ్చిత్తమును రాజులకుద్విగుణాధికముగాను, వైశ్యులకుత్రిగుణాధికముగాను, విధింపవలయును. శూద్రులీదుష్కృత్యమునుజేసిన యెడల హస్తచ్ఛేదమును జేయించవలయును. బ్రాహ్మణస్త్రీ లీదుష్కృత్యమును జేసిన యెడల బ్రాహ్మణులకువిధింపబడినప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. తక్కినవారిస్త్రీలకు వారివారికివిధించినప్రాయశ్చిత్తమునందుసగమునువిధించవలయును. ఇట్లని నారదీయమునందుజెప్పబడియె. ఇట్లని హేమాద్రివిరచిత ధేనుహరణప్రాయశ్చిత్తము సమాప్తము॥

——— ❋ గోవత్సహరణప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౧౧౦) అథవత్సహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పూర్వజోహారితేవత్సం పారక్యంగోతనూద్భవం। మృత్వానరకమాసాద్య చండాలత్వమవాప్నుయాత్॥ మరీచిః॥ శ్లో ॥ పారక్యంధేనుజం విప్రః పౌగండకమథాహరేత్॥ మహాంతంనరకంగత్వాజాయతేసజనంగమః ॥ తద్దోషపరిహారార్థంప్రాజాపత్యంవిశోధనం॥ పౌగండాత్ప్రసూతిపర్యంతం హృత్వావైచాంద్రభక్షణం। కృత్వాశుద్ధిమవాప్నోతి నాన్యథావత్సహారకః। రాజవైశ్యస్త్రీశూద్రాణాంవత్సహరణేపూర్వవత్ప్రాయశ్చిత్తంవివేచనీయం॥ ఇతిహేమాద్రివిరచితే వత్సహరణప్రాయశ్చిత్తం॥

(౧౧౦) గోవత్సహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు పరులసంబంధమైన గోవత్సమునుహరించిన యెడల నరకమునుబొందును. పిమ్మటచండాలుఁడైపుట్టునని దేవలుఁడువచించె. పరులసంబంధమైన పౌగండవయస్సునందున్న గోవత్సమునుహరించిన బ్రాహ్మణుఁడు గొప్పదగునరకమునుబొందును. పిమ్మట జండాలుఁడైపుట్టును. కావునఁ దత్పాపశాంతికొఱకు ప్రాజాపత్యకృఛ్రము నాచరించవలయును. పౌగండవయస్సు మొదలుకొని ప్రసవకాలములోపలి వయస్సునందున్న గోవత్సమును హరించిన యెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. ఇవ్విధముగఁ బ్రాయశ్చిత్తవ్రతము నాచరించుకొనినవాఁడు పరిశుద్ధుఁడగును. రాజవైశ్యస్త్రీ శూద్రులీదుష్కృత్యములను జేసిన యెడల పరిశుద్ధతకొఱకు పూర్వోక్త ప్రకారముగఁ

ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మరీచివచించెను. ఇట్లు హేమాద్రి రచితమైన ధర్మశాస్త్రమునందలి వత్సహరణప్రాయశ్చిత్తము.

——— ❋ అనడుద్ధరణప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౧౧౧) అథానడుద్ధరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ శ్లో ॥ యో హరేత్పారకంవిప్రోబలీవర్దంవిదన్నపి । సగత్వానరకంఘోరం జాయతేపూర్వవత్తదా॥ హారీతః॥ శ్లో॥ యోహరేత్పారకంవిప్రోబలీవర్దంకృషీవలః॥ యువానంబాలకంవాపి మృత్వానరకమశ్నుతే॥ చిరంతనైర్వసంపిష్టాది వాకీర్త్యాభవేద్భువి । తస్యాన్యానిష్కృతిర్నాస్తి తప్తకృచ్ఛ్రద్వయాదృతే॥ మరీచిః॥ శ్లో॥ విప్రోయఃపారకంరాజన్ బలీవర్దంతృషాతురః । యువానంవనమధ్యేవారాజక్షోభమహాభయే । హరేత్పారకంభుక్త్వా భవేద్భూమౌజనంగమః॥ తస్యపాపవిశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రద్వయంస్మృతం । పౌగండేకృచ్ఛ్రమాత్రంస్యాద్బాలేర్ధంమునిభిస్స్మృతం। తన్నారీణాంతదర్ధంస్యాద్బాహుజానాం ద్విజాతివత్॥ ఊరుజస్యక్షత్రియవత్ప్రాయశ్చిత్తంవిశోధనం సర్వత్రపాదజస్యానడుద్ధరణేరాజ్ఞా శిక్షాకారయితవ్యా । రాజాపితద్విచార్యానడుద్ధరణే హస్తచ్ఛేదంపౌగండేంగుళిద్వయచ్ఛేదం బాలవత్సహరణేంగుళిమాత్రచ్ఛేదంచకారయేత్॥ విప్రశ్చేత్తత్ద్రవ్యస్తు దాపయిత్వాతందశరూపకేణదండ్యాత్॥ తదాహమనుః॥ శ్లో॥ బలీవర్దైకరచ్ఛేదః పౌగండేచాంగుళిద్వయం।అంగుళింబాలహరణే దాపయిత్వాపునశ్చతాన్ । దశరూపకదండేన విప్రోదండ్యశ్చతేనవై । రాజానమూరుజంవాపి తదర్ధేనవిచారయన్నితి॥ ఇతిహేమాద్రివిరచితేఽనడుద్ధరణ ప్రాయశ్చిత్త ॥

(౧౧౧) వృషభహరణప్రాయశ్చిత్తము॥ ఇది పరులవృషభమని తెలిసియును హరించిన బ్రాహ్మణుడు నరకమునుబొంది పిమ్మట జండాలుడైపుట్టునని దేవలుడువచించె. బాల్యపౌగండవయస్సులయందున్న వృషభమును హరించిన పిమ్మట నరకమునుబొంది దివాకీర్తిగలవాడు. (అనగా మంగలవాడై) పుట్టును. కావున దత్పాపోపశమనము కొఱకు దప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము నాచరించవలయునని హారీతుడువచించె. బాల్యపౌగండ యౌవన వయస్సునందున్న వృషభమును వనమునందైనను, రాజక్షోభలయందైనను మహాభయకాలమునందైనను, హరించిన యెడల నరకమునుబొంది పిమ్మట జండాలుడైపుట్టును. కావున దత్పాపోపశమనము కొఱకు రెండుతప్తకృచ్ఛ్రములప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. పౌగండ వయస్సునందున్న వృషభమును హరించిన బ్రాహ్మణుడు కృచ్ఛ్రమాత్రము నాచరించవలయును.

బాల్యవయస్సునందున్న వృషభమును హరించినవాడర్ధకృచ్ఛ్రము నాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలకీప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. క్షత్రియులకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును. వైశ్యులకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. శూద్రులీదుష్కృత్యమును జేసినయెడల రాజగువాడు తగిన విధముగ శిక్షను విధించవలయును. అనగా వృషభమును హరించిన శూద్రునకు హస్తచ్ఛేదమును విధించవలయును. బాలవత్సమును హరించిన శూద్రుని కొక్కవ్రేలును మాత్రము హరించవలయును. బ్రాహ్మణుడగువాడీకృత్యమును జేసినయెడల మరల నావృషభమును స్వంతగానికిప్పించి పిమ్మట బదిరూపాయిలను శిక్షార్థముగ విధించవలయునని మరీచివచించె. బలీవర్దమును హరించిన శూద్రుని హస్తచ్ఛేదమును జేయువలయుననియును, పౌగండవయస్సునందున్న వృషభమును హరించిన శూద్రునకు రెండంగుళములను ఛేదించవలయుననియును, బాల్యవయస్సునందున్న వృషభమును హరించిన శూద్రుని కొక్కయంగుళమును విధించవలయుననియును, బ్రాహ్మణుడీదుష్కృత్యమును జేసిన యెడల మరల నావృషభమునిప్పించి పిమ్మట నాబ్రాహ్మణునకు బదిరౌప్యములను దండనార్థముగ విధించవలయుననియును, రాజవైశ్యులీదుష్కృత్యమును జేసినయెడల దగినవిధముగ దండించవలయుననియును మనువుచించె. ఇట్లువృషభహరణప్రాయశ్చిత్తము సమాప్తము.

—— మహిషీహరణప్రాయశ్చిత్తమ్. ——

(౧౧౨) అథమహిషీహరణప్రాయశ్చిత్తమాహ॥ కణ్వః॥ శ్లో॥ మహిషీమాస్యజోలోభాత్పరకీంపాపవత్సలః॥ హరేత్సగత్వానరకం పునశ్చండాలజన్మవాన్॥ దేవస్వామీ॥ శ్లో॥ యోహరేన్మహిషీంవిప్రఃపరకీయాంధనాతురః॥ సగత్వానరకంఘోరం చండాలోభుషిజాయతే॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి గురుచాంద్రాయణాదృతే॥ చతుర్వింశతిమతే॥ శ్లో॥ యోహరేన్మహిషీం విప్రస్సవత్సాంక్షీరవర్ధినీం। అరణ్యేవా గృహేవాస నరకంయాతిదారుణం। చండాలజన్మసంప్రాప్య తిష్ఠత్యాచంద్రతారకం। తస్యైవనిష్కృతిరియం గురుచాంద్రాయణంస్మృతం। పునర్దత్వాసపాపీయాన్ వపనంచాంద్రభక్షణం। వపనంకృత్వా చాంద్రాయణం కుర్యాదిత్యర్థః॥ శ్లో॥ రాజాతుమహిషీంహృత్వా శూరుజఃపాదజోపివా। పునర్దత్వాచరేచ్చాంద్రమన్యథాతప్తమాచరేత్। ఊరుజస్యపరాకస్స్యాత్పాదజో యావకంచరేత్। సర్వత్రపునర్దత్వా ఏకాహాభ్యుపోష్యపంచగవ్యం పీత్వాశుద్ధిమాప్నో

తి। తత్తత్స్త్రీణాంతత్తదర్ధంయోజనీయం । పాదజస్యసర్వత్రజంతుస్తే మహాస్తచ్ఛేదాదికం యోజనీయం॥ ఇతిమహిషీహరణప్రాయశ్చిత్తం॥

(౧౧౨) మహిషీహరణప్రాయశ్చిత్తము ॥ పాపవత్సలుండైన బ్రాహ్మణుడు పరులసంబంధమైన యెనుమునుహరించినయెడల నరకలోకమును బొంది పిమ్మటచండాలుడైపుట్టునని కణ్వమునివరుడు వచించె. దేవస్వామియును నిటులనేవచించి యిట్టిపాపోపశాంతికొఱకు గురుచాంద్రాయణవ్రతమునాచరించవలయునని చెప్పె. అరణ్యమునందైనను, గృహమునందైననుని వసించుచున్నదియును, దూడతోగూడుకొన్నదియును, క్షీరములుగలదియును నగు నెనుమునుహరించిన బ్రాహ్మణుడు దారుణమగు నరకమునుబొంది పిమ్మట జండాలుడైపుట్టుననియును, అట్టి పాపోపశమనముకొఱకు గురుచాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును, మరల నట్టి యెనుమును, ఇచ్చినయెడల వపనచాంద్రాయణములనాచరించినయెడల పరిశుద్ధుడగుననియును చతుర్వింశతిమతమునందు జెప్పబడియె. క్షత్రియవైశ్యశూద్రులీదుష్కృత్యమును జేసినయెడల మరల నొసంగిరేని చాంద్రాయణవ్రతముచేతనైనను, తప్తకృఛ్రప్రాయశ్చిత్తమునైనను నాచరించవలయును. అనగా వైశ్యుడు పరాకకృఛ్రము నాచరించవలయును. శూద్రుడు యావకాహారుడు గావలయును. సర్వవిషయములందును మరలనిచ్చి యుపవాసమును జేసి పంచగవ్యప్రాశనను జేసినయెడల పరిశుద్ధులగుదురు. వారివారిస్త్రీలకు వారివారికి విధించినప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయును. శూద్రుడేజంతువును హరించినను హస్తచ్ఛేదమును జేయవలయును. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందలి మహిషీహరణప్రాయశ్చిత్తము.

——— మహిషహరణప్రాయశ్చిత్తమ్. ———

(౧౧౩) అథమహిషహరణప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ శ్లో॥ మహిషంయోద్విజోలోభాత్పారక్యంకృషికర్మవాన్ । హరేత్సగత్వానరకంపూర్వవజ్జాయతేభువి॥ నాగరఖండే॥ శ్లో॥ పారక్యంమహిషంహృత్వా విప్రఃకృష్యర్థమాదరాత్॥ తస్యైవనరకేవాసస్తథాచండాలజన్మతా ॥ కశ్యపః॥ శ్లో॥ కృష్యర్థంభారవాహార్థం యోవిప్రోమహిషంహరేత్ । యమలోకముపాగమ్య పశ్చాచ్చండాలతాంవ్రజేత్ । వతపాగండతరుణ మహిషహానేఅనడుద్ధరణప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్ । రాజ్ఞాదండశ్చవర్ణాదివిశేషేనయోజనీయః॥ ఇతిహేమాద్రివిరచితే మహిషహరణప్రాయశ్చిత్తం॥

(౧౧౪) మహిషహరణప్రాయశ్చిత్తము ॥ కృషికర్మలను జేయునట్టి

బ్రాహ్మణుడు లోభమువలన బహుళసంబంధమైన మహిషమును (అనగాదు న్నపోతును) హరించెనేని దారుణమగు నరకమునుబొంది పిమ్మట జండాలు డైపుట్టునని కూర్మపురాణమునందు జెప్పబడియె. నాగరఖండమునందును ని టులనే చెప్పబడినె. కాశ్యపుడును నిటులనేచెప్పె. వత్సపౌగండతరుణసం జ్ఞగల మహిషమును హరించువిషయమునందు వృషభహరణమునందువలె నే ప్రాయశ్చిత్తమును విధించవలయును. రాజగువాడు వస్త్రాదివివేకముచే త శిక్షను విధించవలయును. ఇట్లు హేమాద్రివిరచిత ధర్మశాస్త్రమునందు మహిషహరణ ప్రాయశ్చిత్తము.

—— గజహరణ ప్రాయశ్చిత్తమ్. ——

(౧౧౪) అథ గజహరణప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ విప్రో గజంహరేత్సంగ దోషాత్పరక్యమాదరాత్॥ నవవర్షంభ వేద్రక్షః పిశాచోని ర్జనేవనే। గాలవః॥ శ్లో॥ యోవిప్రోగజహారీస్యాత్పరబాధాన్మలిమ్లుచైః॥ నవ వర్షంమహారణ్యే పిశాచోభవతిధ్రువం॥ కణ్వః॥ శ్లో॥ రజ్ఞో వణిక్పతేర్వాపి సంగదోషాన్మలిమ్లుచః॥ హరేద్విప్రోయది గజంసపిశాచత్వ మాప్నుయాత్॥ బాలేచాంద్రం మహాచాంద్రం పౌగండేమదశంకితే॥ చాంద్రాయణత్రయంకు ర్యాన్మాంజీ బంధంవిధానతః॥ పునస్సంస్కారమిత్యర్థః॥ శ్లో॥ తంగజం స్వామినేదత్వా తతశ్చాంద్రాయణంచరేత్॥ రాజ్ఞాశిక్షాప్రకర్తవ్యా చోరే భ్యఃపాపభీరుణా। బాలేపౌగండకేచైవశతనిష్కాణదండయేత్। అశక్తాగ్రూ పకశతంసహస్రంమదహస్తిని॥ జీవనంతస్యగృహ్ణీయాదక్షిణకోద్విజోయది॥ వి ప్రప్రాయశ్చిత్తవచ్చాజ్ఞాం। ఊనుజానాంద్విగుణం। దండశ్చశూద్రస్య హస్తా దిచ్ఛేదః పూర్వవత్కర్తవ్యః స్త్రీణాంగజహరణాసంభవాత్ప్రాయశ్చిత్త మపినోక్తం॥ ఇతిహేమాద్రివిరచితేగజస్తేయ ప్రాయశ్చిత్తం॥

(౧౧౪) గజహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుదుర్జనసాంగత్య మునవలంబించి పరులయేనుగునుహరించినయెడల నిర్జనవనమునందుతొమ్మిది సంవత్సరములుపిశాచముగానైనను, రక్షస్సుగానైననుండునని గౌతముడువ చించె. గాలవుడునునిటులనేచెప్పె. కణ్వుడునునిటులనేచెప్పి బాలగజహరణ మునందుజాంద్రాయణమును, పౌగండగజహరణమునందు మహాచాంద్రము ను, మత్తగజహరణమునందు చాంద్రాయణత్రయమునునాచరించి పునరుప నయనసంస్కారమును బొందవలయుననిచెప్పె. అపహరించినగజమునుమరల నిచ్చినయెడల పిమ్మటనొక్కచాంద్రాయణముచేతనే పరిశుద్ధుడగును. ఇట్టి కృత్యములనుజేసినవారల రాజగువాడు దండించవలయును. బాల్యపౌగండవ

యస్సులయందున్న గజమునుహరించినవారలకు నూరునిష్కములశిక్షనువిధించవలయును. అంతద్రవ్యమునిచ్చుటకుశక్తిలేనివానికి నూరురౌప్యములశిక్షనువిధించవలయును. అంతయునునివ్వను శక్తిలేనివానిజీవనమును హరించవలయును. రాజులకుబ్రాహ్మణులకువలెనే ప్రాయశ్చిత్తమునువిధించవలయును. వైశ్యులకుద్విగుణముగ ప్రాయశ్చిత్తమునువిధించవలయును. శూద్రునకుహస్తచ్ఛేదమునుజేయవలయును. స్త్రీలుగజమునుహరింపజాలరుగనుక ప్రాయశ్చిత్తమునుగూడవిధింపలేదు. ఇట్లనిహేమాద్రివిరచితమైన ధర్మశాస్త్రమునందలిగజహరణప్రాయశ్చిత్తము॥

## (*) అశ్వస్తేయప్రాయశ్చిత్తమ్. (*)

(౧౧౫) అథాశ్వస్తేయప్రాయశ్చిత్తమాహ। దేవలః॥ శ్లో॥ ఉత్తమాశ్వంద్విజోహృత్వా పారక్యంతరుణంముదా। యమలోకము పాగమ్యాభవేత్పంగుర్భువస్థలె॥ హారీతః॥ శ్లో॥ ఉత్తమాశ్వంజాతమాత్రం బడబాంబాలికామపి॥ యోవిప్రస్సంగదోషేణ హరేన్నరకమశ్నుతే। పునర్భవేన్మహాపాపీపంగుస్సర్వాంగసంధిషు। తస్యాన్యాసిమృతిర్నాస్తిద్వివారం చాంద్రభక్షణాత్॥ మార్కండేయః॥ శ్లో॥ బడబాంజాతమాత్రంవా రాజయోగ్యంహయంద్విజః॥ అరణ్యేవాజిశాలాయాంచౌర్యబుద్ధ్యాజనైస్సహ। హృత్వానరకమాసాద్యభవేత్పంగుర్భువస్థలె। తస్యదేహవిశుద్ధ్యర్థంప్రోక్తంచాంద్రద్వయంద్విజైః॥ శిక్షాతురాజ్ఞాకర్తవ్యాపూర్వవజ్జాతిభేదతః॥ భూభుగాదీనామశ్వహరణేవిప్రప్రాయశ్చిత్తంద్విగుణం॥ దండంచరాజాకుర్యాజ్జాతిభేదేన॥ ఇతిహేమాద్రివిరచితే అశ్వస్తేయప్రాయశ్చిత్తం॥

(౧౧౫) అశ్వస్తేయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు, పరులసంబంధమైనదియును, తరుణవయస్సుగలదియును, శ్రేష్ఠమైనదియునునగు నశ్వమునుహరించినయెడల ఘోరనరకములనుబొంది పిమ్మటపంగువాడై (అనగా గుంటివాడై) పుట్టునని దేవలుడువచించె. బ్రాహ్మణుడు మిగులచిన్నవయస్సునందున్న యశ్వమునైనను (అనగానప్పుడుపుట్టినయశ్వమునైనను) బాలికయగునాడుగుఱ్ఱమునైనను, దుర్జనసాంగత్యదోషముచేతనపహరించెనేని నరకలోకమునుబొందును. పిమ్మటపంగువైపుట్టును. కావునదత్పాపశమనముకొఱకు రెండుచాంద్రాయణముల నాచరించవలయునని హారీతుడువచించె. అప్పుడుపుట్టినయాడుగుఱ్ఱమునైనను, రాజయోగ్యమైనయశ్వమునైనను, చౌర్యబుద్ధిచేతనరణ్యమునందు గాని వాజిశాలయందు గానియుండగా నపహరించిన బ్రాహ్మణుడు ఘోరనరకములనుబొంది పిమ్మట కుంటివాడై పుట్టుననియును,

తత్పాపశాంతికొఱకు రెండుచాంద్రాయణములనాచరించవలయుననియు, పూర్వోక్తప్రకారముగ జాతిభేదముచేత రాజువాడు శిక్షించవలయుననియును మార్కండేయుడు చెప్పె. ఇట్లని హేమాద్రివిరచితధర్మశాస్త్రమునందలియశ్వస్తేయప్రాయశ్చిత్తము సమాప్తము॥

## ఉష్ట్రస్తేయప్రాయశ్చిత్తమ్.

(౧౧౬) అథోష్ట్రస్తేయప్రాయశ్చిత్తమాహ। వామనః॥ శ్లో॥ క్రమేళకంహరేద్యస్తువిప్రో రాజకధనాతురః। నరకంససమాసాద్య జాయతేఽక్రజానుకః॥ జాబాలిః॥ శ్లో॥ రాజ్ఞః పశేషాముష్ట్రంయోహరేద్విప్రోధనాతురః॥ సఏవనరకంగత్వాఽక్రజంఘోభవేద్భువి॥ రాజవిజయే॥ శ్లో॥ అరణ్యేరాజసదనేవిప్రోహృత్వాక్రమేళకం। సతస్యపునరావృత్తిః స్నికాద్దీర్ఘజంఘకః॥ భువంప్రాప్యభవేదితిశేషః॥ శ్లో॥ ప్రాయశ్చిత్తమిదంప్రోక్తంమహాపాతకనాశనం। బాల్యేపౌగండకేతప్తంకౌమారేచాంద్రముచ్యతే। రాజ్ఞాశిక్షాప్రకర్తవ్యాపూర్వవద్వర్ణభేదతః। ప్రాయశ్చిత్తమపిపూర్వవద్వేదితవ్యం॥ ఇతి హేమాద్రివిరచితేఉష్ట్రస్తేయప్రాయశ్చిత్తం॥

(౧౧౬) ఒంటెనుదొంగిలించినవానికి ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుధనాతురుడై దొంగతనముచేత నొంటెనుహరించినయెడల నరకలోకమునుబొంది పిమ్మటవంకరలయినపిక్కలుగలవాడైపుట్టునని వామనుడువచించె. జాబాలియునుసిటులనేచెప్పి రాజులయొంటెనుగూడ నపహరింపగూడదనియె. అరణ్యమునందైనను రాజసదనమునందైనను నుండు నొంటెనుహరించినవాడునుపూర్వోక్తప్రకారముగనగునని రాజవిజయమునందు చెప్పబడియె. బాల్యపౌగండవయస్సులయందున్న యొంటెనపహరించినవాడు ప్రాయశ్చిత్తార్థముగతప్తకృచ్ఛ్రమునాచరించవలయును. కౌమారమునందు చాంద్రాయణమునాచరించవలయును. జాతిభేదముచేత రాజగువాడు పూర్వోక్తప్రకారముగ శిక్షనువిధించవలయును. ప్రాయశ్చిత్తమునుగూడ పూర్వోక్తప్రకారముగ విధించవలయును॥

## ఖరస్తేయప్రాయశ్చిత్తమ్.

(౧౧౭) అథఖరస్తేయప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యోహరేతఖరంప్రః పారక్యంధనకామ్యయా। సంగదోషాత్స్వయంవాపిమృగచండాలమాదరాత్। యమలోకముపాగమ్యహీనజాతిర్భవేద్భువి। మార్కండేయః॥ శ్లో॥ ఖరంహృత్వాద్విజోమోహాత్పారక్యంగృహమధ్యతః॥ వనేవాసంగదోషేణనరకంయాతిదారుణం। హీనజాతిర్భవేత్పశ్చాన్నిషర్భూతః కథితో

త్తమైః । బాలేపౌగండకేరాజన్ కాయకృచ్ఛ్రంసమాచరేత్ । తరుణేత ప్తకృచ్ఛ్రంస్యాత్తస్యపాపవిశుద్ధయె ॥ రాజ్ఞాదండ్యస్సపాపీయాన్ దాపయిత్వాప్రసః ఖరం । విప్రేషుదశరూప్యంస్యాద్రాజ్ఞివింశతిమేవచ ॥ ఊరుజేపితథాపాత్రంపాదశ్చహస్తఖండనం । తత్రత్ స్త్రీణామేవమర్ధక్రమేణయోజనీయం ॥ ఇతి హేమాద్రివిరచితే ఖరహరణప్రాయశ్చిత్తం॥

(౧౧౭) గాడిదెనుహరించినందుకుప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడు దుర్జనసాంగత్యమునవలంబించి చౌర్యబుద్ధిచేత ధనాతురుడై యితరులసంబంధమైనగాడిదెనపహరించెనేని ఘోరనరకమునుబొంది పిమ్మటజంబాలుడైపుట్టునని దేవలుడువచించె. మార్కండేయమునిటులసెలవిచ్చి బాల్యపౌగండకవయస్సులయందున్నగాడిదెనపహరించినవానికి కాయకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును, తారుణ్యమయ్యెనేని తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమునువిధించె. పతిమునురాజువాడుమరలనాగాడిదెనిప్పించి బ్రాహ్మణుడయ్యెనేని పదిరూప్యములను, క్షత్రియుడయ్యెనేని యిరువదిరూప్యములను, వైశ్యునకునునిరువదిరూప్యములను, శూద్రునకుహస్తచ్ఛేదమును శిక్షార్థముగవిధించవలయుననిచెప్పె. వారివారి స్త్రీలకు వారివారికివిధించినప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. ఇట్లుఖరహరణప్రాయశ్చిత్తము సమాప్తము॥

## అజబస్తస్తేయప్రాయశ్చిత్తమ్.

(౧౧౮) అథాజబస్తహరణ ప్రాయశ్చిత్తమాహ మార్కండేయః॥ శ్లో॥ అజంబస్తంద్విజోహృత్వాపాకం కృత్యంమదగర్వితః । మహతీంయాతనాం భుక్త్వాభవేత్స్వానుర్వ్యవస్థలే॥ జాతూకర్ణ్యః॥ శ్లో॥ బ్రాహ్మణోమదగర్వేణ పారక్యంబస్తమేషకం। హృత్వేతిశేషః॥ తీవ్రాంచయాతనాం భుక్త్వాహింసకో జాయతేభువి॥ జాబాలిః॥ శ్లో॥ అజంబస్తంగృహీత్వాపారక్యంగర్వితోద్విజః। ముషిత్వానరకంగత్వాహింసకోభువిజాయతే ॥ తస్యనిష్కృతిరుత్పన్నా ప్రాజాపత్యంసమాచరేత్। స్త్రీణామర్ధంతతోరాజ్ఞాంవిప్రవత్స్వామీరితం॥ ఇతి హేమాద్రివిరచితేఅజబస్తహరణప్రాయశ్చిత్తం॥

(౧౧౯) అజబస్తస్తేయప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు, పరులసంబంధమైనగొఱ్ఱెనైనను, మేకనైననుదొంగిలించినయెడల గొప్పదగునరకమునుబొంది పిమ్మటభూలోకమునందు మృగములనుహింసించువాడై పుట్టునని మార్కండేయమునివరుడువచించె. జాతూకర్ణ్యుడునువచించె. జాబాలియును నిటులనేచెప్పి యిట్టిపాపముశాంతినిబొందుటకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రమునువిధించవలయును. స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమునువిధించవలయును. క్షత్రియు

లకు బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయుననియు ను జెప్పె.

—— * ఆరణ్యకమృగహరణ ప్రాయశ్చిత్తమ్. * ——

(౧౯౯) అథారణ్యమృగహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ వ్యాఘ్రంవరాహంభల్లూకమేణీంకృష్ణమృగంతథా । రాజ్ఞాంక్రీడార్థమానీతంహృత్వావిప్రఃకథంభవేత్। ప్రాజాపత్యందుష్టమృగహారిణ్యాంతప్తముచ్యతే॥ చాంద్రంకృష్ణమృగప్రోక్తం ప్రాయశ్చిత్తంవిశోధనం ॥ బోధాయనః ॥ శ్లో॥ రాజ్ఞఃక్రీడార్థమానీతానారణ్యాన్ దుష్టచారిణః । వ్యాఘ్రవరాహం భల్లూకమేణీంకృష్ణమృగంద్విజః॥ హృత్వానరకమాప్నోతి ప్రాయశ్చిత్తేనశుధ్యతి। వ్యాఘ్రవరాహేభల్లూకే ప్రాజాపత్యంవిశోధనం ॥ హరిణ్యాంతప్తకృచ్ఛ్రంస్యాచ్చాంద్రం కృష్ణమృగద్విజః। కృత్వాశుద్ధిమవాప్నోతి నాన్యథా శుద్ధిరీరితా॥ గవయశరభేఖడ్గే ప్రాజాపత్యంహిపూర్వవత్॥ రాజ్ఞాంస్త్రైమే ప్రకర్తవ్య మేవమేవవిశుద్ధయే॥ * ॥ ఇతిహేమాద్రివిరచితే ఆరణ్యాదుష్టమృగహరణప్రాయశ్చిత్తం॥

(౧౯౯) ఆరణ్యకమృగహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు, రాజులువినోదముకొఱకుఁ దేఁబడినపెద్దపులి, వరాహము, భల్లూకము, లేడిని, కృష్ణమృగము, అనువానిని నపహరించెనేని పాపవంతుఁడగును. కావునఁ దత్పాపోపశమనముకొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. దుష్టమృగములను హరించినవానికిఁ బ్రాజాపత్యకృచ్ఛ్రమును, లేడిని హరించినవానికి తప్తకృచ్ఛ్రమును, కృష్ణమృగమును హరించినవానికిఁ జాంద్రాయణమును, విధించవలయునని దేవలుఁడువచించె. బోధాయనుఁడును నిటులనేచెప్పి వ్యాఘ్రభల్లూకములనుహరించినవానికిఁ బ్రాజాపత్యకృచ్ఛ్రమును, లేడిని హరించినవానికి తప్తకృచ్ఛ్రమును, కృష్ణమృగమును హరించినవానికి చాంద్రాయణమును, విధించె. గవయ,శరభ, ఖడ్గమృగములను హరించినవానికి ప్రాజాపత్యమును విధించవలయుననియె. రాజులకును నీప్రాయశ్చిత్తమునే విధించవలయుననియె.

—— * గ్రామ్యపక్షిమృగహరణ ప్రాయశ్చిత్తమ్. * ——

(౨౦౦) అథగ్రామ్యపక్షిమృగహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ మయూరంసారసంచైవ కపోతంజాలపాదకం । శుకంచాషంబలాకంచ శింశుమారంచకచ్ఛపం । ఏతేష్వన్యతమంహృత్వా ద్వాదశాహమభోజనః॥ పరాశరః॥ శ్లో॥ టిట్టిభంచక్రవాకంచ హంసంకారండవంతథా ॥ శు

కంచాష బలాకంచ శిశుమారంచకచ్ఛపం॥ మయూరంసారసంచైవ కపోతంజాలపాదకం। ఏతేష్వన్యతమంహత్వా ద్వాదశాహమభోజనం॥ మార్కండేయః॥ శ్లో॥ మకరంనకులంకాకం వరాహంమూషకంతథా। మార్జారంనకులంసర్పం భారద్వాజకపింతథా॥ డేరికాంచటకంశ్వానం హత్వావైకుక్కుటంతథా॥ సౌపర్ణగృధ్రశ్యేనాంశ్చ శివాంకంకంసృగాలకం॥ కృచ్ఛ్రార్ధమాచరేద్విద్వాన్ జ్ఞాత్వాతద్ద్విగుణంచరేత్। పల్లీంచసరటంరక్తపుచ్ఛకంబహుపాదకం। జ్ఞాత్వాహత్వాద్విజఃకుర్యాద్ద్వాదశాహమభోజనం। అజ్ఞానాద్ధింసయాహత్వా షడ్రాత్రంస్యాదభోజనం" ఇతిహేమాద్రివిరచితే గ్రామ్యమృగహరణప్రాయశ్చిత్తం॥

(౧౨౦) గ్రామ్యపక్షిమృగహరణప్రాయశ్చిత్తము॥ నెమలి, బెగ్గురుపక్షి, పావురము, జాలపాదకము, చిలుక, పాలపక్షి, బలాకము, శింశుమారము, కచ్ఛపము, అనుపక్షులలోనెద్దానినైన హరించిన బ్రాహ్మణుఁడు పదిరెండుదినముల భోజనవ్రతము నాచరించవలయునని దేవలుఁడు వచించె. టిట్టిభము, చక్రవాకము, హంసము, కారండవము, అనుమృగములనుకూడ హరింపఁగూడదని పరాశరుఁడు వచించె. ముసలి, నకులము, కాకము, వరాహము, మూషకము, మార్జారము, సర్పము, భారద్వాజము, కపి, డేరిక, పిచ్చిక, కుక్క, కోడి, గరుత్మంతుఁడు, గ్రద్ద, డేగ, శివయను ప్రాణి, కంకపక్షి, నక్క, అనుజంతువులనపహరించినబ్రాహ్మణుఁడు, అర్ధకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము నాచరించవలయును. ఈకృత్యములను బుద్ధిపూర్వకముగ నాచరించినయెడల సంపూర్ణకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును నాచరించుకొనవలయును. బల్లి, సరటము, రక్తపుచ్ఛకము, బహుపాదకము, అనుజంతువులను బుద్ధిపూర్వకముగ హరించిన బ్రాహ్మణుఁడభోజనవ్రతము నాచరించవలయును. అజ్ఞానమువలన నీకృత్యమును చేసినవాఁడు, ఆరుదినముల భోజనవ్రతము నవలంబించవలయునని మార్కండేయ మునివరుఁడు వచించె.

## భూమిహరణప్రాయశ్చిత్తమ్.

(౧౨౧) అథభూమిహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ స్వదత్తాంపరదత్తాంవాయోహరేతవసుంధరాం। షష్టిర్వర్షసహస్రాణి విష్ఠాయాంజాయతేకృమిః॥ ఏకైవభగినీలోకే సర్వేషామేవభూభుజాం। నభోజ్యానకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా॥ కరగ్రాహ్యేతితస్యా ముష్ణస్తథనాహరణః॥ దేవస్వామీ॥ శ్లో॥ గ్రామంవాక్షేత్రమాత్రంవా కేదారంభూమిమేవవా। విప్రాధీనంహరేద్రాజా యమలోకముపాగతః॥ పశ్చాద్భ్రమ

హాగస్య కృమిరాశిర్భవేన్నలే॥ మహానారదీయే॥ శ్లో॥ క్షేత్రంగ్రామంతటాకంవా వనంకేదారమేవవా। భూమింవావిప్రదత్తాం యోరాజావాప్రభుమాత్రకః । హరేత్సనరకంప్రాప్య కీటస్స్యాన్మలమధ్యతః ॥ తస్యైషాని ష్కృతిర్దృష్టా మహాపాతకశోధినీ। క్షేత్రేహృత్వాషడబ్దంస్యాద్గ్రామేచాంద్రాయణంస్మృతం। తటాకేతద్ద్వయంప్రోక్తం వనేచైః తథాచరేత్ । కేదారేతప్తకృచ్ఛ్రంస్యాద్భూమ్యాంచాంద్రత్రయస్స్మృతం । ఏతదేకవారవిషయం । బహువారేతద్ద్విగుణం । ప్రత్యబ్దఫలస్వీకరణే బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమర్హతీతి॥ ఇతిహేమాద్రివిరచితేభూహరణప్రాయశ్చిత్తం॥

(౧౭౧) భూమిహరణప్రాయశ్చిత్తము॥ తనచేతనైనను, ఇతరులచేతనైనను, ఇవ్వఁబడినభూమిని హరించినవాఁడరువదివేల సంవత్సరములుపురీషమునందలి పురుగైపుట్టుచుండునని దేవలుఁడువచించె. మఱియునన్యథముగనివ్వఁబడిన భూమియేయిచ్చినవాని పుత్రులకు భగినియనఁబడునని యును జెప్పె. బ్రాహ్మణులయధీనమునందున్న గ్రామమునైనను, క్షేత్రమాత్రమునైనను, కేదారమునైనను, భూమినైనను, రాజగువాఁడపహరించెనేని ఘోరనరకములనుబొంది పిమ్మట పురీషమునందలి పురుగైపుట్టునని దేవస్వామిచెప్పె. నారదీయమునందు బ్రాహ్మణాధీనమునందున్న తటాకవనములనుగూడ రాజయినను ప్రభుమాత్రకుఁడయినను హరింపఁగూడదని చెప్పఁబడియె. మఱియు నిట్టిపాపకృత్యమునకుఁ బ్రాయశ్చిత్తముచెప్పఁబడె. అదియెట్లనిన క్షేత్రమునుహరించినవానికి షడబ్దకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును విధించవలయును. గ్రామమునుహరించినవానికిఁ జాంద్రాయణముచెప్పఁబడినది. తటాకవనములను హరించినవానికి షడబ్దకృచ్ఛ్రచాంద్రాయణములను రెంటనువిధించవలయును. కేదారమును హరించినవానికి తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును విధించవలయును. భూమినిహరించినవారికి మూఁడుచాంద్రాయణములను విధించవలయును. ఈప్రాయశ్చిత్తమొకపర్యాయము మిట్టిదుష్కార్యమును జేసినవానికని యెఱుఁగవలయును. అనేకపర్యాయము లిట్టిదుష్కార్యమును జేసినవానికీప్రాయశ్చిత్తమును ద్విగుణితముగఁ జేయవలయును. ప్రతిసంవత్సరమునందును నిట్టిదుష్కృత్యమును జేసినరాజు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమునకర్హుఁడగును. హరించడమనఁగా పైనజెప్పఁబడిన భూమ్యాదులకు పన్నునుగ్రహించుటయని తెలియవలయును. ఇట్లనిమహానారదీయమునందుఁ జెప్పఁబడియె.

——* స్వదత్తాపహరణప్రాయశ్చిత్తమ్. *——

(౧౨౨) అథస్వదత్తాపహరణప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ భూమింక్షేత్రంధనంధాన్యం వస్త్రంకన్యాంవిభూషణం । సాలగ్రామంచ లింగంచ గృహంశయ్యాంమహోన్నతిం । పూర్వందత్వా ద్విజేభ్యశ్చ పశ్చాల్లోభపరాయణః ॥ స్వయంహృత్వామహద్ఘోరం రౌరవంనరకంవ్రజేత్ మార్కండేయః॥ శ్లో॥ సాలగ్రామంచలింగంచ ధేనుంశయ్యాంమహోన్నతిం। భూమింక్షేత్రంధనంధాన్యం వస్త్రంకన్యాంవిభూషణం॥ మహిషీంవాగృహం వాపి హ్యనడ్వాహంద్విజాతయే॥ పుణ్యకాలేస్వయందత్వా పశ్చాద్యదితదాహరేత్ । రౌరవంనరకంఘోరం సయాతిసుమహత్భయం । తస్యాపకృతిరుత్పన్నా మహాపాతకనాశినీ । పునర్దత్వాథతద్వస్తుపశ్చాత్తాపపరాయణః॥ ప్రాజాపత్యద్వయంకృత్వా శుద్ధిమాప్నోతిమానవః । అదత్వాతానివస్తూని భుంక్తేయదిసపాపధీః । చాంద్రాయణద్వయంప్రోక్త మథవాభూపదిక్రమః ॥ భూపతిర్విప్రవత్కుర్యాద్ద్విగుణశుద్ధిహేతవే ॥ ఇతిహేమాద్రివిరచితే స్వదత్తాపహరణప్రాయశ్చిత్తం ॥

(౧౨౨) స్వదత్తాపహరణ ప్రాయశ్చిత్తము॥ భూమి, క్షేత్రము, ధనము, ధాన్యము, వస్త్రము, కన్నియ, భూషణము, సాలగ్రామము, లింగము, గృహము, శయ్య, అనువానిని ముందుగ బ్రాహ్మణునికిచ్చి పిమ్మటబుద్ధి తచేతహరించినవాఁడు ఘోరమలగు నరకములను బొందునని దేవలుఁడు వచించె, మార్కండేయమునివరుఁడు, ధేనువు, ఎనుము, ఎద్దు, వానిసిగూడ ముందుగనిచ్చి పిమ్మట నపహరింపఁగూడదనిమె. మరియును పుణ్యకాలము లయందు ముందుగనొసంగి పిమ్మటగ్రహించినవాఁడు రౌరవమనియెడు నరకమును బొందుననియె. మఱియు నొకవేళ లుబ్ధతచేత గ్రహించినవాఁడు పశ్చాత్తాపపరాయణుఁడై మరలనిచ్చి రెండు ప్రాజాపత్యకృచ్ఛ్రములను ప్రాయశ్చిత్తార్థముగ నాచరించినయెడల పరిశుద్ధుఁడనియె, అట్లుమరల నొసంగనివానికి రెండుచాంద్రాయణముల నయినను, భూప్రదక్షిణమునయినను జేయువలసినదనివిధించె. ఈప్రాయశ్చిత్తమున క్షత్రియ బ్రాహ్మణులకు సమానమేననియె ॥

——* రత్నహరణ ప్రాయశ్చిత్తమ్. *——

(౧౨౩) అథరత్నహరణప్రాయశ్చిత్తమాహ॥దేవలః॥శ్లో॥ ముక్తాఃప్రవాళంవైడూర్యం వజ్రంనీలంతథైవచ। పద్మరాగంమరకతంపుష్యరాగమతఃపరం।ఏతాన్‌రత్నజాతానివిప్రాయః ముష్ణేద్బలాత్॥ప్రాప్యతుంవాథచౌర్యాద్వా

సపాపీనరకం వ్రజేత్ । పశ్చాద్భువముపాగమ్య కురూపీజాయతే తదా॥ మార్కండేయః ॥ శ్లో ॥ మౌక్తికంపుష్యరాగంచ వజ్రం వైడూర్యమేవచ । ప్రవాళంపద్మరాగంచ గారుత్మతమతః పరం । ఇంద్రనీలంమహావజ్రం ద్విజోయః పాపమోహితః ॥ పారక్యంయదిచౌర్యేణముషేత్సనరకంవ్రజేత్ । పశ్చాద్భువముపాగమ్య భవేత్కుత్సితజన్మవాన్ ॥ ఋతుద్వయమపరాకస్స్యాత్ షణ్మాసేచాంద్రముచ్యతే॥ ప్రత్యక్షంహారిణేవిప్రోహ్యబ్దపాతిత్యమర్హతి। సంవత్సరంప్రత్యక్షం రత్నస్తేయపతితప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధ్యతి । ఏతద్బహురత్నస్తేయే పతితప్రాయశ్చిత్తం సంవత్సరాంతేవేదితవ్యం ॥ ఇతి హేమాద్రివిరచితే రత్నస్తేయ ప్రాయశ్చిత్తమ్ ॥

(౧౭౩) రత్నహరణప్రాయశ్చిత్తము ॥ ముత్యము, పవడము, వైడూర్యము, వజ్రము, నీలము, పద్మరాగము, మరకతము, పుష్యరాగము, అనునవి తొమ్మిదియును రత్నములనఁబడును. ఈరత్నములను దొంగతనముచేతనైనను, దౌర్జన్యముచేతనైనను అపహరించినవాఁడు నరకలోకమునుబొంది పిమ్మట భూలోకమునందుఁ గురూపియైపుట్టునని దేవలుఁడువచించె. మార్కండేయుఁడును నిటులనే చెప్పి నాలుగుమాసముల కాలమిట్టి దుష్కృత్యమును జేసిన బ్రాహ్మణునకు పరాకమును, ఆరుమాసము లాచరించినవానికి చాంద్రాయణమును విధించవలయుననియె. అనఁగా నపహరించినరత్నములను మరలనిప్పించి యీప్రాయశ్చిత్తములను విధించవలయుననియభిప్రాయము. ప్రత్యక్షమునందు దౌర్జన్యముచేత సంవత్సరకాలమిట్టి దుష్కృత్యమును జేసినవాఁడు పతితుఁడగును. అట్టివానికి సంవత్సరాంతరమందు పతితప్రాయశ్చిత్తమును విధించ వలయుననియె॥

—— బాలహరణ ప్రాయశ్చిత్తమ్. ——

(౧౭౪) అథబాలహరణప్రాయశ్చిత్తమాహ ॥ నారదః॥ శ్లో॥ బాలంహరేద్ద్విజోదైవాత్ప్రాగక్యంద్రవ్యలోభవాన్ । సచండాలసమోజ్ఞేయస్సర్వకర్మసుగర్హితః ॥ గౌతమః ॥ శ్లో ॥ బ్రాహ్మణం క్షత్రియం బాలం వైశ్యంశూద్రమథాపివా । నతస్యనిష్కృతిర్దృష్టామునిభిస్సత్యవాదిభిః ॥ గాలవః॥ శ్లో॥ పూర్వజంక్షత్రియంబాలం వైశ్యంపాదజమేవవా । సర్వాలంకారసంయుక్తం హృత్వాశక్రకథంభవేత్ । సవిప్రోభ్రూణహంతాస్యాద్భవేచ్చండాలజన్మవాన్ । తస్యైవనిష్కృతిరియంసర్వాఘౌఘనికృంతనీ। బాలంతంస్వామినేదత్వా పశ్చాత్తాపసమన్వితః । బ్రాహ్మణేత ప్తకృచ్ఛ్రంస్యాత్పరాకంక్షత్రియేస్మృతం । వైశ్యేచయావకంప్రోక్తం పాదజేపవనంస్మృతం।

ఏతత్పునర్దానవిషయం । అదత్వాచేద్విశేషమాహ। జాబాలిః॥ శ్లో॥ అదత్వాస్వామినే బాలం చాంద్రం విప్రేప్రచోదితం । క్షత్రే మొతప్తకృచ్ఛ్రంస్యాద్వైశ్యేపారాకమీరితం ॥ పాదజేపంచగవ్యంచ వపనంచశిరోరుహాం । క్షత్రియవైశ్యయోః పారక్య బాలహానేవిప్రోక్తప్రాయశ్చిత్తాద్ద్విగుణం । శూద్రస్యహస్తచ్ఛేదః । భూషణాపహరణే పాదచ్ఛేదశ్చ । ఏతత్ స్త్రీణామర్ధముక్తం ॥ ఇతి హేమాద్రివిరచితే బాలహరణ ప్రాయశ్చిత్తం ॥

(౧౭౪) బాలహరణ ప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు ద్రవ్యాశచేతఁ బరుల సంబంధమైన బాలునిహరించినయెడల చండాల సముఁడగును. మఱియు సర్వకర్మలయందును బహిష్కృతుఁడగునని నారదుఁడు వచించె. బ్రహ్మక్షత్రవైశ్య శూద్రులబాలురలోనే బాలునిహరించినను ప్రాయశ్చిత్తముగూడ లభింపనేరదని గౌతముఁడువచించె. బ్రహ్మక్షత్రవైశ్యశూద్రచాలురలో నేబాలుఁడైనను సర్వాలంకారములను ధరించియుండఁగ హరించిన బ్రాహ్మణుఁడు భ్రూణహత్యకుఁ దుల్యమైన పాపమును బొందినవాఁడగును అవికారణముగఁ జండాలుఁడైపుట్టును. అట్టివానికిఁ బ్రాయశ్చిత్తము నిష్విధముగ విధించవలయును, ఎట్లనిన నబ్బాలుని స్వంతగానికిమరలనిచ్చిపశ్చాత్తాపముతోఁ గూడినవాఁడై బ్రాహ్మణ బాలుని హరించినయెడల తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరించవలయు, క్షత్రియబాలుని హరించినయెడలపరాకకృచ్ఛ్రము నాచరించవలయును, వైశ్యబాలుని హరించినవాఁడు యావకాహారుఁడు గావలయును, శూద్రుబాలుని హరించినవారికి వపనమేప్రాయశ్చిత్తము॥ ఇది మరలనిచ్చినవాని విషయము. ఇట్లని గాలవుఁడువచించె. బ్రాహ్మణబాలుని హరించినవాఁడు మరల నొసంగఁడేని చాంద్రాయణవ్రతము నాచరించవలయును, క్షత్రియబాలుని విషయమై తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమునాచరించవలయును. వైశ్యబాలుని విషయమైపరాకకృచ్ఛ్రము నాచరించ వలయును, శూద్రబాలుని విషయమై వపనమును జేయించుకొని పంచగవ్యప్రాశనను జేయించుకొనవలయును, క్షత్రియవైశ్యులీ కృత్యములను జేసినపుడు బ్రాహ్మణునకు విధించిన ప్రాయశ్చిత్తమునకు ద్విగుణముగ విధించవలయును, శూద్రుడుదుష్కృత్యమును జేసినయెడల హస్తచ్ఛేదమును జేయించవలయును, భూషణములనుమాత్రమే హరించినయెడల పాదచ్ఛేదమును విధించవలయును, స్త్రీలకీప్రాయశ్చిత్తమునందు సగమును విధించవలయును. ఇట్లని జాబాలివచించె ॥

—— * కన్యాహరణ ప్రాయశ్చిత్తమ్. * ——

(౧౭౫) అథకన్యాహరణప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥
శ్లో॥ కన్యాంసురూపిణీంవిప్రో భూషణైరప్యభూషితాంసతీం । చోరబుద్ధ్యాహరేత్పాపీనరకంయాతిదారుణం । తదంతేభువమాసాద్య భిల్లరూపీ సజాయతే ॥ గాలవః ॥ శ్లో॥ విప్రోయఃకన్యకారత్నం సర్వభూషణ భూషితం । విప్రజంచాపహృజ్జాతం పాదజాద్వావిశేషతః ॥ ముషిత్వాదుష్టసంగేన పరవాక్యానుసారతః । నతస్యనరకాద్భూయః పునరాగమనంభవేత్ । కథంచిద్భువమాపాద్య జాయతేభిల్లజన్మవాన్ ॥ పరాశరః ॥ శ్లో॥ పూర్వజః కులజాంకన్యాంవిప్రో దైవవివర్ధినీం । హృత్వాకామాతురోనిత్యంనతస్యపునరుద్భవః । చండాలజన్మసంప్రాప్య బ్రహ్మహావశ్యసన్నృప ॥ దత్వాతాం స్వామినేపశ్చాచ్ఛుద్ధశ్చాంద్రాయణవ్రతాత్ । అదత్వాపునరప్యేనాంసపశ్చాత్తాపవాన్ద్విజః ॥ మహాచాంద్రాయణంకృత్వా పంచగవ్యమనంతరం । తతశ్శుద్ధిమవాప్నోతి నాన్యథాగతిం స్త్రీహి ॥ రాజకన్యాహరేకాయం తప్తం విట్శూద్రకన్యయోః ॥ హరేహరణఇత్యర్థః ॥ శ్లో॥ రాజావిప్రసుతాదానే ద్విగుణంవిప్రచోదితాత్ । వైశ్యోవిప్రసుతాంహృత్వా రాజవన్మని చోదితం ॥ శూద్రోపహరేద్విప్రకన్యాం కారీషవధమర్హతి ॥ తత్తత్స్త్రీణానుర్ధంప్రాయశ్చిత్తం ॥ ఇతిహేమాద్రౌ కన్యాహరణప్రాయశ్చిత్తం॥

(౧౭౫) కన్యాహరణ ప్రాయశ్చిత్తము ॥ చక్కనియాకారముగల కన్నియను చోరబుద్ధిచే నపహరించిన బ్రాహ్మణుఁడు దారుణమగు నరకమునుబొందును, పిమ్మట భిల్లుఁడైపుట్టును, ఇట్లని మార్కండేయ మునివరుఁడు వచించె. గాలవుఁడును నిటులనే చెప్పె. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణకన్నియను కామాతురుఁడై చోరబుద్ధిచే నపహరించినయెడల ఘోర నరకములను బొంది పిమ్మట భూలోకమునందుఁ జండాలుఁడై పుట్టుననియును, మరల నకన్నియను యజమానునకిచ్చినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయుననియును, ఇవ్వనివాఁడు పశ్చాత్తాపపరాయణుఁడై మహాచాంద్రాయణవ్రతము నాచరించి పంచగవ్యప్రాశనను జేసినయెడల పరిశుద్ధుఁడగుననియును, రాజకన్యకను హరించినయెడల కాయకృచ్ఛ్రము నాచరింప వలయుననియును, వైశ్యశూద్రకన్నియలను హరించినయెడల తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము నాచరింపవలయుననియును పరాశర మునివరుఁడువచించె. రాజగువాడుబ్రాహ్మణకన్నియనపహరించినయెడలబ్రాహ్మణునకువిధించినప్రాయశ్చిత్తమునకంటె రెండురెట్లధికముగ విధింపవలయును, వైశ్యుఁడుబ్రాహ్మ

ు కన్యను నపహరించినయెడల రాజునకు విధించిన ప్రాయశ్చిత్తమును విధించవలయును, శూద్రుఁడు బ్రాహ్మణ కన్యను హరించినయెడల కారీష వధను విధించవలయుననియును పరాశరుఁడే వచించె. వారివారిస్త్రీలకు వారివారికి విధించిన ప్రాయశ్చిత్తమునం దర్ధమును విధించవలయును ॥

## ॥ నారీహరణప్రాయశ్చిత్తమ్. ॥

(౧౭౬) అథ నారీహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ విప్రస్త్రీం స్వకులజాం విప్ర పత్నీం హరేద్యది॥ బోధయిత్వా సువార్తాభిరుత వాపి ధియా బలాత్॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి కారీషదహనాదృతే॥ మార్కండేయః॥ శ్లో॥ అనంగీకారిణీం సాధ్వీం విప్రపత్నీం ద్విజః ఖలః॥ బోధయిత్వా సువార్తాభిశ్చోరబుద్ధ్యా హరేద్యది। రాజా తం దండయేత్పశ్చాత్కారీషదహనాదిభిః॥ గాలవః॥ శ్లో॥ అనంగీకారిణీం విప్రపత్నీం సాధ్వీం ద్విజో హరేత్। సంసర్గే వృషణచ్ఛేదస్స్వభావేన తదర్పణే॥ కేశసంవపనం కృత్వా తప్తకృచ్ఛ్రత్రయం చరేత్॥ రహస్యేనాము పాగృహ్ణన్ చాంద్రాయణమథాచరేత్॥ ఏతత్సకృద్విషయం॥ అభ్యాసే ద్విగుణం॥ అత్యంతాభ్యాసే కారీషవధ ఏవ నాన్యత్॥ మనుః॥ శ్లో॥ క్షత్రియో వైశ్యజాతిర్వా బలాద్బ్రాహ్మణసుందరీం॥ ముషిత్వా రావంయాతి వధః కారీషవహ్నినా॥ ఏవం చేచ్ఛుద్ధిమాప్నోతి మాసల్యం పాదజస్స్మృతం। విప్రస్య క్షత్రియ వైశ్య నారీహరణే చాంద్రద్వయం। చాంద్ర-శూద్రాంగనాహరణే ప్రాయశ్చిత్తం విశోధనం॥ ఇతి హేమాద్రివిరచితే నారీహరణప్రాయశ్చిత్తం॥

(౧౭౭) నారీహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు స్వకులమునందుఁ బుట్టినదియును, పతివ్రతయునగు బ్రాహ్మణభార్యను నానావిధములగు దుర్బోధనలను జేసియైనను, బలాత్కారముచేతనైనను, హరించిన యెడల కారీషవధను విధించవలయునని దేవలుఁడు వచించె. దుర్మార్గుఁడగు బ్రాహ్మణుఁడు, అంగీకరించనిదియును, పతివ్రతయును, అగు విప్రస్త్రీని నానావిధములగు సువార్తలచేతనైనను, చోరబుద్ధిచేతనైనను, అపహరించినయెడల రాజగువాఁడట్టిబ్రాహ్మణునకు కారీషవధను విధించవలయునని మార్కండేయమునివరుఁడు చెప్పె. గాలవుఁడును నిటులనే చెప్పి యావిప్రస్త్రీని బొందినవానికి వృషణచ్ఛేదమును శిక్షగా విధించవలయుననియును, అట్టిస్త్రీయొక్క సంసర్గమును బొందకయే మరల నొసంగినయెడల కేశసంవపనమును జేసికొని మూఁడుతప్తకృచ్ఛ్రముల నాచరించవలయుననియును, రహస్యముగ హరించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును

జెప్పె. ఇదియొకసారి మాటుచేసినవానివిషయము. అభ్యాసముగా నిట్టిదుష్కృత్యమును జేయువానికి ద్విగుణప్రాయశ్చిత్తమును విధించవలయుననియును నభిప్రాయము. ఈయభ్యాసమత్యంతాభ్యాసమయ్యేని కారీషవధను విధించవలయును. క్షత్రియుడైనను, వైశ్యుడైనను, బ్రాహ్మణస్త్రీని బలాత్కారముగా నైనను, దొంగతనముచేతనైనను, అపహరించినయెడల రౌరవమనునరకమును బొందును. కావుననట్టివాడు కారీషవధను బొందవలయును. ఈకృత్యమును శూద్రుడు చేసినయెడల మాసల్యవధను విధించవలయును. క్షత్రియవైశ్యస్త్రీలనుహరించినబ్రాహ్మణుడు రెండుచాంద్రాయణముల నాచరించవలయును. శూద్రాంగననుహరించినబ్రాహ్మణుడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును॥

——(*) పురుషహరణప్రాయశ్చిత్తమ్. (*)——

(౧౨౭) అథపురుషహరణప్రాయశ్చిత్తమాహ॥ పరాశరః॥ శ్లో॥ విప్రోహరేత్పరంమర్త్యమున్మత్తంమంత్రభేషజైః॥ దేశాద్దేశాంతరంగత్వాస విప్రోనరకంవ్రజేత్॥ జాబాలిః॥ శ్లో॥ విప్రఃపరంనరంహృత్వా భ్రామయిత్వౌషధాదిభిః। దేశాద్దేశంగతఃపశ్చాద్దత్వాతంపునరాదరాత్। కుర్యాద్దేహవిశుద్ధ్యర్థంతప్తకృచ్ఛ్రమనూదితం॥ అనర్పయిత్వాతంమూఢశ్చాంద్రాయణమథాచరేత్॥ విప్రస్తుక్షత్రియంవైశ్యంహృత్వామంత్రవిధానతః। పునర్దత్వాపరాకంస్యాదన్యథాచాంద్రమీరితం। క్షత్రియవైశ్యయోర్బ్రాహ్మణహరణే విప్రాద్ద్విగుణంవ్రతం॥ శూద్రస్యమాసల్యం। తత్స్త్రీణామర్ధంవేదితవ్యం॥ ఇతిహేమాద్రివిరచితేపురుషహరణప్రాయశ్చిత్తం॥

(౧౨౮) పురుషహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు మంత్రభేషజములచేతనితరుడగుపురుషుని నొకదేశమునుండి వేరొకదేశమునకు బోయినయెడల నరకమును బొందునని పరాశరమునివరుడువచించె. ఈప్రకారముగానే జాబాలియును వచించి మరలనొసంగినయెడల దేహశుద్ధికొఱకు దప్తకృచ్ఛ్రమును నాచరించుకొనవలయుననియె. మరలనివ్వనిమూఢుడు చాంద్రాయణవ్రతమునాచరించవలయును. బ్రాహ్మణుడు మంత్రౌషధిబలమువలన క్షత్రియవైశ్యులనుహరించి మరలనొసంగినయెడల పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. మరలనివ్వనియెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. క్షత్రియవైశ్యులు బ్రాహ్మణులనుహరించినయెడల బ్రాహ్మణులకువిధించిన ప్రాయశ్చిత్తమునకు ద్విగుణముగవిధించవలయును. శూద్రుడీదుష్కృత్యమును జేసిన మాసల్యవధను విధించవలయును. వారివారిస్త్రీలకు వారివారికివిధిం

చినప్రాయశ్చిత్తమునందర్ధమునుకల్పించవలయుననియును జాబాలివచించె॥

## (*) వేశ్యాహరణప్రాయశ్చిత్తమ్. (*)

(౧౨౮) అథవేశ్యాహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ భోగాసక్తస్తుయోవేశ్యాంవిప్రఃపాపపరాయణః॥ రమేత్తాంయదిదుష్టాత్మాసహాంతంనరకంవ్రజేత్ ॥ గాలవః ॥ శ్లో ॥ వైశ్యాంశ్చప్రసృతీంత్యక్త్వాస్వభార్యాంమన్మథాతురః। ఔషధైర్బహుభిర్మాల్యైర్వంచయిత్వాహరేద్యది। స మహాపాపమాసాద్యషండోభూయాద్భవస్థలే॥ తస్యైవనివృత్తిర్నాస్తిజ్ఞాత్వాయదిహరేదిమాం॥ జాబాలిః॥ శ్లో॥ వేశ్యాంహరేద్యదావిప్రోవంచయిత్వౌషధైర్బలాత్॥ రాజ్ఞాదండ్యశ్శతంరూప్యంరతిస్తస్యనవిద్యతే॥ తస్యదేహవిశుద్ధ్యర్థంమహాసాంతపనంస్మృతం॥ ఏతత్ప్రాయశ్చిత్తంహరణమాత్రేవివేచనీయం। తత్రతస్యారతిర్యదితస్యవిశేషమాహ॥ అంగిరాః॥ శ్లో॥ వేశ్యాయాహరణేరాజన్ మహాసాంతపనంవిదుః॥ తత్రైవరమమాణస్యచాంద్రంశుద్ధిప్రదంతదా॥ క్షత్రియోద్విగుణంప్రోక్తంవణిక్క్షత్రియవచ్చరేత్ ॥ శూద్రోదండ్యశ్శతంరూప్యంవిప్రోభ్యాసేపతిష్యతి । విప్రోవేశ్యాంహృత్వాతత్రక్రీడాసక్తశ్చేత్సంవత్సరాదూర్ధ్వంపతితోభవతి। అన్యత్స్పష్టం॥ ఇతిహేమాద్రివిరచితేవేశ్యాహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౨౮) వేశ్యాహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుపాపపరాయణుడును భోగాసక్తుడునునై వేశ్యాకాంతనుబొందినయెడల గొప్పదగునరకమునుబొందునని దేవలుడువచించె. బ్రాహ్మణుడునిజభార్యనువదలి మన్మథాతురుడై వేశ్యాస్త్రీని మంత్రౌషధాదులచేతహరించి సురతక్రీడలననుభవించినయెడలమహాపాపవంతుడగును. పిమ్మటనపుంసకుడైపుట్టును. ఈకృత్యమునుబుద్ధిపూర్వకముగనాచరించినయెడల ప్రాయశ్చిత్తమేలేదు. ఇట్లనిగాలవుడువచించె. బ్రాహ్మణుడువేశ్యాస్త్రీనిహరించి సంభోగమునుబొందనియెడల రాజగువాడు నూరురౌప్యములను దండనవిధించవలయును. అట్లురాజదండనను బొందిన పిమ్మటదేహశుద్ధికొఱకుమహాసాంతపనకృచ్ఛ్రము నాచరించవలయును. ఈప్రాయశ్చిత్తము వేశ్యాహరణమునుమాత్రము చేసినవానికనియునజాబాలివచించె. వేశ్యనుహరించినవానికి మహాసాంతపనకృచ్ఛ్రము నాచరించవలయును. ఆవేశ్యాస్త్రీతోసంభోగమునుజేసినవానికి చాంద్రాయణవ్రతమునువిధించవలయును. ఈకృత్యమునుక్షత్రియవైశ్యులుచేసినయెడల బ్రాహ్మణునకువిధించినప్రాయశ్చిత్తమునకు ద్విగుణముగవిధించవలయును. శూద్రుడీదుష్కృత్యమునుజేసినయెడల శతరూప్యములను దండార్థముగ విధించవలయు

ను. బ్రాహ్మణుడీకృత్యము నభ్యాసముగఁజేసినయెడల పతితుఁడగును. బ్రాహ్మణుడు వేశ్యాస్త్రీతో సంవత్సర కాలమునకధిక కాలము సంభోగాదిక్రియల నుజేయుచున్నయెడలపతితుఁడగునని యంగిరోమునివరుడువచించె॥

—(*) దాసీహరణప్రాయశ్చిత్తమ్. (*)—

(౧౨౯) అథదాసీహరణ ప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ శ్లో॥ దాసీంకామాతురోయస్తుపూర్వజోధర్మముత్సృజన్ । హరేత్సనరకస్థాయీయావదాభూతసంప్లవం॥ జాతుకర్ణిః॥ శ్లో॥ విప్రోలోభాతురోదాసీంస్వధర్మంసంపరిత్యజన్ ॥ వంచయిత్వాపథైర్వాక్యైర్హరేద్యది సపాపధీః॥ మృత్వానరకమాసాద్యభవేద్భువినిరింద్రియః॥ చతుస్త్రింశన్మతే॥శ్లో॥ యదివిప్రోహరేద్దాసీంవంచయిత్వాపథైశ్ఛలాత్ ॥ సగచ్ఛేన్నరకంఘోరంకాలసూత్రంసుదారుణం ॥ దాసీహర్తుర్వేశ్యాహర్తుర్విప్రస్యైవ ప్రాయశ్చిత్తముక్తం। తత్సర్వస్వహరణంభోగంవిచార్యకుర్యాత్ । రాజన్యవైశ్యయోఃపూర్వవదుక్తం। శూద్రస్యచతత్తత్స్త్రీణాంచదాసీహరణే తత్తదర్ధమానేనవేదితవ్యం॥ ఇతిహేమాద్రివిరచితే దాసీహరణప్రాయశ్చిత్తం॥

(౧౨౯) దాసీహరణప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుడు కామాతురుడై దాసీసంగమమును జేసినయెడల మహాప్రళయముదనుక నరకలోకమునం దుబడి యనేకములగుసంకటములను జెందునని మార్కండేయమునివరుడువచించె. బ్రాహ్మణుడులోభాతురుడై స్వకులోచితధర్మములనువదలి మంత్రౌషధాదులచేతదాసీనిహరించి దానితోసురతసుఖములనుభవించినయెడల ఘోరనరకమునుబొంది పిమ్మటభూలోకమునందు, ఇంద్రియహీనుడైపుట్టునని జాతూకర్ణివచించె. బ్రాహ్మణుడు మంత్రౌషధాదులబలమువలన దాసినిహరించిదానితోసురతక్రీడలననుభవించెనేని కాలసూత్రమను నరకమునుబొందును. దాసీహర్తకు వేశ్యాహర్తకు విధించినప్రాయశ్చిత్తమునే యుక్తాయుక్తములనువిచారించి ప్రాయశ్చిత్తమునువిధించవలయును. క్షత్రియవైశ్యులకునుపూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధించవలయును. శూద్రులకును, వారివారిస్త్రీలకును, దాసీహరణమునందు తత్తదర్ధమానముచేత దెలిసికొనవలయునని చతుస్త్రింశతిమతమునందు జెప్పబడెను॥

—(*) శయ్యాహరణప్రాయశ్చిత్తమ్. (*)—

(౧౩౦) అథశయ్యాహరణప్రాయశ్చిత్తమాహ।గౌతమః॥శ్లో॥విప్రశ్చక్షత్రియోవైశ్యః పారక్యంతల్పమాహరేత్।సోపస్కరంమహామూల్యంసఖ్యాంభోగలోలుపః। యమలోకముపాగమ్యఅంగారశయనంవ్రజేత్॥ తతోభు

షము పాగమ్య పృష్ఠదేశే వ్రణీభవేత్॥ దేవలః॥ శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్తల్పం సోపస్కరం హరేత్॥ మహాధనం సఖట్వాం చ చోరబుద్ధ్యా బలాదిహ। సోంతే కృతాం తవశగో వ్రజేదంగారతల్పతాం। నతస్య పునరావృత్తిః పృష్ఠవ్రణభయాదిహ॥ మార్కండేయః॥ శ్లో॥ త్రయోవర్ణాస్స్వధర్మాదీన్। త్యక్త్వా తల్పం మహాధనం। సోపస్కరం హరేయుస్తే యమలోకే సుదారుణం। అంగారశయనం గత్వా పశ్చాత్పృష్ఠవ్రణాభవేత్॥ భవేయురిత్యర్థః॥ శ్లో॥ తేషాం దోషవినాశాయ ప్రాయశ్చిత్తం ప్రజాపతిః॥ ప్రాహ చాంద్రం పరాకం చ తప్తం చైవ యథాక్రమం। తత్తత్ స్త్రీణాం తదర్ధం స్యాచ్ఛూద్రం దండ్యాచ్చ పూర్వవత్॥ ఇతి హేమాద్రౌ శయ్యాహరణ ప్రాయశ్చిత్తం॥

(౧౩౦) శయ్యాహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో నెవ్వరైనను, పరులసంబంధమైనదియును, ఉపస్కారములతో గూడినదియును, మిగులమూల్యముగలదియును, అగుశయ్యను, భోగలోలుపులైయపహరించెనేని యమలోకమునుబొంది యంగారశయ్యనుబొందును. పిమ్మట పృష్ఠభాగమునందు వ్రణముగలవారై పుట్టుదురని గౌతముడువచించె. దేవలుడునిటుల నేవచించె. మార్కండేయుడునునిటులనే చెప్పె. కావుననిట్టిదోషమునశించుటకొఱకు చతురాననుడు చాంద్రాయణము, పరాకకృచ్ఛ్రమును, తప్తకృచ్ఛ్రమును, యథాక్రమముగ నాచరించవలయును. వారివారి స్త్రీలకువారివారికివిధించిన ప్రాయశ్చిత్తమునందు సగమునువిధించవలయును. శూద్రుడీకృత్యమును జేసినయెడల పూర్వోక్తప్రకారముగ దండించవలయును॥

——(*) యానహరణప్రాయశ్చిత్తమ్. (*)——

(౧౩౧) అథయానహరణప్రాయశ్చిత్తమాహ గౌతమః॥ శ్లో॥ ఆందోళికాం యద్వా విప్రశ్చతురంతం విశేషతః। మనుష్యవాహ్యం యానం చ దారు చిత్రవిభూషితం। హృత్వా పాపధియా పాపీ నరకం యాతి దారుణం। స నైషమ ముపాగమ్య వక్రవాన్ పృష్ఠదేశతః॥ పరాశరః॥ శ్లో॥ యానమాందోళికాదీన్వా పారక్యం భోగతృష్ణయా॥ విప్రో హృత్వా మహాదుఃఖ మనుభూయ భువస్థలే। పృష్ఠదేశే సదా వక్రీ జాయతే వర్ణగర్హితః॥ తస్య దోషవిముక్త్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్॥ ఏతత్పునర్దానవిషయం। అదత్వా ప్రాజాపత్యద్వయం వేదితవ్యం। క్షత్రియ వైశ్యయో రేవమేవ। శూద్రస్తు తద్ద్రవ్యం స్వామినే దాపయిత్వా శతరూప్యేణ దండ్యః॥ తత్తత్ స్త్రీణాం తదర్ధం యథాక్రమం వేదితవ్యం॥ ఇతి హేమాద్రివిరచితే యానహరణప్రాయశ్చిత్తం॥

(౧౩౧) యానహరణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు నానావిధము

లగుపరులయానములలో నెద్దానినిహరించినను యమలోకమునందు ఘోరన
రకములనుబొంది పిమ్మటభూలోకమునందు పృష్ఠభాగమున వక్రతగలవాడై
పుట్టునని గౌతముడువచించె. పరాశరుడును నిటులనే వచించి మరలనొసంగి
నయెడల ప్రాజాపత్యకృఛ్రమునాచరించవలయును. మరలనివ్వనివానికి రెండు
ప్రాజాపత్యకృఛ్రముల నాచరించవలయును. క్షత్రియవైశ్యులకునునిటులనే
యనితెలియంగవలయును. శూద్రుడీదుష్కృత్యమును జేసినయెడల మరలనాద్ర
వ్యమును మరలయజమానునకిప్పించి యనంతరమందు శతగోప్యమునపరా
ధార్ధముగ దండుగనువిధించవలయును. వారివారిస్త్రీలకు వారివారికివిధించిన
ప్రాయశ్చిత్తమునువిధించినప్రాయశ్చిత్తమునందు సగముప్రాయశ్చిత్తమును
విధించవలయునని వచించె॥

—— (*) ఉపానద్ధరణప్రాయశ్చిత్తమ్. (*) ——

(౧౩౨) అథోపానద్ధరణే ప్రాయశ్చిత్తమాహ। దేవలః॥ శ్లో॥ ఉపా
నత్పాదుకే రాజన్ ప్రాంక్యాయోహరేద్ద్విజః॥ సచండాలసమోభూత్వా కంట
కాస్తరణం వ్రజేత్॥ యమః॥ శ్లో॥ ఉపానత్పాదుకే యస్తు పరకీయే ద్విజో హ
రేత్। కంటకాస్తరణం గత్వా పాదశూలీభవేద్ధ్రువం॥ మరీచిః॥ శ్లో॥ యోవిప్రః
పాపమజ్ఞాత్వా ఉపానత్పాదుకే హరేత్॥ యమలోకముపాగమ్య శయనం
కంటకోపరి। భజేదితి శేషః॥ శ్లో॥ సతు దేహవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యంసమా
చరేత్। ఏతదదాతృవిషయం। దత్వా పంచగవ్యభక్షణం॥ క్షత్రియాదీనామేవం
తత్తత్ స్త్రీణాంపూర్వవదర్థం। ఇతి హేమాద్రివిరచితే ఉపానద్ధరణప్రా
యశ్చిత్తం॥

(౧౩౩) పాదుకలహరించినదోషమునకుగాను ప్రాయశ్చిత్తమును జె
ప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడుపరులసంబంధమైన పాదుకలనుహరించినయెడల
చండాలసముడై ఘోరనరకములనుబొంది పిమ్మటకంటకాస్తరణనుబొందున
ని దేవలుడువచించె. యముడునునిటులనే చెప్పి పాదశూలరోగముగలవాడై
పుట్టునని యె. మరీచియునునిటులనే చెప్పి యమలోకమునందు కంటకశయ్యా
యందుబరుండబెట్టుదురనియె. ఇట్టిదుష్కృత్యమును జేసినవాడు దేహశుద్ధికొ
రకునాపాదులనుమరలనివ్వనియెడల ప్రాజాపత్యకృఛ్రమునాచరించవలయు
ను. మరలనిచ్చినయెడల పంచగవ్యప్రాశనను జేయవలయును. క్షత్రియాదు
లకునునిటులనే యనితెలియంగవలయును. వారివారిస్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును
విధించవలయును॥

## (*) ఛత్రహరణప్రాయశ్చిత్తమ్. (*)

(౧౩౩) అథఛత్రహరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః శ్లో॥ ఛత్రం ద్విజోహరేద్యస్తు మహాతపనివారణం। యమప్రీతికరంపుణ్యంసర్వ సౌఖ్యప్రదాయకం॥ మార్కండేయః॥ శ్లో॥ పారక్యంపుణ్యదం సర్వసౌఖ్య దాయిమహాధనం। తద్విప్రో యదిముష్ణాతిహ్యనాధారోభ వేద్భువి। శివరహస్యే॥ శ్లో॥ మహామూల్యం మహాసౌఖ్యప్రదంనృణాం ద్విజోహరేత్॥ ఛత్రముష్ణహరం పుణ్యం నరకంయాతిదారుణం॥ అనాధారోభవేద్భూమౌ సర్వజం తువిగర్హితః॥ తస్యనిష్కృతిరుత్పన్నా భూపతెలోకపావనీ॥ వస్త్రావృతెపరాకస్స్యాత్ కేతకీపర్ణసంవృతే। యావకంతాళపత్రైశ్చనిర్మితే రాజవల్లభ। పంచగవ్యంపిబేత్పశ్చాత్పునర్దత్త్వాతుతద్ధనం।అదానెద్విగుణంప్రోక్తంక్షత్రియాణామిదంవ్రతం।తత్తత్స్త్రీణామిదంజ్ఞేయంప్రాయశ్చిత్తంవిశోధనం। ఇతిహేమాద్రివిరచితె ఛత్రహరణప్రాయశ్చిత్తం

(౧౩౩) ఛత్రహరణప్రాయశ్చిత్తము॥ యమునకుప్రీతినిగలుగజేయునదియును, సర్వసౌఖ్యములనునిచ్చునట్టిదియును, ఆతపమునునివారించునట్టిదియునగుగొడుగును బ్రాహ్మణుడుహరింపగూడదని దేవలుడువచించె. పరులఛత్రమునుహరించినబ్రాహ్మణుడు నరకములనుబొంది పిమ్మటభూలోకమునందాధారములేనివాడైపుట్టునని మార్కండేయమునివరుడువచించె. శివరహస్యమునందును నిటులనేచెప్పబడియె. మఱియునువస్త్రావృతమైన ఛత్రముహరించినవానికి పరాకకృచ్ఛ్రమును, కేతకీపర్ణములచేత జేయబడిన ఛత్రమునుహరించినవానికి యావకాహారప్రాయశ్చిత్తమును విధించవలయుననియును, తాళపత్రములచేతనిర్మింపబడిన ఛత్రమునుహరించినవానికి పంచగవ్యప్రాశనమునువిధించవలయుననియును, మరలనివ్వనివానికిప్రాయశ్చిత్తమును ద్విగుణముగవిధించవలయుననియును, క్షత్రియులకునుప్రాయశ్చిత్తమిదియేయనియును, వారివారిస్త్రీలకును ప్రాయశ్చిత్తమిటులనేయనియును జెప్పబడియె॥

## (*) చామరహరణప్రాయశ్చిత్తమ్. (*)

(౧౩౪) అథచామరహరణప్రాయశ్చిత్తమాహ॥గౌతమః ॥ శ్లో॥చామరం సర్వ భూతానాం దేవానామపి తుష్టిదం॥ రాజయోగ్యంహరేద్విప్రస్సద్యోగశ్ఛిద్యమాలయం॥ దేవలః॥ శ్లో॥చామరంసర్వభూతానాం దేవానాంభూపతేరపి। రాజచిహ్నంహరేద్విప్రస్సద్యోభవతినారకీ॥ మార్కండేయః॥ శ్లో॥ భూపతీనాంచ దేవానాం నృణాంతా పాపహారియత్। చామ

కంహరతేవిప్రస్సద్యో యమపురంవ్రజేత్॥ దేవానాంహరణేచాంద్రం ప్రాజాపత్యంచభూపతేః। భూతానాంహరణేసద్యో యావకం వ్రతమాచరేత్॥ ఏతత్ప్రత్యర్పణవిషయం॥ అన్యథాద్విగుణంసర్వేషాం వర్ణానాం స్త్రీణామపి। చిత్రసంగతవ్యజనహరణేపి ప్రాయశ్చిత్తమేవంకర్తవ్యం॥ ఇతిహేమాద్రివిరచితేచామరహరణప్రాయశ్చిత్తం॥

(౧౩౪) చామరహరణప్రాయశ్చిత్తము॥ సర్వభూతములకును దేవతలకును, సంతోషమునుగలుగజేయునట్టి చామరమునుహరించినబ్రాహ్మణుడు నరకలోకమునుబొందునని గౌతముడువచించె. దేవలుడునునిటులనేచెప్పి చామరమురాజచిహ్నమనియునుజెప్పె. మార్కండేయుడునునిటులనేవచించె. మఱియును దేవతలచామరమునుహరించినవాడు చాంద్రాయణవ్రతమునాచరించవలయుననియును, రాజచామరమునుహరించినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించవలయుననియును, భూతములయొక్కచామరమును హరించినవాడు యావకాహారుడుగావలయుననియును, ఈప్రాయశ్చిత్తముమరలనొసంగినవానివిషయమనియును, మరలనీవ్వనివానికిప్రాయశ్చిత్తమును ద్విగుణముగవిధించవలయుననియును, సర్వవర్ణస్త్రీలకును నిదియేప్రాయశ్చిత్తమనియును, చిత్రితవ్యజనమునుహరించినవానికిగూడ నిదియేప్రాయశ్చిత్తమనియునువచించె॥

## పుష్పహరణప్రాయశ్చిత్తమ్.

(౧౩౫) అథపుష్పహరణప్రాయశ్చిత్తమాహవసిష్ఠః॥ శ్లో॥ ఆరామెపుష్పహర్తా యోదేవపూజార్థకల్పితే। యావంత్యత్రైవపుష్పాణిసుగంధీని మహాంత్యపి॥ తావద్వర్షసహస్రాణి యమలోకంసమశ్నుతే॥ పునర్భూమిగతఃపాపీజాయతేవక్రనాసికః॥హారీతః॥శ్లో॥ పారక్యానిప్రసూనానిమోహాద్రేద్విప్రవల్లభః। మహాంతంనరకంగత్వాజాయతేరంధ్రనాసికః॥ మహారాజవిజయే।శ్లో॥ పుష్పజాలంహిపారక్యం దేవపూజార్థమాదరాత్॥ సుగంధికరవీరాది హృత్వావిప్రస్సపాపభాక్॥ ప్రాయశ్చిత్తమిదంప్రోక్తంపారాశర్యర్షిణాధునా॥ దేవద్రవ్యాపహరణేచాంద్రంవత్సరసేవనాత్। పరాకంబ్రహ్మనిర్మాణేకాయంక్షత్రియవైశ్యయోః॥ క్షత్రియవైశ్యనిర్మాణేఆరామెప్రాజాపత్యమిత్యర్థః॥ క్షత్రియవైశ్యయోఃస్త్రీణామపి పూర్వవద్యోజనీయం॥ ఇతిహేమాద్రివిరచితే పుష్పహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౩౬) పుష్పహరణప్రాయశ్చిత్తము॥ దేవపూజకొఱకుగల్పింపబడినయుద్యానవనమునందలి పరిమళకుసుమములనుహరించిన బ్రాహ్మణుడు

పుష్పములనపహరించెనో యన్నివేలసంవత్సరములు నరకలోకమునందుండి పిమ్మటవక్రనాసికగలవాడై పుట్టునని వసిష్ఠమునివరుడువచించె. హారీతుడును నిటులనేవచించె. మహారాజవిజయమునందును నిటులనే చెప్పబడియె. మఱియును పరాశరమునివరునిచే జెప్పబడిన ప్రకారము ప్రాయశ్చిత్తముగూడవిధింపబడియె. అదియెట్లనిన దేవద్రవ్యమునుహరించినవాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును, బ్రహ్మనిర్మాణమునందు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. క్షత్రియవైశ్యనిర్మాణమునందు కాయకృచ్ఛ్రము నాచరించవలయును. క్షత్రియవైశ్యనిర్మితమైన యుద్యానవనమునందలి పుష్పములనుహరించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. క్షత్రియవైశ్యులయొక్క స్త్రీలకును పూర్వమువలెనే యోజనను జేసికొనవలయుననియును మహారాజవిజయమునందే జెప్పబడె॥

## ——— ఫలహరణప్రాయశ్చిత్తమ్. ———

(౧౩౮) అథఫలహరణప్రాయశ్చిత్తమాహ। దేవలః॥శ్లో॥ కదళీంమాతులుంగంచ నారికేళంచ పానసం। ద్రాక్షాఖర్జూరజంబీరచూతజంబూఫలానిచ॥ హృత్వావిప్రస్తుపాపక్యం భుక్త్వానరకమశ్నుతే। పునర్భవముపాగమ్య ఫలహీనోథజాయతే॥ జాబాలిః॥శ్లో॥ ఫలానివివిధానీహ దేవప్రీతికరాణివై। ముష్ణాతియోద్విజోలోభాన్నరకేవాసమశ్నుతే॥ భువస్థలముపాగమ్య ఫలహీనోవృథాభవేత్॥ రాజవిజయే॥శ్లో॥ నానావిధంఫలంవిప్రః పరకీయంమనోహరం। తత్రహృత్వామహాపాపీనరకేవాసమశ్నుతే। ఫలహీనోభవేల్లోకేతస్మాత్తైన్యం నకారయేత్ । ఋతేత్రయేపరాకంస్యాద్వత్సరే చాంద్రముచ్యతే॥ పంచగవ్యంపునః పేయంసాన్వధామునిచోదితం। క్షత్రియవైశ్యయోరేతద్ద్విగుణం॥తత్తత్ స్త్రీణాంపూర్వవద్విజ్ఞేయం॥ ఇతిహేమాద్రివిరచితేఫలహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౩౮) ఫలహరణప్రాయశ్చిత్తము॥ పరులయొక్క, కదళీ, మాతులుంగ, నారికేళ, పనస, ద్రాక్ష, ఖర్జూర, జంబీర, చూత, జంబు, అను వృక్షములయొక్క ఫలములను దొంగలించిభుజించినబ్రాహ్మణుడు నరకలోకమునుబొంది పిమ్మటఫలహీనుడై పుట్టునని దేవలుడువచించె. దేవప్రీతికరములును, నానావిధములునగుఫలములను హరించినబ్రాహ్మణుడు నరకలోకమునుబొంది పిమ్మటభూలోకమునందుఫలహీనుడై పుట్టునని జాబాలివచించె. రాజవిజయమునందునునిటులనే చెప్పబడియె. కావునఫలములను దొంగలింపగూడదు. ఈదుష్కృత్యమును నాలుమాసములకాలముచేసినవానికి పరాక

కృఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ విధించవలయును. సంవత్సరకాలము చేసి నవానికిః జాంద్రాయణమును విధించవలయును. ఈప్రాయశ్చిత్తములనునా చరించుకొనిన పిదప పంచగవ్యప్రాశనను జేయవలయును. క్షత్రియ వైశ్యుల కీప్రాయశ్చిత్తమును ద్విగుణముగ విధించవలయును. వారివారి స్త్రీలకు వారివారికి విధించిన ప్రాయశ్చిత్తమునం దర్ధమును విధించవలయును.

——— ✽ కందాదిహరణప్రాయశ్చిత్తమ్. ✽ ———

(౧౩౭) అథకందాదిహరణ ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ సూరణంశృంగబేరంచ హరిద్రాంమూలకంతథా । అన్యానిమూలవస్తూని దేవయోగ్యానియానిచ॥ విప్రానుషిత్వాలోభేన తేనయద్యత్సమాచరేత్ । తత్సర్వంస్వామినఃప్రోక్తం దోషవాన్సహజాయతే॥✽॥ హారీతః॥ శ్లో॥ సూరణంశృంగిబేరంచ హరిద్రాంమూలకంతథా । అన్యానిమూలవస్తూని పారక్యానిద్విజోయది॥ హరేన్నరకమాప్నోతి పాపయోనిషుజాయతే॥ మార్కండేయః॥ శ్లో॥ సూరణంశృంగిబేరంచ హరిద్రంమూలకంతథా । ముస్తామన్యానిమూలాని విప్రముష్ణాతికామతః। అల్పద్రవ్యేద్విజస్తేయీ దోషబాహుళ్యమాప్నుయాత్॥ పలద్వయంయదిభవే త్పారక్యంమూలకంహృతం। తత్పునస్స్వామినేదత్వా జపేదష్టోత్తరంశతం॥ దశాదిశతపర్యంత మూలద్రవ్యాపహారవాన్ । అదత్వాస్వామినస్తేయీ అయుతంజపమాచరేత్॥ తతశ్శుద్ధోద్విజోలోకే హ్యన్యథాపాపభాగ్భవేత్॥ తథాహాపస్తంబః॥ ఏధోదకమూలపుష్ప ఫలగంధగ్రాసమోచోరఇతి వాచాబాధ్యతఇతి॥ ఏతదేకవారమల్పస్తేయవిషయం॥ తతోధికేతూక్తప్రాయశ్చిత్తమేవ॥ క్షత్రియవైశ్యయోఃపూర్వవద్వేదితవ్యం॥ స్త్రీణామర్ధార్ధన్యాయేన యోజనీయం॥ ఇతిహేమాద్రివిరచితేమూలహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౩౭) కందాదిహరణ ప్రాయశ్చిత్తము॥ కంద, అల్లము, పసుపు, మూలకము, మొదలగు మూలవస్తువులను దొంగిలించినవాఁడు మహాపాపి యనఁబడునని దేవలుఁడువచించె. హారీతుఁడును నిటులనేచెప్పి పాపయోనులయందుఁ బుట్టుననిమె. మార్కండేయుఁడును నిటులనేచెప్పె. మఱియునల్పద్రవ్యమును దొంగిలించినను బ్రాహ్మణునకధిక పాపము గలుగుననిమె. మఱియు నట్టిద్రవ్యమును మరలయజమానునకిచ్చి నూటయెనిమిది పర్యాయములు గాయత్రీజపమును జేసిన యెడల పాపహీనుఁడగుననిమె. పదిమొదలుకొని నూరుసంఖ్యకధికముగాని మూలకమునుహరించి మరల నివ్వనిబ్రాహ్మణుఁడు మరలనివ్వనియెడల పదివేల పర్యాయములు గాయత్రీజపమునుజేసె

నేసి పరిశుద్ధుఁడగును. ఇవ్విధముగఁ జేయని యెడల పరిశుద్ధుఁడు గానేరఁడని యును మార్కండేయుఁడేవచించె. ఆపస్తంబుఁడును నిటులనే చెప్పి యొ కానొకప్పుడు దొంగిలించినవాని కీమాత్రప్రాయశ్చిత్తము చాలుననియును, అధికముగ దినదినమును దొంగిలించినవానికిఁ బూర్వోక్తప్రకారముగమహా ప్రాయశ్చిత్తమును విధించవలయునని చెప్పఁబడియె. క్షత్రియ వైశ్యులకు పూర్వమందువలెనే ప్రాయశ్చిత్తమును విధించవలయును. స్త్రీలకర్ధార్ధము చేత యోజనను జేసికొనవలయును.

——* కోశహరణ ప్రాయశ్చిత్తమ్. *——

(౧౩౮) అథకోశహరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ అలా బుంఘృతకోశంచ వృంతాకంశిగ్రుజ తథా। పటోలంకారవల్లీంచ కూశ్మాం డంచూతసంభవం॥ తథైవతింత్రిణీకోశం కపిత్థంకదళీంతథా। ఏవమాదీని కోశాని హృత్వాపాపమవాప్నుయాత్॥ ఉపోష్యరజనీమేకాంస్వగృహ్యాగ్నౌ విధానతః॥ మహావ్యాహృతిభిర్హోమః పంచగవ్యంపిబేత్తదా। ఏతేనశుద్ధిమా ప్నోతి అభ్యాసేద్విగుణంచరేత్। ఏతదల్పకోశహరణవిషయం। బహుకోశ హరణేద్విగుణంప్రాయశ్చిత్త.॥ స్త్రీణాంతదర్ధః॥ ఇతిహేమాద్రివిరచితేకో శహరణప్రాయశ్చిత్తం॥

(౧౩౮) కోశహరణప్రాయశ్చిత్తము॥ అలాబు, (సొరకాయ) ఘృ తకోశము, వృంతాకము, శిగ్రుజము, పటోలము (పొట్లము) కారవల్లి,కూ శ్మాండము, (గుమ్మడి) మామిడి, చింత, వెలగ, అరటి, మొదలగువానియొ క్క కోశములను హరించినవాఁడు మహాపాపమునుబొందును. ఇట్టిపాపకృ త్యమును జేసినవాఁడొక్కరాత్రియంతయును నుపవాసమును జేసి స్వగృహ్యా గ్నియందు శాస్త్రోక్తప్రకారముగ మహావ్యాహృతులచేత హోమమును జేసి పిమ్మట పంచగవ్యప్రాశనను జేయవలయును. అనంతరమందు పంచగ వ్యప్రాశనను జేయవలయును. ఇట్లు చేసినయెడల పరిశుద్ధుఁడగును. ఇట్లుగా క యీకృత్యమును సతతమునువాఁడుకగాఁ జేయువాఁడీ ప్రాయశ్చిత్తమును ద్విగుణాధికముగ నాచరించవలయును. ఇదియల్పకోశహరణవిషయము. బ హుకోశహరణమునందు ద్విగుణాదికముగ ప్రాయశ్చిత్తమును విధించవల యును. స్త్రీలకర్థప్రాయశ్చిత్తమును విధించవలయు ననియును దేవలుఁడు వచించె.

——* శాకహరణ ప్రాయశ్చిత్తమ్. *——

(౧౩౯) అథశాకహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఉపో

దక్ష్యాదిశాకాని అరణ్యగ్రామజాన్యపి। నానానామానిశాకాని నానావర్ణానపూర్వజః॥ యదాలోభాదపహరే న్మహాశోకమవాప్నుయాత్ । భారమాత్రేమహాపాప మితరెవ్వల్పపాపభాక్॥ గౌతమః॥ శ్లో॥ శాకానిబహురూపాణి నానానామానివర్ణతః। నానావిధానిచహరన్మహాశోక మవాప్నుయాత్॥ భారమాత్రేమహాపాప మితరెశోకభాగ్భవేత్॥ ప్రాజాపత్యంభారమాత్రే పంచగవ్యమథాల్పకే॥ బహువారెతు చాంద్రంస్యా ద్వత్సరె విప్రహాభవేత్॥ స్త్రీణాంరాజన్యవైశ్యయో స్సర్వత్రపూర్వోక్తంవేదితవ్యం॥ ఇతి హేమాద్రివిరచితె శాకహరణ ప్రాయశ్చిత్తం॥

(౧౩౯) శాకహరణప్రాయశ్చిత్తము ॥ ఉపోదకిమొదలుగాఁగలకూరలును, అరణ్యగ్రామములయందుఁ బుట్టినకూరలును, మఱియు ననేకములగు కూరలును హరించిన బ్రాహ్మణుఁడు మహాపాపమునుబొందువాఁడగును. భారుభాగ్రమును హరించినయెడల మహాపాపము గలుగుననియును, అంతకుఁదక్కువగా హరించినయెడల నల్పపాపముగలుగుననియును దేవలుఁడు వచించె. గౌతముఁడును నిటులనేచెప్పి శాకాపహర్త మహాశోకమునుబొందుననెను. మఱియును భారమాత్రమును హరించినవానికి మహాపాపమనియును నంతకఁ దక్కువగా హరించినయెడల నల్పపాపము గలుగుననియును, భారమాత్రమును హరించినవానికి పంచగవ్యప్రాశనను జేయవలయుననియును, అల్పమాత్రముగ హరించినయెడల పంచగవ్య ప్రాశనను జేయవలయుననియును, అనేకపర్యాయములు చేసినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును, సంవత్సరకాలమీకృత్యమును జేసినవాఁడు బ్రహ్మహత్యను జేసినవాఁడగుననియును, రాజన్యవైశ్యులకును, స్త్రీలకును బూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధించవలయుననియును గౌతముఁడేవచించె.

—— పర్ణహరణప్రాయశ్చిత్తమ్. ——

(౧౪౦) అథపర్ణహరణ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ శ్లో॥ కదలీమధుపర్ణాని తాంబూలీనామథాపివా । పరకీయానిపర్ణాని పలాశానివిశేషతః॥ గ్రామ్యాన్యారణ్యజానీహ విప్రొహృత్వాతుపాతకీ ॥ మహారాజవిజయె॥ శ్లో॥ పరకీయానిపర్ణాని గ్రామ్యాణ్యారణ్యజాన్యపి। కదలీమధుపర్ణాని తాంబూలీనాంవిశేషతః అన్యానిపర్ణజాలాని విప్రోహృత్వాభవేత్ఖలః॥ భారమాత్రేపరాకంస్యాద్వత్సరం స్తేయసంభవె। ఇతరెపంచగవ్యంస్యా త్ప్రాజాపత్యంతువత్సరె। స్త్ర్యాదీనాంపూర్వవత్ప్రాయశ్చిత్తం॥ ఇతి

హేమాద్రివిరచితే పర్ణహరణ ప్రాయశ్చిత్తం॥

(౧౪౦) పర్ణహరణప్రాయశ్చిత్తము॥ కదలీపర్ణములను మధుపర్ణములను, తాంబూలీపర్ణములను, మఱియు నితరులు సంపాదించుకొనినయాకులను, గ్రామ్యపత్రములను, వనపత్రములను, బ్రాహ్మణుఁడు హరించెనేని మహాపాతకుఁడగునని మార్కండేయుఁడువచించె. మహారాజవిజయము నందును నిటులనే చెప్పఁబడియె. మఱియును నొకసంవత్సరకాలము భారమాత్రపరిమితిగల యాకులను హరించినవానికి పరాకకృచ్ఛ్రమును విధించవలయుననియును, అట్లుగాదేని పంచగవ్యప్రాశనమునుమాత్రముచేయవలయుననియును, సంవత్సరముపూర్తియయ్యెనేని ప్రాజాపత్య కృచ్ఛ్రమును విధించవలయుననియును, స్త్రీలు మొదలగువారలకు పూర్వోక్తప్రాయశ్చిత్తమునే విధించవలయుననియును చెప్పఁబడియె.

—— ఇ ధనాదిహరణప్రాయశ్చిత్తమ్. ——

(౧౪౧) అథేంధనాదిహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఇంధనందారుకాష్ఠం వాసమిధోదర్భసంచయాన్ । స్రుక్స్రువాదీనిపాత్రాణి యజ్ఞసాధనహేతవే । యూపస్తంభంచారణింవాపరకీయంద్విజోహరేత్॥ సగత్వానరకంఘోరం కృమిస్సమిధపూరితః ॥ తస్యనిష్కృతిరుత్పన్నా మహాపాపప్రణాశినీ॥ ఇధ్మసంగ్రహణే రాజన్ శతమష్టోత్తరంజపేత్॥ స్రుక్స్రువాదిషుపారాక మరణ్యాంతిప్తమీరితం॥ యూపస్తంభేషుచాంద్రంస్యా దింధనెగవ్యభక్షణం । దర్భేషుభారమాత్రేషు ప్రాజాపత్యంవిధీయతే । స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే ఇంధనాదిహరణ ప్రాయశ్చిత్తం॥

(౧౪౧) ఇంధనాదిహరణ ప్రాయశ్చిత్తము॥ ఇంధనము, కాష్ఠము, దారువు, సమిత్తులు, దర్భలు, స్రుక్స్రువాదిపాత్రలు, యూపస్తంభము, అరణి, అను వస్తువులనుబ్రాహ్మణుఁడగువాఁడుహరించెనేనిఘోరనరకములనుబొందును. కావునఁదత్పాపోపశమనముకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నింధనములను దొంగిలించినవాఁడు నూటయెనిమిది పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. స్రుక్స్రువాదుల నపహరించిన యెడల తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. యూపస్తంభములను దొంగలించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. భారపరిమాణముగల దర్భలను దొంగలించిన యెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. స్త్రీలుమొదలగువారలకుఁబూ

ర్వోక్తప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును ఇట్లని దేవలుఁడు వచించె.

## జలహరణప్రాయశ్చిత్తమ్.

(౧౮౨) అథజలహరణప్రాయశ్చిత్తమాహ ॥ మనుః ॥ శ్లో ॥ పరకీయంజలంవిప్రః కేదారార్థంహరేద్యది ॥ ఆరామపోషణార్థాయ వ్యాథవా శాకవృద్ధయే। సఏవనరకంగత్వా మండూకోజాయతేభువి॥ గాలవః॥ శ్లో ॥ ఆరామపోషణార్థంవా కేదారార్థంజలంహరేత్॥ పరకీయంద్విజోయస్తు తస్యైవనరకస్థితిః॥ తదంతేభువమాసాద్య మండూకోజాయతేమహాన్ ॥ తస్యదోషాపశాంత్యర్థం ప్రాయశ్చిత్తముదీరితం। ఏకాహేస్నాశతగాయత్రీమాసే తద్దశధాస్మృతం॥ వత్సరేత్వయుతంప్రోక్తం తతఊర్ధ్వంననిష్కృతిః । తృషార్తోయదివిప్రోయం తావన్మాత్రంహరేద్యది । పీత్వాపశ్చాద్ద్విచార్యాథశతంనామత్రయంజపేత్॥ స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితేజలహరణప్రాయశ్చిత్తం॥

(౧౮౨) జలహరణప్రాయశ్చిత్తము॥ వరిమళ్ళనువృద్ధినొందించుటకయినను, ఉద్యానవనములను బోషించుటకయినను, కూరగాయలను వృద్ధి నొందించుటకయినను, పరులజలమును హరించినవాఁడు నరకలోకమును బొంది పిమ్మట భూలోకమునందు మండూకమై పుట్టునని మనువు వచించె. గాలవుఁడును నిటులనేచెప్పె. మఱియును నిట్టిపాపమును బోఁగొట్టుకొనుటకొఱకుఁ బ్రాయశ్చిత్తమునుగూడ విధించె. అదియెట్లనిన నొకదినమీకృత్యమును జేసినవాఁడు నూరుపర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. ఒకమాసముదినము లీకృత్యమును జేసినవాఁడు పదినూరుపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. ఒకసంవత్సరము దనుక నీదుష్కృత్యమును జేసినవాఁడు పదివేలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. సంవత్సరమునకుఁ బిమ్మటఁగూడ నీదుష్కృత్యమును జేసినవానికిఁ బ్రాయశ్చిత్తమే గలుగనేరదు. తృషార్తుఁడై దాహోపశాంతికొఱకు మాత్రమే యుదకమునుహరించి పానమునుజేసిన యెడల నూరుపర్యాయములు నామత్రయజపమును జేయవలయును. స్త్రీలు మొదలగువారలకు పూర్వోక్తప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును.

## భక్ష్యభోజ్యహరణప్రాయశ్చిత్తమ్.

(౧౮౩) అథభక్ష్యభోజ్యహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ శ్లో॥ అపూపంమాషసంభూతం తథాముద్గసముద్భవం । గోధూమానాం

వికారాణి భక్ష్యాణివివిధానిచ। సంయావంపరమాన్నంచ చిత్రాన్నానిరుచీనిచ। చోష్యంలేహ్యంచపేయం చచిత్రశాకానియానిచ। పరకీయాంస్త్వజో మోహా జ్జిహ్వాచాపల్యతోవాహరేత్ ।తస్యైవజిహ్వాపతతియమలోకేసుదారుణే। సపశ్చాద్భువమాసాద్య వాయసస్స్యాన్నసంశయః॥ జాబాలిః॥ శ్లో॥ గోధూమసంభవంచైవ తథామాషోద్భవంశుచి । ముద్గసంభవమన్యచ్చ తథాక్షీరసముద్భవం । సంయావం పరమాన్నంచ చిత్రాన్నానిరుచీనిచ । పిష్టరూపాణియావంతి తథాఫలసముద్భవం । తైలపక్వంక్షీరపక్వం గుడపక్వం తథైవచ॥ చోష్యంలేహ్యంచపేయంచ చిత్రశాకానియానిచ । పరకీయానియోవిప్రో జిహ్వాచాపల్యావాన్హరేత్॥ తస్యైవజిహ్వాచ్ఛిన్నాస్యాద్యమయూతైర్భయంకరైః। తదంతేభువమాసాద్యవాయసత్వమవాప్నుయాత్॥ తస్యైవనిష్కృతిరియం కథితామునిపుంగవైః । భక్ష్యాపహారిణోర్యా త్సంపూర్ణేచపరాకకం॥ అల్పేశతంసహస్రంచ జపేన్నియమపూర్వకం । గాయత్రీమితి శేషః॥ శ్లో॥ అన్నస్తేయేచ చిత్రాన్నే సంపూర్ణేతప్తమాచరేత్ । పేయేచోష్యేచలేహ్యేచ సంపూర్ణేయావకంచరేత్ । ఏతైశ్శుద్ధిమవాప్నోతిపునర్దత్వా స్మరేద్ధరిం॥ స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే భక్ష్యభోజ్యహరణప్రాయశ్చిత్తమ్॥

(౨౮౩) భక్ష్యభోజ్యహరణ ప్రాయశ్చిత్తము॥ మినపగారెలు, పెసలవడలు, గోధూమలరొట్టెలు, మఱియు వీనిచేతఁ జేయఁబడిన నానావిధభక్ష్యములు, పరమాన్నము, చిత్రాన్నములు, చోష్యము, లేహ్యము, పానీయవస్తువులు, చిత్రశాకములు, నూనెలతోఁజేసిన పదార్థములు, మొదలగు వానిని బ్రాహ్మణుఁడగువాఁడు జిహ్వాచాపల్యదోషమువలన హరించిన బ్రాహ్మణునియొక్క జిహ్వ యమలోకమునందుఁ జ్ఛేదింపఁబడును. అనంతరమందు భూలోకమునందు వాయసమై పుట్టునని దేవలుఁడు వచించె. జాబాలియును నిటులనేవచించె. మఱియు నిట్టిపాపమును జేసినవానికిఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడెను. అదియెట్లనిన సంపూర్ణభక్ష్యమునుహరించినవానికిఁ బరాకకృచ్ఛ్రమును విధించవలయును. అల్పమాత్రము హరించినవాఁడు వేయి పర్యాయములు గాయత్రీజపమును జేయవలయుననియును జాబాలి వచించె. అన్నమును దొంగిలించినవాఁడును, చిత్రాన్నము నపహరించినవాఁడును, తప్తకృచ్ఛ్రము నాచరించవలయును. పేయచోష్యలేహ్యముల నపహరించినవాఁడు యావకాహారుఁడు గావలయును. ఇట్టి ప్రాయశ్చిత్తములచేత పరిశుద్ధుఁడై పిమ్మట నారాయణస్మరణను జేయవలయును. స్త్రీలు మొద

లగువారికి పూర్వోక్తప్రకారముగ నర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును.

## రుద్రాక్షక్రముకహరణ ప్రాయశ్చిత్తమ్.

(౧౪౪) అథ రుద్రాక్ష క్రముకహరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ రుద్రాక్షాన్ క్రముకాన్వాపి పరకీయాన్ ద్విజోహరేత్। సద్యఏవ ద్విజన్మాసౌ శివద్రోహీ ప్రజాయతే॥ మహాంతంనరకంగత్వా జాయతేభువి పేటకః॥ మార్కండేయః॥ శ్లో॥ క్రముకానుతరుద్రాక్షాన్ పరకీయాన్ ద్విజాధమః। క్రయవిక్రయలోభేన హరేద్యదిభువస్తలె। సద్యఏవ మహాపాపీ యమలోకంసమశ్నుతే। పశ్చాచ్ఛ్వపి సపాపీయాన్ జాయతేపిటకాకృతిః। ప్రాయశ్చిత్తమిదంబ్రహ్మన్ పారాశర్యేణభాషితం। శతాదూర్ధ్వంతు రుద్రాక్షాన్ హృత్వాచాంద్రద్వయంచరేత్। శతేపరాకమప్యేతు గాయత్రీ జపమాచరేత్। శతాదూర్ధ్వంసహస్రాంతం క్రముకంయోహరేద్ద్విజః। ప్రాజాపత్యంచచాంద్రంచ యోజయేత్సయథాక్రమం॥ అతఊర్ధ్వం మహాపాపీ నిష్కృతిర్నైవవిద్యతే॥ స్త్రీదీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే రుద్రాక్షక్రముకహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౪౪) రుద్రాక్షక్రముకహరణ ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు పరుల సంబంధమైన రుద్రాక్షలనైనను, క్రముకలనైనను, హరించినయెడల శివద్రోహియనబడును. మరణానంతరమందు గొప్పదగు నరకమును బొంది పిమ్మట భూలోకమునందు పేటకమై పుట్టునని దేవలుడు చెప్పె. మార్కండేయుడును నిటులనేచెప్పి పరాశరోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తవిధానమును గూడ దెలియజెప్పె. ఎట్లనిన రుద్రాక్షలనూటికంటె నధికముగ హరించిన యెడల రెండు చాంద్రాయణవ్రతముల నాచరించవలయును. నూటకిలోపల నపహరించిన యెడల గాయత్రీజపమును జేసికొనవలయును. నూరుమొదలుకొని వేయికధికముగాకుండు నటుల నపహరించినవానికి క్రమముగ ప్రాజాపత్య కృచ్ఛ్రమును, చాంద్రాయణమును నాచరించవలయును. అంతకధికముగ నపహరించిన యెడల ప్రాయశ్చిత్తమే లేదని చెప్పబడెను. స్త్రీలు మొదలగువారికి పూర్వోక్త ప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధించవలయును.

## ❋ గుడహరణ ప్రాయశ్చిత్తమ్. ❋

(౧౪౫) అథగుడహరణ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ శ్లో॥ గుడమల్పంతుభారంవా పారక్యంయోద్విజోహరేత్। నతస్యపునరావృత్తిర్యమలోకాత్కదాచన। తదంతేభువమాసాద్య జాయతేమధుమక్షికః॥

పరాశరః॥ శ్లో॥ యోవిప్రోధనలోభేన పరకీయంగుడంహరేత్। అల్పంవా భారమాత్రంవా సవిప్రోనరకంవ్రజేత్। భువిస్థావరతామేత్య తిష్ఠత్యాచంద్రతారకం। భారప్రమాణంపూర్వముక్తమ్॥ శ్లో॥ అల్పేగుడే పరాకం స్యాద్భారేచాంద్రముదాహృతం॥ ఏవం వైవత్సరాదూర్ధ్వం పతితస్స్యాన్నసంశయః॥ స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే గుడస్తేయప్రాయశ్చిత్తమ్॥

(౧౪౫) గుడహరణప్రాయశ్చిత్తము॥ పరుల సంబంధమైన గుడము నల్పమాత్రముగానైనను, భారపరిమాణముగానైనను హరించినవాఁడు యమలోకమునుండి పునరావృత్తిలేనివాఁడగును. మరికొంతకాలమునకు యమలోకముననుండి బయలువెడలి భూలోకమునందు మధువృక్షమైపుట్టునని మార్కండేయుఁడు చెప్పె. పరాశరుఁడును నిటులనే చెప్పి సూర్యచంద్రులున్నంతవఱకును స్థావరజన్మమును బొందియుండుననియె. భారప్రమాణము పూర్వమునందే చెప్పఁబడినది. గుడమును నల్పమాత్రముగ నపహరించినవాఁడు తత్పాపోపశమనముకొఱకు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. భారపరిమాణముగల గుడమును హరించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. ఈ కృత్యమును సంవత్సరానంతరమందుఁగూడఁ జేసినయెడల పతితుఁడగుననియును పరాశరుఁడేవచించె.

## * క్షీరహరణప్రాయశ్చిత్తమ్. *

(౧౪౬) అథక్షీరహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పారక్యమగ్నిహోత్రార్థమానీతంక్షీరముత్తమమ్। ద్విజాతిర్ద్రవ్యలోభేన ముషిత్వాపాపమశ్నుతే॥ గౌతమః॥ శ్లో॥ పారక్యమగ్నిహోత్రార్థమానీతంతు ద్విజోబలాత్। ముషిత్వాపాపబాహుళ్యమనుభూయభువస్థలే। పశుహీనోభవేత్పాపీ కృతంకర్మమహాత్మనః। ప్రాయశ్చిత్తమిదంకృత్వా శుద్ధోభవతి నిశ్చయః॥ ఉపోష్యరజనీమేకాంపఞ్చగవ్యేణశుద్ధ్యతి? ఉపోష్యరజనీమేకాంపశ్చాద్యోర్గోజలంపిబేత్॥ ఏతదేకవారవిషయమ్। అభ్యాసేద్విగుణం। వత్సరాంతేచాంద్రాయణం। స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే క్షీరహరణప్రాయశ్చిత్తం॥

(౧౪౬) క్షీరహరణప్రాయశ్చిత్తము॥ పరులు హోమముకొఱకు సంపాదించుకొనిన క్షీరములనుహరించిన బ్రాహ్మణుఁడత్యధికమైనపాపమునుబొందునని దేవలుఁడువచించె. గౌతముఁడును నిటులనేచెప్పి యిట్టి పాపమునుజేసినవాఁడు పశుహీనుఁడై పుట్టుననియె. మఱియును ప్రాయశ్చిత్తవిధిఁగూడఁ దెలిపె. ఇట్టిదుష్కృత్యమును జేసినవాఁడొకరాత్రియు

నుపవసించి మరుదినమందు గోజలపానమును జేయవలయును. ఇదియొక్క పర్యాయము చేసినవానివిషయము. ఈ కృత్యమభ్యాసమయ్యేనేని యీప్రాయశ్చిత్తమును ద్విగుణముగ నాచరించవలయును. సంవత్సరానంతరమందు చాంద్రాయణవ్రతము నవలంబించవలయును. స్త్రీలు మొదలగువారలకుఁ బూర్వోక్తప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును.

——— దధ్యాదహరణప్రాయశ్చిత్తమ్. ———

(౧౪౭) అథ దధ్యాదిహరణ ప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ దధితక్రంమధుద్రవ్యం పారక్యంఘృతమేవవా। నవనీతంద్విజోహృత్వా నరకంయాతిదారుణం। పునర్భువముపాగమ్య పాషాణత్వ మవాప్నుయాత్॥ జాబాలిః॥ శ్లో॥ పారక్యందధితక్రంవా నవనీతంఘృతంమధు॥ దేవతార్థంద్విజార్థంవా పిత్రర్థంవాగృహేస్థితం। ద్విజోలోభాతురోయస్తు హరేత్తచ్చోరలీలయా। మహాంతంనరకంగత్వా భువిపాషాణవద్ధ్రువం॥ ఏకవారేదశజపేత్ తక్రేదధ్నిద్విజోత్తమః॥ నవనీతేమధుద్రవ్యే శతమష్టోత్తరంజపేత్। ద్వివారేతు సహస్రంస్యాద్బహువారేఽయుతంస్మృతం॥ ఘృతేవిశేషమాహ॥ శ్లో॥ పలద్వయేసహస్రంస్యా దయుతంశతసంఖ్యయా। శతాదూర్ధ్వంమహాదేవ్యా లక్షమాత్రేణశుద్ధ్యతి। సంవత్సరాదూర్ధ్వం పతితప్రాయశ్చిత్తమ్। స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే దధ్యాదిహరణ ప్రాయశ్చిత్తమ్॥

(౧౪౭) ఇఁకను దధ్యాదిహరణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడగువాఁడు పరుల సంబంధమైన పెరుగు, మజ్జిగ, మధుద్రవ్యము, ఘృతము, నవనీతము, అను వానినిదొంగిలించిన యెడల ఘోరము గు నరకమును బొందును. పిమ్మట భూలోకమునందు శిలయైపుట్టునని గౌతముఁడు వచించె. జాబాలియును నిటులనే వచించె. మఱియును నొక్కపర్యాయమీవస్తువులలో దధితక్రములను దొంగిలించినవాఁడు ప్రాయశ్చిత్తార్థముగఁ బదిపర్యాయములు గాయత్రీజపము నాచరించవలయును. నవనీత మధుద్రవ్యముల నపహరించిన యెడల నూటయెనిమిది పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. ఈవస్తువులను రెండు పర్యాయములుదొంగిలించినవాఁడు వేయిపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. అనేక పర్యాయము లపహరించిన యెడల పదివేలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయుననియును జాబాలియే వచించె. రెండుపలముల ఘృతము నపహరించిన యెడల వేయిపర్యాయములు గాయత్రీజపమును జే

యవలయును. నూఱుపలముల ఘృతము నపహరించినవాఁడు పదివేలపర్యా యములు గాయత్రీజపమును జేయవలయును. నూరుపలములకధికముగ ఘృతము నపహరించినవాఁడు లక్షపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. సంవత్సరానంతరమందుఁగూడ నీదుష్కృత్యము ను జేయువాఁడు పతితుఁడగును. కావున నట్టివానికి పతితప్రాయశ్చిత్తమును విధించవలయును. స్త్రీలుమొదలగువారలకుఁ బూర్వోక్త ప్రకారముగ నర్ధప్రాయశ్చిత్తమును విధించ వలయును.

## త్రికటుకహరణ ప్రాయశ్చిత్తమ్.

(౧౪౮) అథత్రికటుకహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ మరీచింపిప్పలీంశుంఠీం సర్వరోగహరంపరం॥ సర్వపాపహరందేవి ప్రాజ్యం యోహరేద్ద్విజః॥ నతస్యపునరావృత్తి ర్యమలోకాత్కదాచన॥ జాబాలిః॥ శ్లో॥ మరీచింపిప్పలీంశుంఠీం సర్వరోగహరంపరం। సర్వపాపహరంపుణ్యమపవర్గఫలప్రదం। ముష్ట్వాయోభవేత్పాపీ మహాంతంనరకంవ్రజేత్॥ పలద్వయేపరాకంస్యాత్ప్రాజాపత్యందశాత్మకే॥ శతేపలేచచాంద్రంస్యాత్సహస్రే స్తేయభాగ్భవేత్। త్రికటుకపలసహస్రేస్తేయె సువర్ణస్తేయ ప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధిమాప్నోతి। స్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితేత్రికటుకహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౪౮) శొంఠి పిప్పలి మిర్యాలను దొంగలించినవానికిఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ పరుల సంబంధమైనవియును, సర్వరోగహరములును,నగు శొంఠి పిప్పలి మిర్యాలనుదొంగిలించినవాఁడుయమలోకమునందుండి మరల రాఁజాలఁడని దేవలుఁడువచించె. జాబాలియును నిటులనే చెప్పి రెండుపలములమాత్ర మపహరించినవాఁడు పరాకకృచ్ఛ్రమును, పదిపలముల నపహరించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రమును, నూరుపలములదొంగిలించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయు ననియును జెప్పె. మఱియును వేయుపలములపహరించినవాఁడు దొంగకువిధించిన ప్రాయశ్చిత్తమునే యాచరించవలయుననియె. (అనఁగా నూరుపలములశొంఠి పిప్పలి మిర్యాలను దొంగిలించినవాఁడు సువర్ణస్తేయమునకు విధించిన ప్రాయశ్చిత్తమునే యాచరించవలయుననుట) అట్లాచరించిన యెడల పరిశుద్ధుఁడగును. స్త్రీలు మొదలగువారికి పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధించవలయు ననియె.

—※ రసౌషధహరణ ప్రాయశ్చిత్తమ్. ※—

(౧౪౯) అథ రసౌషధహరణప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ శ్లో॥ పూర్ణచంద్రోదయంచైవ వసంతకుసుమాకరం। ఆనందభైరవంచైవ మృగాంకంరాజపూర్వకం। భూపతించాగ్నిపుత్రంచ స్వర్ణభస్మతథైవచ। జ్వరాంకుశంవిదాహంచ తదాగ్రహణివాటకం। అన్యాన్యౌషధజాలాని శంభునిర్మితానిచ। గంధకంపార్వతీబీజం సిందూరం హరితాలకం। అభ్రకంతాళకంచైవ కుసుమంచాశ్మసంభవం॥ లాక్షాతైలంచాశ్వగంధంకూశ్మాండకఘృతంతథా। చించాదిలేహనంచైవ పిప్పల్యాదిఘృతంతథా। ఏతేష్వన్యతమంహృత్వా ద్విజశ్చండాలతాంవ్రజేత్। ఏతేషు రసౌషధేషు మధ్యే ఏకంవావిప్రాపహారే తస్యప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ రసౌషధానియోహృత్వా ద్విజఃపాపంవిదన్నపి। స్తేయదోషోపశాంత్యర్థంప్రాయశ్చిత్తముదీరితం। ప్రాజాపత్యం నిష్కమాత్రే స్వర్ణమాత్రేవిధుంచరేత్। పలమాత్రేభువఃక్రాంతిం ద్విపలేపతితోభవేత్॥ భువఃక్రాంతింభూప్రదక్షిణం। ఘృతాదిషుస్త్ర్యాదీనామేవంవేదితవ్యం॥ ఇతి హేమాద్రి విరచితే రసౌషధహరణ ప్రాయశ్చిత్తమ్॥

(౧౪౯) రసౌషధహరణ ప్రాయశ్చిత్తము॥ పూర్ణచంద్రోదయము, వసంతకుసుమాకరము, ఆనందభైరవము, రాజమృగాంకము, భూపతి, అగ్నిపుత్రము, సువర్ణభస్మము, జ్వరాంకుశము, విదాహము, గ్రహణివాటకము, మఱియు ననేకవిధములైన యౌషధములు, గంధకము, పార్వతీబీజము, సిందూరము, హరితాలకము, అభ్రకము, తాళకము, రాతిపువ్వు, లాక్షాతైలము, అశ్వగంధము, కూశ్మాండకఘృతకము, చించాదిలేహనము, పిప్పల్యాదిఘృతము, మొదలగు నౌషధములలో నేయౌషధమును హరించినను బ్రాహ్మణుఁడగువాఁడు చండాలత్వమునుబొందునని మార్కండేయమునివరుఁడు వచించె. రసౌషధాదుల నపహరించిన బ్రాహ్మణుఁడు పాపవంతుఁడగును. కావునఁ దత్పాపశాంతికొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నిష్కమాత్రమగు నౌషధమును హరించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. సువర్ణమాత్రమును హరించినయెడల విధువునాచరించవలయును. పలమాత్రమును హరించినవాఁడు భూప్రదక్షిణమును జేయవలయును. రెండుపలములను హరించినవాఁడు పతితుఁడగును. కావున నట్టివానికి పతితప్రాయశ్చిత్తమునే విధించవలయును. స్త్రీలు మొదలగువారికిఁ బూర్వోక్త ప్రకారముగానే ప్రాయశ్చిత్తమును

విధించవలయును. ఇట్లు గౌతముఁడు వచించె.

## గృహోపకరణహరణప్రాయశ్చిత్తమ్-

(౧౫౦) అథ గృహోపకరణహరణప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ ముసలం దృషదం చైవ హ్యుపలం చాప్యులూఖలం। ఘురట్టం వేణుపాత్రం చ శూర్పం దామ తథైవ చ। బృహత్ఫలం చ నిఃశ్రేణిం మృణ్మయం భాండమేవ చ। దారుపాత్రం కుందళినీం యోహరేద్ద్విజనాయకః। తస్యాన్యా నిష్కృతిర్నాస్తి పునస్సంస్కారకర్మణః॥ పునస్సంస్కార ఇతి పటగర్భప్రకారః॥ తదాహ దేవలః॥ శ్లో॥ యత్ర యత్ర పునః కర్మ మునిభిః పరికీర్తితం॥ తత్రైవ పటగర్భస్స్యాద్విరజాహోమ ఏవ చ॥ బ్రహ్మోపదేశో గాయత్రీ పంచగవ్యమతః పరం। పవిత్రయోదశం చైవ పునస్సంస్కార ఉచ్యతే॥ తదాహ మనుః॥ శ్లో॥ మునిభిర్యత్ర చోక్తస్స్యాత్పునస్సంస్కార ఆదరాత్। పటగర్భవిధానేన తత్ర తత్రైవ కారయేత్। యజ్ఞోపవీతద్వితయం గాయత్రీదానమేవ చ। బ్రహ్మోపదేశో విహితః పంచగవ్యమనంతరం। ఔపాసనం ప్రకర్తవ్యం పునఃకర్మనివృత్తయే। యత్ర యత్ర పునః కర్మేతి షోడశ మహాదానేషూక్తం। తత్ర తత్ర తద్దానప్రతిగ్రహే పటగర్భవిధానేన సర్వం కుర్యాత్॥ ఇతి హేమాద్రివిరచితే గృహోపకరణహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౫౦) గృహోపకరణముల నపహరించినందుకుఁ బ్రాయశ్చిత్తము॥ రోకలి, గుండ్రాయి, ఱాయి, రోలు, తిరగలి, వేణుపాత్ర, చేట, చేదాడు, బృహత్ఫలము, నిశ్శ్రేన, కుండ, కొయ్యపాత్ర, కుందళిని, మొదలగు గృహోపకరణముల నపహరించిన బ్రాహ్మణునకు పటగర్భవిధానముచేత పునరుపనయసంస్కారమును జేయించుటకంటె వేరొక ప్రాయశ్చిత్తమేదియును లేదని గౌతమమునివరుఁడు వచించె. మునివరులెచ్చటెచ్చట పునస్సంస్కారమును విధింతురో యచ్చట పటగర్భము విరజాహోమము, అనువాని నాచరింపవలయునని దేవలుఁడు వచించె. మఱియును బ్రహ్మోపదేశము, గాయత్రీ, పంచగవ్యము, పవిత్రయోదశము, అనువాని నాచరించుటయే పునస్సంస్కారమనియె. మునులు పునస్సంస్కారమును జెప్పిన స్థలమునందు పటగర్భవిధానముచేత పునస్సంస్కారము నాచరించవలయుననియును, యజ్ఞోపవీతద్వితయధారణ, గాయత్రీదానము, బ్రహ్మోపదేశము, పంచగవ్యము, ఔపాసనము, అనువానిని పునఃకర్మనివృత్తికొఱకుఁ జేయవలయుననియును, షోడశమహాదానములయందుఁ జెప్పఁబడిన పునస్సంస్కారమునుగూడ పటగర్భవిధానముచేతనే చేయవలయుననియును మనువు వచించె.

—* శస్త్రాదిహరణప్రాయశ్చిత్తమ్. *—

(౧౫౧) అథశస్త్రాదిహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః శ్లో॥ కుంతంఖడ్గం చపరశుం భిండివాలంధనుస్తథా। శస్త్రంఖనిత్రంముసలం చక్రంఖేటకసంజ్ఞికం। తూణీరంభిండివాలంచ గదాంచక్రంతథైవచ। కుంతంఖడ్గం చపరశుంశంకుంశల్య ధనుస్తథా। ఏతానిశస్త్రజాలాని హింసాహేతూని యోద్విజః। హరేన్నరకమాప్నోతి కారుకోభువిజాయతే॥ ఏతద్దోషోప శాంత్యర్థం ప్రాయశ్చిత్తంసమాచరేత్। ప్రాజాపత్యంవిదిత్వాతు హ్యజ్ఞానాద్యావకంచరేత్। పశ్చాద్ధిపంచగవ్యస్య ప్రాశనంవిధిపూర్వకం। తత్తత్కృత్వాద్విజఃశుద్ధః క్షత్రియోపియదాహరేత్। తత్ప్రస్యద్విగుణంకుర్యాత్ క్షత్రియఃపాపశాంతయే। స్త్రీణామర్ధంవేదితవ్యం। ఇతిహేమాద్రివిరచితే శస్త్రాదిహరణ ప్రాయశ్చిత్తమ్॥

(౧౫౧) శస్త్రాదిహరణ ప్రాయశ్చిత్తము॥ కుంతము, (అనఁగానీటె) ఖడ్గము, పరశువు, భిండివాలము, ధనువు, శస్త్రము, ఖనిత్రము, ముసలము, చక్రము, ఖేటకము, తూణీరము, గద, శంకువు, శల్యము, మొదలగునాయుధములనుహరించినబ్రాహ్మణుఁడుభూలోకమునందులోహకారుఁడు గాఁబుట్టును, కావునఁదద్దోషనివారణకొరకు ప్రాయశ్చిత్తము నాచరించవలయును, ఇట్టి దుష్కృత్యమును దెలిసి యాచరించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును, అజ్ఞానమువలనఁ జేసినయెడల యావకము నాచరించవలయును, అనంతరమందు పంచగవ్యప్రాశనమును శాస్త్రోక్తప్రకారముగ నాచరించవలయును, ఈకృత్యమును క్షత్రియుఁడు చేసిన యెడల నీప్రాయశ్చిత్తమునే ద్విగుణముగ నాచరించవలయును, స్త్రీలకర్ధము. ఇట్లని దేవలుఁడువచించె॥

—* మార్గనిరోధప్రాయశ్చిత్తమ్. *—

(౧౫౨) అథమార్గనిరోధప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యో విప్రఃపథిచైస్వార్థ మరణ్యేమార్గమధ్యతః। వస్త్రంధాన్యం ధనంతామ్రపాత్రాదిక మథాహరేత్। యమలోకంసగత్వాతు కాలసూత్రమవాప్నుయాత్। తదంతేభువమాసాద్య భిల్లజాతిత్వమాప్నుయాత్॥ మార్కండేయః శ్లో॥ విప్రోమరిమ్లుచైస్సార్థ మరణ్యేమార్గరోధకృత్। వస్త్రంధాన్యం ధనం తామ్రపాత్రాదిక మథాహరేత్॥ సపాపీయమలోకేతు మహా[illegible] స్యచ। భువమాసాద్య పాపాత్మాభిల్లజాతిఃప్రజాయతే। తస్యదోషశాంత్యర్థం ప్రాయశ్చిత్తమిదంస్మృతం। షట్కత్రనివసేరాజక ప్రాజాపత్యాన్ను

దీరితం । మాసేచాంద్రమృతాప్రోక్తం మహాచాంద్రంమునీశ్వరైః । వత్సరాం తేమునిశ్రేష్ఠ సువర్ణస్తేయ మాప్నుయాత్ ॥ వత్సరాంతే సువర్ణస్తేయప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి । క్షత్రియాదీనాంపూర్వవత్ ॥ ఇతిహేమాద్రివిరచితే మార్గనిరోధప్రాయశ్చిత్తమ్ ॥

(౧౫౨) మార్గనిరోధప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు పతితులతోఁ జేరి మార్గమధ్యయందు నివసించి పరులసంబంధమైన వస్త్రము, ధాన్యము, ధనము, తామ్రపాత్ర, మొదలగువానిని హరించినయెడల కాలసూత్రమను నరకముఁబొందును, పిదప భూలోకమునందు భిల్లజాతియై పుట్టునని దేవలుఁడువచించె. మార్కండేయుఁడును నిటులనేచెప్పుచుతీ యునిట్లనియె. ఒకదిన మీకృత్యమును జేసినయెడల ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించవలయునినియును, మాసము దినములీ కృత్యముఁ జేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియును, రెండుమాసములుచేసినయెడల మహాచాంద్రాయణము నాచరించవలయు ననియుఁ, సంవత్సరాంతరమందుఁ గూడ నీదుష్కృత్యమును జేసినయెడల సువర్ణస్తేయమునకు విధించిన ప్రాయశ్చిత్తమును విధించవలయుననియును, క్షత్రియాదులకుఁ బూర్వోక్తప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును విధించవలయుననియును జెప్పె॥

## ✽ తటాకాదిహరణ ప్రాయశ్చిత్తమ్. ✽

(౧౫౩) అథతటాకాదిహరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ తటాకకూపకాసారాన్ వనంక్షేత్రం ద్విజోహరేత్ ॥ బలాద్వాచౌర్యమూల్యేనహీనమూల్యేనవానృప। తస్యావ్యాపిషహ్రుతిర్నాస్తి యమలోకాతరాదాచన। తదంతేఘవమాసాద్య జాయతెకుష్ఠిరోగవాన్ ॥ మాత్స్యే॥ శ్లో॥ వనంతటాకం కూపంవా కాసారంక్షేత్రమేవవా । పారక్యంయోద్విజోలోభాన్మహాతిద్రవ్యలోభతః ॥ హీనమూల్యేనచౌర్యేణ బలాద్వా గాహ్నణీతయా । నతస్యపునరావృత్తి ర్యమలోకాద్భయంకరాత్ ॥ తతోభువ ముపాగమ్య కుష్ఠిరోగీప్రజాయతే । తస్యవైనిష్కృతిరియం మునిభిఃపరికీర్తితా॥ తప్తంసకృన్ద్విజోహృత్వా పరాకంవత్సరెస్మృతం । అతఊర్ధ్వం శృణుష్వేదం స్వర్ణస్తేయాతికథ్యతే ॥ సంవత్సరాదూర్ధ్వం స్తేయప్రాయశ్చిత్తం కృత్వాశుద్ధ్యతీతి తాత్పర్యం ॥ క్షత్రియాదీనాం పూర్వవత్ ॥ ఇతిహేమాద్రివిరచితే తటాకాది హరణ ప్రాయశ్చిత్తం ॥

(౧౫౩) తటాకాదిహరణప్రాయశ్చిత్తము ॥ బలాత్కారముగానైనను, చౌర్యముచేనైనను, హీనమూల్యముచేతనైనను, తటాకకూపకాసా

రములను, వనమును, క్షేత్రమును హరించిన బ్రాహ్మణునకు ప్రాయశ్చిత్తము లేదు. యమలోకమువలన మరలరాలేదు, కొంతకాలమునకు యమలోకమునుండి కుక్షిరోగముగలవాఁడై పుట్టునని దేవలుఁడు చెప్పె, మాత్స్యపురాణమునందును నిటులనే చెప్పఁబడియు నిట్లనియె. ఈదుష్కృత్యము నొక్కపర్యాయము చేసినవాఁడు తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము నాచరింపవలయును సంవత్సరకాల మీకృత్యమును జేసినవాఁడు పరాక కృచ్ఛ్రము నాచరింపవలయును, సంవత్సరానంతరమందుఁగూడ నీదుష్కృత్యమును జేసినవాఁడు స్వర్ణస్తేయమునకుఁ దుల్యమగు ప్రాయశ్చిత్తమును విధింపవలయును, క్రియాదులకుఁ బూర్వోక్త ప్రకారముగ ద్విగుణ ప్రాయశ్చిత్తమును విధింపవలయునని యె ॥

—* పరిదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౧౫౮) అథ పరిదానప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో॥ గ్రామణీః ప్రాడ్వివాకశ్చ రాజద్వారే పురోహితః । మంత్రీ రాజగృహే రాజన్ సర్వాధ్యక్షత్వమాగతః ॥ ప్రజాభ్యః కార్యసిద్ధ్యర్థం మూల్యం భాగాన్గ్హాతః క్రమాత్ । యో హరేత్స తతం పాపీ సవైనః కమశ్నుతే॥ మార్జాలం జ్ఞేయః॥ శ్లో॥ మంత్రీ రాజగృహే తాత రాజద్వారే పురోహితః । గ్రామణీః ప్రాడ్వివాకశ్చ గయాక్షేత్రాదిషు క్రమాత్॥ ప్రజాభ్యో మూల్యహారీ యస్తాం కార్యాభివృద్ధయే । స ఏవ నరకస్థాయీ యావదాభూతసంప్లవం ॥ తదంతే భువమాసాద్య మార్జారత్వమవాప్నుయాత్॥ గౌతమః॥ శ్లో॥ రాజ్ఞో భాండసముద్వాహీ ప్రాడ్వివాకః పురోహితః । గ్రామణీర్గ్రామమధ్యే యశ్చత్వారః పాపభాగినః ॥ ప్రజాభ్యో ధనమాదాయ దద్యాద్దానాధికం ద్విజః॥ నరకస్థానమాసాద్య మార్జారో జాయతే భువి । పాదం ప్రతిగృహీతృభ్యస్తదర్ధం తత్పురోహితః॥ గ్రామణీస్సకలం పాపం మంత్రీ కార్యానుసాధనే । తత్పాపం సకలం ప్రాప్య యమకూపే నిమజ్జతి॥ గయాక్షేత్రాదిషు స్థిత్వా దర్శనార్థం ధనం హరేత్ । దాతుస్సర్వాణి పాపాని తత్క్షణాదాప్నుయాత్ఖలః॥ ఏకవారే తు చాంద్రం స్యాద్రాజద్వారే పురోహితే । మహాచాంద్రం ద్వివారే తు త్రివారే స్వర్ణహార్యసౌ॥ ప్రాడ్వివాకస్య కథితా నిష్కృతిః పాపహారిణీ। రూపకే పంచగవ్యం స్యాత్ ప్రాజాపత్యం తు నిష్కకే॥ స్వర్ణమాత్రే తు చాంద్రం స్యాత్ తతో నాస్తి హి నిష్కృతిః। పూర్వోక్తాశ్చత్వారస్తే తత్తత్ప్రాయశ్చిత్తం పరిశోధ్య కృత్వా శుద్ధిమాప్నుయుః॥ వర్షాదూర్ధ్వం పతితా ఏవ పతిత ప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నుయుః॥ నో చేదశుద్ధాః। ధాన్యవస్త్రాదిగ్రహణే త్వేవమే

వార్ధపాదక్రమేణయోజనీయం॥ క్షత్రియాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితేపరిదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౧౪౮) పరిదాన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తము ॥ గ్రామణియైనను, ప్రాడ్వివాకుఁడైనను, రాజద్వారమునందలి పురోహితుఁడైనను, మంత్రియైనను, రాజగృహమునందు సర్వాధ్యక్షత్వమును బొందినవాఁడైనను, ప్రజలకార్యసిద్ధికొఱకు లంచమును గ్రహించినయెడల పాపాత్ములగుదురు, మరణానంతరమందు నరకమును బొందుననియును దేవలుఁడువచించె. మార్కండేయుఁడును నిటులనే చెప్పి నరకలోకానుభవానంతరమందు మార్జారత్వమును బొందుననియును జెప్పె. భారమునువహించువాఁడును, ప్రాడ్వివాకుఁడును, పురోహితుడును, గ్రామణియును రాజుయొక్క పాపమును భాగించుకొని యనుభవించు వారగుదురు, ద్విజుఁడు ప్రజలవలన ధనమును గ్రహించి దానాదికము నివ్వవలయును, పరులవలన ధనమును లంచముగాఁగ్రహించినవాఁడు నరకలోకమును బొందినపిదప భూలోకమునందు పిల్లియై పుట్టును- పరులభాగమునకు రావలసిన ద్రవ్యములో నాల్గవభాగమును లంచముగాఁగైకొనిన పురోహితుఁడు సగము పాపమును బొందును, గ్రామణియును, మంత్రియును నిర్విఘముగధనమును గ్రహించినయెడల సకల పాపమును బొందినవారగుదురు, అదికారణముగ ఘోరనరకమును బొందుదురు, గయాక్షేత్రాదుల యందుండి దేవతాది దర్శనములను జేయించెదనని ధనమును హరించినవాఁడు దాతయొక్క పాపమును సర్వమును బొందును, కావున ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, ఎట్లనిన నొక్కపర్యాయమీ కృత్యమును జేసినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును, రెండు పర్యాయములు చేసినవాఁడు మహాచాంద్రాయణ వ్రతము నాచరించ వలయును, మూఁడుపర్యాయములీ కృత్యమును జేసినయెడల స్వర్ణస్తేయమునకు సమానమైన ప్రాయశ్చిత్తమును బొందవలయును, ప్రాడ్వివాకుఁడురూపకమాత్రమును హరించినయెడల పంచగవ్యప్రాశనమును జేసికొనవలయును, నిష్కమాత్రమును హరించినయెడల ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించ వలయును, స్వర్ణమాత్రమును హరించినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును, అంతకంటెనధికముగ హరించినవానికిఁబ్రాయశ్చిత్తమేగలుగనేరదు. పూర్వోక్తులగునలుగురును తత్తత్ప్రాయశ్చిత్తమును పరిశోధించి యాచరించి ప్రాశుద్ధ్యమును బొందుదురు. వర్షానంతరమందుఁగూడ నీకృత్యమును జేసినయెడల పతితులేయగుదురు, కావున పతిత ప్రాయశ్చిత్తము

నాచరించినయెడల పరిశుద్ధత గలుగును, ఇవ్విధముగ నాచరించనియెడలపరిశుద్ధతగలుగనేరదు, ధాన్యవస్త్రాది గ్రహణమునందును నిటులనేయర్ధపాదక్రమముచేత నాచరించవలయునని గౌతముడువచించె. క్షత్రియాదులకుపూర్వోక్తప్రకారమునుగ ప్రాయశ్చిత్తమును విధించవలయును॥

——— కూటసాక్షి ప్రాయశ్చిత్రమ్. ———

(౧౬౫) అథకూటసాక్షిప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ వ్యవహారేచకలహేప్రాయశ్చిత్తాదికర్మసు । కూటసాక్ష్యంద్రవ్యలోభాద్యోవిప్రో వదతేనృప॥ తస్యపుత్రాశ్చపౌత్రాశ్చ సదానాశమవాప్నుయుః । యమలోకముపాగమ్యహ్యనుభూయమహద్భయం॥ పునర్భవముపాగమ్యపుత్రహీనోఽపిజాయతే॥ మార్కండేయః॥ శ్లో॥ వ్యవహారేచకలహే ప్రాయశ్చిత్తాదికర్మసు ధనంగృహీత్వాయోవిప్రః కూటసాక్ష్యంవదేత్ఖలః ॥ తస్యైవపుత్రపౌత్రాశ్చ తదానష్టత్వమాప్నుయుః॥ యమలోకముపాగమ్యనిష్పుత్రత్వమవాప్నుయాత్ తస్య దేహవిశుద్ధ్యర్థంమహాచాంద్రముదీరితం॥ ద్విజవాదేఽనృతముక్త్వామహాచాంద్రంప్రాయశ్చిత్తం॥ ధర్మశాస్త్రేష్వనృతముక్త్వా ప్రాజాపత్యంఇతరత్రకాయకృచ్ఛ్రః॥ తదాహమనుః॥ శ్లో॥ ద్విజవాదేమహాచాంద్రం ధర్మశాస్త్రే తదర్ధతః॥ ఇతరేషువివాదేషుకాయకృచ్ఛ్రంసమాచరేత్॥ అనృతేతప్తకృచ్ఛ్రం స్యాన్మాసల్యంపాదజన్మనాం । అథవారూపకశతంరాజాతందండయేత్సుధీః॥ ఇతిహేమాద్రివిరచితే కూటసాక్షిప్రాయశ్చిత్తం॥

(౧౬౫) కూటసాక్షిప్రాయశ్చిత్తము॥ వ్యవహారమునందును, కలహమునందును, ప్రాయశ్చిత్తాదికర్మలయందును, ద్రవ్యలోభాదికమువలనకూటసాక్ష్యమునవలంబించినబ్రాహ్మణుడు పుత్రపౌత్రాదికముతోగూడనాశమును బొందును. అనంతరమందుయమలోకమునుబొంది మహాభయంకరమగునరకమునుబొందును. పిదపపుత్రహీనుడైపుట్టునని దేవలుడువచించె. మార్కండేయమునివరుడునిటులనేచెప్పి యిట్టిపాపపరిహారముకొఱకు మహాచాంద్రమునాచరించవలయుననియె. బ్రాహ్మణవాదమునందబద్ధమునాడినవానికిమహాచాంద్రమును ప్రాయశ్చిత్తార్థముగవిధించవలయును. ధర్మశాస్త్రములయందబద్ధమునుజెప్పినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాశ్రయించవలయును. ఇతరవిషయములయందు కాయకృచ్ఛ్రమునాచరించవలయుననియును మార్కండేయుడెచెప్పె. మనువునునివ్విధముగానేచెప్పె. మఱియునుసామాన్యానృతమునందు తప్తకృచ్ఛ్రమునాచరించవలయుననియును, శూద్రుడీదుష్కృత్యమును జేసినయెడల మాసల్యవధను జేయవలయుననియును, కాదేనిశతరౌప్యములన

పరార్థముగ విధింపవచ్చుననియును మనువే చెప్పె॥

## పుస్తకాదిహరణ ప్రాయశ్చిత్తమ్.

(౧౫౬) అథపుస్తకాదిహరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పుస్తకంఫలకంసూత్రంలేఖ్యంబంధనమేవవా। అపహరేద్ద్విజోయస్తుసమహాపాపమాప్నుయాత్॥ భువంలోకమపాగమ్యమూకోభవితుమర్హతి॥ మహానారదీయే॥ శ్లో॥ లేఖ్యంసూత్రంబంధనంవాపుస్తకంఫలకంతథా। హరేద్యస్తుద్విజోలోభీనరకంయాతిదారుణం॥ భూలోకంసముపాగమ్యమూకోభవేదిహ। తత్తద్ద్రవ్యంపునర్దత్వాపశ్చాత్తాపసమన్వితః॥ ప్రాజాపత్యంచరేత్కృచ్ఛ్రంతదాదేహవిశుద్ధయే। ఏతేనశుద్ధిమాప్నోతినాన్యథాశుద్ధిరిష్యతఇతి॥ ఇతిహేమాద్రివిరచితే పుస్తకాదిహరణప్రాయశ్చిత్తమ్॥

(౧౫౬) పుస్తకాదిహస్తహరణప్రాయశ్చిత్తము॥ పుస్తకము, ఫలకము, సూత్రము, లేఖ్యము, బంధనము, అనువానిని దొంగిలించినబ్రాహ్మణుడు నరకలోకమునుపొంది యనేకములగు కష్టములను పొందును. పిమ్మటభూలోకమునందు మూకవాడైపుట్టునని దేవలుడువచించె. మహానారదీయమందు నునిటులనేచెప్పబడెను. కావునమరలనావస్తువులనొసంగి పశ్చాత్తాపసమన్వితుడై ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయుననియును, ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును నాచరించని యెడల పరిశుద్ధుడుగానేరడనియును మహానారదీయమునందే చెప్పబడియె॥

## సాలగ్రామాదిహరణప్రాయశ్చిత్తమ్.

(౧౫౭) అథసాలగ్రామాదిహరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ సాలగ్రామంశైవలింగంప్రతిమాంచక్రపాణినః। ఘంటాముపస్కరంవిప్రోయోహరేత్పాతకోత్తమః॥ దేవద్రోహీసవిజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః॥ మృత్వానరకమాప్నోతిజాయతేభువిజారవాన్॥ మార్కండేయః॥ శ్లో॥ సాలగ్రామంశైవలింగంప్రతిమాంచక్రపాణినః। ఘంటాముపస్కరంవిప్రోయోహరేత్పాపబుద్ధిమాన్॥ నరకందారుణంగత్వాజాయతేభువిజారవాన్। తస్యైవనిష్కృతిరియంకథితామునిపుంగవైః॥ సాలగ్రామేతుచాంద్రంస్యాచ్ఛివలింగేతథైవచ। రత్నలింగేమహాచాంద్రంప్రతిమాయాంతథైవచ॥ ప్రాజాపత్యంచక్రపాణావితరేషుతథైవచ। ఏతేనశుద్ధిమాప్నోతినాన్యథాగతరస్తిహి॥ స్త్రీణామర్ధం। క్షత్రియాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితేసాలగ్రామాదిహరణప్రాయశ్చిత్తమ్॥ ఇత్యేతస్మాలినీకరణప్రాయశ్చిత్తం॥

(౧౫౭) సాలగ్రామాదిహరణప్రాయశ్చిత్తము॥ సాలగ్రామమును,

శైవలింగమును, విష్ణుప్రతిమను, ఘంటను, మఱియును పస్కారమును, బ్రాహ్మణు డుహరించినయెడల దేవద్రోహియనబడును. మఱియును సర్వధర్మబహిష్కృ తుడగును. మరణానంతరమునందు నరకలోకమును బొంది పిమ్మట జారుడై పుట్టును. ఇట్లని దేవలుడు చెప్పె. మార్కండేయుడునుఁ ఇటులనే చెప్పి ప్రాయశ్చిత్తమును గూడ జెప్పె. అది యెట్లనిన సాలగ్రామ శైవలింగములను హరించిన వాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. రత్నలింగ, విష్ణుప్రతిమను హరించినయెడల మహాచాంద్రాయణవ్రతము నాచరించవలయును. విష్ణుప్రతిమను దొంగిలించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. ఈ ప్రకారముగ నాచరించినయెడల పరిశుద్ధుడగును. ఇట్లు చేసికొననియెడల పరిశుద్ధుడుగానేరడు. స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధించవలయును. క్షత్రియాదులకు పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధించవలయును॥

—— అపాత్రీకరణేషు చండాలీగమనప్రాయశ్చిత్తమ్. ——

(౧౫౮) అథాపాత్రీకరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ చండాలీం బ్రాహ్మణో గత్వా పంచబాణాతురస్సకృత్ । తస్యా న్యాయనిష్కృతిర్నాస్తి కారీషదహనాదృతే ॥ ఏతదజ్ఞానాత్సకృద్గమనవిషయం । తదాహ ॥ మార్కండేయః॥ శ్లో॥ బ్రాహ్మణో యస్తు చండాలీమజ్ఞానాద్రంతుమున్మనాః । గత్వా తత్ర మహాత్పాపం కృత్వా తత్ర వధోఽగ్నితః॥ అగ్నిత ఇతి కారీషవధః। చండాలీగమనే హేతుమాహ॥ కామాతురాణాం॥ శ్లో॥ కుచౌ ముఖం విశాలం చ పృష్ఠం దృష్టిశ్శిరోరుహాః। ఏతాస్వలానాంశ్చండాల్యా దృష్ట్వా తత్ర ప్రవర్తతే ॥ అతస్తద్దర్శనం భాషాం వర్జయంతి మహాజనః॥ మాత్స్యే॥ శ్లో॥ ద్విజో యః ప్రహ్వహం పాపీ చండాలీం మనసా స్మరేత్ । గమిష్యామీతి చ ధియా స్మృత్వా పూర్వాం తదుద్భవాన్॥ విలాసానితి శేషః॥ స స్మృత్య స్మరణమాత్రేణ మహాంతం నరకం వ్రజేత్॥ గమనే విశేషమాహ॥ భారద్వాజః॥ శ్లో॥ చండాల్యా గమనం కుర్యాం గమిష్యామి తదాలయం। ఇతి మోహన సిస్వాప్య గమనాయోపచక్రమే॥ పదే పదే బ్రహ్మహత్యా పాపమేవ సమశ్నుతే । యమలోకే మహాతత్కష్టమవాప్నోతి మహాద్భయం॥ యమదండప్రకారమాహ॥ మహారాజనిజమే॥ శ్లో॥ ఛిన త్రిపాదాగమనే జిహ్వాచ్ఛేదశ్చ భాషణే। ఆలింగనే హృదశ్ఛేదః కరయోః కుచపీడనే॥ చుంబనే దంతఘాతస్స్యాత్సంసర్గే శిశ్నమోక్షణం॥ ఏవం పరోఽక్షికురుతే యమో నాస్త్యత్ర సంశయం॥ గౌతమః॥ శ్లో॥ దినమేకం తు చండాలీం గత్వా విప్రస్స్వమాలయం॥ సర్వేషాం స్పర్శనం కృత్వా పాపం మనసి గూహయేత్॥ తేన స్వసమతాం యాతాదినమేకం రిరంసునా ॥ తేనైవ సహసంసర్గమవాప్య గృహావాసినః॥ అ

ప్నుయాత్తత్సమం పాపం విచార్యాతః ప్రవర్తయేత్॥ మాసమేకం మహాపాపీ గృహే సంకరకృత్సదా॥ ఏతైర్జనైర్గృహేపాకార్యో యదాజ్ఞాతో మహాజనైః। తద్గృహస్థా యదా గ్రామేజ్ఞాత్వా సంసర్గమాప్నుయుః॥ గ్రామస్థాస్తైజనాస్సర్వే యదాజ్ఞాతా జనైస్తదా॥ గ్రామం దగ్ధ్వా ధనిశ్శేషం కృత్వా ప్రాయోపవేశనం। మృతిర్వా మరణం తేషాం తద్గృహస్థైర్వినా మునే॥ దేవీపురాణే॥ శ్లో॥ తీర్థే మహాజనాకార్యంతే హ్యగ్నిదాహే మహాభయే। ద్విజో జ్ఞాత్వా తు చండాలీం సకృద్గత్వాప్యశంకినీం। చండాలీతి మనస్మృత్వా దేహశుద్ధిం యదీచ్ఛతి। తదా మనస్సమాధాయ చాపాగ్రప్రత్యహం సదా। స్నానేన మాసమాత్రేణ శుద్ధిమాప్నోతి పూర్వజః॥ నారదః॥ శ్లో॥ చండాలీతి ద్విజః పూర్వమజ్ఞాత్వా కామపీడితః। పశ్చాద్జ్ఞాత్వా తు చండాలీం శుద్ధిమిచ్ఛన్మనస్యథ॥ రామసేతుముపాగమ్య చాపాగ్రప్రత్యహం శుచిః॥ ప్రాతస్స్నాత్వా మాసమాత్రం పూర్వవచ్ఛుద్ధిమాప్నుయాత్॥ గౌతమః॥ శ్లో॥ ద్విజః కామాతురో గచ్ఛన్న విచార్య జనంగమాం। పశ్చాచ్చండాలజాం మత్వా జ్ఞాత్వా శుద్ధిపరాయణః॥ రామేశ్వరే ధనుష్కోట్యాం ప్రాతస్స్నానాద్విశుద్ధ్యతి మాసమాత్రేణ రాజేంద్ర నాన్యథా శుద్ధిరిష్యతే॥ జాబాలిః॥ శ్లో॥ చండాలీం రూపసంపన్నాం దృష్ట్వా విప్రస్సకృద్వ్రజేత్। స చండాలసమో జ్ఞేయః కార్యో వధమర్హతి॥ ఏకస్మిన్దివసే రాజన్ద్వివారం రమతే యది॥ మాతృగామీ ద్విజో జ్ఞేయో రాజా తం దండయేత్సదా॥ శిశ్నం సవృషణం ఛిత్వా నిర్వాస్యో విషయాద్బహిః॥ జాతూకర్ణిః॥ శ్లో॥ ద్విజశ్చండాలిసంసర్గం కృత్వాజ్ఞాత్వా విచారయన్॥ బహుమాసం మాసమాత్రం పక్షం వాపి దినత్రయం ప్రత్యహం స్నాస్తి తే గ్రామే స్వగృహే వా మెళసంచరేత్॥ జ్ఞాత్వా తత్రైవ గ్రామస్థాస్తే సర్వే గృహవాసినః॥ గ్రామం గృహం తదా దగ్ధ్వా గాజ్ఞితం ప్రత్యవేదయన్॥ రాజా సమ్యగ్విచార్యాథ దండమేతత్పూర్వవత్క్రమాత్। నిర్వాస్యో విషయాద్రాజ్ఞా యావత్ప్రాణావధారణం॥ తతశ్శుద్ధిమవాప్నోతి నాన్యథా గతిరస్తి హి॥ దినత్రయమేతు సంసర్గే గ్రామే వా స్వగృహేపి వా। త్యాగం కృత్వా తలంభిత్తిం మృన్మయాని పరిత్యజేత్। భాండాదీనీత్యర్థః॥ శ్లో॥ సర్వే సచేలం స్నాత్వా తు చక్రోత్తారముత్తమం॥ దశరాత్రేణ సంసర్గే శోధయిత్వా గృహాదికాన్॥ తే సర్వే పుణ్యవత్స్నాత్వా కుర్యుః కృచ్ఛ్రం షడబ్దకం। మాసమాత్రేణ సంసర్గే నివాసాన్ శోధనమేతదా। స్నాత్వా తు విధివద్భక్త్యా తప్తకృచ్ఛ్రశతం చరేత్। వర్షమాత్రేణ సంసర్గే సహశయ్యాసనాదిభిః॥ దగ్ధ్వా గృహాంశ్చ నిశ్శేషాన్ తే సర్వే పతితాస్తతః। యదా శుద్ధిమభీప్సంతి తదా తే విప్రపుంగవాః॥ పతితస్య యథా ప్రోక్తం మునిభిస్తత్త్వవాదిభిః। తతః కర్తవ్యం తథా సర్వైర్నాన్యథా శుద్ధిమాప్నుయుః॥

నాగరఖండే॥ శ్లో॥ యదాయదా ద్విజో రాజన్ పంచబాణాతురస్తదా॥ చం
డాలీం యది వా పాత్నాం రంతుకామో గృహం వ్రజేత్ । తయా సహాయదా కు
ర్యాత్సంసర్గం లోపవిద్వరం। దినత్రయే సమాపీయాత్ కారీషవధమాహరే
త్॥ దశరాత్రం తు కామశ్చండాలీం పాపరూపిణీం। స్వమాంసం సహసా
ఛిత్వా దక్షిణాం దిశమన్వగాత్। మృతశ్శుద్ధిమవాప్నోతి నాన్యథా రఘునంద
న। తద్గర్భధారణే విప్రా వర్షాదూర్ధ్వం స పాపభాక్॥ చండాలసదృశస్స్నా
త్వాత్పిత్రోర్భి స్పృహావజ్జతే॥ మనుః॥ శ్లో॥ అజ్ఞానాన్మ్నిఖజః పూర్వం చండాలీం తు
న సంస్మరేత్। రమయాంచ సకామార్తః పశ్చాద్జ్ఞాత్వా తు తత్కథం। కేతేస్నే
కార్ద్రి ద్విజః పూర్వం జ్ఞాత్వా చండాలచేష్టయా। సచేలం స్నానమాసాద్య విప్రే
భ్యో జ్ఞాపయేన్మదా॥ తదనుజ్ఞామవాప్యాథ చాపాగ్రం వెగతో వ్రజేత్॥ ప్రాత
స్స్నాత్వా మాసమాత్రం శుద్ధిమాప్నోతి పూర్వజః। తస్యోపనయనం ప్రోక్తం
పటగర్భవిధానతః జ్ఞాత్వా ద్విజస్తు చండాలీం సంస్పృశ్యచ్ఛిద్రినం ముదా। ఘృతేనలి
ప్తదేహస్సన్ కారీషవధమాహరేత్। దినత్రయం యువాగచ్ఛేద్వీహీణాం జ్జ
భిస్తదా। సర్వాంగం వేష్టయిత్వా చరా జాతం దాహయేన్మదా॥ మాసమా
త్రం ద్విజో గచ్ఛేత్ గ్రామే సంస్పృష్టిమాచరేత్॥ రాజా తస్మాత్పరం మాచ్ఛిద్యైషధా
యాథ తేదం జలే। ప్రవిశేద్దక్షిణాం శాం మృతశ్శుద్ధిమవాప్నుయాత్। గ్రా
మస్తాః పూర్వవద్దైహన్। దగ్ధ్వా సర్వం హి పూర్వవత్। తద్గర్భధారణాద్విప్రా
రంతుకామో జనంగమాం। మాతృతః పితృతశ్చైవ కులమేకోత్తరం శతం॥ నర
కేనివసేత్సార్థో యావదాభూతసంప్లవం। రాజాభృత్యైస్తమాసీయ విచార్య
బహువాత్రయా। వసటం తు సమారోప్య చండాలైరసిపాణిభిః॥ తస్మాంసం
కణశశ్ఛిత్వా ముదాతం భక్షయన్ పురే॥ అటిత్వా ఘోషయన్వాద్యం పురద్వా
రే విసర్జయేత్। మృత్వా శుద్ధిమవాప్నోతి నదాహో నోదకక్రియా॥ గౌతమః॥
శ్లో॥ విప్రాంగనాయదా దైవాద్రంతుకామాజనంగమం। తస్యా అపి ప్రకర్త
వ్యం ప్రాయశ్చిత్తమిదం ద్విజైః॥ క్షత్రియశ్చేద్ద్విజో గచ్ఛేద్విప్రస్యార్థం ప్రక
ల్పయేత్। ద్విజాంగనాయాశ్చం కాయాం దినమాసవత్సరగర్భధారణాదికం
విచార్య రాజా కర్ణనాసికే ఛేదయిత్వా వివాసయేత్॥ తస్యా నవధః॥ స్త్రీత్వా
త్॥ తదాహ జాబాలిః॥ శ్లో॥ విప్రాంగనాయదా రాజన్ జనైశ్చండాలకం శ్రి
తే దాది నాదిగర్భాంతం రాజా తం దండయేన్మదా॥ విచార్యేతి శేషః॥ శ్లో॥
నాసాం కర్ణౌ వాపయిత్వా నిర్వాస్యా పట్టణాద్బహిః॥ త్యాగ ఏవ వధో రా
జ్ఞాం న వధస్త్రీషు సమ్మతః॥ క్షత్రియ వైశ్యాంగనానాం చండాల సంసర్గశ్చే
త్తం సమగ్రి ప్రచార్య శిర స్త్రీవన్నహి। కింతు కారీషవధ ఏవ॥ తదాహ మనుః॥ శ్లో॥

ద్వయోర్నారీయదాపాపచండాలైర్యదిశంకినీ। తదాసవ్యగ్విజార్యాథకా
రీషవధమాచరేత్ ॥ గర్భేగర్భంతదాచ్ఛిత్వాశిశుంతంభువిక్షిపేత్। పూర్వ
వద్దాహయేత్వా పాంనత్యాజ్యారాజవల్లభైరితి॥ తస్మిన్గ్రామే పురా జాతావె
తంపాపిష్ఠంనిగళైర్బద్ధ్వారాజాంతికం ప్రాపయేయుః ॥ విప్రైర్విప్రాజ్ఞాక
ర్తవ్యా। నహింసాదిః॥ యజ్ఞోపవీతాదికంత్రుటిత్వాబహిష్కుర్యుః॥ ఇతిహే
మాద్రివిరచితే చండాలీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౫౮) అపాత్రీకరణములయందు చండాలీగమనప్రాయశ్చిత్తము॥

బ్రాహ్మణుడు కామాతురుడై చండాలస్త్రీని బొందెనేని ప్రాయశ్చిత్తమె లేనివా
డగును. ఇట్టికృత్యమును జేసినవానికి కారీషదహనముకంటె నన్యమగు ప్రాయ
శ్చిత్తమేదియును లేదు. ఇదియజ్ఞానమువలన సకృద్గమనవిషయమనియును దేవ
లుడువచించె. అజ్ఞానమువలన కామాతురుడై చండాలస్త్రీని బొందినవానికి
కారీషవధకంటె నన్యమగు ప్రాయశ్చిత్తమేదియును లేదని మార్కండేయుడు
వచించె. కుచములు, ముఖము, పృష్ఠభాగము, చూపు, శిరోరుహములు, మొ
దలగునవయవములను మాటిమాటికిని చూచుటచేత కామాతురులగుదురు.
కావునను త్తములగువారు చండాలస్త్రీలయొక్క సంభాషణదర్శనాదులనువ
దలవలయును. బ్రాహ్మణుడు చండాలస్త్రీయొక్క విలాసాదులనుజూచి పొందిన
యెడల సుఖముగలుగునని మనసుచేత స్మరించినయెడల ఘోరనరకములనుబొం
దునని మాత్స్యపురాణమునందు జెప్పబడెను. చండాలస్త్రీని బొందుదమని మ
నసునదలచి దానిగృహమునకు బోవుటకు బయలువెడలెనేని మహాపాపవంతుడ
గును. మఱియును చండాల స్త్రీగృహమునకు బయలువెడలి యెన్నియడుగులు వే
యునో యన్ని బ్రహ్మహత్యలు సేసినవాడగును. అదికారణముగ యమలోక
మునందు మహాకష్టమును బొందునని భారద్వాజమునివరుడు చెప్పె. చండాల
స్త్రీని బొందవలయునని తలంపుతో నడిచినవాని పాదములను యమదూతలు ఛే
దింతురనియును, సంభాషణమును జేసినయెడల నాలుకను గోయుదురనియును
ఆలింగనమును జేసికొనినయెడల హృదయమును ఛేదింతురనియును, హస్తము
ల చేత కుచములను మర్దించినయెడల దెగగొట్టుదురనియును. చుంబనము చేసిన
యెడల దంతఘాతమును జేయుదురనియును. సంసర్గమును జేసినయెడల శిశ్నము
ను చేదింతురనియును, మహారాజవిజయమునందు జెప్పబడెను. ఒక్కదినము
చండాల స్త్రీని బొందిన బ్రాహ్మణుడు తనపాపము నెవ్వరితోడను జెప్పక మ
నసునందె దాచియుంచెనేని యట్టిపాపాత్మునితో సహవాసమును జేసినవారం
దఱును మహాపాపులగుదురు. కావుననట్టివారందఱును నివసించిన గ్రామమును

దగ్ధముసేసికొని వారందఱును ప్రాయోపవేశమును బొందవలయునని గౌతముడు వచించె. బ్రాహ్మణ్యుడు మహాజనాక్రాంతమగు తీర్థమునందయినను, అగ్నిదాహకాలమునందైనను, మహాభయముగలకాలమునందైనను, అజ్ఞానమువలననొకపర్యాయము చండాలస్త్రీని బొంది పిమ్మట చండాలస్త్రీయని తెలిసికొనెనేని మహాపాపవంతుడగును. కావుననట్టివాడు ప్రాయశ్చిత్తమును జేసికొని పరిశుద్ధతను బొందవలయునని తెలశౌసేని ధనుఃకోటియందు ప్రతిదినమును స్నానమును జేయుటచే పరిశుద్ధుడగునని దేవీపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడు తొలుత చండాలస్త్రీయని తెలియక పొంది పిమ్మట చండాలస్త్రీయని తెలిసికొనినయెడల నట్టిపాపశాంతికొఱకు రామసేతువును బొంది మాసము దినములు ధనుఃకోటియందు స్నానమును జేయవలయునని నారదుడు చెప్పె. గౌతముడును నిటులనే చెప్పె. మిగులరూపలావణ్యాదులుగల గారణముచేత బ్రాహ్మణుడు కామాతురుడై యొకమాటు సంభోగించెనేని యట్టివాడేరుపిడకలనిప్పునందు తనశరీరమును దగులబెట్టికొనినయెడల పరిశుద్ధుడగును. ఒకదినమందే రెండుపర్యాయములు భోగించినయెడల మాతృగమనదోషమును బొందును. కావుననట్టివాని శిశ్నమును వృషణములతో గూడ ఛేదించవలయునని జాబాలి వచించె. బ్రాహ్మణుడు చండాలస్త్రీని బొంది తనదు పాపము నెవ్వరికి దెలియకుండగ నొకమాసమైనను, పెక్కుమాసములయినను కులమువారితో జేరియుండిన పిమ్మట కులమువారా వృత్తాంతమును దెలిసికొని వెంటనే యాపాపాత్ముని గ్రామములోనుండి వెడలగొట్టవలయును. అనంతరమందు గ్రామములోని గృహములనన్నిటిని దగ్ధముసేసి యావృత్తాంతమును రాజునకు దెలియ జేయవలయును. రాజగువాడప్పాపాత్ముని బట్టి తెప్పించి పూర్వోక్తప్రకారముగ జక్కగ దండించవలయును. పిమ్మట దేశములోనుండి వెడలగొట్టి ప్రాణములున్నంతవఱకును దేశములోనికి రాకుండునటుల జేయవలయును. ఇంతకంటె వేరొకనుపాయముచేత పరిశుద్ధుడు కానేరడు. ఇట్టిపాపాత్మునితో మూడు దినములుమాత్రమే సాంగత్యమును జేసినవారు మృణ్మయములగు పాత్రలను మాత్రము పారవేసి గృహశుద్ధిని జేసికొనవలయునని జాతూకర్ణి వచించె. మఱియును నందఱును సచేలస్నానమును జేసి యుత్తముడు థాతనుస్మరించవలయును. పదిదినములట్టివానితో సాంగత్యము చేసినయెడల గృహశుద్ధిని జేసికొని యెల్లవారును సచేలస్నానమును జేసి షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మాసమాత్రకాల మట్టివానితో సాంగత్యము గలిగినయెడల నివాసములన్నిటిని శోధించవలయును, పిమ్మట స్నానమును జేసి నూరుతప్తకృచ్ఛ్రములనాచ

రించవలయును. సంవత్సరకాలమట్టివానితో సాంగత్యము కలిగినయెడల గృహ
ములనన్నిటిని దగ్ధము సేయవలయును. మఱియొకనట్లు సాంగత్యమును జేసినవా
రందఱును పతితులగుదురు. కావున బతితునకు విధింపబడిన ప్రాయశ్చిత్తమును
జేసికొనరేని పరిశుద్ధులగుదురని యాజాతుకర్ణియే వచించె. బ్రాహ్మణుడు కా
మాతురుడై సంభోగేచ్ఛచేత చండాలస్త్రీయొక్క గృహమును బొందెనేని పా
పాత్ముడగును. అట్టివానితో బుద్ధిపూర్వకముగ మూడుదినములు సహభోజనశ
యనాసనాదుల నవలంబించినవాడు కారీషవధకుదగినవాడు పదిదినములు చం
డాలస్త్రీని బొందినవాని శిశ్నమును వృషణములతో గూడ ఛేదించికొనవలయు
ను. అట్లు ఛేదించుకొని మరణమును బొందెనేని పరిశుద్ధుడగును. ఆచండాలస్త్రీ
కి గర్భమును గలుగజేసినవాడు పితృదేవతలతో గూడ జండాలుడై ఘోరనరక
ములను బొందును. ఇట్లని నాగరఖండమునందు జెప్పబడె. బ్రాహ్మణుడు చండా
లస్త్రీయని తెలియక కామాతురుడై పొందుచు రేతస్సేచనము గాకమునుపు చండా
లస్త్రీయని తెలిసెనేని యంతటితో విరామమును బొందవలయును. అనంతరమం
దుసచేలస్నానమును జేసి తనదుపాపమును బ్రాహ్మణులకు దెలియజేయవ
లయును. పిదప నాబ్రాహ్మణులయనుమతమును బొంది యతివేగముతో ధను
ష్కోటికిబోయి నెలదినములు ప్రాతఃకాలమునకు ముందుగ స్నానము చేసిన
యెడల పరిశుద్ధుడగును. పిమ్మట పటగర్భవిధానముచేత నుపనయనసంస్కా
రమును బొందవలయును, బ్రాహ్మణుడు చండాలస్త్రీయని తెలిసియే యొక్క
పర్యాయము పొందినయెడల శరీరమున దంతలను నేతిని బూసికొని యేరుపిడ
కలనిప్పునందు తనదుశరీరమును దగ్ధము సేసికొనవలయును. మూడుదినములీదు
ష్కృత్యమును జేసినవాడు వరిగడ్డిని శరీరమునందు జుట్టికొని రాజాజ్ఞవలన దగ్ధు
డుగావలయును. ఇట్టిదుష్కృత్యమును జేసినవాడు నెలదినములు తనదుదోష
మును బయలుపడనీక బ్రాహ్మణులలో జేరియేయుండగా నేదోయొకవిధముచే
నతనిపాపమును కులమువారు తెలిసికొనిరేని యట్టివానిని రాజుమ్రోలకు బోయి
యావృత్తాంతమును దెలియజేయవలయును. రాజగువాడట్టివానియొక్క వృషణ
ములను దెగగోయించి యతనిహస్తమునందు బెట్టించి దక్షిణాభిముఖముగ బం
పవలయును. అట్లు పంపునపుడు మృతినొందెనేని పరిశుద్ధుడగును. గ్రామములో
నివారందఱును మునుపటివలెనే గృహములనన్నిటిని దగ్ధము సేయవలయును.
చండాలస్త్రీకి గర్భమును గలిగించిన బ్రాహ్మణుడు మహాప్రళయముదనుక నూట
యొక్క కులముతో గూడ నరకములననుభవించును. కావుననట్టివాని పాపము
పశమించుటకొఱకు రాజగువాడు భృత్యులచేత నట్టిపాపాత్ముని బట్టి తెప్పించి

శకటముమీఁద నెక్కించి యసిపాణులగు చండాలురచేత వానిమాంసమును దుత్తుక కలుగఁగోయించి యామాంసపుఖండలనుదినిపించుచు గ్రామమునం దూరేగింపును జేయించి పురద్వారమున వానిని విడిచిపెట్టవలయును. అంతటవాఁడు మృతుఁడయ్యెనేని పరిశుద్ధుఁడగును. అట్టివానికి దహనసంస్కారాదిక్రియలను జేయఁగూడదు. ఇట్లనిమనువువచించెను. బ్రాహ్మణస్త్రీ చండాలునిబొందెనేని పూర్వోక్తప్రాయశ్చిత్తమునే విధించవలయును. క్షత్రియవైశ్యులీ దుష్కృత్యమును జేసిరేని బ్రాహ్మణులకు విధించిన ప్రాయశ్చిత్తము నందు సగమును విధించవలయును. బ్రాహ్మణస్త్రీకి దినమాస వత్సరగర్భధారణాదికమును విచారించి కర్ణనాసికలను రాజగువాఁడుగోయించి యూరిలోనుండి వెడలఁగొట్టవలయును. స్త్రీనిమాత్రము వధింపఁగూడదు. ఇట్లని గౌతముఁడువచించెను. బ్రాహ్మణస్త్రీచండాలపురుషునిబొందినదనిగాని పొంది గర్భవతియైనదనిగాని తెలిసెనేని రాజగువాఁడు చక్కఁగవిచారించి ముక్కుచెవులనుగోయించి పట్టణములోనుండి వెడలఁగొట్టవలయును. స్త్రీలను వదలవలయునేగాని చంపఁగూడదు. క్షత్రియవైశ్యాంగనలు చండాలపురుషుని తోరమించిరేని చక్కఁగవిచారించి కారీషవధను విధించవలయును. ఇట్లనిజాబాలివచించెను. క్షత్రియవైశ్యస్త్రీలు చండాలపురుషసాంగత్యమునుబొందినట్లు తెలిసినయెడల రాజగువాఁడు చక్కఁగవిచారించి గర్భవతులైరేనిగర్భమును గోయించి యాశిశువును భూమియందుఁ బాతి పెట్టించవలయును. పిదప నా స్త్రీలకుఁ గారీషవధను గల్పింపవలయును. ఇట్టి పాపమును జేసినవారలుండుచోట రాజులేకుండెనేని వారలనిగళములచేత బంధించి రాజుండుచోటునకుఁ గొనిపోవలయును. విప్రులచేత విప్రాజ్ఞను జేయవలయును. అనఁగా బ్రాహ్మణులు హింసనుజేయఁగూడదు. యజ్ఞోపవీతమును దెగఁగొట్టి కులములోనుండి బహిష్కృతిగాఁజేయవలయును. పిమ్మట రాజగువాఁడు పూర్వోక్తప్రకారముగ శిక్షించవలయును. ఇట్లనిమనువుచెప్పె.

—— * తులుష్కగమన ప్రాయశ్చిత్తమ్. * ——

(౧౪౯) అథతులుష్కగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ చండాలశ్చ తులుష్కశ్చ ద్వావేతౌతుల్యపాపినౌ। తదంగస్నాతథాజ్ఞైయావిప్రైః పాపభయాతురైః॥ చండాలస్పర్శనే రాజన్ సచెలంస్నానమాచరేత్ । సంభాషణేద్విజైర్వ్యాపామ్ దర్శనేభానుదర్శనం॥ తచ్ఛాయాస్పర్శనేచైవ పూర్వవత్స్నానమాచరేత్ । తదుచ్ఛిష్టేనసంస్పృష్టః ప్రాయశ్చిత్తమిదంచరేత్॥ శింఘాణికాయాంలాలాయాం శ్లేష్మసంగనిషేవతః । మృద్భిఃప్రక్షాళయి

త్వాతు తందశకంద్విత్రిసంఖ్యయా। శింఘాణికాస్పర్శనేమృదావేకవారం క్షాళయేత్ । లాలాస్పర్శనేద్వివారం శ్లేష్మస్పర్శనేత్రివారం॥ వదనస్పర్శనేమృద్భిరేకవింశత్యా క్షాళయిత్వాద్వాదశగండూషైః పూతాత్మాతద్దినంసముపోష్యపరేద్యుః పంచగవ్యంపీత్వాశుద్ధిమాప్నోతి । అతోదూరతఏవత్యాజ్యాః ॥ తదేవాహమనుః॥ శ్లో॥ యుగంయుగద్వయంచైవ త్రియుగంచచతుర్యుగం । చండాలపతితోదక్యా సూతికానామధః క్రమాదితి॥ తదేవాహదేవలః॥శ్లో॥శింఘాణికాయామేకాస్యాల్లాలాయాంతుద్వయంస్మృతం । శ్లేష్మసంగేత్రయం ప్రోక్తం తద్దేశక్షాళనక్రమః। అస్యస్పర్శేమహత్పాపం మృన్మయాస్యేకవింశతిః॥ తందశంక్షాళయిత్వాతై ర్గండూషాన్ ద్వాదశాచరేత్ । ఉపోష్యరజనీమేకాం పంచగవ్యేనశుద్ధ్యతి॥ మార్కండేయః॥ శ్లో ॥ తులుష్కయోద్విజోగచ్ఛేత్పంచబాణాతురస్సకృత్ । అజ్ఞానాద్జ్ఞానతోవాపి పూర్వవచ్ఛుద్ధిరీరితా॥ మనురపి॥ శ్లో॥ జ్ఞాత్వాజ్ఞాత్వాతులుష్కయోద్విజః కామాతురస్సకృత్। గత్వాశుద్ధిమవాప్నోతి చండాలీగమవద్ద్విజఇతి ॥ విప్రస్యతులుష్కగమనేప్రాప్తే గ్రామస్వగృహాదిసమ్మేళనేసకృద్దినత్రయమాససంవత్సరగర్భాదీన్విచార్య చండాలీగమనోక్తప్రాయశ్చిత్తవత్సర్వం కృత్వాశుద్ధిమాప్నోతినాన్యథా॥ తదాహనారదః॥ శ్లో॥ పాపంప్రకాశయేద్ధీమాన్ పుణ్యం సమ్యగ్విగూహయేత్। పాపంప్రకాశనాన్నష్టం తస్మాత్పాపం నగూహయేత్॥ చండాలతులుష్కయోరీషద్భేదోనాస్తి॥ తస్మాత్పూర్వోక్త ప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నోతి॥ ఇతిహేమాద్రివిరచితే తులుష్కగమన ప్రాయశ్చిత్తమ్॥

(౧౪౯) తులుష్కగమన ప్రాయశ్చిత్తము॥ చండాలుఁడును, తులుష్కుఁడును సమానమైన పాపముగలవారు. వారి స్త్రీలును వారలకుఁదుల్యులేయనియును నెఱుంగవలయును. కావున పాపభీతులగు బ్రాహ్మణులీచండాలతులుష్కులస్పర్శగలిగినపుడు సచేలస్నానమును చేయవలయును. మఱియునట్టివారితో సంభాషణ, దర్శనము, చేసినపుడు సూర్యునిజూడవలయును. ఆచండాలాదులయొక్క దేహచ్ఛాయయొక్క స్పర్శనుబొందిరేని పూర్వోక్తప్రకారముగ సచేలస్నానమును జేయవలయును. వారియొక్కయుచ్ఛిష్టస్పర్శగలిగినపుడీవిధముగఁ బ్రాయశ్చిత్తమును జేయవలయును. చండాలతురుష్కులయొక్కచీమిడి, జొల్లు, కఫము, మొదలగునవియేదేశమునందుఁ బడునో యాదేశమును మృత్తులచేత రెండుమూఁడుపర్యాయములు ప్రక్షాళనము చేయవలయును. చీమిడియొక్క స్పర్శగలిగినపుడు మృత్తుచేత నొకరూప

ర్యాయము క్షాళనమును జేయ లయును. లాలాస్పర్శయందు రెండుపర్యాయములు మృత్తుచేత ప్రక్షాళనమును జేయవలయును. శ్లేష్మస్పర్శయందు మూఁడుపర్యాయములు ప్రక్షాళనమును జేయవలయును. వదనస్పర్శయందు మృత్తులచేత నీరువదొక్క-పర్యాయము క్షాళనముచేసి పదిపర్యాయములుగఁ ధూపమును స్పృశించినయెడల పరిశుద్ధతగలుగును. ఇట్లు పరిశుద్ధతనుబొంది యాదినమందుపవాసమునుజేసి పరదినమునందు పంచగవ్యప్రాశనము ఁ జేయవలయును. అందువలనఁ జండాలతుళుష్కు-లనుదూరముగవదలవలయునని దేవలుఁడు చెప్పె- చండాల, పతిత, ఉదక్యాసూతికలుస్పృశింపఁగూడనివారనిమనువుచెప్పె- పైనచెప్పఁబడినదేవలవచనమునకును, నీదేవలవచనమునకును నొక్క-టేతాత్పర్యముగనుక మరలవ్రాయ లేదని యెఱుంగవలయును- బ్రాహ్మణుఁడు మదనపరవశుఁడై తెలిసియైనను, తెలియకయైనను, తుళుష్క-స్త్రీనిబొందెనేని చండాలస్త్రీని బొందినపుడు, విధించిన ప్రాయశ్చిత్తమును విధించవలయునని మార్క-ండేయమునివరుఁడువచించె- మనువునుసిటులనే చెప్పె- బుద్ధిమంతుఁడగువాఁడు తనదు పాపమును బ్రకాశింపఁజేయవలయునుగాని దాచిపెట్టికొనఁగూడదు- పాపమును బయలుపఱచినందువలన నాపాపమంతయును నశించునుగాన దాచఁగూడదు- చండాలతుళుష్కు-లకుఁ గొంచెమైనను భేదములేదని యెఱుంగవలయును- అందువలనఁ బూర్వోక్తప్రాయశ్చిత్తమునుబొంది పరిశుద్ధుఁడగును- ఇట్లని నారదమునివరుఁడువచించె-

——— షోడశవిధచండాలాః- ———

(౧౬౦) అథషోడశవిధచండాలస్త్రీగమనే ప్రాయశ్చిత్తమాహ॥ పరాశరః॥ శ్లో॥ రజకశ్చర్మకారశ్చ నటోబురుడఏవచ। కైవర్తమేదభిల్లాశ్చ స్వర్ణకారశ్చసౌచికః॥ తక్షకస్తిలయంత్రీచ సూనుశ్చక్రీతథాధ్వజీ। నాపితః శాయకశ్చైవ షోడశైతెజనంగమాః॥ గ్రామచండాలాఇత్యర్థః॥ తత్పత్న్యశ్చతఇవపరిత్యాజ్యాఃప్రైః॥ తేషాంషోడశవిధానాంపత్నీగమనేపృథక్పృథక్ప్రాయశ్చిత్తమాహ॥

(౧౬౦) పదునారువిధములగు చండాలురు॥ రజకుఁడు, చర్మకారుఁడు, నటుఁడు, బురుడుఁడు, కైవర్తుఁడు, మేదుఁడు, భిల్లుఁడు, స్వర్ణకారుఁడు, సౌచికుఁడు, తక్షకుఁడు, తిలఘాతకుఁడు, సూనుఁడు, కుంభకారుఁడు, ధ్వజి, నాపితుఁడు, కారుకుఁడు, అనుపదునార్గురును, చండాలురని పరాశరమునివరుఁడువచించె- అనఁగా నీపదునార్గురును గ్రామచండాలురని

యెటులఁగ నగును. వీరిభార్యలు చండాలస్త్రీతుల్యలు- కావున వీరలనందఱను దూరముగఁ దొలఁగించవలయును- ఈగ్రామచండాలురయొక్క భార్యలనుబొందినవారికి వేరువేరుగఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడును.

—✽ రజకీగమనప్రాయశ్చిత్తమ్- ✽—

(౧౬౧) దేవలః॥ శ్లో॥ రజకీం యువతీం గ్రామ చండాలీం యోఽభిగచ్ఛేత్ । సకృదజ్ఞానతో రాజన్ జ్ఞాత్వాశుద్ధిమథాచరేత్॥ జాబాలిః॥ శ్లో॥ రజకీం గ్రామచండాలీ మజ్ఞానాద్బ్రాహ్మణో రమేత్। పంచబాణాత్తు రః పశ్చాత్ప్రాయశ్చిత్తీ భవేద్ద్విజః॥ లైఙ్గే॥ శ్లో॥ ద్విజః కామాతురో గ్రామ చండాలీం రజకాహ్వయాం। అజ్ఞానాద్రమయిత్వాపి ప్రాయశ్చిత్తం సమాచరేత్॥ ఉభయోరేకమత్యాచేత్తప్తచాంద్రం విదుర్బుధాః । బలాత్కారేణద్వైగుణ్యం సకృదాచరణే స్మృతం॥ రేతస్సేకాత్పూర్వమేవ ప్రాజాపత్యం విశోధనం॥ మహారాజవిజయే॥ శ్లో॥ ఏకస్మిన్ దివసే విప్రస్సకృద్రజకనాయికాం । ద్వివారం బహువారంవా తప్తకృచ్ఛ్రశతం స్మృతం। సైషా చేటీ యదిభవేత్తదర్ధం మునిభిస్స్మృతం॥ పతివ్రతాయదా సాతు తప్తకృచ్ఛ్రశతం స్మృతం॥ నారదః॥ శ్లో॥ చేటీచేద్రజకీభూప పంచాశత్తప్తమీరితం। ప్రతివ్రతాయదిభవేత్తప్తకృచ్ఛ్రశతం విదుః॥ త్రిదినం మాస మాత్రంచ ద్విజో గత్వా పవిత్రజాం॥ చాంద్రాయణత్రయం ప్రోక్తం దినత్రయగమే ద్విజే । మాసేషట్కంతు చాంద్రాణాం వర్షాదూర్ధ్వం పతత్యసౌ॥ వర్షాదూర్ధ్వం పతితప్రాయశ్చిత్తం రజకీగమనే వేదితవ్యం నాన్యథాశుద్ధో భవతి। ఏవం సర్వత్ర షోడశచండాలస్త్రీగమనేషు యోజనీయముక్తమనుక్తంవా॥ సర్వత్ర గర్భధారణే కారీషవధ ఏవ । విప్రాగనానాం రజకాదిషోడశవిధ చండాలసంసర్గే ప్రాయశ్చిత్తం॥ గర్భే త్యాగ ఏవేతి సర్వత్ర సంబంధః॥ ఏవం క్షత్రియ వైశ్యయోర్ద్వినాదిక్రమేణ ప్రాయశ్చిత్తం వేదితవ్యం। బ్రాహ్మణో మాసమాత్రం వర్షమాత్రం వారస్త్రీ రజకీం గత్వా గృహే మేళనం కుర్యాచ్చేత్తత్తనగృహదాహాదికం। కింతు కుడ్యస్య క్షాళనం మృన్మయానాం త్యాగ ఏవ॥ ఘృతోపదంశాదీనామాచారాధ్యాయే ద్రవ్యశుద్ధిప్రకారోఽభిహితః॥ తదాహ మనుః॥ శ్లో॥ బ్రాహ్మణో మాసమాత్రంవా వర్షమాత్రమథాపివా। ద్విజో రహసిగత్వా తాం కుర్యాచ్చేద్గృహమేళనం। కుడ్యషక్షాళనం కృత్వా మృన్మయాని విసర్జయేత్ । వర్షాదూర్ధ్వంతు తంత్యక్త్వా హ్యజ్ఞానాద్యదుదీరితం॥ గృహస్థాదేహశుద్ధ్యర్థం ప్రాజాపత్యం విశోధనం । కుర్యాదితి శేషః॥ వర్షాదూర్ధ్వంతు జ్ఞాత్వా పృథక్చాంద్రాయణం స్మృతం॥ పంచగవ్యేన శుద్ధాస్స్యుర్గ్రామ

స్థాయదిసంగతాః। గృహేద్రవ్యాణియానీహ తాన్యల్పాని విసర్జయేత్। అధికేషుత దాతుర్ధిర్వినియమ్యస్థలాంతరం। స్థలాంతరం। పాత్రాంతరమిత్యర్థః॥ ఇతి హేమాద్రివిరచితే రజకీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౧) రజకీగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు కామపరవశుడై యజ్ఞానమువలన గ్రామచండాలురాలగు చాకలదానిని పొందినయెడల ప్రాయశ్చిత్తమునకు లవాడగునని జాబాలివచించె. లింగపురాణమునందు నిట్లు నే చెప్పబడియె. మఱియును, అయ్యిరువురును పరస్పరానురాగముచేత రమించిరేని యాబ్రాహ్మణునకు చాంద్రాయణవ్రతమును విధించవలయుననియును, బలాత్కారముగ రమించినబ్రాహ్మణునకు రెండుచాంద్రాయణములను విధించవలయుననియును, ఇదియొకమాటు రమించినవానివిషయమనియును, రేతస్సేకమునకు పూర్వమునందే యట్టిదుష్కృత్యమును మానుకొనినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయుననియును చెప్పబడె. పవిత్రయును, గ్రామచండాలురాలును, నగుచాకితను బ్రాహ్మణుడొకదినమునందొకపర్యాయమైనను; అనేకపర్యాయములైనను, పొందినయెడల నూరుతప్తకృచ్ఛ్రములనాచరించవలయుననియును; వ్యభిచారస్వభావముగల దాసితో రమించినయెడల నేబదితప్తకృచ్ఛ్రముల నాచరించవలయుననియును మహారాజవిజయమునందు జెప్పబడియె. వ్యభిచారస్వభావముగల చాకలదానితో రమించినబ్రాహ్మణునకు నేబదితప్తకృచ్ఛ్రములనాచరించవలయును. పతివ్రతయగు చాకలదానితో రమించినబ్రాహ్మణునకు నూరుతప్తకృచ్ఛ్రముల నాచరించవలయును. ఈకృత్యమును మూడుదినములైనను, నెలదినములైనను, చేసినబ్రాహ్మణునకు మూడుచాంద్రాయణవ్రతములను ప్రాయశ్చిత్తార్థముగ విధించవలయును. ఆఱుమాసము లీదుష్కృత్యమును జేసినబ్రాహ్మణునకు నాలుచాంద్రాయణవ్రతముల నాచరించవలయును. సంవత్సరకాలమందుగూడ నీదుష్కృత్యమును జేసినవాడు పతితుడగును. ఈప్రకారము పదునారువిధములగు చండాలస్త్రీలయొక్కయు గమనములయందు ప్రాయశ్చిత్తమును యోచించుకొనవలయును. గర్భధారణయయ్యెనేని కాశీవవధనే విధించవలయును. బ్రాహ్మణస్త్రీ లీపదునారువిధములగు చండాలురతో రమించుటవలన గర్భముగలిగెనేని వారలవదలవలయును. గర్భధారణలేకపోయెనేని ప్రాయశ్చిత్తమును విధించవలయును. ఇటులనే క్షత్రియవైశ్యులకును దినాదిక్రమముచేత ప్రాయశ్చిత్తవిధానమును జేసికొనవలయును. బ్రాహ్మణుడు నెలదినములైనను, సంవత్సరకాలమైనను, ఏకాంతముగరజస్త్రీతోగూడ నొకర్యగ్

హముననుండెనేని యావిషయమునందు గృహదాహాదికమును జేయనక్కరలేదు. గోడలనుమాత్రముగడుగవలయును. మఱియుమృద్భాండములనుపరిత్యజించవలయును. ఘృతముమొదలగుపదార్థముల కాచారాధ్యాయమునందుజెప్పబడినప్రకారము పరిశుద్ధిజేయవలయును. ఇట్లనినారదుడువచించె. మనువుననిటులనేచెప్పి సంవత్సరానంతరమందువానినివదలి గృహమునందున్న దేహశుద్ధికొఱకు బ్రాజాపత్యకృచ్ఛ్రమును నాచరించవలయును. సంవత్సరానంతరమందుదెలిసియును నట్టివానితో సాంగత్యమునుజేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరించవలయును. అట్టివానితో సాంగత్యమునుజేసిన గ్రామస్థులు పంచగవ్యప్రాశనను జేయవలయును. గృహములయందలియల్పద్రవ్యములను బరిహరించవలయును. అధికములగుద్రవ్యములకు పూర్వోక్తప్రకారముగ పరిశుద్ధతనుగల్పించుకొనవలయును. ఇట్లనిమనువువచించె.

——* చర్మకారస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. *——

(౧౬౨) అథచర్మకారస్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పూర్వేణవయసారాజన్ విద్యాధనవిగర్వితః। ద్విజోయశ్చర్మకారస్య స్త్రీంయదిగచ్ఛేన్నిహ। సచండాలసమోభూయాన్నాలపేత్తుకదాచన। సకృదజ్ఞానతోగత్వామృత్వానరకమశ్నుతే॥ భారద్వాజః॥ శ్లో॥ చర్మకారసతీంరమ్యాం విద్యాధనమదాన్వితః॥ బ్రాహ్మణస్సకృదాగచ్ఛేత్సచండాలోభవేదిహ। మృత్వానరకమాప్నోతికాలసూత్రంమహాభయం। విప్రైస్సహాసనంతిష్ఠేత్స్వజనైర్వానరేశ్వర॥ స్వగృహేగ్రామమధ్యేవావిప్రైస్సహనసంవసేత్॥ దేవస్వామీ॥ శ్లో॥ చర్మకారస్త్రియంగత్వాస్వాచారంసముత్సృజన్। సప్రజఃపాపరతిర్భూత్వానరకానేకవింశతిం। గత్వాభువముపాగమ్యచర్మకారోభవేత్పునః॥ తస్యైవనిష్కృతిరియంకథితాజనవల్లభ। ఏకస్మిన్దివసేరాజన్నేకవారంసమేతయః॥ తప్తకృచ్ఛ్రైర్విశుద్ధ్యర్థంపరాకందినమాత్రతః॥ దినత్రయేతుచాంద్రంస్యాత్షణ్మాసేత్రింశదాచరేత్। వత్సరేపతితంవిద్యాత్తుర్యాత్పతితవత్తదా॥ గర్భేహినిష్కృతిర్నాస్తికారీషదహనాదృతే। స్త్రీణాంబాహుజాదీనాంపూర్వవద్యోజనీయం॥ ఇతిహేమాద్రివిరచితేచర్మకారస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౨) చర్మకారస్త్రీగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుపూర్వవయస్సునందు విద్యాధనములచేతగర్వితుడై చర్మకారునియొక్క భార్యను బొందినయెడలచండాలసముడగుచు. అట్టివానితోసంభాషణనుగూడజేయగూడదు. అజ్ఞానమువలనచర్మకారునిభార్యను నొకపర్యాయముపొందినను నరకలోకమునుబొందుననుటకు సంశయమునులేదనిదేవలుడువచించె. భారద్వా

జుడునునిటులనే చెప్పి యట్టిపాపాత్మునితోఁగూడి యొక్కచోటనివసించుట సంభాషించుట మొదలగువానిని జేయఁగూడదనియె. చర్మకారస్త్రీనిబొందినబ్రాహ్మణుడు స్వకులపరిభ్రష్టుఁడగుటయేగాక యిరువదొక్క నరకములనబొందును. పిదపభూలోకంబున చర్మకారుఁడై పుట్టును. కావుననట్టిపాపాత్ముఁడుతత్పాపోపశమనముకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్టులనిన వివరించెద. చర్మకారస్త్రీతో నొక్కనాఁడొక్కపర్యాయము మాత్రము రమించినవాడు తప్తకృచ్ఛ్రము నాచరించవలయును. ఒక్కదినముననే రెండుమూడుపర్యాయములు రమించినవాడు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. మూడుదినములు రమించినవాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. ఆరుమాసములు రమించినవాడు ముప్పదిచాంద్రాయణముల నాచరించవలయును. సంవత్సరకాలము రమించినవాడు పతితుఁడగును. గర్భధారణయయ్యెనేని ప్రాయశ్చిత్తమే గలుగనేరదు. కావుననట్టివానికి కారీషవధయే ప్రాయశ్చిత్తము. స్త్రీలకును క్షత్రియులకును పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును జేయవలయును. ఇట్లు దేవస్వామివచించె.

——— * నటినీగమనప్రాయశ్చిత్తమ్. * ———

(౧౬౩) అథనటినీగమనప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ నటీనీం బ్రాహ్మణోగత్వా పంచబాణాతురస్సకృత్ । తస్యైవ పితరోయాంతి రేతఃకుండం మహాభయం॥ గారుడపురాణే శ్లో॥ దేవాలయే రాజగృహే గృహీత్వా భృతిమాదరాత్। మాసిమాసి చవర్షే చజీవన్నృత్యతి సర్వదా॥ సోయంనటఇతిఖ్యాతస్సర్వధర్మబహిష్కృతః। తస్యసంబంధినీనారీనటినీతి స్మృతాజనైః॥ దేవలః॥ శ్లో॥ కారాగృహే మాసమాత్రంసాభిర్గత్వాదినత్రయం । అబ్దావావేశనంకృత్వానాట్యంకృత్వాదినత్రయం॥ భృతిమాదాయవిప్రోసౌసద్యఃపాతిత్యమవాప్నుతి। తస్మాద్భృతింపరిత్యజ్యవిప్రోవర్తయ [illegible]। చాంద్రాయణద్వయంకుర్యాత్పునస్సంస్కారపూర్వకం॥ విప్రోగత్వాప్రమాదాద్వాజ్ఞాత్వావాబహువార్షికం॥ మార్కండేయః శ్లో॥ నటినీంయోద్విజోగృహ్ణన్సకృద్వాబహువారతః। కేశసంవపనంకృత్వాకుర్యాచ్చాంద్రాయణద్వయం । తస్యోపనయనంభూయఃపటగర్భవిధానతః। వర్షాదూర్ధ్వంతథారాజన్ తతస్సంత్యజ్జనేశ్వర॥ పతితప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నుతి। గర్భేత్యాగఏవ విప్రాంగనానాం నటసంసర్గాదిసంభవే [illegible]మెవయోజనీయం ॥ రాజాదీనాం పూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే నటినీగమనప్రాయశ్చిత్తం॥

(౧౬౩) నటినీగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు మదనాతురుఁడై

నటినిబొందెనేని యతనిపితృదేవతలు మిగులభయంకరమగు రేతఃకుండమును బొంది దుఃఖవంతులగుదురని దేవలుడువచించె. దేవాలయమునందును, రాజగృహములయందును, వేతనమునుగ్రహించి ప్రతిమాసమునందైనను, ప్రతిసంవత్సరమునందైనను నృత్యముసల్పువాడు నటుడనిచెప్పబడును. అట్టివాడుసర్వకర్మబహిష్కృతుడగును. అతనిభార్యనటినియనబడునని గారుడపురాణమునందుజెప్పబడియె. నెలదినములుకారాగృహమునందు మూడుదినములున్నవాడును, మూడుదినములోడప్రయాణమునుజేసినవాడును, మూడుదినములువేతనముగ్రహించి నాట్యమునుసల్పినవాడును, పతితుడగును. కావునవేతనమునుగ్రహింపక నాట్యమునుసల్పినయెడల చాంద్రాయణవ్రతమునవలంబింపవలయును. అట్లుచేసినను పాపముగలదు. కాబట్టితత్పాపోపశమనముకొఱకు రెండుచాంద్రాయణవ్రతములనాచరించి మరలనుపనయనసంస్కారమునుబొందవలయునని దేవలుడువచించె. బ్రాహ్మణుడునటినితోనొక్కపర్యాయమైనను, బహుపర్యాయములైననురమించెనేని కేశసంవపనమునుజేయుంచికొని రెండుచాంద్రాయణములనుజేయువలయును. పిమ్మటబటగర్భవిధానముచేత నుపనయనసంస్కారమునుబొందవలయును. సంవత్సరానంతరమందుగూడ నట్టిస్త్రీతో రమించినవాడు పతితుడగును. కాబట్టిపతితప్రాయశ్చిత్తమునుజేసికొనెనేని పరిశుద్ధుడగును. గర్భధారణయయ్యెనేని త్యాగమేయుచితమైనది. విప్రాంగనలకునటసంసర్గముసంభవించినపుడిటులనేయోచింపవలయునని మార్కండేయుడువచించె.

——— * బురడీగమనప్రాయశ్చిత్తమ్. * ———

(౧౬౪) అథబురడీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ బురడీంయోద్విజోగచ్ఛేత్సకృత్కామాతురఃక్షితౌ। సఏవనరకంగత్వా హీనజాతిమవాప్నుయాత్॥ నాగరఖండే॥ శ్లో॥ యావైకటకుటీరస్థా భాషావర్ణవిభేదినః॥ మధ్యమాసంనివేశంతేబురడాస్తేసమీరితాః॥ తదంగనేయంబురడీసర్వపాపాలయాసదా। తాంగత్వావిప్రవర్గోసౌనరకంయాతిదారుణం॥ ఏకవాసంద్వివాసంవాదినత్రయమథాపివా। మాసంఋతుత్రయంవాపివత్సరంవావిశేషతః॥ యావకంతత్కృచ్ఛ్రంచప్రాజాపత్యంతథైవచ। వత్సరేపతితోభూయాద్గర్భేతద్వర్ణవాగ్భవేత్॥ విప్రస్త్రీనాంపూర్వవత్ప్రాయశ్చిత్తం। పునరుపనయనంసర్వత్రఉక్తమనుక్తంవా షోడశవిధచండాలస్త్రీగమనేకార్యం॥ ఇతిహేమాద్రివిరచితే బురడీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౪) బురడిగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుకామాతురుడై

బురుడీజాతి స్త్రీతోఁ రమించినను నరకమునుబొంది హీనజాతియందుఁ బుట్టు నని దేవలుఁడు వచించె. కటకతీరములయందుండి భాషావర్ణ విభేదముగల వారలై మద్యమాంసమును సేవించువారు బురడులని చెప్పఁబడుదురు. అట్టి వానియొక్క భార్య బురుడి యనఁబడును. అది సర్వపాపాలయ రాలగును. అట్టిదానితోఁ బ్రాహ్మణుఁడు రమించిన భయంకరమగునరకమునుబొందును. ఒక్క పర్యాయమైనను, రెండుపర్యాయములైనను, మూఁడుదినములయినను, మున్నుదిదినములయినను, ఆరుమాసములయినను రమించెనేని క్రమముగ యావకము, తప్తకృచ్ఛ్రము, ప్రాజాపత్యము, అనువానినాచరింపవలయును. సంవత్సరకాలము రమించినవాఁడు పతితుఁడగును. గర్భధారిణియయ్యెనేని బురుఁడుఁడే యగును. బ్రాహ్మణస్త్రీలు మొదలగువారికి పూర్వోక్తప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును జేయవలయును. మరల నుపనయనసంస్కారమును నీపదునాఱు విధములగు వారితో రమించినవాఁడవశ్యముగఁ జేసికొనవలయునని నాగరఖండమునందుఁ జెప్పఁబడియె.

——— ❋ కైవర్తస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౧౬౫) అథకైవర్తస్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ కైవర్తస్య సతీంవిప్రస్సకృద్గత్వావిచారయన్ । మహాంతంనరకంగత్వాతజ్జాతిషుభవేద్ధ్రువి॥ మార్కండేయః॥ శ్లో॥ కైవర్తానరలోకేస్మిన్ హీనజాతి సముద్భవః । తదంగనాం ద్విజోగచ్ఛేత్పంచబాణాతురస్సకృత్ ॥ తస్యోపనయనంభూయః పటగర్భవిధానతః॥ ప్రాయశ్చిత్తంతథాహ్యుక్తం బురడీగమనోదితం। ఏకవారద్వివార దినత్రయాదికంవిచార్యప్రతిపదోక్తం। ప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నోతి । విప్రస్త్రీణాంతత్సంగమాదౌపూర్వవత్ క్షత్రియాదీనామపి॥ ఇతి హేమాద్రివిరచితే కైవర్తస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౫) కైవర్తస్త్రీగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు కామాతురుఁడై యవివేకమువలన కైవర్తునియొక్క భార్యతో రమించిన యెడల ఘోరనరకమును బొందును. పిమ్మట నాజాతులయందుఁ బుట్టునని దేవలుఁడు వచించె. కైవర్తునిభార్యతోఁ రమించిన బ్రాహ్మణునకు మరల నుపనయన సంస్కారమును జేయవలయుననియును, తక్కిన ప్రాయశ్చిత్తమంతయును బురుడీగమనమునకు విధించిన విధముగానే విధించవలయు ననియును, బ్రాహ్మణస్త్రీలకు కైవర్తులతో సాంగత్యముగలిగినపుడు క్షత్రియాదులకు విధించినచందమునఁ బ్రాయశ్చిత్తమును విధించవలయుననియును మార్కండేయ మునివరుఁడు చెప్పె.

## మేదస్త్రీగమనప్రాయశ్చిత్తమ్.

(౧౬౬) అథమేదస్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః ॥ శ్లో॥ మేదస్త్రియంద్విజోయస్తు బలాత్కారాద్రమేద్యది। కాలకూటవిషంనామనరకంయాతిదారుణం॥ దేవలః॥ శ్లో॥ వేణుకారసతీంగత్వా ద్విజఃకామాతురస్సకృత్ । నరకంకాలకూటాఖ్యం యాతిపాపీసదాశ్వసన్ ॥ మహాభారతే॥ శ్లో॥ వైణవీంబ్రాహ్మణోదృష్ట్వా మనస్తత్రసవేశ్యచ॥ రంతుకామోయదిభవేత్తస్యైవనరకస్థితిః॥ తద్దోషపరిహారార్థం పూర్వవన్మునిచోదితం। ఏకవారద్వివారాదికమత్రాపి విచార్యపూర్వవత్పున స్సంస్కారాదికంసర్వంకుర్యాత్ । విప్రస్త్ర్యాదీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రౌ మేదస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౬) మేదస్త్రీగమన ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు మదనాతురుఁడై మేదస్త్రీని బలాత్కారముగఁబట్టి రమించిన యెడల కాలకూటమనియెడు నరకమునందుఁబడి ఘోరములగు దుఃఖములనుబొందునని గౌతముఁడువచించె. దేవలుఁడును నీప్రకారమేనిర్వచించె. బ్రాహ్మణుఁడు కామాతురుఁడై వైణవిని బొందవలయుననియెడు కోరికగలవాఁడయ్యేనేనినరకలోకమును బొందువాఁడగును. కావునఁ దద్దోషపరిహారముకొఱకు పూర్వోక్తప్రకారము గనేకవార బహువారాదికమును విచారించి పునరుపనయనాదికమును సర్వమును నాచరించవలయును. బ్రాహ్మణస్త్రీలు మొదలగువారికి పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తాదికమును విధించవలయునని మహాభారతమునందు జెప్పఁబడియె.

## —* భిల్లస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. *—

(౧౬౭) అథభిల్లస్త్రీగమన ప్రాయశ్చిత్తమాహ॥ దేవస్వామీ॥శ్లో॥ భిల్లపత్నీంతత్సుతాంవా భగినీంమాతరంతథా । సకృద్గచ్ఛే ద్ద్విజోయస్తు సోపిచండాలవద్భవే॥ నాగరఖండే॥ శ్లో॥ చండాలవత్ప్రసూన్నిఘ్నన్ బ్రాహ్మభావభేదతః । సభిల్లఇతివిఖ్యాత స్సర్వధర్మబహిష్కృతః॥ మార్కండేయః॥ శ్లో॥ చండాలమరుభిల్లానాం స్త్రియస్త్వేతాస్సమాఃస్మృతాః। నజాతుదర్శనేయోగ్యాన సంభాష్యాఃకదాచన । తదంగనాంరమేద్యస్తు ద్విజఃకామాతురస్సకృత్॥ తస్యాన్యా నిష్కృతిర్నాస్తి చండాలగమనాదృతే । భిల్లపత్నీగమనేచండాలీ గమనవత్ప్రాయశ్చిత్తం సర్వంకుర్యాత్। వత్సరంసంసర్గేన విచారణీయం కారీషవధాదికం। విప్రస్త్రీణాంతత్పురుషసంగమే పూ

ర్వవత్ క్షత్రియాదీనామేవం॥ ఇతి హేమాద్రివిరచితే భిల్లస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౭) భిల్లస్త్రీగమనప్రాయశ్చిత్తము॥ భిల్లునిభార్యనైనను, పుత్రికనైనను, భగినినైనను, తల్లినైనను, బ్రాహ్మణుఁడు కామాతురుఁడైపొందెనేని నరకములను బొంది పిదప భూలోకమునందుఁ జండాలుఁడై పుట్టునని దేవస్వామి వచించె. చండాలునివలెఁ బ్రతిదినము బశుహింసను జేయువాఁడు చండాలుఁడనఁబడును. చండాల, మరు, భిల్లుల, స్త్రీలు సమానులగుదురు. ఈముగ్గురయొక్కయు దర్శనస్పర్శనాలాపములను వదలవలయును- కావున నిట్టివారితోఁ రమించెనేని ఘోరనరకపంకమునఁబడును- భిల్లునిభార్యాదులను బొందినవానికి చండాలస్త్రీనిబొందినవానికి విధించిన ప్రాయశ్చిత్తమునే విధించవలయును- సంవత్సరాదికాలమును విచారించి కారీషవధాదికమునుగూడ విధించవలయును- బ్రాహ్మణస్త్రీలకు భిల్లజాతిపురుషుల సాంగత్యము గలిగినయెడల పూర్వోక్త ప్రకారముగఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును- క్షత్రియాదులకును పూర్వోక్తప్రకారముగ జరపవలయునని మార్కండేయుఁడు నిర్వచించె-

## —* స్వర్ణకారస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్. *—

(౧౬౮) అథస్వర్ణకారస్త్రీగమన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ స్వర్ణకారో మహాన్ ద్రోహీ పారక్యంస్వర్ణమాహరన్ ॥ ప్రత్యహం జీవనంకుర్వన్ వంచయిత్వాబహూన్ జనాన్ । తస్యైవరమతోనారీంబలాద్వాచౌర్యధర్మతః । ఏకవారంద్వివారంవా త్రివారంమాసమేవవా । యావత్కంచపరాకంచ ప్రాజాపత్యంతథైందవం । యథాక్రమంయోజనీయం దేహశుద్ధ్యర్థమాదరాత్ । తస్యోపనయనంభూయో వర్షాంతేతత్సమోభవేత్। నతంసంభాషయేత్క్వాపి పతితస్స్యాన్నసంశయః। విప్రాంగనాదీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే స్వర్ణకారస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౮) స్వర్ణకారస్త్రీగమన ప్రాయశ్చిత్తము॥ పరుల బంగారమును హరించువాఁడగుటచేత స్వర్ణకారుఁడు మహాపాతకుఁ డనఁబడును- అట్టిస్వర్ణకారస్త్రీని బలాత్కారముగ నైనను, చౌర్యముచేతనైనను, పొందినవాఁడు పాపాత్ముఁడగును- ఒకటి రెండుమూడుపర్యాయములు పొందినను, లేక మాసముదినములురమించినను, క్రమముగ యావక, పరాక, ప్రాజాపత్య, చాంద్రాయణముల నాచరించవలయును- మఱియు నట్టివానికి పునరుపనయనాది సంస్కారమును గూడ జేయవలయును- సంవత్సరానంతరము

దుగూడ నట్టిస్త్రీతోరమించిన బ్రాహ్మణుఁడుగూడ స్వర్ణకారుఁడే యగు
ను. కావున నట్టివానితోదర్శనస్పర్శనాదుల నాచరింపఁగూడదు. దర్శనాలా
పాదికముల నాచరించినవాఁడు పతితుఁడగును. బ్రాహ్మణస్త్రీలు మొదలగు
వారికి పూర్వోక్తప్రకారముగ నాచరించవలయునని దేవలుఁడువచించె.

—* సౌచికస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. *—

(౧౬౭) అథసౌచిక స్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ సౌచికోవస్త్రసంధానీ జనేభ్యో భృతిముద్వహన్ । జీవంస్తయావస్త్రహారీ సౌచికోయముదీరితః॥ తదంగనామహాపాప కారిణీలోకనాశినీ॥ తాంగచ్ఛేద్బ్రాహ్మణోయస్తు పంచబాణాతురస్సకృత్ । తస్యాన్యానిషద్ధృతిర్నాస్తి సూచీకారస్యజన్మనః॥ నారదః॥ శ్లో॥ సూచికారస్యయఃపత్నీం ద్విజఃకామాతురస్సకృత్ । గచ్ఛేదితిశేషః॥ శ్లో॥ మహాంతంనరకంగత్వాహీనయోనిషుజాయతే। దినంత్రిరాత్రమంమాసం వర్షంవాగర్భధారణాత్ ॥ యావకంచపరాకంచ తప్తమైందవమేవచ । యథాక్రమంప్రకుర్వీత పతితోగర్భధారణే॥ పతితప్రాయశ్చిత్తముపనయనాదికం పూర్వవత్॥ విప్రస్త్రీణాం క్షత్రియాదీనామపిపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితే సౌచికస్త్రీగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౬౮) సౌచికస్త్రీగమనప్రాయశ్చిత్తము॥ జనులవలన వేతనమును గ్రహించి వస్త్రముల సంధానమును సూదులచేతఁ జేయువాఁడు సౌచికుఁడనఁబడును. మఱియు నట్టివాఁడొకానొకప్పుడైనను పరులవస్త్రములనపహరింపక మానఁడు. అట్టివానికి మహాపాపము గలిగియుండును. అదికారణముగ నతనిభార్యయును మహాపాపవంతురాలు. అట్టిస్త్రీని బ్రాహ్మణుఁడు కామాతురుఁడై పొందెనేని ఘోరనరకములనుభవించి సూచీకారకులమునఁ బుట్టునని దేవలుఁడువచించె. బ్రాహ్మణుఁడు కామాతురుఁడై సూచీకారునిభార్యను బొందినయెడల ఘోరనరకమునుబొందును. మీమ్మట హీనజాతులయందుఁ బుట్టును. ఒకదినమైనను, మూఁడుదినములయినను, మాసమునినములయినను, సంవత్సరకాలమైనను, గర్భధారణయగువఱకును నైనను, సూచీకారునిభార్యనుబొందిన యెడల క్రమముగయావక, పరాక, తప్త,ఐందవకృచ్ఛ్రముల నాచరించవలయును. గర్భధారణయయ్యేనేని పతితుఁడేయగును. పతితప్రాయశ్చిత్తోపనయనాదికమును పూర్వోక్తప్రకారముగ నాచరింపవలయును. విప్రస్త్రీలకును, క్షత్రియాదులకును బూర్వముపలె నాచరింపవలయునని నారదుఁడువచించె.

—* తక్షకతిలయంత్రిణోః స్త్రీగమనప్రాయశ్చిత్తమ్. *—

(౧౬౦) అథతక్షక తిలయంత్రిణోః స్త్రీగమన ప్రాయశ్చిత్తమాహ॥ కుమారః॥ శ్లో॥ తక్షకోదారుకర్తాచ తిలయంత్రిచ హాక్షిలః ॥ తిలఘాతక ఇత్యర్థః ॥ శ్లో॥ తిలయంత్రీతిలద్రోహీ దారుకోదారుఘాతుకః ॥ నకర్మా హశ్చాభవేతాంతౌనసంభాష్యౌకదాచన ॥ తావేతౌగ్రామచండాలౌ దూర తస్తౌపరిత్యజేత్ । తయోర్గృతంబీసిపాపౌ తౌ రమేన్మూఢజస్సకృత్॥ మహా పాపమవాప్యాశు భువిహీనేషుజాయతే । తయోరిస్త్యంగనాగామీకారీషవ ధమర్హతి । తాచ్ఛిలికణిని తాతత్స్వభావఇత్యర్థఃప్రతీయతే ॥ జాబాలిః ॥ శ్లో॥ తయోర్యదారమేన్నారీం బ్రాహ్మణఃకామపీడితః । అజ్ఞానాచ్చాపకో ట్యాంతుస్నాత్వామాసేన శుధ్యతి । జ్ఞానాత్సకృద్ద్విజోగత్వా కారీషేణ స్వయందహేత్ ॥ అథవా దేహశుద్ధ్యర్థందద్యాయుతంధేనూ చరేత్ । ద ద్యాదిత్యర్థః ॥ శ్లో॥ శుద్ధిమాప్నోతిరాజేంద్రనశుద్ధిర్మూభిస్మృతా ॥ అన్య థాచేదితి శేషః ॥ విప్రాంగనానాంప్రమాదాద్గమనేగర్భధారణే త్యాగఏవ। క్షత్రియవిశాంతత్ స్త్రీగమనే పూర్వవద్వేదితవ్యం॥ ఇతిహేమాద్రివిరచితే తక్షకతిలఘాతక స్త్రీగమనప్రాయశ్చిత్తమ్ ॥

(౧౬౦) తక్షకునియొక్కయు, తిలయంత్రియొక్కయు భార్యలను బొం దుటవలనఁ జేయదగిన ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాఁడు ॥ తలఘాతకుఁ డును, తక్షకుఁడును, మహాదుర్మార్గు లనఁబడుదురని కుమారుఁడు వచించె. తిలఘాతకుఁడును, దారుఘాతకుఁడును వేదోక్తకర్మల కర్హులుగారు. మఱి యును వారలతో సంభాషింపఁదగదు, ఇంతయగాక యియ్యిరువురును గ్రా మచండాలురనఁబడుదురు. కావుననట్టివారలతో సంభాషింపఁదగదు,అదికా రణముగ వారిభార్యలును పాపాత్మురాలెయుండవలయును. అట్టి స్త్రీలనుబొం దిన బ్రాహ్మణుఁడు మహాపాపవంతుఁడగుటచేత హీనయోనులయందుఁ బు ట్టును, అట్టివానికి కారీషవధకంబె నన్యమగు ప్రాయశ్చిత్తమేదియును లేదని యును కుమారుఁడే వచించె. తక్షకతిలఘాతకుల భార్యలను అజ్ఞానమువ లన బొందినవాఁడు మహాపాపవంతుఁడగును. కావుననట్టివాఁడా పాపము పోవుటకొఱకు నెలదినములు ధనుష్కోటియందు స్నానమును జేసిన యెడల పవిత్రుఁడగును, అట్టి స్త్రీలను బుద్ధిపూర్వకముగ రమించినవానికి కారీషవ ధకంబె నన్యమగు ప్రాయశ్చిత్తమేదియును లేదు, అట్లుచేయలేనియెడల నిరు వదివేలగోవులను దానముచేయవలయునని జాబాలిఁ వచించె. తక్షకతిలఘా తకులను బ్రాహ్మణస్త్రీలు ప్రమాదవశమునఁ బొందినను గర్భవతులైరేని

వారలకుత్యాగమే ప్రాయశ్చిత్తము. క్షత్రియ వైశ్యులు తిలఘాతకదారుఘాతకుల భార్యలనుబొందిరేని పూర్వోక్త ప్రాయశ్చిత్తమునే యాచరింపవలయుననియును జాబాలియే వచించె ॥

—— మాంసవిక్రయికస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్ ——

(౧౫౧) అథ మాంసవిక్రయికస్త్రీగమన ప్రాయశ్చిత్త మాహ ॥ దేవలః ॥ శ్లో ॥ సూనోః పరిగ్రహం గత్వా సప్రపాపపరాయణః ॥ కుంభీపాకే మహాఘోరే వసత్యాచంద్రతారకం ॥ మనుః ॥ శ్లో॥ మాంసవిక్రయిణః పత్నీం పుత్రీం వాభగినీమపి । స్నుషాం వాముఖజః షాపీరమె తాం మాతురస్సకృత్ । నతస్య పునరావృత్తిః కుంభీపాకాద్భయంకరాత్ ॥ పునస్స్వయము పాగమ్య జాయతే హీనజాతిషు ॥ మార్కండేయః ॥ శ్లో ॥ సూనోర్నారీంద్విజోగత్వా పాపీయాక్ పాపరూపిణీం ॥ కుంభీపాకముపాగమ్య జాయతే భువిహీనవాక్ ॥ ప్రాజాపత్యంమాసమాత్రే చాంద్రంప్రోక్తం మృతుత్రయే । తతః పతితవజ్జ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః ॥ అభ్యాసే చాహయేత్తస్య కారీషేణ పునః పునః ॥ అన్యథా నిష్కృతిర్నాస్తి గూఢవద్గర్భపాతకం ॥ విప్రస్త్రీణాంపూర్వవత్ క్షత్రియాదీనామపి ॥ ఇతి హేమాద్రివిరచితే మాంసవిక్రయికస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్ ॥

(౧౫౧) మాంసమును విక్రయించెడు వాని స్త్రీఁ బొందినందుకు ప్రాయశ్చిత్తము ॥ మాంసమును విక్రయించు వానిభార్యనుబొందిన బ్రాహ్మణుఁడు మహాపాపవంతుఁడగుటచేత మిగుల భయంకరమగు కుంభీపాకమను నరకమును బొందుననని దేవలుఁడువచించె. మాంసమును విక్రయించువానిభార్యనైనను, పుత్రికనయినను, భగినినైనను, కోడలినైనను, బ్రాహ్మణుఁడు కామాతురుఁడై పొందెనేని యట్టిబ్రాహ్మణుఁడు మిగులభయంకరమగు కుంభీపాకమను నరకమునుబొందును. పిమ్మట హీనజాతులయందుఁబుట్టుననిమను వుచించె. మార్కండేయుఁడును నిటులనే చెప్పి ప్రాయశ్చిత్తమును గూడ విధించె. అనిమెట్లనిన నట్టిస్త్రీలనొకటి మాసముకాలము పొందినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించ వలయును, ఆరు మాసములు పొందినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును, ఇట్టిప్రాయశ్చిత్తము నాచరించనియెడల సకలధర్మములకును వెలియగును, పైన చెప్పినకృత్యమును, అభ్యాసముగా నాచరించుచు వచ్చినయెడల నట్టివానికి కారీషవధను ప్రాయశ్చిత్తార్థముగ విధించవలయును, అట్లుగాని యెడల వానికి ప్రతిక్రియగలుగనేరదు, విప్రస్త్రీలకును క్షత్రియాదులకును పూర్వోక్త

ప్రకారముగా నేయని యెఱుంగ వలయు ననియును మార్కండేయ ముని వరుండే చెప్పె ॥

——— * కులాలస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్. * ———

(౧౭౨) అథకులాల స్త్రీగమన ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ కులాలకస్యయోనారీం విప్రకామాతురస్సకృత్ । అంగీకార తయారాజక బలాత్కారేణవాపునః ॥ రమేద్దినంవాపక్షంవామాసంఋతుమథాపివా। తస్యాన్యాసివకృతిర్నాస్తి పునస్సంస్కారకర్మణః ॥ మరీచిః ॥ శ్లో ॥ ఇష్టకాఘువిభాండాని కృత్వాయోదాహయేన్నరా ॥ సచండాలసమోజ్ఞేయ స్సర్వవర్ణబహిష్కృతః॥ తదంగనాతత్సమాస్యాద్ధర్మనాత్పాపకారిణీ । ఏనాం ద్విజోంత్యోనాగచ్ఛేత్స మహాపాతకీస్మృతః ॥ తస్యైషా నిష్కృతిర్దృష్టా పూర్వమున్మునిభిస్స్మృత్॥ మాసషణ్మాసవత్సర తారతమ్యేన ప్రాయశ్చిత్తం యోజనీయం । గర్భేవత్సరాం తెచపతితేవత్ప్రాయశ్చిత్తమ హ్గతి । విప్రస్త్రీణాంపూర్వవత్ క్షత్రియాదీనామపి । ఇతికులాలస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్॥

(౧౭౨) ఇకను కులాలస్త్రీగమన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాండు॥ బ్రాహ్మణుండు కామాతురుండై కుమ్మరివానిభార్యను బలాత్కారముగనైనను, అంగీకారపూర్వకముగనయినను పొందినయెడల పాపవంతుండగును, మఱియునట్టిస్త్రీతో నొకటిదినమయినను, పదునైదు దినములయినను, ముప్పదిదినములయినను, ఆఱుమాసముల కాలమయినను రమించినవాండు మహాపాపవంతుండగునని దేవలుండువచించె. ఇటకలనైనను, కుండలనయినను చేసివిక్రయించువాండు చండాలసమానుండని యెఱుంగవలయును. కావున నట్టివాండు సర్వకర్మలకును వెలియగును, అట్టివానిభార్యయును వానికిసమానురాలగును, కావున నా స్త్రీనిబొందినవాండు మహాపాతకుండనంబడును, అదికారణముగనట్టివానికిమాసము, ఆరుమాసములు మొదలగుకాలమును నిర్ణయించి ప్రాయశ్చిత్తమును విధించవలయునని మరీచివచించె-బ్రాహ్మణస్త్రీలకును, క్షత్రియాదులకును పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధించవలయును ॥

——— * మద్యవిక్రయిణస్త్రీగమనప్రాయశ్చిత్తమ్ * ———

(౧౭౩) అథ మద్యవిక్రయిణ స్త్రీగమన ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో ॥ మద్యవిక్రయిణోగత్వా నారీంగ్రామెవనాంతరే। ద్విజఃపాపమవాప్నోతి త్రిషుజన్మసుసంగతః ॥ పరాశరః ॥ శ్లో॥ యోద్విజోధ్వజినో

దారాన్ గృహ్ణీయాత్తాం కామపీడితః॥ నతస్యపునరావృత్తిర్యమలోకాత్కదా
చన ॥ నారదః ॥ శ్లో ॥ ప్రత్యహం మద్యవిక్రేతా మాంసస్యాపి మహామునే। ఉ
భయోర్స్త్రీప్రభృతిర్నార్యా స్త్రీషు పిచండాలజన్మతః॥ తస్యోపనయనం భూయః ప్రా
జాపత్యం దినత్రయే ॥ మాసే చాంద్ర మృతౌ తద్వద్ద్విగుణం వ్రతముచ్యతే ॥
అతఃపరం న శుద్ధిస్స్యాత్ కారీషదహనాదృతే । అశక్తో గోసహస్రం వా వర్ష
మాత్రం చ శెద్బుధః । విప్రస్త్రీణాం పూర్వవత్ క్షత్రియాదీనామపి ॥ ఇతి హే
మాద్రివిరచితే మద్యవిక్రయిణ స్త్రీగమన ప్రాయశ్చిత్తమ్ ॥

(౧౪౩) కల్లును విక్రయించిన వానిభార్యనుబొందినవానికి ప్రాయ
శ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ మద్యమును విక్రయించువానిభార్యను గ్రామ
మునందయినను, వనాంతరమందైనను బొందిన బ్రాహ్మణుఁడు మూఁడుజన్మ
ములదనుక మిక్కిలిఁబాపఫలమును బొందునని దేవలుఁడు చెప్పె, మద్యమును
పానమును జేయువాని భార్యనుబొందినవానికి యమలోకమునుండి యెన్నటి
కిని మరలివచ్చుట లేదని పరాశరుఁడు వచించె. ప్రతిదినమునందును మధుమాం
సములను విక్రయించువానికిఁ జండాలజన్మముకంటె నితరమగునది యేదియు
నుగలుగనేరదు, ఇట్టికృత్యమును మూఁడుదినములవఱకును జేసినబ్రాహ్మణు
నకుఁ బునరుపనయనమును జేసి ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించునటులఁ జే
యవలయును, మాసముదినములీ కృత్యమును జేసినవాఁడు ప్రాయశ్చిత్తార్థము
గఁ జాంద్రాయణవ్రతము నాచరింపవలయును. రెండుమాసములు చేసినవా
ఁడు రెండుచాంద్రాయణముల నాచరింపవలయును, రెండుమాసములకంటె న
ధికకాలముగూడ నీకత్యమును జేసినవాఁడు కారీషవధకుఁ బాత్రుఁడగును, అం
తకంటె నన్యమగు ప్రాయశ్చిత్త మేదియును లేదు, అట్లు కారీషవధనుబొం
దలేనివాఁడు సంవత్సరకాలము వేయి గోవులను దానము చేయువలయును,
బ్రాహ్మణ స్త్రీలకును, క్షత్రియాదులకును బూర్వోక్తప్రకారముగఁ బ్రాయ
శ్చిత్తమును విధింపవలయునని నారదుఁడువచించె ॥

—— కారుకనాపితస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. ——

(౧౪౪) అథకారుకనాపిత స్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥
శ్లో॥ కారుకస్య స్త్రియం గత్వా నాపితస్య ద్విజాధమః। కామాతురో మహాపా
పీ పునర్న సంభవిజాయతే॥ నాపితః క్షౌరకః॥ కారుకస్తు రయః పిండకారీ॥ జాబా
లిః॥ శ్లో ॥ తయోర్వై ప్రసృతిం దృష్ట్వా గాత్రమేవాస్వగృహేపి వా। యభేతాక
మాతురః పశ్చాద్దేహశుద్ధిం సమాచరేత్॥ మార్కండేయః॥ శ్లో ॥ క్షౌరకస్య
ద్విజో గచ్ఛేత్ కారుకస్య ప్రియాం యదా । తదా పతతి దుష్టాత్మా న తస్య పునర్

ద్భవః। తస్యదేహవిశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తముదీరితం॥ పరాకంయావకంచైవ తప్తంచాంద్రమనంతరం॥ ఏకదినత్రిదినమాససంవత్సరక్రమేణయోజనీయం॥ అతఊర్ధ్వంపతితప్రాయశ్చిత్త ॥ ఆభీరస్త్రీగమనేప్రాయశ్చిత్తమేవమేవ వేదితవ్యం। విప్రస్త్రీగామపిపూర్వవత్। క్షత్రియాదీనామపి ॥ ఇతి హేమాద్రివిరచితేనాపితకారుకస్త్రీగమనప్రాయశ్చిత్తం॥

(౧౭౪) ఇకను కారుకనాపిత స్త్రీగమనప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ కారుకునియొక్కయు, క్షౌరకునియొక్కయు, భార్యతోగామాతురుడై రమించినబ్రాహ్మణుడు మహాపాపవంతుడగుటచేత ఘోరనరకమును బొందునని దేవలుడు వచించె. కారుకక్షౌరకులభార్యలనుజూచి గ్రామమునందైనను, స్వగృహమునందైనను, కామాతురుడై రమించెనేని పిమ్మటదేహశుద్ధిని జేసికొనవలయునని జాబాలివచించె. మార్కండేయుడునునిటులనే చెప్పియట్టివానికి ప్రాయశ్చిత్తవిధానమును గూడ దెలిపె. అదియెట్లనిన నట్టికృత్యమునొక్కదినము చేసినవాడు పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. మూడుదినములు చేసినవాడు యావకమునాచరింపవలయును. మాసముదినములీకృత్యములు చేసినవాడు తప్తకృచ్ఛ్రమునాచరింపవలయును. సంవత్సరకాలమయ్యెనేని చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. సంవత్సరానంతరమందుగూడనీకృత్యమును జేసినవాడు పతితప్రాయశ్చిత్తము నాచరింపవలయును. గొల్లదానిబొందినవానికిని నిటులనే ప్రాయశ్చిత్తమును విధింపవలయును. విప్రస్త్రీలకును, క్షత్రియాదులకును పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయుననియె.

— బ్రహ్మచండాలస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. —

(౧౭౫) అథబ్రహ్మచండాలస్త్రీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పరార్థంకాశికాయాంయోదత్తాగ్నిఃకీకసానుగః ॥ తఏతేబ్రహ్మచండాలా వాఙ్మాత్రేణాపినార్చయేత్॥ తత్రకాశికాయాంస్వకృతపుణ్యరాశిం దాస్యామీతిభృతకంగృహీత్వాయః కాశీంగతఃపరార్థంసకాశికాయాయీ। అహమేతస్యఋణపస్యాగ్ని దాహాదికంకరిష్యామీతి మూల్యంగృహీత్వాకృతవాన్యస్సదత్తాగ్నిః॥ కీకసాన్యస్థీనిపరకీయానిఅహంధృత్వా గంగాంభసిస్థాపయిష్యామీతిపూర్వవద్ధనంగృహీత్వాయః కరోతిసకీకసానుగః॥ తదాహమనుః॥ శ్లో॥ కీకసానిద్విజోధృత్వాపరకీయానిపార్థివ ॥ ఏకప్రస్థానమాత్రేణసచండాలసమోభవేత్। ప్రేతకృత్యమహంకుర్యామేతస్యాద్యమశేషతః॥ ఇతియఃకురుతేబుద్ధింసచండాలఇతీరితః॥ పరార్థంమూల్యమాదాయకాశీయాత్రామహంతవ। ఇ

తియోమసస్సిస్థాప్యాతచ్చండాలత్వమర్హతి। ఏతేషామేకతః పత్నీం ద్విజోయస్సంగ్రహేద్గృహాత్। ఏకరాత్రంత్రిరాత్రంవామాసం సంవత్సరం చవా॥ యథితామాతురస్సద్య స్తస్యనిష్కృతిరీరితా। చండాలగమనే రాజన్నిష్కృతిః కథితో త్తమైః॥ సైవాత్రాపిప్రయోక్తవ్యా కారీషవధవర్జితం। పునస్సంస్కారవిధినాకర్తవ్యంకర్మతస్యవై॥ విప్రస్త్రీణాంబ్రహ్మచండాలసంసర్గప్రాప్తౌనిప్రస్యార్ధం। గర్భత్యాగఏవ। క్షత్రియాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రివిరచితె బ్రహ్మచండాలస్త్రీగమనప్రాయశ్చిత్తం॥

(౧౭౫) బ్రహ్మచండాలస్త్రీగమనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ ఇతరులకు బుణ్యమును సంపాదించియిచ్చెదనని ద్రవ్యమును గైకొని కాశికిబోయివచ్చి యాపుణ్యమును దానముసేసినవాడును, ఇతరులశవమునకు, ద్రవ్యమును గైకొని దహనసంస్కారమును జేసినవాడును, ఇతరుల యెముకలను ద్రవ్యమును గైకొని గంగయందువేసినవాడును, బ్రహ్మచండాలురనబడుదురని దేవలమనువులువచించిరి. మఱియునీముగ్గురను వాఙ్మాత్రముచేతగూడ బూజింపగూడదు. వీరియొక్కభార్యలను బ్రాహ్మణుడు కామాతురుడై యొక్కదినమైనను, మూడుదినములయినను, ముప్పదిదినములయినను, సంవత్సరకాలమైనను బొందినయెడల చండాలస్త్రీగమనమునకు విధించిన ప్రాయశ్చిత్తమును విధింపవలయును. అదియును కారీషవధరహితముగ జేయవలయును. మఱియు నుపునరుపనయనాది సంస్కారమునుగూడ జేయవలయును. బ్రాహ్మణస్త్రీలకు బ్రహ్మచండాలసంసర్గప్రాప్తియందు బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తమునందర్ధమునువిధింపవలయును. గర్భధారణయయ్యెనేని యంతటితో దానిని వదలివేయవలయును. క్షత్రియాదులకును బూర్వోక్తప్రాయశ్చిత్తమును విధింపవలయుననియును మనువువచించె.

—⁕ రజస్వలాగమనప్రాయశ్చిత్తమ్. ⁕—

(౧౭౬) అథరజస్వలాగమన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ రాజకఃపుష్పవతీంభార్యాంద్విజఃకామాతురోయభైత్॥ మహాంతంనరకంగత్వారక్తస్రావిగుహోభవేత్॥ మార్కండేయః॥ శ్లో॥ విప్రోరజస్వలాంపత్నీంగచ్ఛేత్కామాతురస్సకృత్। మహావాగ్భవితారాజకరక్తస్రావీభవేచ్ఛవి॥ గాలవః॥శ్లో॥ యోవిప్రఃపంచబాణార్తోయభత్పత్నీంరజస్వలాం। నతస్యపునరావృత్తిస్స్యమలోకాద్భయంకరాత్। ప్రథమేహనియోగచ్ఛేచ్చండాలీగమనేచయత్। తత్కృత్వాశుద్ధిమాప్నోతిహ్యన్యథాదోషభాగ్భవేత్। ద్వితీయేహనిబ్రహ్మఘ్నీగమనేయదుదాహృతం। తదత్రాపిప్రయోక్తవ్యంనాన్యథాశుద్ధిమా

ఛ్నుయాత్। తృతీయేరజకీసంగెప్రాయశ్చిత్తంతదర్ధవై। కృత్వాశుద్ధిమవాప్నో తిఇహలోకే పరత్రచ॥ భవిష్యోత్తరే॥ శ్లో॥ ప్రథమేహనిచండాలీద్వితీయే బ్రహ్మఘాతినీ। తృతీయేరజకీప్రోక్తాచతుర్థేహనిశుధ్యతి। దినత్రయేపిగమనేత త్తత్స్త్రీగమనేయద్యత్పాపముదీరితం॥ తత్తత్ప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నోతి॥ పునస్సంస్కారశ్చ। విప్రస్త్రీణాంరజస్వలానాంపురుషసంసర్గే విప్రస్యార్ధంప్రాయశ్చిత్తం। క్షత్రియాదీనాంపూర్వవత్॥ ఇతిహేమాద్రౌరజస్వలాగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౭౬) రజస్వలాగమనప్రాయశ్చిత్తము॥ రజస్వలయగుభార్యనుబ్రాహ్మణుడుకామాతురుడైపొందెనేని గోప్పదగునరకమును బొంది పిమ్మట రక్తమును స్రవించు గుదస్థానముగలవాడైపుట్టునని దేవలుడువచించె. మార్కండేయుడునునిటులనేవచించె. బ్రాహ్మణుడుకామాతురుడై రజస్వలాస్త్రీని బొందెనేనియట్టివానికి యమలోకమునుండి పునరావృత్తిగలుగనేందు. మొదటిదినమునబొందినవానికి జండాలస్త్రీగమనమునకు విధించినప్రాయశ్చిత్తమును విధించవలయును. రెండవదినమునబొందినవానికి బ్రహ్మఘ్నిగమనప్రాయశ్చిత్తమును విధింపవలయును. మూడవదినమునబొందినవానికి రజకీసంగమనమునకు విధించినప్రాయశ్చిత్తమునే విధించవలయునని గాలవుడువచించె. రజస్వలమైనయాడుది మొదటిదినమునజండాలస్త్రీతుల్యురాలును, రెండవదినమునందుబ్రహ్మఘాతినియును, మూడవదినమునందురజకియనబడును. అట్టిప్రాయశ్చిత్తమును జేసికొనినపిదప మరలనుపనయనసంస్కారమునుగూడనొనర్పవలయును. బ్రాహ్మణస్త్రీలురజస్వలలై పురుషసంసర్గమునుబొందిరేని బ్రాహ్మణునకువిధించినప్రాయశ్చిత్తమునందు సగముప్రాయశ్చిత్తమునువిధింపవలయును. క్షత్రియాదులకుబూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధింపవలయుననియును భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడినది.

—— (✽) విధవాగమనప్రాయశ్చిత్తమ్. (✽) ——

(౧౭౭) అథవిధవాగమనప్రాయశ్చిత్తమాహ। దేవలః॥ శ్లో॥ బ్రాహ్మణోమదలోభేనవిధవాంవిప్రనందినీం। మత్తోథకామతోవాపిపశ్చాద్జ్ఞాత్వాసపాతివర్జితాఇతిమత్వావ్రజేద్గంధమాదనంపర్వతోత్తమం। తత్రచాపాదగమాత్సాద్యప్రాతస్స్నానాద్దినేదినే॥ మాసమాత్రేణశుద్ధస్స్యాన్నాన్యథాశుద్ధిరీరితా। మార్కండేయః॥ శ్లో॥ పూర్వజో విధవాంవిప్రనందినీంవిషయాతురః। అజ్ఞానాత్సకృదాగమ్యపశ్చాత్తాపపరాయణః॥ యదీచ్ఛేదాత్మనశ్శుద్ధించాపాదస్నానమాచరేత్। ఏతదజ్ఞానవిషయం॥ పరాశరః॥ శ్లో॥ జ్ఞాత్వావిప్రస్సకృద్గత్వావి

ధవాంకామపీడితః। తస్యాన్యా నిష్కృతిర్నాస్తి కారీషదహనాదృతే ॥ జాబాలిః॥ శ్లో॥ ఉభయోర్యదిసమ్మత్యా ద్విజః పాపమసంస్మరన్ । యథేచ్ఛశ్చాద్భుద్ధికామో మృతః కారీషవహ్నినా। శుద్ధిమాప్నోతి రాజేంద్ర అథవా భూపరిక్రమాత్। త్రివారంత్వశ్మం పరిక్రమ్య పునస్సంస్కారపూర్వకం॥ పంచగవ్యం పిబేత్పశ్చాచ్ఛుద్ధిమాప్నోతి పార్థివకీం। ఏతద్గర్భధారణవిషయం॥ శివరహస్యే॥ శ్లో॥ యో విప్రో విధవాం సాధ్వీం గచ్ఛేదా గర్భధారణాత్। స చండాలసమో జ్ఞేయస్తస్యాస్త్యాగో విధీయతే॥ గర్భధారణే పతితప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి॥ గర్భధారణవిషయమేవ విశేషమాహ॥ నాగరఖండే॥ శ్లో॥ వర్ణత్రయాద్వా విధవా సవర్ణాద్యదిగర్భిణీ। విప్రైస్తస్యాః పరిత్యాగః కార్యో ధర్మపరాయణైః। తద్దర్శనే మహాపాపమవాప్నోతి హి పూర్వజః॥ విష్ణుధర్మోత్తరే॥ శ్లో॥ వర్ణత్రయాత్సవర్ణాద్వా విధవా గర్భిణీ యది। తస్యా దర్శనమాత్రేణ బ్రహ్మహత్యామవాప్నుయాత్॥ అతస్త్యాగో మునిశ్రేష్ఠా అన్యథా కిం ప్రయోజనం। గర్భే త్యాగో విధీయత ఇతి మనువచనం సర్వత్రానుసంధేయం॥ విధవాయా విప్రస్యార్థం ప్రాయశ్చిత్తం॥ క్షత్రియా వైశ్య పురుషగమనే ద్విగుణం ప్రాయశ్చిత్తం। క్షత్రియాదీనాం విప్రప్రాయశ్చిత్తాద్ద్విగుణం॥ ఇతి హేమాద్రివిరచితే విధవాగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౭౭) విధవాగమనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు ॥ బ్రాహ్మణుడు కామాతురుడై భర్తలేని బ్రాహ్మణస్త్రీని బొందెనేని పాపవంతుడగును. పిమ్మట దత్పాపోపశమనముకొఱకు గంధమాదనపర్వతమునకుఁ బోవలయును. పిమ్మట ధనుష్కోటియందు ముప్పదిదినములవఱకు ప్రతిదినమునందును స్నానమును జేసినయెడల పరిశుద్ధుడగునని దేవలుడు చెప్పె. బ్రాహ్మణుడు విధవయగు విప్రాంగనను, కామాతురుడై యజ్ఞానమువలనబొంది పిమ్మట బశ్చాత్తాపపరాయణుడై యాత్మశుద్ధిని గోరదలచినయెడల ధనుష్కోటియందు స్నానమును జేయవలయుననియును, ఇది యజ్ఞానవిషయమనియును మార్కండేయమునివరుడు వచించె. బ్రాహ్మణుడు బుద్ధిపూర్వకముగ విధవయగు విప్రాంగనను బొందెనేని యట్టివానికి కారీషవధకంబె నన్యమగుప్రాయశ్చిత్తమేదియును లేదని పరాశరుడు వచించె. బ్రాహ్మణుడును, విధవయగు విప్రాంగనయు ననునిరువురు సంగీకారపూర్వకముగ సురతక్రీడలనొనర్చిరేని యయ్యిరువురును పాపవంతులనబడుదురు. అందు బురుషుడు పశ్చాత్తాపపరాయణుడై పరిశుద్ధతనుబొందదలచినయెడల నేరుపిడకలనిప్పుచేత దగ్ధుడుకావలయును. అట్లుగాదేని మూడుపర్యాయములు భూప్రదక్షిణమును జేసి మరలనుపనయ

నసంస్కారమునుబొందియనంతరమందు బంచగవ్యప్రాశనమును జేసినయెడల బరిశుద్ధుడగుననియును నిదిగర్భధారణవిషయమనియును జాబాలివచించె. బ్రాహ్మణుడు పాతివ్రత్యమును నవలంబించియున్నవిధవాంగనతో గర్భధారణయగువరకును సంభోగమును బొందియున్నయెడల వాడుచండాలతుల్యుడగును. కావుననట్టివానిని బరిత్యాగమునుజేయవలయును. గర్భధారణయయ్యెనేని పతితప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుడగునని శివరహస్యమునందు జెప్పబడియె. విధవాంగనతనవర్ణముకంటె నితరములగువర్ణముల వారితోడనైనను, సమానవర్ణస్థునితోనైనను, సంభోగించిగర్భవతియయ్యెనేని బ్రాహ్మణులందఱును దానినికులములోనుండి పరిత్యాగమును జేయవలయును. అట్టిదానినిజూచినయెడల మహాపాపముసంభవించునని నాగరఖండమునందుజెప్పబడియె. వర్ణత్రయమువలననైనను, సవర్ణమువలననైనను, విధవాంగనగర్భవతియయ్యెనేని యట్టిదానినిజూడగూడదు. చూచినయెడలబ్రహ్మహత్యకుదుల్యమైనపాపమువచ్చును. కావుననట్టిదానిని కులములోనుండిబహిష్కారమును జేయవలయును. మనువునకునుసిదియేయభిప్రాయమనియును విధవాంగనకు బ్రాహ్మణునకు విధించినప్రాయశ్చిత్తమునందు సగముప్రాయశ్చిత్తమునువిధింపవలయుననియును, క్షత్రియవైశ్యగమనమునందు ప్రాయశ్చిత్తమును ద్విగుణముగనాచరింపవలయుననియును, క్షత్రియాదులకువిప్రప్రాయశ్చిత్తముకంటె ద్విగుణాధికముగ జేయవలయుననియును విష్ణుధర్మోత్తరమునందు జెప్పబడియె.

——(*) వేశ్యాగమనప్రాయశ్చిత్తమ్. (*)——

(౧౭౮) అథవేశ్యాగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ద్విజఃకామాతురో వేశ్యాంయ ఏకోదినంముదా। నతస్యనిత్యపుణ్యాని నశ్యంత్యత్ర నసంశయః॥ స్కాందే॥ శ్లో॥ ద్విజఃకామాతురో వేశ్యాంనిత్యం యదియభద్భవి। తస్యనిత్యవిధిర్నష్టస్సద్యఏవనసంశయః॥ నిత్యకర్మపరిత్యాగాత్పతితస్స్యాన్నసంశయః॥ యదీచ్ఛేచ్ఛుద్ధిమతులామబ్దంకృచ్ఛ్రమాచరేత్॥ పునస్సంస్కారమత్రైవ కృత్వాశుద్ధిమవాప్నుయాత్। క్షత్రియాదీనామేవమేవ॥ ఇతిహేమాద్రివిరచితే వేశ్యాగమనప్రాయశ్చిత్తమ్॥

(౧౭౯) వేశ్యాగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడుకామాతురుడై వేశ్యాంగనతో నొక్కదినమునురతక్రీడలనుసల్పినను వానిపుణ్యములన్నియును నాశమునుబొందునని దేవలుడువచించె. బ్రాహ్మణుడుకామాతురుడై యనుదినమునందును వేశ్యనుబొందినయెడల నట్టివానికినిత్యవిధియంతయునునశిం

చును. నిత్యకర్మలయొక్క పరిత్యాగమువలన బతితుడగును. అట్టిపాపాత్ము డు పరిశుద్ధతనుబొందదలచినయెడల షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరింపవ లయును. మఱియు పునస్సంస్కారమును బొందవలయును. ఇట్లు చేసినయెడ ల పరిశుద్ధుడగును. క్షత్రియాదులకును నిటులనే యెఱిగియవలయునని స్కాం దపురాణమునందు జెప్పబడియె.

——(*) దాసీగమనప్రాయశ్చిత్తమ్. (*)——

(౧౭౯) అథదాసీగమనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ దాసీం ద్విజో యదాగచ్ఛేత్స్వధర్మం నావలోకయన్। మహాపాపమవాప్నోతిమ హాహానిశ్చ జాయతే॥ మార్కండేయః॥శ్లో॥ దాసీమానధనంహంతి వేశ్యా హంతితపోయశః। విధవాయుశ్శ్రియంహంతిసర్వం హంతిపరాంగనా॥ అ తో దాసీనగం తవ్యాకర్మణామనసాగిరా। ఏకస్మిన్నహ్నియో దాసీంయ భేత్కామాతురస్సకృత్॥ యావకం త్రికతర్తవ్యం పరాకంతుదినత్రయే। ప్రాజాపత్యంతథా మాసేవర్షేచాంద్రం పృథక్పృథక్॥అతఃపరం సమా ప్నోతి చండాలత్వంవిగర్హితః॥ సంవర్తః॥ శ్లో॥ శూద్రాన్నం శూద్రసం పర్కంమాసమేకంనిరంతరం। ఇహజన్మనిశూద్రత్వంచండాలః కోటిజన్మసు॥ వర్షాత్పరం పతితప్రాయశ్చిత్తం కృత్వా దాసీగమనపాపాత్పూతో భవ తి॥ పునస్సంస్కారశ్చ॥ఇతిహేమాద్రివిరచితే దాసీగమనప్రాయశ్చిత్తం॥

(౧౭౯) ఇకను దాసీగమన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడు కామాతురుడై స్వధర్మమును బరిత్యజించి దాసితో సంభో గమును జేసిన యెడల మహాపాపవంతుడగుననియును, గొప్పదగు హాని సంభవించుననియును, గలుగునని దేవలుడు వచించె. దాసి మానధనముల ను గెంటిని నశింపజేయును. వేశ్యతపస్సును, కీర్తిని నశింపజేయును. విధ వాంగన యాయుస్సును, సంపదను హరింపజేయును. పరస్త్రీ సర్వమును హరించును. కావున మనోవాక్కాయ కర్మములతోగూడ దాసీసంగమ మును జేయగూడదు. కామాతురుడై యొక్కదినము దాసీసంగమమును జేసినను పాపవంతుడగును. అట్టి పాపమునశనము కొఱకు యావక ప్రా యశ్చిత్తమును జేసికొనవలయును. మాసముకాలము దాసీగమనమును జేసి నవాడు ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరింప వలయును. సంవత్సరకాల మ ట్టిదుష్కృత్యమును జేసినవాడు చాంద్రాయణ వ్రతము నాచరింప వలయు ను. సంవత్సరకాలముకంటె నధికకాలము గూడ దాసీసంగమమును జేయు వాడు చండాలత్వమును బొందునని మార్కండేయమునివరుడు వచించె

ఒకమాసము దినముల కాలము నిరంతరమును శూద్రాన్నమును భుజించి శూద్రసంపర్కమును జేసినవాఁడీజన్మమందు శూద్రత్వమును బొందుటయే గాక కోటిజన్మలయందుగూడ చండాలుఁడై పుట్టును. వర్షానంతరమందుఁగూడ నీదుష్కృత్యమును జేసియును శుద్ధతను బొందవలయునని తలఁచిన యెడల పతితప్రాయశ్చిత్తమును జేసికొననేని పరిశుద్ధుఁడగునని సంవర్తుఁడు వచించె.

——* పాషండపతితశూద్రస్త్రీగమనప్రాయశ్చిత్తమ్. *——

(౧౫౦) అథ పాషండపతిత శూద్ర స్త్రీగమనే ప్రాయశ్చిత్త మాహ॥ దేవలః ॥ శ్లో॥ బౌద్ధపాషండపతిత శూద్రస్త్రీణాం సకృద్ద్విజః। రతింకృత్వాదినాభ్యాసే చాంద్రాయణ మథాచరేత్।దినత్రయేయావకంచతత్తంమాసేప్రకల్పితం। వర్షాదూర్ధ్వం నసంభాష్యః పతితస్సర్వకర్మసు॥మార్కండేయః ॥ శ్లో ॥ పాషండబౌద్ధపతిత శూద్రాణాం స్త్రీర్యథేద్ద్విజః। దినత్రయేయావకంస్యాత్తత్తంమాసేప్రకీర్తితం ॥ షణ్మాసేచాంద్రమిత్యేవ వర్షేపతతిసద్విజః। పతితప్రాయశ్చిత్తం వర్షాదూర్ధ్వం కృత్వాశుద్ధ్యతి॥ గర్భే పుత్రజననే వాతస్యపరిత్యాగఏవ ॥ తదేవాహమనుః ॥ శ్లో॥ ఏతేషాంస్త్రీషుయోవిప్రో రమయన్ప్రత్యహంఖలః । గర్భేవాపుత్రజననే బహిష్కారో విధీయతే ॥ యదీచ్ఛేత్పుత్రవాత్సల్యాత్పితానరకమశ్నుతే। సంసర్గాత్తస్యరౌద్రపాతిత్యంభవతిధ్రువం ॥ పాపకృన్నభవేత్పుత్రస్సశత్రురితికీర్తితః । తస్మాదేనంపరిత్యజ్య పితాసుఖపరాయణః ॥ తథాచశ్రుతిః ॥ శ్లో॥ సశూద్రయోనిసంభవోన్నేతసాసించతేపిత్రూన్ పిత్రుద్రోహీతి । అతశ్శూద్రస్త్రీషుపుత్రముత్పాదయన్ పుత్రస్త్యాజ్యఏవ ॥ ఔరసం దోషకారిణంత్యజేదితి వచనాత్ ॥ ఇతి హేమాద్రివిరచితే పాషండబౌద్ధపతిత శూద్రస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్ ॥

(౧౮౦) పాషండపతితశూద్రస్త్రీగమన ప్రాయశ్చిత్తము ॥ బ్రాహ్మణుఁడు కామాతురుఁడై బౌద్ధపాషండపతిత శూద్రస్త్రీలతో నొకపర్యాయము సంభోగమును జేసినను, ఈకృత్యము నభ్యాసకృత్యమునుగా జేసిన యెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. మూఁడుదినములీకృత్యమును జేసినవాఁడు యావకాహారుఁడు గావలయును. మాసముదినములీకృత్యమును జేసినవాఁడు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. సంవత్సరానంతరమందుఁ గూడ నీదుష్కృత్యమును జేసినవాఁడు సర్వకర్మబహిష్కృతుఁడగును. మఱియును పతితుఁడనఁబడును. కావున నట్టి

వానితో సంభాషణనుగూడఁ జేయఁగూడదని దేవలుఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు పాపంబౌద్ధపతిత శూద్రుల భార్యలను బొందెనేని పాపాత్ముఁ డగుననియును, దేవలవచనానుసారముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయుననియును మార్కండేయ మునివరుఁడువచించె. ఇప్పుడుచెప్పఁబడినస్త్రీలను బొందు బ్రాహ్మణునివలన నాస్త్రీలకు గర్భధారణయయినను, పుత్రుఁడు గలిగినను, అట్టివానిని కులమువారు బహిష్కారమును జేయవలయును, పుత్రవాత్సల్యమువలన నిచ్చయించిన తండ్రినరకమును బొందును, అట్టవానిసంసర్గమువలన పాతిత్యముగలుగును, ఆపుత్రుఁడు పాపకారిగాక పోయినను శత్రువుఁడగును, కావుననట్టివానినివదలిన తండ్రిమిగుల సుఖవంతుఁడగునని మనువు వచించె. శూద్రయోనియందు రేతస్సునువదలి పుత్రునిగనినవాఁడు పితృద్రోహియనఁబడుననియును, అట్టికార్యమును జేయునట్టి పుత్రుని వదలవలయుననియును వేదముచేఁగూడ జెప్పఁబడెను ॥

—* మద్యపస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్. *—

(౧౮౧) అథమద్యపస్త్రీగమనప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో॥ మద్యపాన రతాంనారీం ద్విజః కామాతురస్సకృత్ । గచ్ఛేద్యదీహ పాపాత్మా చండాలత్వమవాప్నుయాత్ ॥ గౌతమః ॥ శ్లో ॥ ద్విజః కామాతురో గచ్ఛేత్ స్త్రియం మద్యపరాయణాం । మహాంతంనరకంగత్వా చండాలత్వం భజేదిహ ॥ మార్కండేయః ॥ శ్లో॥ మద్యపానరతాంనారీం ద్విజః కామాతురోయదేత్ । అనుభూయాథనరకం చండాలత్వమవాప్నుయాత్॥ షడబ్దంమాసమాత్రేతు షణ్మాసే చాంద్రభక్షణం వత్సరేపతితో భూయాచ్చరేత్పతితనిష్కృతిం ॥ తస్యోపనయనంభూయః పంచగవ్యమతఃపరం । విప్రస్త్రీణాం మద్యపపురుషసంసర్గే విప్రప్రాయశ్చిత్తార్థం ॥ క్షత్రియాదీనాం పూర్వవత్ ॥ ఇతి హేమాద్రివిరచితే మద్యపస్త్రీగమన ప్రాయశ్చిత్తమ్ ॥

(౧౮౧) ఇకనుమద్యపానమును జేయువానిభార్యను బొందినవానికి ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ మద్యపానమును జేయునట్టి వానిభార్యను కామాతురుఁడైబొందిన బ్రాహ్మణుఁడు పాపాత్ముఁడగుటయేగాక చండాలత్వమును బొందుననిదేవలుఁడువచించె. గౌతముఁడునునిట్లనేవచించె. మార్కండేయుఁడునునిట్లనేచెప్పి ప్రాయశ్చిత్తమునుగూడవిధించె. అదియెట్లనిన నెలదినములీదుష్కృత్యమును జేసినవాఁడు షడబ్దసంజ్ఞికప్రాయశ్చిత్తము నాచరించవలయును, ఆఱుమాసములుచేసినవాఁడు చాంద్రాయణమును చరించవలయును, సంవత్సరకాలమీ దుష్కృత్యమును జేసినవాఁడుపతితుఁడగును, కావున

నట్టివాఁడు పతితప్రాయశ్చిత్తమును జేసికొని పిమ్మటఁ బునరుపనయన సంస్కారమును బొంది యనంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. క్షత్రస్త్రీలు మద్యపానమును జేయునట్టి పురుషసంసర్గమును బొందిన యెడల బ్రాహ్మణునకు విధించినప్రాయశ్చిత్తమునందర్ధమును విధించవలయును. క్షత్రియాదులకు పూర్వోక్తప్రకారముగ విధించవలయును.

——— ఋతుకాలపరిత్యాగప్రాయశ్చిత్తమ్. ———

(౧౮౭) అథఋతుకాల పరిత్యాగ ప్రాయశ్చిత్తమాహ। దేవలః॥ శ్లో॥ ఋతుస్నాతాంతుయోభార్యాం స్వస్థస్సన్నోపగచ్ఛతి । భ్రూణహత్యా మవాప్నోతి నరకంచాధిగచ్ఛతి॥ ఋతుకాల వ్యతిక్రమె హేతుమాహ॥ శ్లో॥ వ్రతశ్రాద్ధాదికాలేషు పంచపర్వసుచద్విజః। భార్యామృతుమతీంస్నాతాంయోగచ్ఛేత్సతుపాపభాక్॥ మరీచిః॥ శ్లో॥ ఋతుకాలేసమాయాతే శ్రాద్ధకాలఉపస్థితే । వ్రతకాలేతథా రాజన్నభయంనపరిత్యజేత్ ॥ తయోర్ద్వయోర్బలీయాన్ సశ్రాద్ధకాలోమహత్తరః॥ ఋతౌర్దినానిసంత్యేవ శ్రాద్ధాదిషునసంతిహి॥ అతశ్శ్రాద్ధాదికాలశ్చ నత్యాజ్యోవిప్రపుంగవైః ॥ శ్రాద్ధవ్రతపరిత్యాగ దోషబాహుళ్యాతాల్పస్యాసంభవాచ్చ శ్రాద్ధాదికాలోబలవాన్ । ఋతుకాలస్యషోడశదినానిసంతి॥ రోగాదిరహితౌభర్తా పుత్రకామీసమదినేషు శ్రాద్ధవ్రతాదిరహితేషు సంసర్గంకుర్యాత్॥ తదేవాహ॥ కాత్యాయనః॥ శ్లో॥ ఋతుస్నాతాంద్విజోభార్యాం వ్రతశ్రాద్ధవివర్జితే । స్వయంచరోగరహితో యశ్చేత్సంతానకామ్యయా॥ అన్యథా దోషమాప్నోతి ప్రాయశ్చిత్తమిహార్హతి॥ మహారాజవిజనే॥ శ్లో॥ అనిమిత్తతయావిప్రః పత్నీమృతుమతీంత్యజన్ । భ్రూణహత్యామవాప్నోతి ప్రాజాపత్యం సమాచరేత్॥ నిమిత్తైఃపూర్వోక్తైర్వినాఋతుమతీం భార్యాంసంత్యజన్విప్రః ప్రాజాపత్యంకృత్వాదోషముక్తోభవేత్॥ బృహత్పరాశరః॥ శ్లో॥ ఋతౌనగచ్ఛేద్యోభార్యాంసోపికృచ్ఛ్రార్ధమాచరేదితి॥ ఇతిహేమాద్రివిరచితే ఋతుకాలపరిత్యాగప్రాయశ్చిత్తమ్॥

(౧౮౭) ఇఁకను ఋతుకాల పరిత్యాగమునకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఋతుస్నాతయైనభార్యను స్వస్థుఁడయ్యును బొందనిబ్రాహ్మణుఁడు భ్రూణహత్యవలనఁ గలిగెడి పాపముగలవాఁడగును. అట్టి పాపమువలన నరకలోకమును బొందును. ఋతుస్నాతయై యున్నను, వ్రతశ్రాద్ధాదికాలములయందును, పంచపర్వములయందును సంభోగమును జేయఁగూడదు. అట్లుగాక చేసినవాఁడు మహాపాపవంతుఁడగునని దేవలుఁడు

వచించె. ఋతుకాలశ్రాద్ధకాలములు రెండును నొకపర్యాయము సంభవించెనేని శ్రాద్ధకాలమే యెక్కువయనియెంచి శ్రాద్ధకాలమును పరిత్యజింపఁగూడదు. ఋతుదినములు పదునారుకావున శ్రాద్ధాద్యనంతర దినమునందు భార్యాసంగమమును బొందవలయును. రోగాదులులేని భర్తపుత్రకామునై సమదినములయందు శ్రాద్ధవ్రతాదులు లేనియెడల భార్యతో సంగమమును బొందవలయుననియును వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు ఋతుస్నాతయగు భార్యను శ్రాద్ధాదులులేనికాలమునందును, రోగాదిరహిత సమయములయందును సంభోగింపనివానికి ప్రాయశ్చిత్తమును విధింపవలయునని కాత్యాయనుఁడు చెప్పె. శ్రాద్ధాది నిమిత్తములులేనికాలమునందు బ్రాహ్మణుఁడగువాఁడు ఋతుమతియగు భార్యను పరిత్యజించినవాఁడు భ్రూణహత్యనుబొందినవాఁడగును. కావున దత్పాపోపశమనము కొఱకు ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరింపవలయునని మహారాజవిజయమునందుఁజెప్పఁబడియె. ఋతుకాలమునందు భార్యాసంగమమును బొందనివాఁడు కృచ్ఛ్రార్థము నాచరింపవలయునని బృహస్పరాశరుఁడు వచించె.

——— కన్యాగమన ప్రాయశ్చిత్తమ్. ———

(గల౩) అథకన్యాగమన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఆ ప్రౌఢాంకన్యకాంవిప్రో యభేత్కామాతురోన్వహం। తస్యైవనరకేవాసః కానీనస్యత్తదుద్భవః॥ మార్కండేయః॥ శ్లో॥ అసంస్కృతాం పుష్పహీనాం కన్యకాం యోద్విజాధమః। గంతుమిచ్ఛతిపాపాత్మా నరకంయాతిదారుణం॥ పరాశరః॥ శ్లో॥ ముఖజోముఖజాజ్జాతాంకన్యాంయస్సంపరిగ్రహేత్। సవీవనరకస్థాయీ యావదాభూతసంప్లవం॥ ప్రాజాపత్యంతదామాసే వర్షైచాంద్రం ప్రకల్పితం। అతఃపరమశుద్ధస్స్యాత్సురాపూరితభాండవత్॥ వర్షాదూర్ధ్వం పతితప్రాయశ్చిత్తం కృత్వావిశుద్ధిమాప్నోతి। విప్రస్తుక్షత్రియ వైశ్యకన్యాసంసర్గె పూర్వోక్తప్రాయశ్చిత్తం పాదహీనంకృత్వా శుద్ధ్యేత్॥ శూద్రకన్యాగమనెపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే కన్యాగమనప్రాయశ్చిత్తమ్॥

(గల౩) కన్యాగమనప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు కామాతురుఁడై ప్రతిదినమునందును ప్రౌఢురాలుగున కన్యనుబొందినయెడల నట్టివానికి నరకావాసము గలుగును. అట్టికన్యకకు బుట్టినవాఁడు కానీనుఁడని దేవలుఁడు సెప్పె. అసంస్కృతురాలును, ఋతుమతియును, అగు కన్యకను బొందిన బ్రాహ్మణుఁడు దారుణమగు నరకమునుబొందునని మార్కండేయ మునివ

రుడు సెప్పె. బ్రాహ్మణుడగువాడు బ్రాహ్మణకన్యను వివాహముగాకమును పు పరిగ్రహించినయెడల ప్రళయకాలము దనుక నరకలోకమును బొంది యుండును. ఇట్టి దుష్కృత్యము నొక్కమాసముకాలము సేసినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. సంవత్సరకాలము సేసినవాడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. సంవత్సరానంతరమందుగూడ నిట్టి కృత్యమును జేసినవాడు మద్యముభాండమువలె బహిశుద్ధుడగును. కావునసంవత్సరానంతరమందుగూడ జేసినవాడు పతితప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుడగును. బ్రాహ్మణునకు క్షత్రియవైశ్యకన్యాగమనమునందు పూర్వోక్తప్రాయశ్చిత్తమును పాదహీనముగ జేసికొనినయెడల పరిశుద్ధుడగును. శూద్రకన్యాగమనమునందు పూర్వోక్తప్రాయశ్చిత్తము నాచరింపవలయునని పరాశరుడుపదించె.

—— కన్యాదూషణప్రాయశ్చిత్తమ్. ——

(౧౮౪) అథకన్యకాదూషణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ద్విజోయోదక్షిణాంకన్యాం సభామధ్యేవినిందయేత్ । సఏవపాపకర్మాస్యాన్మృత్వానరకమశ్నుతే॥ గౌతమః॥ శ్లో॥ యోవిప్రోదక్షిణాంకన్యాం వినిందయతిసర్వదా। సగత్వానరకంఘోరం భువిభూయాన్మృతప్రజః॥ కన్యాదూషణంతు మధ్యమానామికాభ్యాం యోనిప్రవేశంకృత్వాశోధనం॥ తదాహజాబాలిః॥ శ్లో॥ మధ్యమానామికాభ్యాంహి కన్యాయోనిప్రవేశనే । కుర్యాత్ప్రవేశనంవిప్రస్తత్కన్యాదూషణంవిదుః॥ నవివాహ్యాత్వజైస్తాంతు యోనిదేశంశోధనాత్ । ప్రాయశ్చిత్తమిదంకుర్యాత్ కన్యాదూషణదోషభాక్॥ చాంద్రాయణత్రయంకృత్వా శుద్ధిమాప్నోతిపోక్షితః । అదక్షిణాదూషణేత్వేవం॥ ఇతిహేమాద్రివిరచితేకన్యాదూషణప్రాయశ్చిత్తమ్॥

(౧౮౪) కన్యాదూషణప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడగువాడు దక్షిణురాలగు కన్నియను సభామధ్యమందు నిందించినయెడల పాపవంతుడగును. కావున నట్టివాడు నరకమునుబొందునని దేవలుడు సెప్పె. గౌతముడును నిటులనేచెప్పి రెండవజన్మయందు మృతప్రజగలవాడై పుట్టుననియె. కన్యకాదూషణమనగా మధ్యమానామికములను వేళ్ళనుయోనియందు బ్రవేశింపజేసి శోధించుటయని యెఱుంగవలయునని జాబాలిచెప్పె. మఱియునట్టి కన్నియను వివాహముసేసికొనగూడదనియె. అట్టి దుష్కృత్యమును జేసినవాడు చాంద్రాయణవ్రతము నాచరించినయెడల పరిశుద్ధుడగుననియె. అద

క్షీణురాలగు కన్నియను దూషించినవానికిని నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయును.

## — పుంసిమైథునప్రాయశ్చిత్తమ్. —

(౧౮౫) అథపుంసిమైథునప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యో విప్రఃపురుషంగచ్ఛేత్పంచబాణాతురఃఖలః। స్వదారేషు ముఖేవాపి యభేత్పాపపరాయణః॥ తస్యవీర్యంతురత్యాశు మృతోనరకమశ్నుతే॥ మార్కండేయః॥ శ్లో॥ యోవిప్రఃపుంసిసంసర్గం స్వదారేషురతింముఖే। కుర్యాద్యది మహాపాపాత్మాతద్రేతః క్లీబతామగాత్॥ యమలోకముపాగమ్య తత్రవాసస్సదాభవేత్। తస్యాన్యానిష్కృతిర్నాస్తి పునస్సంసారణంవినా॥ నారదః॥ శ్లో॥ స్వదారేషుముఖేరాజన్ యభేద్యఃపురుషంద్విజః। తస్యవీర్యంతు యంయాతి సవైనరకమశ్నుతే॥ పశ్చాత్తాపమవాప్యాథ యదీచ్ఛేచ్ఛుద్ధిమాత్మనః। ఏకస్మిన్దివసేతప్తం మాసేచాంద్రంసమాచరేత్॥ అబ్దాత్పరంను నిశ్చేష్ట షడబ్దంకృచ్ఛ్రమాచరేత్। తస్యోపనయసంస్కారః పటగర్భవిధానతః। పంచగవ్యంపిబేత్పశ్చాత్పూతోభవతిసర్వదా॥ ఇతి హేమాద్రివిరచితే పుంసిమైథునప్రాయశ్చిత్తమ్॥

(౧౮౫) పురుషమైథునప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుడు కామాతురుడై పురుషునితో సంభోగించినను, భార్యయొక్కముఖమునందు సంభోగించినను, నరకలోకమును బొందునని దేవలుడు వచించె. మార్కండేయమునివరుడును నిటులనేచెప్పి యమలోకమునందు పునరావృత్తిలేకయుండునని యును, అట్టివానికి బునస్సంస్కారముకంటె భిన్నమగు ప్రాయశ్చిత్తమేదియునులేదనియును చెప్పె. భార్యాముఖమునందు సురతకర్మను జరిపినవాని వీర్యమునాశమునుబొందును. మఱియును పునరావృత్తి రహితముగ నరకలోకమును బొందును. అట్టిపాపాత్ముడు నిజపాపమును బోగొట్టుకొనదలచిన యెడల ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిననొకదినమందీకృత్యమును జేసినవాడు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మాసముదినము లీకృత్యమును జేసినవాడు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. సంవత్సరకాలముకంటె నెక్కువగు కాలమునందీకృత్యమును జేసినవాడు షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. పటగర్భవిధానానుసారముగ బునరుపనయసంస్కారమును జేసికొనవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనను జేసికొనవలయును. ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల బరిశుద్ధుడగును.

——* ఖరోష్ట్రాదిమైథునప్రాయశ్చిత్తమ్ *——

(౧౮౬) అథఖరోష్ట్రాదిమైథునప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఖరముష్ట్రించబడబాంః ప్రాయదిమదాంధవాక్। యఃభేద్యఃహపాపాత్మా రౌరవంనరకంవ్రజేత్॥ వసిష్ఠః॥ శ్లో॥ బడబాఖరముష్ట్రించ విప్రఃకామాతురస్సకృత్। యఃభేల్లజ్ఞాంవిహాయాశు సవైనరకమశ్నుతే॥ జాబాలిః॥ శ్లో॥ ఖరముష్ట్రించబడబాం యభేద్విప్రోమదాతురః। రౌరవంనరకంయాతి యావదాభూతసంప్లవం। తస్యదోషవినాశార్థం ప్రాయశ్చిత్తముదీరితం॥ ఖరేచాంద్రంతథోష్ట్రేచ పరాకంబడబాగమే। ఏతేనశుద్ధిమాప్నోతి పునస్సంస్కారపూర్వకం, పంచగవ్యం పిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతినిశ్చయ ఇతి॥ క్షత్రియవైశ్యయోర్విప్రోక్త ద్విగుణంప్రాయశ్చిత్తంవిశోధనం॥ ఇతిహేమాద్రివిరచితే ఖరోష్ట్రబడబాసంసర్గప్రాయశ్చిత్తమ్॥

(౧౮౬) ఖరోష్ట్రాదిమైథునప్రాయశ్చిత్తము॥ గాడిదెను,ఒంటెను, ఆడుగుఱ్ఱమును బ్రాహ్మణుఁడు కామాంధుఁడై సంభోగించిన యెడల రౌరవమను నరకమును బొందునని దేవలుఁడు వచించె- వసిష్ఠుఁడు నిటులనే చెప్పె. జాబాలియును నిటులనే చెప్పి ప్రాయశ్చిత్తమును గూడ దెలిపె- అదియెట్లనిన గాడిదెను ఒంటెను బొందినవాఁడు చాంద్రాయణవ్రతమును నాచరింపవలయును, ఆడుగుఱ్ఱమును బొందినవాఁడు పరాకకృఛ్రము నాచరింపవలయును- మఱియును బునరుపనయన సంస్కారముఁబొంది పంచగవ్యప్రాశనను గూడ చేసికొనవలయును, ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుఁడగును- క్షత్రియవైశ్యులు బ్రాహ్మణునకు విధించిన ప్రాయశ్చిత్తముకంటె ద్విగుణాధికముగ నాచరింపవలయును॥

——* వత్సమహిషీబస్తాజాదిగమనప్రాయశ్చిత్తమ్ *——

(౧౮౭) అథవత్సమహిషీబస్తాజాదిగమనేప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ బస్తాంవామహిషీంవత్స మజమేణాదికంతువా। యభేద్ద్విజో మహాపాపీసద్యఃపతితుమర్హతి॥ పరాశరః॥ శ్లో॥ బస్తంమేషం తథావత్సం మహిషీంమదనాతురః। విప్రోయదిరమేత్సోపి యమలోక మవాప్నుయాత్॥ నాగరఖండే॥ శ్లో॥ వత్సంమేషంతథాబస్తం మహిషీ ముఖసంభవః। యభేత్కామాతురః పాపీన్యత్వానరకమశ్నుతే॥ తస్యదేహవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యముదీరితం। వత్సేబస్తేతథామేషె తప్తకృచ్ఛ్రంవిశోధనం। మహిష్యాంచహరిణ్యాంచ ప్రాజాపత్యద్వయంచరేత్॥ పునస్సంస్కార మత్రైవ కృత్వాశుద్ధిమవాప్నుయాత్। పంచగవ్యంపిబేత్పశ్చాదభ్యాసే చాంద్రమాచ్య

తే ॥ క్షత్రియవైశ్యయోర్ద్విగుణం ॥ ఇతి హేమాద్రివిరచితే వత్సబస్త మహిష్యాదిగమనప్రాయశ్చిత్తమ్।

(౧౮౭) వత్సమహిషీ బస్తాజాదిగమన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ మేక, గొఱ్ఱె, ఎనుము, లేడి, వత్స, అనువానితో సురతక్రీడలనుసల్పినవాఁడు పతితుఁడగునని దేవలుఁడువచించె. గొఱ్ఱెను, మేకను, వత్సమును, ఎనుమును, కామాతురుడై పొందినబ్రాహ్మణుఁడు యమలోకమునుబొందునని పరాశరుఁడువచించె. నాగరఖండమునందుఁగూడ నిటులనేచెప్పఁబడియె. మఱియును ప్రాయశ్చిత్త గూడఁజెప్పఁబడియె- అదియెట్లని నవత్స,బస్త, మేషములనుబొందినవాఁడు తత్పాపనివారణకొఱకు తప్తకృఛ్రప్రాయశ్చిత్తము నాచరింపవలయును- మహిషీ హరిణములను బొందినవాఁడు రెండుప్రాజాపత్యముల నాచరించుకొనవలయును, ఇంతయగాక పునరుపనయన సంస్కారమును జేసికొనవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనము జేయవలయును, ఈనుపర్యాయమున భ్యాస పూర్వకముగ నాచరించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును, క్షత్రియవైశ్యులకీ ప్రాయశ్చిత్తమును ద్విగుణాధికముగ విధింపవలయును ॥

—❋ రేతోత్సర్గప్రాయశ్చిత్తమ్- ❋—

(౧౮౮) అథ కటాదౌ రేతోత్సర్గ ప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః ॥ శ్లో ॥ అయోనౌచ వియోనౌచ పశుయోనౌచ భారత । సముత్సృజతి యశ్శుక్లం తెవెనియగామినః । అన్యయోనిర్వస్త్రాదిః ॥ వియోనిః కాకాదిః । పశుర్గో అశ్వాదిః ॥ నారదః ॥ శ్లో ॥ కటాదౌ పశుపక్ష్యౌ ఛా జలెవావహ్నౌ సుధ్యతిః । విప్రః కామాతురఃసాక్షీ రేతోత్సర్గంయదాచరేత్ । తదాయమపురంగత్వా తిష్ఠత్యాచంద్రతారకం ॥ మనుః ॥ శ్లో ॥ పశుష్వేజలేమార్గె కబెవాభీజముత్సృజన్ ॥ సగచ్ఛేన్నరకంఘోరంపునరావృత్తిదుర్లభం । పతేన్న్యగ్నాత జానీంవా సచేలం స్నానమాచరేత్ । జపేత్సహస్రంగాయత్రీం తతశ్శుద్ధిమవాప్నుయాత్ ॥ నాన్యథాశుద్ధిర స్త్రీహత్యపాపానుత్తమె । గృహస్థఃకామతఃకుర్యాద్రైత్యసస్థలనంభువి॥ సహస్రంతు జపేద్దేవ్యాః ప్రాణాయామైస్త్రిభిస్సహ । క్షత్రియ వైశ్య యోర్ద్విప్రప్రాయశ్చిత్తాద్ద్విగుణం॥ ఇతి హేమాద్రివిరచితే కటాదౌ రేతోత్సర్గప్రాయశ్చిత్తమ్ ॥

(౧౮౯) రేతోత్సర్గప్రాయశ్చిత్తము ॥ యోనిగాని స్థలమునందైనను, వియోనియందైనను, పశుయోనియందైనను రేతస్సును వదలినవాఁడు నర

కలోకమును బొందుదురు, యోనిగాని స్థలమనఁగా పస్త్రాదికము, వియోని యనఁగా కాకాదికము, పశువనఁగా గోవత్సాదికము. ఇట్లని మార్కండే యుఁడువచించె. బ్రాహ్మణుఁడగువాఁడు కామాతురుఁడై చాప మొదలుగాఁ గల శయనీయములయందైనను, పశుపక్ష్యాదులయందైనను, ఉదకమునందయినను, అగ్నిమధ్యమునందయినను రేతస్సునువదలిన యెడల ప్రళయకాలము డనునరకలోకమునందు నివసించియుండునని నారదుండు పలికెను. పశుపక్షిజలములయందయినను, మార్గమునందయినను, చాపమొదలగు దానియందయినను, రేతస్సువదలినవాఁడు పునరావృత్తిరహితముగ నరకలోకము నందుండును, కాఁబట్టి యట్టిపాపమును బోఁగొట్టుకొనఁదలఁచినవాఁడు పరదినమునందయినను, అట్టికృత్యమును జేసిన యుత్తరక్షణమునందయినను సచేలస్నానమును జేయవలయును, అట్లుసేసి వేయి పర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. మూఁడు ప్రాణాయామముల నాచరింపవలయును, క్షత్రియ వైశ్యులకు విప్ర ప్రాయశ్చిత్తమునకంటె ద్విగుణాధికముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయునని మనువుపలికెను ॥

——*అవకీర్ణిప్రాయశ్చిత్తమ్.*——

(౧౮౯) అథావకీర్ణిప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో ॥ ఆశ్రమాణాం పురోవర్తీ బ్రహ్మచారీ హసైవతః । రేతోత్సర్గం యదాకుర్యాత్స్వప్నే వా ముష్టిమైథునే । అవకీర్ణీస సంజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః । మహాపాపమవాప్నోతి జపహోమవివర్జనాత్ ॥ మార్కండేయః ॥ శ్లో ॥ ఉపనాయనాదినాద్వర్ణీ బ్రహ్మచర్యపరాయణః । ప్రమాదాదుపబాధాద్వా యద్భజేన్నారీమకల్మషాం ॥ అవకీర్ణి స సంజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః ॥ గౌతమః ॥ శ్లో ॥ ఆహూయజీబంధనాద్రాజన్ బ్రహ్మచర్యేణకల్మషః । చరేద్వర్ణీ హ యస్సంగాద్యోనౌ రేతస్సముత్సృజేత్ ॥ అవకీర్ణీ స విజ్ఞేయస్సర్వధర్మం పరిత్యజేత్ । తస్య దేహవిశుద్ధ్యర్థం పరాకం కృచ్ఛ్రమీరితం ॥ ఇష్ట్వా గార్దభమాలభ్య శుద్ధిమాప్నోతి పార్థివకీం । పునస్సంస్కారపూతాత్మా పంచగవ్యం పిబేత్తతః ॥ ఏతేనశుద్ధిమాప్నోతి బ్రహ్మచారీ నచాన్యథా ॥ ఇతి హేమాద్రావవకీర్ణిప్రాయశ్చిత్తమ్ ॥

(౧౮౯) ఇఁక నవకీర్ణిప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ సకలాశ్రమములకును మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమము నవలంబించినవాఁడు చేపుఁడనఁబడును, అట్టివాఁడు స్వప్నమునందైనను, ముష్టిమైథునమునందైనను, రేతోత్సర్జనమును జేసినయెడల, అవకీర్ణియని చెప్పఁబడును, మఱియును సక

లకర్మ బహిష్కృతుఁ డగుటయేగాక సమస్తజపఫలమును బోఁగొట్టుకొని నవాఁడగునని దేవలుఁడువచించె. బ్రహ్మచర్యాశ్రమమునవలంబించినవాఁడు ప్రమాదమువలననైనను, ఇతరుల బోధవలననైనను, అకల్మషురాలగు స్త్రీని బొందినవాఁడవకీర్ణి యనఁబడునని మార్కండేయ మునివరుఁడువచించె. ఉపనయనకాలము మొదలుకొని బ్రహ్మచర్యాశ్రమమును జక్కఁగ నాచరించుచున్నవాఁడు దుర్బోధవలననైనను, బుద్ధిపూర్వకముగనైనను, స్త్రీసంసర్గమును బొందినవాఁడు, అవకీర్ణియని చెప్పఁబడును. అట్టిపాపాత్ముఁడునిజపాపమును బోఁగొట్టుటకొఱకు పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. మఱియు నిషిచే గార్దభమును బట్టుకొనినయెడల పూర్వోక్తమగు శుద్ధినిబొందును, ఇంతియగాక పునరుపనయన సంస్కారమునుబొంది పంచగవ్యప్రాశనను జేయవలయును, ఇట్లువిధముగ నాచరింపనియెడల పరిశుద్ధుఁడు గాఁడని గాలవుడువచించె ॥

—— * మిథ్యోదితప్రాయశ్చిత్తమ్ * ——

(౧౯౦) అథమిథ్యోదితప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో॥ యోవిప్రస్సాధువృత్తేషు పుణ్యవత్సుద్విజేష్విహ। మిథ్యారోపాపవదేద్దోషోహ్యాస్తీతి ప్రవదేన్నృషా । సమిథ్యావాదవాన్లోకె సర్వధర్మబహిష్కృతః॥ మహాభారతే ॥ శ్లో ॥ సాధువృత్తేషువిప్రేషు యోవిప్రోమిథ్యయావదేత్ । స్తేయంవా వ్యభిచారోవా హత్యావాప్యస్తి సర్వదా । ఇతి యోవదతేసాధూంత్సమిథ్యోదితవాక్ద్విజః ॥ దేవకార్యేషుపిత్ర్యేషు హ్యనర్హోమిథ్యయావదన్॥ మార్కండేయః॥ శ్లో ॥ పాపినాంపాపగణనాం నవదేద్వైకదాచన । అస్తిత్వేతుల్యపాపీస్యా న్మిథ్యాత్వేద్విగుణంభవేత్ ॥ మరీచిః ॥ శ్లో॥ మిథ్యయాసాధువృత్తేషు దోషారోపీగుణేష్వపి । విప్రేషుకలుషం వాచావదన్ గ్రామెసభాస్థలె ॥ సఏవనరకంగత్వా శ్వానయోనిషుజాయతె। తస్యదోషవినాశాయ ప్రాయశ్చిత్తమమహత్తరం ॥ విప్రేషుతప్తకృచ్ఛ్రంస్యాద్దంగవాస్వైహకాయికం । బాలవృద్ధాతురుష్వేషు వదన్పారాకమాచరేత్।క్షత్రియాదిషు సర్వేషు ప్రాజాపత్యముదీరితం ॥ నమిథ్యాభాషణంకుర్యాద్జ్ఞాపాలోపం పరిత్యజేత్ ॥ ఇతిహేమాద్రివిరచితే మిథ్యోదిత ప్రాయశ్చిత్తం॥

(౧౯౦) మిథ్యోదితప్రాయశ్చిత్తము॥ సద్వ్యవహారముల నవలంబించినవారివిషయముగను, పుణ్యవంతులగుబ్రాహ్మణులయందును, యసత్యములగువచనములబలికి యపవాదమునుగల్పించినవాఁడు సర్వధర్మబహిష్కృతుడగును. మఱియు ఘోరనరకములను బొందువాఁడగునని దేవలుఁడువచించె.

మహాభారతమునందును నిటులనేచెప్పబడియె. పాపవంతులపాపములవచింపగూడదు. అట్టిపాపమునిజముగనుండెనేని యాపాపమునుదానుబొందును. మిథ్యాత్వమునందు ద్విగుణమగునామార్కండేయుడువచించె. సజ్జనులయందుదోషారోపమునుజేసి సభలయందుబలుకువాడు నరకలోకమునుబొందును పిమ్మట శ్వానయోనులయందుబుట్టును. కావుననట్టిదోషనివారణకొఱకు మిగులగొప్పదగు ప్రాయశ్చిత్తమునాచరించవలయును. అదియెట్లనినబ్రాహ్మణులయందుదోషారోపమునుజేసి సంభాషించినవాడు తప్తకృచ్ఛ్రమునాచరింపవలయును. స్త్రీలయందుదోషారోపమునుజేసినవానికి కాయికకృచ్ఛ్రమునాచరించవలయును. బాలవృద్ధాతురులయందు దోషారోపమునుజేయువాడు పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. క్షత్రియాదులయందంనలయందును దోషారోపమునుజేసినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరింపవలయును. కాబట్టి మిథ్యాభాషణనుజేయగూడదు. దోషారోపమునుగూడ నొనరింపగూడదని మరీచివచించె.

## —— అభిశస్తప్రాయశ్చిత్తమ్. ——

(౧౯౧) అథాభిశస్తప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పూర్వవన్నిందయేల్లోకమభిశస్తస్సఉచ్యతే। అయోగ్యోహవ్యకవ్యేషునిందితస్సర్వదాజనైః॥ నాస్త్యకీర్తిసమోమృత్యురిహలోకేపరత్రచ। అస్తివానాస్తివాదోషోహ్యాయశఃపరివర్తతే॥ తస్మాదేతద్విశుద్ధ్యర్థంప్రాజాపత్యద్వయంచరేత్। అభిశస్తోమహాదోషాన్ముచ్యతేనాత్రసంశయః॥ గాలవః॥ శ్లో॥ మిథ్యయాపాపయాబద్ధోహ్యభిశస్తఇతీరితః। పాపమస్తినవాలోకేవార్తాసర్వత్రగణ్యతే॥ తద్దోషపరిహారార్థంప్రాజాపత్యద్వయంచరేత్। తతశ్శుద్ధోభవత్యేవమిథ్యాత్వేవిప్రపుంగవః॥ సదోషోవిద్యతేయత్రతత్రశాంతింసమాచరేత్। అన్యథాదోషమాప్నోతితస్యపాపస్యగూహనాత్॥ మిథ్యాత్వేప్రాజాపత్యద్వయంవిశోధనం। అస్తిత్వేప్రతిపదోక్తప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నోతీత్యర్థః॥ విప్రక్షత్రియాణాంవిప్రప్రాయశ్చిత్తార్థం॥ ఇతిహేమాద్రివిరచితే అభిశస్తప్రాయశ్చిత్తమ్॥

(౧౯౧) అభిశస్తప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ పూర్వమువలెనిందింపబడినవాడభిశస్తుడనబడును. అట్టివాడుహవ్యకవ్యములయందు గ్రహింపదగినవాడుగాడు. అపకీర్తికిదుల్యమగునదిమరణముగాదు. దోషముండినను, లేకపోయినను, అపకీర్తిమాత్రముపోనేరదు. కావుననట్టిదోషము పోవుటకొఱకు రెండుప్రాజాపత్యకృచ్ఛ్రముల ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయు

ను. ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమునాచరించినయెడల పాపనివృత్తియగునని దేవలుడువచించె. మిథ్యారూపమగు పాపముచే బద్ధుడగువాడు, అభిశస్తుడనబడును. పాపముండినను, లేకపోయినను, వార్తమాత్రము లోకమునందుండియుండును. కావుననట్టిదోషపరిహారమునకు రెండుప్రాజాపత్యకృచ్ఛ్రములనాచరించవలయును. ఇట్టిప్రాయశ్చిత్తమునాచరించుకొనినయెడల పరిశుద్ధుడగును. నిశ్చయముగపాపముండెనేని ప్రతిపదోక్తప్రాయశ్చిత్తము నాచరించవలయును. అనగానిట్లులోకాపవాదమునుబొందినవాడుప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని గాలవుడుచెప్పె.

## కుగ్రామవాసినః ప్రాయశ్చిత్తమ్.

(౧౯౨) అథకుగ్రామవాసినః ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ కుగ్రామవాసినాం పుంసాం ద్వావనర్థౌ ప్రకీర్తితౌ। అపూర్వస్యాగమో నాస్తి పూర్వ విద్యా వినశ్యతి॥ కుగ్రామలక్షణమాహ॥ మరీచిః॥ శ్లో॥ శ్రోత్రియశ్చ తటాకాదిత్యృణం పర్ణాంతకేంధనం। బాంధవాస్స్వకులీనాశ్చ విద్వాన్ వైద్యో మహాధనీ॥ నసంతియత్ర గ్రామే చ స కుగ్రామ ఇతీరితః। అపిచ॥ యత్రవిద్యాగమో నాస్తి యత్ర నాస్తి ధనాగమః। యత్ర పుణ్యాగమో నాస్తి న తత్ర దివసం వసేత్॥ తత్ర గ్రామే ద్విజో యస్తు హవ్యకవ్యపరాఙ్ముఖః। ఏకస్మిన్దివసే తిష్ఠన్మహాపాపమవాప్నుయాత్॥ తస్యైవ నిష్కృతిర్దృష్టా వర్షే చాంద్రాయణవ్రతం। మాసే పరాకం షణ్మాసే ప్రాజాపత్యం సమాచరేత్॥ తస్మాద్గ్రామం పరిత్యజ్య బంధుమధ్యే వసేత్సదా॥ ఇతి హేమాద్రివిరచితే కుగ్రామవాసినః ప్రాయశ్చిత్తమ్॥

(౧౯౨) కుగ్రామవాసియగువానికి ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ కుగ్రామమునందుండునట్టిపురుషులకు రెండనర్థములుకలుగును. పూర్వమునందులేనిదివచ్చున. పూర్వవిద్యయంతయునశించునని దేవలుడువచించె. శ్రోత్రియుడు, తటాకాదిత్యృణము, ఆకులు, కట్టెలు, బంధువులు, కులమువారలు, విద్వాంసుడు, వైద్యుడు, ధనవంతుడు, అనునవిలేనిగ్రామముకుగ్రామమనబడునని మరీచివచించె. మఱియువిద్య, ధనము, పుణ్యము, అనునవియే గ్రామమునందుకలుగనేరవో యదియునుకుగ్రామమనియే చెప్పబడును. అట్టి గ్రామమునందుబ్రాహ్మణుడు హవ్యకవ్యపరాఙ్ముఖుడై యొకదినమునందుండినను మహాపాపమునుబొందును. అట్టిగ్రామమునం దొకసంవత్సరకాలముండెనవానికి తద్దోషపరిహారమునకు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. మాసముదినములీకృత్యమును జేసినవాడు పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. ఆఱుమాసములకాలమునివసించినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రము

నాచరింపవలయును. అందువలననట్టిగ్రామమునువదలి బంధుమధ్యయందుండ వలయునని యుమరీచియేచెప్పె.

—— కుత్సితసేవాప్రాయశ్చిత్తమ్. ——

(౧౯౩) అథకుత్సితసేవాప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ నటశ్చ గాయకశ్చైవశూద్రోదుర్జనఏవచ। పిశునశ్చఖలశ్చైవమద్యపోదుర్జనస్తథా స్తేయీచకితవశ్చైవతఏతేదుర్జనాస్స్మృతాః॥ ఏతేషాంయోద్విజస్సేవాం ప్రత్యహంసముపాచరేత్। తస్యాన్యాన్నిష్కృతిర్నాస్తితప్తకృచ్ఛ్రత్రయాదృతే॥ సేవాప్రకారమాహ। గౌతమః॥శ్లో॥ శౌచార్థంమృత్తికాంతోయం ప్రత్యహంవచనక్రియాః। తద్వాక్యమనుస్మృత్యైవహస్తపాదవిమర్దనం। ఉచ్ఛిష్టమార్జనం తేషాంపాత్రచేలాదిధారణం॥ ఏవంద్విజఃప్రతిదినం సేవాంకుర్యాత్ప్రవర్తతే। సఏవనరకస్థాయీబ్రహ్మకల్పత్రయాదిహ। కల్పత్రయమవధికృత్యేత్యర్థః। తద్దోషపరిహారార్థంపక్షమాసదినక్రమాత్। దినైకస్మిన్ పరాకంస్యాత్పక్షేతప్తమీరితం। ప్రాజాపత్యంతథామాసేవర్షేచాంద్రస్యభక్షణం॥ కృత్వాశుద్ధిమవాప్నోతివర్షాదూర్ధ్వంపతత్యసౌ। వర్షాదూర్ధ్వంపతితప్రాయశ్చిత్తంకృత్వా శుద్ధిమాప్నోతినాన్యథా॥ ఇతికుత్సితసేవాప్రాయశ్చిత్తం॥

(౧౯౩) కుత్సితుని సేవించినవానికి ప్రాయశ్చిత్తము॥ నటుడు, గాయకుడు, శూద్రుడు, దుర్జనుడు, పిశునుడు, ఖలుడు, మద్యపానమును జేసినవాడు, దొంగతనమును జేయువాడు, జూదమాడువాడు, అనునట్టివారలు దుర్జనులనబడుదురు. ఇట్టివారలననుదినమును సేవించునట్టి బ్రాహ్మణునకు మూడుతప్తకృచ్ఛ్రములనాచరించుటకంటె నన్యమగుప్రాయశ్చిత్తమేదియును లేదని దేవలుడు చెప్పె. ఇప్పుడు చెప్పబడినదుర్మార్గులకు, శౌచముకొఱకుమృత్తికోదకములనుగొనివచ్చుట, సంతోషముగలుగునట్లుసంభాషించుట, మఱియువానివచనానుసారముగసంచరించుట, వానిహస్తపాదములనుమర్దించుట, వానియెంగిలినిగడుగుట, వానివస్త్రములుమొదలగువానినిధరించుట, అనుకార్యములనాచరించిన బ్రాహ్మణుడు బ్రహ్మకల్పత్రయకాలముదనుక నరకలోకమును బొందును. కావున నద్దోషపరిహారముకొఱకు పక్షమాసదినక్రమమును ననుసరించి ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నట్టివానిపరిచర్య నొకదినము చేసినవాడు పరాకకృచ్ఛ్రమును, పదునైదుదినములుసేసినవాడు తప్తకృచ్ఛ్రమును, ముప్పదిదినములాచరించినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమును, సంవత్సరకాలముచేసినవాడు చాంద్రాయణమును, ప్రాయశ్చిత్తార్థము నాచరించుకొనిన యెడల పరిశుద్ధుడగును. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొనక సంవత్సరానంతరమందు

గూడ నట్టిదుష్కృత్యమును జేసినవాడు పతితుడగును. కావున నట్టివానికి తత్ప్రాయశ్చిత్తమును విధించవలయునని గౌతముఁడు చెప్పె.

——(*) ఖరోష్ట్రాద్యారోహనప్రాయశ్చిత్తమ్. (*)——

(౧౯౪) అథఖరోష్ట్రాద్యారోహన ప్రాయశ్చిత్తమాహ। దేవలః। శ్లో॥ ఖరముష్ట్రంచమహిషమనడ్వాహమజంతథా। బస్తమారుహ్యచాజ్ఞః క్రోశమాత్రం ప్రవర్తయేత్। మహాంతందోషమాసాద్య భువిభూయాత్స వానరః। పరాశరః। శ్లో॥ ఖరముష్ట్రమనడ్వాహంబస్తంమహిషమేవచ। అజమారుహ్యసహసావిప్రః క్రోశంగతో యది॥ మహాంతంనరకంగత్వా వానరో భువిజాయతే। క్రోశప్రమాణమాహ। లౌగాక్షిః। శ్లో ॥ తిర్యగ్యవోదరాణ్యష్టావూర్ధ్వావా వ్రీహయస్త్రయః। ప్రమాణమంగులస్యోక్తం వితస్తి ద్వాదశాంగులః। వితస్తిద్విగుణారత్నిస్తాద్వాకిష్కుస్తతో ధనుః॥ ధనుస్సహస్రంక్రోశశ్చ చతుఃక్రోశంతుయామినం। యామినంసార్ధక్రోశం చయోజనం పరిచక్షతే। విప్రస్యైషామారోహణె పృథక్పృథక్ప్రాయశ్చిత్తమాహ మార్కండేయః। శ్లో॥ ఖరమారుహ్యవిప్రోసౌ యోజనంయదిగచ్ఛతి। తత్రసాంతపనం ప్రోక్తంశరీరస్యవిశోధనం। పునఃకర్మప్రకుర్వీత పటగర్భవిధానతః॥ ఏతేనశుద్ధిమాప్నోతి ద్విజో నాన్యేనశుద్ధ్యతి। ఏకస్మిన్దివసే ఏకయోజనే ఉక్తప్రాయశ్చిత్తం। ద్వితీయేతృతీయే అభ్యాసే ద్విగుణంత్రిగుణం చతుర్గుణంక్రమాద్వదితవ్యం॥ సర్వత్ర పునరుపనయనం॥ ఇతి హేమాద్రివిరచితే ఖరోష్ట్రాద్యారోహణప్రాయశ్చిత్తం॥

(౧౯౪) ఇకను ఖరోష్ట్రాద్యారోహణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ గాడిదె, ఒంటె, ఎనుము, ఎద్దు, మేక, గొఱ్ఱె, అనుజంతువులనెక్కి సంచరించి క్రోశమాత్రము పోయినబ్రాహ్మణుడు మిగులపాపవంతుడగును. రెండవజన్మమునందు వానరుడై పుట్టునని దేవలుడువచించె. పరాశరమునియు మనునిటులనే వచించె. లోకాక్షి చెప్పిన క్రోశ ప్రమాణమును మూలగ్రంధముచేతనే విస్పష్టముగ దెలియవలయును. గాడిదె నెక్కి యోజనమాత్రముపోయిన బ్రాహ్మణుడు తత్పాపోపశమనముకొఱకు సాంతపనకృఛ్రమునాచరింపవలయును. మఱియును పటగర్భవిధానానుసారముగ బునరుపనయనసంస్కారమును జేసికొనవలయును. ఇట్లు ఈవిధముగ నాచరించుటచే బరిశుద్ధుడగును గాని వేరొండు కారణములచే బరిశుద్ధుడు గానేరడు. ఒక్కదినమునందే యొక్కయోజనదూరముపోయినవానికీ ప్రాయశ్చిత్తమును విధించవలయును. ద్వితీయతృతీయములయందును నభ్యాసపూర్వకముగ నాచరించినయెడల త్రిగుణాధికముగ

ను, చతుర్గుణాధికముగను జేయవలయును. సర్వత్రనునుష్ఠయన సంస్కారము ను జేసికొనవలయునని యును మార్కండేయమునివరు డేవచించె.

—— (✻) ఉద్వాహితాయాః పునరుద్వాహే ప్రాయశ్చిత్తమ్. (✻) ——

(౧౯౪) అథోద్వాహితాయాః కన్యాయాః పునరుద్వాహే ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ సముద్రయాత్రా స్వీకారః కమండలువిధారణం॥ దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం పరస్య చ॥ దీర్ఘకాలం బ్రహ్మచర్యం వర్జయంతి కలౌ యుగే॥ ఏతాన్ ధర్మాన్ పరిత్యజ్య యో పాపే దోషభాగ్భవేత్॥ తస్యైవ నిష్కృతిర్నాస్తి తత్ప్రచ్ఛన్న తాదపి గౌతమః॥ శ్లో॥ పూర్వముద్వాహితాం కన్యామన్యస్మై ధర్మకాంక్షయా॥ యత్పరా ద్వాపిరా జేంద్ర దద్యాద్విప్రో ధనాతురః ॥ భ్రూణహత్యాసమం పాపమవాప్నోతి న సంశయః ॥ దాతుశ్శుద్ధిః కరీషాగ్నిః పరిణేతు స్తథైంద వైః॥ సా కన్యా జారిణీ ప్రోక్తా తత్పుత్రాః కుండసంజ్ఞితాః॥ అనేకదోషబాహుళ్యాదేనం మార్గం పరిత్యజేత్॥ జాబాలిః॥ శ్లో॥ పూర్వముద్వాహితాం కన్యాం పితా భ్రాతా ధనేచ్ఛయా ॥ తయోర్యదిహ దోషా ద్వాహ్యన్యాధీనాం కరోతి చేత్ స్త్రీ॥ మహాదోషమవాప్నోతి పితరౌ యాంత్యధోగతిం॥ దాతుశ్శుద్ధిః కరీషాగ్నిర్వోఢుశ్చాంద్రాయణత్రయైః॥ సా కన్యా పాంసులా జ్ఞేయా తత్పుత్రాః కుండసంజ్ఞితాః॥ ఏతద్దోషవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్॥ కన్యాదాతా తు చాపాగ్రే ప్రత్యహం స్నానమాచరేత్ ॥ వర్షమాత్రేణ సంశుద్ధో నాన్యథా శుద్ధిరిష్యతే ॥ తద్భర్తా తాం పరిత్యజ్య కుర్యాచ్చాంద్రాయణత్రయం ॥ తస్యోపనయనం భూయః శుద్ధమాప్నోత్యనుత్తమం॥ సా కన్యా పూర్వజం చాన్యం త్యక్త్వా చాంద్రాయణం చరేత్॥ శిశుచాంద్రాయణమిత్యర్థః॥ అన్యథా నరకం వ్రజేత్ ॥ ఉభయోస్సంత్యాగే పుత్రాభావః॥ పుత్రాభావే కన్యాయాశ్చాంద్రాయణాచ్ఛుద్ధిః ॥ పుత్రోత్పత్తౌ తస్యాస్తత్పుత్రాణాం చ గతిర్నాస్తి॥ అ స్తూభయోస్త్యాగ ఏవ వరః॥ ఇతి హేమాద్రివిరచితే కన్యాయాః పునరుద్వాహప్రాయశ్చిత్తం॥

(౧౯౪) ఇకను వివాహితురాలయిన స్త్రీకి మరల వివాహమును జేసిన యెడల నాచరింపదగిన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు ॥ సముద్రయాత్రాస్వీకారము, కమండలుధారణ, వివాహితురాలయినదానికి మరలవివాహముసేయుటయును, దీర్ఘకాలబ్రహ్మచర్యము, అనువానిని కలియుగమునందు జేయగూడదు. ఇట్టికృత్యములు సేసినయెడల నట్టివానికి ప్రాయశ్చిత్తమే లేదని చెప్పలుడువచించె. తొలుత నొకరునికిచ్చిన కన్యను ధనాతురత చేతనైనను, మత్సరము చేతనైనను, మరియొకనికిచ్చిన యెడల భ్రూణహత్యాతుల్యమైన పాప

మునొందును. అట్టికృత్యమును జేసినవానికి కారీషవథకంటె నన్యమగుప్రాయశ్చిత్తమేదియునులేదు. అట్టివివాహమును జేసికొనినవానికి మూడుచాంద్రాయణములచేత బరిశుద్ధతగలుగును. ఆకన్యజారిణియనబడును. దానికిబుట్టినబిడ్డలు కుండములనబడుదురు. ఇవ్విధముగనీకార్యమనేకదోషములుగలదగుటవలన నిట్టికార్యమును జేయగూడదని గౌతముడువచించె. జాబాలియునుసిటులనే చెప్పి ప్రాయశ్చిత్తవిధానమునుగూడ జెప్పె. అది యెట్లనిన, అట్టుకన్యాదానమును జేసినవాడొక్కసంవత్సరకాలము ధనుష్కోటియందు బ్రతిదినమును స్నానమును జేయవలయును. ఇట్లు చేసినయెడల కన్యాదాతకు బరిశుద్ధతగలుగును. అట్టివివాహమును జేసికొనినవాడు దానిని బరిత్యజించి మూడుచాంద్రాయణవ్రతములనాచరింపవలయును. అట్లు చేసికొని పునరుపనయన సంస్కారమును గూడ జేసికొనవలయును. అట్టికన్యయును చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. అట్లు చేసికొననియెడల నరకమును బొందును. ఇరువురియొక్కయు సంత్యాగమునందు పుత్రాభావమగును. పుత్రాభావమునందు కన్యకకు చాంద్రాయణమువలన శుద్ధిగలుగును. పుత్రులుద్భవించినచో యాపుత్రులకును దానికి నిగతిలేదనియెఱుంగవలయును. అందువలనవారల వదలవలయుననియె.

—* మాతృష్వస్రుసంబంధపరిణయె ప్రాయశ్చిత్తమ్. *—

(౧౯౭) అథమాతృష్వస్రుసంబంధపరిణయె ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ స్వసారం మాతరం చాస్తు హ్యవిచార్యస్వబంధుతః॥ పశ్చాజ్జ్ఞాతా పరిత్యాజ్యా స్వహామాతా తుధర్మతః॥ గౌతమః॥ శ్లో॥ సంబంధం భోళయిత్వాదౌ మాతృతః పితృతస్తథా॥ సగోత్రప్రవరాం కన్యాం మాతరంభగినీం త్యజేత్॥ యదికామాద్వివాహ్యేత మహాదోషమవాప్నుయాత్॥ తయోస్సంసర్గతో విప్రః మాతృగామీతిగణ్యతె॥ సగోత్రజాం ప్రవరజాం త్యక్త్వా సుఖమవాప్నుయాత్॥ మార్కండేయః॥ శ్లో॥ సగోత్రప్రవరామేతాం మాతరంభగినీంతథా॥ అజ్ఞాత్వా పూర్వముద్వాహ్య జ్ఞాత్వా పశ్చాత్పరిత్యజేత్। యదిపుష్పవతీం గచ్ఛేల్లోభాత్కామాతురస్సకృత్॥ మాతృగామీతివిజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతః। పుత్రోత్పత్తౌ తయోః పుత్రా అంత్యజశ్వ మవాప్నుయుః॥ తద్దోషపరిహారార్థం దేహశుద్ధిం సమాచరేత్॥ అజ్ఞాత్వా యః ప్రమోద్వాహస్తు తచ్చాంద్రమదీరితం॥ యదా పుష్పవతీం గచ్ఛేత్తదాదోషమవాప్నుయాత్॥ గురుతల్పసమం ప్రోక్తం ముష్కచ్ఛేదనవర్జితం॥ పుత్రోత్పత్తౌ కరీషాగ్నిర్దాహఏవవిధీయతె॥ సగోత్రప్రవరజాయాః పరిణయాదౌ ప్రాయశ్చిత్తమిదం పునస్సంస్కారస్త్వేవమేవ॥ తస్యాః కన్యాయాః పురుషస్యార్ధం ప్రా

యుశ్చిత్తం॥ క్షత్త్రియవైశ్యయోరేతద్ద్విగుణం॥ ఇతి హేమాద్రౌ ప్రాయశ్చిత్తే మాతృస్వసృసంబంధపరిణయప్రాయశ్చిత్తమ్॥

(౧౯౬) మాతృస్వసృసంబంధముగల వివాహమును జేసికొనినవానికి బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బంధుసంప్రదాయానుసారముగ దల్లిపరుసయును, స్వస్రువరుసయునుగల దానిని వివేకమువలనఁ బెండ్లియాడినవాఁడు దెలిసికొనినతోడనే యకన్యను బరిత్యజింపవలయునని దేవలుఁడు వచించె. ముందుగ మాతాపితృసంబంధమును, గోత్రప్రవర సంబంధమును విచారించి తల్లివరసను, తోడబుట్టువరసను వదలవలయును. అట్లుగాక బుద్ధిపూర్వకముగ గామాతురుఁడై వివాహమును జేసికొనిన యెడల మహాదోషమును బొందును. అట్టిస్త్రీలయొక్క సంసర్గమును బొందినవాడు మహాదోషమును బొందును. సగోత్రసప్రవరలులేని కన్యను వివాహమును జేసికొనినవాడు సుఖమును బొందును. సగోత్రత్వ సప్రవరత్వములను, మాతృస్వసృ సంబంధమును విచారించక యవివేకమువలన వివాహమును జేసికొనినయెడల పాపవంతుఁడగును. పిమ్మట దెలిసినేని వెంటనే వదలవలయును. అట్టి సంబంధముగల స్త్రీలు పుష్పవతులయిన పిమ్మట సంభోగాదిక్రియలను జరిపినవాఁడు మాతృగామియనఁబడును, అట్టిస్త్రీలయందుఁ బుత్రులుద్భవించిరేని యాపుత్రులంత్యజు లనఁబడుదురు, కావునఁ దద్దోష పరిహారముకొఱకు దేహశుద్ధినిగల్పించికొనవలయును, అదియెట్లనినఁ దెలియక వివాహమును జేసికొనినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును, అట్టిస్త్రీలు పుష్పవతులయిన పిమ్మట రమించినవాఁడు మాతృగామియనబడును గావున నట్టివానికి వృషణచ్ఛేదనరూపమైన ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, అట్టిస్త్రీలయందుఁ బుత్రోత్పత్తి యగువఱకును సంభోగాది క్రియలను జరిపినవారికి కారీషవధకంటె నన్యముగు ప్రాయశ్చిత్తమేదియును లేదు, పునస్సంస్కారమునుగూడ జేసికొనవలయును. స్త్రీలకర్థప్రాయశ్చిత్తము విధింపవలయునని మార్కండేయుఁడు వచించె॥

## స్వదారపరిత్యాగప్రాయశ్చిత్తమ్.

(౧౯౭) అథస్వదారపరిత్యాగప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ నిష్కారణతయా పత్నీం సంత్యజేత్పూర్వజోరుషా। నాసావిహపరత్రాపి నిందితః పూజ్యతేజనైః॥ గౌతమః॥ శ్లో॥ అప్రజాందశమేవర్షే స్త్రీప్రజాం ద్వాదశేత్యజేత్। మృతప్రజాం పంచదశే సద్యస్త్వప్రియవాదినీం। అప్రియవాదో నామకలాయుగే సాక్షాద్వ్యభిచారః॥ అపియాణిభర్తృవిషయే కలాయు

నబహూనిసంతి॥ సాక్షాద్వ్యభిచారఏవా ప్రియావాదఃతదా త్యాజ్యా। అన్యథా దోషమాహ॥ గౌతమః ॥ శ్లో॥ వ్యభిచారాదృతేపత్నీం యోవిప్రస్సంపరిత్యజేత్॥ భ్రూణహత్యామవాప్నోతి ఋతుకాలవ్యతిక్రమాత్ ॥ ఖరాజినం బహిర్లోమ పరిధాయసమంతతః ॥ శరావపాత్రమాదాయ భిక్షార్థంగ్రామమావిశేత్ । స్వదారవ్యతిక్రమణే భిక్షాందేహీతియాచయేత్। సప్తాగారణ్యటిత్వాథభోజయేత్స్వయమాదరాత్ ॥ షణ్మాసమేవంకృత్వాతు శుద్ధిమాప్నోతిపార్థివే ॥ తదాహాపస్తంబః॥ దారవ్యతిక్రమీఖరాజినం బహిర్లోమం పరిధాయదారవ్యతిక్రమిణేభిక్షామితి సప్తాగారిణిచరేత్సావృత్తిష్షణ్మాసాన్ స్త్రీణాం భర్తృత్యాగేపి నిష్కారణకయాప్యేవమర్థం ప్రాయశ్చిత్తం॥ మహాపాతకిశంకాస్తిచేత్త్యాగఏవ విహితః ॥ కారణ. సఏవనోచేత్ భర్తృప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్ । ఖరచర్మవినాభిక్షార్థంపర్యటేత్ పూర్వవత్షణ్మాసాన్ ॥ ఇతిహేమాద్రివిరచితే పత్నీత్యాగప్రాయశ్చిత్తం॥

(౧౯౭) ఇకను స్వదార పరిత్యాగ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు ॥ నిష్కారణముగ భార్యా పరిత్యాగమును జేసినవాడిహ పరలోకములయందు నిందితుడగునని దేవలుడు వచించె. సంతానములేని దానిని పదియవసంవత్సరమునందును, స్త్రీసంతానమేగల దానిని పదిరెండవ సంవత్సరమునందును, మృతశిశువులను గనుదానిని పదునైదవ సంవత్సరమునందును, అప్రియముగ మాటలాడు దానిని తత్క్షణమునందును, వదలవలయును, అప్రియముగ మాటలాడునది యనగా వ్యభిచారముగల యాడుదియని యెఱుంగవలయునని గౌతముడు వచించె. బ్రాహ్మణుడగువాడు వ్యభిచారముకంటె నితరములగు తప్పులను జేయుభార్యను వదలవలయును. ఇట్లు వదలినయెడల భ్రూణహత్యకుదుల్యమైనపాపమును బొందవలయును. ఇట్టిపాపమును జేసినవాడు తత్పాపోపశమనముకొఱకు ప్రాయశ్చిత్తమును జేయవలయును. అదియెట్లనిన వెలుపలలోమములుగల గాడిదె చర్మను గట్టికొని మట్టిమూకుడును చేతియందుభిక్షార్థముగ ధరించి గ్రామములోనికిబోవలయును. ఓయి స్వభార్యాపరిత్యాగమును జేసినపాపాత్మునకు భిక్షము బెట్టుడని యాచింపవలయును- ఇవ్విధముగ నేడుగృహములయందు భిక్షమెత్తి సాయంకాలమునందు భోజనమును జేయువలయును. ఇవ్విధముగ నాఱుమాసములకాలముసంచరించినయెడల పరిశుద్ధుడగునియును గౌతముడు వచించె. ఆపస్తంబమునినిటులనే చెప్పె. నిష్కారణముగ భర్తను వదలిపెట్టిన యాడుదానికి ప్రాయశ్చిత్తమునందర్ధమును విధించి చెప్పె. మహాపాతకిశంకయుండెనేని త్యాగమే

యుచితమైనది. అట్టికారణములేనియెడల భర్తృప్రాయశ్చిత్తమువలె సర్వ మును జేయవలయును. గాడిదెచర్మలేకయే పూర్వోక్తప్రకారముగ నాఱు మాసములకాలము భిక్షార్థముగఁ బర్యటనమును జేయవలయును.

—— ❋ అసంస్కృతకన్యారజోదర్శనప్రాయశ్చిత్తమ్. ❋ ——

(౯౮) అథపితృగృహే అసంస్కృతకన్యారజోదర్శనే ప్రాయశ్చి త్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పితుర్గృహేతుయాకన్యా రజఃపశ్యత్య సంస్కృ తా॥ సాకన్యావృషలీజ్ఞేయాతద్భర్తావృషలీపతిః॥ వృషలస్స్యాదతి॥ మారీచిం డెయః॥ శ్లో॥ యాకన్యాపితృవేశ్మస్థాయదిపుష్పవతీభవేత్ । అసంస్కృతాప రిత్యాజ్యా నపశ్యేత్తాంకదాచన। వివాహేచనయోగ్యాస్యాల్లోకద్వయవిగ ర్హితా। ఏతాంపరిణయన్విప్రో నయోగ్యోహవ్యకవ్యయోః ॥ నతస్యాంజన యేత్పుత్రం కానీనఇతికథ్యతే। మాతాపితాచపుత్రశ్చ త్రయస్తేవృషలాస్మృ తాః॥ యదాపుష్పవతీకన్యా తదైవత్యక్తుమర్హతి॥ నతత్రదోషస్తస్యాస్తి గృ హస్థాచేత్సదోషభాక్॥ గౌతమః॥ శ్లో॥ యదారహఃపుష్పవతీద్విజస్తాముద్వ హేద్యది॥ కాలాంతరేయదాజ్ఞాతా తదాతాంసంపరిత్యజేత్। యాదీక్షితదా త్మనశ్శుద్ధిం తదాచాంద్రాయణంచరేత్ కామాతురస్తదావర్తే త్సచండాల సమోభవేత్॥ పుత్రోత్పత్తిర్యదిభవేత్తదాపతితఏవసః॥ ఇతి హేమాద్రివిర చితే ధర్మశాస్త్రేప్రాయశ్చిత్తాధ్యాయే పితృగృహస్థితకన్యారజోదర్శనప్రా యశ్చిత్తం॥

(౯౮) అసంస్కృత కన్యారజోదర్శన ప్రాయశ్చిత్తము॥ వివాహ ముగాకమునుపు తండ్రియొక్కయింటియందు కన్యకవివాహితురాలయ్యెనేని యాకన్యకవృషలియనఁబడును. అట్టిదాని భర్తవృషలీపతియనఁబడునని దేవ లుఁడువచించె. వివాహముగాకమునుపు పితృగృహమునందు రజస్వలమైన కన్యను పరిత్యజింపవలయును. అట్టి కన్యకవివాహమునకుఁగూడ దగినదికా దు. మఱియు నుభయలోకములయందును గర్హితురాలగును. ఇట్టికన్యను బెండ్లియాడినవాఁడు హవ్యకవ్యములకుపయుక్తుఁడుగా నేరఁడు. అట్టి కన్యక కుఁ బుట్టినపుత్రుఁడు కానీనుఁడనఁబడును. అట్టితండ్రి తల్లిపుత్రుఁడు, అను ముగ్గురును వృషలులనఁబడుదురు. వివాహముకాకమునుపు, రజస్వలమైన యాడుదానిని పరిత్యజింపవలయును. అట్లువదలుటచేత దోషమించుకయు ను గలుగనేరదని మారీచిండేయుఁడువచించె. రహస్యముగఁబుష్పవతియైన కన్యనుతొలుతఁదెలియక వివాహమునుజేసికొని పిమ్మటఁదెలిసికొనెనేనియం తటితో నక్కన్యను వదలవలయును. అట్లువదలినపిమ్మట దేహశుద్ధిని జే

సికొనఁదలచిన యెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. ఇవ్విధముగ వదలక కామాతురుఁడై ప్రవర్తించెనేని చండాలతుల్యుఁడగును. ఛత్రోత్పత్తియయ్యెనేని పతితుఁడగునని గౌతముఁడువచించె.

—— కారాగృహవాసప్రాయశ్చిత్తమ్. ——

(౯౯) అథకారాగృహవాస ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ కారాగృహేబలాత్కారాత్థిస్త్వామాసమతంద్రితః॥ నస్నానంనచసంధ్యాదినదేవపితృతర్పణం। నస్వాధ్యాయోనవాహోమశ్శూద్రఏవనసంశయః॥ మరీచిః॥ శ్లో॥ మాసంకారాగృహేవాసో నాభిర్యాత్రాదిఃత్రయం। మ్లేచ్ఛావాసస్తథాపక్షం యోవర్తేతసతుపాతకీ॥ గౌతమః॥ శ్లో॥ బలాద్దాసీకృతాయేతు మ్లేచ్ఛచండాలదస్యుభిః। అశుభంకారితాః కర్మగవాదిప్రాణహింసనం। ఉచ్ఛిష్టమార్జనంతేషాం తథాతస్యైవభక్షణం॥ తత్స్త్రీణాంచ తథాసంగస్తాభిశ్చసహభోజనం। మాసోషితేద్విజాతౌతు ప్రాజాపత్యం విశోధనం॥ ప్రాజాపత్యంచచాంద్రంచ చరేత్సంవత్సరోషితః। ఆహితాగ్నిస్త్రయంకుర్యాద్యదికారాగృహేవసేత్॥ స్త్రీణామేతత్సంభవే విప్రస్యప్రాయశ్చిత్తార్ధమనూదితంవేదితవ్యం॥ యమః॥ శ్లో॥ కారాగృహాద్వినిర్గత్యప్రాయశ్చిత్తంయథోదితం। కృత్వావిప్రఃపునఃకర్మ కుర్యాచ్ఛుద్ధి మవాప్నుయాత్॥ నాన్యథాశుద్ధిమాప్నోతి యథాభువిసురాఘటః॥ ఇతికారాగృహవాస ప్రాయశ్చిత్తం॥

(౯౯) కారాగృహవాసప్రాయశ్చిత్తము ॥ కారాగృహమునందు బలాత్కారముగఁ బ్రవేశపెట్టఁబడి మాసముదినము లుండినవానికి, స్నానము, సంధ్యాదికము, దేవపితృతర్పణము, స్వాధ్యాయము, హోమము మొదలగు కర్మలు జరగవుగనుక యట్టివాఁడు శూద్రతుల్యుఁడగునని దేవలుఁడువచించె. మాసముదినములు కారాగృహమునం దుండినవాఁడును, మూఁడుదినములోడనెక్కి సముద్రముమీఁదఁ బ్రయాణమును జేసినవాఁడును, పక్షముదినములు మ్లేచ్ఛావాసమును జేసినవాఁడును, పాతకుఁడనఁబడునని మరీచివచించె. మ్లేచ్ఛచండాలదస్యులచేత బలాత్కారముగ దాసులై చేయఁబడినవారును, అశుభకర్మను జేసినవారును, గవాదిప్రాణిహింసను జేసినవారును, ఉచ్ఛిష్టమార్జనమును జేసినవారును, ఉచ్ఛిష్టమును భక్షించినవారును, అన్యస్త్రీలయొక్క సాంగత్యమును బొందినవారును, అట్టిస్త్రీలతోఁగూడ సహభోజనాదులను జేసినవారును, ద్విజాతియందు మాసోషితుఁడును, ప్రాజాపత్యకృచ్ఛ్రమును జేసికొనిన యెడల పరిశుద్ధుఁడగును.

సంవత్సర కాలము కారాగృహమునందున్నవాఁడు ప్రాజాపత్యమును, చాంద్రాయణమును నాచరింపవలయును. ఆహితాగ్ని కారాగృహమునం దుండెనేని మూఁడును నాచరింపవలయును. ఇట్టికష్టము స్త్రీలకు సంభవించి నయెడల పురుషులకు విధించిన ప్రాయశ్చిత్తమునందు సగము ప్రాయశ్చిత్త మును విధింపవలయునని గౌతముఁడు వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు కారాగృహమునుండివచ్చిన పిదప గౌతమోక్తప్రాయశ్చిత్తమును జేసికొని పునరుపనయన సంస్కారమును జేసికొనిన యెడల పరిశుద్ధుఁడగును. అట్లు చేసికొనని యెడల మద్యభాండమువలె నెప్పటికిని బరిశుద్ధుఁడు గానేరఁడని యముఁడు చెప్పె.

—* బంఁదీగృహీతనారీప్రాయశ్చిత్తమ్. *—

(౨౦౦) అథబందీగృహీతనారీణాంప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ శ్లో॥ బందీకృతాయదానార్యో నివసేయుస్తదాలయే। పక్షంమాసమృతుంవాపి సంవత్సరమథాపివా॥ తదాసాంనిష్కృతిర్నాస్తి వ్యభిచారోయదాభవేత్। తత్రాపి గర్భసంపత్తౌ పరిత్యాగోవిధీయతే॥ గర్భేత్యాగో విధీయతఇతి మనుస్మరణాత్॥ తదాహగౌతమః॥ శ్లో॥ బలాద్బందీకృతానారీ తత్రైవనివసేద్యది। పక్షంమాసమృతుంచాబ్దం నతస్యానిష్కృతిర్భవేత్॥ తత్రైవవ్యభిచారస్స్యాద్యదిగర్భమథాత్తదా। దైవాత్తైః పునరుత్సృష్టా తత్రశుద్ధిః కథంభవేత్॥ తాంపతిఃపునరాదాతుం బిభేద్వైలోకవార్తయా॥ ఇచ్ఛన్సభాముపానీయ వదపాపంహ్యుదిస్థితం॥ ఇతిభర్తురనుజ్ఞాతా సావదేత్సత్యమాదరాత్। ఉక్తేసత్యేతయాసాతు సభాసద్భిర్విచార్యచ॥ షష్టిభిర్మృత్తికాభిశ్చ ఘృతశౌచమనంతరం। కారయిత్వావిధానేన స్నాపయిత్వానదీజలైః। కారయేత్పూర్వవద్విప్రః ప్రాయశ్చిత్తమనుక్రమాత్॥ అర్ధముక్తంతత్స్త్రీణాం ప్రాయశ్చిత్తంవిశోధనం। కృత్వాశుద్ధిమవాప్నోతి శాస్త్రదృష్టేనవర్త్మనా॥ తస్యాదోషనివృత్తిస్స్యాజ్జనవాదోనహీయతే। అతస్తుపోషణం తస్యాస్సంసర్గాదీన్నకారయేత్॥ ఇతి హేమాద్రివిరచితే బందీకృతనారీప్రాయశ్చిత్తం॥

(౨౦౦) బందీగృహీతనారీప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ స్త్రీలుబందీకృతలై కారాగృహమునందు ముప్పదిదినములయినను, పదునైదుదినములైనను, రెండుమాసములయినను, సంవత్సరమైనను నివసించియుండి యచ్చోట వ్యభిచారకృత్యమును జేసినయెడల ప్రాయశ్చిత్తమునకుఁ గూడ పాత్రురాలుగాదు. అట్టి విషయమునందు గర్భధారణయాయ్యెనేని పరిత్య

జింపవలయునని మార్కండేయమునివరుఁడు చెప్పె. గౌతముఁడును నిటుల నే చెప్పి మఱియు నిట్లనియె. భర్తయగువాఁడట్టిభార్యను సభలోనికిరప్పించి నీదుపాపమును జెప్పుమనవలయును. పిదప నదిసత్యమును జెప్పినయెడల చక్కఁగ విచారించి యరువదివిధములగు మృత్తికలచేత ఘృతశౌచమును జేయించి విధ్యుక్తప్రకారముగ నదీజలములచేత స్నానమును జేయించి పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఇట్టిప్రాయశ్చిత్తమును శాస్త్రోక్తప్రకారముగఁ జేసికొనినయెడల పరిశుద్ధురాలగును. అట్లు పరిశుద్ధురాలయినను లోకాపవాదమాత్రము వదలదు. అందువలన దానికి భోజనముమాత్రము చేయవలయునే గాని దానితో సంసర్గాదులను జేయఁగూడదనియె.

—❋ రోగనివృత్త్యర్థంమద్యపానస్తన్యపానప్రాయశ్చిత్తమ్. ❋—

(౨౦౧) అథరోగనివృత్త్యర్థం మద్యపానస్తన్యపాన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యదిరోగనివృత్త్యర్థం ద్విజోవాపితదంగనా। సన్నిపాతే మహాఘోరే తన్నివృత్త్యర్థమంజసా॥ ఔషధార్థం పిబేన్మద్యం స్తన్యంవా వైద్యచోదితం। తదారోగనివృత్తిశ్చే న్మరణంవాభవేద్యత। తస్యదేహావిశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రంసమాచరేత్॥ శవభావేపునఃకర్మకర్తవ్యందేహశుద్ధయే। తప్తకృచ్ఛ్రం ద్విజైఃకార్యం దత్వావాబహుదక్షిణాం। ఏతేనశుద్ధిమాప్నోతి మృతోజీవన్నపివాతదా॥ రోగోల్బణేసన్నిపాతే స్తన్యంవామద్యమేవవా॥ పీత్వాజీవేత్తప్తకృచ్ఛ్రం ప్రాయశ్చిత్తంతు సంస్కృతిరితి। పీత్వాజీవేత్తప్తకృచ్ఛ్రం ప్రాయశ్చిత్తంకృత్వాపున స్సంస్కారం కృత్వాశుధ్యతి। మృతశ్చేత్తప్తకృచ్ఛ్రప్రత్యామ్నాయం బ్రాహ్మణైఃకారయిత్వా తత్పుత్రాదిభిః పరలోకసాధనార్థం శవమన్వారభ్యపటగర్భవిధాన మంత్రావృత్తిఃకార్యా। ఏవమేతస్మిన్కృతేసతి స్తన్యమద్యపానదోషాన్ముక్తః పరలోకేసుఖమాప్నోతి। అన్యథాపాపకస్స్యాదేవ॥ ఇతి హేమాద్రివిరచితే రోగనివృత్త్యర్థం స్తన్యపాన మద్యపాన ప్రాయశ్చిత్తం॥

(౨౦౧) రోగనివృత్తికొఱకు మద్యపాన స్తన్యపానమును జేసినందుకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడైనను, బ్రాహ్మణస్త్రీయైనను రోగనివృత్తికొఱకును, మిగుల ఘోరమగు సన్నిపాతరోగనివృత్తికొఱకును, ఔషధార్థముగ మద్యమునైనను, స్తన్యమునైనను పానముచేసినయెడల తద్దోషపరిహారముకొఱకు తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును నాచరింపవలయును. ఇట్టి కృత్యమును జేసినపిమ్మట మరణమును బొందినను, ఆ

షమునుగురించి బ్రాహ్మణులచేత ప్రాయశ్చిత్తమును జేయించవలయును. అట్లుమద్యపాన స్తన్యపానములు చేసినపిమ్మట రోగనివృత్తియైజీవించినయెడ ల పిమ్మటతత్ప్రకృతిప్రాయశ్చిత్తమును జేసికొని పునరుపనయసంస్కారము నుగూడజేయించుకొనవలయునని దేవలుడుచెప్పె.

## జాతిభ్రంశకరప్రాయశ్చిత్తమ్.

(౨౦౨) అథేదానీంజాతిభ్రంశకర ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ వ్యతీపాతేయదన్నంచమహాపురుషభోజనం। కర్మణ్యారజనేభుక్తిర్దశాహేబలిరేవచ॥ భూతప్రేతపిశాచానాంయదన్నంపరికల్పితం। కుటుంబభోజనంచైవ బ్రహ్మరాక్షసభోజనం॥ ఏతానిదురన్నాని॥ శ్లో॥ ఏతేష్వంధస్తుయోవిప్రోధన లోభపరాయణః। భుజ్యేతస్యగతిర్నాస్తితస్మాదేతత్పరిత్యజేత్॥ అంధోన్నం॥ మార్కండేయః॥ శ్లో॥ దుష్టాన్నంముఖజోభుక్త్వావస్త్రద్రవ్యపరాయణః। తదానీంమృత్యుమాప్నోతిజీవేద్వాపాపకార్యసౌ॥ నతస్యపునరావృత్తిర్యమలోకాత్కదాచన। పిశాచజన్మభుక్త్వాతుతదంతేకుక్కుటోభవేత్॥ గౌతమః॥ శ్లో॥ దుష్టాన్నంపూర్వజోజగ్ధ్వాపూర్వోక్తంపాపరూపితత్॥ సద్యఏవపరంమృత్యుముపస్పృశ్యజ్వరాదభిః। మృత్వానరకమాసాద్యకాలజ్ఞానీభవేత్తదా॥ అస్యదోషోపశాంత్యర్థంప్రాయశ్చిత్తమిదంస్మృతం॥ ప్రాజాపత్యద్వయంకృత్వా పునస్సంస్కారపూర్వకం॥ పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతిభూతలే॥ ఇతి హేమాద్రివిరచితేదురన్నభోజనప్రాయశ్చిత్తం॥

(౨౦౨) ఇకనుజాతిభ్రంశకర ప్రాయశ్చిత్తవిధానమునుచెప్పుచున్నాడు॥ వ్యతీపాతాన్నమును, మహాపురుషభోజనమును, ప్రేతకర్మలయందలిపదియవదినమునందలియన్నమును, భూతప్రేతపిశాచాన్నమును, కుటుంబభోజనమును, బ్రహ్మరాక్షసభోజనమును, దురన్నములనిదేవలుడువచించెను. ఇట్టి దురన్నములను ధనలోభపరాయణుడై భుజించువానికి నుత్తమలోకప్రాప్తిలే దనియును దేవలుడేచెప్పె. బ్రాహ్మణుడగువాడు వస్త్రద్రవ్యపరాయణుడై దుష్టాన్నమునుభుజించినయెడల మృత్యువునుబొందును. జీవించియుండెనేని పాపకారియనబడును. మఱియునట్టివానికియమలోకమునుండి యెన్నటికిని బునరావృత్తిగలుగనేరదు. ఒకవేళగొన్నియుగములకు బునరావృత్తిగలిగెనేని భూలోకమునందుకుక్కుటమైపుట్టునని మార్కండేయుడుచెప్పె. గౌతముడు నునిటులనేచెప్పె యిట్టిదోషనివృత్తికొఱకు పునరుపనయనసంస్కారపూర్వకముగ రెండుప్రాజాపత్యములనాచరింపవలయుననియె. మఱియుపంచగవ్యమునుగూడపానముసేయవలయుననియె.

—✻ అయుతబ్రాహ్మణసహస్ర బ్రాహ్మణభోజనప్రాయశ్చిత్తమ్. ✻—

(౨౦౩) అథాయుతబ్రాహ్మణభోజనసహస్ర బ్రాహ్మణభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ అయుతేవా సహస్రేవా నానావర్ణసమాగమే। పతితక్లీబ బైడాలవ్రాత్యతస్కరపూరితే। కుండగోళకసంకీర్ణేనటగాయకసంకులే॥ పాషండజనసంసర్గే సర్వపాతకిసంకులే। భాండోచ్ఛిష్టస్వయంపాకస్త్రీజనైరుపశోభితే॥ యోవిప్రోలోకమస్వచ్ఛన్నభుంజీయాత్కదాచన। యమోజిహ్వాందహాత్యేవ సందంశైర్భృశదారుణైః॥ తదంతేభువమాసాద్యవిడ్వరాహత్వమాప్నుయాత్॥ మార్కండేయః॥ శ్లో॥ అయుతేవాసహస్రేవాద్విజో బ్రాహ్మణభోజనే। జిహ్వాచాపల్యతఃక్షిప్రం యుదిభుఙ్క్తేద్విజాధమః॥ తస్యజిహ్వాం యమఃక్షిప్త్వానరకేస్తాపయత్యథః। తత్రైవనరకంభుక్త్వాసూచకత్వమవాప్నుయాత్॥ ఏకస్మిన్దివసేభుక్త్వాపంచగవ్యంపిబేత్తతః॥ పక్షంవామాసమాత్రంవాభుక్త్వావిప్రోనిరంతరం। తప్తంపరాకంచాంద్రంచకృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ వర్షోపరిహిశూద్రత్వం ప్రాప్నోతిబహువత్సరాన్॥ ఇతిహేమాద్రివిరచితేఅయుతభోజన సహస్రభోజనప్రాయశ్చిత్తమ్।

(౨౦౩) అయుతబ్రాహ్మణసహస్రబ్రాహ్మణబోజనప్రాయశ్చిత్తము॥ పదివేలు లేక వేయిసంఖ్యగలబ్రాహ్మణులుభుజించుస్థలమునందు బోజనమును జేయగూడదు. అట్లమితసంఖ్యగలస్థలమునందు మారువేషములనుధరించుకొని నానావర్ణములవారును జేరుదురు. మఱియునచ్చోట పతితక్లీబబైడాలవ్రాత్యతస్కరాదులుందురు, ఇంతయగాక కుండగోళకులును, నటవిటగాయకులును, పాషండమహాపాతకులును, నివసించియుందురు. కావుననచ్చోటభోజనమును జేయగూడదు. ఒకవేళ జేసినయెడల యమధర్మరాజటివాని నాలుకను గోసివేయుంచును. మఱియుననేకములగు నరకములయందు బడద్రొబ్బించునని దేవలుఁడువచించె. మార్కండేయమునివరుఁడునుసటులనేచెప్పి ప్రాయశ్చిత్తమునుగూడవిధించె. అదియెట్లనిననొకదినముమాత్రముభుజించినవాడు పంచగవ్యప్రాశనను జేయవలయును. పక్షముదినములయినను, మాసముదినములైనను, నిరంతరమునుభుజించినయెడల క్రమముగ తప్తకృచ్ఛ్ర, పరాకకృచ్ఛ్ర, చాంద్రాయణములనాచరింపవలయును. సంవత్సరకాలమైనను, అంతకంటె నెక్కుడుకాలమైనను నచ్చోటభుజించువాడు శూద్రుడగునని యెఱుఁగునది.

—(✻) దీర్ఘసత్రభోజనప్రాయశ్చిత్తమ్. (✻)—

(౨౦౪) అథదీర్ఘసత్రభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ వర్షద్వయంవావర్షంవాయోవాకోవాజనాధిప। సంకల్ప్యభోజయేద్విప్రాన్తద్దీర్ఘం

సత్రముచ్యతే॥ విప్రస్సత్రేనభుంజీయాత్పూర్వవ ద్దుష్టసంగమాత్॥ మహాదోషమవాప్నోతి నరకంచాధిగచ్ఛతి॥ గాలవః॥ శ్లో॥ దీర్ఘసత్రేనభుంజీయాదెకస్మిన్దివసేనృప। మహాదోషమవాప్నోతితత్రైనానాజనాగమాత్॥ కర్తారంస్వకృతంపుణ్యం సంవత్సరముపార్జితం। సద్యస్తత్ప్రాప్నుయాద్భోక్తాతత్సర్వమన్నమాత్రపరిగ్రహాత్॥ ప్రాయశ్చిత్తీభవేత్తస్మాదన్యథాదోషకార్యపి॥ మాససంఖ్యాదికమాలోచ్య పూర్వప్రాయశ్చిత్తవత్స్వయంకుర్యాత్॥ తేనశుద్ధోభవతినాన్యథా॥ ఇతిదీర్ఘసత్రభోజన ప్రాయశ్చిత్తమ్॥

(౨౦౪) దీర్ఘసత్రభోజనప్రాయశ్చిత్తము॥ ఒకసంవత్సరకాలమయినను, రెండుసంవత్సరములకాలమైనను, నిరంతరముగ బ్రాహ్మణులనుభుజింపజేయుదునని సంకల్పమును జేసి బ్రాహ్మణులకన్నదానమును జేయువాడు మహాపాపవంతుడై నరకలోకమును బొందునని దేవలుడుచెప్పె. గాలవుడును నిటులనే చెప్పి సంవత్సరకాలముదనుక నట్టిచోటభుజించువానివల్ల పుణ్యమంతయు నుయజమానునిబొందునవియును, అదికారణముగభోక్తయగువానికి ప్రాయశ్చిత్తమునువిధింపవలయుననియును జెప్పె. అదియెట్లనిన మాససంఖ్యాదికమునాలోచించి పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయుననియును, ఇట్లు సేసినయెడల పరిశుద్ధుడగుననియును జెప్పె.

——(*) శూద్రసత్రభోజనప్రాయశ్చిత్తమ్. (*)——

(౨౦౫) అథశూద్రసత్రభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ శూద్రసత్రేన భుంజీతప్రాణైః కంఠగతైరపి । ఇచ్ఛన్విప్రోమహాలోకందుస్సంగాద్వామహాభయాత్ । జెహంతెనరకంగత్వాభవేద్భువి సవాయసః। చండాలోవా॥ మార్కండేయః॥ శ్లో॥ శూద్రాన్నంశూద్రసంపర్కంమాసమెకంనిరంతరం। కృత్వాశూద్రత్వమాసాద్యచండాలఃకోటిజన్మసు॥ మనుః॥ శ్లో॥ తదన్నంతద్గృహేభుక్తిస్తదనుజ్ఞానిరీక్షణం। తదనుజ్ఞామవాప్యాథస్వయంవాపనిరీక్షణం॥ భుక్త్వావిప్రస్సపాపీయాన్షడ్విధంశూద్రభోజనం । ఏతేషామెకమన్నంవాభుక్త్వావిప్రస్తుచాపలాత్॥ మహాంతంనరకంగత్వా వాయసత్వమవాప్నుయాత్। పక్షేమాసఋతావబ్దే భోజనేతుయథాక్రమం॥ యావకంతప్తకృచ్ఛ్రంచప్రాజాపత్యమథైందవం। క్రమశశ్శుద్ధిమాప్నోతికృత్వాపాపాద్యమానుగాత్॥ విప్రస్త్రీణాంభోజనేప్రాప్తే పక్షమాసాదిక్రమేణతత్తత్ప్రతిపదోక్తంవిప్రస్యార్థం ప్రాయశ్చిత్తంవెదితవ్యమ్॥ ఇతిహేమాద్రౌ శూద్రాన్నభోజన ప్రాయశ్చిత్తం॥

(౨౦౫) ఇకనుశూద్రసత్రభోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥

ప్రాణములుకంఠగతములయినను శూద్రసత్రమునందు భోజనమును జేయగూడదు. అట్లుగాకయొకవేళ మహాభయమువలననైనను, దుస్సంగమువలననైననుభుజించినయెడల దేహాంతమందునరకమునుబొంది పిదపవాయసమైనను, చండాలుడుగనైనుపుట్టునని దేవలుడువచించె. నెలదినములేడతెగకశూద్రాన్నమునుభుజించినను, శూద్రసంపర్కమునుబొందినను శూద్రత్వమునుబొందును. మఱియునుగోటిజన్మలయందుగూడ చండాలుడైపుట్టునని మార్కండేయుడుచెప్పె. శూద్రాన్నము, శూద్రునింటభుజించుట, శూద్రాజ్ఞానిరీక్షణము, శూద్రాజ్ఞనుబొందిస్వయముగనిరీక్షించుట, అనిశూద్రభోజనమారువిధములు. ఇట్లుషడ్విధములగు శూద్రాన్నమునుభుజించినబ్రాహ్మణుడు గొప్పదగునరకమునుబొంది పిమ్మటవాయసమైపుట్టును. పదునైదుదినములీకృత్యమునుజేసినవాడు యావకాహారుడుగావలయును. మున్నదిదినములు భుజించినవాడు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును నాచరింపవలయును. రెండుమాసముల కాలముభుజించినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమును నాచరింపవలయును. సంవత్సరకాలముభుజించినవాడు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. ఇట్టిప్రాయశ్చిత్తములను జేసికొనినయెడల పరిశుద్ధుడగును. విప్రస్త్రీలిట్టికృత్యమునుజేసినయెడల బ్రాహ్మణులకువిధించినప్రాయశ్చిత్తములయందు సగముప్రాయశ్చిత్తమునువిధింపవలయును. ఇట్లనిమనువువచించె.

—(*) శూద్రవేశ్యాగృహస్వయంపాకాన్నభోజనప్రాయశ్చిత్తమ్. (*)—

(౨౦౬) అథశూద్రవేశ్యా గృహయోస్స్వయంపాకాదిభోజనే ప్రాయశ్చిత్తమాహ॥ జాతుకర్ణిః॥ శ్లో॥ శూద్రవేశ్యాగృహేవిప్ర స్స్వయంసంపచన్మృదా। తత్రైవభోజనంకృత్వా సద్యశ్చండాలతాంవ్రజేత్॥ దేవలః॥శ్లో॥ వేశ్యాశూద్రాలయేరాజన్ తద్ద్రవ్యంపాచయేద్ద్విజః। తత్రైవభోజనంకుర్యాత్తదనుజ్ఞాపురస్సరం। జ్ఞానేననిష్కృతిర్నాస్తి ప్రాయశ్చిత్తాయుతైరపి॥ జాబాలిః॥ శ్లో॥ వేశ్యాశూద్రగృహేరాజన్ గృహీత్వామంసకృద్ద్విజః॥ తత్రైవపక్త్వాతద్ద్రవ్యం భోజయిత్వావిచారయన్। సమహాంతంగిరింగత్వాతత్రైవపతనంచరేత్॥ తేనశుద్ధిమవాప్నోతి నాన్యథాగతిరస్తిహి॥ పరాశరః॥ శ్లో॥ శూద్రాలయేవా వేశ్యాయాఆమంత్రకృత్వాతదర్పితం। భుక్త్వావిప్రస్సపాపీయాన్మహాంతంనరకంవ్రజేత్ ॥ పునర్భూతలమాసాద్యచండాలత్వమవాప్నుయాత్। తద్దోషపరిహారార్థంప్రాయశ్చిత్తమిదంస్మృతం। తదానీంవాపరేద్యుర్వాచాపయిత్వాశిరోరుహాన్। స్నానంకృత్వాతతఃపశ్చాత్ తప్తకృచ్ఛ్రంసమాచరేత్॥ పంచగవ్యంపిబేద్వాపి చ్ఛుద్ధ్యర్థం మనిస్సితం। విప్రస్త్రీణాం

మప్యేవం॥ ఇతి హేమాద్రివిరచితేశూద్రవేశ్యా గృహభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౦౬) శూద్రవేశ్యాగృహ స్వయంపాకాన్నభోజన ప్రాయశ్చిత్తము॥ బ్రాహ్మణుఁడు శూద్రవేశ్యాగృహమునందు ఆమపదార్థమునుస్వయముగఁ బాకమును జేసికొని భుజించినయెడల తత్క్షణమే చండాలత్వమును బొందునని జాతుకర్ణి వచించె. బ్రాహ్మణుఁడగువాఁడు వేశ్యాశూద్రాలయమని దెలిసియే యచ్చోటపాకమును జేసికొని భుజించినవాని నిష్కృతిలేదని దేవలుఁడువచించె. మఱియు నెన్నిప్రాయశ్చిత్తములను జేసికొనినను బ్రయోజనములేదనియు. జాబాలియును నిటులనే చెప్పె యిట్టిదుష్కృత్యమును జేసినవాఁడు గొప్పదగు పర్వతముదగ్గరకుఁబోయి దానిమీదనెక్కి యచ్చోటనుండి క్రిందికిదుమికినయెడల పరిశుద్ధుఁడగునని వచించె. పరాశరుఁడును నీకృత్యమును జేయఁగూడదనిచెప్పచుఁ జేసినవానికిఁ బ్రాయశ్చిత్తమునుగూడవిధించె. అదియెట్లనిన నిట్టిదుష్కృత్యమును జేసినవాఁడు, అప్పుడేయైనను, పరదినమునందైనను తలవెండ్రుకలను గొరిగించుకొని స్నానమును జేసి పిదప తప్తకృచ్ఛ్రమును జేసికొని పంచగవ్యప్రాశనమును జేసినయెడల శుద్ధుఁడగుననియు. స్త్రీలకును నిటులనే యర్ధప్రాయశ్చిత్తమును విధించె.

—— ❀ అజ్ఞానకోద్దిష్టభోజనప్రాయశ్చిత్తమ్. ❀ ——

(౨౦౭) అథాజ్ఞానకోద్దిష్టభోజన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ మృతాహైకాదశేవిప్రోభుక్త్వాకబళసంఖ్యయా। తావద్యుగసహస్రాణి రౌరవంనరకంవ్రజేత్॥ తదంతేభువమాసాద్యరక్తపాస్తుభవేద్ధ్రువమ్। యావంత్యన్నపులాకాని కబళేకబళేనృప॥ తావంతఃకృమయస్సర్వే భక్షితాస్తేనపార్థివ॥ మహానారదీయే॥ శ్లో॥ ఏకాహాదివసేరాజన్ ద్వాత్రింశత్కబళసంఖ్యయా। గృహీత్వాయోల్ప మశ్నాతి తావంతఃకృమిరాశయః ॥ భక్షితాస్తేన రాజేంద్రతతస్త్వేతత్పరిత్యజేత్ । కబళేకబళేచాంద్రం కృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ పునఃకర్మవిధానేన పతగర్భేణశుద్ధ్యతి। అన్యథా దోషమాప్నోతి ప్రేతభూతశ్చరేద్భువి॥ మహాపాతకయుక్తోవా యుక్తోవా సర్వపాతకైః। పతగర్భవిధానేన పునస్సంస్కారకృన్నరః॥ శుద్ధిమాప్నోతిరాజేంద్ర పతగర్భోమహత్తరః॥ ఇతి హేమాద్రివిరచితే ఏకాహభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౦౮) అజ్ఞానకోద్దిష్టభోజనప్రాయశ్చిత్తము॥ మృతదినము మొదలుకొని నెలదినములలోపల యేకదివసమునందు కబళసంఖ్యచేత భోజనమును జేసినయెడల నెన్నివేలయుగములు రౌరవమను నరకమును బొందుననియును, మఱియును దదంతమునందు భూలోకమునుబొంది రక్తపానమును జేయు

వాఁడగుననియును, ప్రతికబళమునందును నెన్నిపులాకలుండునోయన్నిపురుగు లచేత భక్షింపఁబడుననియును దేవలుఁడువచించె. మరణాదిపదునొకండవ దినమునందు ద్రవ్యాశచేత ముప్పదిరెండగుకబళములను గ్రహించి భుజించిన బ్రాహ్మణుని క్రిమిసముదాయము యమలోకమునందు భుజించును. అట్టిపా పోపశమనముకొఱకు ప్రాయశ్చిత్తము నాచరింపవలయును. అదియెట్లనిన నె న్నికబళములు భుజించునో యన్నిచాంద్రాయణముల నాచరింపవలయును. పిమ్మట పటగర్భవిధానముచేత నుపనయనమును జేసికొనవలయును. అట్లు గాదేని దోషవంతుఁడయియే యుండును. మఱియును ప్రేతభూతుఁడైసం చరించును. మహాపాతకయుక్తుఁడైనను, సర్వపాతకములతోఁ గూడుకొనిన ను, పటగర్భవిధానముచేత పునరుపనయన సంస్కారమునుబొందినయెడల పరిశుద్ధుఁడగునని మహానారదీయమునందుఁ జెప్పఁబడియె.

—— నగ్నశ్రాద్ధాద్యన్నప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ——

(౫౦౮) అథనగ్నశ్రాద్ధాద్యన్నప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దే వలః॥ శ్లో॥ నగ్నశ్రాద్ధేనవశ్రాద్ధే గృహీత్వాన్నంద్విజోత్తమః। నతస్యపున రావృత్తిర్యమలోకాత్కదాచన॥ జాయతే భువిదుష్టాత్మా స్థావరత్వమవా ప్నుయాత్॥ మరీచిః॥ శ్లో॥ నగ్నశ్రాద్ధంనవశ్రాద్ధం దశాహాభ్యంతరేద్వ యం॥ ప్రాప్తంపాపాలయం నౄణాంమహతాంగర్హితంద్వయం॥ పరాశ రః॥ శ్లో॥ నవశ్రాద్ధంచనగ్నంచ సూతకాంతర్హితంద్వయం। తద్వయంప్ర తిగృహ్యాశుమహారౌరవమశ్నుతే॥ మరీచిః॥ శ్లో॥ నగ్నశ్రాద్ధేతు చాంద్రం స్యా త్ప్రాజాపత్యంనవాదికే। ఆద్యస్థానే తదర్ధంస్యాత్తదర్ధంస్యాత్సపిండనే॥ ప్రాయశ్చిత్తమిదంకృత్వా శుద్ధోభవతిపూర్వజః। విప్రప్రతిగ్రహేయథాశా స్త్రంతుక్షత్రియవైశ్యయోః ప్రతిగ్రహేద్విగుణం॥ ఇతి హేమాద్రివిరచితే నవ శ్రాద్ధాదిప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౫౦౯) నగ్నశ్రాద్ధాద్యన్న ప్రతిగ్రహప్రాయశ్చిత్తము॥ నగ్నశ్రాద్ధ మునందును నవశ్రాద్ధమునందును, అన్నము గ్రహించినవానికి యమలోక మునుండి పునరావృత్తిలేదనియును, కొన్నిదినములకు భూలోకమునందు జ న్మించినయెడల స్థావరత్వమునుబొంది పుట్టునని దేవలుఁడువచించె. మరీచి యునునగ్నశ్రాద్ధనవశ్రాద్ధము, అనురెంటియందును భుజించుట మిగులఁబా పమును గలుగఁజేయుననియె. నగ్నశ్రాద్ధమునందు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. నవాదికమునందు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవల యును. ఆద్యస్థానమునందర్ధప్రాజాపత్యమును జేసికొనవలయును. సపిండ

నమునందర్భములో నర్ధమునాచరింపవలయును. ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధతగలుగును. క్షత్రియవైశ్యులకు ద్విగుణముగ ప్రాయశ్చిత్తమును విధించవలయునని మరీచియేవచించె. నవశ్రాద్ధ నగ్నశ్రాద్ధములయందన్నమును భుజించినవాఁడు మహారౌరవమనునరకమునుబొందునని పరాశరమునివరుఁడుచెప్పె.

—— సూతకద్వితయేభోజనప్రాయశ్చిత్తమ్. ——

(౨౦౯) అథసూతకద్వితయేభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ సూతకద్వితయే రాజన్ జ్ఞాతేరన్యద్విజో యది । అజ్ఞానాద్భోజనంకృత్వా సద్యస్సంస్కారమర్హతి॥ జ్ఞాత్వాతదన్నంసంపాద్యపంచగవ్యంపిబేత్తతః। ఛర్ద్యభావేతదాస్నాత్వా పునఃకర్మపరేహని। ఉపోష్యంజనీమేకాంపంచగవ్యేనశుద్ధ్యతి। అథవానరకంఘోరంయాత్యేవనసంశయః॥ మార్కండేయః॥ శ్లో॥ సూతకద్వితయేజ్ఞానాద్విప్రోభోజనమాదరాత్। కృత్వాసద్యఃపతత్యేవ పునస్సంస్కారమాచరేత్॥ ఛర్దయిత్వాతదన్నంవా పంచగవ్యేనశుద్ధ్యతి॥ ఛర్ద్యభావేతదాస్నాత్వా పునఃకర్మవిధానతః। కృత్వాశుద్ధిమవాప్నోతి నాన్యథాశుద్ధిరీరితా॥ ఇతిహేమాద్రివిరచితే సూతకద్వితయభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౦౯) సూతకద్వితయమునందు భోజనమును జేసినందుకుఁ ప్రాయశ్చిత్తము॥ జ్ఞాతులకంటె నితరులగువారియొక్క సూతకద్వయమునందును భుజింపఁగూడదు. అజ్ఞానమువలన భోజనమును జేసినవాఁడప్పుడే సంస్కారమును బొందవలయును. తెలిసియేభుజించినయెడల పంచగవ్యప్రాశనను జేయవలయును. ఛర్దిలేనియెడల నప్పుడు స్నానమును జేసి కర్మవిధానానుసారముగ నుపనయనాది సంస్కారములను పరదినమునందు జేసికొనవలయును. అదియెట్లనిన ఒకదినమురాత్రింబగళ్లు లుపవసించి మరుదినము పంచగవ్యప్రాశనమును జేసినయెడల పరిశుద్ధుఁడగును. అట్లు చేసికొననియెడల ఘోరనరకమునుబొందును. మార్కండేయమునివరుఁడును నీప్రకారమే ప్రాయశ్చిత్తాదికమునువిధించె.

—— శ్రాద్ధావశిష్టాన్నభోజనేప్రాయశ్చిత్తమ్. ——

(౨౧౦) అథశ్రాద్ధావశిష్టాన్నభోజనేప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ అమాయాంపైతృకశ్రాద్ధే పర్వశ్రాద్ధేమహాలయే। శ్రాద్ధేవాషణ్ణవత్యాశ్చ సపిండీకరణేతథా॥ మాసికేషుతథావిప్రోనకుర్యాచ్ఛేషభోజనం॥ మహాభారతే॥ శ్లో॥ చౌళకర్మణిభోక్తారో భోక్తారోయజ్ఞకర్మణి। శ్రాద్ధశిష్టాన్నభోక్తారః

స్తేవైనిరయగామినః ॥ సగోత్రాణాంసకుల్యానాం జ్ఞాతీనాంచనదోషభాక్। పుత్రీణామన్యగోత్రాణాం విధవానాంనశస్యతే ॥ యతీనాంకర్మనిష్ఠానాంమహతాంబ్రహ్మచారిణాం। అభోక్తవ్యంపైతృకాదౌ పిశ్రశిష్టం మహాత్మనాం॥ జాబాలిః॥ శ్లో ॥ శ్వశురస్యగురోర్వాపి మాతులస్యమహాత్మనః। జ్యేష్ఠభ్రాతుశ్చపిత్రోశ్చ బ్రహ్మనిష్ఠస్యజ్ఞానినః॥ ఏతేషాం శ్రాద్ధశిష్టాన్నం భుక్త్వాదోషానవిద్యతే॥ ఇతికేచిత్ప్రశంసంతి ఇతియత్తదసాంప్రతం ॥ లైంగే॥ శ్లో॥ మాతులస్యగురోర్వాపి శ్వశురస్యమహాత్మనః। పిత్రోశ్చ బ్రహ్మనిష్ఠస్య జ్యేష్ఠభ్రాతుశ్చజ్ఞానినః॥ పైతృకేషునభోక్తవ్యం విధవానాంచహామునే। విధవానామన్యగోత్రిణాం శ్రాద్ధేష్వేతేషునభోక్తవ్యం శ్రాద్ధశిష్టాన్నం ॥ అన్యగోత్రాణాం బ్రహ్మచారిణామపి॥ తదాహమార్కండేయః ॥ శ్లో ॥ పిత్రాదీనామథాన్యేషాం శ్రాద్ధశిష్టాన్నభోజనం। వ్రతినాంవిధవానాంచయతీనాంచవిగర్హితం॥ విధవానామన్యగోత్రాణామిత్యర్థః। జాబాలిః॥ శ్లో ॥ విప్రస్త్వన్యగృహేశ్రాద్ధే చశేచ్ఛిష్టాన్నభోజనం । ప్రాజాపత్యేనశుద్ధస్స్యాత్స్వజ్ఞాతిగోత్రేణనదోషభాక్॥ అన్యగోత్రావితంతుర్యాచ్ఛ్రాద్ధశిష్టాన్నభుగ్యది। కేశానాంవపనంకృత్వా తప్తకృచ్ఛ్రంసమాచరేత్॥ వ్రతినాంయోగనిష్ఠానాం తథాసన్యాసినామపి। ఉభయోర్దేహశుద్ధ్యర్థం పరాకంకృచ్ఛ్రమాచరేత్॥ సన్యాసీవపనంకృత్వా తథాస్నానంసమాచరేత్ । ఉపవిశ్యశుచిర్భూత్వా ప్రణవంలక్షమాచరేత్॥ సర్వత్రపంచగవ్యప్రాశనం సన్యాసిభిర్వినా । బ్రహ్మచారిణాంస్వపిత్రన్నశిష్టభోజనేనదోషః । వ్రతినామపివిధవానామన్యగోత్రాణాం తత్రాపినభోక్తవ్యం । సన్యాసిభిర్నకుత్రాపి ॥ ఇతిహేమాద్రివిరచితే శ్రాద్ధశిష్టాన్నభోజన ప్రాయశ్చిత్తమ్॥

(౨౧౦) అమావాస్యయందును, పైతృకశ్రాద్ధమునందును, పర్వశ్రాద్ధమునందును, మహాలయమునందును, శ్రాద్ధమునందును, షణ్ణవత్యాఖ్యశ్రాద్ధమునందును, సపిండీకరణమునందును, మాసికములయందును, బ్రాహ్మణుఁడగువాఁడు శేషాన్నమును భుజింపఁగూడదని దేవలుఁడు వచించె. చౌలకర్మమందు భుజించువారును, యజ్ఞకర్మయందుభుజించువారును, శ్రాద్ధశిష్టాన్నమును భుజించువారును, నరకలోకమునుబొందుదురనియును, సకుల్యులు, సగోత్రులు, జ్ఞాతులు, అగువారియొక్కయు శ్రాద్ధాదులయందలి శేషాన్నము దోషకారికాదనియును, యతులు, కర్మనిష్ఠులును, బ్రహ్మచారులును, శ్రాద్ధాదులయందు భుజింపఁగూడదనియును మహాభారతమునందుఁ జెప్పఁబడెను. శ్వశురునియొక్కయు, గురువుయొక్కయు, మేనమామయొ

క్కయు, జ్యేష్ఠభార్యయొక్కయు, తల్లిదండ్రులయొక్కయు, బ్రహ్మజ్ఞానుల యొక్కయు, శ్రాద్ధములయందలి శేషమును భుజించువారు దోషభాకులుగారని జాబాలవచించె. లింగపురాణమునందును నిటులనే చెప్పఁబడెను. మఱియు నిట్టివారి శ్రాద్ధములయందుఁగూడ విధవాంగనలు భుజింపఁగూడదనియును లింగపురాణమునందే చెప్పఁబడెను. పితాదులయొక్కయు నటులనే యితరులయొక్కయు శ్రాద్ధశిష్టాన్నభోజనము వ్రతులకును, విధవలకును, యతులకును నిందితమని మార్కండేయుఁడు వచించె. ఇతరులయింటియందలి శ్రాద్ధశేషాన్నమును భుజించిన బ్రాహ్మణుఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రముచేత పరిశుద్ధుఁడగును. జ్ఞాతులయందును, సగోత్రులయింటియందును దోషయుతముగాదని యెఱుంగవలయును. విధవాంగన యన్యగోత్రజుల యింటియందు శ్రాద్ధశేషాన్నమును భుజించినయెడల వపనమును జేయించుకొని తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఇట్టికృత్యమును జేసిన వ్రతులును, యోగస్థులును, సన్యాసులును జేసినయెడల దేహశుద్ధికొఱకు పరాకకృచ్ఛ్రమును నాచరింపవలయును. సన్యాసియగువాఁడు వపనమును జేయించుకొని స్నానమునాచరించి కూర్చుండి శుచియై ప్రణవమునాచరింపవలయును. సన్యాసులకుఁ బంచగవ్యప్రాశనమును విధింపఁగూడదు. బ్రహ్మచారులకు స్వపిత్రన్నశిష్టభోజనమునందు దోషములేదు. వ్రతులును, విధవాంగనలును, ఇతరగోత్రజుల శ్రాద్ధాన్నశేషమును భుజింపఁగూడదు. ఇట్లని జాబాలివచించె.

## ——* క్రీతాన్నభోజనప్రాయశ్చిత్తమ్. *——

(౨౧౧) అథ క్రీతాన్నభోజన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ శ్లో॥ దేవాలయేషుమార్గేషు గ్రామేషునగరేషుచ। విప్రః క్రీతాన్నభోక్తాచేత్ తదా నరకమాప్నుయాత్॥ మహాభారతే॥ శ్లో॥ క్రీతాన్నం దేవతాగారె గ్రామేవాపట్టణేపివా॥ యోభుక్తేపూర్వజోజ్ఞానాన్నరకం ససమాప్నుయాత్। దేవీపురాణే॥ శ్లో॥ విప్రఃకంఠగతప్రాణః క్రీతాన్నంభక్షయేద్యది। గ్రామేవానగరే తీర్థే మహాదేవాలయేపివా ॥ సగత్వానరకం ఘోరం నానాయోనిషుజాయతే। తస్మాత్తస్యవిశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తముదీరితం ॥ త్రిరాత్రంభోజనేకాయం పక్షేతప్తంసరంతరం॥ మాసాతప్తంతుమాసేచవత్సరె చాంద్రముచ్యతే। అతఃపరంశూద్రతుల్యో విద్వానపిసదోషభాక్। విప్రస్త్రీణామేతదర్ధం॥ యతిబ్రహ్మచారి విధవానాంతద్వైగుణ్యం మహాక్షేత్రమితి జనసాధ్వశ్యాత్ । క్రీత్వాభోజనేవిశేషమాహ॥ జాబాలః॥ శ్లో॥ విప్రస్త్వైతన్మహాక్షేత్రం మహా

తీర్థంజనావృతం। క్రీత్వాన్నంజనసాదృశ్యా దితిజగ్ధ్వాసకృద్యది॥ కేశానాంవపనంకృత్వా తప్తకృచ్ఛ్రంసమాచరేదితి॥ ఇతి హేమాద్రివిరచితే క్రీతాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౩౧౧) ఇఁకను క్రీతాన్నభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ దేవాలయములయందును, మార్గములయందును, గ్రామములయందును, నగరములయందును, క్రయక్రీతాన్నమును భుజించినవాఁడు నరకమును బొందునని దేవలుఁడువచించె. మహాభారతమునందును నిటులనే చెప్పఁబడియె. బ్రాహ్మణుఁడగువాఁడు ప్రాణములుకంఠగతములయినను క్రీతాన్నమును భుజింపఁగూడదు. భుజించినవాఁడు నరకలోకములనుబొంది నానాయోనులయందుఁ బుట్టును. కావునఁ దత్పాపోపశమనము కొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన మూఁడుదినములట్టియన్నమును భుజించినవాఁడు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. పదునైదుదినములు భుజించినవాఁడు తప్తకృచ్ఛ్రము నాచరింపవలయును. మాసముదినములు భుజించినవాఁడు మహాతప్తకృచ్ఛ్రమును జేసికొనవలయును. సంవత్సరకాలముభుజించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. సంవత్సరమునకుఁ బిమ్మటఁగూడ నట్టియన్నమును భుజించినవాఁడు విద్వాంసుఁడైనను శూద్రతుల్యుఁడగును. విప్రస్త్రీలకీప్రాయశ్చిత్తమునందు సగము ప్రాయశ్చిత్తమును విధింపవలయునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. మహాక్షేత్రాదికమునందు క్రీతాన్నమునుభుజించినవాఁడు తప్తకృచ్ఛ్రమును జేసికొనవలయునని జాబాలివచించె.

——❋ సంఘాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ❋——

(౩౧౨) అథ సంఘాన్నభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ సంఘీభూయయదావిప్రాస్త్రియోవారాజవల్లభ। సైవ్వసైవ్వద్రవ్యైశ్చైకభాండేపాచయేయుః పృథక్పృథక్॥ పృథక్పృథగితిభిన్నపాత్రైవా। భుక్త్వాదోషమవాప్నోతి శూద్రతుల్యాభవంత్యథ॥ జాబాలిః॥ శ్లో॥ విప్రాస్తత్రైకగ్రామస్థాస్తీర్థయాత్రాదికర్మసు। సంఘీభూయస్వకైర్ద్రవ్యైః పాచయిత్వాన్నభోజినః॥ శూద్రతుల్యాభవంత్యేతే నరకంవావిశేషతః। ఏకగ్రామస్థాఇతిపదం యత్రయత్రసంఘీభావస్తత్రతత్రయోజనీయం॥ గౌతమః॥ శ్లో॥ సంఘీభూయద్విజాస్సర్వే మార్గేతీర్థాగమేపివా। స్వద్రవ్యమేళనంకృత్వా పక్త్వాభుక్త్వైకదేశతః॥ తేసర్వేనరకంయాంతి శూద్రతుల్యానసంశయః। తేషామువంమునిప్రోక్తం ప్రాయశ్చిత్తంవిశుద్ధిదం। ఏకరాత్రేపంచగవ్యం ద్విరా

త్రియావకంచరేత్॥ ప్రాజాపత్యం త్రిరాత్రేచ పక్షేచాంద్రాయణంస్మృతం। మాసేతు శూద్రతుల్యాస్స్యుస్స్త్రీణామర్థం మనీషిభిరితి॥ ఇతి హేమాద్రివిరచితే సంఘాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౧౩) ఇఁకను సంఘాన్నభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ స్త్రీలయినను, పురుషులయినను, గుంపుగాఁగూడి తమతమద్రవ్యమును జేర్చి యొకభాండమునందు పచనమును జేసికొనినను, లేక భిన్నపాత్రలయందే భిన్నభిన్నముగాఁ బచనముచేసికొని యొకచోట భుజించినను శూద్రతుల్యులగుదురని దేవలుఁడు వచించెను. జాబాలియును నిటులనేవచించె. మార్గమునందైనను, తీర్థములయందైనను, గ్రామములయందైనను గుంపుగాగూడి పూర్వోక్త ప్రకారముగఁ బచనముని జేసికొని భుజించువారు శూద్రతుల్యులగుదురు. మఱియును నరకలోకమును బొందుదురు. కావున నట్టివారలకు ప్రాయశ్చిత్తముగూడఁ జెప్పఁబడియె. అదియెట్లనిన నొకదినమిట్టికృత్యమును జేసినవారు పంచగవ్యప్రాశనమును జేయవలయును. రెండుదినములు సేసినవారు యావకాహారులు గావలయును. మూఁడుదినములు సేసినవారు ప్రాజాపత్యకృచ్ఛ్రమును జేసికొనవలయును. పక్షముదినములిట్టికృత్యమును జేసినవారు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. మాసముదినము లీకృత్యమును జేసినవారు శూద్రులగుదురని గౌతముఁడు చెప్పె.

—* యాగాన్నభోజన ప్రాయశ్చిత్తమ్. *—

(౨౧౪) అథ యాగాన్నభోజన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యజ్ఞేషు పశుబంధేషు యాగార్థం పచనం హవిః। తథా విప్రైర్నభోక్తవ్యం లోకేప్సుభిరకల్మషైః। పచనం హవిరితి యజ్ఞశాలాయాం దీక్షితగృహే వా సంపాదితమన్నమిత్యర్థః॥ మహాభారతే॥ శ్లో॥ పశుబంధేషు యజ్ఞేషు అన్నమత్తియదా ద్విజః। తదా నరకమాప్నోతి స బిడాలసమో ద్విజః॥ కణ్వః॥ శ్లో॥ యో విప్రో యాగశాలాసు వపాయాగాదథో యది। భుక్త్వాన్నం తత్ర సంభూతం మహాపాతకమశ్నుతే॥ పునస్తస్యోపనయనం ప్రాజాపత్యేన బుధ్యతి॥ ఏతత్ప్రాయశ్చిత్తం వపాయాగాత్పూర్వం భోజనే వేదితవ్యం॥ తతః పరం భోజనే విశేషమాహ॥ గౌతమః॥ శ్లో॥ వపాయాగాత్పురా విప్రో భోజనే దీక్షితాలయే। ప్రాజాపత్యం విశుద్ధ్యర్థం మునిభిః పరికీర్తితం॥ ఋత్విజాం విప్రస్త్రీణామేవం వేదితవ్యం॥ తదేవాహ కాత్యాయనః॥ శ్లో॥ ఋత్విజాంచ పరస్త్రీణాం భోక్తౄణాం యాగసద్మని। ఉపోష్య రజనీమేకాం పంచగవ్యేన శుద్ధ్యతి॥ సువాసినీనాం తద్భర్తుః పాదోదకం। విధవానాం కే

శవపనం బ్రహ్మకూర్చవిధానంచ॥ యతిబ్రహ్మచారిణాం వపాయాగాత్పూర్వమన్నభక్షణేచాంద్రం। అతఃపరం ప్రాజాపత్యం॥ ఇతి హేమాద్రివిరచితేయాగాన్నభోజన ప్రాయశ్చిత్తమ్॥

(౨౬౪) యాగాన్నభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ యజ్ఞములయందును, పశుబంధములయందును, యాగముకొఱకు పచనమును జేసిన హవిస్సును భుజింపఁగూడదు. హవిస్సనఁగా యజ్ఞశాలయందయినను, దీక్షితగృహమునందైనను సంపాదితమైన యన్నము, ఇట్లని దేవలుఁడు వచించె- పశుబంధములయందును, యజ్ఞములయందును, అన్నమును భుజించినబ్రాహ్మణుఁడు బిడాలసముఁడగును. మఱియును నరకమును బొందును- ఇట్లనె మహాభారతమునందుఁ జెప్పఁబడియె- కణ్వుఁడును నిటులనే చెప్పి యట్టివానికి పునరుపనయనములోఁగూడ ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయుననియె- గౌతముఁడును నిటులనే చెప్పి స్త్రీలకును నిట్టిప్రాయశ్చిత్తమునే విధింపవలయునని చెప్పె. యాగశాలయందు భోజనమును జేసిన ఋత్విక్కులు, పరస్త్రీలు, మొదలగువారందఱును నొకరాత్రియంతయును నుపవసించి పంచగవ్య ప్రాశనమును జేసినయెడల పరిశుద్ధులగుదురు- సువాసినులు భర్తృపాదోదకమును పానముచేయవలయును. విధవాంగనలకు కేశవపనమును, బ్రహ్మకూర్చవిధానమును జేయింపవలయును. యతిబ్రహ్మచారులువపాయాగముకంటెఁ బూర్వమునందన్నమును భక్షించినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును- పిమ్మటఁ బ్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును- ఇట్లని కాత్యాయనుఁడువచించె-

## ——❋ చౌళాన్నభోజన ప్రాయశ్చిత్తమ్ ❋——

(౨౬౫) అథచౌళాన్నభోజనప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో॥ చౌలకర్మణిసీమంతే ముహూర్తాద్భోజనేపరం । సురాపానసమంప్రోక్తమతోన్యేష్వంతిసూరయః ॥ గౌతమః ॥ శ్లో ॥ సీమంతేపుంసవేచైవ చౌళకర్మణిమోక్షజః॥ అసగోత్రస్తదన్నాదస్సురాపీత్యుచ్యతేబుధైః॥ మార్కండేయః॥ శ్లో॥ చౌళకర్మణిసీమంతే పుంసవేదూన్యగోత్రజః । ముహూర్తాదూర్ధ్వభుక్పాపీ సురాపానమవాప్నుయాత్॥ ప్రాయశ్చిత్తంద్విజైఃప్రోక్తందుష్టాన్నాదిభిభోజనే। సుముహూర్తాత్పరంతప్తం తత్పూర్వం వేదమాతరం ॥ జప్త్వాశుద్ధిమవాప్నోతి సహస్రంవిధిపూర్వకం ॥ స్త్రీణామర్ధం యతీనాంచ వ్రతినాంచాంద్రముచ్యతే । చౌళకర్మణిపూర్వత్రపరత్రచసమంవిదుః ॥ ఇతి హేమాద్రివిరచితే చౌళసీమంతాన్న భోజనప్రాయశ్చిత్తం ॥

(౨౧౫) ఇఁకను చౌళాన్న భోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ చౌలకర్మ యందును, సీమంతమునందును ముహూర్తానంతరమందు భోజనమును జేసినయెడల నయ్యన్నము సురాపానతుల్యమగును, కాఁబట్టి యట్టియన్నమును విద్వాంసులగువారు గోరరని దేవలుఁడువచించె. చౌలకర్మయందును, సీమంతమునందును, పుంసవనమునందును, ముహూర్తానంతరమందు భోజనమును జేసినవాఁడు సురాపానమును జేసినవానికిఁ దుల్యుఁడగును, కావునఁదత్పాపోపశమనముకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, అదియెట్లనిన, నుముహూర్తానంతరమందు తప్తకృచ్ఛ్రమునాచరింపవలయును, దానికిఁబూర్వమందు భోజనమును జేసినయెడల వేయిపర్యాయములు గాయత్రీజపమును జేసినయెడల పరిశుద్ధుఁడగును, స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధింపవలయును, యతులకును, బ్రహ్మచారులకును చాంద్రాయణమును విధింపవలయును, చౌళకర్మయందు పూర్వాపరములయందు సమానమేనని యెఱుంగవలయునని మార్కండేయ మునివరుఁడు చెప్పె ॥

——※ అథగణకాన్న దేవలకాన్న భోజన ప్రాయశ్చిత్తమ్. ※——

(౨౧౬) అథగణకాన్న దేవలకాన్న భోజన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ శ్లో॥ యోన్నం దేవలకస్యాపి భుక్తేఽన్నం గణకస్యచ। మద్యపాతా విజానీయాత్సర్వకర్మబహిష్కృతా ॥ విష్ణురహస్యే॥ శ్లో ॥ దేవలకాన్నంతు యోభుక్తే తథా గణకభోజనం । ఉభౌతుపాపకర్మాణౌనసంభాష్యౌకదాచన ॥ గారుడపురాణే॥ శ్లో॥ దేవార్చకస్యయోభుక్తే తథా గణకవేశ్మని । అన్నమితి శేషః ॥ శ్లో॥ ఉభౌతౌనాపితౌప్రోక్తౌ ప్రాయశ్చిత్తమథోచ్యతే॥ ఏకరాత్రే పంచగవ్యం త్రిరాత్రేయావకం స్మృతం ॥ మాసమాత్రేపరాకం స్యాదబ్దేచాంద్రముదీరితం ॥ తతఃపరంతత్సమస్స్యాత్ స్త్రీణామర్ధముదీరితం ॥ యతిబ్రహ్మచారివిధవానామేతద్ద్వైగుణ్యం ॥ ఇతి హేమాద్రౌ గణకాన్న దేవలకాన్న భోజన ప్రాయశ్చిత్తమ్॥

(౨౧౬) ఇకను గణకాన్న దేవలకాన్న భోజనమును జేసినవానికి ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ దేవలకాన్న గణకాన్నములనుభుజించినవాఁడు మద్యపానమును జేసినవానికి సమానుడగును, అట్టివాఁడు సకలకర్మబహిష్కృతుఁడగునని దేవలుఁడువచించె. విష్ణురహస్యమునందునునిట్లనే చెప్పఁబడియె. మఱియు నయ్యిద్దరును నాపితులని చెప్పబడుదురు, కావునవారలకుఁ బ్రాయశ్చిత్తమును విధించవలయును- అదియెట్లనిన నొకదినము భోజనమును జేసినవాఁడు పంచగవ్య ప్రాశనమును జేయవలయును.

మూడుదినములు భుజించినవాడు యావకాహారుఁడు గావలయును, నెలది నములు భుజించినవాఁడు పరాకకృచ్ఛ్రమునునాచరింపవలయును, సంవత్సర కాలము భుజించినవాఁడు చాంద్రాయణ వ్రతమును నాచరింప వలయును, సంవత్సరానంతరమందు గూడనిట్టి కృత్యమును జేసినవాఁడు తత్సమానుఁడగును, స్త్రీలకర్ధ ప్రాయశ్చిత్తమును విధింపవలయును- యతిబ్రహ్మచారి విధవలకుప్రాయశ్చిత్తమును ద్విగుణాధికముగ విధింపవలయును, ఇట్లని గారుడపురాణమునందుఁ జెప్పఁబడియె॥

——* అస్నానభోజనప్రాయశ్చిత్తమ్ *——

(౨౧౮) అథాస్నానభోజన ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥శ్లో॥ అస్నాతాశీమలంభుఙ్క్తే హ్యజపీపూయశోణితం॥ అహుతాశీక్రిమింభుఙ్క్తే అదాతావిష్ఠమశ్నుతే॥ మహాభారతే ॥ శ్లో॥ అరోగీస్నానహీనస్స్యాత్ భుక్త్వాభోజనమాదరాత్ ॥ యావంత్యన్నపులాకాని తావన్మలముదీరితం॥ గౌతమః ॥ శ్లో॥ అస్నాత్వాభోజనంవిప్రో నీరోగఃకురుతే యది। సమలాశీసదాజ్ఞేయ స్సర్వకర్మసుగర్హితః ॥ విష్ణుధర్మోత్తరే॥ శ్లో॥ స్వస్థోవిప్రో యదాఽస్నాత్వాభుంక్తే మోహపరాయణః । విష్ఠాంతదన్నమిచ్ఛంతి మునయ స్తత్వదర్శినః । శ్రాద్ధకాలేతుచాంద్రంస్యాత్ గ్రహణేతద్వయంస్మృతం । పంచపర్వసుతప్తంస్యా దితరత్రతుయావకం । విధవానాం బ్రహ్మచారిణాం యతీనాంగృహస్థప్రాయశ్చిత్తాద్ద్వైగుణ్యం ॥ ఇతి హేమాద్ర్యస్నాతాన్న భోజనప్రాయశ్చిత్తం ॥

(౨౧౮) స్నానమును జేయక భోజనమును జేసినవానికిప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు ॥ స్నానములేక భోజనమును జేసినవాఁడు యమలోకమునందు నరకభోక్తయగును, జపమును జేయక భోజనమును జేసినవాఁడు పూయశోణితములను భుజించును, హోమమును జేయకభుజించినవాఁడు క్రిమిభోక్తయగును, దానమును జేయకభుజించినవాడు పురీషభోక్తయగునని దేవలుఁడు చెప్పె. రోగరహితుఁడై స్నానమును జేయక భోజనమును జేసినవాఁడెన్ని యన్నపులకములుండునో యన్నివిధములగు మలమును భుజించునని మహాభారతమునందుఁ జెప్పఁబడియె. గౌతముఁడును నిట్లనే చెప్పె. శ్రాద్ధకాలమునందీ విధముగ భుజించినవాఁడు చాంద్రాయణ వ్రతమునాచరింపవలయును, గ్రహణకాలమునందైతే రెండుచాంద్రాయణముల ను భుజింపవలయును, పంచపర్వములయందును భుజించిన యెడల తప్తకృచ్ఛ్రమునాచరింపవలయును, ఇతరవిషయమునందైతే యావకాహారుఁడు గా

వలయును. ఈవిషయమునందు విధవలకును, బ్రహ్మచారులకును, యతులకును, గృహస్థప్రాయశ్చిత్తముకంటె ద్విగుణముగఁ బ్రాయశ్చిత్తమును విధింపవలయునని విష్ణుధర్మోత్తరమునందుఁ జెప్పఁబడియె॥

—— * పర్యుషితాన్నభోజన ప్రాయశ్చిత్తమ్ * ——

(౨౧౮) అథపర్యుషితాన్న భోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ జలేనిధాయపూర్వేద్యుర్యదన్నం జల సేచితం। తత్తుపర్యుషితంజ్ఞేయం తద్భుక్త్వాపాపమాప్నుయాత్ ॥ గౌతమః ॥ శ్లో॥ దుర్గంధిజలసిక్తంచరూపహీనంయదస్తిహి।తతఃపర్యుషితంత్యాజ్యం భుక్త్వా చాంద్రాయణంచరేత్॥ గాలవః ॥ శ్లో॥ దధ్నాఘృతేనతైలేన యదన్నంసంస్కృతంభవేత్॥ దుర్గంధరహితంభోజ్య మన్యథాచాంద్రముచ్యతే ॥ గౌతమః ॥ శ్లో॥హింగుజీరకసంమిశ్రం తింత్రిణీరసవేష్టితం ॥ దుర్గంధరహితంచాన్నంభోక్తవ్యంద్విజపుంగవైః । ఏతైర్ద్రవ్యైఃపరిష్కృత్యదుర్గంధరహితంయది ॥ కృత్వాపి పూర్వదినే భోక్తవ్యంస్యాద్ద్విజన్మభిః। దుర్గంధంజలసంమిశ్రం పూర్వేద్యురుదకేధృతం॥ తత్పర్యుషితసంజ్ఞంస్యాద్భుక్త్వా చాంద్రాయణంచరేత్ ॥ త్రిరాత్రంపంచరాత్రంవా భుక్త్వాపర్యుషితంద్విజః। తస్యాపనయనంభూయశ్చాంద్రాయణమథాచరేత్॥ బ్రహ్మచారివిధవాయతీనాంద్విగుణంప్రాయశ్చిత్తం॥ బ్రహ్మచారిణాం సంవత్సరభోజనే పునరుపనయనం చాంద్రాయణద్వయం చ ॥ ఇతి హేమాద్రిపర్యుషితభోజనప్రాయశ్చిత్తం ॥

(౨౧౮) పర్యుషితాన్నభోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ పూర్వదినమునందలి యున్నమును నీటియందుంచిన యెడల నది పర్యుషితాన్నమనబడును. అట్టియన్నమును భుజించిన యెడల పాపముకలుగునని దేవలుఁడు వచించె. దుర్గంధముగలదియును, జలముచేఁదడపఁబడినదియును, రూపహీనమును పర్యుషితమును నగునన్నమును భుజించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయునని గౌతముఁడు వచించె. పెరుగు, నేయి, తైలము, అనువానిచేత సంస్కృతమైనదియును, దుర్గంధరహితమైనదియునునగు నన్నమును భుజించుటవలన దోషములేదు. అట్లుగాని యన్నమును భుజించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయునని గాలవుఁడు వచించె. హింగుజీరకసమ్మిశ్రమును, తింత్రిణీరసచేష్టితమును, దుర్గంధరహితమునునగునన్నము పూర్వదినమునందలిదైనను భుజింపవచ్చును, దుర్గంధముగలదియును, జలసమ్మిశ్రితమునునగు నన్నమును భుజించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. మూఁడుదినములదైనను, అయిదుదినములదైనను పర్యుషితా

న్నభోజనమును జేసినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరించుటయేగాక పునరుపనయనమును జేసికొనవలయును. బ్రహ్మచారులకును, యతులకును ద్విగుణముగఁబ్రాయశ్చిత్తమును విధింపవలయును, బ్రహ్మచారు లిట్టియన్నమును సంవత్సరకాలముభుజించిన యెడల పునరుపనయనముతోఁగూడఁజాంద్రాయణ ద్వయమును నాచరింపవలయునని గౌతముడు చెప్పె॥

—-* దుర్భక్ష్యభక్షణప్రాయశ్చిత్తమ్ *—-

(౨౧౯) అథదుర్భక్ష్యభక్షణ ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో॥ దుర్గంధసహితంభక్ష్యం తథాపర్యుషితంచయత్ । శష్కులీమాషసిద్ధాన్నం విపణిస్థంచవర్జయేత్ । తైలపక్వవిహీనంచ నభోజ్యంస్యాద్ద్విజాతిభిః ॥ పరాశరః ॥ శ్లో॥ భక్ష్యంవైమాషసంభూతం విపణిస్థమతైలజం । దుర్గంధం పూతిగంధంచ పితృదేవవివర్జితం ॥ శష్కులీఫేణికారాజవటకామాషసంభవాః । నిష్కారణతయావిప్రో నభుంజీయాత్కదాచన॥ గాలవః॥ శ్లో॥ అన్ననిర్మితవస్తూనిశష్కుల్యాదీనిశష్కులీః। మాషకామాషసంభూతాహిం గుజీరపరిష్కృతాః । దుర్గంధిపూతిగంధీనివిపణిస్థానియానిచ । అనర్పితాని దేవానాం శుభపైతృకవర్జితం। నభుంజీయాదిమానీహ విప్రోదుష్టాన్నభుక్తదా॥ తస్యైవనిష్కృతిర్దృష్టావిప్రైర్ధర్మపరాయణైః । పిత్రర్థందేవకార్యార్థంపక్త్వాభుక్త్వానదోషభాక్ । జిహ్వాచాపల్యమాగమ్య భక్షయేద్యదిపూర్వజః ॥ వృథాతానీహభక్షిత్వా యావకంకృచ్ఛ్రమాచరేత్ । శోభనేపితృకార్యే దేవకార్యేషుయేషుచ । భక్షయిత్వాయదావిప్రస్తదాదోషైర్నలిప్యతే॥ స్త్రీణామేతదర్థం। విధవాబ్రహ్మచారియతీనాం విప్రాద్ద్విగుణం ॥ ఇతి హేమాద్రౌఅభక్ష్యభక్షణప్రాయశ్చిత్తం ॥

(౨౧౯) ఇకనుదుర్భక్ష్యభక్షణ ప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు ॥ దుర్గంధసహితమయినభక్ష్యమును, పూర్వదినమునందలిభక్ష్యమును, అంగడియందలిభక్ష్యమును, తైలపక్వవిహీనమైనదియునునగుదానిని బ్రాహ్మణులగువారుభుజింపగూడదని దేవలుడువచించె. మినుములచే జేయబడినదియును, అంగడియందున్నదియును, తైలపాకరహితమైనదియును, దుర్గంధముగలదియును, పితృదేవవివర్జితమును, చక్కెర, ఫేణి, వటకము, అనువానినిబ్రాహ్మణుడు నిష్కారణముగభుజింపగూడదని పరాశరుడువచించె. గాలవుడునునిటులనేచెప్పె. మఱియును దేవపితృకార్యములయందు భక్ష్యములనుభుజించినయెడలదోషములేదు. ఒకవేళబ్రాహ్మణుడగువాడు జిహ్వాచాపల్యముచేతదేవతలకైనను, పితృదేవతలకైనను నివేదింపకభుజించినయెడల యావకకృ

ఛ్రిమును నాచరింపవలయును. దేవపిత్రాదికార్యములయందు భుజించినయె డలదోషమించుకైనను లేదు. స్త్రీలకర్ధప్రాయశ్చిత్తము నువిధింపవలయును. వి ధవలకును, బ్రహ్మచారులకును, యతులకును, బ్రాహ్మణులకు విధించెడు ప్రాయశ్చిత్తమునకు ద్విగుణాధికముగవిధింపవలయును.

——— ❋ దుష్టశాకభక్షణ ప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౨౨౮) అథదుష్టశాకభక్షణప్రాయశ్చిత్తమాహ। దేవలః. శ్లో॥ కర్కి కారస్యయచ్ఛాకంయచ్ఛాకందుశ్చరీకృతం ॥ వేశ్యోపకేశశాకంచశాకమాఖు శ్రవంతథా। గుర్గురీచంచరీశాకంశాకంవల్ల్యుద్భవంచయత్॥ కరంజశాకందు ర్భక్ష్యం దేవతాపితృవర్జితం॥ అతిలవణంచదుష్టందుష్టం తేనవివర్జితం । అత్యా మ్లయుక్తంపుగ్గంధితచ్ఛాకంపరివర్జయేత్। ఉల్లంఘనేచయచ్ఛాకంయచ్ఛాకం పాదతాడితం । పలాండులశునాక్రాంతంభావదుష్టంపరిత్యజేత్ । ఏతానివి ప్రోననాత్తథాతాననభక్షయేత్। జ్ఞాత్వాభక్షేద్యదాపాపీఉపోష్యరజనీమి మాం॥ పరేద్యుర్భక్షయేత్పంచగవ్యంహోమపురస్సరం॥ ఏతేనశుద్ధిమాప్నో తిదుష్టశాకాన్నభుక్ద్విజః। స్త్రీణాంవిధవానాంబ్రహ్మచారిణాంయతీనాంచ పూర్వవత్ప్రాయశ్చిత్తం॥ ఇతిహేమాద్రిదుష్టశాకభక్షణప్రాయశ్చిత్తం॥

(౨౨౮) దుష్టశాకభక్షణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ కర్కికా రశాకము, దుశ్చరీకృత్యము, వేశ్యోపకేశశాకము, ఆఖుశ్రవశ్రావకము, గు ర్గురీశాకము, చంచరీశాకము, వల్లీశాకము, కరంజశాకము, అనువానిని దేవ పితృకార్యములయందు దుపయోగపరుపగూడదు. అధికలవణముగలశాకము ను, అధికమైనపులుపుగలశాకమును, దుర్గంధముగలశాకమును భుజింపగూడ దు. ఇతరులచేతనైనను, తనచేతనైనను దాటబడినశాకమును, పాదతాడి తమగుశాకమును, పలాండులశునములతోగూడినశాకమును భుజింపగూడ దు. ఇట్టిశాకములనుభుజింపగూడదనితెలిసియును భుజించినయెడలప్రాయ శ్చిత్తమును చేసికొనవలయును. అదియెట్లనిననొకరాత్రియంతయును నుపవ సించిపరదినమునందు హోమపురస్సరముగ బంచగవ్యమును భుజింపవల యును. స్త్రీలకును, విధవలకును, యతులకును, బ్రహ్మచారులకునుపూర్వో క్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధింపవలయునని దేవలుడువచించె.

—(❋) కారణంవినాపరమాన్నకృసరాన్నభోజనప్రాయశ్చిత్తమ్. (❋)—

(౨౨౧) అథకారణంవినా పరమాన్నకృసరాన్న భోజనప్రాయ శ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పరమాన్నంచకృసరంవృథాపక్వం ద్విజోత్తమః॥ భుంజీయాత్తేషలంతచ్ఛనరకేవాసమశ్నుతే॥ మార్కండేయః॥ శ్లో॥ నవా

ధనుస్సమాయాం తు గృహే కన్యా రజస్వలా। పిత్రర్థం దేవకార్యార్థం పరమాన్నం ప్రశస్యతే। ధనుర్మాసే కృసరం ప్రశస్తం దుహితా స్వసా భగినీ స్నుషా వా ప్రథమరజస్వలా యది తత్ర కృసరాన్నభోజనే తీర్థయాత్రాసు చ న దోషః॥ తదాహ గౌతమః॥ శ్లో॥ ధనుర్మాసే గృహే కన్యా యది స్యాత్ప్రథమార్తవా। దేవయాత్రాసు సర్వాసు కృసరాన్నం న దోషభాక్॥ పైతృకాదిషు దేవకార్యే బంధుసమాగమే చ పరమాన్నం న దోషభాక్॥ తదాహ మనుః॥ శ్లో॥ పితృకార్యేషు సర్వేషు దేవబంధుసమాగమే। పశ్చాద్భుక్త్వా తదన్నం తు ప్రభూతక్షీరసంభవం। న దోషభాగితి శేషః॥ శ్లో॥ ద్విజో వినా నిమిత్తైస్తద్భుక్త్వా పాపం సమశ్నుతే। భర్దయిత్వా తదన్నం చ ఉపోష్య రజనీమిమాం॥ పంచగవ్యం పిబేత్పశ్చాచ్ఛుద్ధో భవతి నాన్యథా। స్త్ర్యాదీనాం పూర్వవత్॥ ఇతి హేమాద్రౌ కృసరాన్న పరమాన్న భోజనప్రాయశ్చిత్తం॥

(౨౨౧) ఇకను నిష్కారణముగ పరమాన్నకృసరాన్నములను భుజించినవానికి ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పరమాన్నకృసరాన్న దేవపితౄలకు నివేదింపక భుజించినవాడు నరకలోకమును బొందునని దేవలుడు వచించె. సూర్యుడు ధనుస్సునందు ప్రవేశించినపుడును, గృహమునందు కన్యక రజస్వలయైనపుడును, దేవపితృకార్యములు తటస్థించినపుడును, పరమాన్నమును భుజించుట యుక్తము, ధనుర్మాసమునందును, కూతురు, చెల్లెలు, అక్క, కోడలు, మొదలగువారలలో నెవరైన రజస్వలలయి రేని కృసరాన్నమును భుజించుటచే దోషము గలుగ నేరదు. తీర్థయాత్రలయందును కృసరాన్నము దోషమును గలుగ జేయునది గాదు. ఇట్లని గౌతముడు చెప్పె. గౌతముడు నిటులనే చెప్పె. మనువు నిటులనే వచించియుండె. ఇట్లు చెప్పబడిన సమయములయందు దప్ప ధకితర సమయములయందు పరమాన్నకృసరాన్నములను భుజించిన యెడల నొకదినసమంతయు నుపవసించి పంచగవ్యప్రాశనను జేయవలయును.

——* ఏకాదశ్యన్నభోజనప్రాయశ్చిత్తమ్. *——

(౨౨౨) అథ ఏకాదశ్యన్నభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఏకాదశ్యాం న భుంజీత పక్షయోరుభయోరపి। యది భుంక్తే స పాపీ స్యాద్రౌరవం యాతి దారుణం॥ మార్కండేయః॥ శ్లో॥ హరివాసరముక్త్వాపి జయంత్యన్న విమర్దనః। కృష్ణే శుక్లే తథా రాజన్ మహాంతం నరకం వ్రజేత్॥ గాలవః॥ శ్లో॥ యాని కాని చ పాపాని బ్రహ్మహత్యాయుతాని చ। అన్నమాశ్రిత్య తిష్ఠంతి తస్మాదన్నం పరిత్యజేత్॥ శుక్లామేవ సదా గృహీత్వా వచనం సాత్త్వికం కామ్య విషయం। ని

త్యత్వేనభోక్తవ్యం కేచిత్తత్రభుంజతేకదసమీచీనం॥ మార్కండేయః॥ శ్లో॥ బ్రహ్మనిష్ఠస్యవిప్రస్యసర్వద్రవ్యసమస్యచ। కృష్ణపక్షేహరిదినేహ్యన్నంభుక్తంనదోషకృత్॥ గౌతమః॥శ్లో॥ కృష్ణపక్షేహరిదినేద్విజోబ్రహ్మపరాయణః॥ భుక్త్వాసర్వసమస్సోపిఉపవాసఫలంలభేత్।అన్యథావిప్రమాత్రస్తుభుక్త్వాచాంద్రాయణంచరేత్॥గాలవః॥ శ్లో॥ ఏకాదశ్యన్నభుక్పాపీశుద్ధ్యర్థంచాంద్రమాచరేత్। విప్రస్సర్వసమస్తత్రభుక్త్వాదోషైర్నలిప్యతే। విధవానాంవ్రతీనాంసన్యాసినాంద్విగుణంప్రాయశ్చిత్తం। ఇతిహేమాద్రివిరచితేఏకాదశ్యన్నభోజనప్రాయశ్చిత్తం॥

(౨౨౨) ఏకాదశియందుబోజనమునుజేసినందుకు ప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ ఉభయపక్షములయందలి యేకాదశియందునుభుజింపగూడదు. అట్లుగాకభుజించెనేని రౌరవమనుపేరుగల నరకమునుబొందునని దేవలుడువచించె. ఉభయపక్షైకాదశులయందును భుజించువాడును, జయంతియందుభుజించువాడును ఘోరనరకమునుబొందునని మార్కండేయుడువచించె. బ్రహ్మహత్యాదిపాపములేవికలవో యవియన్నియునునన్నమునాశ్రయించియుండును. "శుక్లామేవసదాగృహీ,, అనువచనముపాక్షికమనియును, కామ్యవిషయమనియును, నిత్యత్వముచేతభుజింపవలయుననియును, కొందరచ్చోటభుజించుట యుచితముగాదనయునుగాలవుడుసెప్పె. సర్వద్రవ్యసముడును, బ్రహ్మనిష్ఠుడునునగుబ్రాహ్మణుని కృష్ణైకాదశులయందును భుజించుటవలనదోషమించుకయునులేదని మార్కండేయుడుచెప్పె. సర్వభూతసముడును, సర్వద్రవ్యసముడును, నగుబ్రహ్మనిష్ఠుడేకాదశియందుభుజించుటవలనదోషములేదనియును, ఇతరులగుబ్రాహ్మణులుభుజించినవాడల చాంద్రాయణవ్రతమునాచరింపవలయునని గౌతముడువచించె. ఏకాదశియందన్నమునుభుజించినపాపాత్ముడు తత్పాపశమనముకొఱకు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. విధవలకును, బ్రహ్మచారులకును, సన్యాసులకును, ద్విగుణముగప్రాయశ్చిత్తమును విధింపవలయునని గాలవుడుచెప్పె.

——✱ వ్రాత్యాన్నశిష్యాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ✱——

(౨౨౩) అథవ్రాత్యాన్నశిష్యాన్నభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః శ్లో॥ వ్రాత్యాన్నంయదిశిష్యాన్నంభుక్తేప్రాశిత్వధాతురః। కబళేకబళే చాంద్రంకృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ మరీచిః॥శ్లో॥ సగ్నావేదపరిత్యాగవ్రాత్యగాయత్రినాశకః। దుష్టితత్రసవిజ్ఞేయోదుశ్చర్మామాతృఘాతకః॥ తయోరన్నంద్విజోభుక్త్వాశుద్ధశ్చాంద్రాయణాదిహా। పరాశరః॥ శ్లో॥ దుశ్చర్మణశ్చ

వ్రాత్యస్యఅన్నంభుక్త్వాద్విజస్సకృత్। తస్యదేహవిశుద్ధ్యర్థంచాంద్రముక్తంము
నీశ్వరైః॥ విధవాబ్రహ్మచారియతీనాం పూర్వవత్ప్రాయశ్చిత్తమ్ ॥ ఇతి హే
మాద్రివిరచితే. కుష్ఠ్యన్నవ్రాత్యాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౨౩) ఇకనువ్రాత్యాన్నకుష్ఠ్యన్న భోజనప్రాయశ్చిత్తమును జెప్పు
చున్నాడు॥ బ్రాహ్మణుడుక్షుత్పీడితుడై వ్రాత్యాన్నకుష్ఠ్యన్నమును భుజించి
నవాడుమహాపాపవంతుడగును. అట్టియన్నమునునెన్నికబళములుగాభుజించు
నోయన్నిచాంద్రాయణవ్రతముల నాచరింపవలయునని దేవలుడు సెప్పె. నగ్న
డును, వేదపరిత్యాగియును, గాయత్రినాశకుడును, నగువాడువ్రాత్యుడనబ
డును. దుష్టమైనచర్మగలవాడును మాతృఘాతకుడునుకుష్ఠియనబడును. ఈ
యిరువురియొక్కయు నన్నమునుభుజించినబ్రాహ్మణుడు చాంద్రాయణమువ
లనశుద్ధుడగుననిమరీచివచించె. పరాశరుడునునిటులనేచెప్పె. విధవాబ్ర
హ్మచారియతులకు పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధింప
వలయును.

-*- కుండగోళకపరివిత్తిపరివేత్త్రన్నభోజన ప్రాయశ్చిత్తమ్- *-

(౨౨౪) అథకుండగోళకయోః పరివిత్తిపరివేత్త్రోరన్నభోజనే ప్రా
యశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ కుండశ్చగోళకశ్చైవ పరివిత్తిఃపరివేత్తా।
తేషామన్నంనభోక్తవ్యం విప్రైఃపాపపరాఙ్ముఖైః॥ కుండాదిలక్షణమాహ॥
మరీచిః॥ శ్లో॥ స్వస్థేభర్తరియానారీ జారాసక్తాభవేద్యదా । తదుత్పన్నస్తు
కుండస్స్యాత్సర్వకర్మబహిష్కృతః॥ మృతేభర్తరియానారీ జారాత్సుతమ
వాప్నుయాత్। సవైగోళకసంజ్ఞస్స్యాత్సర్వకర్మబహిష్కృతః॥ స్వస్థంజ్యే
ష్ఠంసముత్సృజ్య కనీయాన్యదుద్వహేత్త్రియం । తజ్జ్యేష్ఠఃపరివిత్తిస్స్యాత్ప
రివేత్తాసహానుజః । తత్పుత్రఃపరివిన్నస్స్యాత్పరివిందోద్వితీయజః ॥ యమళ
యోర్వ్యత్యయసంస్కారే రాజ్యపాలనే అందోళికారోహణేష్వేవంవేది
తవ్యం॥ గాలవః॥ శ్లో॥ కుండగోళకయోశ్చాన్నంపరివిత్తేస్తథైవచ । పరివే
త్తుశ్చాన్నం చతత్పుత్రాణాంచయద్భవేత్॥తయోర్వ్యత్యయసంస్కారే
యదన్నం మృష్టసంజ్ఞితం।తదన్నంసంపరిత్యాజ్యం పూర్వజైర్ధర్మవత్సలైః। ప
రాశరః॥ శ్లో॥ పరివిత్తిఃపరివేత్తాతథాతౌకుండగోళకౌ। తేషాంపుత్రాశ్చపౌ
త్రాశ్చయమళౌయదివ్యత్యయౌ। తేషామన్నంనభోక్తవ్యంముఖజైర్ధర్మజ
ఙ్ఞిప్సుభిః॥ తత్రభుక్త్వాద్విజోజ్ఞానాదేకవారంవిధుంచరేత్ । చాంద్రాయణమి
త్యర్థః॥ మాసేచాంద్రంపరాకంచచరేత్సంవత్సరేష్వపి। చాంద్రాయణంప
రాకంచప్రాజాపత్యంసమాచరేత్॥ తతఃపరంతత్సమస్స్యాదపాఙ్క్తేయస్స

డాశుచిరితి॥ విధవాదీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే కుండగోళకాన్నప్రాయశ్చిత్తమ్॥

(౨౨౪) ఇకను కుండ, గోళక, పరివేత్తృపరివేత్తలయన్నమును భుజించుటకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ కుండుడు, గోళుడు, పరివిత్తి, పరివేత్త, అనువారలయన్నమును బుజింపగూడదని దేవలుడువచించె. భర్త జీవించియుండగ వ్యభిచరించునట్టి స్త్రీకి జారపురుషునివలనగలిగినవాడు కుండుడనబడును. భర్తమరణమును బొందినపిమ్మట వ్యభిచరించినందువలనబుట్టినవాడు గోళకుడనబడును. జ్యేష్ఠుడుస్వస్థుడైయుండగ వివాహమును జేసికొనిన నవాడుపరివేత్తయనబడును. ఆజ్యేష్ఠుడుపరివిత్తియనబడును. పరివేత్తః పుత్రుడుపరివిందుడును, పరివిత్తియొక్కపుత్రుడు పరివిన్నుడనియును జెప్పబడును. ఇన్నల్వురియొక్కయు వీరిసంతతియొక్కయు నన్నమునుదినగూడదని మరీచివచించెను. గాలవుడునుసిటులనే వచించె. పరాశరుడునునిటులనే చెప్పి యొకవేళ నజ్ఞానమువలన నట్టివారియన్నమును బుజించినయెడల చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. మాసముదినములుబుజించినవాడు చాంద్రాయణమును, సంవత్సరకాలముభుజించినవాడుపరాకమును, మఱియునుచాంద్రాయణపరాక ప్రాజాపత్యములనునాచరింపవలయుననియును, పిమ్మటనప్రాశ్తైయుడనియునుచెప్పె. విధవులకుపూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధింపవలయును.

——— యత్యన్నదంపతిశిష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ———

(౨౨౫) అథ యత్యన్నదంపతిశిష్టాన్నభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ యత్యన్నంయతిపాత్రస్థంయతినాపరిశంతథా। దంపత్యోర్భుక్తశేషంయత్ తద్భుక్త్వాచాంద్రమాచరేత్॥ యతిర్ద్రవ్యాణ్యార్జయిత్వాసమారాధనాదికంకరోతితద్యత్యన్నం॥ యతిఃభిక్షామటిత్వాస్వభోజనాపరియచ్ఛిష్టంతద్యతిపాత్రస్థం॥ స్త్రీపురుషయోర్భుక్త్యనంతరం యదన్నంపరిశేషితంతద్దంపతిశిష్టం। తదేవాహమనుః॥ శ్లో॥ ధర్మార్థకామాన్ సంత్యజ్య ప్రథమంసమతాంత్యజేత్। ఇతిధర్మంపరిత్యజ్యయతిః పాపపరోభవేత్॥ బాలాంశ్చకులవృద్ధాంశ్చగర్భిణ్యాతురకన్యకాః। సంభోజ్యాతిథిభృత్యాంశ్చదంపత్యోశ్శేషభోజనం॥ ఇవంధర్మంపరిత్యజ్యవిపరీతంతయోర్యదః॥ తత్రభుక్త్వాద్విజోయస్తుశుద్ధ్యర్థంచాంద్రమాచరేత్॥ గౌతమః॥ శ్లో॥ యతేరారాధనేభుక్త్వా యత్యన్నంభోజనాపరి। దంపత్యోర్భుక్తశిష్టంయద్భుక్త్వాచాంద్రాయణంచరేత్॥ విధవాదీనాంపూర్వవత్ప్రకల్పనీయం॥ ఇతి హేమాద్రివిరచితేయత్యన్నదంపతి

శిష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౨౫) ఇకను యత్యన్నదంపతి శిష్టాన్నభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ యత్యన్నమును, యతిపాత్రయందున్నయన్నమును, యతిచేత (రే)పింపబడినయన్నము, దంపతీభుక్తశేషాన్నమును, భుజించినవాడు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. యతిద్రవ్యములనుసంపాదించియన్నదానమును జేసినయెడల నది యత్యన్నమనబడును. యతిభిక్షమెత్తితెచ్చికొని భుజింపగా మిగిలినయన్నముయతిపాత్రస్థాన్నమనబడును. స్త్రీపురుషులు భుజించినపిమ్మట పాత్రయందుమిగిలియున్నయన్నము దంపతీభుక్తశిష్టాన్నమనబడును. ఇట్లని దేవలుడు సూచించె. మనువునునిటులనే వచించె. గౌతముడు నునిట్లేవచించె. విధవాదులకు బూర్వోక్త ప్రాయశ్చిత్తమును విధింపవలయును.

## ఉచ్ఛిష్టాన్నభోజన ప్రాయశ్చిత్తమ్.

(౨౨౬) అథఉచ్ఛిష్టాన్నభోజనే ప్రాయశ్చిత్తమాహ। దేవలః॥శ్లో॥ ఉల్లంఘితంపాదహతంబిడాలాఖువిమర్దితం। పూర్వోక్తశాకసంయుక్తంపలాండులశునావృతం॥ దేవపూజావిహీనంయద్వైశ్వదేవవివర్జితం। ఏకపఙ్క్త్యుపవిష్టేన బ్రాహ్మణేనవిఘాతితం॥ నప్రత్యుత్థాళనభాండేషుతథాహానవివర్జితం। పుత్రైఃపౌత్రైశ్చానుజైర్వాపుత్రీపుత్రైస్తథాపివా॥ భార్యావిలోకనేచైవయద్యదన్నమసాత్త్వికం। దేవాలయేచయచ్ఛకంయదన్నంమూల్యసంభవం॥ విధూతేనైవశూర్పేణవదనేచానిలేనచ॥ శాంతంపిండీకృతంచాన్నంయదన్నంజీవతండులం। తుషపాషాణసంయుక్తంఫలీకరణమిశ్రితం॥ ఏతద్దుష్టంవిజానీయాత్పూర్వోక్తంగాలవాదిభిః। ఏతద్భుక్త్వాద్విజోయస్తుమహాపాపంసమశ్నుతే॥ భోక్తురాగమనాత్పూర్వంభోజనపాత్రేపరివేషితంతదసాత్త్వికం। శిష్టంస్పృష్టం॥ గౌతమః॥శ్లో॥ దుష్టాన్నంయోద్విజోభుక్త్వా పూర్వముక్తంమనీషిభిః। పశ్చాద్దేహవిశుద్ధ్యర్థంపరాకంకృచ్ఛ్రమాచరేత్॥ ఏతత్సగోత్రబాలభోజనవిషయం॥ భగినీపుత్రాదిసహభోజనేద్విగుణం। విధవాబ్రహ్మచారియతీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే ఉచ్ఛిష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౨౬) ఇకనుచ్ఛిష్టాన్నభోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ ఉల్లంఘితమైనదియు, (అనగా పాదములచే దాటబడినదియును) పాదములచే దన్నబడినదియును, పిల్లులు, ఎలుకలు మొదలగువానిచేత మర్దనచేయబడినదియును, పూర్వోక్తములగు శాకములతో గూడినదియును, పలాండులశునములచేనావృతమైనదియును, దేవపూజారహితమైనదియును, వైశ్వదేవహీన

మైనదియును, ఒకపఙ్క్తియందున్న బ్రాహ్మణునిచేత విఘాతముసేయబడినదియును, పుత్రపౌత్రాదులుసూచుచుండగ వారలకుబెట్టకతానుమాత్రము భుజించుటకు సేకరింపబడినదియును, భోక్తయగువాడురాకమునుపు భోజనభాజనమందువడ్డింపబడినదియును, దేవాలయమునందుభుక్తమైనదియును, క్రయక్రీతమైనదియును, చేటచేతను, నోటిచేతనునూదబడినదియును, (అనగా వడిలేకుండునట్లుచేయబడినదియనుట) పిండీకృతమైనదియును, తుషపాషాణసంయుక్తమైనదియును, అగునన్నముదుష్టాన్నమని దేవలుడుచెప్పె. మఱియు నిట్టియన్నమునుభుజించినవాడు పాపాత్ముడగుననియునువచించె. దుష్టాన్నమునుభుజించినబ్రాహ్మణుడు తత్పాపోపశమనంబుకొఱకు పరాకకృచ్ఛ్రమును నాచరింపవలయుననియును, భగినీపుత్రాదిసహభోజనమునందు ద్విగుణముగ ప్రాయశ్చిత్తమును చేసికొనవలయునని గౌతముడువచించె. విధవాబ్రహ్మచారి యతులకు పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయును.

### —— పత్నీసహభోజనప్రాయశ్చిత్తమ్. ——

(౨౨౭) అథపత్నీసహభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ ద్విజఃకామాతురోయస్తుపత్న్యాసహయదాన్నభుక్ । పశ్చాచ్చాంద్రాయణంకృత్వాశుద్ధిమాప్నోతిపార్వతి॥ పత్నీసహభోజనకాలమాహ॥ మనుః॥శ్లో॥ మహారణ్యేచయాత్రాయాంపథిచోరాకులేసతి । అసహాయోయదిభవేత్తదాభుక్తిర్నదోషకృత్॥ గాలవః॥ శ్లో॥ వివాహకాలేయాత్రాయాం పథిచోరసమాకులే। అసహాయోభవేద్విప్రస్తదాకార్యంద్విజన్మభిః॥ ఏకత్రయానమారోహేదేకపాత్రేఽన్నభోజనం । భార్యయాసహభుక్త్వాతువిప్రస్తత్రనదోషభాక్। అన్యత్రభోజనేయాసౌ మహాంతంరౌరవంవ్రజేత్ । తద్దోషపరిహారార్థంపశ్చాచ్చాంద్రాయణంచరేత్॥ పరాశరః॥శ్లో॥ ఏకత్రయానమారోహేదేకపాత్రేతుభోజనం॥ వివాహేపథియాత్రాయాం కృత్వావిప్రోనదోషభాక్। అన్యథాదోషమాప్నోతిపశ్చాచ్చాంద్రాయణంచరేత్॥ అభ్యాసేద్విగుణంచైవకృత్వాశుద్ధిమవాప్నుయాత్ ॥ ఇతిహేమాద్రివిరచితే. పత్నీసహభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౨౭) ఇకనుపత్నీసహభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడు కామాతురుడై భార్యతోగూడభుజించెనేని పాపాత్ముడగును. కావునదత్పాపోపశమనముకొఱకు చాంద్రాయణవ్రతమునాచరింపవలయునని దేవలుడువచించె. మహారణ్యమునందును, యాత్రయందును, చోరాకుల

మైనమార్గమునందును, భార్యతోఁగూడభుజించుటవలన దోషములేదని మనువు వచించె. వివాహకాలమునందును, యాత్రయందును, చోరులుగలమార్గమునందును, భార్యాభర్తలొక్క భాజనమునందొక్కటిగాభుజించినను, ఒక్క వాహనమునధిష్ఠించినను దోషములేదని గాలవుఁడు చెప్పె. మఱియునీకాలములకంటె వ్యతిరిక్తములగుకాలములయందుభుజించినయెడల దోషవంతుఁడగునని యును, తద్దోషపరిహారముకొఱకు చాంద్రాయణవ్రతము నాచరింపవలయునని యును, చెప్పె. పరాశరుఁడునునిటులనే చెప్పి యనుచితకాలములయందీకృత్యము నభ్యాసపూర్వకముగఁ జేయువానికి ద్విగుణముగ బ్రాయశ్చిత్తమును విధింపవలయునని రెం.

## ——— శూద్రభాండభోజనప్రాయశ్చిత్తమ్. ———

(౨౨౮) అథశూద్రభాండభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ అతీవతృషితో విప్రో నశూద్రస్యోదకంపిబేత్ । తద్భాండే భోజనశ్చైవ హ్యజ్ఞానాద్యది మార్గతః॥ తస్యోపనయనంభూయస్తప్తకృచ్ఛ్రేణ శుద్ధ్యతి ॥ పరాశరః॥ శ్లో॥ శూద్రభాండోదకంపీత్వా ప్రపాయాంజలసేవనాత్। శూద్రభాండస్థమన్నంచ భుక్త్వాశుద్ధః కథంద్విజః॥ తస్యోపనయనంభూయస్తప్తకృచ్ఛ్రంసమాచరేత్॥ శంఖః॥ శ్లో॥ ప్రపాయాంశూద్రభాండేచ స్థితంతోయం ద్విజో యది। అన్నంవాజ్ఞానతో భుక్త్వా పునస్సంస్కారమాచరేత్ ॥ పశ్చాద్దేహవిశుద్ధ్యర్థంతప్తకృచ్ఛ్రంసమాచరేత్। విధవాబ్రహ్మచారియతీనాంపూర్వవత్॥ ఇతి హేమాద్రివిరచితే శూద్రభాండభోజనోదకపానప్రాయశ్చిత్తమ్॥

(౨౨౮) ఇకనుశూద్రభాండ భోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడగువాఁడెంతదప్పిగొన్నను శూద్రునియొక్క యుదకమును బానముసేయఁగూడదు. శూద్రభాండమునందుభోజనమును జేయఁగూడదు. తెలియక చేసినయెడల పునరుపనయనతప్తకృచ్ఛ్రములచేత పరిశుద్ధుఁడగునని దేవలుఁడు చెప్పె. పరాశరశంఖులునిటులనే చెప్పిరి. విధవాబ్రహ్మచారియతులకు పూర్వోక్తప్రకారముగ బ్రాయశ్చిత్తమును విధింపవలయును,

## —❋ పతితదుర్మార్గదుష్టాక్రాంతపంక్తిభోజనప్రాయశ్చిత్తమ్. ❋—

(౨౨౯) అథపతితదుర్మార్గ దుష్టాక్రాంతపఙ్క్తి భోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పతితశ్చృంఖలశ్చైవదుర్జనః పిశునస్తథా। జారశ్చగాయకశ్చైవనిత్యంయాచ్ఞాపరస్తథా॥ భిషక్చోరస్తథామర్మీఆతతాయీభయప్రదః॥ ఏతేవైదుర్జనాః ప్రోక్తానపాక్త్యాః కదాచన। కుండశ్చగోళకశ్చైవ ఆయాజ్యాస్సాంధయాజకః ॥ చక్రాంకితతనూరాజక్ తథాలింగాంకితో,

పిపా। చారువాకోదూషకశ్చఉన్మత్తఃకితవ స్తథా ॥ ఏతైరావేష్టితాః_ జ్క్తిః పాపదాసర్వదాన్నృణాం। ఏతేషామన్నభుగ్విప్రః పాపమేవసమాశ్రయేత్।ఏకత్రభోజనేరాజన్ చాంద్రాయణమథాచరేత్ । మాసభోజీమహాపాపీచాంద్రంపారాకమాచరేత్॥ వర్షభోజీమహాచాంద్రంకృత్వాశుద్ధిమవాప్నుయాత్। విధవాబ్రహ్మచారిసన్యాసినాంపూర్వవత్ ॥ ఇతిహేమాద్రివిరచితేపతితాదిదుష్టాక్రాంతపఙ్క్తిభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౨౯) ఇకనుపతిత, దుర్మార్గ, దుష్టులచేతనాక్రమింపబడినపఙ్క్తియందు భోజనమునుజేసినందుకుగాను ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ పతితుడు, ఖలుడు, దుర్జనుడు, పిశునుడు, జారుడు, గాయకుడు, సర్వకాలములయందును యాచనను జేయువాడును, వైద్యుడును, దొంగవాడును, మర్మముగలవాడును, ఆతతాయియును, భయమునుగలుగజేయువాడును, దుర్జనులనబడుదురు. మఱియువీరపాఙ్క్తేయులనబడుదురు. కావునవీరిపఙ్క్తియందుభోజనమునుజేయగూడదు. కుండుడు, గోళుడు, అయాజ్యయాజకుడు, చక్రాంకితశరీరుడు. లింగాంకితుడు, చారువాకుడు. దూషకుడు, ఉన్మత్తుడు, కితవుడు, అనువారునునపాఙ్క్తేయులనబడుదురు. ఇట్టివారలతోగూడనొకపఙ్క్తియందుభుజించినవాడు పాపమునుబొందును. కావునవీరితోగూడ నొకపఙ్క్తియందు భోజనమునుజేయగూడదు. ఒకవేళనొకప్పఙ్క్తియందు భుజించినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. మాసముదినములుభుజించినవాడు చాంద్రపారాకముల నాచరింపవలయును. సంవత్సరకాలముభుజించినవాడు మహాచాంద్రమునాచరింపవలయును. విధవాబ్రహ్మచారిసన్యాసులకుపూర్వోక్తప్రకారముగ బ్రాయశ్చిత్తమునువిధింపవలయును.

## పిణ్యాకకరమథితతక్రాదిభక్షణప్రాయశ్చిత్తం.

(౨౩౦) అథపిణ్యాకకరమథితతక్రపానపలాండులశునగృంజనాదిభక్షణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ లశునంగృంజనంతక్రంపలాండుంలశునంతథా। త్యక్త్వాభోజ్యంబ్రాహ్మణేనజగ్ధ్వాపాపంసమశ్నుతే॥ గృంజనంకామవృద్ధ్యర్థంపర్ణచూర్ణంకరమథితం తక్రంవిలయనంఘృతమలంకారీషాపరిజాతంచఛత్రంఏతానివిప్రైర్నభోక్తవ్యాని॥ తదాహమార్కండేయః॥ శ్లో॥ ఛత్రాకంవిడ్వరాహంచ పలాండుంగ్రామకుక్కుటంలశునం గృంజనంచైవమత్యాజగ్ధ్వాపతేద్ద్విజః॥ జ్ఞాత్వాభుక్త్వాతుచాంద్రంస్యాదజ్ఞానాత్తప్తమీరితం॥ సకృదేవంవిజానీయాద్బహువారేద్విరావృతం॥ అబ్దాదూర్ధ్వంమహాపాపీపతితస్స్యాదన్నసంశయః। విధవాబ్రహ్మచారిణాంపూర్వవత్ ॥ ఇతిహేమాద్రి

విరచితేపిణ్యాకాదిభక్షణప్రాయశ్చిత్తం॥

(౨౩౦) ఇక లశునపిణ్యాకకరంభితతక్రాది భక్షణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ లశునము, గృంజనము, తక్రము, పలాండువు, లయనము, చేతితో మథించినతక్రము, అనువానిని భుజింపగూడదని దేవలుడు చెప్పె. ఛత్రాకమును, విడ్వరాహమును, పలాండువును, గ్రామకుక్కుటమును, లశునమును, గృంజనమును, బుద్ధిపూర్వకముగ భుజించినబ్రాహ్మణుడు పతితుడగును. కావున తత్పాపోపశమనముకొఱకు చాంద్రాయణవ్రతమునాచరింపవలయును. అజ్ఞానమువలన నిట్టిపదార్థములనుభుజించినవానికి దప్తకృచ్ఛ్రమును ప్రాయశ్చిత్తార్థముగవిధింపవలయును. సంవత్సరానంతరమందుగూడ నిట్టికృత్యమును జేయువాఁడు మహాపాపియును పతితుడునునగును. విధవాబ్రహ్మచారులకుపూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునువిధింపవలయునని మార్కండేయుఁడువచించె.

——— శ్వేతవృంతాకరక్తశిగ్ర్వాదిభక్షణప్రాయశ్చిత్తమ్. ———

(౨౩౧) అథ శ్వేతవృంతాకరక్తశిగ్రువృత్తాలాబుకతకకాళింగబిల్వోదుంబరభిస్సటాభక్షణేప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ వార్తాకకతకాళింగబిల్వోదుంబరభిస్సటాః। రక్తశిగ్రుమలాబుంచభుక్త్వాచాంద్రాయణంచరేత్॥ గౌతమః॥ శ్లో॥ వృత్తాలాబుంరక్తశిగ్రుం శ్వేతవృంతాకమేవచ। కాళింగభిస్సటాబైల్వంకతకౌదుంబరంతథా॥ భుక్త్వాజగ్ధ్వాపతేద్విప్రః పశ్చాచ్చాంద్రాయణంచరేత్॥ మహాభారతే॥ శ్లో॥ వార్తాకకతకాళింగబిల్వోదుంబరభిస్సటాః। యస్యకుక్షౌప్రవర్తంతేతస్యదూరతరోహరిః॥ రక్తశిగ్రుమలాబుంచ శ్వేతవృంతాకమేవచ। భక్షయిత్వాద్విజోయస్తుసతుచాంద్రాయణంచరేత్॥ యతిబ్రహ్మచార్యాదీనాంపూర్వవత్ ॥ ఇతి హేమాద్రివిరచితే శ్వేతవృంతాకరక్తశిగ్రువృత్తాలాబుకతకకాళింగ బిల్వోదుంబర భిస్సటా భక్షణ ప్రాయశ్చిత్తమ్॥

(౨౩౧) శ్వేతవృంతాంకరక్తశిగ్ర్వాదిభక్షణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ వార్తాకము, కతకము, కాళింగము, బిల్వము, ఉదుంబరము. భిస్సట, రక్తశిగ్రువు, అలాబు, అనువానినిభుజించినవాఁడు చాంద్రాయణవ్రతమునువిధింపవలయునని దేవలుడు చెప్పె. వృత్తాకారముయినయలాబును, రక్తశిగ్రువును, శ్వేతవృంతాకమును, కాళింగమును, భిస్సటను, బైల్వమును, బుద్ధిపూర్వకముగభుజించినవాఁడు చాంద్రాయణవ్రతమునాచరింపవలయునని గౌతముడును జెప్పె. మహాభారతమునందునుసిట్టులనే చెప్పబడియె. యతిబ్రహ్మ

చారులకును పూర్వోక్తప్రకారముగ బ్రాయశ్చిత్తమును నిర్ణింపవలయును.

——— తామ్రపాత్రస్థగవ్యభక్షణప్రాయశ్చిత్తమ్. ———

(౨౩౨) అథ తామ్రపాత్రస్థగవ్యభక్షణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ తామ్రపాత్రస్థితం దుగ్ధం గోమూత్రం తక్రమేవవా। దధివా తామ్రపాత్రస్థం నారికేళోదకం తథా॥ ద్విజః పీత్వా సురాపానం కృతవాన్నాత్ర సంశయః। అజ్ఞానాజ్జ్ఞానతోవాపి సురాపానసమం విదురితి॥ మార్కండేయః॥ శ్లో॥ గవ్యం మూత్రం తథా తక్రం నారికేళోదకం తథా। తామ్రపాత్రస్థితం పీత్వా పయో లవణసంయుతం॥ ద్విజః కామాత్సురాపానమజ్ఞానాచ్చాంద్రభక్షణం। కృత్వా శుద్ధిమవాప్నోతి మద్యాఘ్రాణే తద్ధైంధవం॥ పరాశరః॥ శ్లో॥ నారికేళోదకం తామ్రపాత్రస్థం గవ్యమేవచ। లవణాక్తం పయశ్చైవ మద్యాఘ్రాణం తథైవచ॥ ద్విజోజ్ఞాత్వాచరేచ్చాంద్రం పీత్వాజ్ఞానాత్ప్రజాపతిం। అన్యథా దోషమాప్నోతి నరకం చాధిగచ్ఛతి॥ యమః॥ శ్లో॥ తామ్రపాత్రస్థితం గవ్యం నారికేళోదకం తథా। లవణాక్తం పయశ్చైవ మద్యగంధం తథైవచ॥ పీత్వా ద్విజశ్చరేచ్చాంద్రం ప్రాజాపత్యమకామతః। మద్యాఘ్రాణే విశేషమాహ॥ దేవలః॥ శ్లో॥ హింతాళతాళఖర్జూరనారికేళవనేచరన్। దైవాద్వాయువశాత్ప్రాప్తం ఘ్రాత్వా విప్రస్స్వదక్షిణం। హస్తమాఘ్రాయ సహసా శుద్ధిమాప్నోతి తత్క్షణాత్॥ అథావిభాసురం పశ్యేత్స్పృష్ట్వా కర్ణం జపేద్ధరిం। దైవాన్మద్యగంధం శాకపరిష్కృతగంధం వాయువశాత్ప్రాప్తమాఘ్రాయ పశ్చాద్విప్రదక్షిణహస్తమాఘ్రాయశుద్ధ్యతి॥ అథావెమార్తాండం పశ్యేత్। స్వదక్షిణశ్రవణంస్పృష్ట్వా హరింమనసాస్మరన్ శుద్ధ్యతి॥ తతః పరం నాసికాం పిధాయగచ్ఛేత్। విప్రస్త్ర్యాదీనామేవం॥ ఇతి హేమాద్రివిరచితే తామ్రపాత్రస్థగవ్యాదిభక్షణప్రాయశ్చిత్తమ్॥

(౨౩౨) ఇకను తామ్రపాత్రయందున్న గవ్యభక్షణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ తామ్రపాత్రయందున్నదుగ్ధమును, గోమూత్రమును, తక్రమును, పెరుగును, నారికేళోదకమును, తెలిసియైనను, తెలియకనైనను, పానముసేసినవాడు సురాపానమును జేసినవానికి దుల్యుడగునని దేవలుడు చెప్పె. మార్కండేయుడునునిటులనేచెప్పి యాకృత్యమును నజ్ఞానమువలన జేసినవానికి జాంద్రాయణవ్రతము నాచరింపవలయునని యె. పరాశరుడునునిటులనేచెప్పె. యముడునునిటులనేచెప్పె. హింతాళ, తాళ, ఖర్జూర, నారికేళము, వీనివనమునందు సంచరించుచుండగ నావృక్షములయందలి మద్యగంధమును దైవవశముగగలిగిన గాలివలనమీదబడెనేని పాపవంతుడగును. అట్టి

పాపోపశమనముకొఱకు బ్రాహ్మణుని దక్షిణహస్తమును స్పృశించిన యెడల పరిశుద్ధుఁడగును. ఆసమయమున బ్రాహ్మణుఁడు దొరకని యెడల సూర్యునిఁజూచి దక్షిణకర్ణమును స్పృశించి నారాయణుని స్మరింపవలయుననియును. పిమ్మట ముక్కును మూసికొని యచ్చోటును వదలిపోవలయుననియును, దేవలుఁడు చెప్పె. బ్రాహ్మణస్త్రీలు మొదలగువారికిని నిటులనే విధింపవలయును.

—— * పీతశేషోదకపానప్రాయశ్చిత్తమ్. * ——

(౨౩౩) అథపీతశేషోదకపానే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ విప్రస్యపీతశేషం యత్తోయమన్యః పిబేద్యది। మద్యపానసమంప్రాహుస్తత్తోయం మునిపుంగవాః॥ వ్యాసః॥ శ్లో॥ పీతశేషం ద్విజః పీత్వా సురాపానసమం జలం। పీత్వాజ్ఞానాద్ద్విజః కుర్యాత్ప్రాజాపత్యం విశుద్ధయే॥ ఏకపఙ్క్తినివిష్టానాం విప్రాణాం పాత్రసంస్థితం। పీతశేషం జలం పీత్వా విప్రః కుర్యాత్ప్రజాపతిం॥ ఏతేన శుద్ధిమాప్నోతి న శుద్ధ్యత్యన్యథా ద్విజః। పీతశేషమపి కించిత్తోయం భూమౌ నిపాత్య పీత్వా న దోషః॥ తదాహ॥ మార్కండేయః॥ శ్లో॥ పాత్రాభావే జలాభావే పీతశేషం ద్విజః పిబేత్। భూమౌ కించిన్నిపాత్యాథ పీత్వా ప్రానదోషభాక్॥ జాబాలిః॥ శ్లో॥ పీతశేషం కబంధం యః పాతుమిచ్ఛేద్ద్విజో యది। భువి కించిజ్జలం క్షిప్త్వా పీత్వా తత్ర న దోషభాక్॥ గౌతమః॥ శ్లో॥ పీతశేషం జలం విప్రః పాతుమిచ్ఛేత్తృషాతురః॥ భువి కించిజ్జలం క్షిప్త్వా పీత్వా తత్ర విశుద్ధ్యతి॥ ఏతత్పృథక్పాత్రాభావవిషయం। పాత్రే విద్యమానే సతి స్వపాత్రస్థోదకమేవ పిబేత్॥ నాన్యత్॥ యమః॥ శ్లో॥ ఆసనం శయనం వస్త్రం జాయాపత్యం కమండలుః। ఆత్మనః శుచీన్యేతాని పరేషామశుచిర్భవేత్॥ అతః స్వపాత్రస్థోదకమేవ సమీచీనం। తదభావే పూర్వోక్తం కృత్వా శుద్ధ్యతీత్యర్థః॥ ఇతి హేమాద్రివిరచితే పీతశేషోదకపానప్రాయశ్చిత్తమ్॥

(౨౩౩) ఇక నొకరు పానము చేయఁగా మిగిలిన యుదకమును పానము చేసినవానికి ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఒకరు పానము చేయఁగా మిగిలిన యుదకమును పానము చేసినవాఁడు మద్యపానమును జేసినవానికి దుల్యుఁడగును. వ్యాసుఁడును నిటులనే చెప్పి తత్పాపోపశమనముకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరింపవలయును. జలాభావకాలమునందు పీతశేషమునందలి యుదకమును గొంచెము క్రిందవైచి పానమును జేయవచ్చుననియె. మార్కండేయుఁడును నిటులనే వచించె. గౌతముఁడును నిటులనే వచించె. ఆసనము, శయనము, వస్త్రము, భార్య, సంతానము, కమండలు, అనునవి తనకు బరిశుద్ధములు. ఇతరులకపరిశుద్ధములు. అదికారణముగ స్వపాత్రస్థోదకమునే పానము చేయ

వలయునని యముడు వచించె.

——— * ముఖేనోదకపానఖరోష్ట్రక్షీరాదిపానప్రాయశ్చిత్తమ్ * ———

(౭౩౪) అథముఖేనోదకపానఖరోష్ట్రహరిణీ క్షీరయామలసవక్షీరపానమృతవత్సగోక్షీరపానప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఉష్ట్రక్షీరం ఖరక్షీరం హరిణీక్షీరమేవచ। మృగక్షీరంచసాంధిన్యం క్షీరంయామలసంతథా॥ ముఖేనోదకపానంచ మృతవత్సాపయస్తథా। పీత్వాద్విజస్సకృన్మోహాత్కేవలం మహిషీపయః॥ తస్యాపనయనంభూయస్సప్తకృచ్ఛ్రంవిశోధనం। మృతవత్సాపయఃపానం ముఖేనోదకపానం వినేత్యర్థః॥ మార్కండేయః॥ శ్లో॥ మృతవత్సాపయఃపీత్వా ముఖేపీత్వాజలంద్విజః। ఉపోష్యైకరజనీమేకాం పంచగవ్యేన శుద్ధ్యతి॥ గౌతమః॥ శ్లో॥ సాంధిన్యం యామలం దుగ్ధముష్ట్రక్షీరంచమార్గజం। ఖరోష్ట్రయోఃపయఃపీత్వా పునస్సంస్కారమర్హతి॥ పశ్చాద్దేహవిశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రంసమాచరేత్। ఏతేనశుద్ధిమాప్నోతినాన్యథాశుద్ధిరిష్యతే॥ ప్రజాపతిః॥ శ్లో॥ ఖరోష్ట్రయోశ్చ సాంధిన్యం యామలంమార్గజంతథా। కేవలంమహిషీదుగ్ధం ద్విజఃపీత్వాపతత్యధః॥ తస్యాపనయనంభూయః తప్తకృచ్ఛ్రేణశుద్ధ్యతి। విప్రస్త్రీణాం బ్రహ్మచారిణాంసన్యాసినాం ద్విగుణం ప్రాయశ్చిత్తం వేదితవ్యం। ఖరోష్ట్రయోఃక్షీరపానే ఔషధార్థం తప్తకృచ్ఛ్రమాత్రం నపునస్సంస్కారః॥ తదాహగౌతమః॥ శ్లో॥ ఔషధార్థంద్విజః పీత్వాదుగ్ధం ఖరక్రమేళయోః। తప్తకృచ్ఛ్రం చరేత్పశ్చాన్నపునః కర్మగౌరవాత్॥ ఇతిహేమాద్రివిరచితేఉష్ట్రక్షీరాదిపానప్రాయశ్చిత్తమ్॥

(౭౩౫) ముఖముచేత నుదకపానము సేయుటకును, గాడిదె, ఒంటె, మొదలగువాని క్షీరమును పానముచేసినందుకును ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఒంటె, గాడిదె, లేడి, ఎనుము, చచ్చినదూడగలగోవు, వీనియొక్కక్షీరమును ద్రావినవాఁడును, ముఖముచేత నుదక పానము చేసినవాఁడును పునరుపనయన సంస్కారమును బొందుటయగాక తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమునుగూడఁ జేసికొనవలయునని దేవలుఁడు వచించె. మృతవత్సాక్షీరమును జేసినవాఁడును, ముఖముచేత నుదకపానము చేసినవాఁడును నొక్కదినముపవసించి పంచగవ్యప్రాశనము జేయుటచేతఁ బరిశుద్ధుఁడగునని మార్కండేయ మునివరుఁడుచెప్పె. సాంధిన్యము, యామలము, ఉష్ట్రక్షీరము, మృగక్షీరను. అనువానిని పానము చేసినవాఁడు పునస్సంస్కారమును బొందవలయును. పిమ్మట దేహశుద్ధి కొఱకు తప్తకృచ్ఛ్ర

ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని గౌతముఁడు చెప్పెను. ప్రజాపతియు ను నిటులనే చెప్పి బాలవృద్ధస్త్రీలకును, బ్రహ్మచారులకును, సన్యాసులకును ద్విగుణప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఖరోష్ట్రములయొక్క క్షీరపానము నౌషధముకొఱకుఁ జేసినయెడల తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొనవలయుననియును, పునరుపనయన సంస్కారము చేయవలసిన యక్కఱలేదనియును ప్రజాపతి వచించెను. గౌతముఁడును నిటులనే చెప్పె

—※ మనుష్యమృగపక్ష్యాది మలమూత్రాదిభక్షణ ప్రాయశ్చిత్తమ్ ※—

(౨౩౫) అథమనుష్యమృగపక్ష్యాది మలమూత్రాదిభక్షణే ప్రాయశ్చిత్తమాహ। దేవలః॥ శ్లో॥ మనుష్యస్య ఖరస్యాపి సూకరస్య ద్విజన్మనః। మలంమూత్రంపిబేద్యస్తు రేతోవారోగపీడితః। ద్విజఃపశ్చాత్పునఃకర్మ తప్తంకృత్వావిశుద్ధ్యతి॥ అజ్ఞానాచ్ఛుద్ధిమాప్నోతి జ్ఞాత్వాచాంద్రంచశోధనం। ఏతదనాతురవిషయం॥ ఆతురవిషయేప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ శ్లో॥ ఆతురోరోగముక్త్యర్థం ఖరమానుషసూకరాః। ఏతేషాం మలమూత్రంచ పీత్వాదోషమవాప్నుయాత్॥ రోగాంతేదేహశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రం చరేత్సుఖీ। అనాతురః పునఃకర్మ కృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ జాబాలిః॥ శ్లో॥ ద్విజఃపీత్వామలంమూత్రం ఖరమానుషయోఃకిటేః॥ అటదో దేహశుద్ధ్యర్థం పునఃకర్మపురస్సరం। తప్తకృచ్ఛ్రం చరేత్స్వస్థ్యేరోగితస్తంసమాచరేత్॥ ఏతేనశుద్ధోభవతినచాన్యైఃకర్మభిర్ద్విజః॥ యమః॥ శ్లో॥ ద్విజఃపీత్వామలంమూత్రం ఖరమానుషయోఃకిటేః॥ వయోవాహసగృధ్రాణాం సకృద్భుక్త్వాతుపాతకీ। పునఃకర్మప్రకుర్వీత తప్తకృచ్ఛ్రంచశోధనం॥ రోగిణోనపునఃకర్మతప్తకృచ్ఛ్రముదీరితం। మత్యభక్షాత్వాపిబేద్దవ్యం నారీణామర్ధమీరితం॥ యతీనాంవిధవానాం బ్రహ్మచారిణాం ద్విరావృత్తం॥ ఇతిహేమాద్రివిరచితే మనుష్యమలమూత్ర ఖరసూకరాది మలమూత్రభక్షణే ప్రాయశ్చిత్తమ్॥

(౨౩౫.) మనుష్యమృగపక్ష్యాది మలమూత్రాది భక్షణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ రోగపీడితుఁడైన ద్విజుఁడు మనుష్యమలమైనను గాడిదెమలమైనను, సూకరమలమైనను, మూత్రమైనను భక్షణపానములను జేసినయెడల పునరుపనయన సంస్కారమును జేసికొనుటయేగాక తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరింపవలయునని దేవలుఁడు వచించె. ఈ కృత్యమును బుద్ధిపూర్వకముగఁ జేసినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయు ననియును జెప్పె. రోగార్తుఁడగువాఁడు రోగవిముక్తికొఱకు ఖ

ంసూకరమానవ మలమూత్రమును భక్షణపానములు చేసినవాఁడు తత్ప్రాప్తిశమనముకొఱకు రోగనివారణానంతరమందు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, రోగములేనివాఁడిట్టి కృత్యముఁ జేసినయెడల పునరుపనయనసంస్కారమును బొందవలయునని గౌతముఁడు చెప్పె. జాబాలియును యముఁడును నిటులనే వచించిరి. స్త్రీలకర్ధప్రాయశ్చిత్తమును విధింపవలయును, యతులకును విధవలకును, బ్రహ్మచారులకును ద్విరావృత్తముగఁ జేయవలయును॥

—* అస్థిచర్మపక్షిలోమకేశోపహతశాకాన్నభోజనే ప్రాయశ్చిత్తమ్. *—

(౭౩౬) అథాస్థిచర్మపక్షి బహులోమకేశమలోపహత శాకాన్న భోజనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ శాకమధ్యే౽న్నమధ్యే వా దంత కేశనఖామలం। అస్థిచర్మద్విజస్యాంగ లోమకీటాఖనస్తథా॥ బహ్వన్నంస పరిత్యాజ్యం స్వపాత్రేస్థం పరిత్యజేత్। అన్నప్రమాణమాచారాధ్యాయే ప్రవ్యక్తం కరణేభిహితం॥ అథాన్నవిశేషమాహ॥ గౌతమః॥ శ్లో॥ అల్పేన్నే శాకమధ్యే వా దధిక్షీరాదిమధ్యగాః। దంతకేశనఖావిష్ఠా ద్విజలోమాస్థిచర్మచ। కీటాఖుక్రిమయస్తత్ర పచనం సంహరిత్యజేత్॥ స్వపాత్రస్థం గృహే చాల్పముభయం సంపరిత్యజేత్। భుక్త్యనంతరం శాకౌదనపాత్రయోర్ద్విధ్యమానే తదన్నం భుక్త్వా ఉపోష్య శుద్ధ్యతి॥ చర్ద్యథా వెఘటికా నప్త ప్రమాణాదారాత్రిభోజనం విరహ్య గాయత్ర్యష్టశతం జప్త్వా పంచగవ్యం పీత్వా శుద్ధ్యతి॥ తదాహ మనుః॥ శ్లో॥ జ్ఞాత్వైవ తైర్దూషితం భుక్తం భుక్త్వా విప్రః ప్రమాదతః। ద్వినాహర్తం ముహూర్తం వా తదన్నం జీర్ణతామగాత్॥ తదంతేవమనం కృత్వా శుద్ధో భవితుమర్హతి। న చేద్వైద్యరుషసి స్నాత్వా జప్త్వా విధానతః॥ అష్టోత్తరశతం పశ్చాత్ పంచగవ్యం పిబేత్తతః। శుద్ధిమాప్నోతి రాజేంద్ర న శుద్ధస్త్వన్యథా ద్విజ ఇతి॥ జాబాలిః॥ శ్లో॥ పక్వం వాల్పం త్యజేచ్ఛాకం నన్నం ల్పం త్యజేత్తథా॥ ఏతైరుపహతం భుక్త్వా తదానీం ఛర్దిమాచరేత్। జీర్ణే కేత్ర్యుషసి స్నాత్వా దేవేంద పెచ్ఛతం। బ్రహ్మకూర్చవిధానేన పంచగవ్యం పిబేత్తతః॥ ఏతేన శుద్ధిమాప్నోతి మృన్మయం తత్పరిత్యజేత్। బహులకేశేషు శాకాన్నయోర్మధ్యేస్థితేషు పూర్వవత్ ప్రాయశ్చిత్తం॥ ఏకస్మిన్కేశే విశేషమాహ॥ గౌతమః॥ శ్లో॥ అన్నే వా పక్వశాకే వా కేశమాత్రే వ్యవస్థితే। కబళే వాపి రాజేంద్ర కబళం సంపరిత్యజేత్॥ గ. ఘూషణం కృత్వాతు శేషాన్నం ప్రోక్ష మౌజ్జలైః। మృదం భస్మ క్షిపేత్తత్ర పశ్చాద్భుక్త్వా న దోషభాక్। మృదం వా భస్మ వా శ్యర్దః। అన్యైర్వాక్షినిర్వా స్వ వా

త్రస్థమన్నంవిప్రేక్షణాదిభిః శుద్ధింకారయిత్వాస్వయంగండూషమేకంకృత్వా భుక్త్వానదోషభాగిత్యర్థః ॥ ఇతిహేమాద్రినిర్మితె చర్మాస్థినఖమలాదిదూషితాన్నభోజనప్రాయశ్చిత్తం ॥

(౨౩౬) ఎముకలు,చర్మము, పక్షిలోమము, కేశము, మొదలగువానితో గూడుకొన్న శాకాన్నభోజనమందుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ శాకమధ్యగతంబైనను, అన్నమధ్యగతంబైనను, దంత, కేశ, నఖ, మలములయినను, అస్థిచర్మలోమములయినను, నున్నయెడల నట్టిశాకాన్నములనుపరిత్యజింపవలయును, బహ్వన్నము పరిత్యజింపగూడదు, స్వపాత్రస్థాన్నమును భుజింపగూడదు దేవలుడు చెప్పె. గౌతముడునుసిటులనే చెప్పె. భోజనానంతరమందు నఖలోమాదులా పాత్రయందు గనబడినయెడల భుజించినయన్నమును వమనమును జేసికొనవలయును, వమనాభావమునందు రాత్రిభోజనమును జేయక మరుదినమునందు నూటయెనిమిది పర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును, పిమ్మటపంచగవ్య ప్రాశనను జేయవలయును, మనువునునిటులనే చెప్పె. జాబాలియును సిట్లెవచించె. అన్నమునందైనను, పక్వమైనశాకమునందయినను, కేశాద్యగ్రముకనబడినయెడలదానిని వదలవలయును, భుజింపఁబోవుచున్న కబళమునందు కేశాదికముకనబడినయెడల నాకబళమునువదలవలయును, అట్లుసేసి యొకతూరి గండూషమునాచరించి భుజింపవలయును. మరలభుజించునపుడన్నముమీద నుదకమును ప్రోక్షించవలయును, ఇట్లని గౌతముడువచించె.

——❋భోజనకాలేదీపనిర్వాణప్రాయశ్చిత్తమ్ ❋——

(౨౩౭) అథభోజనకాలేదీపనిర్వాణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ దీపప్రజ్వాలనప్రాప్త్యా భోజనేనాశమాప్నుయాత్॥ కృత్వాపాత్రంతదాదోర్భ్యాం సంస్మరన్భానుమవ్యయం । పునర్దీపాగమే తాతగాయత్ర్యాన్నేజలంక్షిపేత్ ॥ తదన్నమత్యజన్భుక్త్వా శుద్ధిమాప్నోతి పండితః । అన్యదన్నంపునర్భుక్త్వా పంచగవ్యంపిబేత్తదా ॥ పూర్వపరివష్టృతమన్నమె భోక్తవ్యం ॥ నపునర్దాతవ్యం ॥ గౌతమః॥ శ్లో ॥ దీపాయదా ప్రణష్టశ్చేద్వాయునాతైలవర్జనాత్ ॥ పాణిభ్యాం పాత్రముద్ధృత్య స్మరన్సూర్యాండనువ్యయం॥ పునర్దీపాగమేచాన్నం స్థితంపాత్రపరివష్టృతం॥ నపునస్తత్ప్రదాతవ్యంభుక్త్వాశుద్ధిమవాప్నుయాత్॥ విధవాబ్రహ్మచారియతీనామేవం॥ వేదితవ్యం ఇతిహేమాద్రివిరచితె భోజనసమయె దీపనాశన ప్రాయశ్చిత్తం॥

(౨౩౭) భోజనకాలమునందు దీపము బోయినందుకు ప్రాయశ్చి

త్తమును చెప్పుచున్నాఁడు॥ రాత్రులయందు భోజనమును జేయుచుండఁగ దీపము పోయిన యెడల హస్తద్వయముచేతను పాత్రను ధరించి సూర్యదేవుని స్మరింపవలయును, అటుసేసి మరలదీపమును వెలిగించిన పిమ్మట నన్నము మీఁద నుదకము ప్రోక్షించి భుజింపవలయును. మరల నన్నమును బెట్టికొనఁ గూడదు. ఒకవేళ మరల నన్నమును బెట్టికొనిన యెడల పంచగవ్య ప్రాశనముచేత పరిశుద్ధుఁడగును. కాపునఁ దొలుతటియన్నముసేతప్ప మరల నన్నమును వడ్డించుకొనఁగూడదని దేవలుఁడువచించె. గౌతముఁడును నిటులనేచెప్పె. విధవాబ్రహ్మచారియతులకును నిటులనే ప్రాయశ్చిత్తాదికమును విధింపవలయును.

— ॥ ఏకహస్తవామహస్తపటపాషాణాదౌభోజనే ప్రాయశ్చిత్తమ్. ॥ —

(౨౯౮) అథఏకహస్త వామహస్త పటపాషాణాదౌ భోజనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ ఏకహస్తేనవామేనవటెపుష్పేఫలేత్వచి। పాషాణేచాయుతామ్రేవా భుక్త్వాదోషమవాప్నుయాత్॥ గౌతమః॥ శ్లో॥ త్వచిపుష్పేఫపాషాణే యద్రమేవస్త్రేస్థండిలే। ఉపలాయాంమునిశ్రేష్ఠవామహస్తేనవాద్విజః॥ ఏకపాణినాతోయపానంవామేనభోజనం॥ త్వచిపుష్పేఫలేవాపి పాషాణేతామ్రభాజనే॥ ఉపలాయాంవవస్త్రేవా అంజలౌ స్థండిలేపి వా। భుక్త్వాన్నంపూర్వజోజ్ఞానాతారాయకృచ్ఛ్రం సమాచరేత్॥ హారీతః॥ శ్లో॥ ఉపలాయాంచవస్త్రేవా అంజలౌస్థండిలేపివా। త్వచిపుష్పేఫలేవాపిపాషాణేతామ్రభాజనే। ఏకేనపాణినాతోయపానంవామేనభోజనం॥ ద్విజస్తుస్మృత్వామేపాత్రేకృత్వాకాయంసమాచరేత్॥ వ్రతార్థంవామహస్తభోజనే స్త్రీణాం దోషః॥ తదాహ గాలవః॥ కామ్యార్థం భోజనేన్నారీ వామహస్తేనసర్వదా॥ నతేనదోషమాప్నోతి వ్రతంయావత్సమాప్యతే॥ కంథూకవ్రణాదిభిరాక్రాంతే వామహస్తభోజనేనదోషః॥ తదాహగౌతమః॥ వామహస్తేనభుంజీయాద్విప్రోఽవామేవ్రణాదిభిః। దుష్టేనతేనదోషస్స్యాదన్యథాశూద్రఏవసః॥ ఇతిహేమాద్రివిరచితే ఏకహస్తపానపాషాణపటాదౌభోజనేప్రాయశ్చిత్తం॥

(౨౯౯) ఇఁకను ఒకహస్తమునందైనను, ఎడమచేతియందైనను, వస్త్రమునందైనను, పాషాణాదికమునందైనను భోజనమును జేసినందుకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఒకహస్తముచేతనైనను, వామహస్తముచేతనైనను, పటమునందైనను, పుష్పమునందైనను, చర్మమునందయినను, పాషాణమునందైనను, ఫలమునందైనను, పాషాణమునందైనను, తామ్రభాజ

నమునందైనను, ఒకహస్తముచేత నుదకపానమును, వామహస్తముచేత భోజనమును జేసిన యెడల దోషవంతుఁడగును. పృష్ఠపాత్రయందు భుజించినవాఁడు కాయకృచ్ఛ్రము నాచరింపవలయునని దేవలగౌతములు చెప్పిరి. హారీతుఁడును నిటులనే వచించె. కామ్యవ్రతాది నిమిత్తముగ స్త్రీలుమొదలగువారు వ్రతసమాప్తివఱకును నేకముచేత భుజించుటచే దోషములేదని గాలవుఁడువచించె. గౌతముఁడును నిటులనేచెప్పి వ్రతాది రహితకాలములయందు భుజించినవాఁడు శూద్రతుల్యుఁడగుననియె.

—— * శవాశ్రితగ్రామభోజనప్రాయశ్చిత్తమ్. * ——

(౨౩౯) అథ శవాశ్రితగ్రామభోజనే ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో॥ గ్రామేవా పట్టణే పల్ల్యాం కుణపః ప్రసంజ్ఞితః॥ నతావద్భోజనంకుర్యాద్యావద్గ్రామే నసత్యదః. మహాభారతే॥ శ్లో॥ బాలోవాకన్యకావాపి విప్రోవాధనతంభవేః। మృత్వా గ్రామేస్థితో యత్ర విప్రస్తత్రనభోజయేత్॥ యది భుక్తే సపాపీస్యాత్తదన్నం క్రిమిసంజ్ఞితం॥ మరీచిః॥ శ్లో॥ పట్టణేష్వగృహే త్యాజ్యా గ్రామేవీథ్యాంపరిత్యజేత్॥ అన్యత్ర సర్వేష్వస్యం త్యాజ్యం భోజనం తోయధారణం॥ సంవర్తః॥ శ్లో॥ యత్రైవశవః సంతిష్ఠేద్విప్రస్తత్రమహాజనః॥ పాకయత్నంతదాభుక్తిం జలాహారమేవచ। నకుర్యాత్తావతాక్షిప్రం యావత్తిష్ఠతిభూతలే॥ నతత్రభోజనంకుర్యాదన్యథాకాయమాచరేత్ । కుణపేనాశ్రితగ్రామేవిప్రోభుక్త్వాసపాతకీ॥ పశ్చాత్తాపంచయంప్రకుర్వీత పంచగవ్యమతఃపరం। బాలానాంక్షీరపానే నదోషోగృహమేధినాం॥ ఏతత్సర్వేషాం సమం॥ ఇతిహేమాద్రివిరచితే శవాశ్రితగ్రామభోజనప్రాయశ్చిత్తం॥

(౨౩౯) ఇఁకను శవము గ్రామమందుండఁగ భోజనమును జేసినందుకుఁ బ్రాయశ్చిత్తమును విధించుచున్నాఁడు॥ గ్రామమునందైనను, పట్టణమునందైనను, పల్లెయందైనను, బ్రాహ్మణశవముండి యుండఁగా భోజనమును జేయఁగూడదని దేవలుఁడు చెప్పె. బాలుఁడైనను, కన్యకయైనను, బ్రాహ్మణుఁడైనను, స్త్రీయైనను, లేక మఱియెవ్వరైనను మృతులై గ్రామమునందుండియుండఁగా బ్రాహ్మణుఁడగువాఁడు భోజనమును జేయఁగూడదనియును, ఒకవేళఁజేసినచో పాపవంతుఁడగుననియును, ఆ యన్నము క్రిమితుల్యమనియును మహాభారతమునందుఁ జెప్పఁబడియె. శవమెంతపర్యంతము భూతలమునందుఁ బడియుండునో యంతపర్యంతమును, భోజనమజ్జన జలపానాది ప్రయత్నమును గూడదనియును, ఒకవేళనవివేకాదులచేతఁ జేసిన యెడల కాయకృచ్ఛ్రము నాచరించుకొని పిదపఁ బంచగవ్య ప్రాశనమును జే

సినయెడల పరిశుద్ధుఁడగుననియును సంవర్తుఁడు చెప్పె. ఇదిసకలజనులకును సమానము.

——✻ సూర్యసోమోపరాగకాలభోజనప్రాయశ్చిత్తమ్. ✻——

(౨౮ . ) అథసూర్యసోమోపరాగకాలభోజనప్రాయశ్చిత్తముచ్యతే॥ దేవలః॥ శ్లో॥ సూర్యసోమోపరాగేచ ఉక్తకాలంవినాద్విజః॥ తదన్నం మాంసమిత్యాహుస్తద్భోక్తామాంసభుక్తదా॥ మరీచిః॥ శ్లో॥ సూర్యగ్రహే తు నాశ్నీయాత్పూర్వంయామచతుష్టయం। చంద్రగ్రహేతుయామాంస్త్రీన్ భుక్త్వాపాపంసమశ్నుతే। ఇతిధర్మంపరిత్యజ్య యోఽశ్నీయాత్త్వన్యథాచరేత్॥ తస్యోపవాసంభూయః తప్తంసాంతపనంస్మృతం॥ సూర్యగ్రహభోజనేతప్తం। చంద్రగ్రహభోజనేసాంతపనం॥ తథైవాహమనుః॥ శ్లో॥ సూర్యోపరాగయోర్భుక్తే తస్యపాపంమహత్తరం। తస్యపాపవిశుద్ధ్యర్థం తప్తకృచ్ఛ్రముదీరితం। చంద్రోపరాగకాలేతు భుక్త్వాకాయంసమాచరేత్। ఉభయోర్భోజనేవిప్రః పునస్సంస్కారమర్హతి॥ విధవానాంసన్యాసినాంపునస్సంస్కారవర్జం॥ బ్రహ్మచారిణామేవం॥ ఇతిహేమాద్రివిరచితే సూర్యసోమోపరాగకాలభోజనప్రాయశ్చిత్తం॥

(౨౮౦) ఇఁకను సూర్యసోమోపరాగకాలభోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ సూర్యసోమోపరాగములయందు ఉక్తకాలమును వదలి భోజనమును జేసినవాఁడు మాంసభోక్తయనఁబడును. ఆయన్నమును మాంసమనబడును. ఇట్లని దేవలుడు చెప్పె. సూర్యగ్రహణమునకు పూర్వము నాలుగుయామములకాలమును వదలి భోజనమును జేయవలయును. చంద్రగ్రహణమునకు పూర్వము మూడుయామములను వదలి భోజనమును జేయవలయును. అట్లుగాకేని పాపవంతుడగును. మఱియునిప్పుడు చెప్పినకాలములకు వ్యతిరిక్తమగు కాలములయందు భుజించినవానికి పునరుపనయనమును తప్త సాంతపనములను విధింపవలయును. అనగా సూర్యగ్రహణమునందు తప్తకృచ్ఛ్రమును, చంద్రగ్రహణమునందు సాంతపనకృచ్ఛ్రమును విధింపవలయును. ఇట్లని మరీచివచించె. మనువుగూడనిటులనేచెప్పె. విధవలకును సన్యాసులకును పునస్సంస్కారరహితముగ ప్రాయశ్చిత్తమును విధింపవలయును.

——✻ భిన్నపాత్రభోజనప్రాయశ్చిత్తమ్. ✻——

(౨౮౧) అథ భిన్నపాత్రభోజనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ స్వర్ణేవారాజతేకాంస్యే ప్రత్యహంభోజనంచరేత్। తద్భిన్నంయది రాజేంద్ర నకుర్యాత్తత్రభోజనం॥ జాబాలిః॥ శ్లో॥ స్వర్ణరాజతకాంస్యేషు

పలాశకదళీషుచ। విప్రోభుక్త్వా-మహత్పుణ్య మవాప్నోతినసంశయః। యదిభి న్నంపరిత్యాజ్యం తదాభుక్త్వైందవంచరేత్॥ ఏతానిస్వర్ణరజతకాంస్యానీ షట్పదకలితానిచే త్సర్వథాత్యాజ్యాన్యేవ॥ తదేవాహ దేవలః। శ్లో॥ స్వ ర్ణంకాంస్యంతథా రాజత రాజతంభిన్నమేవయత్। తత్రభుక్త్వాచరేతాం యమన్యథాదోషమాప్నుయాత్। పలాశకదళీపర్ణాదిషుయోభోజనంచరేత్ తాన్యేవాహరణీయాని నపాత్రాంతరాణి। అన్యథాపూర్వవత్ప్రాయశ్చిత్తం కృత్వాశుధ్యతి॥ తదేవాహపరాశరః॥ శ్లో॥ యేషుపర్ణేషు యాభుక్తిస్తేషు తాంముఖజశ్చరేత్॥ అన్యపాత్రంతథాభిన్నం తత్రభుక్త్వైందవంచరేత్। అభిన్నభాండె ఏకపాత్రేచ భోజనే విప్రాణాంధర్మోవర్ధతే అన్యథాక్షీణతామాప్నోతి॥ గౌతమః॥ శ్లో॥ అభిన్నపాత్రేయోవిప్రః పర్ణేష్వేకేషుజాతితః॥ భోజనంకురుతేసోఽయం సంపూర్ణాయుర్భవేదిహ। సర్వేషామేతదేవవేదితవ్యం। నాన్యత్॥ ఇతిహేమాద్రౌవిరచితేభిన్నపాత్రభోజనప్రాయశ్చిత్తం॥

(౨౪౧) ఇకను భిన్నపాత్రభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ బంగారుపాత్రయందైనను, వెండిపాత్రయందైనను, కంచుపాత్రయందైనను భోజనమును ప్రతిదినమందును భోజనమును జేయవలయును. ఇతరపాత్రలయందు భోజనమును జేయగూడదనియును దేవలుడు చెప్పె. స్వర్ణ, రాజత, కాంస్య, పాత్రలయందైనను, పలాశకదళీపత్రములయందైనను, బ్రాహ్మణుడు భుజించినయెడల మహత్పుణ్యమును బొందును. భిన్నమయిన పాత్రలయందు భుజించినవాడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. పైన చెప్పబడిన పాత్రలు భిన్నములయిన యెడల వానిని పరిత్యజింపవలయును. ఇట్లని జాబాలివచించె. దేవలుడును నిటులనేచెప్పె. బ్రాహ్మణుడే పాత్రలయందేభుక్తిని చేయునో యాపాత్రలయందాభుక్తినే చేయవలయును. అట్లుగాక యన్యపాత్రయందు భుజించిన యెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయునని పరాశరుడు వచించె. సర్వకాలములయందును నొకవిధమగు పాత్రలయందే భుజించిన యెడల సంపూర్ణాయుష్యము గలవాడగునని గౌతముడువచించె. ఈవిషయమందఱకును సమానమేయనియభిప్రాయము.

—* సంధ్యాదిభోజనకాలేమచండాలాదిధ్వనిశ్రవణప్రాయశ్చిత్తమ్.*—

(౨౪౧) అథసంధ్యాదిభోజనకాలేషు చండాలాదిధ్వనిశ్రవణేప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ స్నానభోజనవేళాయాం జపహోమాదికేషు పైతృకే। సంధ్యాదినిత్యకామ్యేషు దేవపూజాసుసర్వదా। చండాలాస్త్రీవి

ధాఃప్రోక్తాస్తేషాంసంభాషణాదికం। శ్రుత్వాకర్మపరిత్యజ్య దృష్ట్వాతత్పునరాచరేత్। అన్యథాదోషమాప్నోతి కర్మభ్రష్టోహిజాయతే। చండాలస్యైవయత్కర్మ శ్రుత్వాదృష్ట్వాపరిత్యజేత్। గ్రామచండాలానాం తత్తత్సాధనధ్వనిశ్రవణం కృత్వాభోజనాదికం పరిత్యజేత్తత్తత్సాధనాని రజకస్య వస్త్రసంఘట్టనధ్వనిః। చర్మకారకస్యచర్మతాడనం। స్వర్ణకారకస్యస్వర్ణతాడనం। తక్షకస్యదారుసౌష్ఠవార్థంతక్షణం। తిలఘాతకస్య తిలయంత్రధ్వనిః। సూనోర్మాంసఖండనం। కులాలస్యఆర్ద్రభాండతాడనం। ఏతేషాంతత్సాధనభూతానాం ధ్వనిశ్రవణేదర్శనేచతత్త్యాజ్యం పునఃకర్మకరణీయం॥ తదేవాహమార్కండేయః॥ శ్లో॥ ఏతేషాంసాధనానాంచ ధ్వనింశ్రుత్వానుకర్మసు। కర్మతత్సంపరిత్యజ్య శ్రోత్రంస్పృష్ట్వాచదక్షిణం। అక్షిణీపయసాస్పృష్ట్వాపునఃకృత్వావిశుద్ధ్యతి। దర్శనేసంపరిత్యజ్యపునఃకర్మసమాచరేత్। అన్యథాభోజయేద్విప్రః కర్మకుర్యాత్తదాయది॥ అష్టోత్తరశతంజప్త్వాగాయత్రీంవేదమాతరం। ఏతేనశుద్ధిమాప్నోతి ద్విజోనాన్యత్రకర్మణా॥ యతిబ్రహ్మచారిణామేవం॥ ఇతిహేమాద్రివిరచితే చండాలాదిధ్వనిశ్రవణప్రాయశ్చిత్తం॥

(౨౪౧) ఇఁకను సంధ్యాదిభోజనకాలములయందు చండాలాదిధ్వనిశ్రవణప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాఁడు॥ స్నానభోజన సమయములయందును, జపహోమములయందును, పైతృక కృత్యములయందును, సంధ్యాదినిత్యకర్మలయందును, కామ్యకర్మలయందును, దేవపూజాది కర్మలయందును, త్రివిధచండాలురవచనములను వినఁగూడదనియును, ఒకవేళనట్టివారివచనములనువినినను, అట్టివారలనుజూచినను, మరల నాకర్మలనాచరింపవలయును. అట్లుచేయనియెడల దోషవంతుఁడగును. పిమ్మటఁ గర్మభ్రష్టుఁడై పుట్టును. చండాలునికర్మనువినినను, చూచినను, తనకర్మనువదలి మరల ప్రారంభింపవలయును. గ్రామచండాలాదులయొక్క తత్తత్సాధనధ్వనిశ్రవణమునుజేసిన యెడల భోజనాదికమును పరిత్యజింపవలయును. తత్తత్సాధనధ్వనియనఁగా రజకునివస్త్రసంఘట్టనధ్వని, చర్మకారకునియొక్క చర్మతాడనధ్వని, ఇటులనే తక్కినధ్వనులనియును నెఱుంగవలయును. ఇట్లని దేవలుఁడు వచించె. మార్కండేయుఁడును నిటులనేచెప్పి యిట్టికృత్యమును జేసినవాఁడు తనదు పాపము నివర్తియగుటకు నూటయెనిమిది పర్యాయములుగాయత్రీజపమును జేసికొనవలయును. ఇట్లుచేయనియెడల బ్రాహ్మణకర్మలకనుకూలుఁడు గానేరఁడని యెఱుంగవలయును. యతిబ్రహ్మచారులును నిటులనేయాచరింపవలయును,

—✻ సతకర్మాచరణకాలేసూకరాదిదర్శనప్రాయశ్చిత్తం. ✻—

(౨౪౧) అథసతకర్మాచరణకాలె సూకరాదదర్శనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ సూకరంకుక్కుటం శ్వానం ద్విజోదృష్ట్వాసుకర్మసు। తత్కర్మసంపరిత్యజ్య పునఃకృత్వావిశుద్ధ్యతి ॥ భోజనేభోజనంత్యక్త్వా సుఖమాప్నోతిపూర్వజః। అన్యథాదోషమాప్నోతి యదిలోభాత్ప్రవర్తతే। స్నానాదినిత్యకర్మమధ్యేసూకరాదికం దృష్ట్వాపూర్వవత్ శ్రౌత్రాదికంస్పృష్ట్వా పూర్వవత్ప్రాయశ్చిత్తం కృత్వాపిశుద్ధ్యతి। నాన్యకర్మభిః ॥ స్త్రీణాంయతిబ్రహ్మచారిణామేవం ప్రాయశ్చిత్తం॥ ఇతిహేమాద్రివిరచితె సతకర్మాచరణకాలేసూకరాదిదర్శనప్రాయశ్చిత్తం॥

(౨౪౨) ఇంకను సతకర్మాచరణకాలమునందు సూకరాదిదర్శనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడగువాఁడు సత్కర్మలను జేయుచుండు తరుణమున సూకరమైనను, కుక్కుటమైనను, శ్వానమైనను, గనఁబడినయెడల నంతటితో నాకర్మంబుజాలించి మరల నాకర్మనుప్రారంభించి చేయవలయును. ఈజంతువులను భోజనసమయమునందుఁ జూచినయెడల నంతటితోనయ్యన్నమును బరిత్యజింపవలయును. అట్లుగాదేని దోషవంతుఁడగును. స్నానాదినిత్యకర్మమధ్యమందు సూకరాదికమునుజూచి పూర్వోక్తప్రకారముగ శ్రోత్రాదికమును స్పృశించి పూర్వమువలెఁ బ్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పరిశుద్ధుఁడగును. ఇతరములగు కర్మలచేతఁ బరిశుద్ధుఁడు గాఁడు. స్త్రీలకుయతిబ్రహ్మచారులకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించవలయునని దేవలుఁడు చెప్పె.

—— రజస్వలాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ——

(౨౪౩) అథరజస్వలాన్నభోజనప్రాయశ్చితమాహ॥ దేవలః॥ శ్లో॥ రజస్వలాన్నంయోభుక్త్వాద్విజోజ్ఞానాత్సకృద్యదిః॥ రౌరవంనరకంయాతి భవేత్పశ్చాద్విగర్హితః॥ ఋతుమత్యప్యజ్ఞానాత్పచనాదికం కృత్వాభుక్త్యనంతరమీషచ్ఛుష్కంరజోదృష్ట్వా అహంరజస్వలాభవామీతిజ్ఞాత్వాచ ప్రసరతితదప్రసరణె సర్వేభుక్తవంతోరజస్వలాన్నభోక్తారః । తేషాంభోక్తౄణాం పునరుపనయనచాంద్రాయణాభ్యాం వినాశుద్ధిర్నాస్తి॥ తదేవాహ। మార్కండేయః॥ శ్లో॥ అజ్ఞాత్వాపుష్పిణీనారీ కృత్వావైపచనక్రియాం। పశ్చాచ్ఛుష్కంరజోదృష్ట్వా తస్మాద్దేశాదపాక్రమేత్॥ తాందృష్ట్వా భాషణంశ్రుత్వాభోక్తారోద్విజనాయకాః । కృత్వాశుద్ధిమవాప్నుస్తే చాంద్రంవ్రతమనుక్రమాత్॥ పంచగవ్యేనశుద్ధాస్స్యురన్యథాపాపినోభవేత్ । యతిబ్రహ్మచారి

ణాం స్త్రీణామప్యేవం॥ ఇతి హేమాద్రివిరచితే రజస్వలాన్నభోజన ప్రాయశ్చిత్తం॥

(౨౮౩) ఇఁకను రజస్వలాన్నభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడగువాఁడజ్ఞానమువలన రజస్వలాన్నము నొకపర్యాయము భుజించినను రౌరవమను నరకమునుబొందునని దేవలుఁడుచెప్పె. ఆడుదితానురజస్వలయైనవిషయమును దెలియక పచనక్రియనుచేసి పిమ్మట తనకుఁ దానుగూడ రజస్సునుజూచి యాస్థలమును వదలి బయలునకుఁ బోవలయును. అట్టిదానిజూచి సంభాషించి భోజనమును జేసినవారు రజస్వలాన్నభోక్తలనఁబడుదురు. అట్టివాఁడు పునరుపనయన చాంద్రాయణవ్రతపంచగవ్యప్రాశనములను జేసినయెడల పరిశుద్ధులగుదురు. యతిబ్రహ్మచారులకును, స్త్రీలకును నిటులనే ప్రాయశ్చిత్తమును విధించుకొనవలయునని మార్కండేయుఁడుచెప్పె.

——— స్పృష్టాన్నదృష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ———

(౨౮౪) అథస్పృష్టాన్నభోజన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ శూద్రైర్నానావిధైర్వర్ణైశ్చండాలాదిభిరీక్షితం। పుష్పవత్యాసూతికయాగృష్టంవా పతితాదిభిః॥ అన్నంభక్ష్యంతథాశాకం భుక్త్వావిప్రస్సకృద్యది। ప్రాయశ్చిత్తీభవేద్వాపి సకర్మార్హోభవేదిహ॥ గాలవః॥ శ్లో॥ చండాలపతితవ్రాత్య శూద్రవారాజతేంద్రియైః। అస్నాతవద్భిర్జ్ఞాతైశ్చశ్వపాకైః పరిభాషితం॥ మలమూత్రసమీపస్థంతు షాంగారకపాలవత్। ఉచ్ఛిష్టస్పృష్టసంస్పృష్టం భక్ష్యమన్నంచయద్భవేత్॥ ద్విజైస్తత్తన్నభోక్తవ్యం శాకంవాభోజ్యమేవవా। యదిమోహవశాద్భుంక్తే ప్రాయశ్చిత్తీభవేదిహ॥ లౌగాక్షిః శ్లో॥ ఘృతైర్వాక్తైర్వానిమిత్తైర్వా స్పృష్టముచ్ఛిష్టమేవయత్॥ తదన్నంయోద్విజోభుక్త్వా పశ్చాత్తాపవాప్యచ। స్వశరీరవిశుద్ధ్యర్థంకాయకృచ్ఛ్రంసమాచరేత్॥ పచగవ్యేనశుద్ధిస్స్యాత్ వ్రతినాంయతినామిహ। విధవానామిదంశుద్ధం నాన్యథాశుద్ధిరిష్యతే॥ ఇతి హేమాద్రివిరచితే స్పృష్టాన్నదృష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్॥

(౨౮౪) ఇఁకనితరులు స్పృశించినదియును, జూచినదియును నగు నన్నమును భుజించిన దోషనివారణకొఱకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ శూద్రులు, నానావర్ణస్థులు, చండాలాదులు, రజస్వలాస్త్రీలు, ప్రసవముయియున్నస్త్రీలు, పతితులు మొదలగువారిచేతఁ జూడఁబడిన యన్నమును, స్పృశింపఁబడిన యన్నమును లేక భక్ష్యాదులను భుజించిన బ్రాహ్మణుఁడు

ప్రాయశ్చిత్తార్హుఁడగును. అట్టివాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనని యెడల నేకర్మను జేయుటకును నర్హుఁడు గాఁడని దేవలుఁడు వచించె. గాలవుఁడును నిటులనే చెప్పె. లౌగాక్షియును నిటులనే చెప్పె యిట్టి పాపకృత్యమును జేసినవాఁడు కాయకృచ్ఛ్రమును జేసికొనవలయును. మఱియును పంచగవ్యప్రాశనను గూడ జేసికొనవలయును. విధవాయతిబ్రహ్మచారులకును దగిన ప్రాయశ్చిత్తమును విధించవలయుననియె.

—— ❋ నిషిద్ధదినేషుద్విర్భోజన ప్రాయశ్చిత్తమ్. ❋ ——

(౨౮౫) అథనిషిద్ధదినేషు ద్విర్భోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పిత్రోర్మృతాహే పూర్వేద్యుర్భానువారేచసంక్రమే। తథాచతుర్దశ్యష్టమ్యోర్వ్రతేషుచమహోత్సవే॥ శ్రోత్రియేమరణంప్రాప్తే గురూణాందుఃఖసంభవే। పితరౌవ్యాధినాగ్రస్తౌ మహారాజనిపాతనే॥ ఉక్తేష్వేతేషుసర్వేషు అన్యేష్వపితపర్వసు। నద్విర్వారంసమశ్నీయాద్విప్రోధర్మపరాయణః॥ మార్కండేయః॥ శ్లో॥ అర్కద్విపర్వరాత్రౌచ మృతాహేతుపూర్వాపరే। తథాచతుర్దశ్యష్టమ్యోర్వ్రతేమచమహోత్సవే॥ పితరౌవ్యాధినాక్రాంతౌ మహారాజనిపాతనే। శ్రోత్రియేమరణంప్రాప్తే గురూణాందుఃఖసంభవే॥ ఉక్తేష్వేతేషు గాన్యేషుపుణ్యేష్వతపర్వసు॥ నద్విర్వారంసమశ్నీయాద్విప్రోధర్మమనుస్మరన్। తస్యపాపవిశుద్ధ్యర్థం సహసానిష్కృతించరేత్॥ అజ్ఞానాత్కాయకృచ్ఛ్రంస్యాజ్జ్ఞాత్వాపస్తంసమాచరేత్। పంచగవ్యేనశుద్ధస్స్యాద్విప్రోద్విర్వారభోజనే॥ ఇతి హేమాద్రివిరచితే నిషిద్ధదివసేషు ద్విర్భుక్తిప్రాయశ్చిత్తమ్॥

(౨౮౫) ఇకను నిషిద్ధదినములయందు రెండుపర్యాయములు భోజనమును జేసినందుకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ధర్మపరాయణుఁడగు బ్రాహ్మణుఁడు తల్లిదండ్రుల మృతదినమునకుఁ బూర్వదినమునందును, భానువారమునందును, సంక్రమణమునందును, చతుర్దశినందును, అష్టములయందును, వ్రతములయందును, మహోత్సవమందును, శ్రోత్రియుఁడు మరణమును బొందియున్న సమయమునందును, గురువులకు దుఃఖము గలిగియున్న సమయమునందును, తల్లిదండ్రులు వ్యాధిగ్రస్తులైయున్న సమయమునందును, మహారాజనిపాతనమునందును, మరియు నితరములగు పర్వములయందును రెండుపర్యాయములు భోజనమును జేయఁగూడదని దేవలుఁడు చెప్పె. మార్కండేయుఁడును నిటులనే చెప్పి ప్రాయశ్చిత్తమునుగూడ విధించె. ఎట్లనిన, ఇట్టికృత్యమును, అవివేకముచేతఁ జేసినయెడల కాయకృచ్ఛ్రమును,

ఆచరింపవలయును, తెలిసి చేసినయెడల తప్తకృఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, పిదపపంచగవ్యప్రాశనముగూడ జేయవలయును ॥

—— ✻ దేవపూజావైశ్వదేవపరిత్యాగభోజనప్రాయశ్చిత్తమ్. ✻ ——

(౨౮౬) అథ దేవపూజావైశ్వదేవపరిత్యాగభోజనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ దేవతారాధనం త్యక్త్వా వైశ్వదేవం తథాతిథిం। యో విప్రోభోజనం కృత్వానిత్యహోమం తథా త్యజేత్ ॥ సురాపీసహివిజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతః ॥ మార్కండేయః ॥ శ్లో ॥ వైశ్వదేవం నిత్యహోమంతథైవాతిథిభోజనం । దేవతారాధనంచైవత్యక్త్వావిప్రోమహామునే ॥ భుక్త్వాజ్ఞానాన్మహాదోషస్సురాపీకథ్యతేబుధైః ॥ జాబాలిః ॥ శ్లో ॥ వైశ్వదేవం దేవతార్చాం నిత్యహోమం తథాతిథిం । బ్రహ్మయజ్ఞం పితౄణాంచతర్పణంద్విజవల్లభ ॥ త్యక్త్వాభుక్త్వాతథావిప్రస్సురాపీత్యుచ్యతేబుధైః । తప్తకృచ్ఛ్రంచరేత్సాపీ తస్మాద్దోషాత్ప్రముచ్యతే ॥ పంచగవ్యేనపూతాత్మా నాన్యథాశుద్ధిరస్తిహి॥ ఇతి హేమాద్రివిరచితే దేవపూజావైశ్వ దేవాతిథి బ్రహ్మయజ్ఞ పరిత్యాగప్రాయశ్చిత్తం॥

(౨౮౬) ఇకను దేవపూజా వైశ్వదేవ పరిత్యాగభోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ దేవతారాధనను, వైశ్వదేవమును, అతిథిపూజను, నిత్యహోమమునువదలి భోజనమును జేసిన బ్రాహ్మణుడు, సురాపానమును జేసినవాడగుననియును, సకలకర్మబహిష్కృతుడునునగునని దేవలుడుచెప్పె. మార్కండేయుడునునటులనేచెప్పె. వైశ్వదేవమును, దేవతార్చనను, నిత్యహోమమును, అతిథిపూజను, బ్రహ్మయజ్ఞమును, పితృతర్పణమును, వదలి భోజనముజేసినవాడు సురాపియనబడును, కావుననట్టివాడు తప్తకృఛ్రమును జేసికొని పంచగవ్య ప్రాశనముశేసినయెడల పరిశుద్ధుడగునని జాబాలిచెప్పెను॥

——✻ఉష్ణోదకస్నానకూపోదకస్నానమృత్తికాహీనశౌచప్రాయశ్చిత్తం✻——

(౨౮౭) అథ ఉష్ణోదకస్నాన కూపోదకస్నాన మృత్తికాహీనశౌచ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో ॥ ఉష్ణోదకేనసప్తాహం తథాకూపోదకేనచ । మృత్తికాభిర్వినాశౌచం కృత్వాసప్తాహమాదరాత్॥ చతుర్వేదధరోవిప్రః శూద్రఏవనసంశయః॥ గౌతమః ॥ శ్లో॥ మృత్తికాభిర్వినాశౌచం స్నానముష్ణోదకేనవై। కూపోదకేనసప్తాహం కృత్వావిప్రస్సశూద్రవత్॥జాబాలిః॥ శ్లో॥ కూపోదకేనసప్తాహం తథాహ్యుష్ణేనవారిణా। మృత్తికాభిర్వినాశౌచం తథాకూపోదకంమహత్ ॥ కృత్వాశౌచాదికంవిప్ర శూద్రఏవనసంశయః ।

ప్రాయశ్చిత్తమిదంప్రోక్త మృషిభిర్లోకసమ్మతం ॥ ప్రాజాపత్యం విశుద్ధ్యర్థం చరేత్పూర్వతో భవేదిహ । పంచగవ్యంపిబేత్పశ్చాత్తేనశుద్ధిర్నచాన్యథా ॥ యతి బ్రహ్మచారి విధవానాంద్విగుణం ॥ ఇతి హేమాద్రివిరచితే ఉష్ణోదకకూపోదకమృత్తికారహితశౌచ ప్రాయశ్చిత్తమ్ ॥

(౨౪౭) ఇకను, ఉష్ణోదకస్నాన, కూపోదకస్నాన, మృత్తికాహీన శౌచ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ ఉష్ణోదకకూపోదకములచేతనే డుదినములు స్నానమును జేసినను, మృత్తికలేక యేఁడుదినములు శౌచమును జేసినను, నాలుగువేదములను జదివినవిప్రుఁడుగూడ శూద్రతుల్యుఁడగుననుటకు సంశయములేదని దేవలుఁడుచెప్పె. గౌతముఁడునునిటులనేచెప్పె. జాబాలియును నిటులనేచెప్పె ప్రాయశ్చిత్తమును గూడఁజెప్పె. అదియెట్లనిన, ఇట్టికృత్యములు జేసినవాఁడు నిజపాపోపశమనముకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రపంచగవ్యప్రాశనలను జేసినయెడల పరిశుద్ధుఁడగును, యతి బ్రహ్మచారి విధవలకు ద్విగుణముగఁ జేయవలయుననియె ॥

——* ఉపవీతశిఖావినా భోజనే ప్రాయశ్చిత్తమ్ *——

(౨౪౮) అథోపవీతశిఖేవినాభోజనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ వినాయజ్ఞోపవీతేన శిఖయాచద్విజోత్తమః । ఉచ్ఛిష్టేనాయదిమోహాత్మాపాపకారీభవేద్ద్విజః । మార్కండేయః ॥ శ్లో॥ శిఖయాబ్రహ్మసూత్రేణవినావర్తేతయోద్విజః । ఉపోష్యాంరజనీమేకాం పంచగవ్యేనశుద్ధ్యతి॥ గౌతమః ॥ శ్లో ॥ శిఖాచబ్రహ్మసూత్రంచ నష్టం భ్రష్టం యదాభవేత్ । ధృత్వానవంపునర్గ్రంథితాం ద్విక్షిప్తంతత్రజలేక్షిపేత్ ॥ శిఖాంవినా ద్విజశ్రేష్ఠః కర్ణగోపాలలోమభిః ॥ ధృత్వాతద్దోషశాంత్యర్థం కాయకృచ్ఛ్రంసమాచరేత్।యావచ్ఛిఖాపునర్జాతా తావత్కర్ణైవధారయేత్ ॥ బ్రహ్మవిష్ణుమహేశాఖ్యాబ్రహ్మసూత్రస్యతంతవః । ఏకస్మిన్ త్రుటితేవిప్రఃపునర్ధృత్వానవంముదా॥ నిత్యకర్మప్రకుర్వీత త్రుటితం నిక్షిపేజ్జలే । బ్రహ్మసూత్రందక్షిణేంసే భ్రష్టంస్యాచ్చతురంగులం ॥ ప్రాణాయామత్రయంకృత్వా పునస్సంస్థాపనంచరేత్ । కూర్పరేబ్రహ్మసూత్రంచేద్భ్రష్టంయదిహదైవతః ॥ ప్రాణాయామశతంకృత్వా స్వస్థానేపూర్వవత్క్షిపేత్ । మణిబంధేస్థితంసూత్రం భ్రష్టంయదిహ పూర్వవత్ ॥ తద్దోషపరిహారార్థం ప్రాణాయామసహస్రకం । కృత్వాశుద్ధిమవాప్నోతిహామహస్తాదధోగతం: తత్సూత్రంసహసాత్యక్త్వా ధృత్వాచాన్యన్ముదాద్విజః । జలేక్షిప్తంపరిత్యాజ్యసహస్రం వేదమాతరం ॥ జప్త్వాశుద్ధిమవాప్నోతి నాన్యథాశుద్ధిరీరితా ॥ ఇతి హేమాద్రివిరచితే ఉపవీతశిఖావినా

భోజనే నిత్యకర్మకం చైవ ప్రాయశ్చిత్తమ్ ॥

(౫౮౮) ఇకను శిఖాయజ్ఞోపవీతములులేక భోజనమునుజేసి నందుకుం బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ శిఖాయజ్ఞోపవీతములు లేక భోజనమును జేసినయెడల పాపవంతుఁడగునని దేవలుఁడు చెప్పె. శిఖాయజ్ఞోపవీతములను వదలి ప్రవర్తించిన బ్రాహ్మణుఁ డొకదినమంతయును పవసించి పంచగవ్యప్రాశనను జేసినయెడల పరిశుద్ధుఁడగునని మార్కండేయుఁడు వచించె. శిఖాయజ్ఞోపవీతములు భ్రష్టమైనను, నష్టమైననుమరల ధరించవలయును, నూతనమైనదానిని ధరించినపుడు ప్రాతదానినిజలమునందు బడవేయవలయు, శిఖలేనివాఁడు కర్ణమునందు గోవాలలోమములనుబెట్టికొని శిఖాధారణానంతరమందు వదలవలయును, అట్లుసేసినయనంతరమందు తద్దోషపరిహారము కొఱకు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును, యజ్ఞోపవీతముయొక్క మూఁడుతంతువులును, బ్రహ్మవిష్ణు మహేశ్వరులనబడును. కావున నామూడుసూత్రములలో నొకటిత్రుటితమైనను,మరి నూతనయజ్ఞోపవీతమును ధరించినిత్యకర్మల నాచరింపవలయును, యజ్ఞోపవీతము దక్షిణభుజమునకు దిగువ నాలుగంగుళము లతిక్రమించి వచ్చెనేని మూఁడుప్రాణాయామముల నాచరించి మరలనయ్యజ్ఞోపవీతమునుయథాక్రమముగ వేసికొనవలయును, కూర్పరస్థానమందు యజ్ఞోపవీతము బడెనేని నూరుప్రాణాయామములను జేసికొని మరల నయ్యజ్ఞోపవీతమును పూర్వోక్తప్రకారముగ ధరించవలయును, మణిబంధమునందు యజ్ఞోపవీతముబడెనేని వేయిప్రాణాయామములను ధరించవలయును, మణిబంధమునకు గూడదిగిపోయెనేని మరల నూతనయజ్ఞోపవీత ధారణను జేయవలయును. పిమ్మట వేయి పర్యాయములు గాయత్రీ జపమును జేయవలయునని గౌతముడు చెప్పె॥

— భోజనకాలేక్షుతజృంభణాపానవాయూత్సర్గప్రాయశ్చిత్తమ్ —

(౫౮౯) అథభోజనకాలే క్షుతజృంభణాపానవాయూత్సర్గప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ శ్లో ॥ విప్రోభోజనకాలేషు క్షుతంవా జృంభణంతథా । అపానవాయోరుత్సర్గం కృత్వావిప్రస్సపాపభాక్ ॥ మరీచిః ॥ శ్లో॥ విప్రస్స్వభుక్తిసమయే క్షుతంజృంభణమేవవా । అపానవాయు మోక్షంచ కృత్వాభుంజీతపాపభాక్ ॥ విష్ణుః ॥ శ్లో॥ ద్విజోభోజనకాలేతు జృంభణం క్షుతమేవచ । అపానవాయుమోక్షంచ ప్రాయశ్చిత్తీభవేత్తదా ॥ అన్యోదోష్ణాజలం ధృత్వా తస్యమూర్ధనివిన్యసేత్ ॥ స్పృశ్చేత్తం జన్మసదనం దవా

వాయదివానిశి । తుతేతుతస్యసంజాతే ఏవంకృత్వావిశుద్ధ్యతి । జృంభణే ప్యేవం । అపానవాయోరుత్సర్గే జాతేన్నంపరివర్జయేత్ ॥ భుక్త్వాపాప మవాప్నోతి పాపంయచ్ఛ్వాచవర్జనే । లోభేనభుక్త్వాతద్భక్తంస్నాత్వాకాయం సమాచరేత్ ॥ ఏతేనశుద్ధిమాప్నోతి ద్విజోనాన్యత్రకర్మణేతి । స్త్రీణాంయతిబ్రహ్మచారిణామప్యేవం ॥ ఇతి హేమాద్రివిరచితే భోజనసమయే క్షుత జృంభణాపానవాయూత్సర్గప్రాయశ్చిత్తం ॥

(౨౪౯) ఇకను భోజనకాలమునందు, తుమ్ము, ఆవలింత, అపానవాయువు, వీనినివదలినందుకు ప్రాయశ్చిత్తవిధానమును దెలుపుచున్నాడు॥ భోజనకాలమునందు, తుమ్ము, ఆవలింత, అపానవాయువు, అనువానినివదలిన బ్రాహ్మణుడు పాపవంతుడగునని దేవలుడుచెప్పె. మరీచియును నిటులనేచెప్పె. విష్ణునిట్టికృత్యములను జేసినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయుననియు- అపానవాయువును వదలినవాడంతటితో నయ్యన్నమును బరిత్యజించవలయును, లోభమువదలక భుజించినవాడు తత్పాప శమనముకొఱకు కాయకృఛ్రమునాచరించవలయుననియు. ఇట్లు చేయనియెడల పరిశుద్ధుడుగాడనియును వచించె॥

——✻ సూతకద్వితయభోజనప్రాయశ్చిత్తమ్ ✻——

(౨౫౦) అథసూతకద్వితయ భోజనప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ శ్లో ॥ ఆశౌచద్వితయేరాజ న్నసగోత్రోథవావ్రతీ । విధవాచాన్యగోత్రావాయతివాన్యసియనుస్థితః ॥ సూతకద్వితయే భుంజన్ మహాంతం నరకంవ్రజేత్ ॥ గాలవః ॥ శ్లో॥ యతిర్వాబ్రహ్మచారీవావిధవావా ఒన్యగోత్రజా॥ అసగోత్రోథవావిప్రస్త్వాశౌచద్వయసంశ్రితం । అన్నంభుక్త్వామహాపాపీ నరకంయాతిదారుణం । భవమాసాద్యతత్పశ్చా జ్జాయతేరోగబాధితః ॥ గౌతమః ॥ శ్లో॥ విప్రస్త్వాహారమన్విచ్ఛన్ యతిర్వాప్రథమాశ్రమః ॥ సూతకద్వితయేభుక్త్వా నారీవాసతివర్జితా । పునస్సంస్కారపూతాత్మాతప్తకృచ్ఛ్రం సమాచరేత్ ॥ పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధిమాప్నోతి నాన్యథా । యతివిధవయోః పునస్సంస్కారవర్జం। ప్రాయశ్చిత్తంవివేచనీయ్యం ॥ ఇతి హేమాద్రివిరచితే సూతకద్వితయ భోజనప్రాయశ్చిత్తం ॥

(౨౫౦) ఇకను సూతక ద్వితయ భోజన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు ॥ జాతాశౌచమృతాశౌచములు గలిగియున్నయసగోత్రునింటభుజించినవారలు పాపవంతులగుదురని దేవలుడువచించె. గాలవుడునునిటులనే వచించె, గౌతముడును నిటులనేచెప్పె ఇట్టికృత్యమును జేసినవాడు తప్త

కృచ్ఛ్రము నాచరించి పంచగవ్యప్రాశనను జేయవలయును, పునరుపనయన సంస్కారమును గూడ బొందియుండవలయును, యతివిధవలకుఁ బునస్సంస్కార రహితముగఁ బైప్రాయశ్చిత్తమును విధించవలయుననియె॥

—— అన్యోన్యసంస్పృష్టాన్నభోజనప్రాయశ్చిత్తమ్. ——

(౨౪౧) అథాన్యోన్యసంస్పృష్టాన్నభోజనప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥శ్లో॥ ఏకపఙ్క్త్యుపవిష్టాయాభుంజానాతౌ పరస్పరం॥ స్పృష్టాన్నమన్త్యజక్షుక్త్వాజ్ఞెయాతౌ మాంసభోజినా॥ పరాశరః॥శ్లో॥ ఏకపఙ్క్త్యుపవిష్టానుభుంజంతో ముఖజాస్సకృత్॥ అన్యోన్యస్పర్శనంకృత్వామత్యాజగ్ధ్వాస్వపాత్రజం। మాంసతుల్యంతదన్నంస్యాద్భోక్తారో మాంసభోజినః । ఏకపంక్త్యుపవిష్టశ్చబ్రాహ్మణోబ్రాహ్మణంస్పృశేత్। తదన్నమత్యజక్ భుక్త్వాప్రాయశ్చిత్తీభవేత్తదా। అన్యగోత్రంద్విజంస్పృష్ట్వాభుక్త్వాచాంద్రాయణంచరేత్॥ స్వగోత్రస్పర్శనేభుక్త్వాతప్తకృచ్ఛ్రంసమాచరేత్॥ పితాపుత్రంభ్రాతరంవాస్పృష్ట్వాభుక్త్వాతుకాయికం॥ పుత్రస్యవాకనిష్ఠస్యపితురుచ్ఛిష్టభోజనే । నదోషఃపుత్రయోస్తత్రపితాకాయికమాచరేత్॥ ఉచ్ఛిష్టంతత్రకబళమాత్రప్రాశనం। నపాత్రస్థాన్నభోజనం॥ గౌతమః॥శ్లో॥ పితానుజస్యపుత్రస్యతయోశ్శ్రీతింసముద్వహేత్। నిత్యపితరః బళంతత్రనదోషస్తత్రభోజనే। పితాతాభ్యాంసహనభుంజీయాత్॥ కబళదానేనదోషః॥ తదాహఆపస్తంబః॥ ప్రీతిహ్యుపలభ్యతే। పితుర్జ్యేష్ఠస్యచభ్రాతురుచ్ఛిష్టంభోక్తవ్యం। ధర్మవిప్రతిపత్తావభోజ్యమితి। యతివిధవాబ్రహ్మచారిణామేవంవేదితవ్యం। ఇతిహేమాద్రివిరచితే పరస్పరోచ్ఛిష్టభోజనప్రాయశ్చిత్తం॥

(౨౪౧) ఇకనన్యోన్యసంస్పృష్టాన్న భోజనప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ ఒకపఙ్క్తియందు భుజించుచున్న బ్రాహ్మణులలో నొకరినొకరుబుజింపగూడదు. అట్లుస్పృశించియనుబుజించినయెడల మాంసభోక్తలనబడుదురని దేవలుడువచించె. పరాశరుడునునిటులనేచెప్పి యన్యగోత్రస్థుడగుబ్రాహ్మణునిస్పృశించినయెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలయుననియె. మఱియును స్వగోత్రజునిస్పృశించినయెడల తప్తకృచ్ఛ్రమును, పితృపుత్రభ్రాతృవులనుస్పృశించినయెడల కాయికకృచ్ఛ్రమును, ఆచరించవలయును. పుత్రునకయినను, కనిష్ఠునకైనను, తండ్రియొక్క యుచ్ఛిష్టభోజనమునందు దోషములేదనియె. అనగానావిషయమునందు పుత్రులకుదోషము లేదు. తండ్రియగువాడుమాత్రము కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. ఉచ్ఛిష్టమనగా కబళమాత్రప్రాశనమనుటయునియును, పాత్రస్థాన్నభోజనముగాదనియును

నెఱుంగవలయుననిచెప్పె. అనుజులకును, పుత్రులకును, ప్రీతిచేతభుజించుసమయమునందు కబళమునుబెట్టినయెడల దోషములేదనియును, వారితోఁగూడనేకభాజనమునందు భోజనమునుజేయఁగూడదనియును గౌతముఁడుచెప్పె. ఆపస్తంబుఁడునునిటులనేచెప్పె. యతివిధవాబ్రహ్మచారులకును నిటులనేయనియెఱుంగవలయును.

—— శివనిర్మాల్యభోజనే ప్రాయశ్చిత్తమ్. ——

(౨౪౨) అథశివనిర్మాల్యభోజనేప్రాయశ్చిత్తమాహ। దేవలః శ్లో॥ శంభోర్నివేదితంభుక్తంతత్తీర్థంశాకమేవవా॥ విప్రఃకదాచనభుంజీయాద్భుక్త్వాతత్ప్రంసమాచరేత్॥ మార్కండేయః॥శ్లో॥ శివేనివేదితంభుక్తంప్రత్యేకందేవతాంవినా।ద్విజోజ్ఞానాద్యదాభుక్తేతదాతత్కృంసమాచరేత్॥ గాలవః॥శ్లో॥శివాలయేశివేభక్తమర్పితందేవతాంవినా। ద్విజోభుక్త్వాచరేత్తప్తంతథాతత్తీర్థసేవయా। సాలగ్రామాదిదేవతాసహాహేవిశేషమాహ। జాబాలిః॥ శ్లో॥ శివవిష్ణ్వాదిభిర్దైవైర్వేష్టితేయత్సమర్పితం। తద్భుక్త్వావిప్రవర్యోసౌనభవేద్దోషభాగితః॥ హారీతః॥శ్లో॥ సాలగ్రామాదిభిశ్శంభోర్వేష్టితస్యయదర్పితం॥ తద్భోక్తవ్యంద్విజైర్నిత్యంతత్త్యాగంపరివర్జయేత్। సాలగ్రామాదిదేవతాసహితేశివేర్పితంనైవేద్యంచాంద్రాయణసమం। తద్వినాశివనిర్మాల్యభక్షణంతత్త్యాగంచమాంసతుల్యం। యాజ్ఞవల్క్యః॥శ్లో॥ శివేనివేదితంభుక్తంసాలగ్రామాదివేష్టితే॥ తద్భుక్తభోజనేచాంద్రంకృతవాన్నాత్రసంశయః। అన్యథామాంసతుల్యంస్యాత్తత్త్యాగమసృజాసమమితి। యతిబ్రహ్మచారిణామేవం॥ ఇతిహేమాద్రివిరచితే శివనిర్మాల్యభోజనప్రాయశ్చిత్తం॥

(౨౪౩) ఇఁకను శివనిర్మాల్యభోజనమునందుఁ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఈశ్వరునకు నివేదితమయినయన్నమునైనను, తీర్థమునైనను, శాకమునైనను, బ్రాహ్మణుఁడగువాఁడు భుజింపఁగూడదనియును, అజ్ఞానమువలనభుజించినయెడల తద్దోషపరిహారముకొఱకు తప్తకృచ్ఛ్రమునునాచరింపవలయుననియును దేవలుఁడుచెప్పె. దేవతాంతరసహితుఁడుగాని శివునకునివేదితమయినపదార్థములలో నెద్దానింగూడభుజింపఁగూడదని మార్కండేయుఁడునుచెప్పె. గాలవుఁడునునిటులనేచెప్పె. విష్ణ్వాదిదేవతలతోఁ గూడినశివునకునివేదితమైన యన్నాదికమునుభుజించుటవలన దోషములేదనిజాబాలిచెప్పె. సాలగ్రామాదులచేత వేష్టితమయిన శివునకర్పితమైన యన్నాదికమునుభుజించుటవలనదోషములేదని హారీతుఁడుచెప్పె. యాజ్ఞవల్క్యమునీశ్వరుఁడును నిటులనేపలికెను. యతిబ్రహ్మచారులకును నిటులనేయని [illegible] వలయును.

—— నీలీవస్త్రంధృత్వాభోజనేప్రాయశ్చిత్తమ్. ——

(౨౪౩) అథనీలీవస్త్రంధృత్వాభోజనేప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ నీలీవస్త్రంచతచ్చిహ్నంస్పృష్ట్వాజ్ఞానాద్ద్విజశ్చరేత్॥ సవిప్రస్త్వశుచిర్నిత్యంనకర్మార్హోభవేదిహ। తచ్చిహ్నమితినీలీతంతుభిర్వస్త్రాంతే వస్త్రమధ్యేవానిర్మితంవస్త్రంతద్ధారణేప్రస్త్వశుచిః ॥ తదాహగౌతమః॥ శ్లో ॥ నీలీమయంపటంధృత్వావిప్రస్తచ్చిహ్నమాత్రకం। ధృత్వాకర్మాణిభుక్త్వావాసతత్కర్మఫలంలభేత్। భోజనేమాంసభుగ్విప్రస్సర్వధాతత్పరిత్యజేత్॥ గాలవః॥ శ్లో॥ నీలీవస్త్రంతుతచ్చిహ్నంధృత్వాకర్మకరోతియః॥ సవిప్రస్తునకర్మార్హస్తత్కర్మవిఫలంభవేత్ ॥ ఏకత్రదివసేభుక్త్వాధృత్వానీలీమయంపటం । కుర్యాన్నైవవిశుద్ధ్యర్థంయావకంమునిచోదితం। అభ్యాసేతుపరాకంస్యాద్వత్సరేచాంద్రముచ్యతే। యతిబ్రహ్మచారివిధవానాంప్రాయశ్చిత్తమిదంప్రయోక్తవ్యం॥ ఇతిహేమాద్రివిరచితేనీలీవస్త్రంధృత్వా భోజనేప్రాయశ్చిత్తం॥ ఇతిజాతిభ్రంశకరప్రాయశ్చిత్తమ్॥

(౨౪౩) నల్లనివస్త్రమునుధరించి భోజనమునుజేసినందుకు ప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ నల్లనివస్త్రమునైనను, నల్లనియంచుగలవస్త్రమునైననుధరించినబ్రాహ్మణుఁ డపరిశుద్ధుడును, సర్వకర్మబహిష్కృతుడును నగునని దేవలుఁడువచించె; గౌతముఁడునునిటులనే చెప్పె. గాలవుడునునిటులనే చెప్పిప్రాయశ్చిత్తమునువిధించె. అదియెట్లనిన నట్టివస్త్రమునుధరించి యొకరోదినముభుజించినవాడు తద్దోషపరిహారమునకై యావకాహారుఁడుగావలయును. అట్టికృత్యమును, అభ్యాసపూర్వకముగ జేయుచున్నవాడు పరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. ఇట్టికృత్యమును సంవత్సరకాలము నేసినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. యతిబ్రహ్మచారివిధవలకును నీప్రాయశ్చిత్తమునేవిధింపవలయుననియె.

—— ప్రకీర్ణకరప్రాయశ్చిత్తమ్. ——

(౨౪౪) అథప్రకీర్ణకరప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్లో॥ పాపేభ్యఃపూర్వముక్తేభ్యోనవధోన్యత్రవిద్యతే। తత్ప్రకీర్ణకమిత్యాహుర్ధుమ్మృజాతేష్చవిశోధనం। విద్యుదగ్నిపయఃపాశచండాలైర్బ్రాహ్మణోహతః॥ ఏకద్విత్రిచతుఃపంచషడబ్దంకృచ్ఛ్రమాచరేత్।విద్యుదశనిః । అగ్నిర్దావానలఃస్వకృతోవా॥ పయఃతటాకనదీస్థం। పాశఃరజ్జుః। చండాలోజనంగమః । ఏతైర్నిమిత్తైర్విప్రఃప్రమాదాత్ జ్ఞాత్వావామ్రియతేతస్య సద్యోదహనపక్షే ఏతద్వచనసాక్షాణి కృచ్ఛ్రాణికృత్వాదహేత్॥ అశక్తవిషయేకాలమాహ॥ శ్లో॥ మాసత్రయేషు

ణ్మాసేవత్సరేవా విచక్షణః। పుత్రాదిర్దుర్మృతస్యాస్య కుర్యాత్సంస్కారమాదరాత్। దేశకాలవైపరీత్య శంకయా దుర్మృతస్య లోకమాకాంక్షన్నిమిత్తోక్తకృచ్ఛ్రాచరణం కృత్వా దహేత్। తత్ప్రకారమాహ॥ గౌతమః॥ శ్లో॥ విద్యుతా వహ్నినా తోయైః పాశైర్వ్యాఘ్రజనంగమైః ॥ విప్రః ప్రాణాన్పరిత్యజ్య త్తస్య శుద్ధిరుదీరితా। సద్యో దహనపక్షే తు కుర్యాత్పూర్వోక్తమాదరాత్। విద్యుద్ధతస్య ఏకం షడబ్దం తథాపి దహనే విశోధనం। అగ్నిదగ్ధస్య షడబ్దద్వయం విశోధనం। జలే మృతస్య త్రిగుణిత షడబ్దం। పాశమృతస్య చతుర్గుణ షడబ్దం। చండాలేన హతస్య పంచషడబ్దం। మృన్మృతస్యైతాన్ కృచ్ఛ్రాణి తత్తత్సంఖ్యాపరిమితాని కృత్వా దగ్ధ్వా దుర్మృతిదోషాత్పూతో భవతి ॥ తదాహ గౌతమః॥ శ్లో॥ దుర్మృతానాం తదా పుత్రః కృత్వా కృచ్ఛ్రాణి ధర్మతః। దహేత్పాపవిశుద్ధస్స్యాద్యదస్యాధాదోషభాగ్భవేత్॥ గ్రంథాంతరే॥ శ్లో॥ దుర్మృతస్య తదానీం యస్సంస్కారం కర్తుమిచ్ఛతి। ఏకద్విత్రిచతుఃపంచ షడబ్దం కృచ్ఛ్రమాచరేత్। ఏతేన శుద్ధిమాప్నోతి న కాలస్య నిరీక్షణం॥ పిశాచతా న తస్యాస్తి పుత్రస్స్యాదనృణస్తదా ॥ మాసత్రయషణ్మాసవత్సరకృతానాం దుర్మృతిప్రాయశ్చిత్తం తారతమ్యేన విశిష్టి॥ గోభిలః॥ శ్లో॥ మాసత్రయే దుర్మృతానామబ్దమాత్రం విశోధనం॥ ఋతుత్రయే తు ద్వ్యబ్దం స్యాత్త్ర్యబ్దం సంవత్సరే స్మృతం। నారాయణబలిం కృత్వా కుర్యాత్ ఔర్ధ్వదైహికం। ఏతేన శుద్ధిమాప్నోతి పరలోకం చ గచ్ఛతి॥ వ్యాఘ్రాదిభిర్హతస్య విశేషమాహ॥ గౌతమః॥ శ్లో॥ వ్యాఘ్రభల్లూకవారాహసర్పవృశ్చికకుంజరైః॥ శృంగిభిర్విషపానాద్యైర్వృక్షశైలనిపాతనైః॥ విప్రో యది మృతం ప్రాప్తః ఖడ్గదంష్ట్రాదిభిః ఖలైః॥ గ్రహాభిత్త్యశ్మభిర్వాపి స్తంభకంటకశంకుభిః। తం తదా దాహయేత్పుత్రః సద్యః కృత్వా షడబ్దకం। మాసత్రయే ఒబ్దమాత్రం స్యాత్త్ర్యబ్దం తు ఋతుదర్శనాత్। వత్సరే తు షడబ్దం స్యాత్సర్వేషాం దుర్మృతౌ స్మృతం। విద్యుదగ్నిభిర్హతైర్వినా॥ గాలవః॥ శ్లో॥ దేశాంతరే వా యుద్ధే వా హతం వ్యాఘ్రేణ వా యది మధునా సర్పిషా సిక్త్వా దాహయేద్విధినా చ తం। విధిశిష్ట్యుక్తప్రాయశ్చిత్తమిత్యర్థః। ప్రాయశ్చిత్తవిహీనస్య దుర్మృతస్య పిశాచతా। సద్యశ్శతగుణం ప్రోక్తం ప్రాయశ్చిత్తం మనీషిభిః॥ ఇతి హేమాద్రివిరచిత దుర్మృతస్య విప్రస్య ప్రాయశ్చిత్తం॥

(౨౫౪) ఇక నుపకీర్ణకర ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ విద్యుదగ్నిపయఃపాశ చండాలాదులచేత బ్రాహ్మణుడు చంపబడెనేని దుర్మరణమనబడును. అట్టివానికొకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు, అనుకృచ్ఛ్రముల నాచరించి ప..లయొనని దేవళుడు సెప్పె. అట్లు సెప్పినవారలు ట్లని మొ

ఏమనిన దుర్మరణమునుబొందినవానికి మూడవమాసమునందయినను, ఆరవమాసమందైనను, సంవత్సరమునందైనను, పుత్రాదులుసంస్కారమును జేయవలయును. దేశకాలవైపరీత్యశంకచేతననగా చిరకాలముజీవింపగలమనియెడునమ్మకములేదుగనుక దుర్మరణమునుబొందినవానికి సద్గతినిగల్పించుటకొఱకు శాస్త్రమునందు జెప్పబడినప్రకారము కృచ్ఛ్రాచరణనుచేసి పిమ్మటదహనసంస్కారమును జేయవలయుననియును దేవలుఁడేచెప్పె. మెఱుపు, నిప్పు, ఉదకము, పాశములు, చండాలురు, మొదలగువానివలన ప్రాణహానినిబొందిన బ్రాహ్మణునకు వెంటనేదహనసంస్కారమును జేయగూడదు. ఒకవేళనప్పుడె దహనసంస్కారమును జేయుటకు పుత్రాదులకిష్టముండినయెడల పూర్వోక్తప్రకారముగ కృచ్ఛ్రాచరణనుజేయవలయును. అదియెట్లనఁ బిడుగుపడిచచ్చినవానికి, ఏకషడబ్దకృచ్ఛ్రమును జేయవలయును. అగ్నివలనజచ్చినవానికి షడబ్దద్వయమును జేయవలయును. జలమువలనమృతుడయినవానికి త్రిగుణితషడబ్దమును జేయవలయును. పాశమృతునకు చతుర్గుణషడబ్దము నాచరించవలయును. చండాలునిచేతజంపబడినవానికి పంచషడబ్దమును జేయవలయునని గౌతముడుచెప్పె. గ్రంథాంతరమందునునిట్లేచెప్పబడియె. దుర్మృతులకు మూడవమాసమునందబ్దమాత్రము. ఆరవమాసమునందబ్దద్వయకృచ్ఛ్రము. సంవత్సరమయ్యేనేని యబ్దత్రయకృచ్ఛ్రము. పతియును నారాయణబలినిజేసి ప్రేతకర్మలనారంభించవలయును. ఇవ్విధముగజేసినయెడల పరిశుద్ధుడగునని గోభిలుడుచెప్పె. వ్యాఘ్రము, భల్లూకము, వరాహము, సర్పము, వృశ్చికము, ఏనుగు, కొమ్ములుగలమృగములు, విషము, వృక్షములనుండిపడడము, శైలములనుండిపడడము, ఖడ్గదండాదులు, చండాలురు, మొదలగువానివలన మరణమునుబొందినవానికి బ్రాహ్మణుడగువాఁడుతత్కాలమునందే షడబ్దకృచ్ఛ్రమును జేసి దహనాదిప్రేతకృత్యములను జేయవలయునని గౌతముడుచెప్పె. దేశాంతరమునందైనను, యుద్ధమునందైనను, మరణమునుబొందినవానిని, వ్యాఘ్రముచేతహతుడైనవానిని, మధువుచేతనైనను, సర్పముచేతనైనను, తడిపి శాస్త్రోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమునుజేసి యనంతరమందుదహనాదికృత్యములనాచరించవలయును. దుర్మరణమునుబొందినవానికి ప్రాయశ్చిత్తముచేయకయేదహించినయెడల పిశాచత్వముగలుగును. కాబట్టి ప్రాయశ్చిత్తమునుజేసి దహనమును జేయవలయునని గాలవుడువచించె.

——* క్షత్రియవైశ్యయోర్దుర్మృతయోః ప్రాయశ్చిత్తమ్. *——

(౨౪౫) అథ క్షత్రియవైశ్యయోర్దుర్మృతయోః ప్రాయశ్చిత్తమాహ।

పుత్రంయదా నారీదశాహాభ్యంతరే మృతా । నతస్యాః పునరావృత్తిర క్తకుణ్డా న్మహాభయాత్॥ మరీచిః॥ యానారీతనయంసూత్వా యది దైవాత్ప్రమీయతే। సూతకేపునరావృత్తిర్నతస్యా యమమన్దిరాత్॥ గౌతమః॥ సూత్వానారీమృతాపశ్చాద్దశాహాభ్యన్తరేయది। నతస్యా యమలోకాద్వై వినివృత్తిః ప్రహావత్సరైః। తద్దోషపరిహారార్ధంచత్వారః స్త్విగ్వ్యజః పృథక్॥ ఏకఏవద్విజోవాపి వారుణాన్ కలశాన్ క్షిపేత్। పూర్వాదిషుసర్వత్రజలేనాపూర్యయత్నతః వరుణంపూజయేత్తత్ర ఋత్విగేకశ్చతుష్వపి ॥ కలశాన్పాణిభిస్స్పృష్ట్వా మంత్రానేతానుదీరయేత్। నమకంచమకంచైవపురుషసూక్తఞ్చవైష్ణవమ్ ॥ పవమానానువాకఞ్చహిరణ్యశృఙ్గమితిక్రమాత్ । శాన్తిభిర్దశభిశ్చైవకలశానభిమంత్రయేత్। అన్యేనవాససాచ్ఛాద్యసూతికాంకృతశౌచికామ్ । మార్జయేదృత్విజస్తోయైఃకలశస్థైఃపవిత్రకైః । అపోహిష్ఠాదిభిర్మన్త్రైఃదేవస్యత్వేతిమార్జయేత్। తతశ్శవంబహిర్దేశేస్నాపయిత్వాథదేశికః । శతకుంభోదకైఃప్రోక్ష్యనూతనైనైవవాససా। ఆచ్ఛాద్యకుణపంపశ్చాద్దహేదౌపాసనాగ్నినా॥గౌతమః॥ తుషాగ్నినాదహేత్కన్యాంకపాలేనవటుంతథా। విధురంవిధవాంచైవప్యుత్తప్తైనైవదాహయేత్। గృహస్థంచైవతత్పత్నీందహేద్గృహ్యాగ్నినాపృథక్ ॥ ఆహితాగ్నించతత్పత్నీంవహ్నిభిశ్చత్రిభిర్దహేత్ ॥ అన్యథాదోషమాప్నోతిగతిస్తేషాంనవిద్యతే । కన్యకాంబాలంవాధనిష్ఠాదిషుమృతం పూర్వవప్రాయశ్చిత్తంకృత్వాదహేత్ ॥ ఇతిహేమాద్రౌ సూతికామరణ ప్రాయశ్చిత్తం॥

(౩౬౦) ఇక సూతికామరణప్రాయశ్చిత్తమును విధించుచున్నాడు॥ పుత్రునిప్రసవించినపదిదినములలోపల మరణమునుబొందినయాధుది మిగుల భయంకరమును, రక్తకుండమును, అనునరకమునుబొందుననిదేవలుడువచించె. మరీచియునుమహాపాపమనిచెప్పె. గౌతముడునునిటులనేచెప్పి తద్దోషపరిహారముకొఱకు ప్రాయశ్చిత్తమునుగూడవిధించె. అది యెట్లనిన నలుగురు ఋత్విక్కులచేతనైనను, ఒక్కఋత్విక్కుచేతనైనను, వారుణకలశములను క్షేపముచేయించవలయును. ఎట్లనగాపూర్వాదినాలుగుదిక్కులను జలముచేతనిండించివరుణదేవుని బూజించవలయును. అనంతరమందుకలశములనుహస్తములజేతస్పృశించి నమకము, చమకము, పురుషసూక్తము, విష్ణుసూక్తము, పవమానానువాకమును, హిరణ్యశృంగమనుమంత్రమును, పఠించుచుగలశములనభిమంత్రించి, స్నానమునుచేయించినసూతికాంగనమీద నాకలశములయందలియుదకమును ఋత్విక్కులుప్రోక్షించవలయును. అనంతరమం

శాపోహిష్ఠాదిమంత్రములచేత నాశవమునకుమార్జనమును జేయవలయును. పిమ్మటనాశవమును బహిర్దేశమునకుగొనివచ్చి శతకుంభోదకములచేతప్రోక్షణను జేసి పిమ్మటనూతనవస్త్రముచేత నాశవమునకాచ్ఛాదనమును జేసి యనంతరమందు దహనసంస్కారమును జేయవలయుననియె. మఱియునీగౌతముఁడేతుపాగ్నిచేత నేకన్నియను. కపాలాగ్నిచేతవటువును, విధురవిధవలను త్రేతాగ్నిచేతను, గృహస్థుని, గృహస్థునిభార్యను, గృహ్యాగ్నిచేతనుదహనమును జేయవలయును. ఆహితాగ్నిని, అతనిభార్యను, త్రేతాగ్నులచేతదహనమును జేయవలయును. ఇవ్విధముగ జేయనియెడలదోషముగలుగును. కన్నియను, బాలికను, ధనిష్ఠాదిపంచకనక్షత్రములయందు మరణమునుబొందినవానిని దహనముచేయునపుడు పూర్వోక్తప్రకారముగ ప్రాయశ్చిత్తమును జేయించి దహనమును జేయవలయుననియె.

——— * రజస్వలామరణప్రాయశ్చిత్తమ్. * ———

(౭౯౧) అథరజస్వలామరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ రజస్వలాతుయానారీమృతింప్రాప్యాద్యదాసతీ। నరకంయాతిసానారిరక్తకుండేనిమజ్జతి॥ గౌతమః॥ యదాపుష్పవతీనారీదైవాద్యదివిపద్యతే। తస్యాశ్చనిష్కృతిర్నాస్తిరౌరవేకుండాద్భయంకరాత్॥ జాబాలిః॥ రజస్వలాతుదైవేనదినేషుత్రిషుయత్రిపి। మృతాతస్యాగతిర్నాస్తిరక్తకుండాద్భయంకరాత్। సూతికామరణప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్॥ ఇతిహేమాద్రౌరజస్వలామరణప్రాయశ్చిత్తం॥

(౭౯౧) ఇకనురజస్వలామరణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ రజస్వలయైనయాడుదిమరణమునుబొందెనేని రక్తకుండమనునరకమునుబొందునని దేవలుడు చెప్పె. గౌతముడునుసిటులనే చెప్పె. జాబాలియునునిటులనే చెప్పి సూతికామరణప్రాయశ్చిత్తమువలెనె సర్వమును జేయవలయునని జాబాలివచించె.

——— ఆహితాగ్నిదుర్మృతిప్రాయశ్చిత్తమ్. ———

(౭౯౨) అథాహితాగ్నిదుర్మృతిప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అత్రభాండాజసూత్రం। యద్యాహితాగ్నిరభ్యాసంగచ్ఛేత్సహాగ్నిహోత్రేణానువ్రజేత్। యావత్యోస్యాత్రిమయాద్యదానద్యాశ్చతావతీర్నాతిహారయుః। యద్యతిహారేయుఃశోకికాస్సంపద్యేరన్॥ యదిస్మశ్రుసీమాన్నరౌఖనిమోచే దభ్యుదియాద్పునరాధేయం। నతస్యప్రాయశ్చిత్తిః। యద్యాత్మన్యరణ్యార్వాసమారూఢేష్వగ్నిషుయజమానోమ్రియేత। పూర్వవదదగ్న్యాయతనాది

కల్పయిత్వా యజమానాయతనే ప్రేతం నిధాయ గార్హపత్యాయతనేఽరణింసన్నిధాయమన్థేత్। ప్రేతస్యదక్షిణపాణిమభి నిధాయతత్పుత్రో భ్రాతా న్యోవాప్రత్యాసన్నబన్ధురుపావరోహజాతవేదఇతీమం స్వర్గాయలోకాయ త్వంనప్రజానాంయః ప్రజాగ్ంరయిమస్మాసుజేహి ప్రేతాహుతీశ్చాస్యజుషస్వస్వాహేత్యరణ్యోర్వోపావరోహ్యామం దేత్। అరణ్యోస్సమారూఢస్యాన్నిర్వర్తమానే ప్రేతమన్వారబ్ధయిత్వేమంమన్త్రంజపేత్ ॥ ఇతి హేమాద్రౌ ఆహితాగ్నేర్దుర్మృతిప్రాయశ్చిత్తమ్॥

(శ్లో ౨) ఇకను, అహితాగ్నికిదుర్మరణముగలిగినయెడల జేయదగిన ప్రాయశ్చిత్తవిధానమును దెలుపుచున్నాడు॥ ఆహితాగ్నియెక్కడకుపోయినను, అగ్నిహోత్రములతోగూడబోవలయునే గాని వేరుగాపోగూడదు. ఆత్మయందైనను, అరణియందైనను, అగ్నిసమారూఢనమును జేసినపుడు మరణమునుబొందినయెడల పూర్వమువలెనగ్న్యాయతనాదికమునుకల్పించి యజమానాయతనమునందుబ్రేతనుంచి గార్హపత్యాయతనమునం దరణిసన్నిధానమును జేసి మన్థనమును జేయవలయును. పిమ్మట ప్రేతదక్షిణపాణి నభినిధానముచేసియతనిపుత్రుడైనను, భ్రాతయైనను, ఇతరుడైనను "ఉపావరోహ... త్వేమంమంత్రంజపేత్" అనుమంత్రమునుజపింపవలయునని దేవలుడుంచించె.

—— అపస్మారిశ్వస్పగాలాదిదంశమృతిప్రాయశ్చిత్తమ్. ——

(శ్లో ౩) అథాపస్మారిశ్వసృగాలాది దష్టమృతస్యప్రస్య ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అపస్మారిశునాదష్టోవిప్రోన్యాత్ప్రలపకస్సదా। జమ్బుకేనాథవాదష్టః ప్రలపన్పూర్వవన్మృతః॥ పరాశరః॥ జంబుకేనశునా విప్రోబుద్ధిభ్రంశేనదంశితః। ప్రలపన్ప్రత్యహంత్వద్యన్మృతోయదిసదైవతః। వినాస్యమృతిర్నాస్తిషడ్భిః కృచ్ఛ్రసంజ్ఞితైః। విధినాదాహయేత్పశ్చాన్నతేనసహదోషభాక్। మార్కండేయః॥ జంబుకేనశునారాజన్విప్రోదష్టస్తదాకథం। ప్రలపన్ప్రత్యహంతద్వన్మృతోయదిసదైవతః। వినాస్యనిమృతిర్నాస్తిషడ్భిః కృచ్ఛ్రసంజ్ఞకైః। విధినాదాహయేత్పశ్చాన్నతేనసహదోషభాక్। నతస్యదుష్టైర్దోషోనపిశాచోభవేత్తదా॥ విధవావిప్రస్త్రీణాం క్షత్రియాదీనామేవం॥ ఇతి హేమాద్రౌ అపస్మారిశ్వసృగాలదష్టమృతప్రాయశ్చిత్తం॥

(శ్లో ౩) ఇకనుఅపస్మారిశ్వసృగాలాది దంశమృతప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ అపస్మారియుగుక్కచేతగరవబడి మరణమునుబొందినవాడును, నక్కకఱవడముచేత మరణమునుబొందినవాడును నరకమునుబొం

దునని దేవలుడువచించె. పరాశరుడునునిటులనే చెప్పి షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసి పిమ్మటదహనము చేసిన యెడల దోషములేదనియె. మార్కండేయుడునునిటుల నేవచించె. విధవావిప్రస్త్రీలకును, క్షత్రియాదులకునునిటులనే యని యెఱుంగవలెను.

## శునాదష్టస్య ప్రాయశ్చిత్తమ్.

(౯౯౪) అథశునాదష్టస్యప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ దివావాయది వా రాత్రౌ శ్వాపిప్రైవిదంశితః। దివాసచేలంస్నాయాత్తనరాత్రౌ స్నానమాచరేత్॥ గౌతమః॥ శునావిప్రోదివారాత్రౌదంశితస్తత్క్షణాజ్జలైః। స్నాత్వాదివావిశుద్ధస్స్యాద్రాత్రౌన స్నానమాచరేత్॥ పరాశరః॥ దివావాయది వా రాత్రౌ విప్రః కబళితశ్శ్వభిః। ధర్మనాశస్తదాభూయాద్దివాస్నానంసమాచరేత్। తం దేశంక్షాళయేత్తోయైరగ్నిసంస్పర్శనంచరేత్। పునఃప్రక్షాళ్యతం దేశంపాదౌప్రక్షాళ్యవాగ్యతః। ఆచమ్యశుద్ధిమాప్నోతిపరేద్యుస్స్నానమాచరేత్। ఉపోష్యరజనీమేకాంపఞ్చగవ్యేనశుద్ధ్యతి। స్త్రీబాలవృద్ధాతురాణామేవం॥ క్షత్రియాదీనామపి॥ ఇతి హేమాద్రౌశునాదష్టప్రాయశ్చిత్తం॥ ఇతిప్రకీర్ణకరప్రాయశ్చిత్తం॥

(౯౯౫) కుక్కచేతగరవబడినవానికి జేయుదగినప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ కుక్కచేతగరవబడినవాడు సచేలస్నానమును జేయవలయును. రాత్రియందయ్యేనేని స్నానమును జేయనక్కరలేదు. ఇట్లని దేవలుడు వచించె గౌతముడునునిటులనే వచించె. పరాశరుడునునిటులనే చెప్పి. మఱియును. రాత్రులయందయ్యేనేనియుదకములచేత నాప్రదేశమును క్షాళనమును జేసి పాదప్రక్షాళనమును జేసికొని యాచమనమును జేయవలయును. పిమ్మటపరదినమునందు స్నానమును జేసియొకరాత్రియంతయును నుపవసించిపంచగవ్యప్రాశనమును జేసినయెడలపరిశుద్ధుడగుననియె. స్త్రీబాలవృద్ధాతుర క్షత్రియాదులకును నిటులనే యని యెఱుంగవలయును.

## షోడశకర్మణాం కాలాతిక్రమే ప్రాయశ్చిత్తమ్-

(౯౯౬) అథేదానీం షోడశకర్మణాం స్మృత్యుక్తానాంతత్తత్కాలాతిక్రమే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ గర్భాధానం పుంసవనం సీమంతో జాతకర్మచ। నామాన్నప్రాశనంచౌలం మా జీవితచతుష్టయం। గోదానాఖ్యం స్నాతకంచ వివాహః పైతృమేధికం। కర్మాపిశ్రావణాఖ్యంవ మహాయజ్ఞాస్తథైవచ। ఏతత్కర్మాతిక్రమేకర్మభిశ్రేష్ఠాః తిథిభిశ్రేష్ఠాః శాఖారండాః బ్రహ్మభిశ్రేష్ఠాశ్చతుర్విధాశ్చాపసః బాహ్యాఅవాత్యై యాశ్చ॥ మనుః॥ పితాపితామహాశ్చైవ

వత్యథైవ ప్రపితామహః। యేనావర్త్తత మార్గేణ తత్పుత్త్రస్తేన సంచరేత్॥ గౌతమః॥ యేనాస్య పితరో యాతాః యేన యాతాః పితామహాః। తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్ న రిష్యతి। అన్యథా యదివర్త్తంతే చక్రలింగాది ధారిణః॥ పథిభ్రష్టాస్తు తే జ్ఞేయాః సర్వధర్మబహిష్కృతాః। గర్భాధానాదిసంస్కారాన్ శక్తాః కర్తుం న భువి ద్విజాః। తైర్వినా యే ప్రవర్త్తంతే కర్మభ్రష్టాస్త ఏవ హి। యస్స్వశాఖాం పరిత్యజ్య హ్యన్యశాఖామనుస్మరన్। ఉపనయనాదికం తత్ర కుర్వన్ విప్రో యదా భవేత్। శాఖారండస్స విజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః। సంధ్యాదినిత్యకర్మాణి గాయత్రీజపమేవ చ। యజ్ఞాదికం పరిత్యజ్య సమర్థోపి ద్విజోత్తమః। యది వర్తేత లోకేస్మిన్ బ్రహ్మభ్రష్టస్స ఉచ్యతే॥ అత ఏతాని కర్మాణి శ్రుతిస్మృత్యుదితాని చ। త్యాజ్యాని న కదా ప్యేతైర్విప్రైర్ద్విజైః పాపభీరుభిః॥

(౮౫) ఇకనుబదునారగు కర్మలకు కాలాతిక్రమమయ్యెనేని జేయదగిన ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము మౌంజీవ్రతచతుష్టయము, గోదానము, స్నాతకము, వివాహము, పైతృమేధికము, శ్రావణాఖ్యకర్మ, మహాయజ్ఞము, అనునవి కర్మలు ఇట్టి కర్మలనుచిత కాలమతిక్రమింపకుండునట్టుల జేయవలయును. కర్మభ్రష్టులు, పథిభ్రష్టులు, శాఖారండులు, బ్రహ్మరండలు, అనునల్వురును నపాంక్తేయులనియును, అసంభాష్యులనియును దేవలుడు వచించె. తండ్రి, తాత, ముత్తాత, మొదలగువారే విధముగ బ్రవర్త్తించిరో యా విధముగా దాను ను బ్రవర్త్తించవలయునని మనువు సెప్పె. గౌతముడు నిటుల నే వచించె. మఱియు నట్లు సంచరించక చక్రలింగాది ధారులగువారు పథిభ్రష్టులనబడుదురు. గర్భాధానాదిసంస్కారములను జేసికొననివారు కర్మభ్రష్టులనబడుదురు. స్వశాఖను వదలి యన్యశాఖోక్తప్రకారముగ నుపనయనాదిసంస్కారములను బొందినవాడు శాఖారండుడనియును, సర్వకర్మబహిష్కృతుడనియును చెప్పె. ఇంతియగాక సామర్థ్యముగలిగియుండి సంధ్యాది నిత్యకర్మలను, గాయత్రీజపమును, యజ్ఞాదికమును వదలి సంచరించువాడు బ్రహ్మభ్రష్టుడనబడునని యెఱుంగవలె.

—— ❋ గర్భాధానత్యాగప్రాయశ్చిత్తం ❋ ——

(౮౬) అథ గర్భాధానత్యాగప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ స్నాతవత్యాం మృతౌ సత్యాం గర్భాధానం సమాచరేత్। చతుర్థేహని వా రాజన్ పంచమే వాహని వా ధవః। కృత్వాభ్యుదయికం ప్రాత స్తద్రాత్రౌ మంత్రపూర్వకం। గర్భాధానం తదా కుర్యాత్తత్సార్వం గర్భే విశుద్ధయే॥ నచేత్ప్రతిగర్భే

తస్మిన్నేకంమత్రివర్జితం। అన్యథాదోషమాప్నోతిగర్భఘాతీనిగద్యతే। తద్దోషపరిహారార్థంగర్భశుద్ధ్యర్థమేవచ। ప్రాజాపత్యద్వయంకుర్యాద్రిప్రోవ్యేపునరార్తవే। అన్యథాగర్భఘాతీస్యాద్యథాజారస్తథైవసః॥ క్షత్రియాదీనామేవం॥ ఇతిహేమాద్రౌగర్భాధానాకరణప్రాయశ్చిత్తమ్॥

(౫౬) ఇకనుగర్భాధానత్యాగప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ భార్యఋతుస్నాతయైననాల్గవదినమందైనను, అయిదవదినమందైనను, ప్రాతఃకాలముననభ్యుదయకర్మనాచరించి రాత్రియందుమంత్రపూర్వకముగ గర్భాధానమునుజేయువలయును. ఇవ్విధముగజేయనివాడు దోషవంతుడగును. కావుననట్టిదోషశాంతికొఱకు రెండుప్రాజాపత్యకృఛ్రములనాచరించవలయునని దేవలుడుచెప్పె. క్షత్రియాదులును నివ్విధముగానే యాచరింపవలయును.

——— * సీమన్తపుంసవనాకరణప్రాయశ్చిత్తమ్. * ———

(౫౭) అథసీమన్తపుంసవనాకరణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ సీమన్తః ప్రథమేగర్భేచతుర్థేమాసిశస్యతే। అథవాషష్ఠయోగేనకుర్యాత్షష్ఠేష్టమేద్విజః॥ పుంసవంతత్రకుర్వీత సీమన్తేనసహైవవా। జాబాలిః॥సీమన్తః ప్రథమేగర్భేయుగ్మేమాసిఋతౌచవా। వసుమాసేప్రకుర్వీతగర్భశుద్ధ్యర్థమాదరాత్॥ రజఃపాపసముద్భూతంశుక్లంపాపానువర్తియత్। తయోస్సంసర్గతోగర్భప్రథమేదోషసంభవః॥ తద్దోషపరిహారార్థంసీమన్తోన్నయనంచరేత్।శలల్యాదర్భపింజీలైర్మార్జయిత్వానదోషభాక్॥ అన్యథాదోషమాప్నోతినశుద్ధిగర్భధారిణః। తత్రప్రాయశ్చిత్తమాహమార్కండేయః॥ సీమన్తపుంసవనయోర్యదితద్దోషనాశనం। నకుర్యాత్పూర్వజఃపాపీప్రాజాపత్యద్వయంపృథక్। కృత్వాశుద్ధిమవాప్నోతిగర్భశుద్ధిస్తుజాయతే॥ క్షత్రియాదీనామేవం॥ ఇతిపుంసవనసీమన్తాకరణప్రాయశ్చిత్తమ్॥

(౫౭) ఇకనుసీమంతపుంసవనములుచేయనందుకు ప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు॥ సీమంతమనుకర్మను ప్రథమగర్భకాలమునందలి నాల్గవమాసమునందైనను, ఆఱవమాసమునందైనను, ఆచరించవలయును. పుంసవనమును సీమంతముతోగూడనాచరింపవలయునని దేవలుడుచెప్పె. జాబాలియునునిటులనేచెప్పె. ఇట్టికర్మలనాచరించనివాడు తద్దోషశాంతికొఱకు రెండుప్రాజాపత్యములనాచరించవలయునని మార్కండేయుడుచెప్పె. ఇవ్విధముగానేక్షత్రియాదులును నాచరింపవలయును.

—— జాతకర్మాతిక్రమణప్రాయశ్చిత్తమ్. ——

(శ్లో) అథజాతకర్మాతిక్రమణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ జాతేపుత్రేపితాస్నాత్వా సచేలంజాతకర్మణి। హేమ్నావాధాన్యజాతేనజాతశ్రాద్ధంసమాచరేత్॥ అలూననాభింతంపుత్రంపితాపశ్యేత్ప్రయత్నతః। యత్పుత్రముఖమీక్షేతస్వర్గద్వారమనావృతం॥ పుత్రందృష్ట్వాతథాభూమౌజాతకర్మసమాచరేత్॥ ఫలీకరణమిశ్రైశ్చసర్షపైరాహుతీర్యజేత్॥ అజసాగ్నిస్తదాతిష్ఠేద్యావదాశౌచనిర్గమః। దశరాత్రంపితాకుర్యాదేవంపుత్రాభివృద్ధయే॥ జాతకర్మాకరణేప్రాయశ్చిత్తమాహగౌతమః॥ జాతకర్మనకుర్వీతపూర్వజో యదినాస్తికాత్। వ్రతకాలేచతత్కర్మకుర్యాద్విధిపురస్సరం॥ ప్రాజాపత్యద్వయంకుర్యాచ్చౌళేవానామకర్మణి। ముఖ్యకాలోదశరాత్రమధ్యం। గౌణస్తునామకరణచౌలోపనయనాని ముఖ్యకాలాతిక్రమే గౌణకాలేష్వేషుప్రాజాపత్యద్వయంకృత్వా తత్కర్మకృత్వాశేషంసమాచరేత్। ఏవంక్షత్రియాదీనామపి॥ ఇతిజాతకర్మాతిక్రమణ ప్రాయశ్చిత్తం॥

(తా) ఇకనుజాతకర్మాతిక్రమణప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు పుత్రుడుదయింపగానే తండ్రియగువాడు సచేలస్నానమును చేసిబంగారముచేతనైనను, ధాన్యజాతముచేతనైననుశ్రాద్ధమునాచరింపవలయునుబొడ్డునుగోయకమునుపు పుత్రునిమోమును చూచినవానికి స్వర్గద్వారము తెరవబడియుండును. భూమియందుబడినపుత్రునిముఖమును చూచినపిమ్మటజాతకర్మను చేయవలయును. ఫలీకరణమిశ్రములగుసర్షపములచేత నాహుతులను హోమము చేయవలయును. పుత్రాభివృద్ధికొఱకుతండ్రియగువాడు మఱియును జేయదగినవానిని జేయవలయునని దేవలుడువచించె. బ్రాహ్మణుడగువాడుజాతకర్మమును జేయనియెడలవ్రతకాలమునందునయ్యైకర్మలను, విధ్యుక్తప్రకారముగ జేయవలయును. అట్లుగాదేని చౌలకర్మయందైనను, నామకర్మయందైనను ప్రాజాపత్యద్వయమును జేయవలయును. ముఖ్యకాలము దశరాత్రులలోపలనని యెఱుంగవలయును. గౌణకాలము నామకరణచౌలోపనయనములు ముఖ్యకాలమతిక్రమించెనేనిగౌణ కాలములయందు ప్రాజాపత్యద్వయమును జేసి యాకర్మను జేసి మిగిలినదాని నాచరింపవలయునని గౌతముడుచెప్పె. ఇటులనే క్షత్రియాదులును నాచరింపవలయునని యెఱుంగవలయును.

—— యమళవ్యుత్క్రమణప్రాయశ్చిత్తమ్. ——

(శ్లో) అథయమళవ్యుత్క్రమణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ యమళౌయుగపజ్జాతౌమాతుర్యోనిప్రభేదనాత్। తయోర్జ్యేష్ఠః పూర్వజన్యోర్ద్వి

తీయోఽనుజఏవహి॥ మార్కండేయః॥ పితుర్వీర్యనిషేకేణ మాతుర్మదనసద్మని। శుక్లశోణితసంసర్గా ద్ద్విధాగర్భోభవిష్యతః॥ తౌవర్ధయన్తౌ పేశిన్యాం దశమేమాసిసమ్భవే। గర్భద్వారాద్వినిష్క్రాంతౌయుగపత్పతితౌభువి॥ పూర్వజస్తుతయోర్జ్యేష్ఠో ద్వితీయోఽనుజఏవహి॥ జాబాలిః॥ పేశిన్యాంవీర్యబాహుళ్యాన్మాతుర్గర్భేపితుస్తథా। భిన్నవస్సంపతన్త్యత్రద్విధాభవతిపూరణాత్॥ పిండద్వయంతదాభూయా ద్వర్ధతేబహుమైథునాత్। అగతేప్రసవేకాలే జాతౌయుగపదున్నతౌ॥ పూర్వజఃపూర్వజోజ్ఞేయో ద్వితీయోవరజస్తథా। తయోర్నకారణంబిన్దుర్జనిరేవాత్రకారణమ్॥ యదాజనిర్యస్యశిశోఃసఏవాత్రైవపూర్వజః॥ పరాశరః॥ యోనిమూలాద్వినిష్క్రాంతౌ యుగపద్గర్భగోళతః। జాతౌయమళజౌజ్ఞేయౌ తయోర్జ్యేష్ఠస్తుపూర్వజః ॥ ఉపానయాదికం కర్మతస్యపూర్వం సమాచరేత్। యోనిబిందుసముత్పత్తిర్నదృష్టా బాహ్యతోజనైః॥ ప్రత్యక్షాదృష్టసామగ్రీ సైవకర్మఫలప్రదా॥ మరీచిః॥ ఏకయోనిసముత్పన్నౌ జాయేతాంయమళాత్మకౌ। తయోర్జ్యేష్ఠః పూర్వజస్స్యాత్కనీయానపరఃక్షితౌ॥ యోనౌబిందోరదృష్టత్వా జ్జనిరేవాత్రకారణమ్। తస్మాజ్జ్యేష్ఠఃపూర్వజస్స్యాత్కర్మార్హోభువిగౌరవాత్॥ అన్యథాదోషమాప్నోతిపరివేత్తైవసర్వదా॥ భరద్వాజః॥ తయోర్వ్యుత్క్రమతఃకుర్యాత్పితాయమళయోశ్శుభమ్। పరివిత్తిఃపూర్వజస్స్యాత్పరివేత్తాద్వితీయజః॥ తయోర్యదిహసన్తానం పరివిన్దాదయోభవన్। తస్మాద్విమృశ్యకుర్వీత వ్రతకర్మాదికంపితా॥ వ్యుత్క్రమాన్మౌంజిబన్ధాది కర్మాజ్ఞానాత్కృత్వా పరివిత్తి పరివేత్తృప్రాయశ్చిత్తం కృత్వావివాహాదికంకుర్యాత్। అన్యథాదోషమాప్నోతి॥ క్షత్రియవైశ్యయోరేవం॥ ఇతియమళయోర్వ్యుత్క్రమప్రాయశ్చిత్తమ్॥

(౪౭) ఇఁకను యమళవ్యుత్క్రమణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఒక్కమాటుజన్మించినవారలలో తల్లియొక్కగర్భమునుండి ముందుగఁ బుట్టినవాఁడు జ్యేష్ఠుఁడనియును, పిమ్మటఁ బుట్టినవాఁడు కనిష్ఠుఁడనియును దేవలుఁడువచించె. మాతృయోనియందు పితృవీర్యనిషేకముచేత గర్భము రెండువిధములగును. ఆరెండుగర్భములును మాతృకుక్షియందు వృద్ధినిబొందుచుఁ బదవమాసమునందుఁ బుట్టునపుడు ముందుగఁబుట్టినవాఁడు జ్యేష్ఠుడనియును పిమ్మటఁ బుట్టినవాఁడు కనిష్ఠుడనియును మార్కండేయుఁడు చెప్పె. జాబాలియును నిటులనేచెప్పె. పరాశరుఁడును నిటులనేచెప్పె. మరీచియునునిట్లేచెప్పె. భరద్వాజుఁడును నివ్విధముగానేవచించె. అజ్ఞానముచేత యమళులకు మౌంజిబంధనాదికర్మము, వ్యుత్క్రమముగఁ జేసినయెడల ప్ర

రివిత్తిపరివేత్తృ ప్రాయశ్చిత్తమును జేసి వివాహాదికమును జేయవలయును. అట్లు చేయనియెడల దోషముగలుగును. క్షత్రియవైశ్యులకును నివ్విధముగానే యని యెఱుంగవలయును.

## —— నామకరణలోప ప్రాయశ్చిత్తమ్. ——

(౩౦౦) అథనామకరణలోప ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ ఏకాదశేహ్నిసంప్రాప్తే పితరౌనామకర్మయత్ । కుర్యాతాం తేనసంపత్తిరాయుషాంతస్యతత్క్షణాత్॥ మార్కండేయః॥ పితరౌనామకరణం పుత్రస్యదశమేహని। విచార్యవదతో వేగాత్కుర్యాతాం శుభమాదరాత్॥ పుత్రస్యవాకన్యకాయానామకర్మశుభాప్తయే। పితాకుర్యాత్ప్రయత్నేన మహద్భిర్ద్విజపుంగవైః॥ గౌతమః॥ పుత్రస్యనామకుర్వీత పితాచైకాదశేహని। ఆయుషస్తస్యవృద్ధ్యర్థం స్వస్యసమ్పత్సమృద్ధయే॥ నామత్రివిధం॥ మాసనామనక్షత్రనామవ్యవహారనామచేతిత్రయాణాం కరణాత్పుత్రస్యాయుషః పరివృద్ధిః॥ నామకరణమేకాదశేహనివిహితమ్॥ ఏతేషాంకరణాత్పుత్రశ్శతవర్షమఖండకం। ఆయురాప్నోతిసహసాతస్మాదేతత్త్రయంచరేత్ । ఏకాదశాహాంస్త్యజ్యభోజనే చౌలకేపివా। వ్రతబన్ధేతురాజేన్ద్ర ప్రాజాపత్యద్వయంపితా॥ కృత్వాకర్మప్రకుర్వీత ముఖ్యకాలవ్యతిక్రమాత్ । ఏతేనశుద్ధిమాప్నోతి నాన్యథా శుద్ధిరస్తిహి। క్షత్రియాదీనామేవమ్॥ ఇతిహేమాద్రౌనామకరణలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౦౦) ఇఁకను నామకరణలోప ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ పుత్రుఁడు పుట్టినను, పుత్రికపుట్టినను, పదునొకండవదినమునందు మాతాపితృవులు నామకరణమును జేయవలయునని దేవలుఁడు చెప్పె. మార్కండేయుఁడును నిటులనే చెప్పె. గౌతముఁడును నివ్విధముగానే వచించె. మాసనామమును, నక్షత్రనామమును, వ్యవహార నామమును పుత్రీపుత్రుల కాయుర్వృద్ధికొఱకు చేయవలయును. పదునొకండవదినమునందునామకరణమును జేయనియెడల భోజనమునందైనను, చౌలమునందైనను, వ్రతబంధమునందైనను, ప్రాజాపత్యద్వయమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించవలయును. ఇవ్విధముగఁ జేసినయెడల పరిశుద్ధతగలుగును గాని లేనియెడల పరిశుద్ధతగలుగనేరదు. క్షత్రియాదులును నివ్విధముగానే యాచరింపవలయును.

## ——✻ అన్నప్రాశనకాలవ్యతిక్రమణె ప్రాయశ్చిత్తమ్. ✻——

(౩౦౧) అథాన్నప్రాశనకాలవ్యతిక్రమణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శిశూనాంభోజనేరాజన్ కాలష్షణ్మాసఈరితః । తదతిక్రమణేనాస్తి ముఖ్యకాలో ద్విజన్మనామ్॥ హారీతః॥ శిశూనాంభోజనంశస్తం షణ్మాసేము

నిచోదితం । తదతిక్రమణేదోషో వ్రతబన్ధేతుమధ్యమః॥ జాబాలిః॥ షష్ఠేమాసికృతశ్రాద్ధో వాచయిత్వాశిషోద్విజైః। బ్రాహ్మణంతత్రసమ్పూజ్యభోజయేత్తంశిశుంబుధః॥ ముఖ్యకాలపరిత్యాగాచ్ఛిశుర్గుణవిహీనవాన్ । అతష్షణ్మాసతఃకుర్యాదన్నప్రాశనమాదరాత్॥ తదతిక్రమేప్రాయశ్చిత్తమాహ ॥ ఉశనా॥ ఇతిహేమాద్రౌఅన్నప్రాశనకాలాతిక్రమణప్రాయశ్చిత్తమ్॥

(౩౦౧) ఇకను అన్నప్రాశనకాలాతిక్రమణ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ శిశువుల కాఱవమాసమునం దన్నప్రాశనమును జేయవలయును. ఆఱవమాస మతిక్రమించెనేని మఱియొకటె ముఖ్యకాలములే దని దేవలుఁడుచెప్పె. హారీతుఁడును నివ్విధముగానె చెప్పె. ఆఱవమాసమునందు శ్రాద్ధము నాచరించి బ్రాహ్మణులచేత నాశీర్వచనమును జేయించి బ్రాహ్మణుని పూజించి శిశువునకు భోజనమును బెట్టవలయును. ముఖ్యకాలమతిక్రమించెనేని శిశువుగుణవిహీనుఁడగును. అందువలన నాఱవమాసమునందన్నప్రాశనమును జేయవలయునని జాబాలివచించె. ఈముఖ్యకాల మతిక్రమించెనేని ప్రాయశ్చిత్తమును శుక్రాచార్యుఁడువిధించె. ఇక్కడ గ్రంథము పాతమైనది.

—— చౌలకర్మణోముఖ్యకాలాతిక్రమే ప్రాయశ్చిత్తమ్. ——

(౩౦౨) అథచౌలకర్మణో ముఖ్యకాలాతిక్రమణే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ చూడాకార్యాద్విజాతీనాం సర్వేషామేవధర్మతః। ప్రథమేబ్దే తృతీయేవా కర్తవ్యాశ్రుతిచోదనాత్॥ పరాశరః॥ చూడానామశిశూనాంచ వపనంతచ్ఛిఖాంవినా। పంచవాత్రశిఖామేకామవశిష్యవపేత్తదా॥ శిశుర్దీర్ఘాయురత్రైవ జాయతేపృథివీపతే। అన్యథాదోషమాప్నోతి ఆయుహీనో భవేత్తదా॥ మరీచిః॥ ప్రథమేవాతృతీయేబ్దే శిశూనాం ముండనంస్మృతమ్। శిఖాఃపంచైవసంశిష్టా ఆపస్తంబానువర్తినాం॥ యస్యైవఋషయోయేచయస్యైవకులధర్మతః। తత్సంఖ్యయాశిఖాం స్థాప్యవాపయేదితరానిమాన్॥ గౌతమః॥ దేశకాలానురోధేన యదిద్రైవాన్నలుప్యమేత్। ప్రాజాపత్యద్వయంకృత్వా తత్పాపపరిశోధనాత్॥ చతుష్పాత్రవిధానేన పరిస్తీర్యహుతాశనమ్। మహావ్యాహృతిహోమంచ కృత్వాకర్మసమాచరేత్॥ శిశుర్వృద్ధిమవాప్నోతి కర్తాచైవనదోషభాక్। క్షత్రియాదీనామేవమ్॥ ఇతిహేమాద్రౌ చౌలకర్మణో ముఖ్యకాలాతిక్రమప్రాయశ్చిత్తమ్॥

(౩౦౩) ఇకను చౌలకర్మను జేయఁదగినకాలమునందుఁ జేయకపో

వుటవలనఁ గలిగిన దోషనివారక ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ సర్వజనులకును మొదటి సంవత్సరమునందైనను, మూఁడవ సంవత్సరమునందైనను, చూడాకర్మను జేయవలయునని దేవలుఁడు చెప్పె. అయిదు శిఖలనైనను, ఒక్కశిఖనైనను, ఉంచి బాలునకువపనమును జేయించవలయును. ఇవ్విధముగఁ జేసినయెడల దీర్ఘాయువుగలుగును. ఇట్లు చేయని యెడల దోషముగలుగునని పరాశరుఁడువచించె. మరీచియును నిటులనేచెప్పి యాపస్తంబులకు నైదుశిఖలను బెట్టవలయుననియె. మఱియు నితరులుతమతమకులాను సారముగ జరపవలయుననియె. దేశకాలోపద్రవముల వలన చూడాకర్మము జరగని యెడల ప్రాజాపత్యద్వయమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయును. చతుష్పాత్రవిధానముచేత హుతాశనపరిస్తరణమును జేసి మహావ్యాహృతి హోమమునుజేసి పిదప నికార్యమును జేయవలయును. ఇట్లు చేసిన యెడల శిశువు శుద్ధిఁబొందును. కర్తయును దోషమునఁబొందఁడు. క్షత్రియాదులును నివ్విధముగానే యాచరింపవలయునని గౌతముఁడు వచించె.

—— * శిశూనామక్షరాభ్యాసకాలాతిక్రమణేప్రాయశ్చిత్తమ్. * ——

(౩౦౩) అథశిశూనామక్షరాభ్యాస కాలాతిక్రమణే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ ఉదగ్గతే భాస్వతిపంచమేబ్దే ప్రాప్తేక్షరస్వీకరణం శిశూనామ్। సరస్వతీంవిష్ణువినాయకౌచ గుడౌదనాద్యైరభిపూజ్యకుర్యాత్॥ గాలవః॥ పంచమేబ్దేశిశూనాంచ కుర్యాద్విద్యాపరిగ్రహమ్। వినాయకం శారదాఞ్చపూజయిత్వాజనార్దనం॥ మార్కండేయః॥ ఆరోగ్యంభాస్కరాదిచ్ఛేద్విద్యామిచ్ఛేద్వినాయకాత్। శ్రియంమహేశ్వరాదిచ్ఛేన్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్॥ అతఃపంచమేవర్షే విద్యాభ్యాసఃప్రశస్తః॥ మేధావీచభవతి। తదతిక్రమేప్రాయశ్చిత్తమాహ॥ పరాశరః॥ పంచమాబ్దంవిలంఘ్యాథ శిశోరక్షరసంగ్రహే। కాయకంతత్రకర్తవ్యం కృచ్ఛ్రంకృత్వావిశుద్ధ్యతి॥ అన్యథాదోషమాప్నోతి విద్యాతంనప్రబాధయేత్। విద్యాగ్రహణంనామ పంచాశద్వర్ణమాతృకాస్వీకారః॥ గాలవః॥ పంచమేబ్దేశిశుస్సమ్యగ్గురోర్మాతరమభ్యసేత్। అభ్యర్చ్యగణపంవిష్ణుంశారదాంభక్తవత్సలామితి॥ ఇతిహేమాద్రౌశిశూనామక్షరాభ్యాస కాలాతిక్రమణప్రాయశ్చిత్తమ్॥

(౩౦౩) శిశువుల కక్షరాభ్యాసకాలాతిక్రమణమునందు జేయదగిన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ అయిదవ సంవత్సరమునందు యుత్తరాయణకాలమునందు సరస్వతీవిష్ణువినాయకులను బూజించి గుడౌదనాదు

లచేత నివేదించి యక్షరస్వీకరణమును జేయవలయునని దేవలుడు వచించె. గాలవుడును నిటులనే వచించె. సూర్యునివలన నారోగ్యమును బొందవలయును, వినాయకునివలన విద్యను బొందవలయును. మహేశ్వరుని వలన లక్ష్మిని బొందవలయును, జనార్దనునివలన మోక్షమును బొందవలయును, అయిదవ సంవత్సరమునందు దక్షరాభ్యాసమును జేయవలయును, ఇట్లు చేసినయెడల బుద్ధిమంతుడగునని మార్కండేయుడు వచించె. అయిదవసంవత్సరమునందు దక్షరాభ్యాసమును జేయనియెడల కాయకృఛ్రము నాచరించవలయును, ఇట్లు చేయనియెడల దోషము గలుగనేరదని పరాశరుడు చెప్పె. అయిదవ సంవత్సరమునందు బాలునకక్షరాభ్యాసమును జేయవలయును, ఆసమయమునందు విఘ్నేశ్వరుని, విష్ణువును, సరస్వతిని బూజించవలయునని గాలవుడు చెప్పె॥

——❋ఉపనయనకాలాతిక్రమప్రాయశ్చిత్తమ్.❋——

(౩౦౪) అథ ఉపనయనకాలాతిక్రమప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ గర్భాష్టమేష్టమే వా బ్రాహ్మణస్యోపనాయనం। గర్భద్వాదశమే రాజ్ఞో విశః షోడశవత్సరే । తదాహ గృహ్యకారః ॥ గర్భాష్టమేషు బ్రాహ్మణం। గర్భైకాదశేషు రాజన్యం । గర్భద్వాదశేషు వైశ్యమితి॥ ద్వాదశవర్ష పర్యంతం కామ్యోపనయన కాలమాహ ॥ స ఏవ॥ సప్తమే బ్రహ్మవర్చసకామం అష్టమే ఆయుష్కామం నవమే తేజస్కామం। దశమేన్నాద్యకామం ఏకాదశే ఇంద్రియకామం ద్వాదశే పశుకామమితి । గర్భాష్టమేషు బ్రాహ్మణమితి బహువచనం । పంచమవర్షాదారభ్య గర్భాష్టమపర్యంతం ముఖ్యకాలః॥ గర్భాష్టమజన్మాష్టమయోరేవ మేధావీ ఆయుష్మాంశ్చ భవతి వటుః ॥ గర్భాష్టమే బ్రాహ్మణమితి వచనం । ముఖ్యకాలగౌరవాత్ ॥ తదేవాహ గౌతమః॥ గర్భాష్టమే కుమారాణాం వ్రతబంధో విధీయతే । మేధావీ దీర్ఘకాలాయుర్వటుర్భవతి నిశ్చయః ఇతి ॥ యదదైవాద్గర్భాష్టమాభావే జన్మాష్టమాద్వా కుర్యాత్ ॥ తదేవాహ మనుః ॥ శిశోర్గర్భాష్టమాభావే కుర్యాజ్జన్మాష్టమేపి వా। దీర్ఘాయుర్బ్రహ్మవిద్వాంశ్చ స కృతకృత్యో భవేత్తత ఇతి ॥ తతః గర్భాష్టమ జన్మాష్టమయోరేవ విహితః । నవమే దశమే వా మధ్యమః ॥ ఏకాదశ ద్వాదశయోః కనీయాన్ ॥ తదేవాహ గౌతమః ॥ నవమే దశమే చ వ్రతబంధస్య మధ్యమః। ఏకాదశే ద్వాదశే చైకకనీయాన్ వ్రతబంధనే ॥ కాల ఇతి శేషః । ముఖ్యకాలే వ్రతీభూయాన్మధ్యమే మధ్యమో భవేత్ । నీచాద్దే నీచతాం యాతి అష్టమాబ్దం నలంఘయేత్ ॥ అష్టమాబ్దస్య బలవంతామాహ ॥ పరాశరః ॥ బాలస్తు బలహీనోపి గర్భిణ్యామపి మాతరి । యో యది క్షేద్ద్విజన్మత్వమష్టమాబ్దం నలం

ఘయేత్ ॥ ఆషోడశాబ్దపర్యంతం కాలమాహుర్మనీషిణఇతి । కాలపరీక్షణా
పేక్షయా కల్పాయుగ ద్వౌ బాహుశ్రుత్యాద్దైశవిద్యారాచ్చ పంచమవర్షా దార
భ్యాష్టమాబ్దపర్యంతం సమీచీనం॥ ఉక్త నవమ దశమవా షోడశావా । ఏతేషాం
ముఖ్యకాలాతిక్రమేదోషమాహ ॥ కాత్యాయనః ॥ జన్మగర్భాష్టమే రాజన్
వ్యతిక్రమ్యావిదన్నపి । గౌణకాలేపిపుత్రాణాం వ్రతబంధంయదాచరేత్ ॥ త
దాపితా మహాపాపమవాప్యరఘునందన । సపుత్రఃపాపకర్మాస్యా దుభౌ
తౌపాపసంభవౌ ॥ యదికామాదష్టమాబ్దం లంఘయిత్వాచరేద్వ్రతం।ప్రా
జాపత్యమిత్యర్థః ॥ నవమేతు ప్రకృచ్ఛ్రంస్యాద్దశమేచోభయంస్మృతం । ఏ
కాదశ ద్వాదశౌవాప్యతిక్రమ్యైన్దవంచరేత్ ॥ త్రయోదశాబ్దాదారభ్య షో
డశాబ్దవ్యతిక్రమే । ససంభాష్యైవపాత్రేయస్సర్వధర్మబహిష్కృతః ॥ తతః
పరం యదీచ్ఛేత్తు ద్విజన్మత్వం పితాత్మజే । కృత్వాస్వయం పునఃకర్మ చరే
చ్చాంద్రాయణత్రయం ॥ పుత్రస్యదేహశుద్ధ్యర్థం కుర్యాద్గోముఖసంభవం ।
గోముఖజననమిత్యర్థః ॥ ప్రాజాపత్యత్రయంకృత్వా మౌంజీబంధనమాచరే
త్ । అన్యథా పతితం విద్యాన్నకర్మార్హోభవేదిహ ॥ క్షత్రియస్యద్వావిం
శతివత్సరాతిక్రమే వైశ్యస్య చతుర్వింశతివత్సరాతిక్రమేచైవమేవ ప్రాయశ్చి
త్తం ద్విగుణం కృత్వోపనయనంచరేత్ । అన్యథాత్రయోవర్ణాదోషమాప్ను
యుః ॥ ఇత్యుపనయన కాలాతిక్రమప్రాయశ్చిత్తం ॥

(౩౦౪) ఇక నుపనయన కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తమును దెలుపు
చున్నాడు ॥ గర్భములోని మాసములతో గూడ నెనిమిదవ సంవత్సరము నం
దయినను, లేక జననాదిగ నెనిమిదవ సంవత్సరమందయినను, బ్రాహ్మణు
నకు పనయనమును జేయవలయును, గర్భమాసములతో గూడ బదిరెండవ సం
వత్సరమునందు రాజులకుపనయనమును జేయవలయును. వైశ్యులకు బదునా
రవసంవత్సరమునందు జేయవలయునని దేవలుడు వచించె. గృహ్యకారుడును
నీవిధముగానే చెప్పె. బ్రహ్మవర్చస్సును గోరువాని కేడవసంవత్సరమునందు
ను, ఆయుష్కామునకు నెనిమిదవసంవత్సరమునందును, తొమ్మిదవసంవత్స
రమునందు తేజస్కామునకును, పదియవసంవత్సరమునం దన్నాద్యకాముని
కును, పదునొకండవసంవత్సరమునం దింద్రియకామునకును, పదిరెండవసం
వత్సరమునందు బలకామునకును నుపనయనమును జేయవలయును. “గ
ర్భాష్టమేషు” అనిబహువచనమును జెప్పుటచేత నైదవసంవత్సరము మొదలు
కొని ఘోసమిదవ సంవత్సరమువరకును నుపనయనమునకు ముఖ్యకాలముల
నియములుగవలయును, గర్భాష్టమ జన్మాష్టములయందు వటువాయుష్మం

తుడగును, గర్భాష్టమమునందు బ్రాహ్మణత్వము గలుగునని గృహ్యసూత్ర కారుని యభిప్రాయము. గౌతమమనువులును నీప్రకారముగానే వచించిరి, తొమ్మిది, పదిసంవత్సరము లుపనయనమునకు మధ్యకాలములు, పదునొకండవ సంవత్సరమధమము. ముఖ్యకాలమునం దుపనయనముసేసిన వాఁడ వ్రతియగును, మధ్యమకాలమునందు మధ్యముడగును, అధమకాలమునం దధముఁడగును, కావున నెనిమిదవ సంవత్సరమును వదలఁగూడదు. బాలుడు బలహీనుఁడైనను, తల్లి గర్భవతియైయున్నను, యెనిమిదవ సంవత్సరమునందు ఉపనయనమును జేయవలయును, పదునారు సంవత్సరములవరకును నుపనయనకాలముగలదని యెఱుంగవలయును, కాలపరీక్షణను జేయుటకంటె గలియుగమునందు దోషబాహుళ్యము గలిగియుండుటచేత నైదవసంవత్సరము మొదలుకొని యెనిమిది సంవత్సరములలో నుపనయనమును జేయవలయును, అట్లుగాకేని తొమ్మిదవసంవత్సరమునందైనను, పదియవసంవత్సరమునందైనను నుపనయనమును జేయవలయును, జన్మగర్భాష్టమములతిక్రమించెనేనిగౌణకాలమునందైనను పుత్రులకుపనయనమును జేయవలయును, అట్టి గౌణకాలమునందు పితృపుత్రులిరువురును పాపవంతులగుదురు, కావున నెనమిదవసంవత్సర మతిక్రమించెనేని ప్రాజాపత్య కృఛ్రమునాచరింపవలయును, తొమ్మిదవసంవత్సరమునం దుపనయనమును జేయుతండ్రి తప్తకృఛ్రమును జేసికొని పిదపపుత్రునకుపనయనమును జేయవలయును, పదియవసంవత్సరమునం దయ్యెనేని యుభయమని చెప్పబడియె. పదునొకండు పదిరెండుసంవత్సరములతిక్రమించెనేని చాంద్రాయణవ్రతము నాచరించవలయును, పది మూడవ సంవత్సరము మొదలుకొని పదునారు సంవత్సరములు గూడ నతిక్రమించెనేని యట్టిబాలుడు భాషింప దగనివాఁడును, అపాఙ్క్తేయుడును, సర్వధర్మ బహిష్కృతుడునునగును. కావుననట్టివానికుపనయనము కావలసియున్నయెడలతండ్రియగువాఁడు పునరుపనయన సంస్కారమును జేసికొనిమూఁడు చాంద్రాయణములనాచరించవలయును. పుత్రునకు దేహశుద్ధికొరకు గోముఖజననమునుగలిగించవలయును, పిమ్మట ప్రాజాపత్యకృఛ్రమునాచరింపజేసియుపనయనమును జేయవలయును. ఇవ్విధముగ జేయని యెడల పతితుడగును, క్షత్రియునకిరువదిరెండుసంవత్సరము లతిక్రమించినపిదపను, వైశ్యునకిరువదినాలుగు సంవత్సరములయనంతరమందును ప్రాయశ్చిత్తమును ద్విగుణముగ జేసి పిమ్మటనుపనయనమును జేయించవలయును, ఇవ్విధముగ జేయని యెడల మూఁడువర్ణములవారికిని దోషముగలుగును. ఇట్లనికాత్యాయనుఁడువచించె ॥

## —— ✲ దండాజినమౌంజ్యభావేవటోః ప్రాయశ్చిత్తమ్. ✲ ——

(౩౦౫) అథ దండాజిన మౌంజ్యభావే వటోః ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అజినంమేఖలాందండం వ్రతీనిత్యంభజేత్తదా। యావత్స్యాద్గృహస్థ స్స్యాత్తావద్వర్ణీ నసంత్యజేత్ ॥ పరాశరః ॥ మేఖలాజినదండానాం నిత్యం వర్ణీ పరిగ్రహేత్ । కర్మకుర్యాత్తదా మౌనీ యదాకర్మసమాప్యతే ॥ గవుత మః॥ మేఖలామజినందండం బ్రహ్మచారీ సదావహేత్ । సంధ్యాదికంయదాకు ర్యాత్తదానంత్యాయకల్పతే ॥ మహారాజవిజయే॥ అజినంమేఖలాందండము ద్వహేత్ప్రథమాశ్రమః॥ సంధ్యాదినిత్యకర్మాణికుర్యాద్యదితదాశ్శృణు। సర్వా ణిఫలవంత్యస్యబ్రహ్మతేజోఽభివర్ధతే ॥ తతోవేదానధీయీత గురు శుశ్రూషణం తథా। బ్రహ్మచారీయదిత్యజ్యాదాషాఢం మేఖలాజినే॥ దినత్రయంవా పక్షం వాప్రాజాపత్యంసమాచరేత్ । నష్టేభ్రష్టేనవంమంత్రాద్ధృత్వాభ్రష్టంజలే క్షిపేత్॥ తథామాసపరిత్యాగేతప్తకృచ్ఛ్రంసమాచరేత్। అబ్దమాత్రపరిత్యా గేకుర్యాచ్చాంద్రాయణవ్రతం ॥ క్షత్రియాదీనామేవం ॥ ఇతిహేమాద్రౌ మే ఖలా దండాజిన ధారణ లోప ప్రాయశ్చిత్తమ్ ॥

(౩౦౫) ఇకనుదండాజినమౌంజ్యభావమునందు వటువునకుజేయదగి నప్రాయశ్చిత్తమునుజెప్పుచున్నాడు ॥ గృహస్థాశ్రమము నవలంబించువఱకు ను, అజినము,మేఖల,దండము, అనువానిని సేవించుచుండవలయునని దేవలు డువచించె. పరాశరుడునునిటుల నేవచించె. గవుతముడునిప్పిధముగా నే చె ప్పె. మేఖలాజినదండములనువహించి బ్రహ్మచారిసంధ్యావందనాది నిత్యక ర్మల నాచరించవలయును. ఇవ్విధముగజేసినయెడల సకలకర్మలును ఫలవంత ములగును. బ్రహ్మ తేజస్సభివృద్ధిఁబొందును, ఇట్లుసేయుచు వేదాధ్యయనగు రు శుశ్రూషలను జేయవలయును. బ్రహ్మచారియగువాడు మేఖలాజినదం డములనువదలి మూడుదినములయినను, పదునైదుదినములయినను నున్నయె డల ప్రాజాపత్యమునాచరించవలయును, మేఖలాజినదండములునష్టమైనను, భ్రష్టమైనను, నూతనమైనవానిని ధరింపవలయును, భ్రష్టమైనదానినుదకము నందుబడవేయవలయును, ఆమేఖలాదులను మాసముదినములు పరిత్యజిం చినయెడల తప్తకృచ్ఛ్రమునాచరించవలయును, సంవత్సరకాలమువదలియుం డె నేని చాంద్రాయణవ్రతమును జేయవలయునని మహారాజవిజయమను గ్రం థమునందు జెప్పబడియె. క్షత్రియాదులును నివ్విధముగానే యాచరించ వలయును ॥

## బ్రహ్మచర్యవ్రతలోప ప్రాయశ్చిత్తమ్.

(౩౦౬) అథబ్రహ్మచర్యవ్రతలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అశుచిత్వందివాస్వాపస్తథాతాంబూలభక్షణం। నృత్తంగీతంతథావాద్యంద్యూతంస్త్రీవ్యసనంతథా॥ గంధఃపుష్పంతథోష్ణీషంఛత్రంవా పాదుకాద్వయం। పాషండజనసంసర్గస్తథాపాషండభాషణం॥ తథా వేదపరిత్యాగోగురుశుశ్రూషణంతథా। గ్రామచండాలసంభాషాబ్రహ్మచండాలభాషణం॥ దర్పణందంతకాష్ఠంచపరనిందాత్మకత్థనమ్। ఏతానిసంత్యజేన్నిత్యంబ్రహ్మచారీజితేంద్రియః॥ ఏతేషాంసంపరిత్యాగేవ్రతీబ్రహ్మపదంవ్రజేత్। ఏతేషాంపూర్వవర్ణానామేకమేవయథావ్రతీ॥ ప్రాయశ్చిత్తీభవేత్సోపిబ్రహ్మచారీనసంశయః। ఏతాంశ్చనియమాంస్త్యక్త్వాబ్రహ్మచారీయదావసేత్। చాంద్రాయణవ్రతంకృత్వాశుద్ధిమాప్నోతినిశ్చయః॥ మహాపాతకయుక్తోవాయుక్తోవాసర్వపాతకైః। బ్రహ్మచర్యపరోయస్తుసగచ్ఛేద్బ్రహ్మణఃపదం॥ ఇతిహేమాద్రౌ బ్రహ్మచర్యవ్రతలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౦౬) ఇకనుబ్రహ్మచర్యవ్రతలోప ప్రాయశ్చిత్తవిధానమునుజెప్పుచున్నాము॥ బ్రహ్మచారియగువాడు, అశుచిత్వమును, దివాస్వాపమును, తాంబూలభక్షణను, నృత్తగీతవాద్యములను, ద్యూతమును, స్త్రీవ్యసనమును, గంధపుష్పములను, ఉష్ణీషమును, (అనగాదలగుడ్డను) గొడుగును, పాదుకలను, పాషండజనసంసర్గమును, పాషండభాషణను, వేదపరిత్యాగమును, గురుశుశ్రూషారాహిత్యమును, గ్రామచండాలసంభాషణను, బ్రహ్మచండాలభాషణను, దర్పణమును, దంతకాష్ఠమును, పరనిందను, ఆత్మస్తుతిని, వదలవలయును. వీనినివదలిసంచరించినబ్రహ్మచారి బ్రహ్మపదమునుబొందును. ఇవ్విధముగసంచరించనిబ్రహ్మచారి చాంద్రాయణవ్రతము నాచరించవలయును. మహాపాతకయుక్తుడైనను, సర్వపాతకయుక్తుడైనను, బ్రహ్మచర్యాశ్రమమునవలంబించినవాడు బ్రహ్మపదమునుబొందునని దేవలుడువచించె.

## అగ్నికార్యబ్రహ్మయజ్ఞతర్పణలోపప్రాయశ్చిత్తమ్.

(౩౦౭) అథాగ్నికార్యబ్రహ్మయజ్ఞతర్పణగురుసేవాదిలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అగ్నికార్యంబ్రహ్మయజ్ఞందేవర్షిపితృతర్పణం। బ్రహ్మచారీయదిత్యక్త్వాభుక్త్వాచాంద్రాయణంచరేత్॥ గౌతమః॥ అగ్నికార్యంబ్రహ్మయజ్ఞందేవర్షిపితృతర్పణం। త్యక్త్వావ్రతీయదాభుఙ్క్తేఽజ్ఞానాచ్చాంద్రాయణంచరేత్॥ మార్కండేయః॥ అగ్నికార్యంబ్రహ్మయజ్ఞందేవర్షిపితృతర్పణం। దేవపూజాంగురోస్సేవాంత్యక్త్వావర్తతేచేద్వ్రతీ॥ భుక్త్వాచాం

ద్రాయణంకుర్యాన్మాసమాత్రంనిరంతరం। జాబాలిః॥ దేవపూజాంగురో స్సేవాంతథావృద్ధాభివాదనం। అగ్నికార్యంబ్రహ్మయజ్ఞం దేవర్షిపితృతర్పణం। ఏకత్రదివసేత్యక్త్వాబ్రహ్మచారీ యుదావసేత్॥ లౌకికాగ్నింసమాధాయ వ్యాహృతీహోమమాచరేత్। మాసేతు పంచగవ్యంస్యాద్ ఋతౌ కాయంవిశోధనం॥ సంవత్సరేతుచాంద్రంస్యాత్తతః పతితఏవహి॥ ఇతి హేమాద్రౌ బ్రహ్మచారిణామగ్నికార్య బ్రహ్మయజ్ఞదేవర్షిపితృతర్పణ గురుసేవాతిక్రమణప్రాయశ్చిత్తం॥

(౩౦౭) ఇకనుఅగ్నికార్యబ్రహ్మయజ్ఞతర్పణలోపప్రాయశ్చిత్తమును గురించిచెప్పుచున్నాడు॥ అగ్నికార్యమును, బ్రహ్మయజ్ఞమును, దేవర్షిపితృతర్పణమును, వదలిబ్రహ్మచారిభోజనమును జేసినయెడల చాంద్రాయణవ్రతమునాచరించవలయునని దేవలుడువచించె. గౌతముడును నిటులనేవచించె. మార్కండేయుడునునిటులనేచెప్పి దేవపూజాగురుసేవలనుగూడ వదలకూడదనియె. జాబాలియునునిటులనేచెప్పిమఱియునిట్లనియె. ప్రమాదాదులచేత నొక్కదినమిట్టివిధముగాజేసినబ్రహ్మచారి లౌకికాగ్నినుంచివ్యాహృతీహోమమునాచరించవలయును. నెలదినములీవిధముగాసంచరించినవాడు పంచగవ్యప్రాశనను జేయవలయును. రెండుమాసములాచరించినవాడు కాయకృచ్ఛ్రమునాచరించవలయును. సంవత్సరకాలమయ్యేనేని చాంద్రాయణవ్రతము నాచరించవలయును. సంవత్సరానంతరమందు పతితుడగుననియె.

## —— వేదాధ్యయనలోపప్రాయశ్చిత్తమ్. ——

(౩౦౮) అథవేదాధ్యయనలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ మౌంజీవ్రతముపక్రమ్యపరంశ్రావణకర్మణః। బ్రహ్మచారీవృథాకుర్వన్ వేదాభ్యసంవినాదినమ్॥ దినానీత్యర్థః॥ వేదఘాతీసవిజ్ఞేయస్సర్వకర్మస్వనర్హవాన్॥ గౌతమః॥ ఉపాయనదినాదూర్ధ్వంపరంశ్రావణకర్మణః। అవంధ్యం దివసంకుర్వన్ బ్రహ్మచారీసలోకభాక్। అన్యథాదోషమాప్నోతి వేదఘాతీసఉచ్యతే॥ పరాశరః॥ బ్రహ్మచారీసదాశుద్ధో వేదాభ్యాసేనబుద్ధిమాన్। వేదోనారాయణస్సాక్షాత్తదభ్యాసేమహాన్భవేత్॥ జాతుకర్ణిః॥ ఉపాయనదినాదూర్ధ్వంపరంశ్రావణకర్మణః। బ్రహ్మచారీ బ్రహ్మవిద్యాం త్యక్త్వావర్తేతసర్వదా॥ వేదఘాతీసవిజ్ఞేయోబ్రహ్మకర్మస్వనర్హవాన్। తద్దోషపరిహారార్థం కాయకృచ్ఛ్రం తతఃపరమ్ కృత్వాభ్యాసం చరేద్వేదా నధీత్యబ్రహ్మవిద్భవేత్। ఏకవర్షాదూర్ధ్వమేతత్ప్రాయశ్చిత్తం। వర్షద్వయేవర్షత్రయేవా చాంద్రాయణం॥ ఇతి హేమాద్రౌ వేదాధ్యయనలోపప్రాయశ్చిత్తం॥

(౩౦౮) ఇకను వేదాధ్యయనలోపప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ శ్రావణకర్మానంతరమందు మౌంజీవ్రతమునవలంబించి వేదాభ్యాసమునువదలిన బ్రహ్మచారి వేదఘాతకుడనబడును. మఱియునట్టివాడు సర్వకర్మలయందు ననర్హుడగునని దేవలుడు పలికెను. గౌతముడు నిటులనే చెప్పె. బ్రహ్మచారి సర్వకాలములయందును శుద్ధుడై వేదాభ్యాసము జేసినయెడల బుద్ధిమంతుడగును. ఇట్టివిధముగ జేయనియెడల వేదఘాతియనబడును, మఱియును దోషమును బొందినవాడగునని పరాశరుడు వచించె. జాతూకర్ణి యును నిటులనే వచించి తద్దోషపరిహారమునకొఱకు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. ఈ ప్రాయశ్చిత్తము సంవత్సరకాలమతిక్రమించెనేని యాచరింపవలయును. రెండు సంవత్సరములయినను, మూడుసంవత్సరములయినను అయ్యేనేని చాంద్రాయణవ్రతము నాచరించవలయుననియె.

—— అనధ్యాయేషు వేదపాఠప్రాయశ్చిత్తమ్. ——

(౩౦౯) అథానధ్యాయేషు వేదపాఠప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ మాసే మాసే తు పర్వాణి తథా మన్వాదయః పరం। యుగాదయస్తథా శుక్లకృష్ణాష్టమీ చ చతుర్దశీ। శయనోత్థానద్వాదశ్యౌ మహాభరణీ తథైవ చ। సంధ్యాయాం గర్జితే మేఘే తథా భూకంప ఏవ చ। గ్రామదాహే రాజనాశే తథా సర్పాదిదర్శనే। మాతాపిత్రోర్మృతాహేషు శ్రోత్రియే మరణం గతే॥ జాతాశౌచే చ జ్ఞాతీనాం గజచ్ఛాయా ప్రవృత్తే తథా। మహాపాతకినో దృష్ట్వా చండాలాన్ బహిరాశ్రితాన్॥ ఏతేషూక్తేషు రాజేంద్ర వేదాంతం వేదమేవ వా। యోధీతే మూఢధీః పాపీ మృత్వా నరకమశ్నుతే॥ నారదః॥ వేదాంతం వాథ వేదం వా అనధ్యాయేష్వధీతవాన్। ద్విజః పాపమవాప్నోతి బ్రహ్మహత్యాం చ విందతి॥ గౌతమః॥ అనధ్యాయేష్వధీతానాం ప్రజ్ఞామాయుః ప్రజాం శ్రియం। మంత్రవీర్యత్తు యుభయాదింద్రో వజ్రేణ హంతి చ। పక్షే పరాకః స్థితః మాసే త ప్రకీర్తితం। వర్షే చాంద్రం తతః పశ్చాత్ తతో బ్రహ్మహణో వ్రతం॥ ఇతి హేమాద్రౌ అనధ్యాయే వేదాభ్యాసప్రాయశ్చిత్తం॥

(౩౦౯) ఇకను అనధ్యయనములయందు వేదపాఠమును జేసిన దోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ ప్రతిమాసమందలి పర్వములును, మన్వాదులును, యుగాదులును, శుక్లకృష్ణాష్టములును, చతుర్దశులును, శయనోత్థానద్వాదశులును, మహాభరణియును, సంధ్యాకాలమును, మేఘగర్జనకాలమును, భూకంపనమును, గ్రామముదహనమైనదినము, రాజనాశదినము, సర్పాదిదర్శనము, మాతాపితృశ్రాద్ధదినములును, శ్రోత్రియు

డుమరణమును బొందినదినమును, జాతాశౌచమృతాశౌచ దినములును, గజ చ్ఛాయాహ్వాయమునుమహాపాతకులను, చండాలురను, చూచినకాలమును, అనధ్యయన కాలములనబడును. ఇట్టికాలములయందు వేదమునైనను, వేదాంతమునైనను, పఠించినవాడు మరణాంతరమందు నరకమును బొందునని దేవలుడు వచించె. నారదుడిట్టికాలములయందు వేదాభ్యాసమును జేసినవాడు బ్రహ్మహత్యకు దుల్యమైనపాపమును బొందునని యె. అనధ్యాయనములయం దధ్యయనమును జేసినవారలకు నాయుః ప్రజ్ఞాసంపదలు నశించును. మంత్రవీర్యతయు భయమువలన నింద్రుడట్టివారలవజ్రముచేతజంపును. ఇట్టికృత్యమును పక్షము దినములుచేసినవాడు పరాకకృచ్ఛ్రమును మాసదినము లాచరించినవాడు తప్తకృచ్ఛ్రమును, సంవత్సరకాలమయ్యెనేని చాంద్రాయణవ్రతము నాచరింపవలయును, సంవత్సరకాలమతిక్రమించెనేని పతితుడగునని గౌతముడు వచించె.

—— * వేదవ్రతాతిక్రమప్రాయశ్చిత్తమ్. * ——

(౩౧౦) అథ వేదవ్రతాతిక్రమణప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ ప్రాజాపత్యం తథాసౌమ్యమాగ్నేయం వైశ్వదేవికం॥ చత్వారి వేదసంజ్ఞాని వ్రతాని సుమహాంతిచ। ప్రాజాపత్యమృచాం వేదే సౌమ్యం యాజుషమేవచ। ఆగ్నేయం సామవేదేచ వైశ్వదేవం చతుర్థకమ్। ఏతానికురుతే యస్తు ద్విజః పాపాత్ప్రముచ్యతే॥ మార్కండేయః॥ వేదవ్రతానిచత్వారి వేదసంజ్ఞాని యోద్విజః। చిత్తశాంతి శేషుకుర్వీత వాజపేయఫలం లభేత్ । ఋచం వేదమధీత్యైవ ప్రాజాపత్యం సమాచరేత్। యజుర్వేదమథాధీత్య యాజుషం వ్రతమాచరేత్ । ఆగ్నేయం సామవేదంచ అధీత్యైవ తథాఽమలమ్। అథర్వాణం వైశ్వదేవం కుర్యాత్ప్రోక్తయథాక్రమమ్ । ఏతాని క్రమశః కృత్వా వాజపేయఫలం లభేత్ । నతత్ర కర్మలోపస్స్యాద్యన్యథా పతితో భవేత్॥ అకరణే ప్రాయశ్చిత్తమాహ॥ జాతుకర్ణిః॥ అకృత్వా యో ద్విజో మోహాదేతద్వ్రతచతుష్టయమ్। ఏకైకస్మిన్ వ్రతే రాజన్ కర్మహీనో భవేత్స్ఫుటం। అకృత్వైవ తాని యో మోహాత్పాణిగ్రహణమాచరేత్। మహాంస్తు నరకం గత్వా ఘుణజాయతనిష్ప్రజః॥ ఏతద్వ్రతలోపప్రాయశ్చిత్తమాహ॥ హారీతః॥ ప్రమాదాద్బ్రాహ్మణో లోభాద్దేశకాలవిపర్యయాత్ అకృత్వైవ తాని సర్వాణి ప్రాజాపత్యం పృథక్చరేత్। తతః పరం నదోషస్స్యాచ్ఛుద్ధ్యా హేమస్నాతకవ్రతే॥ ఇతి హేమాద్రౌ వేదవ్రతాతిక్రమణప్రాయశ్చిత్తం॥

(౩౧౦) ఇకను వేదవ్రతము నతిక్రమించినదోషనివారకప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ వేదములు నాలుగు. వేదవ్రతములును నాలుగు. ఋగ్వేదమునకు ప్రాజాపత్యవ్రతము, యజుర్వేదమునకు సౌమ్యవ్రతము, సామ

వేదమునకునాగ్నేయవ్రతము, అథర్వణవేదమునకు వైశ్వదేవవ్రతము, అను
వానినాచరించుటవలన పాపముగలుగనేరదని దేవలుడువచించె. మార్కండే
యుడునునిటులనే చెప్పి యీవ్రతములనాచరించుటచేత వాజపేయఫలమును
బొందుననియును, ఈవ్రతములనాచరింపనివాడు పతితుడగుననియును జెప్పె.
అవివేకమువలన నీనాలుగువ్రతముల నాచరింపనివాడుకర్మహీనుడగును. ఈ
వ్రతములనాచరింపకయే పాణిగ్రహణమును జేసికొనినవాడు గొప్పదగునర
కమునుబొందును. పిమ్మటభూలోకమునందు సంతానహీనుడై పుట్టునని జా
తుకర్ణి వచించె. ప్రమాదాదులవలననీవ్రతములనాచరింపనివాడు నిజదోషని
వారణకొఱకు ప్రాజాపత్యమునాచరింపవలయును. ఇవ్విధముగనాచరించిన
యెడలదోషముతొలగును. పిమ్మటస్నాతకవ్రతమునవలంబించవలయునని హా
రీతుడువచించె.

——* గోదానికవ్రతలోపప్రాయశ్చిత్తమ్. *——

(౩౧౧) అథగోదానికవ్రతలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ షోడ
శేవర్షే కేరాజన్యవిప్రాణాంపాపనాశనమ్॥ గోదానికంమహత్కర్మకుర్యా
ద్విప్రస్సమాహితః। యఃకుర్యాత్కర్మసంపూర్ణం భవేద్విప్రస్స పుణ్యభాక్॥
జాబాలిః॥ గోదానికంమహత్కర్మవిప్రాణాంకర్మపూర్తయే। కుర్యాద్విప్రః
ప్రయత్నేవన తేనసహాదోషభాక్॥ గౌతమః॥ అవశ్యంకరణీయంయద్ద్విజైర్గో
దానికంమహత్। నతత్కర్మపరిత్యాజ్యంవిప్రైర్ధర్మానువర్తిభిః। ఏతద్గోదాని
కంత్యక్త్వావర్తేత్బ్రహ్మవిత్తమః। కుర్యాత్పాపవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యంవి
శోధనమ్। సర్వపాపహరంపుణ్యంప్రాజాపత్యంవిదుర్బుధాః। అన్యథాదోష
మాప్నోతిద్విజఃపాపభయాదిహ॥ ఇతిహేమాద్రౌగోదానికవ్రతాకరణప్రా
యశ్చిత్తం॥

(౩౧౧) ఇకనుగోదానికవ్రతలోపప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥
బ్రాహ్మణులుపదునారవసంవత్సరమునందు గోదానికమనుమహావ్రతమునా
చరింపవలయును. ఈవ్రతమునాచరించినవాడు మిగులబుణ్యవంతుడగునని దే
వలుడువచించె. జాబాలియునునిటులనేవచించె. గౌతముడునునిటులనేచెప్పి
యీవ్రతమునాచరింపనివాడు తద్దోషనివారణకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము
నాచరింపవలయును. ప్రాజాపత్యముసర్వపాపహరమని విద్వాంసులుచెప్పు
దురనియె.

——* సమావర్తనలోపప్రాయశ్చిత్తమ్. *——

(౩౧౨) అథసమావర్తనలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ వేదా

నధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్ । అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మాచరేత్॥ మార్కండేయః॥ స్నాతకం బ్రహ్మచర్యస్య వ్రతలోపం సుపుణ్యదం। యః కృత్వా స్నాతకం కర్మ సర్వవ్రతఫలం లభేత్॥ గాలవః॥ స్నాతకం వ్రతలోపం యద్బ్రహ్మచర్యవ్రతం పరమ్ । యః కృత్వా స్వవివాహే దారసగృహస్థస్సంచరం సుఖీ॥ మార్కండేయః॥ స్నాతకం వ్రతనిర్మోకం మహాపాతకనాశనం। యః కుర్యాత్స్వవివాహే తౌ నవిప్రః పఙ్క్తిపావనః॥ తదాహాపస్తమ్బః॥ విద్యయా స్నాతీత్యేకేయాం తీర్థవిద్యా అధీతే విప్రః తావంతి స్నాతకవ్రతాని విప్రః కుర్యాత్త్రిశకా వేకవిధం వా కుర్యాత్॥ నత్యాజ్యం॥ గౌతమః॥ అవశ్యం స్నాతకం కుర్యాద్ద్విజో లోకపరాయణః॥ అన్యథా దోషమాప్నోతి ప్రాయశ్చిత్తీభవేద్ద్విజః। స్నాతకవ్రతసంత్యాగే కుర్యాచ్చాంద్రాయణద్వయమ్॥ ప్రాప్నువివాహయేత్కన్యాం కులశీలానువర్తినీమ్। చాంద్రాయణద్వయం కృత్వా వివాహేన తు దోషభాక్॥ ఇతి హేమాద్రౌ స్నాతకవ్రతలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౧౨) ఇక సమావర్తనలోప ప్రాయశ్చిత్తము చెప్పుచున్నాడు॥ నాలుగు వేదముల నైనను, మూడు వేదముల నైనను, రెండు వేదముల నైనను, ఒక్క వేదము నైనను, బ్రహ్మచర్యవ్రతానుష్ఠానపురస్సరముగ జదివినపిమ్మట గృహస్థాశ్రమధర్మమును నవలంబించవలయునని దేవలుడు వచించె. బ్రహ్మచర్యవ్రతమును జక్కగ జరిపినపిమ్మట స్నాతకవ్రతము నాచరించినవాడు సర్వవ్రతఫలమును బొందవలయునని మార్కండేయుడు చెప్పె. గాలవుడు స్నాతకవ్రతము నాచరించి వివాహమును జేసికొనినవాడు సుఖవంతుడగునని రౌ. ఆపస్తంబుడునని టులనే చెప్పె. బ్రాహ్మణుడగువాడవశ్యముగ స్నాతకవ్రతము నాచరింపవలయును. అట్లు చేయనియెడల దోషవంతుడగును. స్నాతకవ్రతమును వదలినవాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును. చాంద్రాయణవ్రతము నాచరించినపిమ్మట నుత్తమకన్యను బెండ్లియాడవలయును. రెండు చాంద్రాయణముల నాచరించి వివాహమును జేసికొనుట మఱియు నుత్తమమని గౌతముడు చెప్పె.

——— ॥ ఉపాకర్మలోప ప్రాయశ్చిత్తమ్. ॥ ———

(౩౧౩) అథ ఉపాకర్మలోప ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ వేదాన్తానాఞ్చ వేదానామధీతానాఞ్చ వీర్యకం। బ్రహ్మచారిగృహస్థానాం సర్వపాపహరం పరం। సంవత్సరేతు పాపం యద్గృహస్థబ్రహ్మచారిభిః। కృతం తత్ప్రవిశాపార్థముపాకర్మ సమాచరేత్॥ బోధాయనః॥ సంవత్సరకృతం పాపం గృహస్థబ్రహ్మచారిభిః। ఉపాకర్మహరేత్త్రిపథమన్త్రైర్విష్ణుస్మృతిర్యథా॥ నారదః॥

ప్రతినాశ్చగృహస్థానాంసంవత్సరకృతంమహత్। అఘందహతిహోమశ్చశ్రా
వణేమాసిసమ్భవః॥ ఏవంహోమమకృత్వైవవేదారమ్భంనకారయేత। వేద
మూలోహివిప్రోసౌమూలాభావేఫలంకుతః। తస్మాద్విప్రైర్నసంత్యాజ్యం
శ్రావణంకర్మనిచ్ఛుభమ్। అకృత్వాబ్రహ్మచారీవాద్విజోవా వేదసమ్మతః। ఏవం
శ్రావణికంహోమంత్యక్త్వాయదిహవర్తతే। తత్రత్రయంప్రతికుర్యాద్గృహ
స్థోపిద్వయంచరేత్। కృత్వైతద్వర్షకేప్రోక్తం శుద్ధిమాప్నోతిపూర్వజః।ప్ర
త్యబ్దంసత్యజేద్యస్తు శ్రావణాఖ్యంపవిత్రదమ్॥ పతితస్సతువిజ్ఞేయస్సర్వధర్మ
బహిష్కృతః॥ ఇతిహేమాద్రావుపాకర్మత్యాగప్రాయశ్చిత్తమ్॥

(౩౧౩) ఇకనుపాకర్మలోపప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ వేద
వేదాంతములనుజదివినవారియొక్కయు, బ్రహ్మచారిగృహస్థులయొక్కయు,
సకలపాపములను శ్రావణమాసమునందుజేయదగిన యుపాకర్మనశింపజే
యగలదనిదేవలుడువచించె. సంవత్సరకాలమువఱకును, గృహస్థబ్రహ్మచా
రులచేతజేయబడినసకలపాపములను నుపాకర్మహరించునని బోధాయనుడువ
చించె. నారదుడునునిటులనే చెప్పి మఱియునిట్లనియె. శ్రావణహోమమును
జేయక వేదారంభమును జేయగూడదు. బ్రాహ్మణుడు వేదమూలుడు. మూల
ములేనియెడలఫలమెట్లుగలుగును. అందువలనబ్రాహ్మణులచేత శ్రావణహో
మకర్మవదలదగినదికాదు. బ్రహ్మచారిశ్రావణహోమమును జేయనియెడల
ప్రాయశ్చిత్తార్థముగ తప్తత్రయమును జేయవలయును. గృహస్థుడుశ్రావణ
హోమమునుజేయనియెడల తప్తద్వయమును ప్రాయశ్చిత్తార్థముగనాచరిం
చవలయును. ప్రతిసంవత్సరమునందును శ్రావణాఖ్యకర్మనుచేయనివాడు ప
తితుడును, సర్వకర్మబహిష్కృతుడునునగుననియె.

——* రాక్షసాదివివాహప్రాయశ్చిత్తమ్. *——

(౩౧౪) అథరాక్షసాదివివాహప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ బ్రా
హ్మోదైవస్తథాచార్షః ప్రాజాపత్యస్తథాసురః। గాన్ధర్వోరాక్షసశ్చైవ
పైశాచశ్చాష్టమోధమః॥ లిఙ్గపురాణే॥ సూతః॥ బ్రాహ్మోవివాహోరాజేన్ద్ర
బన్ధుశీలశ్రుతంతథా। ఆరోగ్యంసమ్యగాలోచ్యంపరీక్ష్యైత్రైర్వరంముదా। ప్ర
జాసహత్వకర్మభ్యస్తస్మైకన్యాంప్రదాపయేత్। ఇతిబ్రాహ్మోవివాహః
దైవేవివాహోధూపాలస్వాధ్వరేఋత్విజేముదా। దక్షిణార్థంతదాకన్యాంస
దైవఇతికథ్యతే॥ ఇతిదైవవివాహః॥ ఆర్షేణపాణిగ్రహోరాజన్ జామాతుర్మి
థునద్వయమ్। గవాందత్వాసుతాంసమ్యగలంకృత్యతతఃపరమ్। దద్యాత్తస్మై
తదాకన్యాంసఆర్షఇతికథ్యతే॥ ఇత్యార్షోవివాహః॥ సుతాము·ధానువి

ప్రియవదాధర్మంచరేదితి। ఇత్యుక్త్వాదీయతేకన్యా ప్రాజాపత్యస్స ఈరితః ఇతిప్రాజాపత్యవివాహః॥ కన్యావరాయదాన్యోన్యమంగీకృత్య సుఖాప్తయే। తత్రైవచరతో రాజన్ సగాన్ధర్వ ఇతీరితః॥ ఇతిగాన్ధర్వవివాహః ॥ కన్యాదాత్రే ధనందత్వాతత్సుతాంయోవహేద్యదా । సఆసుర ఇతిజ్ఞేయస్సర్వదాతంపరిత్యజేత్। ఇత్యాసురః ॥ కన్యాదాతారమథవావఞ్చయిత్వాబలాదిహ। సాంపరాయేథవాజిత్వాకన్యామాదాయసత్వరమ్॥ ఉద్వహేద్యదిపాపాత్మాసరాక్షసఇతీరితః। కన్యాంసుప్తాంప్రమత్తాంవాయోహృత్వాతాంసముద్వహేత్। రుదతీంపాపకర్మాసౌసపైశాచ ఇతీరితః । ఆద్యాస్త్రయః ప్రశస్తాస్స్యుర్వివాహాఃపఞ్చగర్హితాః। యథాయుక్తోవివాహస్స్యాత్తథాయుక్తాప్రజాభవేత్ తదాహాపస్తమ్బః॥ బ్రాహ్మేవివాహేబన్ధుశీల శ్రుతారోగ్యాణిబుద్ధ్వాప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయేచ్ఛక్తివిషయేణాలఙ్కృత్యాఽర్షే దుహితృమతేమిథునౌగావౌదేయా ॥ దైవేయజ్ఞతంత్రేఋత్విజే ప్రతిపాదయేత్। సహధర్మంచరతఇతిప్రాజాపత్యః మిథఃకామాత్సంవర్తేతేసగాంధర్వః । శక్తివిషయేణద్రవ్యాణిదత్త్వావహేరన్ సఆసురః । దుహితృమతఃప్రోథయిత్వావహేరన్ సరాక్షసః। సుప్తాంప్రమత్తాంవాపహరేత్సపైశాచః ॥ తేషామాద్యాస్త్రయఃప్రశస్తాః। పూర్వఃపూర్వశ్శ్రేయాన్ । యథాయుక్తోవివాహస్తథాయుక్తాఃప్రజాభవంతి॥ అతస్త్రయోవివాహాఃపరాఃసమీచీనాః । యోయోవివాహోహీనమనుష్యేషుభవతి। తద్రూపయుక్తంసంతానంభవతి ॥ అతో గాంధర్వాసురరాక్షస పైశాచవివాహేషువిప్రాణాం నిషేధాత్పృథక్పృథక్ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః ॥ వివాహేత్వాసురేవిప్రశ్చరేచ్చాన్ద్రాయణత్రయం। చాంద్రత్రయంపరాకంచగాంధర్వేసమ్యగాచరేత్ । రాక్షసేచమహాచాంద్రంతప్తకృచ్ఛ్రత్రయంతథా । పైశాచేకాయకృచ్ఛ్రఞ్చతథాచాంద్రత్రయంస్మృతం। పూర్వంకామాతురఃకృత్వాపశ్చాదేతచ్చరేద్బుధః। కృత్వాసశుద్ధిమవాప్నోతినాన్యథాశుద్ధిరస్తిహి । బ్రాహ్మోదైవస్తథాచార్షః ప్రాజాపత్యోద్విజన్మనాం । ముఖ్యాసంతానకర్తారస్తస్మాదేతాన్సమాచరేత్। అసురాదివివాహాశ్చకేవలంసుఖదాయినః । అసురాదివివాహేషుదైవాద్యదిహపూర్వజః । ప్రాయశ్చిత్తంతదాకృత్వాపశ్చాత్తేషుప్రవర్తయేత్। అన్యథాదోషమాప్నోతిపాపయోనిషుజాయతే॥ ఇతిహేమాద్రౌరాక్షసాదివివాహప్రాయశ్చిత్తం॥

(౩౧౪) ఇకనురాక్షసాది వివాహప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు ॥ బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధ

ర్వము, రాక్షసము. పైశాచము, అనివివాహమెనిమిది విధములని దేవలుడు వచించె. బ్రాహ్మవివాహమునందు బంధుశీల శ్రుతములను, ఆరోగ్యమును, చక్కగా నాలోచించి సత్కర్మలవలన వరునకు గన్యకనివ్వవలయునని లింగ పురాణమునందు జెప్పబడియె. ఇది బ్రాహ్మవివాహము. తనదు యజ్ఞమునందు ఋత్విక్త్వమును జేసినవానికి దక్షిణార్థముగ గన్యాదానమును జేయవలెనని యె. ఇది దైవవివాహము. అల్లునకు రెండుగోవులను దానముచేసి పుత్రికను జక్కగనలంకారమును జేసి కన్యాదానమును జేయవలయును. ఇదియార్ష వి వాహము. ధర్మార్థముగ బుత్రికను బ్రాహ్మణునకిచ్చి సధర్ముడవైయుండుమ నిచెప్పిచేసిన వివాహము ప్రాజాపత్య వివాహమనబడును. ఇది ప్రాజాపత్య వివాహము. కన్యావరు లిరువురును నన్యోన్యానురాగముచేత పెద్దలయను మతిలేకయే చేసుకొనిన వివాహముగాంధర్వ వివాహమనబడును. ఇది గాం ధర్వవివాహము. ధనమునుగ్రహించి వరునకు గన్యాప్రదానమును జేసినయె డల నది యాసురవివాహమనబడును. ఇది యాసురవివాహము. కన్యాదాత నువంచించియైనను, బలాత్కరించియైనను, యుద్ధమునందు జయించియైనను, కన్యనపహరించిచేసికొనిన వివాహము రాక్షసవివాహమనబడును. ఇదిరా క్షసవివాహము. నిద్రవుబొందుచున్న కన్యనైనను, ప్రమత్తురాలైన కన్యనై నను, బలాత్కారముగహరించి యాకన్యరోదనమును జేయుచుండగ జేసి కొనిన వివాహము పైశాచమనబడును. ఇది పైశాచవివాహము. ఇయ్యెనిమి దివివాహములలో మొదటిమూడును నుత్తమములు. తక్కినవైదును గర్హి తములు. శాస్త్రోక్తప్రకారముగ జరిగినవివాహమువలన సకలసౌఖ్యములు నుగలుగును. ఇవ్విధమంతయును లింగపురాణమునందే. చెప్పబడియె. ఆప స్తంబుడును నీవిధముగా సెవచించె. ఆసురవివాహమును జేసికొనిన బ్రాహ్మ ణుడు చాంద్రాయణవ్రతము నాచరించవలయును, గాంధర్వవివాహమును జేసికొనినవాడు చాంద్రత్రయమును పరాకమును నాచరించవలయును, రా క్షసవివాహ దోషనివారణకొరకు మహాచాంద్రమును, తప్తకృచ్ఛ్రత్రయము ను నాచరింపవలయును, పైశాచవివాహ దోషనివృత్తికొరకు మహాచాంద్ర త్రయమును, కాయకృచ్ఛ్రమును నాచరింపవలయును, తొలుత కామాతురత చేతనిట్టి వివాహములను జేసికొనిన వాడిట్టిప్రాయశ్చిత్తములను జేసికొనవల యును, లేనియెడల దోషవంతుడగును, బ్రాహ్మదైవ ఆర్షములను వివాహ ములు బ్రాహ్మణులకు ముఖ్యములైనవి. ఆసురాదివివాహములను జేసికొ నినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొననియెడల పాపయోనులయందు బుట్టు

ఇట్లని మార్కండేయుడు వచించె.

### —— * పరివిత్తిపరివేత్తృప్రాయశ్చిత్తం. * ——

(౩౧౫) అథపరివిత్తిపరివేత్తృప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అనూఢభార్యేతరి జ్యేష్ఠే యవీయాన్ సపరిగ్రహః॥ జ్యేష్ఠస్తుపరివిత్తిస్స్యాత్పరివేత్తా తదానుజః॥ వివాహే రాజ్యలాభేచ శ్రియసాంవ్యత్క్రమేపిచ। అనుజస్యవివాహే హేతుమాహ॥ మార్కండేయః॥ పతితంక్లీబమున్మత్తంకుబ్జంకాణం రుజార్దితం। అపస్మారంపరిత్యజ్య వివాహేనసదోషభాక్॥ కాత్యాయనః॥ కాణంరుజార్దితంకుబ్జం పతితంక్లీబమేవచ। అపస్మారంవివాహ్య శుకదళ్యా శుభవృద్ధయె। తదనుజ్ఞాంసమావాప్యాథ వివాహేనతుదోషభాక్॥ జాతుకర్ణిః॥ కాణంరుజాన్వితంకుబ్జం పతితంక్లీబమేవవా। అపస్మారంపూర్వజాతం కదళ్యాతువివాహయేత్॥ పశ్చాదనుజ్ఞయారాజన్ వివాహేనతు దోషభాక్॥ కదళీవివాహస్తుపురాభిహితః। తేషామన్నపానాదికేషు వృత్తింవిధాయపశ్చాదుద్వాహయేత్॥ తదాహదేవలః॥ తేషాంవృత్తింవిధాయాశుకదళ్యాతాన్వివాహ్యచ। పశ్చాత్పరిణయేత్కన్యాం నదోషస్తత్రపార్థివ॥ యమళయోస్త్వగ్రతఃకృతసంస్కారే జ్యేష్ఠఃపరివిత్తిః। ద్వితీయఃపరివేత్తాత్రప్రకారస్తుపూర్వమేవాభిహితః॥ తేషాంప్రాయశ్చిత్తమపిత్రైవాభిహితం॥ తయోఃపుత్రాఃపరివిందకపరివిన్నాః॥ తేషాంపరివిత్తిపరివేత్త్రోస్తత్పుత్రాణాంచ ప్రాయశ్చిత్తమాహ॥ లౌగాక్షిః॥ పరివిత్తిశ్చరేత్సమ్యక్పూర్వం చాంద్రచతుష్టయం। కృత్వాశుద్ధిమవాప్నోతి నాన్యథాపతితోభవేత్। పరివేత్తాచరేత్కృచ్ఛ్రాశీతం దేహవిశుద్ధయె। తత్పుత్రాస్తుతయోఃకుర్యుః ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥ ఇతిహేమాద్రౌ పరివిత్తిపరివేత్త్రోః తత్పుత్రాణాం ప్రాయశ్చిత్తం॥

(౩౧౫) ఇకను పరివిత్తిపరివేత్తృ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ జ్యేష్ఠునకువివాహము గాకమునుపు తమ్ముడువివాహమును జేసికొనినయెడల నట్టితమ్ముడు పరివేత్తయనబడును. అన్నయగువాడు పరివిత్తియనబడునని దేవలుడువచించె. పతితుడు, నపుంసకుడు, ఉన్మత్తుడు, కుబ్జుడు, రుజార్దితుడు, అపస్మార రోగముగలవాడునునగు నన్నకు వివాహము గాకమునుపు తమ్ముడువివాహమును జేసికొనను. రాజ్యపదస్థుడైనను దోషములేదని మార్కండేయుడు చెప్పె. కాణుడు, రుజార్దితుడు, కుబ్జుడు, పతితుడు, క్లీబుడు, అపస్మారరోగముగలవాడునునగు జ్యేష్ఠభ్రాతకదళీవివాహమును జేసికొని స్వానుమతిచేత దమ్మునకువివాహమును జేయించిన యెడల

దోషమేమియును గలుగనేరదని కాత్యాయనుడువచించె. జాతుకర్ణియునునీ విధముగానేవచించె. అసమర్థులగు జ్యేష్ఠభ్రాతలనువదలి వివాహమును జేసికొనదలచిన తమ్ములు జ్యేష్ఠభ్రాతలకు వృత్తినిగల్పించి వివాహమును జేసికొనవలయునని దేవలుడువచించె. కవలవారలలో జ్యేష్ఠుడు పరివిత్తియని యును, కనిష్ఠుడుపరివేత్తయనియును చెప్పబడును, ఈవిషయమంతయును నిదివరకే విస్పష్టముగ జెప్పబడియె. ఇట్టివారలపుత్రులుపరివిందపరివిన్నులనబడుదురు। పరివిత్తిచాంద్రచతుష్టయము నాచరించవలయును, పరివేత్తనూరుకృఛ్రముల నాచరించవలయును, వారిపుత్రులును నీవిధముగానే ప్రాయశ్చిత్తము నాచరించవలయునని లౌగాక్షివచించె ॥

—— వివాహమధ్యేవధ్వాః ప్రథమార్తవప్రాయశ్చితం. ——

(౩౧౬) అథవివాహమధ్యే వధ్వాః ప్రథమార్తవప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥ వివాహేవితతేతంత్రే హోమకాల ఉపస్థితే। వధూపశ్యేద్యదాపుష్పం ప్రథమందోషసంభవం ॥ సావధూశ్శూద్రకన్యాస్యాత్తత్పతిర్వృషలోపమః । తయోఃపుత్రస్తువృషలః తేషాంతిరస్కరంధ్రువం ॥ మరీచిః ॥ వివాహదివసాద్రాత్రి న్నారభ్య ప్రథమార్తవా ॥ వధూర్యాశేషహోమాత్ప్రాగ్వధూః త్స్యాదశుభానరకగామినా ॥ గౌతమః ॥ వివాహశేషహోమాత్ప్రాగ్వధూర్యా ప్రథమార్తవా । తత్పతిస్సావధూశ్చైవ ప్రాయశ్చిత్తమిహార్హతః ॥ గర్గః ॥ హవిష్మతీరిమా అప్సుర్వధూంతాంస్నాపయేన్ముదా। అన్యైస్తైర్ణసంచ్ఛిద్య తస్మిన్నగ్నౌవిధానతః । సంస్కారాజ్యేనజుహయాద్యుజానేత్ద్వయంముదా । హుత్వాతదాచరేత్కృచ్ఛ్రం పావనంకాయసంజ్ఞితం । ఏవంవైప్రత్యహంకుర్యాత్ పంచమేహనిపూర్వవత్ । స్నాపయిత్వా పరీధాయపూర్వవచ్ఛుద్ధవాససా । పూర్వైర్జుహుయాద్వహ్నౌతత శ్చాంద్రాయణం పృథక్ । కృత్వాతాపాపశుద్ధాస్తామన్యథాదోషసంభవా। తదాసీంనపరిత్యాజ్యా పూర్వంపుష్పవతీనచేత్ ॥ నయోగ్యాహవ్యకవ్యేషుసానారీవృషలీభవేత్ ॥ ప్రాయశ్చిత్తంతదాకృత్వా కర్మకుర్వన్నదోషభాక్॥ ఇతిహేమాద్రౌ వివాహమధ్యేవధ్వాః ప్రథమార్తవదర్శన ప్రాయశ్చిత్తం ॥

(౩౧౬) ఇకనువివాహమధ్యమందు వధువుప్రథమార్తవప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు ॥ వివాహముజరుగుచునుండగ కన్యరజస్వలయయ్యెనేని యట్టికన్యయశూద్రస్త్రీతుల్యురాలగును, దానిభర్త వృషలోపముడగును, వారిపుత్రుడును వృషలుడనబడును, ఈముగ్గురును నరకమును బొందుదురని దేవలుడువచించె. వివాహప్రారంభకాలము మొదలుకొని శేష

హోమకాలమునకులోపల కన్నియరజస్వలయయ్యేనేని యాకన్నియయును దానిభర్తయును నరకమును బొందుదురని మరీచిచెప్పె. గౌతముడును నిటులనే చెప్పి యయ్యిరువురును ప్రాయశ్చిత్తార్హులనియె. వివాహము ప్రారంభమయినది మొదలుకొని శేషహోమకాలమునకులోపల కన్నియరజస్వలయయ్యేనేని యట్టికన్యను, „హవిష్మతీరిమా„ అను మంత్రముచేత స్నానమును జేయించవలయును, పిమ్మట వేరొకవస్త్రమును ధరింపజేయవలయును, అనంతరమందు సంస్కారాజ్యముచేత హోమమును జేయవలయును, పిదప పావనమగు కాయకృచ్ఛ్రమును నాచరింపవలయును, ఇట్లు ప్రతిదినమును జేసి మైదవదినమునందు స్నానమును జేయించి పూర్వోక్తప్రకారముగ వస్త్రమును ధరింపజేసి యగ్నియందు బూర్వమువలె హోమమునుజేసి చాంద్రాయణవ్రతము నాచరించవలయును, ఇవ్విధముగ జేసినయెడల నయ్యిరువురును బరిశుద్ధులగుదురు. అట్టివారలు హవ్యకవ్యాది కర్మలయందు నిషిద్ధులుగానేరరని గర్గుడుచెప్పె ॥

——* ఉద్వాహౌపాసనమధ్యే అగ్నిశాంతి ప్రాయశ్చిత్తమ్. *——

(౩౧౭) అథఉద్వాహౌపాసనమధ్యేలాజహోమాదనంతరం ప్రాగ్వాగ్నిశాంతి ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః ॥ ఉద్వాహౌపాసనాత్పూర్వమనలశ్శాంతిమన్వగాత్ । మహాన్దోషోభవేత్తత్రపత్న్యావాధపరిగ్రహో॥ గౌతమః॥ వివాహేస్వరతావహ్నౌ లాజహోమార్థసంభవః। రాత్రేరౌపాసనాత్పూర్వం శాన్తశ్చేదత్రదోషభాక్ ॥ జాబాలిః ॥ లాజహోమానలోదైవాద్రాత్రేరౌపాసనాదథః। శాంతశ్చేదుభయోర్దోషః ప్రాయశ్చిత్తంవిశుద్ధయే। కుర్యాద్వరస్తదానీం వాహ్యతరాత్రావిశేషతః। తప్తకృచ్ఛ్రంతదాకృత్వా లౌకికాగ్నింసమాహరేత్॥ ప్రతిష్ఠాప్యవిధానేన హ్యాజ్యభాగాంత మాచరేత్। స్రువేణాజ్యంసమాధాయ జుహునేదత్రాహుతీఃపృథక్॥ మహావ్యాహృతయః॥ తతశ్చజుహుయాదత్ర వ్యాహృతిత్రితయంపునః। తిస్రోవ్యాహృతయః॥ తమగ్నింధార్యసత్కృత్వా యుగలాజాంతరంపునః। మంత్రావృత్తిం తతః కృత్వా నతత్రసహదోషభాక్। ఔపాసనంతతఃకృత్వా శుద్ధిమాప్నోతిపూర్వజః॥ ఇతి హేమాద్రౌలాజహోమాదనంతరం ప్రాగ్వాగ్నిశాంతి ప్రాయశ్చిత్తమ్॥

(౩౧౭) ఇంక నుద్వాహౌపాసన మధ్యయందగ్నిశాంతియయ్యేనేని చేయదగిన ప్రాయశ్చిత్తవిధానమును దెలుపుచున్నాడు॥ ఉద్వాహౌపాసనముకంటె బూర్వమందు, అగ్నిశాంతిని బొందెనేని మహాదోషము గలుగు

నని దేవలుఁడువచించె. వివాహానంతరమందు లాజహోమముఁ గొఱకుఁబు ట్టినయగ్నిహోత్రము రాత్రియందలి యౌపాసనకాకమునుపు శాంతినిబొం దెనేని దోషముగలుగునని గౌతముఁడుచెప్పె. లాజహోమానలము దైవ యోగము వలన రాత్రియందలి యౌపాసనమైనపిమ్మట శాంతమైనయెడలవ ధూవరుల కిరువురకును దోషముగలుగును. అట్టి దోషనివారణముకొఱకు వ రుఁడప్పుడే ప్రాయశ్చిత్తము నాచరింపవలయును. అదియెట్లనిన తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొని లౌకికాగ్నిని స్థాపించవలయును. పిమ్మట నాజ్య భాగాంతమును జేయవలయును. స్రువముచేత నాజ్యసమాధానమును జేసి వేరువేరుగ హోమములను జేయవలయును. (మహావ్యాహృతులు) అనం తరమందు వ్యాహృతిత్రితయహోమమును జేయవలయును. పిదప నయ్యా గ్నిధారణను జేసి మంత్రావృత్తిని జేయవలయును. అనంతరమందౌపాసనను జేయవలయును. ఇవ్విధముగ నాచరించినయెడల దోషమేమియును గలుగ నేరదని జాబాలివచించె.

——※ స్థాలీపాకసమయేఽగ్నినాశ ప్రాయశ్చిత్తమ్. ※——

(౩౮౫) అథస్థాలీపాకసమయేఽగ్నిశాంతిప్రాయశ్చిత్తమాహ॥ దే వలః॥ స్థాలీపాకేయదావహ్ని శ్శాంత స్తత్రమహద్భయం॥ తత్రకృత్వా కా యకృచ్ఛ్రం విప్రఃకుర్యాదనంతరం పూర్వోక్తంతత్రకుర్వీత ప్రాయశ్చిత్తం యథాక్రమం। పూర్వోక్తంశవాగ్నినాశ ప్రాయశ్చిత్తవదత్రాపి సర్వంకు ర్యాత్॥ ఇతిస్థాలీపాకేఽగ్నినాశ ప్రాయశ్చిత్తమ్॥

(౩౮౬) ఇఁకను స్థాలీపాకసమయమునం దగ్నినాశమయ్యేనేని చే యఁదగిన ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ స్థాలీపాకసమయము నందనలము శాంతమయ్యేనేని కాయకృచ్ఛ్రము నాచరించి పూర్వోక్త ప్రకా రముగఁ బ్రాయశ్చిత్తమును నాచరింపవలయునని దేవలుఁడు వచించె. అనఁ గాశవాగ్నినాశప్రాయశ్చిత్తమునే యిట్టి విషయమునందుఁగూడ నాచరింప వలయుననుట.

—— స్థాలీపాకాదూర్ధ్వమౌపాసనత్యాగ ప్రాయశ్చిత్తమ్. ——

(౩౮౭) అథాగ్న్యయస్థాలీపాకాదూర్ధ్వం ఔపాసనాత్ప్రాక్ ప త్నీభర్తావా ఉపాధిగ్రస్తస్తదౌపాసనత్యాగ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ స్థాలీపాకాత్పరం రాజన్నుభయోర్హోతృకర్మణి। అథావెనిత్యహోమస్య ప తిఃపత్నీరుజాగ్దితః। తయోరేకతరాభావే నిత్యహోమోత్రదోషభాక్॥ త యోరేకతరంస్వాప్య వ్యాగ్నిసాన్నిధ్యమాదరాత్। మహాసాంతపనంకృత్వా

హ్యాధ్వర్యుర్హోమమాచరేత్॥ సుబ్రహ్మణ్యేన। సమక్షవిషయే పత్నీ ఉద్దేశత్యాగకారికా ॥ తదభావేచాధ్వర్యురేవ ॥ తదాహ కాత్యాయనః॥ సన్నిధౌ యజమానస్స్యాదుద్దేశత్యాగకారకః । అధ్వర్యుస్సన్నిధౌ పత్నీ అధ్వర్యుస్తదనుజ్ఞయా॥ ఇతి ప్రాయశ్చిత్తపురస్సరం॥ నిత్యహోమంకృత్వా తతః పరం శేషహోమంకృత్వా లౌకికాదికంకుర్యాత్॥ ఇత్యాగ్నేయస్థాలీపాకాదూర్ధ్వం శేషహోమాదౌపాసనలోపప్రాయశ్చిత్తం॥

(౩౧౯) ఇకను స్థాలీపాకానంతరమందు, ఔపాసనత్యాగదోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు ॥ స్థాలీపాకానంతరమం దౌపాసనకర్మను జేసికొనని యెడల దోషముగలుగును. ఒకవేళ వధూవరులు రోగాదులచేతఁ బీడితులైరేని యొకరైనను నగ్నిసన్నిధియందుఁ గూర్చుండి హోమమును జేయవలయును. ఇరువురును రోగార్దితులైరేని యధ్వర్యుఁడు మహాసాంతపనము నాచరించి పిమ్మట నౌపాసనకర్మను జరపవలయునని దేవలుఁడు వచించె. కాత్యాయనుఁడును నిటులనే వచించె. నిత్యహోమమునుజేసి పిమ్మట శేషహోమమునుజేసి లౌకికాదికమును జేయవలయును.

—— అన్వారమ్భణీయలోపప్రాయశ్చిత్తమ్. ——

(౩౨౦) అథాన్వారమ్భణీయలోప ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ అథాన్వారమ్భణీయస్య లోపంవిప్రోఽకారమేత్। కుర్యాద్వ్యాహృతిహోమాఖ్యాత్మా పతితోభూన్నసంశయః॥ మార్కండేయః॥ ప్రథమాయాంతుపౌర్ణమాస్యాంవోఢా దేవాహుతీర్యజేత్। అగ్నిస్తథాగ్నావిష్ణుశ్చ సరస్వాంశ్చ సరస్వతీ । అగ్నిశ్చభగినీచైవ స్విష్టకృద్దేవతాస్త్విమాః । ప్రథమే పౌర్ణమాస్యాంతు హ్యన్వారంభణమిష్యతే. యోఽత్ర దేవతాహుత్వా తాస్సర్వా వరదాస్తయోః॥ గౌతమః ॥ ఊఢవధ్వాస్తదారాజన్ ప్రథమె పౌర్ణమీదినే॥ యోయజేద్దేవతాస్సమ్యక్తస్యాయుర్వృద్ధిమన్వగాత్ ॥ మరీచిః ॥ ప్రథమాపౌర్ణమీరాజన్ పరవధ్వాశ్శుభప్రదా । తామకృత్వాఽరోయస్తు తస్యాయుర్లయమెష్యతి । తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తంమనూదితం ॥ బ్రహ్మకృచ్ఛ్రంతదాకుర్యాద్విధాశుద్ధ్యర్థమాదరాత్॥ వధ్వాస్తదర్థఁకథితం మునిభిర్ధర్మదృష్టిభిః । తతోఽన్యస్యాంతథాకుర్యాత్పౌర్ణమీ దేవతాస్త్విమాః॥ అన్యథాదోషమాప్నోతి హ్యాశుభంస్యాత్తమోరితః ॥ ఇతి హేమాద్రౌ అన్వారమ్భణీయలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౨౦) ఇకనన్వారంభణీయలోప ప్రాయశ్చిత్తమును దెలుపుచు

న్నాడు॥ బ్రాహ్మణుండగువాఁడన్వారంభణీయమునకు లోపమును జేయఁగూడదు. ఒకవేళ మూఢతనముచేత లోపము చేసినయెడల పతితుఁడగుటకు సందియములేదని దేవలుఁడుచెప్పె. మొదటిదగు పౌర్ణమాస్యయందు దేవాహుతులను హోమమును జేయవలయును. ప్రథమపౌర్ణమాస్య, అన్వారంభణీయమునకు చితమైనది. ఎవడు దేనియందు దేవతలనుగురించి హోమమును జేయుదురో యాదేవతలందఱును వరదులగుదురని మార్కండేయుడువచించె. గౌతముడును నిటులనేచెప్పె. మరీచియును నీవ్విధముగానేచెప్పి ప్రాయశ్చిత్తమునుగూడ విధించె. అదియెట్లన నన్వారంభణీయహోమమును జేయనియెడల దోషనివారణకొఱకు బ్రహ్మకృఛ్రము నాచరించవలయును. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొననియెడల వధూవరులకు నాయుష్యనాశమగుననియును జెప్పె.

## —— ❋ ప్రతిపద్ధోమలోప ప్రాయశ్చిత్తం. ❋ ——

(౩౨౧) అథప్రతిపద్ధోమలోపప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ ప్రతిపద్ధోమలోపేతుశుక్లేకృష్ణేతథైవచ । మహాంతం దోషమాప్నోతి నరకంచాధిగచ్ఛతి ॥ గౌతమః ॥ ధార్యగ్నియోగృహీహోమ లోపీప్రతిపదోర్ద్వయోః । తస్యాన్యానిష్కృతిర్నాస్తి కాయకృచ్ఛ్రాద్విహద్విజాః ॥ పరాశరః॥ గృహీతాగ్నిహోత్రాణామకుండే ప్రతిపత్పూర్వణోర్ద్వయోః। అగ్నిస్విష్టకృదగ్నిశ్చదేవతెతేనసంత్యజేత్ । త్యజత్యవిహోమాధాత్మా హ్యగ్నిస్తం సంపరిత్యజేత్ । తస్యాగ్నిస్సంపరిత్యాగా ద్విప్రస్యాధోగతిర్భవేత్ ॥ తస్యపాపవిశుద్ధ్యర్థంకాయకృచ్ఛ్రం సమాచరేత్ ॥ హారీతః ॥ ప్రతిపత్సువహ్నిరిధాస్సర్వపాపహాన్నృణాం । ద్విజాహోమంసంపరిత్యజ్య పాతాద్వయ ప్రతిపదం। నరకంయాంతితేఘోరం హోమలోపాదితోమునే॥ ఏతద్దోషవిశుద్ధ్యర్థం। పరలోకజిఘాంసయా। తెషాంవిశుద్ధిరుదితా కాయకృచ్ఛ్రం మహాత్మభిః॥ ఇతిహేమాద్రౌ ప్రతిపద్ధోమలోపప్రాయశ్చిత్తం ॥

(౩౨౧) ఇఁకను ప్రతిపద్ధోమలోప ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ శుక్లకృష్ణప్రతిపత్తులయందు జేయదగిన హోమమును జేయనియెడల వింగుల దోషవంతుఁడగును. కావున నరకలోకమునుబొందుననిదేవలుడువచించె. గౌతముడిట్టిహోమమును ధార్యాగ్నియందాచరించనివాడు కాయకృఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయుననెను. పరాశరుడునునీవ్విధముగానేచెప్పె. ప్రతిపత్తునందలి ప్రతిపత్తునందును సర్వపాపహరమగుహోమమును జేయవలయును. అట్టిహోమమును జేయనివాడు నర

కలోకమును బొందును. కావున దద్దోషపరిహారము కొఱకు గాయకృచ్ఛ్రము నాచరించవలయునని హారీతుడువచించె.

—✽ ఆగ్రయణలోప ప్రాయశ్చిత్తం. ✽—

(౩౨౨) అథాగ్రయణలోపప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ నవధాన్యేసమాయాతే బ్రాహ్మణా బ్రహ్మవిత్తమాః । వ్రీహ్యాదీనాం నవానాంచ శుద్ధ్యర్థంమునిచోదితం। స్థాలీపాకంతదాకృత్వాహుత్వాగ్రయణదేవతాః। శేషంచరుంప్రభుంజీయాద్బ్రాహ్మణైర్బ్రహ్మవిత్తమైః । అన్యథాదోషమాప్నోతి ధాన్యవృద్ధిర్నజాయతే। రక్తస్రావిచాసనేస్యా దతోదోషో మహత్తరః॥ మార్కండేయః॥ ఇంద్రశ్చాగ్నిశ్చవిష్ణుశ్చ విశ్వేదేవామహాబలాః। ద్యౌశ్చైవపృథివీచైవ అగ్నిస్స్విష్టకృదగ్రహీ॥ నవధాన్యేసమాయాతేదేవాంస్త్వేతాన్గృహీయజేత్ । అన్యథాదోషమాప్నోతి లోపేచాగ్రయణేగృహీ॥ వ్యాధిమాన్భవతిక్షిప్రం గుదేరక్తంనిరంతరమితి॥ మరీచిః॥ ఆగ్రయణం ద్విజోలోభాత్పురతాలేతుసంత్యజేత్ । నవేధాన్యేగృహంయాతేసదోషఃపాపభాగ్భవేత్ । తస్యదోషోపశాంత్యర్థంపర్ణకృచ్ఛ్రంసమాచరేత్ ॥ పునస్తదేవకర్తవ్యం శ్యామాకైర్వ్రీహిభిర్నవైః॥ పునస్తదేవేతిహోమాణాంతేవాశ్యామాకైర్నవైర్వ్రీహిభిస్థాలీపాకం కృత్వాపూర్వోక్తదేవతాయజేదిత్యర్థః। దర్శపూర్ణమాసాగ్రయణాన్వారమ్భణప్రతిపత్త్యాలీ పాకాదికం సర్వశాఖాసమమ్ ఏతేషాంపరిత్యాగ ఏతత్ప్రాయశ్చిత్తమేవాపదర్శితమ్ । అన్యథాపూర్వోక్తదోషోభవతీతి తాత్పర్యార్థః॥ ఇతిహేమాద్రౌఆగ్రయణస్థాలీపాకలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౨౨) ఇకను ఆగ్రయణలోప ప్రాయశ్చిత్తవిధానమును దెలుపుచున్నాడు॥ నూతనములును, నవవిధములును నగు ధాన్యములురాగానే బ్రహ్మవిత్తములగు బ్రాహ్మణులు ధాన్యసంశుద్ధి కొఱకు నాగ్రయణదేవతలను గురించి స్థాలీపాకమును జేయవలయును. మిగిలినచరువును బ్రహ్మవిత్తములగు బ్రాహ్మణులతోగూడ భుజించవలయును. ఇవ్విధముగ జేయనివాడు మహాదోషవంతుడగును. రెండవజన్మమునందు రక్తమును స్రవించునట్టి యాసనరోగముగలవాడై పుట్టునని దేవలుడువచించె. మార్కండేయుడును నివ్విధముగానే వచించె: నూతనధాన్యములు రాగానే యాగ్రయణేష్టిని చేయనివాడు మిగుల దోషవంతుడగును. కావున దద్దోషనివారణ కొఱకు పర్ణకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అనంతరమందు నూతనములగు శ్యామాకవ్రీహులచేత నాహోమమునే చేయవలయును. (అన

గా హోమాంతరమందు నూతనములగు శ్యామాకవ్రీహులచేత స్థాలీపాకమునుజేసి ఫలార్థులగు నింద్రాగ్నివిష్ణువిశ్వేదేవాదులనుగురించి హోమమును జేయవలయుననుట) దర్శపూర్ణమాసాగ్రయణాన్వారంభణప్రత్యబ్దస్థాలీపాకాదికము సర్వశాఖీయులకును సమానమేయనియును, వీనినివదలినపుడీప్రాయశ్చిత్తమునే యాచరింపవలయుననియును, చేయనియెడలదోషముగలుగుననియును నెఱుంగవలయును.

—— గృహస్థానాంబ్రహ్మయజ్ఞలోపప్రాయశ్చిత్తమ్. ——

(332) అథగృహస్థానాం బ్రహ్మయజ్ఞలోప ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ బ్రహ్మయజ్ఞపరిత్యాగీ గృహస్థోగృహమాస్థితః। దేవహన్తా సవిజ్ఞేయోదుష్టబ్రాహ్మణఈరితః॥ మరీచిః॥ దేవయజ్ఞఃపితృయజ్ఞః భూతయజ్ఞోన్నృనామకః॥ బ్రహ్మసంజ్ఞశ్చయజ్ఞశ్చ పఞ్చయజ్ఞాఃప్రకీర్తితాః॥ గృహస్థైర్నపరిత్యాజ్యా వేదధర్మపరాయణైః। పఞ్చయజ్ఞా గృహస్థాస్యురన్యథాగృహరక్షిణః। పఞ్చయజ్ఞపరిత్యాగీ బ్రహ్మహేత్యభిధీయతే॥ అతోయజ్ఞోనలోప్తవ్యో బ్రాహ్మణైఃపాపభీరుభిః। గౌతమః॥ బ్రహ్మయజ్ఞమకుర్వాణో విప్రోబ్రహ్మహణోభవేత్॥ సంవత్సరపరిత్యాగే కపాలధ్వజవర్జితమ్। ఏకత్రదివసత్యాగేవ్యాహృతీభిర్హునేద్ఘృతమ్ ॥ దశరాత్రపరిత్యాగే స్నాత్వాశుచిరలఙ్కృతః। విభూతింపఞ్చరూపంచ ఊర్ధ్వపుణ్డ్రంతతఃపఠేత్ ॥ తథామాసపరిత్యాగే ఫలకృచ్ఛ్రంసమాచరేత్ । ఋతుత్రయపరిత్యాగే పక్షమేకంనిరన్తరమ్॥ పఠేదుపనిషద్వాక్యం తథానారాయణంపఠేత్ । మార్తాండోదయమారభ్య యావదస్తంగతోరవిః॥ తావద్విరక్తస్సహసా హవిష్యాశీభవేత్తదా। పక్షమాత్రేణ శుద్ధిస్స్యాన్నాన్యథాశుద్ధిరీరితా॥ వర్షత్యాగే పూర్వముక్తం వ్రతంకృత్వావిశుద్ధ్యతి। సర్వశాఖాసమమేతత్ ॥ ఇతిహేమాద్రౌగృహస్థస్య పఞ్చయజ్ఞలోపప్రాయశ్చిత్తమ్॥

(333) ఇఁకను గృహస్థులకు బ్రహ్మయజ్ఞలోప ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రహ్మయజ్ఞమును వదలినగృహస్థుఁడు దేవహంతయనియును, దుష్టబ్రాహ్మణుఁడనియును దేవలుఁడు వచించె. దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మానవయజ్ఞము, బ్రహ్మసంజ్ఞయజ్ఞము, అనునవి పంచయజ్ఞము లనఁబడును. గృహస్థులగువారీపంచయజ్ఞములను బరిత్యజింపఁగూడదు. పంచయజ్ఞములను వదలినవాఁడు బ్రహ్మహంతయని చెప్పఁబడును. కావునఁ బాపభీరులగు బ్రాహ్మణులు పంచమహాయజ్ఞములను వదలఁగూడదని దేవలుఁడు వచించె. సంవత్సరము బ్రహ్మయజ్ఞ

మును వదలినవాఁడు కపాలధ్వజరహితముగ బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్త
ము నాచరించవలయును. ఒకదినమునమాత్రము బ్రహ్మయజ్ఞమును జేయని
వాడు వ్యాహృతులచేత ఘృతహోమమును జేయవలయును. పదిదినములు
వదలినవాడు స్నానమును జేసి పరిశుద్ధుఁడును నలంకృతుడును నైవిభూతిని, వి
శ్వరూపమును, ఊర్ధ్వచూలమును బరించవలయును. మాసముదినములుబ్ర
హ్మయజ్ఞమును జేయనియెడల ఫలకృచ్ఛ్రము నాచరించవలయును. ఆరుమా
సములకాలము వదలినవాడు, పదునైదుదినములు సూర్యోదయము మొద
లుకొని సూర్యాస్తమయమువఱకును ఉపనిషద్వాక్యములను పఠించవలయు
ను. సంవత్సరకాలము వదలినవాడు పూర్వోక్తప్రాయశ్చిత్తమును జేసికొన
వలయును. ఇదిసకలశాఖాసమమని యెఱుంగవలయునని గౌతముఁడువచించె.

## ఔపాసనపరిత్యాగప్రాయశ్చిత్తమ్.

(౩౩౪) అథౌపాసనపరిత్యాగ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ ఔ
పాసనపరిత్యాగీ సురాపీత్యుచ్యతెబుధైః। నకర్మార్హోభవేదత్రశూద్రఏవ న
సంశయః॥ పరాశరః॥ సాయంప్రాతర్ద్విజోహోమం భార్యాగ్నౌ విధిపూ
ర్వకమ్। కృత్వాలోకమవాప్నోతి దేవమానుష్యదుర్లభమ్॥ మనుః॥ గృహ్యా
గ్నౌప్రత్యహంవిప్రస్సాయంప్రాతరనన్యధీః। తండులైర్వాయవైర్వాపిలోకో
త్కృష్టంసమశ్నుతే॥ మరీచిః॥ పూర్వజశ్చిరాసీనః స్వగృహ్యాగ్నౌ యవై
ర్మదా। అగ్నిమగ్నింసముద్దిశ్య హుత్వాలోకమవాప్నుయాత్॥ అన్యథాదో
షమాప్నోతి ప్రాయశ్చిత్తీభవేదిహ॥ తదాహాపస్తంబః॥ త్రిదినంయదివిప్రో
సావహారేకముపోషయేత్। ఆయాశ్చవ్యాహృతీస్తత్ర ప్రాయశ్చిత్తంసమా
చరేత్॥ ఉపోషణంనకర్తవ్యం పత్న్యైవాస్వేనవానృప। పక్షత్యాగేతుద్వి
దినం మాసత్యాగేదినత్రయమ్॥ మాసంసంవత్సరత్యాగె పయోవా భక్షయే
న్మదా। ఆయాశ్చవ్యాహృతీస్తత్ర హుత్వానోపోషణంతయోః॥ అన్యథారౌర
వంయాతి అగ్నిస్త్యాగాదితస్తతఇతి॥ బహ్వబ్దత్యాగవిశేషమాహ॥మార్కం
డెయః॥ ద్వాయంత్రీన్బహువర్షాన్వా యస్త్యక్త్వాగ్నింప్రవర్తయేత్। సప్రో
మద్యపైస్తుల్యఃప్రాయశ్చిత్తంసమర్హతి॥ మాసిమాసిచతత్కృచ్ఛ్రం ప్రాజా
పత్యంవిశోధనమ్। స్త్రీణాంతదర్ధమిచ్ఛంతి సర్వజ్ఞామునిపుఙ్గవాః॥ తదాహాప
స్తంబః॥ నిత్యోద్భార్యానుగతోవన్థగ్నిశ్శ్రోత్రియాగారాద్వాహార్య ఉపవాస
శ్చాన్యతరస్య భార్యాయాఃపత్యుర్వానుగతోపివోత్తర యావాజుహుయా
న్నోపవసెదితి॥ గౌతమః॥ ఔపాసనంద్విజఃకుర్యాత్సాయంప్రాతస్సమా
హితః। వహ్నేర్లోకమవాప్నోతి నిత్యవగ్నిఃదిగ్రహాత్॥ అకరణే ప్రత్యా

యమాహ॥ జాతుకర్ణిః॥ యస్తుస్థితాయాం భార్యాయా మగ్నింత్యజతిమూఢ ధీః। అనగ్నికఇతిఖ్యాతస్సర్వధర్మబహిష్కృతః॥ ఇతి హేమాద్రౌ ఔపాసన లోపప్రాయశ్చిత్తం॥

(౩౩౪) ఇక నౌపాసనపరిత్యాగ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ఔపాసన కర్మనువదలినవాడు సురాపియని చెప్పబడును. అట్టివాడుఏకర్మకును నర్హుడు గాడనియును, శూద్రుడేయగుననియును దేవలుడు వచించె. సాయంప్రాతఃకాలములయందు శాస్త్రోక్తప్రకారముగ భార్యాగ్నియందు హోమమునుజేయువాడు దేవతలకును, మానవులకును దుర్లభమగు పుణ్యలోకమును బొందునని పరాశరుడువచించె. సాయంప్రాతః కాలములయందు ప్రతిదినమును తండులములచేతనైనను, యవలచేతనైనను హోమమును జేయవలయునని మనువువచించె. మరీచియును నిటులనే చెప్పె. మూడుదినములు భార్యాగ్నియం దౌపాసనను జేయనివాడొక్కదినముపవసించవలయును. మఱియును "అయాశ్చ,, అను మంత్రమును, వ్యాహృతులను ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఉపోషణను జేయనక్కరలేదు. పక్షత్యాగమునందు రెండుదినములు, మాసత్యాగమునందు మూడుదినములు, సంవత్సరకాలము వదలిన యెడల మాసముదినములును, పయోభక్షణను జేయువలయును. మఱియును పూర్వోక్త ప్రాయశ్చిత్తమును బోగొట్టుకొనవలయును. ఇట్లువిధముగ జేయనివాడు రౌరవమనియెడు నరకమునుబొందుననియాపస్తంబుడుచెప్పె. రెండుసంవత్సరములైనను, మూడు సంవత్సరములైనను, ఔపాసననువదలినవారు మద్యపానమునుజేసినవారలతోతుల్యులగుదురు. అట్టివాడు ప్రతిమాసమునందును ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించవలయును. స్త్రీలకీప్రాయశ్చిత్తమునందు సగము నాచరించవలయునని మార్కండేయుడుచెప్పె. సాయంప్రాతఃకాలములయందు,ఔపాసనకర్మనుజేసినవాడుఉత్తమలోకమును బొందునని గౌతముడువచించె. భార్యజీవించియుండగా నగ్నినివదలినవాడు సర్వకర్మబహిష్కృతుడగునని జాతుకర్ణివచించె.

## —— దేవతార్చనపరిత్యాగప్రాయశ్చిత్తమ్. ——

(౩౩౫) అథదేవతార్చనపరిత్యాగప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అస్నాత్వానైవభుంజీత అజప్త్వాగ్నిమపూజ్యచ। సాలగ్రామం హరేశ్చిహ్నం ప్రత్యహంపూజయేద్ద్విజః॥ భాస్కరంగణపంవిష్ణుం శమ్భుంచైవసరస్వతీం। మహాలక్ష్మీం మహాదుర్గాం నిత్యంవిప్రస్సమర్చయేత్। సాలగ్రామశిలాతీర్థం

వేద్యో మనుజోత్తమః॥ తస్య పాపాని నశ్యంతి బ్రహ్మహత్యాదికాని చ॥ మనుః॥ ఆజన్మకృతపాపానాం ప్రాయశ్చిత్త-విశోధనమ్। సాలగ్రామశిలావారి పాపహారి నిషేవ్యతామ్॥ పురుషసూక్తం శఙ్ఖతోయం సాలగ్రామశిలా తథా। సుధోద్భవా చక్రపాణిః పఞ్చతీర్థం ప్రచక్షతే। యః పిబేద్ధారయేన్మూర్ధ్ని నిత్యం పాపాపనుత్తయే॥ సర్వపాపవినిర్ముక్తః ప్రయాతి పరమం పదమ్। ద్విజానామావశ్యకత్వాత్సాలగ్రామశిలార్చనం న త్యాజ్యం। దేవపూజాత్యాగదోషమాహ॥ గౌతమః॥ యో విప్రస్సముత్సృజ్య దేవతార్చనమాదరాత్। స యాతి నరకం ఘోరం యావదాచన్ద్రతారకమ్॥ తస్య పాపవిశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తముదాహృతమ్। బ్రహ్మకృచ్ఛ్రం చరేత్తత్ర దినైకస్మిన్ ద్విజోత్తమః॥ మాసత్యాగే పర్ణకృచ్ఛ్రం వర్షైత్వౌదుమ్బరం చరేత్। సాలగ్రామో యత్ర నాస్తి యత్ర నైవామృతోద్భవా॥ శ్మశానసమ్మితం గేహం స విప్రః పఙ్క్తిదూషకః। గృహస్థబ్రహ్మచారిసన్న్యాసినామేవం॥ ఇతి హేమాద్రౌ దేవార్చనపరిత్యాగప్రాయశ్చిత్తమ్॥

(౩౩౫) ఇకను దేవతార్చన పరిత్యాగ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ స్నానమును జేయకయును, జపమును జేయకయును, సాలగ్రామమును బూజించకయును బ్రాహ్మణుడు భోజనమును జేయగూడదు. భాస్కరుని, గణపతిని, విష్ణువును, శంభువును, సరస్వతిని, మహాలక్ష్మిని, మహాదుర్గను, బ్రాహ్మణుడగువాడు దినదినమందును బూజించవలయును- సాలగ్రామతీర్థమును దినదినమందును పానమును జేసినవాడు సకలపాపరహితుడగునని దేవలుడు చెప్పె- సాలగ్రామశిలార్చనను పురుషసూక్తపఠనమును జేయుచు శసి తత్తీర్థమును పానము చేసిన యెడల సకలపాపములును నశించునని మనువు వచించె- దేవతార్చనను వదలి భోజనమును జేసిన బ్రాహ్మణుడు ఘోరనరకమును బొందును. కావున తద్దోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును- అది యెట్లనిన నొకదినము దేవతార్చనను జేసినవాడు బ్రహ్మకృచ్ఛ్రమును నాచరింపవలయును- మాసము దినములు దేవతార్చనను జేయనివాడు పర్ణకృచ్ఛ్రమును జేసికొనవలయును- సంవత్సరకాలము చేయనివాడౌదుంబరమును నాచరించవలయును- సాలగ్రామములేని గృహము శ్మశానతుల్యమగును- సాలగ్రామమును బూజింపని బ్రాహ్మణుడపాంక్తేయుడగునని గౌతముడు వచించె- గృహస్థబ్రహ్మచారిసన్న్యాసులకు నిటులనే యెఱుంగవలయును-

## ——❋ వైశ్వదేవపరిత్యాగప్రాయశ్చిత్తమ్. ❋——

(౩౩౬) అథవైశ్వదేవపరిత్యాగప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ వైశ్వదేవం ద్విజైఃకార్యమన్నశుద్ధ్యర్థమాదరాత్ । పంచసూనాపనుత్త్యర్థం లవణవ్యంజనైర్వినా ॥ ద్విజస్త్వహరహఃకుర్యాద్వైశ్వదేవం హుతాశనే। అన్యథాదోషమాప్నోతి వృక్షస్స్యాత్కంటకీభువి ॥ అన్నందుష్టం త్రివిధమ్॥ సంస్కారదుష్టం క్రియాదుష్టంస్వభావదుష్టంచేతి ॥ దేవపూజా వైశ్వదేవరహితం సంస్కారదుష్టమ్। ఏకపఙ్త్క్యాం భుంజానే ద్విజేభోజనంత్యక్త్వాగచ్ఛతిసతి శేషైర్యద్భుక్తం తత్క్రియాదుష్టం । స్వభావదుష్టంలశునాదికం॥ తదాహమనుః ॥ సంస్కారదుష్టం విజ్ఞేయం వైశ్వదేవవివర్జితం । ఏకపఙ్త్క్యుపవిష్టశ్చ త్యక్త్వాపాత్రం గతోయది॥ క్రియాదుష్టంహివిజ్ఞేయం తద్భోక్తౄణాంద్విజన్మనాం । స్వభావదుష్టంలశునం విప్రైస్సర్వత్రగణ్యతే॥తస్మాద్వైశ్వదేవమవశ్యంకరణీయం ॥ అన్యథాదోషమాహ ॥ గౌతమః ॥ వైశ్వదేవంపరిత్యజ్యయోభుఙ్త్క్రేసద్విజోత్తమః । మహాన్తం నరకంగత్వా వృక్షోభవతికంటకీ ॥ ప్రాయశ్చిత్తమిదం ప్రోక్తం వైశ్వదేవాపరిగ్రహే । ఫలకృచ్ఛ్రంతదాకృత్వా శుద్ధిమాప్నోతిపూర్వజః । మాసత్యాగేతు చాంద్రంస్యాద్వర్షత్యాగేపతత్యసౌ ॥ అత ఊర్ధ్వంపతితప్రాయశ్చిత్తముక్తం॥ ఇతి హేమాద్రౌ వైశ్వదేవపరిత్యాగ ప్రాయశ్చిత్తం॥

(౩౩౬) ఇకనువైశ్వదేవమునువదలిన దోషనివారణ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు ॥ అన్నశుద్ధికొఱకు లవణరహితముగ పంచసూనాపనోదనముకొఱకును, అన్నశుద్ధికొఱకును, వైశ్వదేవమునుదినదినమును నగ్నిహోత్రమునందు జేయవలయును, ఇవ్విధముగ జేయనివాఁడు భూలోకమునందు కంటకవృక్షమైపుట్టును, వైశ్వదేవాదిరహితమైనయన్నముసంస్కారదుష్టమనబడును, సపంక్తియందున్న వారలనువదిలి భుజించిన యన్నముక్రియాదుష్ట మనబడును, లశునాదిఘూయిష్టమైనయన్నము స్వభావదుష్టమనబడును, కావుననీమూఁడు విధములయినయన్నమును భుజింపగూడదనిమనువువచించె. వైశ్వదేవమును జేయకభుజించినవాఁడు గొప్పదగు నరకమును బొందును. మఱియును రెండవజన్మయందు కంటకవృక్షమైపుట్టును. కావున దద్దోషపరిహారముకొఱకు ఫలకృచ్ఛ్రమును జేసికొనవలయును. మాసము దినములువైశ్వదేవమునువదలి భుజించినవాఁడు చాంద్రాయణ వ్రతము నాచరించవలయును. సంవత్సరానంతరమందు పతితుఁడగునని గౌతముడుచెప్పె. కావున సంవత్సరానంతరమందు పతితప్రాయశ్చిత్తమును జేసికొనవలయును॥

——* పిత్రోరాబ్దికపరిత్యాగప్రాయశ్చిత్తం. *——

(౩౩౭) అథ పిత్రోరాబ్దికపరిత్యాగ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ మృతాహంసమతిక్రమ్య చండాలః కోటిజన్మసు। అతో విప్రైర్న తత్త్యాజ్యం ప్రాణైః కంఠగతైరపి॥ నారదః॥ అధ్వగశ్చాతురశ్చైవ విహీనశ్చ ధనైస్తథా। ఆమశ్రాద్ధం ప్రకుర్వీత హేమ్నా వా ద్విజసత్తమః॥ ద్రవ్యాభావే ద్విజాభావే అన్నమాత్రం తు పాచయేత్। పైతృకేన తు సూక్తేన హోమం కుర్యాద్విచక్షణః॥ అత్యంతద్రవ్యశూన్యశ్చేద్భక్త్యా దద్యాద్గవాం తృణం। స్నాత్వా చ విధివద్విప్రః కుర్యాద్వా తిలతర్పణం॥ అథవా రోదనం కుర్యాదత్యుచ్చైర్విజనే వనే॥ దరిద్రోహం మహాపాపీ వదంతీతి విచక్షణః॥ పరేద్యుశ్శ్రాద్ధకృన్మర్త్యో యో న తర్పయతే పితౄన్। తత్కులం నాశమాప్నోతి బ్రహ్మహత్యాం చ విందతి॥ తద్దోషపరిహారార్థం కుర్యాచ్చాంద్రమనుత్తమం। మాతురప్యేవం॥ అవిభక్తజ్యేష్ఠకనిష్ఠపితృవ్యభ్రాత్రాదిష్వేవం॥ ఇతి హేమాద్రౌ పిత్రోరాబ్దికపరిత్యాగ ప్రాయశ్చిత్తం॥

(౩౩౭) ఇకను దల్లిదండ్రులయొక్క యాబ్దికపరిత్యాగ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ మృతాహమును వదలిన బ్రాహ్మణుడు కోటిజన్మములయందును చండాలుడై పుట్టును. కావున ప్రాణములు కంఠగతములయినపుడుగూడ నాబ్దికమును వదలగూడదని దేవలుడు వచించె. మార్గము నడచుచున్నవాడును, ఆతురుడును, ద్రవ్యరహితుడును, ఆమశ్రాద్ధమునైనను, హిరణ్యశ్రాద్ధమునైనను, ఆచరింపవలయును, ద్రవ్యాభావమునందును, ద్విజాభావమునందును, అన్నమాత్రమును వండి పైతృకసూక్తముచేత హోమమును జేయవలయును. కొంచెమైనను ద్రవ్యము లేనివాడు శ్రాద్ధదినమునందు గోవులకు తృణదానమును జేయవలయును, మఱియును శాస్త్రోక్తప్రకారముగ దిలతర్పణమును జేయవలయును, అట్లుగాదేని విజనమగు వనమునకుబోయి నేను దరిద్రుడనని యును, మహాపాపినని యును రోదనమును జేయవలయును. ఇవ్విధముగ జేసి పరదినమునందు విశ్వేదేవతలను గురించి తర్పణమును జేయవలయును, అట్లు తర్పణమును జేయనియెడల, కులమంతయును నశించిపోవును. కావుననట్టి దోషనివారణకొఱకు సర్వోత్తమమగు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును, తల్లికిని నిట్లులనే యని యెఱుంగవలయును, అవిభక్తులగు జ్యేష్ఠకనిష్ఠభ్రాతృవుల యాబ్దికములయందును నిట్లులనే యని తెలియవలయును॥

——* అర్ఘ్యకవిస్మరణప్రాయశ్చిత్తం. *——

(౩౩౮) అథార్ఘ్యకవిస్మరణ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ విశ్వే

కార్యపరోయస్తు పూర్వజో విస్మరేదిహ । అర్ఘ్యపాత్రోదకంవిప్ర పాణౌ
పైతృకకర్మణి ॥ కర్తా యాతి మహాఘోరం పితరోయాన్త్యధోగతిం। తదన్నం
రాక్షసంప్రోక్తం తద్భోక్తారో విడాశినః ॥ మరీచిః ॥ ప్రవర్తమాన శ్రాద్ధేషు
అర్ఘ్యపాత్రోదకంద్విజః । విస్మరేద్విప్రపాణౌ తు తత్కర్తా నరకంవ్రజేత్॥
భోజనాన్తే యదిస్మృత్వావిప్రేష్వేతేషు తత్తదా । ఆచాన్తేషూపవిష్టేషు త
దాతత్కర్మకృద్ద్విజః ॥ లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య సంస్తీర్య యథావిధి । స్రు
వేణాజ్యంసమాదాయ హుత్వాగ్నౌ విధివద్ద్విజః ॥ సముద్రాయవయునా
యసింధూనాం పతయే నమః । నదీనాగ్ సర్వాసాం పిత్రేఇత్యన్తముక్త్వాచ
తస్రః ఆజ్యాహుతీరేవజుహుయాత్ ॥ భూర్భువఃస్వరితివ్యాహృతిశ్చహుత్వా
విప్రసన్నిధౌ అర్ఘ్యపాత్రాణిపునరాస్తీర్య అర్ఘ్యప్రదానం కృత్వా శేషం
కర్మసమాపయేత్ । తదాహ వసుః ॥ విప్రస్త్వర్ఘ్యమకృత్వాతు పైతృకేవి
ప్రహస్తయోః । పశ్చాద్వా భోజనేకాలే పునస్స్మృత్వాప్రమాదజం॥ ఆచా
న్తేషూపవిష్టేషు విప్రేషుశ్రాద్ధకృత్తదా । లౌకికాగ్నింసమాదాయ పరిస్తీ
ర్యయథావిధి ॥ స్రువేణాజ్యం సమాదాయ సముద్రాయద్వయంస్మరన్ ।చ
తస్ర ఆహుతీర్హుత్వా కర్మశేషం సమాపయేత్ ॥ పార్వణేమప్రకర్తవ్యం
సంకల్పేషునవిద్యతఇతి । సర్వశాఖాసమమిదం ॥ ఇతిహేమాద్రౌ పార్వణ
శ్రాద్ధేవర్ఘ్యవిస్మరణప్రాయశ్చిత్తం ॥

(౩౩౮) ఇకను అర్ఘ్యవిస్మరణప్రాయశ్చిత్త విధానమునుగురించి చె
ప్పుచున్నాడు ॥ పితృకార్యపరుడగు బ్రాహ్మణుడు పైతృకకర్మయందు విప్ర
పాణియందు అర్ఘ్యపాత్రోదకమును వదలుటను మఱచిపోయినయెడలకర్త
యగువాడు ఘోరనరకమునుబొందును, పితృదేవతలుగూడ నధోగతినిబొం
దుదురు- అయ్యన్నము రాక్షసమని చెప్పబడును. అయ్యన్నమునుభుజించినవారు
విడాశినులని చెప్పబడుదురని దేవలుడుచెప్పె. మరీచియును నిటులనేవచించి
ప్రాయశ్చిత్తవిధినిగూడదెల్పె. అదియెట్లనిన లౌకికాగ్నిని బ్రతిష్ఠించి యథాశా
స్త్రముగ బరిస్తరణముచేసి స్రువముచేత నాజ్యమునుగ్రహించి యగ్నియం
దు యథాశాస్త్రముగ హోమమునుజేసి ,,సముద్రాయవయునాయసిం
ధూనాంపతయేనమః । నదీనాగ్ సర్వాసాంపిత్రే,, అనుమంత్రమునుసర్వము
ను నుచ్చరించి నాలుగాజ్యాహుతులను హోమము సేయవలయును, భూ
ర్భువస్స్వః,, అనివ్యాహృతులను హోమముచేసి బ్రాహ్మణసన్నిధియందు,
అర్ఘ్యపాత్రములను పునరాస్తరణమును జేసి యర్ఘ్యప్రదానమునుజేసిమిగిలి
నకర్మను సమాప్తిని బొందింపవలయునని యె. మనువుగూడ నిటులనే వచించి

యీవిషయము పార్వణశ్రాద్ధములయందే గాని సంకల్పములయందు లేదనియె॥

—* పార్వణశ్రాద్ధే అగ్నౌకరణలోప ప్రాయశ్చిత్తమ్. *—

(౩౩౯) అథపార్వణశ్రాద్ధే అగ్నౌకరణలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్రాద్ధకర్తా యదావిప్రో గృహ్యాగ్నౌ దక్షిణే౽నలే। అన్నహోమమకృత్వాతు పార్వణే సముపస్థితే॥ నిరాశాః పితరో యాంతి కర్తా యాతి యమాలయమ్। తచ్ఛ్రాద్ధం రాక్షసంజ్ఞేయం త్రీణ్యేతాని వృథావృథా॥ మార్కండేయః॥ ద్విజః శ్రాద్ధే పార్వణాఖ్యే హ్యకృత్వాగ్నౌ హవిర్యదా। తత్కర్తా నరకం యాతి పితరో యాంత్యధోగతిం॥ తచ్ఛ్రాద్ధం రాక్షసంజ్ఞేయం తస్మాదేతన్న సంత్యజేత్। యది మధ్యే తదా స్మృత్వా భోజనాత్పూర్వమాదరాత్॥ హవిరగ్నౌ తదా కృత్వా యథావిధిపురస్సరం। అంతే వా భోజనే కాలే స్మృత్వా కర్తా యదా ద్విజః॥ విప్రం వాథ ద్వయం వాపి నిమంత్ర్య పునరాచరేత్। తచ్ఛ్రాద్ధం విధివత్కృత్వా న తేన సహ దోషభాక్॥ అంగిరాః॥ ద్విజో౽గ్నౌ పార్వణశ్రాద్ధే హోమం విస్మృత్య దైవతః। పరివేషణకాలే తు స్మృత్వా కృత్వా సమాచరేత్। భోజనానంతరం వాపి స్మృత్వా తత్సమ్పరిత్యజేత్। ఏకం విప్రం ద్వయం వాపి నిమంత్ర్య పునరాచరేత్॥ సాయంకాలేన దోషస్స్యాత్ పైతృకం బలవత్తరం॥ తయోరకరణే దోషమాహ॥ నాస్తిక్యాత్పైతృకత్యాగే హ్యకృత్వాగ్నౌ తదాహతిమ్। నిరాశాః పితరో యాంతి శాపం దత్వా సుదారుణం॥ తత్కర్తా చాంధతామిస్రం తచ్ఛ్రాద్ధం రాక్షసం భవేత్। ద్వయోరేకమకృత్వా చ ద్విజో యది హ వర్తతే॥ స చండాలసమో జ్ఞేయస్సర్వదా తం పరిత్యజేత్। తస్య దోషవిశుద్ధ్యర్థం శిరః కృత్వాథ వాపనం॥ కృచ్ఛ్రమాదం బరం కృత్వా పంచగవ్యేన శుద్ధ్యతి। పునశ్శ్రాద్ధం తతః కుర్యాదన్యథా పతితో భవేత్॥ సర్వశాఖాసమమిదం॥ ఇతి హేమాద్రౌ పార్వణశ్రాద్ధేష్వగ్నౌకరణవిస్మృతిప్రాయశ్చిత్తం॥

(౩౩౯) ఇకను పార్వణశ్రాద్ధమునందు అగ్నౌకరణలోపప్రాయశ్చిత్తమునుగురించి చెప్పుచున్నాడు॥ శ్రాద్ధకర్తయగు బ్రాహ్మణుడు గృహ్యాగ్నికి దక్షిణానలమునందు, అన్నహోమమును జేయనియెడల పితృదేవతలు నిరాశులై పోదురు, మఱియు నాశ్రాద్ధము రాక్షస మనబడును, కర్తయగువాడు నరకమునుబొందునని దేవలుడువచించె. మార్కండేయుడునునిటులనేవచించి భోజనానంతరమం దగ్నౌకరణమును మరచితినేయని స్మరణకు దెచ్చుకొనినయెడల మరలనిరువురు బ్రాహ్మణులనైనను, ఒకరినైనను మంత్రించి శ్రాద్ధము నాచరింప వలయుననియె. అంగిరోమునియును నిటులనేవచించె;

నాస్తిక్యమువలనఁ బితృశ్రాద్ధములయందగ్నౌకరణమును జేయని యెడల పితృదేవతలు నిరాశులై శాపమునొసంగిపోదురు. అట్టి శ్రాద్ధకర్తయంధతామిస్రమను నరకమునుబొందును. ఆశ్రాద్ధము రాక్షసమనఁబడును. మఱియు నాశ్రాద్ధకర్తచండాలసముఁడనఁబడును. కావున నట్టివానిని వదలవలయును. కాఁదేనిప్రాయశ్చిత్తమును జేసి కులమునందుఁ జేర్చికొనవలయును. ఆప్రాయశ్చిత్తవిధి యెట్లనినవివరించుచున్నాఁడు. తద్దోషపరిహారముకొఱకు క్షురకర్మను చేయించుకొని యాదుంబరకృఛ్రము నాచరించి పంచగవ్యప్రాశనమును జేయవలయును. ఇట్లుచేసికొనినపిమ్మట మరలశ్రాద్ధము నాచరించవలయును. లేనియెడల పతితుఁడగును. ఇదిసకలశాఖాసమము.

——✽ శ్రాద్ధపంక్త్యాం-అన్యోన్యస్పర్శనప్రాయశ్చిత్తమ్. ✽——

(౩౪౦) అథశ్రాద్ధపంక్త్యాం-భుంజానానాం ద్విజానామన్యోన్యస్పర్శనే ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ శ్రాద్ధపంక్త్యాంతుభుంజానో బ్రాహ్మణో బ్రాహ్మణంస్పృశేత్ । తదన్నమత్యజన్భుక్త్వా గాయత్ర్యష్టశతంజపేత్ ॥ మార్కండేయః॥ శ్రాద్ధపంక్త్యాం-ద్విజోన్యోన్యం ప్రమాదాత్సంస్పృశేద్యది। తదన్నంనపరిత్యాజ్యం భోక్తృభిశ్శ్రాద్ధకర్మణి॥ పరేద్యుర్భోజనాత్పూర్వంస్నాత్వాశుద్ధేనవారిణా। ఉపవిశ్యతదాకుర్యాదష్టోత్తరశతంమహాత్॥ శ్రాద్ధభోక్తృషువిప్రేషు పతన్త్యుచ్ఛిష్టబిన్దవః॥ తదాప్రక్షాళ్యతందేశం భుక్త్వాన్నంనపరిత్యజేత్। పరేద్యురుదకంస్పృష్ట్వా జపేదష్టోత్తరంశతం ॥ నిపతంతియదాపాత్రేష్విత్రోర్భోజనసంజ్ఞితే॥ బిందవః॥ ప్రక్షాళ్య పూర్వవత్పాత్రం భోజనేతునదోషభాక్ । గాయత్రీంపూర్వవజ్జప్త్వా శుద్ధిమాప్నోతిపూర్వజః ॥ మనుః॥ శ్రాద్ధపంక్త్యాంతుభోక్తారో । ద్విజాయదిపరస్పరం । స్పృశంతిబిందవో వాపి హ్యన్యత్రోచ్ఛిష్టసంజ్ఞకాః॥ కుక్కుటంపతితంశ్వానం దృష్ట్వాన్నంనపరిత్యజేత్। అకుత్సయిత్వాపాత్ర స్థమన్నంభుక్త్వాతతఃపరం। సమ్యక్స్నాత్వా పరేద్యుస్తేజపేయుర్వేదమాతరమ్॥ అష్టోత్తరశతంకృత్వా శుద్ధిమాపుర్నసంశయః॥ అన్యథాదోషవన్తస్తే ద్విజాఃపాపానువర్తినః । శ్రాద్ధపఙ్క్తౌతు భోక్తౄణాందైవేషుభోజనపాత్రేషువా అన్యోన్యోచ్ఛిష్టబిందు రన్యోన్యస్పర్శోవా శునకాదిదర్శనంవా ప్రాప్తం తదాతత్తద్దేశ ప్రక్షాళ్యతత్రశ్రాద్ధసమాప్తిపర్యన్తం భుక్త్వాపరేద్యుస్స్నాత్వాశ్రాద్ధాన్నేజీర్ణేసతి అష్టోత్తరశతగాయత్రీజపంకృత్వాశుద్ధ్యతిసర్వవర్ణసమం॥ ఇతి హేమాద్రౌ శ్రాద్ధభోక్తౄణామన్యోన్యస్పర్శనప్రాయశ్చిత్తమ్॥

(౩౪౦) ఇఁకను శ్రాద్ధపంక్తియందు నొకరినొకరు స్పృశించినదో

షనివారకప్రాయశ్చిత్తవిధానమును దెలుపుచున్నాఁడు॥ శ్రాద్ధపంక్తియందు భోజనమును జేయుచున్న బ్రాహ్మణులొకరినొకరు స్పృశించినయెడల నయ్యన్నమునుమాత్రము వదలక భుజించినూటయెనిమిదిపర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయునని దేవలుఁడువచించె. మార్కండేయుఁడును నిటులనేచెప్పి పరస్పరోచ్ఛిష్టబిందువులువడినపుడుగూడ నిటులనే యాచరింపవలయుననియె. మనువుగూడనిటులనేచెప్పి కుక్కుటపతితశ్వానాదులనుజూచినపుడుగూడ నివ్విధముగానే యాచరింపవలయుననియె. కావుననవ్విధముగ నాచరించనియెడల దోషవంతుఁడగును. శ్రాద్ధపంక్తియందు భోజనమును జేయుచున్నవారలయొక్క దేహములయందైనను, భోజనపాత్రలయందైనను, అన్యోన్యోచ్ఛిష్టబిందుస్పర్శమైనను, పరస్పరస్పర్శమైనను, శునకాదిదర్శనమైనను, సంప్రాప్తమైనయెడల నయ్యెదోషములను ప్రక్షాళనముచేసి శ్రాద్ధసమాప్తివఱకును భోజనముచేసి పరదినమునందు స్నానమునుజేసి శ్రాద్ధాన్నముజీర్ణమైనపిమ్మట నూటయెనిమిదిపర్యాయములు గాయత్రీజపమును జేసినయెడల పరిశుద్ధుఁడగును. ఇదిసర్వవర్ణసమమని తెలియవలయును.

—— పార్వణవిస్మృతి ప్రాయశ్చిత్తం. ——

(౩౮౧) అథపార్వణవిస్మృతిప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ ద్విజోయః పార్వణశ్రాద్ధే పార్వణంవిస్మరేద్యది। శ్రాద్ధహన్తాసవిజ్ఞేయస్సర్వదాతంనభాషయేత్॥ మరీచిః॥ శ్రాద్ధేషుపార్వణేష్వేషు యదివిస్మృత్యభోజయేత్। పరేద్యుశ్శ్రాద్ధకృద్భూయో విప్రశ్శుద్ధిమవాప్నుయాత్॥ కాత్యాయనః॥ యోవిప్రః పార్వణశ్రాద్ధే తద్విస్మృత్యైవ భోజయేత్। పరేద్యుశ్శ్రాద్ధకృత్స్యాత్సోహ్యన్యథా పతితోభవేత్॥ గాలవః॥ ద్విజఃపార్వణశ్రాద్ధేషు యదావిస్మృత్యభోజయేత్। తదైవపతితోజ్ఞేయః పునశ్శ్రాద్ధం సమాచరేత్॥ కాశ్యపః॥ అకృత్వాపార్వణశ్రాద్ధే ద్విజఃపార్వణమాదరాత్। స్వభుక్తైఃపూర్వతస్స్మృత్వా పిండకృద్విప్రసన్నిధౌ॥ శుద్ధిమాప్నోతిసర్వత్రనచేదన్యత్రసంచరేత్। పరేద్యుశ్శ్రాద్ధంకుర్యాదిత్యర్థః॥ మనుః॥ స్వభుక్తైఃపూర్వతస్స్మృత్వా శ్రాద్ధేపార్వణసంజ్ఞితే। పిండస్తదాప్రకర్తవ్యో భుక్త్వాశ్రాద్ధంపరేహని॥ నతత్రదోషోభవతి హ్యన్యథాపతితోభవేత్। ద్వయంవిస్మృత్యమోహేనగచ్ఛేన్నరకమంజసా॥ తద్దోషపరిహారార్థం ఫలకృచ్ఛ్రంసమాచరేత్। కృత్వాకృచ్ఛ్రంపరేద్యుర్వాపునశ్శ్రాద్ధం సమాచరేత్॥ ఇతిహేమాద్రౌపార్వణశ్రాద్ధేషుపార్వణవిస్మృతిప్రాయశ్చిత్తం॥

(౩౮౧) ఇఁకను పార్వణవిస్మృతిప్రాయశ్చిత్తమును గురించి చె

ప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడు పార్వణశ్రాద్ధమునందు పార్వణమును మరిచిపోయినయెడల నట్టివాఁడు శ్రాద్ధహంతయనఁబడునని దేవలుఁడువచించె. ఈపార్వణశ్రాద్ధములయందు పార్వణమునుమరిచిపోయి భోజనమును జేసినయెడల మారునాఁటియందు మరలశ్రాద్ధము నాచరించవలయునని హరీతివచించె. కాత్యాయనుఁడును నిటులనేవచించె. గాలవకాశ్యపులును నీవిధముగానేచెప్పిరి. శ్రాద్ధకర్తభోజనమును జేయకమునుపు పార్వణలోప విషయమును దెలిసికొనెనేని యప్పుడేమరలశ్రాద్ధము నాచరించవలయును. భోజనముచేసినపిమ్మట జ్ఞప్తికివచ్చెనేని పరదినమునందు శ్రాద్ధము నాచరించవలయునని మనువువచించె. ఇవ్విధముగాఁ జేయనియెడల పతితుఁడగును. కావునఁ దద్దోషపరిహారముకొఱకు ఫలకృచ్ఛ్రమునాచరించవలయును. ఇట్టి ఫలకృచ్ఛ్రమునాచరించి పరదినమునందు మరల శ్రాద్ధమునాచరించవలయును.

——— పార్వణభంగబిడాలాదిస్పర్శనేప్రాయశ్చిత్తం. ———

(౩౮౭) అథపార్వణభఙ్గె బిడాలాదిస్పర్శనేప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ పైతృకే పార్వణశ్రాద్ధెపిండనిక్షేపణేయదా। సపిండాద్విదళో భూయాత్తతఃకర్తుస్సహద్భయం॥ హారీతః॥ పార్వణెపైతృకేకర్తాపిండం కృత్వాపృథఙ్ముదా। నిక్షిపెత్పార్వణస్థానె హ్యప్రమత్తోరాభయాతురః॥ తదావిదళితః పిండో భూమౌ రాజన్మహద్భయం। కులహానిఃకర్తృహానిః పుత్రహానిరనన్తరం॥ తస్మాత్కృత్వా పృథక్పూర్వం నిక్షిపెదప్పాత్రతలెముదా॥ దేవలః॥ పిండపక్షెపణెశ్రాద్ధెకర్తాకృత్వాపృథక్సకృత్। నిక్షిపెదప్పాత్రతలెరాజన్నప్రమత్తః ప్రమోదతః॥ తదాభవేద్ద్విధాపిండః కర్తృనాశోభవేదిహ। యదిప్రమాదతఃపిండంబిడాలాదిస్పృశేత్తదా॥ అధోగతిఃపితౄణాంచ స్వస్యహానిశ్చజాయతె॥ యద్వావిదళితఃపిండో బిడాలాద్యైర్విఘాతితః। కర్తుశ్చతత్పితౄణాంచ నరకంచమహద్భయం॥ తద్దోషపరిహారార్థం కృచ్ఛ్రంమాహేశ్వరంచరేత్। బిడాలాద్యైరుపహతె పిండేకృచ్ఛ్రంచపూర్వవత్॥ కృత్వాత్మశుద్ధిస్సర్వపునఃపిండంసమాచరేత్। మార్జారోపహతెపిండెపునఃకరణమర్హతి॥ దోషఏవమహానత్రపిండెవిదళితెక్రమాత్। ఏవమన్యత్రదప్టవ్యం వర్ణత్రయస్య॥ ఇతిహేమాద్రౌపార్వణభంగేబిడాలాదిస్పర్శనప్రాయశ్చిత్తం॥

(౩౮౭) ఇఁకను పార్వణము భంగమైనను, బిడాలాది స్పర్శగలిగినను, జేయఁదగిన ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ శ్రాద్ధకాలమునందుఁ బిండము ద్విదళమైనయెడల కర్తకుహానిగలుగునని దేవలుఁడు వచించె. హారీతుఁడును నిటులనేవచించె. దేవలవచనాంతరమందుఁగూడ నిటులనే చెప్పఁ

బడియె. మఱియును బిడాలాదిస్పర్శగలిగినపుడుఁగూడ కర్తకు హానిగలుఁగునని యును, పితృదేవతలు నరకలోకమును బొందుదురనియును దెలియవలయు ను. కావునఁ దద్దోషపరిహారముకొఱకు మాహేశ్వరకృఛ్రమునాచరింపవ లయును. ఇవ్విధముగ నాచరించి మరల పిండప్రదానమును జేయవలయును. పిండముమార్జారోపహతమయ్యెనేని మరలఁజేయవచ్చును. పిండముబ్రద్దలైన యెడల మహాదోషముగలదు కావున నావిషయమునువర్ణాంతరములయందుఁ గూడఁ జూచికొనవలయును.

## ——— ఆహితాగ్నేరగ్నిలోప ప్రాయశ్చిత్తం. ———

(౩౮౩) అథాహితాగ్నేరగ్నిహోత్రలోప ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ క్రత్వనుష్ఠానదివసా ద్యాజీయవ్యగ్నిహోత్రకం । త్యక్త్వా యోహి ప్రవర్తేత భ్రూణహత్యామవాప్నుయాత్॥ మార్కండేయః॥ యస్మిన్ దినే క్రతుం కుర్యాత్తదారభ్యాగ్నిహోత్రకం । యస్త్యజేన్మన్దబుద్ధిస్స భ్రూణహత్యామవాప్నుయాత్॥ కాత్యాయనః॥ సోమంపిబతియత్త్రైవత దారభ్యానలం యజేత్। యస్త్యజేద్బహుశోవ్యాజా దాలస్యాద్వాద్విజాధమః॥ సయాతి నరకంఘోరం భ్రూణహత్యామవాప్నుయాత్ । దినత్రయేఽగ్నిహోత్రస్య త్యాగేకుర్యాద్విశుద్ధిదం ॥ ప్రాజాపత్యంపక్షమాత్రేతప్తంమాసేఽన్దవంచరే త్। వర్షాదతార్ధ్వంభ్రూణహత్యాప్రాయశ్చిత్తంవిశుద్ధిదం॥ కలౌపంచవివర్జ యేదితిపూర్వముక్తం। ఇదానీంతుఅగ్నిహోత్రత్యాగినాం నరకప్రాప్తిరితి భీత్యాక్రతుర్విప్రైర్నకర్తవ్య ఇత్యుక్తం । తస్మాద్దార్భ్రిహ్మణ్యానివృత్త్యర్థంక్ర తుంకృత్వాగ్నిహోత్రం నసన్త్యజేదితివాక్యార్థః॥ ఇతి హేమాద్రౌఆహి తాగ్నేరగ్నిహోత్రత్యాగప్రాయశ్చిత్తం॥

(౩౮౩) ఇఁకను, ఆహితాగ్నికి నగ్నిలోప ప్రాయశ్చిత్తమును గురించి చెప్పుచున్నాఁడు॥ క్రతుకాలముమొదలుకొని బ్రదికియున్నంతవఱకును నగ్నిహోత్రకర్మ నాచరించవలయును. అట్లు చేయని యెడల భ్రూణహత్యనుబొందునని దేవలుఁడు చెప్పె. మార్కండేయుఁడును నిటులనే చెప్పె. కాత్యాయనుఁడును నిటులనేచెప్పి ప్రాయశ్చిత్తమునుగూడ విధించె. అదియెట్లనిన మూఁడుదినము లగ్నిహోత్రమును వదలినవాఁడు ప్రాజాపత్యకృఛ్రమును జేసికొనవలయును. పదునైదుదినములు వదలిన యెడల తప్తకృఛ్రము నాచరించవలయును. మాసమఁదినములువదలెనేని చాంద్రాయణమునాచరించ ల యును. సంవత్సరానంతరమందుగూడ నగ్నిహోత్రకర్మను వదలినవాఁడు భ్రూణహత్యనుబొందును. కలియుగమునందైదింటినివదలవలయునని పూర్వ

ము చెప్పఁబడె. ఇప్పుడు అగ్నిహోత్రమునువదలినవారికి నరకలోకము వచ్చునని యెడు భయముచేత యజ్ఞమును జేయఁగూడదని చెప్పఁబడె. కావున దార్భార్యపత్యనివృత్తికొఱకు క్రతువును జేసి యగ్నిహోత్రమును వదలఁగూడదు.

——— * దర్శపూర్ణమాసలోపప్రాయశ్చిత్తం. * ———

(३४४) అథదర్శపూర్ణమాసలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ దర్శశ్చపూర్ణమాసశ్చ చతుష్షీసోమయాజినః। తయోర్లోపంనకుర్వీతబహుధా యత్నతశ్చరేత్॥ మార్కండేయః॥ దర్శంచపూర్ణమాసంచసోమయాజీనసంత్యజేత్। త్యక్త్వాయదిప్రవర్తేత చక్షుర్హీనోభవేదలం॥ కాత్యాయనః॥ దర్శంచపూర్ణమాసంచ పక్షయోరుభయోర్యజేత్ । అన్యథాదోషమాప్నోతి మహాపాతకినాంవరః॥ గౌతమః॥ సోమయాజీమహాలోకే అష్టమరాశ్యంశభాక్। దర్శశ్చపూర్ణమాసశ్చ చక్షుషీసోమయాజినః ॥ తయోరేకంపరిత్యజ్యమహాపాపమవాప్నుయాత్ । తద్దోషపరిహారార్థం పథికృన్మఖమాచరేత్॥ హారీతః॥ పక్షయోరుభయోరిష్టిం సోమయాజీనసంత్యజేత్॥ మహాంతంనరకంగత్వా చక్షుర్హీనోభవేద్ధ్రువం॥ తద్దోషపరిహారార్థంపథికృన్మఖమాచరేత్। పశ్చాత్కుర్వీతతామిష్టిం సర్వపాపాపహారిణీం । యద్యైవదర్శపూర్ణమాసయోర్లోపాద్దైవాత్తదైవపథికృన్మఖనహుత్వాపశ్చాదిష్టింసమాచరేత్॥ ఇతిహేమాద్రౌసోమయాజినోదర్శపూర్ణమాసలోప ప్రాయశ్చిత్తమ్॥

(३४४) ఇఁకను దర్శపూర్ణమాసలోప ప్రాయశ్చిత్తవిధానమునుగుఱించి చెప్పుచున్నాఁడు॥ సోమయాజులు దర్శపూర్ణమాసలోపమును జేయగూడదు. ఎవ్విధముచేతనైనను, ఆచరించియే తీరవలయునని దేవలుఁడు చెప్పె. మార్కండేయుఁడును నిటులనేచెప్పి యిట్టి యాపితాగ్ని నేత్రహీనుఁడైపుట్టునని యె. కాత్యాయనుఁడును నిటులనేచెప్పె. సోమయాజి యీశ్వరాంశసంభూతుఁడు. సోమయాజికిదర్శపూర్ణమాసములు నేత్రములు. కావుననా రెంటిలో నొక్కదానినివదలినను మహాపాపమునుబొందును. అందువలన నట్టిదోషనివారణకొఱకు పథికృద్యాగమును జేయవలయునని గౌతముఁడు వచించె- ఉభయపక్షములయందును సోమయాజియగువాఁడు, ఇష్టిని వదలఁగూడదు. వదలినయెడల గొప్పదగు నరకమునుబొందును. మఱియును నేత్రహీనుఁడగును. కావునఁ దద్దోషపరిహారముకొఱకు పథికృద్యాగమును జేసి పిమ్మట నిష్టిని జేయవలయునని హారీతుఁడు వచించె.

— సోమయాజినఆగ్రయణలోప ప్రాయశ్చిత్తమ్. —

(౩౮౫) అథసోమయాజిన ఆగ్రయణలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ నవధాన్యసమాయాతే శరద్యాగ్రయణంచరేత్॥ సోమయాజీతుసంత్యజ్య దేవద్రోహమాచరేత్। శరద్యాగ్రయణంకుర్యాచ్ఛ్యామాకైర్వ్రీహిభిస్తథా॥ ఆగ్రయణం దేవతాతుష్ట్యై సోమయాజీనసంత్యజేత్॥ పరాశరః॥ వర్షేవర్షే శరత్కాలే నవధాన్యసమాగతే॥ బహుదేవోపకారాయ ఇష్టింతత్ర సమాచరేత్॥ గౌతమః॥ ప్రతివర్షంశరత్కాలే శ్యామాకైర్వ్రీహిభిర్నవైః॥ కుర్యాచ్చాగ్రయణంయాజీ బహుదేవోపకారకమ్॥ అకృత్వా నరకంయాతి యావదాభూతసంప్లవమ్॥ తద్దోషపరిహారార్థం కుర్యాత్పథికృతంవశీ। సోమయాజీఆగ్రయణలోపే దర్శపూర్ణమాసలోపప్రాయశ్చిత్తవదత్రాపిపథికృద్యాగేనతద్దోషభాగ్భవతీతి భాష్యకారమతం॥ ఇతి సోమయాజినఆగ్రయణలోపప్రాయశ్చిత్తమ్॥

(౩౮౫) ఇకను సోమయాజికి ఆగ్రయణలోప ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాడు॥ నూతనధాన్యమువచ్చినవెంటనే శరత్కాలమునందు సోమయాజియగువాడు ఆగ్రయణేష్టిని చేయవలయును. ఆగ్రయణమును చేయనివాడు దేవతలకుద్రోహమునుచేసినవాడగును. శరత్కాలమునందు నూతనములయిన శ్యామాకములచేతను వ్రీహులచేతను ఆగ్రయణమునుచేయవలయును. దేవతాప్రీతికొఱకు చేయదగిన ఆగ్రయణమును సోమయాజివిడువగూడదని దేవలుడుచెప్పె. ప్రతిసంవత్సరమునందును నూతనధాన్యమువచ్చినవెంటనే అనేకదేవతోపకారముకొఱకు ఇష్టినిచేయవలయునని పరాశరుడువచించె. ప్రతిసంవత్సరమునందును శరత్కాలమునందు దేవతలకందఱకును మేలునుగలుగజేయునట్టి ఆగ్రయణేష్టినినూతనధాన్యములచేత చేయవలయును. అట్లుచేయనిసోమయాజిప్రళయకాలమువఱకును నరకమును పొందును. కాబట్టిఆదోషశాంతికొఱకు పథికృత్తేష్టినిచేయవలయునని గౌతముడుచెప్పె. సోమయాజియగువాడు ఆగ్రయణలోపమునందు దర్శపూర్ణమాసలోపప్రాయశ్చిత్తమువలెనే ఆగ్రయణలోపమునందుగూడ పథికృదిష్టినిచేసినయెడల దోషరహితుడగునని భాష్యకారులునుచెప్పిరి.

— పిండపితృయజ్ఞలోపప్రాయశ్చిత్తమ్. —

(౩౮౬) అథపిండపితృయజ్ఞలోపప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ సోమయాజీతదాకుర్యాద్యదామాసఃప్రవర్తతే॥ తత్రైవపిండయజ్ఞస్యాకరణం తత్ఫలఘాతుకః॥ గౌతమః॥ మాసిమాసియదాదర్శస్సోమయాజీతదాచరేత్।

ఉద్దిశ్యస్వపితౄన్ సర్వాన్ భుక్తిముక్తిఫలప్రదాన్॥ పరాశరః॥ మాసిమా స్యపరాహ్ణేచ ఉద్దిశ్యస్వపితౄన్సుతః। సోమయాజీతదాపిండాన్ కుర్యా ద్దైవదక్షిణేనలై॥ సతుబ్రహ్మపదంయాతి పితరోయాంతిసద్గతిం। అన్యథాదో షమాప్నోతి నరకాయోపపద్యతే। ప్రమాదాద్దైవయోగాద్వా దక్షిణా గ్నావసంచరేత్॥ పునఃపిండప్రదానేతు యజేద్వైసప్తహోతృకాన్। సప్త హోతారమిత్యర్థః। ప్రాయశ్చిత్తమిదంప్రోక్తం శుద్ధ్యర్థం సోమయాజినః। మాసిమాసిపునఃకార్యం లోపేకృత్వేదమంజసా॥ ఇతి పిండపితృ యజ్ఞలోప ప్రాయశ్చిత్తమ్॥

(౩౮౬) ఇఁకను పింసపితృయజ్ఞలోప ప్రాయశ్చిత్తమును గురించి చెప్పుచున్నాఁడు॥ సోమయాజియగువాఁడు ప్రతిమాసమునందును పిండపితృ యజ్ఞమును జేయవలయును. అయ్యదియనంతఫలదాయకము, దానినాచ రించనియెడల దోషముగలుగునని దేవలుఁడుచెప్పె. గౌతముఁడును నిటులనే చెప్పె. సోమయాజియగువాఁడు ప్రతిమాసమునందలి యపరాహ్ణమునందు ను, దక్షిణాగ్నియందు పిండములను జేయవలయును. అట్లు సేసినవాఁడుస నాతనమగు బ్రహ్మపదమునుబొందును. అట్లుచేయని యెడల నరకలోకము నుబొందును. ప్రమాదమువలననైనను, దైవయోగమువలననైననుదక్షిణాగ్ని యందుఁ జేయనియెడల మరలపిండపితృయజ్ఞమును జేయవలయును. సప్త హోతను యజించవలయును. ఈప్రాయశ్చిత్తమునాచరించనియెడల దోష నివృత్తికానేరదని పరాశరుఁడుచెప్పె.

—— సోమసూర్యోపరాగేసాగ్నేస్సోమయాజినఃకర్తవ్యమ్. ——

(౩౮౭) అథసోమసూర్యోపరాగయోః విద్యమానాగ్నేఃసోమయా జినః కర్తవ్యమాహ॥ దేవలః॥ సూర్యసోమోపరాగేషు సోమయాజ్యగ్ని హోత్రవాన్। గార్హపత్యేసమిద్ధేగ్నౌస్రుచాహుతిద్వావిధానతః॥ మార్కం డేయః॥ సూర్యసోమోపరాగేషు స్నాత్వాయాజీప్రయత్నతః॥ మోక్షస్నా నంపునఃకృత్వా మౌనమాస్థాయసత్వరం। గార్హపత్యంసమిద్భిశ్చ ప్రజ్వా ల్యాజ్యంస్రుచోద్వహాన్। సూర్యోపరాగేజుహుయాదుదుత్యంచిత్రమిత్యృ చా॥ ఉపస్థాయతతఃపశ్చాన్నత్వాస్తుత్వావిసర్జయేత్। ఏవంకృత్వా తదా యాజీసూర్యలోకమవాప్నుయాత్। సోమోపరాగేజుహుయాదాప్యాయ స్వేతిమంత్రతః॥ సంతేపయాంసిచపునర్హుత్వాచాజ్యాహుతిద్వయం। తత శ్శుద్ధిమవాప్నోతి సోమయాజీమహాసిహా॥ జాబాలిః॥ గ్రహణేచోభయో రాజ న్నగ్నిర్వీర్యంతు యుంగతం। రాహుస్పృష్టిరయోః పీడా హ్యగ్నౌ సంక్రమ్యతిష్ఠ

తి। సోమయాజ్యష్టమూర్త్యంశః పుష్పవంతౌ తథానృప। అతో హోమః ప్రకర్తవ్యో యజ్వభిర్యత్నతో నృప। ఆత్మనశ్చాగ్నిహోత్రస్య పునర్వీర్యబలాప్తయే॥ సోమయాజిన స్త్వష్టమూర్తిత్వమస్తీత్యుక్తమ్॥ భవిష్యోత్తరే॥ పృథివీ సలిలం తేజో వాయురాకాశమేవచ। సూర్యాచంద్రమసౌ సోమయాజీ చేత్యష్టమూర్తయః॥ ఇతిసూర్యసోమోపరాగే యజ్వభిః కర్తవ్యాంశలోప ప్రాయశ్చిత్తం॥

(౩౪౭) ఇకను సోమోపరాగములయందు; అగ్నిహోత్రనిష్ఠుడగు సోమయాజిచేయదగినవిధానమును చెప్పుచున్నాడు॥ సూర్యసోమోపరాగములయందు సోమయాజియగువాడు స్రుక్కుచేత గార్హపత్యాగ్నియందు శాస్త్రోక్తప్రకారముగ హోమమును జేయవలయునని దేవలుడు చెప్పె. సోమయాజిసూర్యోపరాగములయందు స్నానమునుజేసి పిమ్మట మోక్షస్నానమునుగూడ జేయవలయును. పిమ్మటగార్హపత్యాగ్నిని సమిత్తులచేత బ్రజ్వలింపజేసి "ఉదుత్యంచిత్రం,, అను ఋక్కుచేత హోమమును జేయవలయును. అనంతరమందుసస్థానమునుజేసి వదలవలయును. ఇవ్విధముగ జేసినయెడల సూర్యలోకమునుబొందును. సోమోపరాగమునందు "ఆప్యాయస్వ,, అనుమంత్రముచేత హోమమునుజేయవలయును. పిమ్మట నాహుతిద్వయమును జేసినయెడల పరిశుద్ధతగలుగునని మార్కండేయుడు చెప్పె. సూర్యసోమోపరాగములయం దగ్నినిర్వీర్యుడగును. రాహుస్పర్శయందు చంద్రసూర్యులకు గలిగిన పీడయగ్నిహోత్రమునకును గలుగును. సోమయాజియును, చంద్రసూర్యులును నీశ్వరాంశసంభూతులు. అందువలన సోమయాజియగు సూర్యసోమోపరాగములయందు దప్పక హోమమునుజేయవలయును. ఇవ్విధముగ జేసినయెడల సోమయాజికిని, అగ్నిహోత్రమునకును బలముగలుగునని జాబాలివచించె. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, సోమయాజి, అను నెనిమిదియును నీశ్వరాంశలని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె.

(౩౪౮) అథాన్వాధానేష్టిమధ్యే సోమయాజినో వ్రతలోప ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥

(౩౪౮) ఇకను అన్వాధానేష్టి మధ్యయందు సోమయాజికివ్రతలోప ప్రాయశ్చిత్త విధానమును గురించి చెప్పుచున్నాడు ॥

——* గృహస్థధర్మాతిక్రమప్రాయశ్చిత్తమ్. *——

(౩౪౯) అథగృహస్థధర్మాతిక్రమ ప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః ॥

గృహస్థస్యపదాచారం వక్ష్యామిశృణుతత్వతః । యంశ్రుత్వా సర్వపాపే
భ్యో ముచ్యతేనాత్రసంశయః ॥ వివాహాదిషువిప్రస్య కర్తవ్యంయచ్ఛృణుష్వ
మే । యజ్ఞోపవీతద్వితయం సోత్తరీయంచధారయేత్ ॥ సువర్ణకుండలేచైవ
ధౌతవస్త్రద్వయంతథా । అనులేపనలిప్తాంగః కృత్తకేశనఖశ్శుచిః । ధార
యేద్వైణవందండం సోదకంచకమండలుం । ఉష్ణీషమమలం ఛత్రం పాదుకే
చాప్యుపానహౌ । ధారయేత్పుష్పమాలాంచ సుగంధంప్రియదర్శనం ॥ ని
త్యంస్వాధ్యాయశీలస్స్యాద్యథాచారం సమాచరేత్ ॥ పరాన్నంనైవభుం
జీత పరవాదంచ వర్జయేత్ ॥ పాదేనాక్రమేత్పాద ముచ్ఛిష్టంనైవలంఘ
యేత్॥ నసంహతాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనశ్శిరః । పూజ్యం
దేవాలయంచైవ నాపసవ్యం వ్రజేద్ద్విజః । దేవార్చనవ్రతస్నాన జపహోమా
ర్చనాదిషు ॥ నభవేన్ముక్తకేశశ్చ నైకవస్త్రధరస్తథా ॥ నారోహేదు
ష్ట్రయానంచ శుష్కవాదంచ వర్జయేత్ ॥ అన్యస్త్రియంనగచ్ఛేచ్చపైశున్యం
పరివర్జయేత్ । నదుర్జనైస్సహావసేన్నాశాస్త్రంశృణుయాత్తథా । నాపస
వ్యంవ్రజేద్విప్రమశ్వత్థం చతుష్పథం । అసూయాంమత్సరంచైవ దివాస్వాపం
చవర్జయేత్ ॥ నవదేత్పరపాపాని స్వపుణ్యంనైవకీర్తయేత్ । స్వవయశ్చ
స్వనక్షత్రం నామచైవాతిగోపయేత్ ॥ ఆసవద్యూతగీతేషు నరస్తునరతించ
రేత్ ॥ ఆర్ద్రాస్థిచతథోచ్ఛిష్టం శూద్రంచపతితంతథా । నర్తంచకితవంస్పృ
ష్ట్వాసచేలంస్నానమాచరేత్ । చితించచితికాష్ఠంచయూపంచండాలమేవచ।
స్పృష్ట్వాదేవలకంచైవ సవాసాజలమావిశేత్ । దీపఖట్వాతనుచ్ఛాయా కేశ
వస్త్రనఖోదకం । అజమార్జారరేణుశ్చ హంతిపుణ్యంపురాతనం। స్నానం
రజకతీర్థేషు భోజనంగణికాగృహే ॥ నాపితస్యగృహేక్షౌరంహంతిపుణ్యం
పురాకృతం । ద్వావిప్రౌవిప్రమగ్నించదంపత్యోర్గురుశిష్యయోః ॥ నందిశంక
రయోర్మధ్యే హంతిపుణ్యంపురాకృతం । శూర్పవాతం ప్రేతధూమం తథా
శూద్రాన్నభోజనం । వృషలీపతిసంగంచదూరతఃపరివర్జయేత్ । అసచ్ఛా
స్త్రాదిగమనం ఖాదనంనఖకేశయోః । తథైవనగ్నశయనం సర్వదా పరివర్జ
యేత్ । గ్రామశ్వత్థంసభాంచైవ తథైవచచతుష్పథం । దేవతాయతనంచై
వనాపసవ్యంవ్రజేద్ద్విజః ॥ శిరోభ్యంగావశిష్టేన తైలేనాంగం నలేపయేత్।
తాంబూలమశుచిర్నాద్యాత్తథాసుప్తంనబోధయేత్॥పర్ణమూలేభవేద్వ్యా
ధిఃపర్ణాగ్రేపాపసంభవః । చూర్ణపర్ణంహరేదాయుస్సిరాబుద్ధివినాశినీ॥నా
శుద్ధోగ్నింపరిచరేన్న పూజాంగురుదేవయోః । నవామహస్తేనైకేనపిబేత్స్వ
క్త్రేణవాజలం । నచాక్రమేద్గురోశ్ఛాయాం తదాజ్ఞాంచనలంఘయేత్ । న

నింద్యాద్యోగినాసిప్రాజ్ఞ వ్రతినోపియతీశ్వరాన్ । పరస్పరస్యకర్మాణికదా
చిన్నచరేద్ద్విజః । దర్శేచపౌర్ణమాస్యాంచ యాగంకుర్యాద్యథావిధి । ఔ
పాసనంచహోతవ్యం సాయంప్రాతర్ద్విజాతిభిః । ఔపాసనపరిత్యాగీ సు
రాపీత్యుచ్యతేబుధైః ॥ అయనేవిషువేచైవ యుగాదిషుచతుర్ష్వపి । దర్శేచ
ప్రేతపక్షేచ శ్రాద్ధంకుర్యాద్గృహీద్విజః ॥ మన్వాదిషుమృతాహేచాష్టష్ట
కాదిషుసత్తమః । నవధాన్యేసమాయాతే గృహీశ్రాద్ధంసమాచరేత్ । శ్రో
త్రియేగృహమాయాతే గ్రహణేచంద్రసూర్యయోః ॥ పుణ్యక్షేత్రే పుణ్యతీర్థే
గృహీశ్రాద్ధంసమాచరేత్ । యజ్ఞోదానంతపోహోమ స్స్వాధ్యాయఃపితృ
తర్పణం । వృథాభవతిరాజేంద్ర ఊర్ధ్వపుండ్రం వినాకృతం । ఇత్యేవమా
దయోధర్మా గృహస్థస్యసమీరితాః । తేషాంవ్యతిక్రమేణైవరాజన్ ప్రాయ
శ్చిత్తీభవేద్ద్విజః ॥ మరీచిః ॥ ధర్మాణాం వ్యతిక్రమేవిప్రో నశుద్ధ్యతికదా
చన ॥ అశుద్ధస్యవృథాకర్మ చర్మణాచ్ఛాదితోయథా ॥ నిష్కృతిస్సస్య నైవ
స్యాద్యజ్ఞైరిష్ట్వామహాధనైః । ఏతేషాంత్యాగమాత్రేణ విప్రోదోషమవా
ప్నుయాత్ । తతశ్శాస్త్రత్వమాయాతితస్మాదేతాన్నసంత్యజేత్ । ఏతేషాం
వ్యతిక్రమేప్రాయశ్చిత్తమాహ ॥ మనుః॥ బ్రాహ్మేముహూర్తేచోత్థాయ
శౌచాచమనపూర్వకం । దంతాన్సంశోధ్యయత్నేన క్షాళ్యాద్భిర్ముఖంద్వి
జః । స్నాత్వావాదేహశుద్ధ్యర్థం ధౌతంవాపరిధాయచ । పుండ్రాదికంతదా
ధృత్వా మానసంస్నానమాచరేత్ ॥ ప్రాతస్సంధ్యాముపాసీత హ్యర్ఘ్యదా
నపురస్సరం । మంత్రైష్షోడశభిస్సమ్యక్ జ్ఞాత్వార్షమేవ్ఛంబుభిశ్శిరః । మంత్రేణపూ
ర్వంక్షిపేదర్ఘ్యంసూర్యస్యాభిముఖోజలే ॥ సూర్యస్యాభిముఖోభూత్వా
జప్త్వావై వేదమాతరం । ద్విజస్యయావతీసంఖ్యా తావజ్జప్త్వానదోషభాక్ ।
బ్రహ్మచారీగృహస్థశ్చశతమష్టోత్తరంజపేత్ ॥ వానప్రస్థో యతిశ్చైవ సహ
స్రాధికంజపేత్ । ఏవంప్రభావాసాసంధ్యా సర్వపాపప్రణాశినీ ॥ సం
ధ్యాయాస్సన్త్యాగాచరణం తదుత్పత్తించాహ॥ గౌతమః॥ పితామహఃపితౄం
స్సృష్ట్వామూర్తింతామత్ససర్జహ । తదాప్రభృతిసాదేవీ సంధ్యారూపేణ
పూజ్యతే ॥ ఏతాంసంధ్యాంయతాత్మానో యేతుదీర్ఘముపాసతే ॥ దీర్ఘా
యుషోభవిష్యంతి నీరుజఃపాండునందన ॥ సమ్యక్సంధ్యాచరణేకాలమాహ॥
కశ్యపః ॥ ఉత్తమాతారకోపేతా మధ్యమాలుప్తతారకా । నీచాస్యాదుద
యాదూర్ధ్వం ప్రాతస్సంధ్యాత్రిధామతా । కాలేనాచరితాయాస్యా త్సాస
ర్వార్థఫలదాయినీ । అకాలాచరితాసంధ్యా వంధ్యానారీవనిష్ఫలా । తస్మా
త్సూర్యోదయాత్పూర్వం ప్రాతస్సంధ్యాంసమాచరేత్ । పూర్వోక్తదోష

నిస్సృక్తః ప్రయాతిపరమంపదం ॥ తథాచశ్రుతిః ॥ యదహ్నాత్కురుతేపాపం తదహ్నాత్ప్రతిముచ్యతే ॥ యద్రాత్ర్యాత్కురుతేపాపం తద్రాత్ర్యాత్ప్రతిముచ్యతఇతీతి । సంధ్యైవసమ్యగాచరితా సర్వాఘౌఘనికృంతనీభవతి। తావత్కాలంతత్రైవమనస్సమాధాయ సంధ్యాంసమాచరేత్। సర్వేషాంపూర్వోక్తానాం గృహస్థధర్మాణాం ప్రమాదాదతిక్రమేణ సంధ్యైవప్రాయశ్చిత్తంనాన్యత్ ॥ అతఏవ ద్విజాతీనాం సంధ్యాకర్మైవ బలవత్తరం ॥ ఇతిహేమాద్రౌగృహస్థధర్మాతిక్రమే ప్రాయశ్చిత్తమ్ ॥

(౩౪౯) ఇకను గృహస్థధర్మాతిక్రమ ప్రాయశ్చిత విధానమును జెప్పుచున్నాడు ॥ గృహస్థాశ్రమ ధర్మములనువిడిచినవాడు పుణ్యలోకమునుబొందును. వివాహాదులయందు బ్రాహ్మణుడు రెండుయజ్ఞోపవీతములను ధరించవలయును, సువర్ణకుండలములను, ధౌతవస్త్రములను ధరించవలయును, అనులేపనలిప్తాంగుడును ఛేదితకేశనఖములు గలవాడును, పరిశుద్ధుడును వైవేణవ దండమును, ఉదకముతోగూడిన కమండలమును, ఉష్ణీషమును, నిర్మలమగు ఛత్రమును, పాదుకలను, పుష్పమాలికను,ధరించవలయును, ఆచారానుసారముగ దినదినమందును స్వాధ్యాయశీలుడుగావలయును, పరమాన్నమునుభుజింపగూడదు, పరవాదమును వదలవలయును, పాదముచేత పాదమునాక్రమింపగూడదు, ఉచ్ఛిష్టమునువదలగూడదు, రెండుచేతులచేతను శిరస్సునుగోకికొనగూడదు. పూజ్యమగు దేవాలయములోని కపసవ్యముగబోగూడదు. దేవార్చన, వ్రత, స్నాన,జప, హోమార్చనాదులయందు ముక్తకేశుడును నొక్కవస్త్రముగల వాడును నైయుండగూడదు, ఉష్ట్రమునధిష్ఠింపగూడదు శుష్కవాదమును వదలవలయును, పరస్త్రీలనుబొందగూడదు, పైశున్యమునువదలవలయు, దుర్జనులతో సహవాసమును జేయగూడదు, అశాస్త్ర విషయములనువినగూడదు, అశ్వత్థమునకును, బ్రాహ్మణునకును, చతుష్పథమునకును నపసవ్యముగబోగూడదు,అసూయను, మత్సరమును పగటియందలి నిద్రనువదలవలయును, పరులపాపములను జెప్పగూడదు స్వపుణ్యమును గొనియాడగూడదు, తనదువయస్సును, తనదునక్షత్రమును,తనదునామమును బ్రకటింపగూడదు, ఆసవద్యూతగీతముల యందు ప్రియమును బొందగూడదు. తడి మొముకను, ఉచ్ఛిష్టమును, శూద్రుని. పతితుని, నర్తకుని, కితవుని, స్పృశించినయెడల సచేల స్నానమును జేయవలయును, చితిని, చితికాష్ఠమును, యూపమును, చండాలుని, దేవలకుని, స్పృశించినపుడుగూడ సచేల స్నానమును జేయవలయును, ... ము, మంచ

ముయొక్క-యు, శరీరము యొక్క-యు, ఛాయ, కేశవస్త్రము, నఖోదక ము, మేక, మార్జాలము, వీనియొక్క రేణువును, పూర్వపుణ్యమును నశించిపో వును. చాకిరేవునందలిస్నానము, భోగముదానియింటియందలి భోజనము, మంగలవానియింటియందలిక్షౌరము, పూర్వజన్మమునందలి పుణ్యమునుగూడ నశింపఁజేయును. ఇరువురుబ్రాహ్మణులమధ్యనుబోవుట, అటులనే నిప్పునుదీసి కొనిపోవుట, దంపతులకు మధ్యమునందుఁబోవుట, గురుశిష్యులకునడుమనుబో వుట, నందిశంకరులకునడుమనుబోవుట, అనునవి పూర్వపుణ్యమును నశింప జేయును. చేటగాలి, ప్రేతధూమమును, శూద్రాన్నభోజనమును, వృషలీప తిసంబంధమును, దూరముగవదలవలయును. అసచ్ఛాస్త్రములను జదువుట, నఖములను, కేశములనుభుజించుట, నగ్నశయనము, అనువానినివదలవలయు ను. గోవునకును, అశ్వత్థమునకును, సభకును, చతుష్పథమునకును, దేవతా యతనమునకును, నపసవ్యముగఁబోఁగూడదు. శిరోభ్యంగావశిష్టమైనతైలము చేత శరీరమును లేపనముచేసికొనఁగూడదు. అపరిశుద్ధుడై తాంబూలమును భుజింపగూడదు. అటులనే నిద్రనుబొందువానిని మేల్కొలుపగూడదు. తను లపాకుయొక్క యగ్రమునందు వ్యాధియుండును. పర్ణాగ్రమునందు పాప ముండును. చూర్ణపర్ణము అయుష్యమును హరించును. ఈనెలుబుద్ధినినశింప జేయును. అపరిశుద్ధుడై యగ్నిపరిచర్యను గురుదేవపూజలను జేయగూడ దు. ఒకటటగునేదమచేతిచేతనైనను, నోటిచేతనేమైనను, జలపానమును జేయవలయును. గురుచ్ఛాయను, గుర్వాజ్ఞను, అతిక్రమింపగూడదు. రోగు లను, విప్రులను, వ్రతస్థులను, యతీశ్వరులను, నిందింపగూడదు. ఒకరికృత్య ములనొకరుచెప్పగూడదు. దర్శపౌర్ణమాస్యలయందు శాస్త్రోక్తప్రకారము గ యాగమును జేయగూడదు. సాయంప్రాతఃకాలములయందు ఔపాస నాగ్నియందు హోమమునుజేయవలయును. ఔపాసనమును వదలినవా డు సురాపియని చెప్పబడును. అయనములయందును, విషువునందును, యు గాదులయందును, దర్శయందును, ప్రేతపక్షమునందును, శ్రాద్ధమును జేయ వలయును. మన్వాదులయందును, మృతదినమునందును, అష్టకాదులయందు ను, నూతనధాన్యములువచ్చినపుడును, గృహస్థుడు శ్రాద్ధము నాచరింపవల యును. శ్రోత్రియుడు గృహమునకువచ్చిన సమయమునందును, సూర్యసో మోపరాగములయందును, పుణ్యక్షేత్రమునందును, పుణ్యతీర్థమునందును, గృహస్థుడు శ్రాద్ధమునాచరించవలయును. యజ్ఞము, దానము, తపస్సు, హోమము, స్నానము, పితృతర్పణము, అనువాని నూర్ధ్వపుండ్రము

ను ధరింపక చేసిన యెడల నిష్ఫలములగును. ఇట్టిధర్మములకు వ్యతిరిక్తముగ సంచరించిన గృహస్థుడు ప్రాయశ్చిత్తీయుడగునని దేవలుడు చెప్పె. బ్రాహ్మణుడు సద్ధర్మములకు వ్యతిరిక్తముగ సంచరించిన యెడల పరిశుద్ధుడు గానేరండు. అపరిశుద్ధుడై చేసిన కర్మలన్నియును వ్యర్థమగును. అట్టివానికి ప్రాయశ్చిత్తమునువిధింపవలయును. ప్రాయశ్చిత్తమును జేసికొననియెడల శూద్రత్వమును బొందుననిమరీచివచించె. బ్రహ్మనామకముహూర్తమునందు నిద్రను మేల్కొంచి యాచమనమును జేసి దంతములను శోధించి ముఖప్రక్షాళనమును జేసికొనవలయును. పిదపదేహశుద్ధికొరకు స్నానమును జేసి ధౌతవస్త్రమునుగట్టికొని పుండ్రికమునుధరించి మానసమను స్నానము నాచరింపవలయును, అనంతరము దర్భజ్ఞానపురస్సరముగ సంధ్యావందనమును జేయవలయును, పదునగుమంత్రముల నుచ్చరించుచు నుదకమును శిరస్సున బ్రోక్షించవలయును, పిమ్మట సూర్యాభిముఖుడై యర్ఘ్యమును నొసంగవలయును, అనంతరమందు సూర్యాభిముఖుడై గాయత్రీమంత్రమును జపించవలయును, బ్రహ్మచారియు. గృహస్థుడును, నూటయెనిమిది పర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. వానప్రస్థుడును, యతియును, వేయిపర్యాయములుజపించవలయును, ఇట్లువిధముగ సంధ్యావందనమును జేసినయెడల సర్వపాపములును నశించునని మనువువచించె. బ్రహ్మదేవుడుముందుగ విశ్వదేవతలను సృజించి పిమ్మటనొక్కదేవిని సృజించె. అద్దేవి యది మొదలుకొని సంధ్యారూపముచేత బూజింపబడుచున్నది. ఇట్టిసంధ్యాదేవిని, ఎవ్వరునియతాత్ములై పూజించుచున్నారో యట్టివారు దీర్ఘాయుష్మంతులున్నునిరోగులునగుచున్నారని గౌతముడుచెప్పె. ప్రాతఃకాలమునందు నక్షత్రములుండగా జేసినసంధ్యావందన ముత్తమము. నక్షత్రములులోపించిన తర్వాత జేసిన సంధ్యావందనము మధ్యమము, సూర్యోదయముగాక మునుపటిసంధ్యావందనమునీచమైనది, సరియగుకాలమునందు జేసిన సంధ్యావందనముసంపూర్ణఫలమునిచ్చును, అకాలమునందాచరింపబడిన సంధ్యావంధనము, వంధ్యాస్త్రీవలె నిష్ఫలమగును, కావున సూర్యోదయమునకు బూర్వము సంధ్యావందనమును జేసినవాడు ఘోరోక్తదోషమును బోగొట్టుకొని పరమపదమునుబొందునని కశ్యపుడు చెప్పె. ఏపగటియందుపాపమునుజేయుచున్నాడో యాపాపమును నాపగలేనశింపజేయుచున్నది. ఏరాత్రియందు పాపమును జేయుచున్నాడో యాపాపమునారాత్రియేపోగొట్టుచున్నది. లేకపగటియందేపాపమును జేయుచున్నాడో యా పాపమా పగటియందే పోగొట్టబడుచు

న్నది. రాత్రియందు జేసిన పాపమును జేయుచున్నాడో యాపాపమును రాత్రియేన శింపజేయుచున్నది. (అనగా సంధ్యావందనకర్మయిట్టి కార్యమును జేయుచు న్నదనుట) చక్కగనాచరింపబడిన సంధ్యావందనముసకలపాపములనునశిం పజేయుచున్నది. కావునసకాలమునందుమనస్సునునిశ్చలముగ జేసి సంధ్యావం దనమును జేయవలయునని వేదమునందుగూడ జెప్పబడెను. పూర్వోక్తముల యినగృహస్థులకు బ్రమాదమువలన హానికలిగినయెడల సంధ్యావందనమే ప్రాయశ్చిత్తముగానివేరొక ప్రాయశ్చిత్తమక్కరలేదు. కావునద్విజులకు సం ధ్యావందనకర్మయేయుత్తమమైనది.

——— ❀ మానసస్నానవిధిః. ❀ ———

(౩౫౦) అథసర్వవర్ణోప కారార్థంమానసస్నానమాహ॥ దేవలః॥ ఖస్థితంపుండరీకాక్షం చిన్తయేత్పురుషోత్తమమ్॥ అనన్తాదిత్యసంకాశంవాసు దేవంచతుర్భుజం। శంఖచక్రగదాపద్మధారిణంవనమాలినం। ధ్వజవజ్రాంకు శైర్లక్ష్యపాదపద్మంసునిర్మలం। తత్పాదోదకజాంగంగాం నిపతంతీం స్వమూ ర్ధని। చిన్తయేద్బ్రహ్మరంధ్రేణ ప్రవిశంతీంస్వకాంతనుం। తయాసంక్షాళ యేత్సర్వ మంతర్దేహగతంమలం।తత్క్షణాద్విరజామత్త్యోజాయతేస్ఫటికోప మః॥ ఇదంమానసికంస్నానం ప్రోక్తంహరిహరాదిభిః। సార్ధత్రికోటితీర్థేషు స్నానాత్కోటిగుణాధికం॥ యోనిత్యమాచరేదేవం సవైనారాయణస్మృ తః॥ కాలమృత్యుమతిక్రమ్యజ్జీవత్యేవనసంశయః॥ ఇడాభాగీరథీగఙ్గా పిఙ్గళా యమునాస్మృతా। తయోర్మధ్యగతానాడీ సుషుమ్నాఖ్యాసరస్వతీ। జ్ఞాన హ్రదధ్యానజలె రాగద్వేషమలాపహే। యస్స్నాతిమానసెతీర్థేసయాతి పరమాంగతిం। అచ్యుతోహమనంతోహం గోవిందోహమహంహరిః॥ ఆనం దోహమశేషోహమజోహమమృతోస్మ్యహం। నిత్యోహంనిర్వికల్పోహం ని రాకారోహమవ్యయః। సచ్చిదానందరూపోహం పరిపూర్ణోస్మిసర్వ దా॥ బ్రహ్మైవాహంనసంసారీ ముక్తోహమితిభావయేత్। అశక్నువన్ భావ యితుంవాక్యమేతత్సమభ్యసేత్। ఏవంయఃప్రత్యహంస్మృత్వా మానసం స్నానమాచరేత్। సదేహంతెపరబ్రహ్మపదంయాతినసంశయః॥ ఇతి హే మాద్రౌమానసస్నానవిధిః॥

(౩౫౧) ఇకను మానసస్నానవిధిని దెల్పుచున్నాడు॥ అనేక కోటి సూర్యసమానుడును, జగన్నివాసుడును, నాలుగుభుజములుగలవాడును,శం ఖచక్రగదాపద్మములను ధరించినవాడును, వనమాలాధారియును, ధ్వజవ జ్రాంకుశాదిరేఖలతో గూడిన నిర్మలపాదపద్మములుగలవాడును, ఆకాశస్థు

డునునగు నారాయణునిస్మరించవలయును. విష్ణుట నట్టినారాయణునియొ
క్క పాదమువలనబుట్టినగంగను బ్రహ్మరంధ్రద్వారా శరీరమునందు బ్రవేశిం
చుచున్నవిధముగ భావనను జేయవలయును. అట్లొనేసి యంతర్దేహగతమగు
సర్వమలమును నాగంగచేత క్షాళనమును జేయవలయును. ఇవ్విధముగ జేసి
నవాడు స్ఫటికమువలె బరిశుద్ధుడగును. ఇత్యాదిమానసికస్నానమసిహారిహ
రాదులచేత జెప్పబడియె. ఇట్టిమానసికస్నానమునాచరించినవాడు మూడు
కోట్లతీర్థములయందు స్నానమునాచరించి యందువలన బొందెడిపుణ్యమును
బొందును. ఇట్టిస్నానమును దినదినమందును నాచరించినవాడునారాయణుం
డని చెప్పబడును. అట్టివాడు కాలమృత్యువునుగూడ నతిక్రమించి జీవించును.
ఇళాపింగళనాడులు గంగాయమునలని చెప్పబడును. ఆరెంటికిని మధ్యయం
దుండునట్టిసుషుమ్నానాడి సరస్వతియనబడును. జ్ఞానమనుమడుగునందలి మ
లాపహారణకారియగు ధ్యానజలమునందు స్నానమును జేసినవాడు మానసస
రోవరమునందు స్నానమును జేసినవాడగును. నేనచ్యుతుడను, అనంతుడను,
గోవిందుడను, నారాయణుడను, ఆనందస్వరూపుడను, అశేషుడను, అజుడ
ను, అమృతుడను, నిత్యుడను, నిర్వికల్పుడను, నిరాకారుడను, అవ్యయుడను, సచ్చి
దానందస్వరూపుడను, పరిపూర్ణుడను, బ్రహ్మస్వరూపుడను, సంసారినిగాను,
అని భావనను జేయవలయును. ఈప్రకారముగా నెవ్వడుస్మరించునో యట్టి
వాడు దేహాంతరమందు పరమపదమును బొందునని దేవలుడువచించె.

## —— నిషిద్ధదివసేతాంబూలభక్షణప్రాయశ్చిత్తమ్. ——

(౩౫౧) అథనిషిద్ధదివసేషు తాంబూలభక్షణ ప్రాయశ్చిత్తమాహ॥
దేవలః॥ అమాయాంచపితృశ్రాద్ధే తీర్థయాత్రాసుసర్వదా। క్షయే రాజ్ఞో
బంధుమృతౌ పక్షద్వయహరేర్దినే॥ అశుచౌమార్గమధ్యేచ సంధ్యయోరుభ
యోరపి। దేవాలయేసభాస్థానే తథాకర్మందిభాషణే। దుఃఖాయితేబహు
జనేతథైవాత్రాతదర్శనే। రాజ్యభంగేప్రజాక్షోభే గురుదేవార్చనేషుచ।
వ్రతాచరణకాలేషు పురాణశ్రవణేతథా। తాంబూలంభక్షయేద్యస్తు విష్ఠా
సమమిదంనృప॥ మహారాజవిజయే॥ ఇక్షూనపఃఫలంమూలం తాంబూలం
పయఔషధం। భక్షయిత్వాపికర్తవ్యా బ్రహ్మయజ్ఞాదికాఃక్రియాః॥ ఏత
ద్వచనముక్తకాల వ్యతిరిక్తవిషయం॥ ప్రాయశ్చిత్తమాహ॥ గౌతమః॥ అమా
శ్రాద్ధాదికాలేషు తాంబూలంయస్తుఖాదయేత్। తస్యదోషనివృత్త్యర్థం జ
పేదష్టశతంద్విజః। అన్యథాదోషమాప్నోతి విష్ఠాశీజాయతేధ్రువం॥ ఇతిహే
మాద్రౌనిషిద్ధదివసే తాంబూలభక్షణప్రాయశ్చిత్తమ్॥

(౩౪౧) ఇకను నిషిద్ధదినమునందు తాంబూలభక్షణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ అమావాస్యయందును, పితృశ్రాద్ధమునందును, తీర్థయాత్రలయందును, రాజక్షయమునందును, బంధుమరణమునందును, ఉభయపక్షైకాదశులయందును, అపరిశుద్ధమగు మార్గమధ్యమందును, ఉభయసంధ్యలయందును, దేవాలయమునందును, సభాస్థానమునందును, కర్మాదిభాషణమునందును, అనేకజనులు దుఃఖమునుబొందిన సమయమునందును, ఉత్పాతదర్శనమునందును, రాజ్యభంగమునందును, ప్రజాక్షోభమునందును, గురుదేవార్చనములయందును, వ్రతాచరణకాలమునందును, పురాణశ్రవణకాలమునందును, తాంబూలమును భుజించినయెడల నా తాంబూలము విష్ఠాతుల్యమనబడునని దేవలుడు వచించె. ఇక్షువును, ఉదకమును, ఫలమును, మూలమును, తాంబూలమును, పాలను, ఔషధమును, భక్షించియు స్నానబ్రహ్మయజ్ఞాదిక్రియలను జేయవచ్చును. ఇదియుక్తకాలవ్యతిరిక్తవిషయమని మహారాజవిజయమునందు జెప్పబడియె. అమాశ్రాద్ధాదికాలములయందు తాంబూలమును భుజించినవాడు దోషయుక్తుడగును. కావుననట్టిదోషనివృత్తికొఱకు నూటయెనిమిదిపర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును. అట్లుచేయనివాడు విష్ఠాశియనబడునని గౌతముడు చెప్పె.

—— తులాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ——

(౩౪౨) అథతులాదిషోడశమహాదానానామితరదానానాంచ ప్రతిగ్రహీతౄణామాచార్యాదీనాం ప్రాయశ్చిత్తంబ్రువన్ తత్రాదౌ తులాప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ ఋణాపకరణార్థం వాహ్యతయా గాధయా ఏవవా। ద్విజఃప్రతిగ్రహంకృత్వా తదుద్ధరణమాచరేత్ ॥ దేవస్వామీ॥ తులాప్రతిగ్రహీతాచ పూర్వజో విషయాతురః। సారణ్యే నిర్జలే దేశే భవతి బ్రహ్మరాక్షసః॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి నవలక్షజపాదృతే॥ తులాత్రివిధా॥ స్వర్ణమయీ॥ రజతమయీ॥ రత్నమయీచ॥ తాసాంప్రతిగ్రహీతాచార్యబ్రహ్మణోర్నిష్కృతిర్నాస్తి । తథాపిమునిభిఃకుత్రాపినిష్కృతిర్దృష్టా॥ తదేవాహమార్కండేయః॥ తాసాంప్రతిగ్రహేవిప్ర ఋణయాగాదిభిర్వినా। తావద్వైనరకేఘోరే ఋత్విక్ఛసహమజ్జతి॥ ఋత్విజఃబ్రహ్మసదస్యాః ద్వాస్థాఃజాపకాః హోతారశ్చ॥ దేవీపురాణే॥ ఆత్మతుల్యసువర్ణంయః ప్రతిగృహ్యాధనాతురః। అకృత్వానిష్కృతింతస్య ఋత్విక్ఛసహరాక్షసః॥ కూర్మపురాణే॥ కాశ్యాదిపుణ్యతీర్థేషుఉపరాగాదిసంభవే॥ ప్రతిగృహ్యతులాం రాజ్ఞస్సహసాబ్దంపిశాచతా॥ గారుడపురాణే ॥ శ్రీశైలే హేమకూటేచ

హ్యాచలేగంధమాదనే॥ అహోబిలేవేంకటాద్రౌ కాశ్యాదిషువిశేషతః॥సూ
ర్యోపరాగకాలేషు అన్యకాలేషుపర్వసు। ప్రతిగృహ్యతులాం(హిరా) రజ్ఞో
యోభోగలోలుపః॥ సారణ్యేనిర్జలేదేశేవృత్తిహీనోనిరాశ్రయః। సహస్రా
బ్దంభవేద్రక్షోనవలక్షజపాద్ధృతే॥ నవలక్షజపశ్చగాయత్ర్యాః॥ బ్రహ్మాండే॥
సేత్వాదిపుణ్యతీర్థేషు ఉపరాగాదిపర్వసు॥ పూర్వజఃప్రతిగృహ్ణీయాత్తులాం
రాజసుతాద్యది॥ భవేద్రక్షస్సహస్రాబ్దం దృష్టిహీనోనిరాశ్రయః॥ నిష్కృతి
స్తస్యగాయత్ర్యాః నవలక్షజపాదిహ॥ తదశక్తౌ॥ లింగపురాణే॥ వాణిజ్య
స్యాష్టమంభాగం కృషేర్వింశతమంతథా॥ ప్రతిగ్రహేచతుర్థాంశం దత్వా
పాపైర్నలిప్యతే॥ తదేవాహమార్కండేయః॥ వాణిజ్యస్యాష్టమంభాగంభా
గంవింశతమంకృషేః॥ ప్రతిగ్రహేచతుర్థాంశం దత్వావిప్రోనదోషభాక్॥ అ
న్యథానిష్కృతిర్నాస్తి దానైర్వాతీర్థసేవనైరితి॥ మహారాజవిజయే॥ యదా
ప్రతిగ్రహస్తస్య తదాపాతిత్యమర్హతి। సంధ్యాదినిత్యకర్మాణివిఫలంతినసం
శయః। సావిత్రీపతితంవిద్యాత్పునస్సంస్కారమర్హతి॥ స్కాందే॥ ప్రతిగృ
హ్యతులామాశు నవలక్షంజపేద్బుధః॥ వ్యయంకృత్వాచతుర్థాంశంయజ్ఞం
స్యాత్స్వస్తిదక్షిణం॥ ప్రయుతంవాభిషేకస్య శంభోరుద్రవిధానతః। తదర్ధంబ్ర
హ్మణఃప్రోక్తం తత్ర్యంశంచసదస్పతేః॥ హోతౄణాంద్వారపాలానాంపాఠ
కానాంమహామునే॥ జాపకానామిదంప్రోక్తం తయోరర్ధంవిచక్షణైరితి। త
యోఃబ్రహ్మసదస్యయోరర్ధం సర్వేషాంప్రాయశ్చిత్తంమునిభిర్దర్శితం। అన్య
థాదోషమాహ॥ బ్రహ్మాండే॥ అగ్నిక్షేత్రేషుతీర్థేషు పుణ్యకాలేషుపర్వసు।
భోగాసక్తస్తులాంధృత్వా హ్యకృత్వానిష్కృతీరిమాః॥ తదాచార్యస్సహ
స్రాబ్దం భవతిబ్రహ్మరాక్షసః। తద్బ్రహ్మసదస్యశ్చ కోటరా నామరాక్ష
సా। హోతారఃప్రేతభూతాస్స్యుర్ద్వారపాలామహోదరాః॥ పాఠ
కాఃకూరవాక్యస్థాః కూశ్మాండాజాపకాభవన్॥ అకృత్వానిష్కృతింభూ
ప యావద్బ్రూమాచరంతిహి॥ నభవంతీహకర్మార్హానసంభాష్యాఃకదాచ
న। అహోనిష్కృతిరేతైర్వాకార్యాలోకవిశుద్ధయే॥ తత్రాపిసులభమాహ॥
మార్కండేయః॥ తులాప్రతిగ్రహీతాచ ప్రాయశ్చిత్తమిదంచరేత్॥ చతు
ర్థార్ధాంశభాగేన పరిషద్విధిపూర్వకం। చతుర్థాంశధనంసర్వం చతు
ర్థాభాగమాచరేత్॥ అనువాదేభాగమేకం భాగమేకంవిధాయకే॥ విధా
యకేష్వన్నర్థః॥ భాగఃపరిషదిప్రోక్తః। శేషంకృచ్ఛ్రాదిషున్యసేత్। తతఃప
రంవిశుద్ధోధూమాదిహలోకేపరత్రచ। బ్రహ్మరాక్షసనివృత్త్యైకృత్వాయాగా
దికంసుధీః॥ పునస్సంస్కారవిధినాహ్యాత్మనశ్శుద్ధమాత్రం। బ్రహ్మహా పక్షే

శంతత్రైవ కుర్యాదాచార్యవాక్యతః। తతః పరం జపేద్వేదమాతరం ప్రత్యహం సుధీః। ప్రతిగ్రహాపరాన్నేషు విముఖో విష్ణుమాదరాత్ । చింతయన్వర్తయన్విప్రస్సుఖీహచపరత్రచ। ఏవంకృత్వా ద్విజోయస్తు నిష్కృతిం శుద్ధమానసః। తులాప్రతిగ్రహే రాజన్ శుద్ధోభవతినాన్యథా । అకృత్వానిష్కృతిరేతా ఏకాం వాపినరేశ్వర । సంధ్యాదినిత్యకర్మాణి పితృకార్యాణియానిచ॥ నఫలంతిహిసర్వాణి భస్మనిన్యస్తహవ్యవత్। పునస్సంస్కారమాత్రేణ పునరాయాంతితానివై। అతఃప్రతిగృహీతాతు ఆత్మదేహవిశుద్ధయే । కుర్యాద్వై విరజాహోమం పంచగవ్యమనంతరం॥ ఇతి హేమాద్రౌ తులాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౩౫౩) ఇఁకను తులాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ ఋణాపకరణముకొఱకైనను, యాగముకొఱకైనను, బ్రాహ్మణుఁడు ప్రతిగ్రహమును జేసి యక్కార్యములను నెరవేర్చవలయునని దేవలుఁడు చెప్పె. బ్రాహ్మణుఁడు విషయాతురుఁడై తులాప్రతిగ్రహీతయయ్యేనేని నిర్జలమైన యరణ్యప్రదేశమునందు బ్రహ్మరాక్షసుఁడై పుట్టును. అట్టివానికి నవలక్షజపముకంటె నితరమగు ప్రాయశ్చిత్తమేదియును లేదని దేవస్వామివచించె. స్వర్ణమయమనియును, రజతమయమనియును, రత్నమయమనియును తుల మూఁడువిధములు. ఈమూఁడువిధములలో నెద్దానిని బ్రతిగ్రహించినను నాచార్యబ్రహ్మలకు మహాదోషముగలుగును. అట్టిదోషనివారక ప్రాయశ్చిత్తమెందును జెప్పఁబడలేదు. అయినను మార్కండేయుఁడు బ్రాహ్మణుఋణయాగాదులకొఱకుఁ జేసిన యెడల దోషముగలుగనేరదనియును, ఇంతకంటె వ్యతిరిక్తకార్యములయందయ్యేనేని రౌరవమను నరకమును బొందుననియును చెప్పె. ఆత్మతుల్యమైనసువర్ణమును ధనాతురుఁడై బ్రతిగ్రహించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనని యెడల ఋత్విక్కులతోఁగూడ రాక్షసత్వమును బొందునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. కాశ్యాదిపుణ్యతీర్థములయందును, ఉపరాగాదికమునందును, తులాప్రతిగ్రహమును జేసినవాఁడు వేయిసంవత్సరములు పిశాచత్వమును బొందునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. శ్రీశైలమునందును, హేమకూటమునందును, గంధమాదనపర్వతమునందును, అహోబిలమునందును, శేషాచలమునందును, కాశ్యాదులయందును, సూర్యోపరాగములయందును, ఇతరములగుపర్వములయందును, తులాప్రతిగ్రహమును జేసినవాఁడు నిర్జలమగునరణ్యమునందు వేయిసంవత్సరములు రాక్షసుఁడైయుండును. కావున నట్టిదోషనివారణముకొఱకుఁ దొమ్మి

దిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయునని గారుడపురాణమునందుం జెప్పంబడియె బ్రహ్మాండపురాణమునందును జెప్పంబడియె. వాణిజ్యముయొక్క యష్టమభాగమును, కృషియొక్క యిరువదవభాగమును, ప్రతిగ్రహమునందలి నాల్గవభాగమును,ఇచ్చినబ్రాహ్మణుడుదోషవంతుడగునని లింగపురాణమునందుం జెప్పంబడియె. మార్కండేయపురాణమునందుం జెప్పంబడియె. ప్రతిగ్రహమును జేసినయెడల పాతిత్యముగలుగును. సంధ్యావందనాది నిత్యకర్మలన్నియును నిష్ఫలములగును. సావిత్రిపతితయయ్యెనేని మరలనుపనయనసంస్కారమును బొందవలయునని మహారాజవిజయమునందుం జెప్పంబడియె. స్కాందపురాణ బ్రహ్మాండపురాణములయందును నీపూర్వోక్తాభిప్రాయమంతయును జెప్పంబడియె. తులాప్రతిగ్రహీత యీప్రాయశ్చిత్తమునాచరింపవలయును. పరిషద్విధిపూర్వకముగ నాద్రవ్యమునందలి చతుర్థాంశభాగమును దానముసేయవలయును. అదియెట్లనినననువాదకునికొక్కభాగమును, విధాయకునికొక్కభాగమును, ఒక్కభాగము పరిషత్తునకును, మిగిలినద్రవ్యమును కృచ్ఛ్రములకునుపయోగింపవలయును. ఇవ్విధముగ సకలద్రవ్యమును వ్యయముచేసినయెడల నిహపరలోకములయందుం బాపరహితుడగును. బ్రహ్మరాక్షసనివృత్తికొఱకు యాగాదికమును జేయవలయును. పునస్సంస్కారవిధి పురస్సరముగ వేదమాతనభ్యసించవలయును. ఆచార్యునివలన బ్రహ్మోపదేశమును బొందవలయును. అనంతరము దినదినమందును వేదమాతను జపింపవలయును. ప్రతిగ్రహపరాన్నములయందు విముఖుండై యాదరముతో విష్ణుదేవునిస్మరించుచుండినయెడల నిహపరలోకములయందు సుఖవంతుడగును. ఇవ్విధముగం బరిశుద్ధమనస్కుండై చేసినబ్రాహ్మణుడు తులాప్రతిగ్రహమునందుం బరిశుద్ధుడగును. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొననక చేసిననిత్యకర్మలన్నియును నిష్ఫలములగును. మఱియు నాకర్మలన్నియును బూడిదయందుం జేసినహోమమువలె వ్యర్థమగును. పునస్సంస్కారముచేత మరలనన్నియునువచ్చును. అందువలనం బ్రతిగ్రహీతయగువాడాత్మవిశుద్ధికొఱకు విరజాహోమమును జేసికొని పంచగవ్యప్రాశనను జేయవలయునని మార్కండేయుండు వచించె.

## హిరణ్యగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్.

(౩౫౩) అథహిరణ్యగర్భప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ పూర్వజోదివ్యలోకః నిమిత్తైః పూర్వజైర్వినా। గర్భంస్వర్ణమయంధృత్వాబుత్విగ్భిస్సహరాక్షసః॥ మాత్స్యపురాణే॥ హిరణ్యగర్భంగృహీత్వాయాద్ద్విజ

జోలోకపరాఙ్ముఖః। తస్యాపనయనంభూయోభవేద్వైన క్తచార్యసౌ॥ మా
త్స్యే॥ హిరణ్యగర్భంభూపాలభూపాలాద్ద్విజవల్లభః। ప్రతిగృహ్యసశేషే
ణనక్తచారీభవేద్భువి॥ ఋత్విజఃకీనాశానామపిశాచాస్సమ్భవన్త్యథ। అరణ్యేనిర్జ
లేదేశే హ్రిస్వపాదామహోదరాః॥ నతేషాంనిష్కృతిర్దృష్టా ప్రాయశ్చిత్తా
యుతైరపి। కథంచిన్నిష్కృతిర్దృష్టా పునర్గర్భాఽచాస్యథేతి॥ దేవీపురాణే॥
దక్షిణామాత్రమాలభ్య ప్రధానంసమ్పరిత్యజేత్। యాపియాగధర్మాదీక్షా
కృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ శేషమేద్యదిమోహేనవృత్త్యర్థం భోగలోలు
పః॥ తస్యోపనయనంభూయోజననంగర్భగోళతః॥ ఇష్ట్వేము తేనశిష్యోభార్యా
హ్యభిషేకాత్ప్రముచ్యతే। అష్టలతుజపాద్దేవ్యాః కూశ్మాండాయుత హోమ
తః॥ చాతుర్భాగస్యయోవాపి యజ్ఞోవాసర్వదక్షిణః। ఏవంకుర్యాద్ద్విజో
యస్సతస్మాద్దోషాత్ప్రముచ్యతే॥ అభిషేకాద్యశక్తౌదక్షిణామాత్రపరిగ్రహే
హిరణ్యగర్భగ్రహణేసులభంప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ ప్రధా
నంసమ్పరిత్యజ్యయాగార్థందక్షిణాంవహేత్। తస్యైవనిష్కృతిరియంమునిభిః
పరికీర్తితా॥ పరేద్యుర్వాతద్దినేవాస్నాత్వాశుచిర్జితేన్ద్రియః। నీలవర్ణాంశ్చ
గావకాంశ్చ్యామాదాయనిర్గదామ్॥ ఆపోహిష్ఠాదిభిర్మన్త్రైః పాప్మఘ్నీం
మార్జయేజ్జలైః। రక్తేనవాససాచ్ఛాద్యత్రిఃపరిక్రమ్యయత్నతః॥ తేన్మాతస్థాన
మాసాద్యజపేన్మన్త్రమిమంసుధీః। హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే హవిషావి
ధేమేత్యంతముక్త్వా విష్ణుర్యోనిమిత్యాదిసమర్థయాంతాభిరనుమన్త్రయేత్॥ త
తఃపరంముహూర్తమాత్రంస్థిత్వాగోగర్భగమాత్మనోమూర్ధానం విధాయ
అష్టయోనీమష్టపుత్రామిత్యనువాకంపఠేత్॥ తతఃపరమాత్మానం పునర్జాతం
మత్వాస్వయంవాపితావా ఆచార్యోవాజాతకర్మాద్యుపనయనాన్తంకుర్యా
త్॥ గాంధర్వాణిచాచార్యాయదత్వాతమాపమేత్। తతఃపరంపూతోభవ
తి॥ దక్షిణామాత్రప్రతిగ్రహేప్రాయశ్చిత్తమేతద్వేదితవ్యమ్॥ ప్రధానత్యా
గాభావే పూర్వోక్తైర్గష్టలతుజపాదిభిః పూతోభవతి। అన్యథానిష్కృతిః॥ తే
జతద్దోషమాహ॥ హరిసాగరే॥ అన్యథానిష్కృతిర్నాస్తి హ్యకృత్వా
నిష్కృతీరిమాః। సహస్రాబ్దంభవేద్రక్షః ఆచార్యోద్రవ్యలోభతః॥ బ్రహ్మసద
స్పతిశ్చైవతదర్ధంరాక్షసోభవేత్। ద్వారస్థాఋత్విజశ్చైవ పాఠకాజాపకా
అపి॥ తయోరర్ధంభవేయుస్తేరాక్షసాఘోరరూపిణః। ఆచార్యార్ధంజపఃశిష్యౌ
త్రోబ్రహ్మాణస్సదసస్పతేః॥ తయోరర్ధంహోతృకాణామితరేషామిహస్థితిః॥ నాగ
రఖండే॥ ఏవంహిరణ్యగర్భస్యగ్రహణేనిష్కృతిఃపురా। దృష్టామన్వాదిభిర్వి
ప్రైర్ధర్మశాస్త్రపరాయణైః॥ అన్యథానిష్కృతిర్నాస్తిప్రాయశ్చిత్తైర్గలాప్నుతే

రీతి॥ ఇతి హేమాద్రౌ హిరణ్యగర్భప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౫౩) ఇకను హిరణ్యగర్భ ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడు ద్రవ్యలోభముచేతను, మఱియే కారణములచేతనైనను స్వర్ణమయమగు గర్భమును బ్రతిగ్రహించిన యెడల ఋత్విజులతోగూడ రాక్షసుడై పుట్టునని దేవలుడు వచించె. కూర్మపురాణమునందును నిటులనే చెప్పబడియె. మాత్స్యమునందును నిటులనే చెప్పబడియె. దక్షిణను మాత్రమవలంబించి ప్రధానమును వదలవలయును, అట్టివాడు యాగధర్మాదులను జేసినయెడల పరిశుద్ధుడగును, ఆద్రవ్యమును సర్వమును యాగాదులయందు వ్యయముచేయక లుబ్ధత్వముచేత గొంతద్రవ్యమును దాచికొనినయెడల నట్టివాడు పునరుపనయన సంస్కారమును బొందవలయును, రుద్రాభిషేకమును జేయవలయును, ఎనిమిదిలక్షలపర్యాయము గాయత్రీ జపమును జేయవలయును. వేయిపర్యాయములు కూశ్మాండ హోమమును జేయవలయును, కావుననట్టిద్రవ్యమునందు నాలుగవభాగమును వ్యయము చేయవలయును, సర్వమును దక్షిణనుజేసి యజ్ఞమునైనను నాచరింపవలయును, ఇవ్విధముగా జేసినయెడల హిరణ్యగర్భప్రతిగ్రహదోషనివృత్తియగును. ఇకనభిషేకాదులను జేయుశక్తిలేనివాడు దక్షిణామాత్రపరిగ్రహమునందు హిరణ్యగర్భ గ్రహణమునందు సులభమైన ప్రాయశ్చిత్తమును గురించి మార్కండేయమునివరుడు చెప్పుచున్నాడు. అదిగాట్లనైన ప్రధానమునువదలి యాగముకొరకు దక్షిణనువహించినవానికి ప్రాయశ్చిత్తముచెప్పబడియె. అట్టి పరిగ్రహమునుజేసిన పరదినమునందు స్నానమును జేసి పరిశుద్ధుడును నలకృతుడును, నైరోగ్యరహితమైనదియును, నల్లనివర్ణముగలదియును. పూర్ణవయస్సుగలదియునునగు గోవును ప్రాఙ్ముఖముగజేసి యాపోహిష్ఠామాదిమంత్రములచేత మార్జనమునుజేసి తెల్లనివస్త్రముచేత నాచ్ఛాదనమునుజేసి "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రేహవిషావిధేమ" అనుమంత్రమునుజపించి "విష్ణుర్యోనిం" అనుమంత్రమునుచ్చరించి ముహూర్తమాత్రము తననుగోగర్భమును బొందినటులజేసికొని (అనగాశిరస్సును గోగర్భమునొద్దబెట్టియనుట) "అష్టయోనీమష్టపుత్రాం" అనుమంత్రమును పఠించవలయును, పిమ్మట దనను మరలజన్మించినవానినిగా దలచి తనకుదనచేతనే నైనను, తండ్రిచేతనైనను, ఆచార్యునిచేతనైనను, జాతకర్మాద్యుపనయనాంతకర్మను జేసికొనవలయును పిమ్మటగోవును, ద్రవ్యములను, ఆచార్యునకివ్వవలయును, ఇట్లుచేసినయెడల పరిశుద్ధుడగును, దక్షిణామాత్ర పరిగ్రహమునందీ ప్రాయశ్చిత్తమును జేసి

కొనవలయును. ప్రధానత్యాగాభావమునందు పూర్వోక్తమైన యేసిమిదిల క్షలజపము మొదలగువాటి నాచరింపవలయును. ఈపూర్వోక్తప్రాయశ్చిత్తమును జేసికొననివాడు వేయిసంవత్సరములు రాక్షసుడైయుండును, బ్రహ్మయును, సదస్పతియును నైనూరుల వత్సరములు రాక్షసత్వమును బొందుదురు, ద్వారస్థులును, ఋత్విజులును, పాఠకులును, జాపకులును, రెండునూరులయేబది సంవత్సరములు రాక్షసులై యుందురు. కావుననిట్టివారలకు గూడ ప్రాయశ్చిత్తమును నిక్రమముగానే యథాక్రమముగ నాచరింప వలయునని హరిసాగరమను గ్రంథమునందు జెప్పబడెను. నాగరఖండమునందు హిరణ్యగర్భ ప్రతిగ్రహమునందు మన్వాదిస్మృత్యుక్త ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని చెప్పబడెను.

——* బ్రహ్మాండఘటప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. *——

(౩౪౪) అథ బ్రహ్మాండఘటప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురాణే॥ ద్విజైర్బ్రహ్మాండసంజ్ఞో వై ఘటస్త్వాపత్సు యాసుచ । నధార్యః పుణ్యతీర్థేషు ఆత్మనాశకరో మహాన్ ॥ దేవలః ॥ బ్రహ్మాండం యోనుగృహ్ణీయాద్ద్విజః క్రత్వాదభిర్వినా । ఋత్విగ్భిస్సహ దుష్టాత్మా రాక్షసో భవతి ధ్రువం॥ మాత్స్యే॥ ద్విజో గృహీత్వా బ్రహ్మాండం రాజ్ఞో దానాధికారిణః । తస్యాన్యా నిష్కృతిర్నాస్తి హ్యాశీత్యబ్దాన్స్వరాక్షసాత్ ॥ మార్కండేయః ॥ బ్రహ్మాండం పుణ్యతీర్థేషు పుణ్యకాలేషు పర్వసు । గృహీత్వా నిష్కృతిర్నాస్తి వసులక్షజపాదృత ఇతి॥ బ్రహ్మకైవర్తే ॥ బ్రహ్మాండం ముఖజో ధృత్వా పాపీ లోభపరాయణః । అష్టలక్షజపాదస్య నిష్కృతిర్బ్రహ్మరాక్షసాదితి ॥ మహాభారతే। అష్టలక్షజపాద్దైవ్యా బ్రహ్మాండస్య పరిగ్రహే । వినేతి శేషః॥ ఆసహస్రాబ్దపర్యంతం నముక్తిర్బ్రహ్మరాక్షసాదితి ॥ దేవీపురాణే ॥ దశలక్షజపాద్దేవ్యావిప్రస్య బ్రహ్మణో ఘటే । ఆసహస్రాబ్దపర్యంతమితియత్తదసామ్ప్రతం॥ తదాహ ॥ లింగపురాణే ॥ గౌతమః ॥ బ్రహ్మాండం యో ద్విజో ధృత్వా వసులక్షజపాద్వినా । పూతో భవతి దుష్టాత్మా ఇహలోకే పరత్ర చ॥ నియుతేనాభిషేకస్య శతమ్యా పూర్వవదాస్థితః । చాతుర్భాగవ్యయం కృత్వా యజ్ఞం వా బహుదక్షిణం ॥ సర్వం వ్రదక్షిణమిత్యర్థః । న శేషయేత్ ॥ ఏషా వై నిష్కృతిస్తస్య ఋత్విగ్భిస్సహితస్య చ । అన్యథా నిష్కృతిర్నాస్తి సహస్రాబ్దం పిశాచతః ॥ ప్రాయశ్చిత్తాకరదేవోహమాహ ॥ భవిష్యోత్తరే ॥ ఆచార్యో జీవతో నామ భవతి బ్రహ్మరాక్షసః । బ్రహ్మా భవేత్ఖరారూఢస్సహస్రాంశీ సదస్యవాన్॥ ద్వారస్థాస్సుశక్రూరకగ్రామణిః పాఠకాః పిశితాశనాః । హోతారః కృకలా

సాస్సుర్జ్ఞాపకాః పాదహీనజాః ॥ ఆచార్యార్థంతయోః ప్రోక్తం ప్రాయశ్చి
త్తమిదం ప్రభో । ద్వారస్థానాం తదర్థం స్యాచ్ఛేషాంచపూర్వవత్ ॥ అథవా
తచ్చతుర్భాగవ్యయం వా కురుతే సదా । అన్యథానిష్కృతిర్నాస్తి దానైస్తీ
ర్థావగాహనైః ॥ ఆచార్యం ప్రవిశేత్పాపం రాష్ట్రోదాంధికారిణః । పాద
హీనంద్వయోః ప్రోక్తం శేషం సర్వే సమంవిశేత్ ॥ ప్రాయశ్చిత్తైర్వినా రా
జన్ నపునంతి ప్రతిగ్రహాత్ । తస్మాదిదం ప్రకర్తవ్యం ప్రాయశ్చిత్తం ద్విజాతి
భిః ॥ ప్రాయశ్చిత్తేనపూతాత్మా శుద్ధో భవతి నాన్యథా ॥ ఇతి హేమాద్రౌ
బ్రహ్మాండఘట ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥

(౩౫౪) ఇకను బ్రహ్మాండఘట ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు ॥ ఆపత్కాలములయందు దానమివ్వబడుచున్న బ్రహ్మాండ నామకఘటమును పుణ్యతీర్థములయందు బ్రతిగ్రహింప గూడదు, అట్లుగాక ప్రతిగ్రహించినయెడల నాత్మనాశమగునని దేవీపురాణమునందు జెప్పబడె- దేవలుడును బ్రహ్మాండఘటమును బ్రతిగ్రహించినయెడల రాక్షసుడై పుట్టునని యె- మాత్స్యపురాణమునందును నిటులనే చెప్పబడియె. పుణ్యతీర్థములయందును, పుణ్యకాలములయందును, పర్వముల యందును, బ్రహ్మాండమును గ్రహించినవాడెనిమిదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, లేనియెడల రాక్షసుడై పుట్టునని మార్కండేయుడుపచించె. బ్రహ్మకైవర్తమునందును నిటులనేచెప్పబడియె. మహాభారతమునందును నిటులనేచెప్పబడియె. దేవీపురాణమునందును నిటులనేచెప్పబడియె. బ్రహ్మాండమును గ్రహించినవాడు, ఎనిమిదిలక్షలపర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. మఱియును రుద్రాభిషేకమును జేయవలయును. ఇంతియగాక గ్రహించిన దానద్రవ్యమునందలి నాల్గవభాగమును వ్యయముచేయవలయును, కాదేని సర్వదక్షిణగలయజ్ఞమునైనను జేయవలయును, ఆద్రవ్యమునందు గాంచెముద్రవ్యమునైనను మిగల్చగూడదు, ఋత్విజాదులును నీప్రాయశ్చిత్తమునే యాచరించవలయును, లేనియెడల వేయి సంవత్సరములు పిశాచత్వమును బొందుదురని గౌతముడుచెప్పె. ఆచార్యుడు జీవకుడను బ్రహ్మరక్షస్సగును, బ్రహ్మయగువాడు ఖరారూఢరాక్షసుడగును. ద్వారమునందున్న వారలు క్రూరకర్మలను జేయువారగుదురు. పాఠకులు మాంసభోక్తలగుదురు, హోతలుకృకలాస జన్మమునెత్తుదురు, జాపకులు పాదహీనజులగుదురు. కాబట్టి వీరందఱును క్రమముగ నొకరిప్రాయశ్చిత్తమునందర్థప్రాయశ్చిత్తమునాచరించవలయును, అట్లుగాదేని స్వీకృతద్రవ్యమునందు నాల్గవభాగం

వ్యమును క్రయముచేయువలయును, ఇట్టిప్రాయశ్చిత్తములను జేసికొననియెడల బ్రహ్మరాక్షసులుగా నేరని భవిష్యోత్తర పురాణమునందు జెప్పబడియె॥

——— ❋ కల్పతరుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౩౫౫) అథకల్పతరుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ ఆపత్స్వపి సమృద్ధో వా విప్రో న గృహ్ణీయాద్ద్రుమం తరుమ్। యావంతి సంతి పర్ణాని ఫలాని కుసుమాని చ॥ తావంతి హాయనాని స్యాద్రాక్షసో నిర్జలే వనే। ఋత్విగ్భిర్బ్రాహ్మణైః సార్ధమథఃపాదవివర్జితః॥ సౌపర్ణే॥ న గృహ్ణీయాద్ద్విజః పాపీ బహుభిః కాంక్షైర్వ్రతైర్వా। తరుమేనం ర్ణవంతం రక్షో భవతి కాననే॥ దృష్ట్వా సద్భ్యో వినా రాజవృత్త్యగ్నిస్సహ నిర్జలే। యావంతి తస్య పర్ణాని తావదబ్దం నరాధిప॥ దార్బ్రాహ్మణ్యనివృత్త్యర్థం క్రతుః॥ పితృభిరాత్మనా వా కృతమృణం స్యాత్। నైవకృతోఽగ్రహారస్తటాకో వా ఖిలీభవతి చేత్ తదుద్ధరణార్థం ప్రతిగ్రహః ఏతాని నిమిత్తాని ప్రతిగ్రహే। ఏతేషాం రక్షణార్థం సర్వధనవ్యయేన దోషః॥ తదాహ గౌతమః॥ కుటజం ప్రతిగృహ్యైనం ద్విజో ఋణవిముక్తయే। యాగార్థం స్వకృతారంభ తటాకాదివినాశనే॥ సర్వం తదర్థం సహసా వ్యయం కృత్వా న దోషభాక్॥ శుద్ధో భవతి మానుష్యే న భవేద్బ్రహ్మరాక్షసః ఇతి॥ మార్కండేయః॥ ప్రతిగృహ్య ద్విజో లోభాత్తరుమేనం సుఖాప్తయే। నిష్కృతిస్తస్య వా స్త్రీహంచరకాదేకవింశతేః॥ కథంచిన్నిష్కృతిర్దృష్టా మనునారదగాలవైః। అష్టలక్షాద్వేదమాతుశ్చతుర్థాంశవ్యయేన వా॥ అభిషేకేణ వా శంభోర్ప్యామేర్వాత్రిః పరిక్రమాత్। సేత్వాదిపుణ్యతీర్థేషు త్ర్యబ్దం వా స్నానమాచరేత్॥ ఏతాని నిష్కృతయో దృష్టాస్తరోరేతస్య సంగ్రహే। బ్రహ్మసదస్య ఋత్విజాం హిరణ్యజాపకపారకాణాం ప్రాయశ్చిత్తమర్ధార్ధాంశేన వేదితవ్యం। బాహుజాదేకగుణితం పాదజాద్ద్విగుణం చరేత్॥ ముఖజాదుక్తమాసేన హ్యూరుజాత్ క్షత్రవన్నృప। ఏతాభ్యో నిష్కృతిభ్యశ్చ గతిర్నాన్యత్ర దృశ్యతే ఇతి॥ ఇతి హేమాద్రౌ కల్పతరు ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౩౫౫) ఇకను కల్పతరు ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడు కల్పతరుదానమును బట్టగూడదు, ఆవృక్షము నందెన్ని పర్ణములు, ఫలములు, పుష్పములునునుండునో యన్ని సంవత్సరములు నిర్జనమగువనమునందు రాక్షసుడైయుండును, ఋత్విజాదులును నటులనే రాక్షసులైయుందురని మార్కండేయుడు చెప్పె. సౌపర్ణమునందును నటులనే చెప్పబడియె. మఱియును దార్బ్రాహ్మణ్య నివృత్తికొరకు క్రతువునాచరించవలయును. అగ్రహారమైనను, తటాకమైనను, ఖిలమైనయెడల తదుద్ధరణము

కొఱకుఁ గల్పతరువును ప్రతిగ్రహించి వీనినిభాగుచేసిన యెడల దోషమేమి యునుగలుగనేరదనియును సౌవర్ణమునందే చెప్పఁబడియె. గౌతముఁడు నిటు లసెవచించె. లుబ్ధతచేతఁ గల్పతరువును ప్రతిగ్రహించినవానికి రాక్షసత్వముగలుగును. కావునఁ దద్దోషనివారణకొఱకు నెనిమిదిలక్షల పర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును. కాదేనియాద్రవ్యమునందుఁ జతుర్థాంశమును వ్యయముసేయవలయును. లేకరుద్రాభిషేకమునైనను జేయవలయును. అట్లుగాదేని మూఁడుపర్యాయములు భూప్రదక్షిణమును జేయవలయును. కాదేని సేత్వాది పుణ్యతీర్థములయందుఁ బ్రతిసంవత్సరమునందు స్నానమునైనను నాచరించవలయును. బ్రహ్మసదస్య ఋత్విజులును నర్ధార్ధక్రమముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. క్షత్రియవైశ్యులవలననీదానమును గ్రహించినయెడ ననేకగుణిత ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. శూద్రునివలన గ్రహించినయెడల ద్విగుణముగ నాచరింపవలయును. బ్రాహ్మణునివలన గ్రహించినపుడు నుక్తప్రకారముగనే ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయమునివరుఁడువచించె.

—* గోసహస్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౩౫౬) అథగోసహస్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ తులాయాంగోసహస్రేచ ఆచార్యస్యపునర్భవః। ఆబ్రహ్మణోబ్దపర్యంతేనాస్తి భూమౌపిశాచతః॥ గ్రంథాంతరే। తులాయాంగోసహస్రేచ ఆచార్యో యదిపూర్వజః॥ తస్యనాస్తిపునర్జన్మ యావద్బ్రహ్మలయంగతః। తథాచార్యస్తథాబ్రహ్మసదస్యారాక్షసాస్త్రయః। యావద్బ్రహ్మలయంయాతి తావత్తేసంచరంత్యథః॥ మార్కండేయః॥ ఏకాగార్న్ప్రతిగృహ్య ద్వితీయానకదాచన। సాచేద్విక్రయమాపన్నా దహత్యాసప్తమంకులమ్॥ విష్ణురహస్యే॥ కాశీక్షేత్రేచగౌతమ్యాం కృష్ణవేణ్యాంనదీతటే। శ్రీశైలేవేంకటాద్రౌచ మహాక్షేత్రేఅహోబిలే॥ కాంచీక్షేత్రేచశ్రీరంగగోకర్ణేగంధమాదనే। ధనుష్కోట్యాంమహారాజాత్తులాంవాగోసహస్రికమ్॥ ప్రతిగృహ్యద్విజోలోభాద్వృణయాన్యైర్వినానృప। పుత్రపౌత్రైఃపరివృతో నరకేవాసమశ్నుతఇతి॥ సాకండే॥ గ్రహణేసంక్రమేచైవ పుణ్యతీర్థేషుపర్వసు। గోసహస్రీం తులాంవిప్రః ప్రతిగృహ్యధనాతురః॥ పూర్వోక్తానిష్కృతీశతాఃపరిత్యజ్యతునిర్విశేత్ ॥ సపుత్రపౌత్రసహిత స్సహస్రాబ్దంనిశాచరఇతి॥ దేవీపురాణే॥ గోసహస్రం ద్విజోధృత్వా అకృత్వాతద్వ్యయంసుధీః॥ సోఽరణ్యేనిర్జలేదేశే కులేనసహరాక్షసఇతి॥ మార్కండేయః॥ ధృత్వాద్విజోగోసహస్రంరాజ్ఞోస్యస్మాద్ధి

జన్మనః। నవలక్షంజపేద్దేవ్యాః పునస్సంస్కారమర్హతీతి॥ మాత్స్యే॥ పుణ్య
క్షేత్రేతుపుణ్యతీర్థే సూర్యాచంద్రమసోర్గ్రహే॥ ధేనూనాం యస్సహస్రంచ
ప్రతిగృహ్యాధనాతురః॥ భువఃప్రదక్షిణంకృత్వా నవలక్షంజపేత్తతః॥ కేశా
నాంవపనంకృత్వాపునస్సంస్కారమర్హతి॥ మహారాజవిజయే॥ సహస్రధేను
దానేతు ఆచార్యత్వంవ్రజేద్ద్విజః॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తినవలక్షజపా
దృతే। భూమేఃప్రదక్షిణంకృత్వా కేశానాంవపనంపునః। ప్రాయశ్చిత్తేన
పూతాత్మాపునస్సంస్కారమర్హతీతి॥ ఏతదశక్తౌ పక్షాంతరమాహ॥ కూర్మ
పురాణే॥ సహస్రధేనుదానేతు ఆచార్యోపాదిలోభతః। భూమేఃప్రదక్షి
ణంకృత్వా నవలక్షంజపేత్తతః। తదశక్తౌమహాదేవ్యార్నమకైశ్చమకైశ్చ
భిః॥ కృత్వాఽభిషేకంవిధివచ్చతురయుతంప్రయత్నతః। సర్వవ్యయంచ
యాగనాకృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ నాగరఖండే॥ బ్రహ్మసదస్యఃపూర్వ
వత్ప్రాయశ్చిత్తార్థమర్హతః। తదర్థంద్వారపాలానాం పాఠకానాం తథైవ
చ। మాహాత్మ్యాణాంజాపకానాంచ పూర్వవన్మాసభిస్తుక్రమ్॥ తత్రవిశేష
మాహ॥ లింగపురాణే॥ గోసహస్రతులాయాం చాప్యాచార్యోప్యర్ధనంహ
రేత్। అకృత్వాతద్వ్రతంధర్మ్యం పత్నీపుత్రైరిష్కృతః। తత్పత్నీనాంచ
పుత్రాణాం మనుజానాంజనాధిప। హవ్యకవ్యేషుయోభోక్తా యేవాసంబంధి
బాంధవాః। తత్తత్కృచ్ఛ్రత్రయంపత్న్యా నిష్కృతిఃకథితోత్తమైః। ఏతదబ్ద
పర్యంతం। అతఃపరంనిష్కృతిర్నాస్తి॥ చాంద్రాయణత్రయంప్రోక్తం తత్పు
త్రాణాంధనాగమే। తద్ద్రవ్యభృత్యానాంపరాకంస్యాద్యదిచేద్విభజేద్ధనం। హ
వ్యకవ్యేషుభోక్తౄణాముపవాసాదినంభవేత్। పరేద్యుఃప్రాశనంకృత్వా
పఞ్చగవ్యంవిశేషతః॥ తేషాంపరాకస్సంప్రోక్తో యేచసంబంధిబాన్ధవాః। త
స్యసంభాషణాదేవ కుర్యాత్సూర్యావలోకనమ్॥ తస్మాచ్చనిష్కృతిఃకార్యా
ఆచార్యేణశుభేప్సునా। అన్యథాదోషమాప్నోతి ఇహలోకేపరత్రచ। తులా
ప్రతిగ్రహేప్యేవమేవవేదితవ్యమ్॥ గోసహస్రంతులాచద్వయంసమమ్॥ తస్మి
న్నయోరపరిగ్రహఏవవరమ్। ఉభయోర్లోకయోరతిగర్హితత్వాత్॥ ఇతి
హేమాద్రౌగోసహస్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౫౬) ఇకను గోసహస్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు॥ తులయందును, గోసహస్రమునందును, బ్రహ్మాగ్రశయముదనాక పిశాచత్వము గలిగియుండునని దేవలుఁడు వచించె. గ్రంథాంతరమునందును నిటులనేచెప్పఁబడెను. ఒకటియగుగోవుప్రతిగ్రహింపఁదగినదిగాదు. కొండవదానినిగూడ గ్రహింపఁగూడదు. అది మే విక్రయమును బొందెనేని కుల

మును సప్తపురుషపర్యంతము దనక నాశమును బొందించునని మార్కండేయ
మునివరుఁడు వచించె. కాశీక్షేత్రమునందును, గౌతమీనదియందును, కృష్ణ
వేణియందును, శ్రీశైలమునందును, వెంకటాద్రియందును, మహాక్షేత్రము
నందును, అహోబిలమునందును, కాంచీక్షేత్రమునందును, శ్రీరంగమునం
దును, గోకర్ణమునందును, గంధమాదనమునందును, ధనుష్కోటియందు
ను, మహారాజువలన తులనైనను, గోసహస్రమునైనను, లోభము వలనఁ
బ్రతిగ్రహించిన యెడల పుత్రపౌత్రులతోఁగూడ నరకలోకమునందుండును.
యాగాదులకొఱకిట్టి దానమును గ్రహించుట వలన దోషములేదని విష్ణుర
హస్యమునందుఁ జెప్పఁబడియె. చంద్రసూర్యోపరాగములయందును, సం
క్రమణమునందును, పుణ్యతీర్థములయందును, పర్వములయందును, గోసహ
స్రమును, తులను గ్రహింపఁగూడదు. లుబ్ధత్వముచేత గ్రహించిన యెడల పూ
ర్వోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అట్టి ప్రాయశ్చిత్తము
ను జేసికొనని యెడల వేయి సంవత్సరములు రాక్షసత్వమును బొందునని
స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. గోసహస్రమును బ్రతిగ్రహించి
నవాఁడు తద్ద్రవ్యమును వ్యయము సేయని యెడల నిర్జనారణ్యమునందు రాక్ష
సత్వమును బొందియుండునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. రాజు
వలన గోసహస్రమును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు తద్దోషనివృత్తికొఱ
కు తొమ్మిదిలక్షల పర్యాయములు గాయత్రీజపమును జేసికొనవలయును. మ
ఱియును బునరుపనయన సంస్కారమును బొందవలయునని మార్కండే
య మునివరుఁడు చెప్పె. పుణ్యక్షేత్రమునందును, పుణ్యతీర్థమునందును, చం
ద్రసూర్యోపరాగములయందును, గోసహస్రమును బ్రతిగ్రహించిన బ్రాహ్మ
ణుఁడు భూప్రదక్షిణమును జేసి తొమ్మిదిలక్షల పర్యాయములు గాయత్రీజప
మును జేసి వపనమును జేయించుకొని పునరుపనయనసంస్కారమును బొం
దవలయునని మాత్స్యపురాణమునందుఁ జెప్పఁబడియె. సహస్రగోదాన
మునందాచార్యత్వమును వహించిన బ్రాహ్మణుఁడును బూర్వోక్త ప్రాయ
శ్చిత్తమునే యాచరించవలయునని మహారాజవిజయమునందుఁ జెప్పఁబడి
యె. ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొనుటకుఁ దగిన సామర్థ్యము లేని యెడల
నమకచమకములను జెప్పించుచుఁ బదివేల పర్యాయములు రుద్రాభిషేకమును
జేయవలయును. అట్లుగాఁ జేసి యాద్రవ్యమును సర్వమును యాగాదులకొఱ
కు వ్యయమును జేయవలయునని బ్రహ్మపురాణమునందుఁ జెప్పఁబడియె. బ్ర
హ్మయును, సదస్యుఁడును పూర్వోక్త ప్రాయశ్చిత్తమునం దర్ధమును నాచరిం

చవలయును. ద్వారపాలకులును, పాఠకులును, హోతలును, జాపకులును, క్రమముగనర్ధార్ధక్రమముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయునని నాగరఖండమునందుఁ జెప్పఁబడియె. గోసహస్రదానమునందును, తులయందును, ఆచార్యుఁడు గ్రహించినధనమును శాస్త్రోక్తప్రకారముగ వ్యయముసేయక స్వకుటుంబమునందే యుపయోగించిన యెడల తద్ద్రవ్యభోక్తలగువారందఱును దప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఈప్రాయశ్చిత్తమును సంవత్సరములోపలనే చేసికొనవలయును. సంవత్సరానంతరమునందుఁ బ్రాయశ్చిత్తమే లేదు. అట్టిధనమునుబొందిన పుత్రులు మూఁడుచాంద్రాయణవ్రతముల నాచరించవలయును. భ్రాతలుపరాకకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అట్టివాని హవ్యకవ్యములయందు భోజనమును జేసినవారలొకదినముపవాసమును జేయవలయును. పరదినమునందుఁ బంచగవ్యప్రాశనమును జేయవలయును. తత్సంబంధిబాంధవులు పరాకకృచ్ఛ్రము నాచరించవలయును. అట్టివానితో సంభాషణను జేసిన యెడల సూర్యావలోకనమును జేయవలయును. అందువలన నాచార్యుఁడగువాఁడు ప్రాయశ్చిత్తమునుదప్పక చేసికొనవలయును. గోసహస్రదానతులాదానములు సమానములుగనుక వానిని గ్రహింపకపోవుటయే యుత్తమమని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె.

—✽ హిరణ్యకామధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం. ✽—

(౩౪౭) అథ హిరణ్యకామధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్త మాహ॥ మహాభారతే॥ వ్యాసః ॥ శృణుధర్మజవక్ష్యామి స్వర్ణకామదుహంసకృత్‌। ప్రతిగృహ్యద్విజోయస్తు ససద్యఃపతితోభవేత్‌ ॥ తస్యస్యాన్నిష్కృతిర్భూప ఘృచ్ఛ్రహిమ్నాపదేశతః । అష్టలక్షజపాద్రాజన్‌ వ్యయాద్వాఽష్టమభాగతః॥ అభిషేకేణవా శమ్భోర్యజ్ఞాద్వా సర్వదక్షిణాత్‌॥ ఏత్రైశ్శుద్ధిమవాప్నోతిహ్యుభయోర్లోకయోరపి ॥ లింగపురాణే ॥ హిరణ్యకామధుక్పూర్వం రాజ్ఞాం శ్రేయోభివృద్ధయే । సర్వపాపక్షయకరీ మహాపాతకనాశినీ । అగ్నికుండాత్సముత్పన్నా పశ్యతాంద్వ్యసదాంసతామ్‌ ॥ దృష్ట్వాబ్రహ్మాణమద్రాక్షీద్బ్రహ్మాతాంప్రత్యువాచహ ॥ ఇతఆగచ్ఛభద్రంతేమహీంగచ్ఛప్రయత్నతః । రాజానస్తత్రవర్తన్తేమహ్యర్థంపాపకారణః। తత్రతాన్‌రక్షదానేన సుఘోరాత్పాపసఙ్కటాత్‌ ॥ ఓమిత్యుక్త్వాతదాధేనుర్భువంగతవతీయదా । తదాప్రభృత్యసౌధేనుః కామధుక్స్వర్ణరూపిణీ ॥ రాజ్ఞాంపాపనిబద్ధానాం వస్వర్గం పాపచేతసామ్‌ । పాపనిర్మోచనీతేషాం స్వర్చితాపుణ్యసంగమే ॥ ఏతాదృ

శీంపుణ్యరూపాం స్వర్ణకామదుహాంద్విజః । ప్రతిగృహ్ణాతియోలోభా త్పన ద్యఃపతితోభవేత్ ॥ కూర్మపురాణే ॥ స్వర్ణకామదుహాంరాజ్ఞా స్వర్చితాం శాస్త్రవర్త్మనా । ద్విజోయఃప్రతిగృహ్ణాతి సనద్యస్సూతకీభవేత్ ॥ శివపురాణే ॥ సనర్వపాపవితో౽పి రాజభిఃపూజితామిమాం । యోగృహ్ణీయాత్పుణ్యకాలే పూర్వోక్తైఃకారణైర్వినా ॥ ప్రాయశ్చిత్తీభవేత్సద్యః పునశ్చబ్రహ్మోపదేశతః । అష్టలక్షజపంకృత్వా ప్రత్యహంసుధీపూర్వకం ॥ ధనస్యాష్టమభాగేన ప్రాయశ్చిత్తంసమాచరేత్ । అభిషేకేణవాశమ్భో ర్యజ్ఞాత్సర్వస్వదక్షిణాత్ ॥ ఏతేషామేకమారాజేంద్ర ప్రాయశ్చిత్తేనబుద్ధిమాన్ । ఇహలోకేపరత్రాపి శుద్ధిమాప్నోత్యనుత్తమాం ॥ మహాభారతే॥ స్వర్ణకామదుహాంధృత్వా ద్విజోనిపాతందాన్మనే । అష్టలక్షజపంకృత్వా శుద్ధిమాప్నోతి దైహికీమ్ ॥ ధనస్యాష్టమభాగేన ప్రాయశ్చిత్తేనవాద్విజః । అభిషేకేణవాశమ్భోశ్శైవమృణమోచనాత్ ॥ నాన్యథాశుద్ధిమాప్నోతి ద్విజోలోభాద్ధనార్జకఇతి ॥ నియమేనగాయత్రీజపంకృత్వా స్వర్ణకామధేనుప్రతిగ్రహతూష్ణీంభవతి । తదశక్తాధనాష్టమభాగేన తులాప్రతిగ్రహోక్త ప్రాయశ్చిత్తంవాకుర్యాత్ ॥ నమకచమకైశ్శమ్భోః ప్రయుతాభిషేచనాత్పూతోభవతి। అథవాధనేన ప్రతిగ్రహలబ్ధేన నిశ్శైవమృణమోచనంకృత్వా పంచగవ్యంప్రాశ్యశుద్ధోభవతి ॥ ఇతిహేమాద్రౌ హిరణ్యకామధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్ ॥

(३५६) ఇకను హిరణ్యకామధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాఁడు ॥ సువర్ణకామధేనువును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు తత్క్షణమే పతితుఁడగును, కావునదద్దోషనివారణముకొఱకు మరల బ్రహ్మోపదేశమును బొందవలయును, ఎనిమిదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, మఱియునట్టిద్రవ్యమునందెనిమిదవభాగమును వ్యయమునేయవలయును, కాదేని రుద్రాభిషేకమును జేయవలయును, ఇదియును జేయుటకు వీలుగానియెడల నాద్రవ్యమును సర్వమును దక్షిణగాఁబెట్టి యజ్ఞమును జేయవలయుననివ్యాసుఁడువచించె. తొల్లి బ్రహ్మనుమతిచేతస్వర్ణకామధేనువు రాజులపాపమును నశింపజేయుటకు భూలోకమునకువచ్చెననియును, దానినిప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు పతితుఁడగుననియును లింగపురాణమునందు జెప్పబడియె. కూర్మపురాణమునందును స్వర్ణకామధేనుదానమును ప్రతిగ్రహించుటవలన బతితుఁడగుననిచెప్పబడియె. వ్యాసుఁడు చెప్పినవిధముగానే శివపురాణమునందును జెప్పబడియె. మహాభారతమునందును

నిటులనే చెప్పఁబడెను. అట్టిదానము నంగ్రహించి నిశ్శేషముగ ఋణవిమోచనను జేసికొనిన యెడల పంచగవ్యప్రాశనమమాత్రముచేతనే పరిశుద్ధుడగును॥

—* హిరణ్యాశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౩౪౮) అథహిరణ్యాశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ కూర్మపురాణే ॥ హిరణ్యవాజినం గృహ్ణన్ ద్విజో లోభపరాయణః । జన్మత్రయే రాక్షసత్వమనుభూయ పిశాచతాం ॥ తదన్తే ఘువమాసాద్య రాసభత్వమవాప్నుయాత్ । తదన్తే రోగవాన్భూత్వా నరకం యాతి పాండవ॥ మత్స్యపురాణే ॥ హిరణ్యవాజినం ధృత్వా ం జ్ఞో దానపరాయణాత్ ।పుణ్యకాలేపుణ్యదేశే ద్విజో యో భోగలోలుపః ॥ సోఽపి దేహాంతరే భూయాదరణ్యే రాక్షసస్తథా । తదంతే రాసభో భూత్వా తతో నరకమాప్నుయాత్॥ బ్రహ్మాండే॥ హిరణ్యవాజినం యస్తు ప్రతిగృహ్యాథ నాస్తికః । సోఽరణ్యే నిర్జలదేశే రాక్షసత్వం భజేదిహ ॥ తతస్తు గార్దభతనుమనుభూయ తతఃపరం । తతో వ్యాధిభిరాకీర్ణో నరకావాసమశ్నుతే ॥ న తస్య పునరావృత్తిర్దివ్యాబ్దలక్షాష్టకాదృతే ఇతి ॥ తద్దేవాహ ॥ వామనపురాణే ॥ హిరణ్యాశ్వం ద్విజో లోభాదాజ్ఞః పుణ్యదినేష్విహ । ప్రతిగృహ్య స్వయం భోగార్థం స భవేద్బ్రహ్మరాక్షసః॥ తతః ఖరత్వమాసాద్య రోగవాన్ జన్మనాంతరే। తతో నరకమాసాద్య తిష్ఠత్యాచంద్రతారకం ॥ తస్యాన్యాని ష్కృతిర్నాస్తి హ్యష్టలక్షజపాదృతే॥ బ్రహ్మకైవర్తే ॥ హిరణ్యాశ్వం ద్విజో ధృత్వా తస్యాః నిష్కృతిరీరితా। అష్టలక్షజపాద్వాపి నియుతాదభిషేకతః ॥ అష్టమాంశవ్యయాచ్చాపి యాగైర్వా సర్వదక్షిణైః। తతశ్శుద్ధిమవాప్నోతి పునస్సంజీవిధానత ఇతి ॥ పునస్సంస్కారాదిత్యర్థః॥ తద్బ్రహ్మచ సదస్యశ్చ ప్రాయశ్చిత్తార్ధమర్హతః । ద్వావస్థాన్ సజ్జ సకారాబ స్నహాన్త్యర్థార్ధమంశతః॥ అన్యథా దోషవంతస్తేన సమ్భాషాత్ కదాచన। న సంస్పృశ్యా న పాత్రేయా నాలపేత్తాన్ హ ద్విజానితి ॥ ఇతి హేమాద్రౌ హిరణ్యాశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౩౪౮) ఇకను హిరణ్యాశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు ॥ సువర్ణాశ్వమును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు మూడు జన్మములదనుక రాక్షసత్వమును బొందును, పిమ్మట భూలోకమునందు రాసభమైపుట్టును. అనంతరమందు రోగవంతుడైపుట్టి మరణానంతరమందు నరకమును బొందునని కూర్మపురాణమునందు జెప్పబడె. మత్స్యపురాణమునందును నిటులనే చెప్పబడినది. బ్రహ్మాండపురాణమునందును నిటులనే చెప్పబడెను. మఱియునట్టి దోషనివారణకొఱకు నెనిమిదిలక్షలపర్యాయములు గాయ

త్రీజపమును జేయవలయుననియును జెప్పఁబడియె, వామనపురాణమునందు నునిటులనే చెప్పబడియె. బ్రహ్మకైవర్తమునందిట్టి దానమును గ్రహించినపుడు ప్రాయశ్చిత్తమును విపులముగ జెప్పబడియె. అది యెట్లనిన నేనిమిదిలక్షల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. అట్లుగా జేసినపిదప వేలపర్యాయములు రుద్రాభిషేకమును జేయవలయును, కాచేనియా ద్రవ్యమునందెనిమిదవభాగమును వ్యయముసేయవలయును, లేక సర్వదక్షిణలుగల యాగమునైనను జేయవలయును, పునరుపనయన సంస్కారమును బొందవలయును. ఇవ్విధముగ నాచరించినయెడల పరిశుద్ధుడగును, బ్రహ్మయగును, సదస్యుడును, పూర్వోక్తప్రకారానుసారముగ ప్రాయశ్చిత్తార్థము నాచరింపవలయును, ద్వారమునందున్నవారును, జాపకులును సర్వార్థక్రమముగ ప్రాయశ్చిత్తము నాచరించవలయును, ఇవ్విధముగ ప్రాయశ్చిత్తము నాచరింపనివారు దోషవంతులును, సంభాషింపదగనివారును నగుదురనియును జెప్పబడియె ॥

—* హిరణ్యాశ్వరథప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౩౪౯) అథహిరణ్యాశ్వరథప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ బ్రహ్మకైవర్తే ॥ హిరణ్యాశ్వరథందివ్యం పూజితంన్నృపసూనుభిః ॥ తంధృత్వా బ్రహ్మణోలోభాద్యఃకశ్చిద్ద్విజపల్లభః ॥ సభృత్వా రాక్షసో ఘోరో నిర్జలేవిజనేవనే । భవత్యేవ సదాక్రూరో నిష్ఠురంసర్వదాపదః ॥ భవిష్యోత్తరే ॥ విశ్వాచీచఘృతాచీచ స్త్రియాలోకవిమోహనే । అకల్పయత్పురా బ్రహ్మహిరణ్యాశ్వరథంముదా ॥ తే ఆరోప్య రథశ్రేష్ఠే న్యానయంతిదివంసురాః । రథంతమిన్ద్రిస్సహసా ఆలోక్యాప్సరసాంగణైః ॥ ఆరురోహముదాయుక్తో హతవానాతుసోసురాన్ బహూన్ । హిరణ్యాశ్వరథందృష్ట్వా తద్దీప్త్యా రాక్షసాహతాః ॥ తదంతేదివమాసాద్య హిరణ్యాశ్వరథేనవై । తతఃపరంతముత్సృజ్య జైవంద్రోరథమంజసా ॥ బ్రహ్మతమవలోక్యాథ హిరణ్యాశ్వరథంపునః । హస్తేగృహీత్వాతం దివ్యంరాజభ్యఃప్రదదౌముదా ॥ దానంకురుతవిప్రేభ్య స్సర్వపాపాపనుత్తయే । హింసాకరమిమందివ్యం పూజితంమంత్రితంద్విజైః । ఇతి తేభ్యోముదాదత్వా బ్రహ్మలోకపితామహః ॥ తేరాజ్ఞీమాస్తైతత స్తేపిచక్రుర్బ్రహ్మనిదేశతః । తస్మాద్ధింసాకరంవిప్రో నగృహ్ణీయాత్కదాచన ॥ శంభురహస్యే ॥ హిరణ్యాశ్వరథంయస్తు ద్విజోగృహ్ణాన్నరాధిపాత్ । సారణ్యేనిర్జలేదేశే బుభుక్షుస్సహరాక్షసః ॥ యావద్బ్రహ్మాసృజద్విశ్వంతావద్రాక్షసదేహవాన్ । తస్యైవనిష్కృతిర్దృష్టా మునిభిస్తత్త్వదర్శిభిః ॥ వసులక్షజపాద్వాపి నియుతేనాభిషేకతః । అష్టమాంశవ్యయేనాపి ప్రాయశ్చిత్త విధాన

తః ॥ తదంతేవపనంప్రోక్తం పునస్సంస్కారమర్హతి। ఏవంచేచ్ఛుద్ధిమాప్నో తిప్రాయశ్చిత్తేనభూయసా । అన్యథా తేనశుద్ధాస్స్యుర్నసంభాష్యాః కదాచన । బ్రహ్మసదస్యద్వాస్థానాం ఋత్విజాంపూర్వవత్ప్రాయశ్చిత్తం వేదితవ్యం॥ పునస్సంస్కారః పూర్వవత్ ॥ ఇతి హేమాద్రౌ హిరణ్యాశ్వరథప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౩౫౯) ఇకను హిరణ్యాశ్వరథప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానము ను జెప్పుచున్నాఁడు॥ శ్రేష్ఠమైనదియును, రాజసూనులచేతఁ బూజింపఁబడినదియునునగు హిరణ్యాశ్వరథమును లోభమువలనఁ బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు మరణానంతరమందు నిర్జనమును, భయంకరమునునగు నరణ్యమునందు రాక్షసుఁడైపుట్టి సర్వకాలములయందును గతిః వచనములను బలుకువాఁడగునని బ్రహ్మకైవర్తమునందుఁ జెప్పఁబడియె. తొల్లిబ్రహ్మదేవుఁడు లోకములను మోహపెట్టఁజాలిన విశ్వావిఖ్యాతాచియునునియుపురుచేవవేశ్యలనుసృజించె. మఱియును సర్వోత్తమమగు హిరణ్యాశ్వరథమునుగూడ నొకరుదానినిర్మించె. అంతనాదేవవేశ్యలిపుడును నారథమునధిష్ఠించి స్వర్గమునకుపచ్చువారలనెవరొకని తీసికొనిపోవుచుందురు. ఆరథకాంతులచే రాక్షసులు హతులగుచుండిరి. తొల్లి ఋంగుండారథమునధిష్ఠించి రాక్షసుల ననేకులహతముసేసె. మఱియును నట్టిరథమును దానముసేసినరాజులకుస కలదోషములునునశించుననియె. అదికారణముగ హింసాకరమగు నట్టియా హిరణ్యాశ్వరథమును బ్రాహ్మణుఁడు ప్రతిగ్రహింపఁగూడదని భవిష్యోత్తరమునందు జెప్పబడియె. హిరణ్యాశ్వరథమును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు నిర్జలమగునరణ్యమునందు రాక్షసత్వమునుబొంది సంచరించును, అట్టిదోషనివారణకొఱకు నెనిమిదిలక్షల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, కాదేనిపదివేలపర్యాయములు రుద్రాభిషేకమును జేయవలయును లేకయాద్రవ్యమునం దెనిమిదవభాగమునైనను వ్రియము చేయవలయును, అనంతరమందు పునరుపనయన సంస్కారమును జేసికొనవలయును, బ్రహ్మసదస్యాదులును పూర్వోక్తప్రకారముగ నర్థార్థకృముగ ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని శంభురహస్యమునందు జెప్పబడియె॥

—※ హేమహస్తిరథప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం. —

(౩౬౦) అథ హేమహస్తిరథప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండపురాణే॥ హిరణ్యహస్తినంధృత్వా పుణ్యకాలేషుపర్వసు। యోవిప్రోలోభమోహేన రాజ్ఞోదానార్థినోన్నృప । తస్యాప్యాబ్రహ్మకృతిర్యాహస్తిదళలక్షజపా

దృతే॥ లక్షహోమేనకూశ్మాండైశ్శుద్ధిమాప్నోత్యనుత్తమాం॥ బ్రహ్మవైవర్తే॥ హిరణ్యహస్తినంధూపాద్ద్విజోయోలోభమోహతః। పుణ్యకాలేషుపుణ్యేషుతీర్థేష్వాయతనేషుచ॥ ప్రతిగృహ్యతతోలోభాదకృత్వా నిష్కృతింపృథక్॥ సారణ్యేఃసర్జలేదేశే రాక్షసోంబరచారవాన్॥ తస్యాన్యాసినిష్కృతిర్నాస్తినవలక్షజపాదృతే॥ లక్షహోమేనకూశ్మాండైశ్శుద్ధిమాప్నోతివైదికీమ్। అష్టమాంశవ్యయేనాపి ప్రాయశ్చిత్తవిధానతః॥ ఏతేనశుద్ధిమాప్నోతి హ్యశుద్ధోహ్యన్యథాద్విజఇతి॥ దేవీపురాణే॥ హేమహస్తిరథంధృత్వావిప్రోయదివిమోహితః॥ నిశాచరత్వమాసాద్య ఋత్విగ్భిస్సహపార్థివ। నిశాచరాద్విముక్తోభూయాన్నవలక్షజపాదిహ॥ లక్షహోమేనకూశ్మాండైశ్శుద్ధోభవతినిశ్చయః॥ కేశానాంవపనంకృత్వా పునస్సంస్కారమాచరేత్। తదర్ధంబ్రాహ్మణఃప్రోక్తం తదర్ధంవైసదసస్పతేః॥ తదర్ధంద్వారపాలానాం జాపకానాంతదర్ధతః॥ ప్రాయశ్చిత్తమిదంప్రోక్తం హేమహస్తిరథగ్రహే॥ లింగపురాణే॥ పురాదైవాసురేయుద్ధే నిర్మితంవిశ్వకర్మణా॥ హేమహస్తిరథందివ్యమారురోహప్రజాపతిః॥ జిగాయరాక్షసాన్సర్వా హేమహస్తిరథేనవై। జిత్వాలోకంపునర్గత్వా దృష్ట్వారథమనుత్తమమ్॥ బభాషేదేవతామధ్యేయోవాకౌవాభువస్థలే॥ పూజయిత్వాద్విజాగ్ర్యాయ దత్వామాంప్రతిపద్యతే॥ ఇతీరయిత్వాతందివ్యందత్తవాన్కృపయాతదా। తదాప్రభృత్యదోయానం నృణాంపాపహారంమహత్। పూజయిత్వాద్విజాగ్ర్యాయ యోదద్యాత్సప్రజాపతిః॥ తంధృత్వాబ్రాహ్మణోయస్తు తస్యపాపంమహత్తరం॥ తస్యైవనిష్కృతిరియం సర్వపాపప్రణాశినీతి॥ ఇతి హేమాద్రౌ హేమహస్తిరథప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౬౦) ఇఁకను హేమహస్తిరథప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ పుణ్యకాలములయందును, పర్వములయందును రాజులవలన సువర్ణమయమైన యేనుఁగును ప్రతిగ్రహించినవాఁడు తద్దోషపరిహారమునకుఁ బదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. మఱియును లక్షపర్యాయములు కూశ్మాండహోమమును జేయవలయునని బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడియె. పర్వాదులయందును, పుణ్యక్షేత్రములయందును హిరణ్యగజమును ప్రతిగ్రహించినవాఁడు నిర్జలమైన యరణ్యప్రదేశమునందు రాక్షసుఁడై యంతరిక్షసంచారియగును. కావున నట్టిదోషనిష్కృత్తికొఱకు తొమ్మిదిలక్షల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. మఱియును లక్షసంఖ్యాక కూశ్మాండహోమమును జేయవలయును. అట్లుగాదేని ప్రాయశ్చిత్తవిధానపురస్సరముగ నష్టమాంశద్రవ్యమును జే

యవలయును. ఇవ్విధముగఁ జేసినయెడలఁ బరిశుద్ధుఁడగుఁనని బ్రహ్మకైవర్తమునం దుఁ జెప్పఁబడియె. దేవీపురాణమునందును నిటులనే చెప్పఁబడియె. మఱియును బ్రహ్మసదస్సునలకు నర్థార్థక్రమముగఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడియె. తొల్లి విశ్వకర్మ దేవాసురయుద్ధమునందు దివ్యమగు సువర్ణరథమును సృజించె. అట్టిరథమును, సువర్ణగజమును నధిష్ఠించి బ్రహ్మదేవుఁడు రాక్షసుల నుజయించె. అట్లుజయించిన దేవతామధ్యయందిట్లనియె. దేవోత్తములారా భూలోకమునందెవ్వఁడునన్నునర్చించి యిట్టిరథగజములను బ్రాహ్మణునకు దానముసేయునో వాఁడునన్నుఁబొందుననియె. అదికారణముగ సువర్ణమయములగు రథగజములను దానముసేసినవాఁడు బ్రహ్మలోకమును బొందును. అట్టివానికిగొప్పదగుదోషముసంభవించును. కావునఁ దద్దోషపరిహారముకొఱకు పూర్వోక్తప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె.

——* పంచలాంగలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(౩౬౧) అథపంచలాంగలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ శివపురాణే॥ పుణ్యక్షేత్రేపుణ్యకాలే రాజాధర్మపరాయణః। లాంగలంవాథపంచైవ హ్యాత్మదోషప్రశాంతయే॥ కుర్యాద్యదిసపూతాత్మా పాపాదస్మాత్ప్రముచ్యతే॥ తత్రాజ్ఞాత్వాద్విజోయశ్చ లోకద్వయవిగర్హణమ్। లాంగలంప్రతిగృహ్ణీయాదేకంవాపంచవాపివా॥ ఋత్విగ్భిస్సహదుష్టాత్మాఖిలీభూతేఽజలేవనే। సహసాబ్దంభవేద్రక్షః శ్వపచజన్మన్యస్మిన్స్తదా॥ మహాభారతే॥ లాంగలంయోనుగృహ్ణీయాద్రాజ్ఞఃకర్మాధికారిణః। సవనేనిర్జలేఘోరే సహస్రాబ్దంభవేత్తరా॥ రాజన్నాకల్పపర్యంతం నిష్కృతిర్నాస్తికుత్రచిత్॥ దశలక్షజపాద్దేవ్యాః క్వచిద్దృష్టామనీషిభిః॥ ప్రధానత్యాగమాత్రేణ యాగార్థందక్షిణాంవపేత్॥ తదర్థంమునిభిఃప్రోక్తం ప్రాయశ్చిత్తంవిశోధనం। ఏతద్దక్షిణామాత్ర ప్రతిగ్రహవిషయం। ప్రధానత్యాగాభావే దశలక్షజపాచ్ఛుద్ధిః॥ శివధర్మే॥ లాంగలందేవిగృహ్ణీయాన్ముఖజోభోగలోలుపః॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి దశలక్షజపాదృతే॥ ఏతదశక్తాపత్త్యంతరమాహ॥ వసిష్ఠసంహితాయాం॥ లాంగలంముఖజోధృత్వా పంచవాప్యేకమేవవా। తస్యైవనిష్కృతీర్వక్ష్యే శృణునాన్యమనాఃప్రభో। దశలక్షజపంవాథప్రయుతంవాభిషేచనమ్॥ చతుర్భాగవ్యయంవాపి యజ్ఞంవాసర్వదక్షిణం। ఏతత్పాపవిశోధనార్థంపరేద్యుర్వాన్యతోపివా॥ మార్తాండస్యోదయాదర్వాక్ స్నానంకృత్వాయథార్హతః। నిత్యకర్మసమాప్యైవయావత్సూర్యోదయోభవేత్॥ తా

వర్గత్వా జలాధారం నదీం పుష్కరిణీమపి । కణ్ఠదఘ్నజలే స్థిత్వా స్మరన్నా
రాయణం విభుం। ముఖముద్ధృత్య మార్తాండం పశ్యన్నుత్తానపాణికః। అఘ
మర్షణసూక్తంచ జపన్ పాపవిముక్తయే। యావదస్తంగతో భానుస్తావత్కా
లంజపేత్సుధీః। మధ్యాహ్నాద్యాహ్నికం కృత్వా బ్రహ్మయజ్ఞంచ తర్పణం॥ మన
సా దేవమారాధ్య పునర్గత్వా జలంజపేత్। సాయంసంధ్యాముపాసిత్వా సా
యం హోమమనంతరం। మౌనంత్యక్త్వా తదా రాజన్ ఫలాహారం సమాచరే
త్॥ ఉత్తమం యావకం భక్ష్యేదథవా ముద్గభక్షణం। అథశ్శయీ భవేత్తత్రకీర్తి
తం పాపమనుస్మరన్। ప్రభాతాయాంతు వ్యుష్టాయాం పూర్వవద్వ్రతమాచ
రేత్॥ ఏవంతు మండలే పూర్ణే విరజాహోమమాచరేత్ । ఉపోష్యదినమేకం
చ పంచగవ్యం పిబేత్తతః॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్తేభ్యో దత్వాచ దక్షి
ణామ్॥ పశ్చాత్స్వయం ప్రభుంజీయాత్తద్విప్రానుజ్ఞయాసహ ॥ సర్వేషువా
మేషులోకేషు మృత్యోర్నోన్వాయతా ఇత్యఘమర్షణసూక్తం। ఔపాసనాగ్నౌ
త్రిత్రైస్సక్తుభిస్తిలాజ్జైః హోమామీతి మంత్రైర్విరజాహోమః॥ పంచగవ్యంబ్ర
హ్మకూర్చవిధానేన । ఏతత్ప్రాయశ్చిత్తమాచార్యస్య॥ సర్వేషాం ప్రాయ
శ్చిత్తమాహ॥ మాత్స్యే॥ బ్రహ్మసదస్పతిశ్చైభా తదర్ధంభాగమర్హతః॥ ద్వా
రస్థానాంతదర్ధంస్యాత్తదర్ధమితరేషువై। ప్రాయశ్చిత్తవిధిశ్చైవ నాన్యథాగ
తిరస్తిహి॥ ప్రాయశ్చిత్తాకరణేదోషమాహ॥ గౌతమః ॥ తులాయాంగోస
హస్రేచ లాంగలే మేచ ఋత్విజః। ప్రాయశ్చిత్తమకృత్వాచేన్నత్రైస్సంభాష
ణంచరేత్॥ నతేషాందర్శనంకుర్యాద్దైస్సహనసంవిశేత్॥ మహాదానేషు స
ర్వేషుప్రాయశ్చిత్తముదీరితం । తదకృత్వాద్విజోగర్వా చ్చండాలత్వమవా
ప్నుయాత్॥ నయోగ్యోహ్యవ్యక్తవ్యేషు నసంభాష్యః కదాచన॥ సోనుభూయమ
హత్పాపం మృత్వేహచపరత్రచ । ఇహజన్మనిచండాలః పరత్ర బ్రహ్మరాక్ష
సః॥ తస్మాదేవ ప్రకర్తవ్యం ప్రాయశ్చిత్తంద్విజోత్తమైః ॥ ఇతి హేమా
ద్రౌపంచలాంగలప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౩౬౧) ఇఁకను పంచలాంగల ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానము
ను జెప్పుచున్నాఁడు॥ పుణ్యక్షేత్రమునందైనను, పుణ్యకాలమునందైనను, రా
జుధర్మపరాయణుఁడై ఒకలాంగలమునైనను, అయిదులాంగములనైనను,
దానము చేసినయెడల పాపరహితుఁడగును. అట్టిదానమును ప్రతిగ్రహించిన
బ్రాహ్మణుఁడు ఋత్విజాదులతోఁగూడ నిర్జలమగువనమునందు వేయిసంవ
త్సరములు రాక్షసుఁడైయుండునని శివపురాణమునందుఁ జెప్పఁబడియె. మ
హాభారతమునందును నిట్టులనే చెప్పఁబడి ప్రాయశ్చిత్తముగూడ విధింపఁబ

డియె. అదియెట్లనిన నట్టిదోషనివృత్తికొఱకు పదిలక్షల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. సర్వదక్షిణగలయాగమునైనను జేయవలయునని చెప్పఁబడియె. శివధర్మమునందును నిటులనే చెప్పఁబడియె. ఒక్కలాంగలమునైనను, అయిదులాంగలములనైనను బ్రతిగ్రహించినవాఁడు తద్దోషనివృత్తికొఱకు పదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. కాదేని పదివేలపర్యాయములు రుద్రాభిషేకమును జేయవలయును. ఆద్రవ్యమునందలి నాల్గవభాగమును వ్యయమైనను జేయవలయును. సర్వద్రవ్యమును దక్షిణగానమర్చి యజ్ఞమునైనను జేయవలయును. మఱియు నీపాపశాంతికొఱకు పరదినమున సూర్యోదయమునకు ముందుగ స్నానమును జేసి నిత్యకర్మనుసమాప్తిని బొందించి జలాశయమునకైనను, పుష్కరిణీనదికైనను బోయి కంఠపర్యంతముగలజలమునందు నిలిచి నారాయణ స్మరణను జేయవలయును. అనంతరమందు ముఖము నెత్తికొని సూర్యునిఁ జూచుచు నుత్తానకర్తుఁడై యఘమర్షణసూక్తమును జపింపవలయును. ఈప్రకారము సూర్యాస్తమయమగు వఱకును జపించవలయును. మధ్యాహ్నముఁగా మాధ్యాహ్నికసమయమునందు బ్రహ్మయజ్ఞమును తర్పణమును జేయవలయును. మనస్సుచేత దేవారాధనను జేసి మరలబోయి జలపానమును జేయవలయును. సాయంసంధ్యోపాసనను జేసి సాయంకాలీన హోమమును జేయవలయును. మఱియు నప్పుడు మౌనమును వదలి ఫలాహారము నాచరించవలయును. కాదేని యుత్తమమగు యావకమునైనను, ముద్గమునైనను భక్షించవలయును. పిమ్మట నేనిట్టి పాపమును జేసితిగదా యని స్మరించుచు నధశ్శాయియై యుండవలయును. పిమ్మటఁ బ్రాతఃకాలమైనతోడనే పూర్వోక్త ప్రకారముగ నాచరింపవలయును. ఇట్లు నలుబది దినములైన పిమ్మట విరజాహోమము నాచరించవలయును. మఱియు నొక్కదినముపవాసమును జేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. అనంతరమందు సదక్షిణాకముగ బ్రాహ్మణులను భుజింపఁజేయవలయును. "సర్వేషువామేషులోకేషుమృత్యవోన్వాయత్తా" అనునది యఘమర్షణ ఋక్కనఁబడును. "ఔపాసనాగ్నౌ తిలైస్సక్తుభిస్తిలాజైర్హోష్యామి" అను మంత్రములచేత విరజాహోమము. పంచగవ్యమును బ్రహ్మకూర్చవిధానముచేత భుజించవలయును. ఈప్రాయశ్చిత్తమాచార్యునకేని మెఱుంగవలయునని వసిష్ఠసంహితయందుఁ జెప్పఁబడియె. బ్రహ్మసదస్యతులాచార్యునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునందర్ధము నాచరింపవలయును. ద్వారస్థులు ప్రాయశ్చిత్తమునందు సగము నాచరించవలయును. ఇతరు

లుదానియందు సగమునాచరించవలయును. ఇట్లని మాత్స్యపురాణమునందుఁ జెప్పఁబడెను. తులాదానమునందును, గోసహస్రదానమునందును, లాంగలదానమునందును, ఋత్విక్త్వమును వహించినవారు ప్రాయశ్చిత్తమును జేసికొనని యెడల సంభాషించుటకుఁదగినవారుగారు. అట్టివారిదర్శనమును గూడ జేయుఁగూడదు. ఇట్టి మహాదానములయందు జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును గర్వముచేత నాచరింపనివాడు చండాలత్వమును బొందును. మఱియును హవ్యకవ్యములయందు దగినవాఁడుగాడు. ఇహపరలోకములయం దిట్టిపాపమునను భవించి యిహజన్మయందు చండాలుఁడును, పరజన్మయందు రాక్షసుడునునగునని గౌతమునిచేత జెప్పబడెను.

——* ధరాదానప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. *——

(౩౬౨) అథధరాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ యోరాజామండలంరక్షేద్ధర్మశాస్త్రానుసారతః। సోపిస్వర్గమవాప్నోతి కిమన్యైర్దానసాగరైః। తథాపికురుతేపాపంవిప్రగ్రామేషుసర్వదా॥ దేవద్రోహంజనద్రోహంవిప్రద్రోహంమహత్తరం। చండాలాదపిసర్వత్రధనార్జనమితీరితం। దుష్టదండశ్చసర్వత్రతథానిష్ఠురభాషణం। నదానంపుణ్యకాలేషురతిశ్చస్త్రీషుసర్వదా। వ్రతత్యాగస్సదాచారనృషువిత్తార్జనంమహత్। బ్రహ్మహత్యాదిపాపానిమనసాచింతయేత్సదా। ఏవమాదీనిపాపానిరాజ్ఞస్సంతిదినేదినే॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థంధరాదానంసమాచరేత్॥ అభ్యర్చ్యగంధవస్త్రాద్యైర్దద్యాద్వేదవిదేముదా॥ శివపురాణే॥ ధరామభ్యర్చ్యగంధాద్యైర్యోరాజాపుణ్యసంగమే॥ విప్రసాత్కురుతేయస్తత్రతస్యచాంతోనవిద్యతే। గృహ్ణీయాద్యోధరామేనాంపుణ్యకాలేషుపర్వసు। తస్యవిప్రస్యనాస్తిహ్యపునర్జన్మచరాక్షసాత్। బ్రహ్మోపదేశఃకర్తవ్యస్సావిత్రీదానమేవచ। తతఃపరంజపేద్దేవ్యాదశలక్షమతంద్రితః॥ పద్మపురాణే। ధరామభ్యర్చితాంరాజ్ఞోధర్మశాస్త్రానుసారతః॥ యోవిప్రఃప్రతిగృహ్ణీయాద్ధనలోభపరాయణః॥ యజ్ఞాదికమకృత్వాచేత్భవతిబ్రహ్మరాక్షసః। దశలక్షజపాద్దేవ్యాస్తస్యనిష్కృతిరీరితా। పునస్సంస్కారవిధినాగాయత్రీంవేదమాతరం। గృహ్ణీయాద్విప్రముఖ్యేభ్యస్తతశ్శుద్ధిమవాప్నుయాత్॥ బ్రహ్మాండే॥ అభ్యర్చ్యగంధవస్త్రాద్యైశ్శర్ధరామేనాం మహీభుజా। దీయతేవిప్రవర్యాయసర్వపాపాపనుత్తయే। రాజ్ఞాదత్తాంధరామేనాంనిష్కారణతయాద్విజః। పుణ్యకాలేషుగృహ్ణీయాత్సహిరక్షత్తస్యకిల్బిషంతస్యైవనిష్కృతిర్నాస్తికదాచిద్బ్రహ్మరాక్షసాత్ నిష్కృతిస్తస్యకథితాదశలక్షజపాదిహ॥ పునర్బ్రహ్మోపదేశశ్చకర్తవ్యోబ్రహ్మవిత్తమైః। జప్త్వా

తేనసావిత్రీప్రణవస్సంస్కారమాగతః । అన్యథాసవయోగ్యస్స్యాద్దైవ్యకవ్యేషుకర్మసు। అసంభాష్యోహ్యపాఙ్త్క్తేయోనతేనసహసంవిశేత్॥ సదస్యబ్రహ్మణోరర్థంద్వారస్థానాంతదర్ధకం। తదర్ధజాపకానాంచహోతౄణాంచతత్త్వతః। మార్జనంసర్వదానానామాచార్యాణాంస్వయంభువా। ఉక్తంపురాదక్షమధ్యేలోకస్యాస్యహితైషిణా। అన్యథామృత్యుమాప్నోతికుర్యాదేతత్ప్రయత్నతః॥ ఇతి హేమాద్రాధరాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౩౬౨) ఇకనుభూదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ రాజ్యమునుజక్కగాపాడునట్టి రాజు స్వర్గలోకమును బొందును. శాస్త్రోక్తప్రకారముగ రాజ్యమునుపాలించునట్టి రాజునకు నితరదానములవలన బ్రయోజనమించుకైనను లేదు. అయినను రాజునకనేకములగు పాపములుసంభవించుచుండును. కావుననయ్యాపాపములు పోవుటకొఱకు వేదవేత్తయగు బ్రాహ్మణునిబూజించి భూదానమును జేయవలయునని మార్కండేయమునివరుడువచించె. పుణ్యకాలములయందు భూదానమును జేసినరాజునకు శాశ్వతమగుపుణ్యలోకములగలుగును. అట్టిదానమునుప్రతిగ్రహించినవాడు శాశ్వతమగురాక్షసత్వమును బొందును. కావుననట్టిదోషనివృత్తికొఱకుపునరుపనయనమును జేసికొని పదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయునని శివపురాణమునందు జెప్పబడియె. శాస్త్రోక్తప్రకారముగ రాజుచేనర్పింపబడినభూమిని ధనలోభపరాయణుడై గ్రహించినబ్రాహ్మణుడు పాపభూయిష్ఠుడగును. కావునట్టిబ్రాహ్మణుడాద్రవ్యమును బెట్టి యజ్ఞాదికములను జేయుచో యడల బ్రహ్మరాక్షసుడగును. కావునయజ్ఞమును జేయవలయును. కానిపదిలక్షలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. మఱియును పునరుపనయనసంస్కారమును బొందవలయును. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల పాపరహితుడగునని పద్మపురాణమునందు జెప్పబడియె. బ్రహ్మాండపురాణమునందునునిట్లనే చెప్పబడియె. మఱియును బ్రహ్మసదస్యులుగూడనర్ధప్రాయశ్చిత్తమును జేసికొనవలయుననియును జెప్పబడె.

—— ॥ విశ్వచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ॥ ——

(౩౬౩) అథవిశ్వచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ పురాస్వయంభువా రాజన్ లోకానాంహితకామ్యయా। విశ్వచక్రమిదంసృష్టం రాజ్ఞాం పాపాపనుత్తయే॥ స్థావరాజంగమాశ్చైవ దేవరాక్షసపన్నగాః। యక్షాః పిశాచాః కూశ్మాండావిశ్వ చక్రంసమాశ్రితాః। కాలమృత్యుహరం చేదం సర్వపాపప్రణాశనం॥ రాజ్ఞాం శ్రేయస్కరం దివ్యంవిశ్వచక్ర మిదంద్విజాః॥ ని

నాయ లోకంగతవాన్ హంసారూఢశ్చతుర్ముఖః॥ మాంధాతృప్రముఖాన్ దృష్ట్వా క్షితిపాలాన్మహారాజః॥ దదౌ పరమయా భక్త్యా పిత్రేభ్యో దీయతామితి। ఇత్యుక్త్వా తాన్ తదా దత్త్వా పునర్లోకం జగామ హ॥ తదా ప్రభృతి తచ్చక్రం పూజ్యతే రాజభిస్సదా। దీయతే చ ప్రవక్త్రేభ్యస్సర్వక్రియోపసుత్తయే॥ కూర్మపురాణే॥ యో రాజా బ్రాహ్మణాద్దత్తం విశ్వచక్రం మహత్తరం। అభ్యర్చ్య గంధవస్త్రాద్యైర్ధనాన్నగోపజీవతః॥ విప్రాయ వేదవిదుషే దత్త్వా చేత్పుణ్యసంగమే। తస్య పుణ్యస్య లేశం వా మయా వక్తుం న శక్యతే। కల్పకోటిసహస్రాణి కల్పకోటిశతాని చ। స్థిత్వా స బ్రహ్మణో లోకే పునర్భువముపాగతః। చక్రవర్తిత్వమాప్నోతి కిమన్యైర్బహుభాషితైః॥ మహాభారతే॥ ఏతాదృశం విశ్వచక్రమర్చితం రాజవల్లభైః। దత్తం విప్రేషు గృహ్ణీయాద్యది నిష్కారణాదిహ। న తస్య పునరావృత్తిరాత్మసాద్బ్రహ్మణాముఖాత్। కథంచిన్నిష్కృతిర్దృష్టా మునిభిస్తత్త్వదర్శిభిః। అరణ్యే నిర్జనే స్థిత్వా షణ్మాసం వాయుపూరితః। తత్ర త్రిషవణస్నానం కుర్వన్ సంధ్యాదికాః క్రియాః। మార్తాండోదయమారభ్య యావత్పూర్వాహ్ణసంగతః॥ తావజ్జపేచ్చ సావిత్రీం తిష్ఠన్సంత్రాసపాణికః॥ రవౌ మధ్యంగతే తత్ర మాధ్యాహ్నికమథాచరేత్॥ పునర్జపేచ్చ సావిత్రీం యావదస్తంగతో రవిః। తావద్విరమ్య నిగమాదబ్భక్షో వాయుభక్షకః॥ అశక్తః ఫలాహారః కేవలస్థండిలే స్వపేత్। ఏవం మండలమావర్త్య తస్మాద్దోషాత్ప్రముచ్యతే॥ మార్కండేయః॥ విశ్వచక్రం ద్విజో ధృత్వా ప్రమత్తేన లోభతః। అరణ్యే నిర్జలే దేశే రాక్షసస్స్యాద్భయంకరః॥ న తస్య పునరావృత్తిస్సహస్రాబ్దం మహాభయాత్। ఏషా వై నిష్కృతిర్దృష్టా వసిష్ఠేన మహాత్మనా॥ చతుర్థాంశవ్యయం కృత్వా ప్రాయశ్చిత్తవిధానతః। పునస్సంస్కారవిధినా పునస్సంస్కారమాచరేత్॥ బ్రహ్మహ్నసదేశం సావిత్రీమభ్యసేద్ద్విజపుంగవాత్। ప్రయుతేనాభిషేకేణ నిష్కృతిస్తస్య నాన్యథా॥ తదర్ధం బ్రహ్మణే ప్రోక్తం తదైవ సదస్పతేః। ద్వాస్థానాం జాపకానాం చ తయోరర్ధం ప్రకల్పయేత్॥ విశ్వచక్రం మహద్భూతం సర్వపాపహరం పరమ్। మృత్యువంతర్గ్రహీతానాం దాతుః శ్రేయః ప్రదం సదా॥ ప్రాయశ్చిత్తమిదం విప్రైః విశ్వచక్రధృతాం నృణామ్। ఏతేన శుద్ధిమాప్నోతి నాన్యథా శుద్ధిరీరితేతి॥ ఇతి హేమాద్రౌ విశ్వచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౩౬౩) ఇకను విశ్వచక్ర ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ తొల్లి బ్రహ్మదేవుఁడు లోకములకు హితమును జేయఁదలచి రాజుల పాపమును బోగొట్టుటకొఱకు విశ్వచక్రమునొకటి దానినిర్మించె, అట్లునిర్మిం

చిపాపాపనోదనముకొఱకు రాజులీచక్రమును దానముసేయునటులవిధించె
అదికారణముగనదిమొదలుకొని రాజులచేత నీచక్రముదానముచేయబడుచు
న్నదనిదేవలుడుచెప్పె. బ్రహ్మచేనిర్మింపబడినవిశ్వచక్రమును, శాస్త్రోక్తప్రకా
రముగనర్చించి వేదవేత్తయగు బ్రాహ్మణునకుదానముజేసిన రాజనేకవేల
సంవత్సరములు బ్రహ్మలోకములందునివసించి పిమ్మటచక్రవర్తిత్వమునుబొం
దును. అనగాజక్రవర్తియైపుట్టునని కూర్మపురాణమునందుజెప్పబడె. శాస్త్రో
క్తప్రకారముగరాజులచేనర్చింపబడి దానముసేయబడినవిశ్వచక్రమునుప్రతి
గ్రహించినబ్రాహ్మణుడుబ్రహ్మరక్షస్సగును. అట్టిదోషనివారణకొఱకు ప్రాయ
శ్చిత్తమువిధింపబడియె. అదియెట్లనిననిర్జలమయిన యరణ్యప్రదేశమునందున
లుబదిదినములుండి వాయుపూరితుడైయుండి త్రిషవణస్నానముజేయుచుసం
ధ్యావందనాదిక్రియలనాచరింపవలయును. సూర్యోదయముమొదలుకొనిసూ
ర్యాస్తమయమగువఱకును గాయత్రీజపమునుజేయవలయును. మధ్యాహ్నస
మయముకాగానే మాధ్యాహ్నికక్రియలనుజేయవలయును. అదిమొదలుసూ
ర్యాస్తమయమగువఱకును గాయత్రీజపమునుజేయుచుండి పిమ్మటనుదకమును
భక్షించవలయును. ఉదకపానముచేతజీవింపజాలనివాడు ఫలాహారుడుగావ
లయును. అట్టియాహారమునుభుజించి స్థండిలమునందు శయనించవలయును.
ఇవ్విధముగ నలుబదిదినములుజరిపినయెడలదోషమువలన మోచనమునుబొం
దునని మహాభారతమునందుజెప్పబడియె. విశ్వచక్రమునుప్రతిగ్రహించినవా
డుబ్రహ్మరక్షస్సుగాబుట్టును. కావుననట్టిదోషనివృత్తికొఱకు ద్రవ్యమునందు
నాల్గవభాగద్రవ్యముచు ప్రాయశ్చిత్తపూర్వకముగ వ్యయమునుజేయవలయు
ను. మఱియును పునరుపనయనసంస్కారమును బొందవలయును. బ్రహ్మస
దస్యాదులును పూర్వోక్తప్రకారముగ నర్ధార్థక్రమముగ ప్రాయశ్చిత్తమును
జేసికొనవలయునని మార్కండేయ మునివరుడుచెప్పె॥

## ⟶ ❋కల్పలతాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.❋ ⟵

(౩౬౪) అథ కల్పలతాప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురా
ణె ॥ కల్పవల్లీసురైః పూజ్యా హ్యుత్పన్నా క్షీరసాగరే । విష్ణుప్రియకరీనిత్యం
సర్వదాసర్వదానృణాం ॥ లక్ష్మీరూపామిమాంవల్లీంపూజయిత్వానరాధిప
పుణ్యకాలేషుసంక్రాంతౌ వ్యతీపాతేచవైధృతౌ। విప్రాయాధ్యాత్మవిదుషే
యోదద్యాత్సజనార్దనః॥ మహానారదీయే ॥ లతామియామబ్ధిభవామర్చయి
త్వాజనాధిప । పుణ్యక్షేత్రేపుణ్యకాలె విప్రసాత్కురుతేయది । షష్టికోటి
కులైర్యుక్తో మాతృతఃపితృతస్తథా। విష్ణులోకంసమాసాద్య స్థిత్వాశతవత్స

ర్యాగం। పునర్భవము పాగమ్య ధనవాన్ క్షితిపాలక । బ్రహ్మజ్ఞానముపాగ మ్యాపశ్చాన్నిర్వృతిమాప్నుయాత్॥ విష్ణురహస్యే॥ దత్త్వామిమాంకల్పలతాం రాజభిః పూజితాంశుభాం॥ యోగృహ్ణీయాద్ద్విజః కామాత్సభవేద్రాక్షసో వనే। యావత్తిష్ఠంతిజ్యోతీంషి తావత్తిష్ఠతి రాక్షసః ॥ లైంగే ॥ ఇమాంకల్పల తాందివ్యాం పూజితాంరాజవల్లభైః । దత్తాంపర్వసుకాలేషుద్విజోయస్తాం ప్రతిగ్రహేత్॥ నతస్యపునరావృత్తిశ్చిరాద్వైబ్రహ్మరాక్షసాత్ । తద్భృ హ్మాచసదస్యశ్చ తద్ద్వాస్తాజాపకా అపి॥ రాక్షసాఃక్రూరకర్మాణో భవం త్యేవతతఃక్షణాత్॥ సహస్రంచతదర్ధంచ తదర్ధంవైయథాక్రమం। కల్పలతా ప్రతిగ్రహప్రాయశ్చిత్తం కల్పతరుప్రతిగ్రహప్రాయశ్చిత్తవద్వేదితవ్యం॥ ఇతి హేమాద్రౌకల్పలతాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౬౪) ఇకను కల్పలతాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును గు రించిచెప్పుచున్నాడు॥ పాలసముద్రమునందు బుట్టిన కల్పవృక్షము దేవతల చేత పూజింపబడియె. మఱియును విష్ణువునకు ప్రియకరమైనది. మఱియును కల్పవల్లి లక్ష్మీరూపమనబడును. ఇటువంటికల్పవల్లిని బుణ్యకాలములయందు దానమును జేసినవాడు సాక్షాన్నారాయణతుల్యుడగునని దేవలుడు వచించె. క్షీరసాగరసముద్భవమైన లతనుబూజించి పుణ్యక్షేత్రమునందును, పుణ్యకా లమునందును, దానముచేసినవారియొక్క పితృమాతృకులముల వారినూరు ను విష్ణులోకమునుబొంది యచ్చటనాలుగుయుగములుండి మరల భూలోక మునందు ధనవంతుడైపుట్టి బ్రహ్మజ్ఞానవంతుడై పిదప మోక్షమునుబొందు నని మహానారదీయమునందు జెప్పబడియె. కల్పలతాదానమును గ్రహించిన వాడు నిర్జలమగువనమునందు రాక్షసుడైపుట్టి సూర్యచంద్రు లున్నంతవఱకును రాక్షసత్వమునుబొందియేయుండునని విష్ణురహస్యమునందు జెప్పబడియె. ఈకల్పలతాదానమునుగ్రహించినవానికి కల్పతరుప్రతిగ్రహప్రాయశ్చిత్తము నేవిధించవలయునని లింగపురాణమునందు జెప్పబడియె.

## సప్తసాగరప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౩౬౫) అథసప్తసాగరప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ గారుడపు రాణే॥ లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరోదకార్ణవాః॥ జంబూద్వీపశ్చప్లక్ష శ్చశాల్మలీద్వీపమేవచ, కుశద్వీపశ్చక్రౌంచశ్చశాకఃపుష్కలమేవచ । ఏతేద్వీ పాస్సముద్రాణాం మధ్యేతిష్ఠంత్యనామయాః॥ మేరుశ్చహిమవాన్ శైలః కై లాసోగంధమాదనః । మహేంద్రోమలయశ్శైలస్త్రికూటాఖ్యామహాగిరిః॥ ఏతేతేసప్తశైలాశ్చ లవణోదధిమధ్యగాః॥ జంబూద్వీపేమనుష్యాణామేవసంఖ్య

త్రనిరామయాః। ప్లక్షద్వీపే మహాపుణ్యే తురంగాస్యావసంత్యథ। తథైవ శాల్మలిద్వీపే కిన్నరాస్సంతికామినః। కుశద్వీపే మహారాజ వసంతీచ్ఛావిహారిణః। క్రౌంచద్వీపే మహాపుణ్యే తిష్ఠంతి పితరస్తథా। శాకద్వీపే మహారాజ విశ్వేదేవా వసంత్యథ। వసంతి పుష్కలద్వీపే దేవాశ్చేంద్రపురోగమాః। మర్త్యా అశనమిచ్ఛంతి ప్రత్యహం మునివల్లభ॥ తస్మాన్నాస్తి ప్రభావశ్చ నిగ్రహానుగ్రహే నృణాం। తురంగాస్యాస్తథా రాజన్ వారేవారేన్నకాంక్షిణః॥ కిన్నరాః పక్షమాత్రేణ వ్యాదంత్యన్నం సకృత్సకృత్। కుశద్వీపగతా రాజన్ వింశత్యాదివసాశినః॥ క్రౌంచద్వీపే తు పితరస్సకృన్మాసానుభోజినః। శాకద్వీపే తు శృణు మే విశ్వేదేవా మహాబలాః। విప్రశ్రాద్ధేషు భుంజంతి శ్రాద్ధాహా యత్ర జంతవః॥ దేవాశ్చ పుష్కలద్వీపే ప్రతివర్షప్రభోజినః॥ ఏతైస్సముద్రాః పుణ్యాహాస్సర్ధానం పృథివీపతిః। సహార్ణమనతయా కుర్వన్ స నృపః పురుషోత్తమః॥ సూర్యసోమోపరాగేషు పుణ్యకాలేషు పర్వసు। పుణ్యక్షేత్రే పుణ్యతీర్థే యః కుర్యాత్పృథివీపతిః। అభ్యర్చ్య గంధవస్త్రాద్యైస్సాగరాంస్సప్తసంఖ్యయా॥ కులముద్ధృత్య సహసా దశ పూర్వం దశాపరం। వైకుంఠే వాసమాసాద్య తిష్ఠత్యాచంద్రతారకం॥ ముఖజో ధనలోభేన యో గృహ్ణాత్సప్తసాగరం। కులేన సహ సంయుక్తో రాక్షసస్స్యాద్వనే జలే। యాగార్థం దక్షిణాం గృహ్ణన్ ప్రధానత్వాగమాచ న్। యాగే సర్వవ్యయం కృత్వా నాస్తి తస్య పిశాచతా। ప్రాయశ్చిత్తేన పూతాత్మా ఇహలోకే పరత్ర చ॥ పూతో భవతి రాజేంద్ర నాత్ర కార్యా విచారణా॥ లైంగే॥ యో విప్రః పృథివీపాలాద్గృహ్ణీయాత్సప్తసాగరం॥ కులేనైకేన సంవీతో రాక్షసస్స్యాన్మహావనే॥ అశేషయిత్వా తద్ద్రవ్యం యాగం కుర్యాద్ద్విజో యది॥ తస్య నాస్తి పిశాచత్వమిహలోకే న దోషభాక్॥ నాగరఖండే॥ యో విప్రః పుణ్యకాలేషు రాజ్ఞా దత్తం సుఖాప్తయే॥ సప్తసాగరదానం చ ప్రతిగృహ్యాఘనాతురః॥ రాక్షసత్వం భవేత్తస్య న పునర్జన్మ రాక్షసాత్। తద్దోషపరిహారార్థం ద్వాదశంలక్షమాచరేత్। తస్యోపనయనం భూయో గాయత్రీదానమేవ చ। కుర్యాద్బ్రహ్మోపదేశం చ పునస్సంస్కారమర్హతః॥ గారుడపురాణే॥ విప్రో యది మహామోహాత్ గృహ్ణీయాత్సప్తసాగరం। ససద్యః పతితో భూయాత్పునస్సంసారమర్హతి॥ తద్దోషాపశమాయాలం కుర్యాద్ద్వాదశలక్షకమ్॥ చాతుర్భాగవ్యయేనాపి ప్రాయశ్చిత్తం సమాచరేత్॥ తస్యోపనయనం భూయస్సావిత్రీదానమేవ చ। పునస్సంస్కారరూపేణ కుర్యాద్బ్రహ్మోపదేశనం। వ్యవహారతో మో భూయాదిహలోకే పరత్ర చ। బ్రహ్మసదస్యస్తస్యార్థం ప్రాయశ్చిత్తమిహార్హతః। తయోరర్థం తు ద్వాస్థా

నాంజాపకానాంయథాక్రమం । ప్రాయశ్చిత్తమిదంకార్యం సాగరాణాం ప్రతిగ్రహే॥ అన్యథాదోషమాప్నోతిపతితస్స్యాన్నసంశయః॥ తస్మాత్సర్వప్రయత్నేన ప్రాయశ్చిత్తంసమాచరేత్॥

(౩౬౫) ఇకను సప్తసాగరప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమును విధించుచున్నాఁడు॥ లవణ, ఇక్షు, సురా, సర్పిస్, దధి, క్షీర, ఉదకములనిసముద్రము లేడువిధములుగనున్నయవి. ఈయేడుసముద్రములయందును, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కలద్వీపము, జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలీద్వీపము, అను నేడుదీవులుగలవు. మేరువు, హిమవంతము, కైలాసము, గంధమాదనము, మహేంద్రము, మలయము, త్రికూటము, అనునట్టియేడుపర్వతములు జంబూద్వీపమునందుగలవు. ఈజంబూద్వీపమునందుమానవులురోగరహితులై నివసించియుందురు. మిగులపుణ్యవంతమగు ప్లక్షద్వీపమునందు తురంగముఖమువంటి ముఖముగలవారుందురు. శాల్మలీద్వీపమునందు కిన్నరులుందురు. కుశద్వీపమునందిచ్ఛానుసారముగవిహరించువారుందురు. పుష్కలద్వీపమునందు దేవతలుందురు. మానవులు సర్వకాలములయందును నన్నమును గోరుచుందురు. కావున నిగ్రహానుగ్రహసామర్థ్యములేనివారై యుందురు. తురంగముఖులు ప్రతివారమును నన్నమును గోరుదురు. కిన్నరులు పదునైదుదినముల కొకపర్యాయమన్నమునుగోరుదురు. కుశద్వీపమునందుండు వారిరువదిదినముల కొకపర్యాయమన్నమునుగోరుదురు. క్రౌంచద్వీపమునందుండునట్టి పితృదేవతలు మాసమునకొకతూరి భోజనమును గోరుదురు. శాకద్వీపమునందు నివసించువారు మహాబలవంతులగువిశ్వేదేవులుందురు. వారుపిశ్రాద్ధములయందు భోజనమును జేయుదురు. పుష్కలద్వీపమునందు సంవత్సరమునకొకతూరిభోజనమును జేయునట్టి దేవతలుందురు. ఇట్టివిషయములతోగూడిన సప్తసముద్రములను దానముసేయునట్టిరాజు మిగుల పుణ్యవంతుఁడగును. సూర్యసోమోపరాగములయందును, పుణ్యకాలములయందును, పర్వములయందును, పుణ్యక్షేత్రమునందును, పుణ్యతీర్థమునందును, సప్తసాగరములను గంధపుష్పాదులచేత నలంకరించి దానమును జేసినరాజుపూర్వాపరములయందు పదితరములవఱకునుదనవారలను పుణ్యలోకములను బొందించును. (అనగా సూర్యచంద్రులున్నంతవఱకును వైకుంఠమునందునివసించియుందురనుట) ఇట్టిదానమునులోభముచేతగ్రహించినబ్రాహ్మణుడునిర్జలమగువనమునందుతనకులముతోగూడరాక్షసత్వమునుబొందును. కావునయీగాద్యగ్రముగ సిట్టిదానమును ప్రతిగ్రహిం

చినను, ప్రధానద్రవ్యపరిత్యాగమును జేసినను, యాగమునందు సర్వద్రవ్యప రిత్యాగమును జేసినను రాక్షసత్వమునుబొందనేరడు. మఱియు నిట్టిప్రాయ శ్చిత్తమును జేసికొనినయెడల నిహపరలోకములయందు బూజ్యుడగునని గా రుడపురాణమునందు జెప్పబడియె. రాజాదులవలన సప్తసాగరదానమును గ్రహించినబ్రాహ్మణుడు కులమువారితోడ భిక్షాత్వమునుబొందును. కావు న తద్దోషనివారణకొఱకు నాద్రవ్యమును సర్వమును యాగాదులయందు వ్రయము సేయవలయును. ఇవ్విధముగ జేసినయెడల దోషమించుకైనను లే దని లింగపురాణమునందు జెప్పబడియె. సప్తసాగరదానమును బ్రతిగ్రహిం చినవాడు రాక్షసత్వమును బొందును. కావున దద్దోషపరిహారముకొఱకు పునరుపనయన సంస్కారమును బొందును. మఱియును బదిరెండు లక్షల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయునని నాగరఖండమునందు జె ప్పబడియె. సప్తసాగరదానమును బ్రతిగ్రహించినవాడుతత్క్షణముసంపతి తుడగును. కావున నట్టిదోషశాంతికొఱకు బదిరెండు లక్షల పర్యాయము లు గాయత్రీజపమును జేయవలయును. మఱియు నాద్రవ్యమునందు నాల్గ వభాగమును వ్రయము సేయవలయును. పునరుపనయన సంస్కారమును బొందవలయును. బ్రహ్మసదస్యాదులును నర్థార్ధక్రమముగ బ్రాయశ్చిత్తము నుజేసికొనవలయునని గరుడపురాణమునందు జెప్పబడియె.

——✻ చర్మధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ✻——

(३६६) అథచర్మధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ వాయుపు రాణే॥ పురాచర్మమయీధేను ర్నిర్మితావిశ్వకర్మణా॥ సర్వపాపహరాపు ణ్యా విష్ణులోకప్రదాయనీ॥ తామర్చయిత్వాయోరాజా పుణ్యకాలేషు స ర్వసు॥ దద్యాత్తాం విధివద్విప్ర వర్యాయాధ్యాత్మవేదినే॥ సరాజాకులసం యుక్తో మాతృతఃపితృత స్తథా ॥ యావంతిధేనురోమాణి తావత్కాలం వసేద్దివి॥ తతస్తుసువమాసాద్య చక్రవర్తిత్వమాగతః ॥ తతోజ్ఞానమవా ప్యైవ బ్రహ్మణాసహమోదతే॥ దేవీసారే॥ ధృత్వాచమణామయీంధేనుంపు ణ్యకాలేషురాజభిః॥ దత్తాంవిప్రోనుగృహ్ణీయాద్ధనభోగపరాయణః॥ సప్తజ న్మసురాజేంద్ర విజనేనిర్జలేవనే॥ కృతంపాపమనుస్మృత్య సభవేద్బ్రహ్మ రాక్షసః॥ తస్యనిష్కృతిరద్యాపి దేవ్యాద్వాదశలక్షతః ॥ తస్యోపనయనం భూయఃపునస్సంస్కారమర్హతి ॥ కూర్మపురాణే ॥ యోధృత్వాచర్మణో ధేనుం ద్విజోదత్తాం నృపాత్మజైః॥ పూజితాంపుణ్యకాలేషు నభూయో రా క్షసాన్నరః ॥ తస్యైవ నిష్కృతిర్దృష్టా దేవ్యాద్వాదశ లక్షతః॥ బ్రహ్మ

(౩౭౫) ఇకనుతులాదియందు, ఆచార్యాదులకు జ్వరాదికము సంభ-గొట్టునట్టి మృత్యుపూజావిధానమును దెల్పుచున్నాడు ॥ తులాదిదానములనుప్రతిగ్రహించిన వారలకును, అట్టిదానములయం దాచార్యత్వాదికమును గ్రహించినవారలకును, నానావిధములగు రోగములుసంభవించును, మఱియును మృత్యుదేవతవాయురూపముగ శరీరమునందు ప్రవేశించును, కావునసట్టి దోషనివారణకొఱకు మృత్యుదేవతను గంధపుష్పాక్షతాదులచేత బూజింపవలయును, పిమ్మట నీశాన్యాదిగ్భాగమునందు స్థండిలమునందు సమిదాజ్యచరువులచేత హోమమును జేయవలయును, హోమానంతమందపమృత్యూత్తారణమార్జనమువలె రోగికిమార్జనమును జేయవలయును, తులాది దానములయందాచార్యత్వాదికమును వహించినవారలకు రెండుమూడుసంవత్సరములైన పిమ్మటగూడ నానావిధములగు రోగములుగలిగి యకాలమృత్యువుసంభవించును, కావున మూలగ్రంథోక్తప్రకారముగ తిలాదిదానములను జేయవలయునని మార్కండేయుడుచెప్పె॥

—— * కోటిహోమాదిష్వాచార్యాదీనాం ప్రాయశ్చిత్తమ్. * ——

(౩౭౬) అథకోటిహోమలక్షహోమేచాచార్యాదీనాంప్రాయశ్చిత్తమాహ॥ మహానారదీయే॥ యోవిప్రఃకోటిహోమేషులక్షహోమేషువా నృప। ఆచార్యత్వంయదాకుర్యాత్ దానస్యంతిసత్క్రియాః । దేహాంతేనరకంగత్వా పిశాచాస్యుఖసంజ్ఞకః । తస్యాన్యానిష్కృతిర్నాస్తిత్రిఃపక్రమణాద్భువః॥ లైంగే॥ కోటిహోమేషుయోవిప్రోనిర్నిమిత్తంప్రధానభాక్॥ మహాంతంన కంభుక్త్వాపిశాచోజన్మవాంత్రమే । నిష్కృతిఃకుత్రచిద్దృష్టాశంభునా లోకశమ్భునా। త్రిఃప్రక్రమణాద్భూమేసుతకాశీనివాసనే ॥ ఆజన్మపతనాత్తిష్ఠేత్తదాశుద్ధిమవాప్నుయాత్ । తదాహగౌతమః ॥ కోటిహోమేషు నియమా బహవస్సంతిపార్థివ । మౌనంచ ప్రాసనంధ్యానం హవిష్యాన్నస్యభక్షణం। స్థండిలేశయనంగంధతాంబూలాదీనివర్జయేత్ । మంత్రాంత ముచ్చరేద్భుక్త్వాహవిరుత్తానపాణినా । కృమికీటాస్థికేశాది బాహుళ్యాద్ధాన్యమధ్యతః ॥ సంత్యజ్యనియమానేతా నార్త్విజ్యేవర్తయేద్యది । దోషానియమసంత్యాగాన్న హోమాఫలమశ్నుతే ॥ రాజవిజయే ॥ ఆవ్రతఘ్నంతిలక్షహుత్వా పరార్థంశంభుమంత్రతః। సఏవగ్రామచండాల స్తంకదానాలపెత్సుధీః। చతుర్దశచచండాలా గ్రామస్థాః॥ తానాహ॥ లైంగే॥ రజకశ్చర్మకారశ్చ నటోబురుడఏవచ। కైవర్తమేదభిల్లాశ్చ స్వర్ణకారశ్చసౌచికః॥ తక్షుక స్త్రీలయంత్రీచసూనుశ్చక్రీతధార్ద్యజీ॥ తఏతేగ్రామచండాలా వాద్యాతైరణాపి నాల్ప

పేత్। అపిచ॥ తపేత్ బ్రహ్మచాండాలావాజ్ఞ్యాత్రైణాపినాలపేత్। పరార్ధంకా
శికాయాయాదత్తాగ్నేః కేకనానుగః। అతోపిదోషబాహుళ్యాద్ధామమేనంపరి
త్యజేత్॥ ఈషన్మాత్రస్యసౌఖ్యస్యదోషమానంత్యమిచ్ఛుభిః॥ నృభిస్త్యాజ్యః కో
టిహోమోలక్షహోమశ్చ పార్థివ॥ బ్రహ్మాండే॥ హోమంకృత్వావృథా
విప్రః కోటింలక్షమథాపివా। యాగాద్యభావేకుర్వీత ప్రాయశ్చిత్తంవిశుద్ధయే
విప్రస్యార్ధేకృతే హోమేషడబ్దంకృచ్ఛ్రమాచరేత్॥ బాహుజార్ధంకృతే హోమే
షట్ చైవత్రిగుణంచరేత్। వణిగ్భ్యస్త్రిగుణంప్రోక్తం పాదజేభ్యశ్చతుర్గుణం
సంకరార్ధంకృతే హోమేషడ్గుణంపూర్వవచ్చరేత్। సదస్యబ్రహ్మణోరర్ధంత
దర్ధంఋత్విజాంస్మృతం। పూర్వోక్తప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్॥ ప్రా
యశ్చిత్తాకరేతుదోషమాహ॥ మార్కండేయః॥ లక్షహోమేకోటిహోమే
ఆచార్యఋత్విజోయది॥ తద్దోషపరిహారార్థమకృత్వానిష్కృతిం సకృత్। పై
శాచ్యమనుభూయాథతేఘోరేథ వేద్యపి। భిషక్సాత్త్రీణిజన్మానిగర్దభః పం
చజన్మసు। వానరస్సంభవేత్పశ్చాత్ తస్యకలాసస్తతః పరం॥ తతోభువంసమా
సాద్యబహురోగీప్రజాయతే। ఆచార్యార్ధంతయోఃప్రోక్తంతదర్ధంచర్త్విజాం
పృథక్ ప్రాయశ్చిత్తంపూర్వోక్తరూపంపూర్వవత్సర్వంకుర్యాత్॥ లక్షహోమేచైవమేవ॥ లక్షహోమేకోటిహోమేచ ప్రాయశ్చిత్తార్థమాచార్యస్య।
తదర్ధంసదస్యబ్రహ్మణోః। తదర్ధమృత్విజాం। తదాహ॥ బోధాయనః॥ లక్షేచ
కోటిహోమేషోడ్ఢంప్రాయశ్చిత్తంప్రధానకే॥ తదర్ధముభయోఃప్రోక్తంతద
ర్ధంచర్త్విజాంపృథక్॥ ప్రాయశ్చిత్తంసర్వంపూర్వవత్కుర్యాత్॥ ఇతి హే
మాద్రౌలక్షహోమకోటిహోమప్రాయశ్చిత్తమ్॥

(౩౬౮) కోటిహోమాదులయం దాచార్యత్వాదికమును వహించి
నవారలకు విధించినప్రాయశ్చిత్తవిధానముసమాప్తము॥ కోటిహోమ
ములయందును, లక్షహోమములయందును, ఆచార్యత్వమునువహించినవా
రలసత్క్రియలన్నియును నాశమునుబొందును. మఱియును దేహాంతమందున
రకమునుబొందును. పిమ్మటనుల్మ్ముఖమనుపిశాచమైపుట్టును. ఇట్టిదోషముభూ
మికి మూడుపర్యాయములు ప్రదక్షిణముసేయుటచేత శాంతమగుననిమహా
నారదీయమునందుజెప్పఁబడెను. కోటిహోమములయందు ప్రధానత్వము
నుబొందినబ్రాహ్మణుడు గోప్పదగునరకమునుసనుభవించి మూడుజన్మములద
నుక పిశాచజన్మమునవలంబించును. అట్టిదోషనివారణకొఱకు మూడుపర్యా
యములు భూప్రదక్షిణమును జేయవలయును. కాశీనికాశీవాసమునైననుజే
యవలయునని లైంగమునందుజెప్పఁబడియె. కోటిహోమములయం దనే

కములగునియమములు గలవు. ఎవ్వియనినమౌనము, పద్మాసనము, ధ్యానము, హవిష్యాన్నభక్షణము, స్థండిలశయనము, గంధతాంబూలాదివర్జనము, మొదలగువానినాచరింపవలయును. ఇట్టినియమములను వదలినయెడల హోమఫలమునుబొందఁజాలడని గౌతముఁడు చెప్పె. రజకుడు, చర్మకారుడు, నటుడు, బురుడుడు, కైవర్తుడు, మేదుడు, భిల్లుడు, స్వర్ణకారుడు, సౌచికుడు, తక్షకుడు, తిలయంత్రీ, సూనుడు, ధ్వజి, అనువారలు గ్రామచండాలురనబడుదురు. ఇట్టిచండాలురనువాక్యమాత్రముచేతగూడ బూజింపగూడదు. పరులకొఱకు గాశికిఁబోవువాడును, పరప్రేతములనుదహించువాడును, ఎముకలనుగొనిపోవువారల వెంటనంటిపోవువాడును, బ్రహ్మచండాలురనబడుదురు. ఈకృత్యములకంటె కోటిహోమలక్షహోమములు పాపమునుఁగలుగఁజేయునవియగును. అల్పసౌఖ్యమునకుఁగా నధికపుణ్యమునుబోగొట్టుకొనగూడదని లింగపురాణమునందుజెప్పఁబడియె. బ్రాహ్మణుడు వ్యర్థముగా కోటిహోమమునైనను, లక్షహోమమునైనను, జేసియాగాదులను జేయునపుడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. బ్రాహ్మణార్థముగ జేసినహోమమునందు షడబ్దకృఛ్రమునాచరింపవలయును. క్షత్రియులకొఱకు జేసినహోమమున ను షడబ్దకృఛ్రమును ద్విగుణితముగ జేయవలయును. వైశ్యులకొఱకు జేసినహోమమునందు త్రిగుణాధికముగ జేయవలయును. సంకరునికొఱకు జేసినహోమమునందు షడబ్దకృఛ్రమును షడ్గుణితముగ జేసికొనవలయునని బ్రహ్మాండమునందుజెప్పబడియె. లక్షహోమమునందును, కోటిహోమమునందును, ఆచార్యత్వమును, ఋత్విక్త్వమునువహించినవారు పిశాచత్వమునుబొంది తిలఘాతకుడైపుట్టును. అనంతరమందు మహాదుజన్మములదనుక వైద్యుడైపుట్టును. అనంతరమందు గాడిదెయైపుట్టును. పిమ్మటక్రమముగ వానరజన్మమును, కృకలాసజన్మమును, బహురోగయుతమగు మానవజన్మమును, బొందుదురు. కావున నిట్టిదోషనివారణకొఱకు బూర్వోక్తమగు ప్రాయశ్చిత్తమునాచరింపవలయును. సదస్యబ్రహ్మలు సగముప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఋత్విజులింకులో సగముప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయుడువచించె. బోధాయనుడును నిటులనేచెప్పె.

——* కాలచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(౩౭౭) అథేదానీంకాలచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ కౌత్స్యే జన్మన్యేకత్రపైశాచ్యంకాలచక్రప్రతిగ్రహే॥ విప్రోభవతిదుష్టాత్మాపూర్వజైఃకారణైర్వసా॥ మాత్స్యేభ్యోఽన సక్తిర్విప్రో సౌరిచక్రప్రతిగ్ర

హే। పిశాచోభవతిక్షిప్రం రాజ్ఞః పాపానువర్తినః । తస్యాన్యానిమకృతిర్నాస్తీతి ప్రకృచ్ఛ్రశతత్రయాత్ । సతిక్రియాప్తస్య నశ్యన్తిపునస్సం స్కారము హాత॥ గారుడే॥ ముఖజో యమచక్రస్యసంగ్రహీ పాపపురుష్యన్తే॥ పిశాచత్వంభవేత్తస్య జన్మన్యేకగ్రిహమపి। నిష్కృతికథితావిప్రైస్తప్తకృచ్ఛ్రశతత్రయాత్। అన్యథాదోషమాప్నోతిప్యాకృత్యానియమానిపూర్॥ స్థవిరయోఃపిత్రోస్సంరక్షణమ్॥ పశుదశఃపూర్ణమాసాదయః॥ ఏతేనియమాః॥ ఏతేషాంనియమానాంలోపేదోషప్రాప్తిః॥ తస్మాదేతత్పరిపూరణార్థం కాలచక్ర కాలపురుషాదిప్రతిగ్రహాః॥ ఏతద్బ్రేవ్యస్యసర్వస్యవ్యయేఏకాంరజనీముపోష్యపంచగవ్యప్రాశనంవిశోధనం। అన్యథాతప్తకృచ్ఛ్రశతత్రయపూర్వకప్రాయశ్చిత్తంకుర్యాత్॥ ఉభయోరేతయోరభావేపిశాచత్వానంతరం సహస్రవృషణోనామమృగవిశేషోజాయతే॥ తదాహకౌర్మే॥ పిత్రాదిరక్షణాభావే నియమానామసమ్భవే॥ ప్రాయశ్చిత్తమకృత్వాతు సహస్రవృషణోమృగః॥ తతఃపరంవరాహస్స్యాత్పశ్చాల్లస్త్రిషుజన్మసు॥ తస్మాదేతద్విశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తంసమాచరేత్॥ ఉభయోర్లోకయోః పూజ్యఉభాలాకౌతరేత్తదా ॥ ఇతికాలచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౭౭) ఇకనుకాలచక్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమునుగురించిచెప్పుచున్నాడు॥ కాలచక్రమునుప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు పిశాచత్వమును బొందునని కూర్మపురాణమునందు జెప్పబడియె. మాత్స్యపురాణమునందును నిటులనేచెప్పబడెను. మఱియునుతప్తకృచ్ఛ్రశతత్రయమువలన దోషరహితుడగును. ఇట్టిప్రాయశ్చిత్తమునుజేసికొననివాని సుకృతములన్నియునాశమునుబొందుననియును జెప్పబడియె. గారుడపురాణమునందును నిటులనేచెప్పబడియె. తల్లిదండ్రులసంరక్షణకొఱకును, యాగాదులకొఱకును కాలచక్రమునుప్రతిగ్రహించినయెడల దోషముగలుగనేరదు. ఇట్టికృత్యములయందుదప్పదక్కిన కార్యములకొఱకు లుబ్ధతచేత గాలచక్రమునుబ్రతిగ్రహించినవాడు స్వదోషనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ప్రాయశ్చిత్తమును జేసికొననివాడు సహస్రవృషణములుగలమృగమైపుట్టును. అనంతరమందువరాహజన్మమునుబొందును. పిమ్మటమూడుజన్మములయందు బిడాలత్వమునుబొందును. కావునపాపనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమునుజేసికొనవలయునని కౌర్మమునందు జెప్పబడియె.

—— * కాలపురుషప్రతిగ్రహప్రాయశ్చిత్తం. * ——

(౩౭౮) ఇదానీంకాలపురుషప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాంద

శ్లో॥ రాజ్ఞః పీడానిబద్ధస్య సూర్యసోమగ్రహేపివా। పుణ్యకాలే పుణ్యతీర్థే ద్విజో భోగపరాయణః॥ గృహ్ణీయాత్కాలపురుషం సతుకాలవశో భవేత్ । తతః పరం పిశాచస్స్యాచ్ఛూన్యాగారేషు సర్వదా॥ మాత్స్యే॥ పుణ్యకాలే పుణ్యతీర్థే ద్విజో భోగపరాయణః। గృహ్ణీయాత్కాలపురుషం రాజ్ఞో దోషానువర్తినః॥ యమస్యసదనం గత్వా యమపాశనిపీడితః। తతః పరం పిశాచస్స్యాచ్ఛూన్యాగారేషువర్తయన్ ॥ సన్త్రాసయన్సర్వజనాన్ బాలవృద్ధాతురానపి । తస్య పాపనివృత్తిర్దృష్టా గాయత్ర్యాః కృచ్ఛ్రలక్షతః ॥ తిలాన్సన్త్రీహియావా న స్త్రావ కాలంనః ష్కృతిః। కృచ్ఛ్రలక్షేణగాయత్ర్యాస్తిలాభస్మీభవంత్యధ॥ లైంగే॥ కాశ్యాదిపుణ్యతీర్థేషు పుణ్యకాలేషు భూమిపాత్। గృహ్ణీయాత్కాలపురుషం ద్విజో రోగస్సమిత్తతః ॥ సతుకాలవశం యాతి బహుళ్లజ్జలయావృతః । శూన్యాగారేషు సర్వేషు పిశాచస్సంచరన్భవేత్॥ కృచ్ఛ్రలక్షేణ వేదమాతుర్నిష్కృతిస్స్యాన్నచాన్యధా। తిలాస్సన్త్యత్రయావన్తః పురుషే కాలసంజ్ఞితే॥ తావన్త్యేతాని పాపాని రాజ్ఞస్తస్య పరిగ్రహాత్। తదానిశం తిలంవిప్రం తస్మాచ్ఛిప్రస్సపాతకీ॥ తంకదానాలపేచ్ఛ్వపస్మాన్నకదాతం నావలోకయేత్। తస్మాద్విశుద్ధిం కుర్వీత పంచలక్షైర్నచాన్యధా॥ స్సర్వవ్యయంవాకురుతే యాగార్థం నసదోషభాక్। కాలచక్రం కాలపురుషం ద్వయమేతత్సుంభువి ॥ యమస్తుకాలపురుషశ్చక్రంతస్యాయుధం మహత్ । ఉభయం యది గృహ్ణీయాద్దోషస్తత్రన గణ్యతే॥ ప్రాయశ్చిత్తేనపూతాత్మా ఉభయం సన్తరేత్తదా॥ ఇతి హేమాద్రౌ కాలపురుషప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౩౭౮) ఇకను కాలపురుషప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నారు॥ పీడాదుల చేతనిబద్ధుడయిన రాజునకు బిడా పరిహారమగుటకొఱకు సూర్యసోమగ్రహణ సమయముల యందైనను, పుణ్యకాలమునందైనను, పుణ్యతీర్థమునందైనను, కాలపురుషప్రతిగ్రహమును జేయువలయును. ఇట్టిదానము నుగ్రహించినవాడు పిశాచత్వమును బొందుననిస్కాందపురాణమునందు జెప్పబడియె. పుణ్యకాలమునందును, పుణ్యతీర్థమునందును, బ్రాహ్మణుడు భోగపరాయణుడై కాలపురుషదానము నుగ్రహించిన యెడల మరణానంతరమందు యమమందిరమునకుబోయి యమపాశముల చేతబద్ధుడగును. అనంతరమందు పిశాచరూపమును ధరించి శూన్యగృహములయందు సంచరించుచుండును. అట్లు సంచరించుచు బాలవృద్ధాతురులను, సర్వజనులను బాధించును. కావున నట్టిదోషనివృత్తికొఱకై దులక్షలప ర్యాయములు గాయత్రీ జపమును జేయవలయును. తిలలెంతకాలము దనుకనుండునో యంత కాలము వఱకును నిష్కృతిగ

లుగ నేరదు. అయినదులక్షలపద్యాయములు గాయత్రీజపమును జేయుటవలన దిలలన్నియునుభస్మమగునని మాత్స్యపురాణమునందుజెప్పఁబడియె. లైంగమునందునునిటులనేచెప్పబడియె. మఱియును గాలచక్ర కాలపురుష దానములనుబ్రతిగ్రహించుటచేత గలిగినద్రవ్యమును సర్వమునుక్రయమునుచేసినను, ఆద్రవ్యమునుబెట్టి యజ్ఞమునుజేసినను దోషనివృత్తియగుననియును లైంగమునందేచెప్పఁబడినది.

## ※ గజప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ※

(౩౭౯) అథగజప్రతిగ్రహప్రాయశ్చిత్తముహ॥ దేవీపురాణే॥ గజప్రతిగ్రహీతాచ విప్రఃపుణ్యాహసంజ్ఞమే। నిత్యంనైమిత్తికంకామ్యమిష్టాపూర్తాదికంచయత్॥ తత్సర్వంవిఫలంయాతిభిన్నభాణ్డోదకంయథా। నిత్యకర్మఫలాభావాచ్చక్రీభవతిభూతలే॥ చక్రీకులాలః॥ నిత్యంస్నానసన్ధ్యాది॥ నైమిత్తికంగ్రహణస్నానాది॥ కామ్యమనన్తవ్రతాది॥ ఇష్టమగ్నిష్టోమాది॥ పూర్తంతటాకఖననిర్మాణాది॥ సప్తసన్తానమితియావత్॥ తదేవాహకౌర్మే॥ తటాకోఖననం త్దేవాలయబ్రహ్మస్థాప్యంసురాలయః। సత్రంచేతిర్వనకాసారాన సప్తసన్తానమిష్యతే॥ చతుర్దశచణ్డాలభేదాః॥ మార్కణ్డేయపురాణే॥ రజకశ్చర్మకారశ్చనటోబురుడఏవచ। కైవర్తమేదభిల్లాశ్చస్వర్ణకారశ్చసౌచికః॥ తక్షకస్తిలయంత్రీచసూనుశ్చక్రీతథాధ్వజీ। చతుర్దశసమాఖ్యాతాశ్చణ్డాలాఃపరికీర్తితాః॥ నిత్యకర్మభ్రంశీనామధారకఇత్యుచ్యతే॥ తదేవాహశివపురాణే॥ శూద్రాత్పతితాః కర్మహీనావేదహీనాశ్చగూహకః। లోకేకుసీదవృత్తిశ్చనామధారకసంజ్ఞితాః॥ అతఃప్రతిగ్రహోరాజకగజప్రతిగ్రహీతస్సాధువర్తినామ్। యాగాదిస్నాన్నవేతాతనదోషస్త్రప్రతిగ్రహే॥ అన్యథాదోషమాప్నోతిదుఃఖీస్యాజ్జన్మజన్మని॥ శంభుపురాణే॥ నిష్కృతిస్తస్యకథితాగజంయస్సమ్ప్రతిగ్రహేత్। చాంద్రాయణత్రయంకృత్వాపునస్సంస్కారమర్హతి॥ స్కాందే॥ హస్తినంప్రతిగృహ్ణీయాద్యోద్విజశ్శృంఖలాన్వితమ్॥ తస్యైవనిత్యకర్మాణిఃఫలంతిద్విజన్మనః। చాంద్రాయణత్రయంకృత్వాపునస్సంస్కారకృద్ద్విజః॥ శుద్ధిమాప్నోతిపండాలాదన్యథాపతితోభవేదితి। చాంద్రాయణలక్షణంకృచ్ఛ్రప్రకరణేఽభిహితమ్॥ భవిష్యోత్తరే॥ మంజూషాశ్శృంఖలాబద్ధంహస్తినంపాపదాయినమ్। దేవాలయేపుణ్యతీర్థేయోగృహ్ణీయాద్ద్విజాధమః॥ కులాలకస్ససద్యస్స్యాత్తస్యనిత్యంవినశ్యతి। చాంద్రాయణత్రయంకృత్వాశుద్ధిమాప్నోతిదైహికీం॥ పునస్సంస్కారపూర్వకంకుర్యాద్ద్యాగాదికంపునః। అన్యథాదోషమాప్నోతిపుత్రహానిశ్చజాయతే॥ ఇతిహేమాద్రౌగజప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౩౭౯) ఇకనుగజప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాండు॥ పుణ్యకాలములయందును, పుణ్యతీర్థములయందును, ఏనుగునుప్రతిగ్రహించువానియొక్క నిత్యనైమిత్తికకర్మలన్నియును ప్రబద్ధమైనకుండలోనియుదకము వలెనశించిపోవును. అట్లునిత్యకర్మలన్నియునునశించిపోవుటవలనప్పాట గుమ్మర వాడైపుట్టును. నిత్యకర్మలనగా స్నానసంధ్యాదికము. కామ్యకర్మయనగాన నంతవ్రతాదికము. నైమిత్తికమనగాగ్రహణస్నానాదికము. ఇష్టమనగానగ్నిష్టోమాదికము. పూర్తమనగాతటాకఖననిక్షేపాదికము. సత్సంతానము గూడపూర్తమనబడును. రజకుడు, చర్మకారుడు, నటుడు, బురుడుడు, కైవర్తుడు, మేదుడు, భిల్లుడు, స్వర్ణకారుడు, సౌచికుడు, తక్షకుడు, తిలఘాతకుడు, సూనుడు, కులాలుడు, ధ్వజి, అనుపదునల్వురును చండాలురనిచెప్పబడుదురని మార్కండేయ పురాణమునందుజెప్పబడియె. నిత్యకర్మలనువదలినవాడు నామధారకుడనబడును. శూద్రాపతియును, కర్మహీనుడును, వేదహీనుడును, దూషకుడును, కుసీదుడును, అగ్రబ్రాహ్మణులు నామధారక బ్రాహ్మణులనబడుదురు. ఇట్టివారివలనదానాదులను ప్రతిగ్రహించిన వారు మాటిమాటికిని దుఃఖవంతులైపుట్టుదురనిశివపురాణమునందుజెప్పబడె. గజదానమునుగ్రహించినవాడు మూడు చాంద్రాయణములను జేసిపునరుపనయన సంస్కారమును బొందవలయునని శంభుపురాణము నందు జెప్పబడియె. స్కాంద పురాణభవిష్యోత్తర పురాణముల యందును నిటులనె చెప్పబడియె.

—— * శ్వేతాశ్వప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. * ——

(౩౮౦) అథ శ్వేతాశ్వప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ పురాదుర్వాససశ్శాపాద్గతైశ్వర్యైః పురన్దరః । తదర్థంమధ్యతేసిన్ధుర్దివిజైరాతుసాన్వితైః॥ ఐరావతఃకల్పతరుశ్చన్ద్రమాఃకమలోద్భవా । ఉచ్చైశ్శ్రవాస్సముత్పన్నశ్శ్వేతాశ్వస్తదనన్తరమ్॥ దేవమధ్యేహరిస్సాక్షాదిదమాహావచస్తదా శృణ్వన్తుదేవతాస్సర్వాశ్శ్వేతాశ్వంతంభువస్థలే ॥ సపల్యాణంసకవికంసాయుధంవ్యాధివర్జితమ్ । యోరాజావిప్రసాత్కుర్యాత్సగచ్ఛేన్మామకంపురమ్॥ తంహయంయోనుగృహ్ణీయాద్ద్విజఃపాపపరాయణః । యాగాదికమకృత్వాతుఆత్మభోగపరాయణః॥ సభవేన్మరణేవిప్రో గర్దభఃక్రోధసంయుతః॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి తప్తకృచ్ఛ్రశతత్రయాత్ ॥ లైంగే॥ శ్వేతాశ్వంపుణ్యకాలేషుపుణ్యతీర్థేషుపర్వసు । సాయుధంసహపల్యాణముపస్కరసమన్వితమ్ ॥ నిష్కారణంద్విజోధృత్వాప్రజాద్గర్దభతాంభువి । తస్యైవనిష్కృతిరి

యంకథితామునిపుంగవైః॥ తత్తప్తకృచ్ఛ్రత్రయంకృత్వా కేశానాంవపనంచరేత్।
త్రయంత్రిశతమ్॥ ఉపోష్యరజనీమేకాం పఞ్చగవ్యేనశుద్ధ్యతి। యాగార్థక్రయణే
తస్యపఞ్చగవ్యమలంసకృత్॥ సప్రాయశ్చిత్తమ్॥ తస్మాత్పాపవిశుద్ధోభవతి॥ మా
త్స్యే॥ సాయుధంచసపల్యాణం ముఖసూత్రసమన్వితమ్। పుణ్యకాలేషుతీర్థేషుద
త్తంరాజ్ఞాద్విజోగ్రహీత్॥ దేహేనైతస్యవైజన్మఖరస్యక్రోష్ఠజన్మనః। తద్ధనేన
ద్విజోయాగమృణమోచనమేవవా॥ అకృత్వాయదిభోగీస్యాత్సద్యోగర్దభో
భవేత్। ప్రాయశ్చిత్తమిదంకృత్వాతప్తకృచ్ఛ్రశతత్రయమ్॥ ఉపోష్యరజనీమె
కాంపంచగవ్యేనశుద్ధ్యతి॥ బ్రహ్మాండే॥ ద్విజోహయంశ్వేతరూపంగృహ్ణీ
యాత్పుణ్యసంగమే। తస్యాన్యాసనవృత్తిర్నాస్తి తప్తకృచ్ఛ్రశతత్రయాత్॥ కే
శానాంవపనంకృత్వాపంచగవ్యేనశుద్ధ్యతి॥ ఇతిశ్వేతాశ్వప్రతిగ్రహప్రాయ
శ్చిత్తమ్॥

(౩౮౦) ఇకనుశ్వేతాశ్వప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును దెల్పు
చున్నారు॥ తొల్లిదూర్వాసమునిప్రదత్తశాపమువలన ఇంద్రుడుసకలైశ్వర్యర
హితుడయ్యె. అప్పుడు దేవదానవులు దేవేంద్రునికొఱకు సముద్రమునుమథిం
చిరి. ఆసమయమునందాసముద్రమునుండియైరావతము, కల్పతరువు, చంద్రు
డు, లక్ష్మీదేవి, ఉచ్చైశ్శ్రవము, శ్వేతాశ్వము, అనునవియుదయించె. అ
ప్పుడు నారాయణుడు సకలదేవమధ్యయందునునిలిచియిట్లనియె. దేవోత్తము
లారా! శ్వేతాశ్వమునుజక్కగనలంకరించి దానమునుజేసినరాజు నాలోక
మునుబొందును. అట్టిదానముప్రతిగ్రహించి యాద్రవ్యమువలన యాగాది
కమునుజేయనిబ్రాహ్మణుడు భూలోకమునందుగాడిదెయైపుట్టును. కావున
నట్టిదోషనివృత్తికొఱకు మూడునూరులతప్తకృచ్ఛ్రములను ప్రాయశ్చిత్తార్థ
ముగనాచరింపవలయునని కూర్మపురాణమునందుజెప్పబడియె. లైంగమునం
దునునిటులనేచెప్పబడియె. శ్వేతాశ్వదానమునుబ్రతిగ్రహించుటవలన గలిగిన
ధనమును యాగాదులకుపయోగించినయెడల ప్రాయశ్చిత్తమును జేసికొనన
క్కఱలేదు. మాత్స్యమునందునుబ్రహ్మాండమునందును నిటులనేచెప్పబడియె.

※ తిలచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ※

(౩౮౧) అథతిలచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ పురా
శంభూరథారూఢః ప్రతస్థేత్రిపురసాధనే। వేదాహయాస్సూర్యచంద్రౌరథచ
క్రేబభూవతుః॥ మేరుర్ధనుర్గుణశ్శేషస్సాయకస్తుచతుర్ముఖః। సారథి
ర్భగవాన్ సాక్షాచ్ఛమ్భురేవహిసాధకః॥ తథాపితేనరాజేంద్రనసాధ్యం
తత్పురత్రయం। తిలచక్రంహరిరిదంనిర్మాయాతదపూజయత్॥ పూజితంప్ర

వర్యాయ దత్వాశీఘ్రంపురత్రయమ్ । అజయత్పునరాగత్య మహేంద్రాయ కథాంహరిః॥ బిడౌజాస్తుస్వయంకృత్వాప్యజయచ్ఛత్రుమండలం। సర్వపాపహరంపుణ్యం సర్వాపద్వినాశనమ్।రాజ్యదంస్వర్గదంన్యాణాం తిలచక్రంసుదుర్లభమ్॥ పూజయిత్వాద్విజాగ్ర్యాయయోదద్యాత్ససరాఘవ॥ అనుభూయభువశ్చక్రం తవంతేహరిమశ్నుతే॥ నాకంజేః పుణ్యకాలేప్రాప్యతీర్థే తిలచక్రంభువఃపతిః।పూజయిత్వాద్విజెదద్యాత్తస్యాంతోనాస్తికుత్రచిత॥సభువామండలంసాగరంశతవర్షంస్వైశ్వసహ । పాయిలత్వాహశేష్వేస్వర్గచ్చైత్స్వస్థలసంయుతః॥ తచ్చక్రంయోద్విజోధృత్వాబహుభిఃకారణైర్వినా । రాజభిఃపుణ్యకాలేషుదత్తంలోభ రాయణః ॥ సభవేచ్ఛ్వవిచండాలస్త్రిలఘాతీత్రిజన్మసు॥ తస్యాన్యాయప్రతిగ్రాహ్యస్తిక్రుచ్ఛ్రాత్సాంతపనాచ్ఛతాత్॥ నిప్రకృతిరక్షతయాగాదికవిషయమ్॥ యాగాదికంకృత్వాఏకాహమపౌష్యపంచగవ్యమేవాలం ॥ సప్రాయశ్చిత్తమ్ ॥ తదేవాహశివధర్మే ॥ తిలచక్రంద్విజోధృత్వానిషాకారణతయాన్నృప । సభవేత్తిలఘాతీచత్రిషుజన్మసుపాపభాక్ ॥ కృత్వాతంసాన్తపనంశుద్ధోభవతిపాపతః ॥ అన్యథాపాపమేవాశుభుక్త్వానరకమశ్నుతే॥ కృఛ్రంసాంతపనంనామమహాపాతకనాశనమ్ । ఏతచ్చతంద్విజఃకృత్వాతస్మాద్దోషాత్ప్రముచ్యతే॥ సాంతపనకృచ్ఛ్రలక్షణం కృచ్ఛ్రప్రకరణేభిహితమ్॥ ఇతి హేమాద్రౌతిలచక్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౩౦౧) ఇకనుదిలచక్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ తొల్లి పరమేశ్వరుడు త్రిపురాసురులనుసంహరింపదలచి రథారూఢుఁడయ్యె. అరథమునకువేదములుగుఱ్ఱములయ్యె. సూర్యచంద్రులువక్రాకారములనుధరించిరి. మేరువుధనుర్గుణమయ్యె. బ్రహ్మదేవుఁడు సారధియయ్యె అట్టిరథమునధిష్ఠించి యును బరమేశ్వరుడుపురత్రయమును సాధింపజాలఁడయ్యె. అంతటనారాయణుండు తిలచక్రమునునిర్మించిపూజించె. దానసామర్థ్యమువలన బరమేశ్వరుడుజయమునుబొందెను. పిదపనారాయణుండీవిషయమునుమహేంద్రునకుఁ దెల్పె. అప్పుడింద్రుడుతిలచక్రమునుబూజించి దానిసామర్థ్యమువలనశత్రుమండలమునుజయించె. కావునదిలచక్రము సర్వాభీష్టములనుబొగొట్టునదియును, సకలైశ్వర్యములనునొసంగునదియునునైతింగి బ్రాహ్మణునకుదానముసేయువలయును. అట్లుదానముసేయుటవలన సకలభోగములననుభవించి నారాయణసాయుజ్యమునుబొందుదునని బ్రహ్మాండపురాణమునందుజెప్పబడియె, రాజగువాడు పుణ్యకాలములయందైనను, పుణ్యతీర్థములయందైనను, తిలచక్రమునుబూజించి దానమునుజేసినయెడల సకలసామ్రా

జ్యములను ననుభవించి పిమ్మట వారిసాయుజ్యమును బొందును. అట్టి దానమును బ్రతిగ్రహించినవాడు మూడు జన్మములదనుక తిలఘాతకుడై పుట్టును. కావున నట్టిదోషనివృత్తి కొఱకు నూరుసాంతపనకృచ్ఛ్రములను ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయును. అట్లుగాదేని తిలచక్రదానమును బ్రతిగ్రహించుటవలన గలిగిన ద్రవ్యమును యాగాదులకుపయోగించెనేని యొక్కదినముపవసించి పంచగవ్యప్రాశనను జేయుటచేత బవిత్రుడగునని స్కాందపురాణమునందు జెప్పబడియె. శివధర్మమనుగ్రంథమునందును నిటులనే చెప్పబడియె.

## —* తిలగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. *—

(౩౮౨) అథేదానీంతిలగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ బ్రాహ్మణోబ్రహ్మసమ్పన్నో యమలోకభయాతురః। గర్భంతిలమయంక్వాపి నగృహ్ణీయాజ్జనాధిప॥ తిలగర్భంద్విజోధృత్వా తిర్యగ్యోనిత్వమాప్నుయాత్। నతస్యపునరావృత్తిస్తిర్యక్త్వంతోర్నరాధిప॥ నారదీయే॥ ఇహలోకెసుఖంభుంజన్ పరలోకభయాతురః॥ త్యజేత్తిలమయంగర్భ మన్యథాసూకరోభవేత్॥ విష్ణుధర్మే॥ నిష్కారణంతిలమయం గర్భంధృత్వాద్విజోయది।అనన్తంనరకంభుక్త్వా తిర్యగ్యోనిత్వమాప్నుయాత్॥ దేవీపురాణే। ధృత్వాతిలమయంగర్భం పూర్వజఃకారణంవినా। మహాదోషమవాప్నోతి సూకరోభవిజాయతే॥ హిరణ్యగర్భప్రతిగ్రహప్రాయశ్చిత్తవత్సర్వంకుర్యాత్॥ ఇతి తిలగర్భప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౮౨) ఇఁకను తిలగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రహ్మసంపన్నుఁడగు బ్రాహ్మణుఁడు యమలోకభయాతురుఁడై తిలగర్భమును బ్రతిగ్రహింపఁగూడదు. తిలగర్భమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుఁడు తిర్యగ్యోనియందుఁ బ్రపంచమున్నంతవఱకును బుట్టుచుండునని బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇహపరలోకములయందు సుఖమునుబొందఁగోరువాఁడు తిలమయగర్భమును బ్రతిగ్రహింపఁగూడదు. లుబ్ధుఁడైగ్రహించెనేని సూకరమైపుట్టునని నారదీయమునందుఁ జెప్పఁబడియె. విష్ణుధర్మమునందు బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడిన విధముగఁ జెప్పఁబడియె. తిలగర్భప్రాయశ్చిత్తమును హిరణ్యగర్భప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాచరించినటుల నాచరింపవలయును.

## —* కనకప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౩౮౩) అథకనకప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ ద్వి

జో యః పుణ్యకాలేషు తీర్థేష్వాయతనేషు చ॥ రాజభ్యశ్చాన్యతో వాపి లోభమోహపరాయణః॥ కనకం ప్రతిగృహ్ణీయాదణుమాత్రమకించనః। స దరిద్రో భవేత్పాపీ నరకాననుభూయ చ। పునస్సంసృతిమాపన్నో మృతః కర్పటకే క్రిమిః॥ తస్యాన్యా నిష్కృతిర్నాస్తి చాంద్రాయణచతుష్టయాత్॥ నారదీయే॥ పుణ్యకాలేషు పుణ్యేషు తీర్థేష్వాయతనేషు చ। హిరణ్యమణుమాత్రం వా ద్విజో య దినరాధిప। ప్రతిగృహ్య ప్రభో పాపీ మృతః కర్పటకే క్రిమిః॥ తస్యాన్యా నిష్కృతిర్నాస్తి చాంద్రాయణచతుష్టయాత్॥ భారతే॥ కనకం ప్రతిగృహ్ణీయాద్ద్విజో నిష్కారణాన్మనే॥ స మహానిరయం గత్వా క్రిమిః కర్పటసంభవః। పశ్చాత్తాపసమాయుక్తశ్చాంద్రాయణచతుష్టయం। కృత్వా శుద్ధిమవాప్నోతి నాన్యథా శుద్ధిరిష్యతే॥ బ్రహ్మకైవర్తే॥ బ్రహ్మనాభిసముద్భూతం కారవల్లిఫలం యథా। తద్వదాభాతి సర్వత్ర కనకం తదుదాహృతమ్॥ రాజ్ఞః పాపం తదాదద్యా దానకాలే విశేద్ద్విజమ్। అతః పరిగ్రహస్త్యాజ్యో ద్విజైర్లోకే వృభిప్సదా॥ కనకప్రమాణం స్తేయాదిప్రకరణేఽభిహితం ద్రష్టవ్యమ్॥ బ్రహ్మకైవర్తే॥ హిరణ్యగర్భసంభూతం కనకం యస్సకృద్వహేత్॥ పుణ్యకాలేషు పుణ్యేషు తీర్థేషు ద్విజవల్లభాత్॥ తస్యైష నిష్కృతిర్దృష్టా చాంద్రాయణచతుష్టయాత్॥ అథవా త్రిః పరిక్రమ్య భూమండలమిహేశ్వర॥ అణుమాత్రమితి శ్లోకపూరణార్థమ్। కనకస్య యావత్ప్రమాణం పూర్వముక్తమ్॥ తావత్ప్రతిగ్రహే పాపబాహుళ్యమిత్యర్థః॥ కనకం శుద్ధసువర్ణం ఖదిరాంగారదీప్తియుక్తం దానాధ్యాయే యావత్ప్రమాణముక్తం తావదిత్యర్థః॥ ఇతి హేమాద్రౌ కనకప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౭౩) ఇకను కనకప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పుణ్యకాలములయందును, పుణ్యతీర్థములయందును, ధనలోభపరాయణుండై బ్రాహ్మణుడు రాజువలననైనను, ఇతరులవలననైనను, కనకమును బ్రతిగ్రహించెనేని యనేకవేలజన్మములు నరకమననుభవించి పిమ్మట గర్పటమునందలి క్రిమియై పుట్టును. కావున నిట్టిదోషనివృత్తి కొఱకు నాలుగు చాంద్రాయణవ్రతముల నాచరింపవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. నారదీయమునందును నిటులనే చెప్పబడియె. భారతమునందును నివ్విధముగానే వచింపబడియె. బ్రహ్మకైవర్తమునందును నిటులనే చెప్పబడియె. కనకప్రమాణము స్తేయాదిప్రకరణయందు జెప్పబడియె.

——— తిలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ———

(౩౭౪) అథేదానీం తిలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కం

జేయః॥ ముఖజో బాహుజాద్రాజన్ పుణ్యకాలేషు పర్వసు ॥ తిలప్రతిగ్రహం
కృత్వా నిష్కారణతయా ధనీ। మహాపాపమవాప్నోతి వ్రణరోగీ స జాయతే॥
బ్రహ్మాండే॥ మధుకైటభయోర్యుద్ధే మాసమేకం నిరంతరమ్ । అత్యంతగ్లాని
మాపన్నో హరిస్స్వేదామ్బుభృత్తదా॥ స్వేదబిందుసముత్పన్నాస్తిలారాశ్య
భవంస్తదా। తిలానాలోక్య సహసా హరిరత్ర జగాద హ॥ యుష్మాన్ దత్వా
తు హుత్వా తు భుక్త్వా వా జనవల్లభ॥ సర్వపాపవినిర్ముక్తో మామకం పదమ
శ్నుతే॥ ఇత్యుక్త్వా తాన్ గృహీత్వా దా ద్దేవో మునిగణాయ సః॥ మధుకైటభ
నామానౌ హత్వా వైకుణ్ఠమాయయౌ॥ తదారభ్య తిలాస్త్వేతే లోకేస్మిన్
సంచరంతి హి॥ తానేతాన్యో నరో దద్యాద్విష్ణులోకమవాప్నుయాత్ ॥ లైం
గే॥ విష్ణుదేహోద్భవం ధాన్యం యో ధృత్వా పుణ్యసంగమే॥ ద్విజస్త్వజ్ఞాన
తాం యాతి ద్విపాత్పశురుదాహృతః ॥ తేషాం ప్రతిగ్రహే రాజన్ ధర్మశా
స్త్రోక్తమార్గతః। ద్విజో లోకద్వయం త్యక్త్వా పశురూపమవాప్నుయాత్ ॥ త
స్యైవ నిష్కృతిరియం కణ్ఠదఘ్నజలే వసన్॥ ప్రాతరారభ్య సాయాహ్నే ఫల
భోజనమాచరేత్॥ తద్విష్ణోరితి మంత్రేణ మాసమాత్రేణ శుద్ధ్యతి ॥ నిష్కార
ణతయా తిలాన్ ప్రతిగృహ్య పశ్చాత్తాపసంయుక్తః ప్రాతఃకాలమారభ్య క
ణ్ఠదఘ్నజలే వసన్ తద్విష్ణోరితి మంత్రముచ్చరన్ సాయంకాలే విరమ్య ఫలాహా
రం కృత్వా స్థండిలే శయీత। ఏవం మాసమాత్రేణ శుద్ధో భవతి। నాన్యేన। దశ
దానమధ్యే తిలదానస్య యావంతస్తిలాస్తత్ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమిదం
వేదితవ్యమ్॥ నాల్పస్య॥ తదాహ బ్రహ్మపురాణే॥ తిలప్రతిగ్రహే విప్రః పశ్చా
త్తాపసమన్వితః॥ ప్రాతస్స్నాత్వా నిత్యకర్మ సమాప్య విధిపూర్వకమ్ ॥ ఓద
యాజ్జలమావిశ్య కణ్ఠదఘ్నజలే వసన్॥ తద్విష్ణోరితి మంత్రేణ జపన్నా సాయ
మాదరాత్॥ విరమ్య నియమాత్సాయం ఫలాహారం సమాచరేత్ ॥ కేవలే స్థండి
లే సుప్త్వా స్మరన్నారాయణం విభుమ్॥ మాసమాత్రేణ శుద్ధస్స్యాదశుచిస్త్వ
న్యథా ద్విజః॥ ఇతి హేమాద్రౌ తిలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౮౪) ఇకను తిలప్రతిగ్రహప్రాయశ్చిత్తమును జెల్పుచున్నాడు॥
బ్రాహ్మణుడు నిష్కారణముగ రాజులవలన దిలప్రతిగ్రహమును జేసెనేని
మహాపాపమును బొంది పిమ్మట వ్రణరోగముగలవాడై పుట్టునని మార్కం
డేయుడు చెప్పె. నారాయణుడు పూర్వము మధుకైటభాసురులతో నొక్క
మాసము దినములు యుద్ధమును జేసె. ఆయుద్ధమునందు నారాయణునకు
జెమటపట్టె. ఆచెమటవలన దిలలు జనించె. అట్టి తిలలనుగురించి నారాయ
ణుడిట్లనియె. లోకములయందు దిలదానమును జేయువారు సకలైశ్వర్యము

లను ననుభవించి పిమ్మట నాలోకమును బొందునని బ్రహ్మాండమునందు జె ప్పబడియె. విష్ణుదేహము వలన నుత్పన్నమైన తిలలను బ్రతిగ్రహించిన బ్రా హ్మణుడు పశురూపమును బొందును. ఇట్టిదోషనివృత్తికొఱకు కంఠమునం టి యుదకమునందు బ్రాతఃకాలము మొదలుకొని సాయంకాలము వఱకును నివసించి ఫలములను భుజింపవలయును- ఇట్లు నివసించి నెలదినములు "త ద్విష్ణోఃపరమంపదమ్,, అను మంత్రమును జలమునందుండియే జపించుచుండ వలయును. మఱియును సాయంకాలమునందు స్థండిలశాయియై నారాయ ణుని స్మరింపవలయునని లైంగమునందు జెప్పబడియె. ఇటులనే బ్రహ్మపురా ణమునందు జెప్పబడియె.

—— దాసీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ——

(౩౭౫) అథదాసీందాసీప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ సురూపాంసుస్తనీంసుభ్రూంసుకేశీంశూద్రయోనిజాం। దాసీంద్వి జోనుగృహ్ణీయాద్భోగార్థంపతితోభవేత్॥ నిత్యంనైమిత్తికంకామ్యంసద్యః త్యజతిపాపినః॥ విక్రయేద్యదితాం మూఢశ్చండాలత్వమవాప్నుయాత్॥లైంగే॥ దాసీంశూద్రసముత్పన్నాం సర్వాభరణభూషితాం ॥ నిష్కారణతయాబ్ర హ్మన్ సంగృహ్ణాతిద్విజోయది । ససద్యఃపతితోభూయాద్విక్రయిత్వాపతాం రమేత్ ॥ చండాలయోనిమావిశ్యవసేదాబ్రహ్మణఃపదాత్ ॥ భవిష్యోత్తరే॥ దాసీమలంకృతాంరాజన్ దత్తాంరాజభిరాదరాత్ ॥ ప్రతిగృహ్యద్విజోయ స్తు కారణైర్బహుభిర్వినా ॥ రమేద్వావిక్రయేద్వాపి సచండాలోభవేత్తదా। యావద్బ్రహ్మసృజన్విశ్వంతావచ్చండాలజన్మతా॥ శివపురాణే॥ దాసీమలం కృతాంయస్తు ప్రతిగృహ్యద్విజాధమః । పశ్చాత్తాపసమాయుక్తఃప్రధానం సపరిత్యజేత్ । యాగంకృత్వాఋణంతీర్త్వా తస్మాద్దోషాత్ప్రముచ్యతే॥ అన్యథానిష్కృతిర్నాస్తిత్రివర్షంయావభక్షకః । కేశానాంవపనంకృత్వా పునస్సంస్కారమాచరేత్ ॥ ఏవంత్రివర్షాచ్ఛుద్ధస్స్యాన్నాన్యథాశుద్ధిరిష్య తే ॥ బ్రహ్మకైవర్తే॥ దాసీమలంకృతాంశూద్రీం నిష్కారణతయాద్విజః। ప్రతిగృహ్యపునఃపశ్చాత్తాపేనానేనసంయుతః ॥ కృత్వాత్రిషవణస్నానంజ ప్త్వానారాయణాక్షరం। చతుర్థకాలఆహారాయవభుక్స్థండిలేశయః॥ ప్ర ధానంసంపరిత్యజ్య వర్షత్రయమతంద్రితః । ఇహలోకేపరత్రాపి శుద్ధిమా ప్నోతిదైహికీమ్ । ఏతత్ప్రాయశ్చిత్తంఋణమోచన యాగాద్యకరణే వేదిత వ్యం । తదాపంచగవ్యమాత్రేణశుద్ధిః ॥ తయోరభావే ప్రాయశ్చిత్తేనానేన శుద్ధిమాప్నోతి । నాన్యథేత్యర్థః॥ సర్వదప్రస్యయథావిషనివారణమా

షధంయోజనీయం ॥ నాన్యథా॥ తద్వద(త్రాప్తిరితి)భావః ॥ ఇతి హేమాద్రౌ దాసీప్రతిగ్రహప్రాయశ్చిత్తః॥

(౩౮౪) ఇకను దాసీప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును దెల్పుచున్నాడు ॥ చక్కనిరూపముగలదియును, సుందరములగు స్తనములుగలదియును, అందములగు కనుబొమలుగలదియును, దీర్ఘములగు కేశములుగలదియును, శూద్రయోనియందుఁబుట్టినదియును, అగు దాసిని సంభోగముకొఱకు బ్రాహ్మణుఁడు ప్రతిగ్రహించినయెడల పతితుఁడగును. అట్టివాని యొక్క నిత్యనైమిత్తికకర్మలన్నియును నాశమునుబొందును, ఆయ్యంగనను మరల విక్రయించెనేని చండాలత్వము బొందునని మార్కండేయుఁడు చెప్పె. లైంగమునందునునిటులనే చెప్పబడియె, భవిష్యోత్తరపురాణమునందును నిట్లేదముగానే చెప్పబడియె. దానిని పరిగ్రహించి దానితో సంభోగాది క్రియలను సల్పక దాసిని విక్రయించి యాద్రవ్యమువలన యాగాదులను జేసినను, ఋణమును దీర్చినను దోషరహితుఁడగును, ఇట్లు చేయని యెడల మూఁడు సంవత్సరములు యావభక్షకుఁడుగను, పిమ్మట వపనమును జేయించుకొని పునరుపనయన సంస్కారమును జేసికొనవలయునని శివపురాణమునందు జెప్పబడియె. అలంకృతురాలయిన శూద్రస్త్రీని ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు మహాపాపవంతుఁడగును. అట్టి పాపనివారణకొఱకు మూఁడుసంవత్సరముల కాలము త్రిషవణస్నానమును జేసి నారాయణాష్టాక్షరమును జపించి సాయంకాలమునందు యావభక్షకుఁడై స్థండిలమునందు శయనించవలయును, ఇవ్విధముగ ప్రాయశ్చిత్తమును జేసికొనినయెడల నిహపరలోకములయందుఁ బవిత్రుఁడగును, దాసీపరిగ్రహము ఋణవిమోచనకొఱకును, యాగాదులను జేయుటకొఱకును గాదేని యీ ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. యాగాదులకొఱకు దాసీ పరిగ్రహమును జేసినవాఁడు పంచగవ్యప్రాశనముచేత బరిశుద్ధుఁడగునని బ్రహ్మకైవర్తమునందుఁ జెప్పఁబడియె॥

—❋ సోపస్కారగృహప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్ ❋—

(౩౮౫) అథసోపస్కారగృహప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ బ్రహ్మాండే॥ గృహంసోపస్కరం రాజ్ఞః ప్రతిగృహ్యాద్విజాధమః ॥ ఆకృత్వాతత్ప్రియంభోగాద్వ్యాళీభవతి కాననే ॥లైంగే॥ గృహంసోపస్కరం రాజ్ఞః ప్రతిగృహ్యైవబాహుజాత్ । యాగాదికంనకుర్యాచ్చేద్దండశూకోభవేద్వనే। సోపస్కరమితి నిక్షేపధాన్యంవర్షపూర్త్యర్థం నూతనభాండకట్వా పీఠకుసూలముసలోలూఖలకుండల్యాదీదృషదుపలపశ్వారామ కూప గోమహిష్యాది

కమింధనాదికం గృహిణః ప్రతిగృహీతుర్వర్ష పూరణం యేనభవతి తేనప్రకారేణ గృహంనిర్మాయశ్రోత్రియాయదత్వా గృహదానఫలమాప్నోతి । నోచేద్యావద్దత్తం తావన్మాత్రఫలమ్ । తద్గ్రహీతుస్తావన్మాత్రమేవపాపం॥ తదాహమార్కండేయః ॥ సోపస్కరంగృహంరమ్యం నిర్మాయదృఢవత్ప్రభుః॥ పుణ్యతిథౌపుణ్యకాలే శ్రోత్రియాయకుటుంబినే। సప్తజన్మసు రాజేంద్రహరేః ప్రీతికరోభవేత్ ॥ తద్గృహీత్వాద్విజోలోభాద్యాగాదికమనర్థకం ॥ వ్యయంకృత్వాసమాధాత్మా వ్యాళీభవతికాననే। తద్దోషపరిహారార్థంవత్సరత్రేణవర్షపీడితః । మార్తాండోదయమారభ్యక్లిన్నవాసాబహిస్థలే । జపన్నైవవారుణంసూక్తం స్వమూర్ధ్ని న్యస్తబాహుకః ॥ మధ్యాహ్నే నిత్యకర్మాణి కృత్వాపూర్వవదాచరేత్ । సాయంకాలేఫలాహార స్స్వపేద్వైస్థండిలేవ్రతీ। వర్షర్తుమేవంకృత్వాథశుద్ధిమాప్నోత్యనుత్తమామ్ । వారుణంసూక్తంహిరణ్యశృంగమిత్యనువాకః ॥ బ్రహ్మాండే ॥ సోపస్కరంగృహంవిప్రః ప్రతిగృహ్యనరాధిపాత్ । తస్యాన్యాయకృతిర్నాస్తి సప్తజన్మతయాన్నృప ॥ వర్షర్త్వాజలవాతార్తఃక్లిన్నవాసాజితేంద్రియః ॥ న్యస్తబాహుస్స్వోత్తమాంగే బహిరేవవసేత్సదా । జపన్నైవవారుణంసూక్తం యావదస్తంగతోరవిః । తదాపిరమ్యసహసా ఫలాహారంసమాచరేత్ ॥ స్థండిలేచస్వపేద్రాత్రౌ కృతంపాపమనుస్మరన్ । ఏవంమాసద్వయంకృత్వా గృహదానప్రతిగ్రహాత్ । తస్మాద్దోషాత్ప్రముక్తస్స్యాదన్యథాభుజగోభవేత్ ॥ యాగేబుధేనాసర్వస్వాగయంకృత్వానదోషభాక్ ॥ ప్రధానత్యాగఏవాథవా పశునిక్షేపవర్జితమ్ ॥ కృత్వాశుద్ధిమవాప్నోతి సముక్తస్సర్వజన్మతః ॥ ఇతిహేమాద్రౌ సోపస్కరగృహదాన ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

(౩౮౬) సోపస్కరగృహప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానము సమాప్తము ॥ సోపస్కరగృహమును రాజాదులవలన బ్రతిగ్రహించినవాఁడు, ఆ గృహప్రతిగ్రహమువలనఁగలిగిన ద్రవ్యమును యాగాదులయందు వ్రయమునఁజేసినవాఁడు, అరణ్యమునందు వ్యాళియై పుట్టునని బ్రహ్మాండమునందుఁ జెప్పబడియె. లైంగమునందును నిటులనే చెప్పబడియె. గృహదానమును జేయునపుడు సంవత్సరకాలమునకు దగిన సామగ్రులనన్నింటిని గృహమునందుఁ బెట్టి దానమును జేయవలయును, ఇట్లునముగఁ జేయఁడేని యాగృహము నిష్ఫలమగునని యెఱుంగవలయును, సకలసామగ్రులతోఁ గూడినగృహమును బుణ్యకాలాదులయందు దరిద్రుఁడగు బ్రాహ్మణునకు దానముసేయవలయును, అట్టిగృహమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడా ద్రవ్యమును యాగాదికమునకును

ప్రయోగింపఁ జేసి యరణ్యమునందు సర్పజన్మమును బొందును, కావున నిట్టిదోషపరిహారముకొఱకు వర్షర్తువునందు వర్షముచేత బీడితుఁడై సూర్యోదయము మొదలుకొని తడివస్త్రములను గట్టుకొని బహిస్స్థలమునందుండి శిరస్సునందు బాహువులను బెట్టుకొని వారుణసూక్తమును జపించుచుండవలయును, మధ్యాహ్నమునందు నిత్యకర్మలనాచరించి మరల పూర్వమువలెనే నాచరింపవలయును, ఇట్లు సేయుచు సాయంకాలమునందు ఫలాహారుఁడుగావలయును, ఇట్లు వర్షర్తువును సర్వమును గడిపిన యెడల బరిశుద్ధతను బొందవలయును, వారుణసూక్తమనగా హిరణ్యశృంగమను, అనువాక్యమని యభిప్రాయము. ఇట్లని మార్కండేయుడు చెప్పె. బ్రహ్మాండపురాణమునందును నిటులనే చెప్పబడియె॥

— శయ్యాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

(౩౮౪) అథశయ్యాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మాత్స్యే॥ శయ్యాంసోపస్కరాందివ్యాం సఖట్వాం బాహ్వాంజాద్ద్విజః । పుణ్యకాలే పుణ్యతీర్థే యదిపర్వసుసంగ్రహేత్ । తస్యమృత్యుభయంప్రోక్తంషణ్మాసాభ్యంతరేయమాత్ ॥ తతఃపిశాచతాంయాతి త్రిషుజన్మసుగోఖరః ॥ స్కాందే ॥ ఏకాదశ్యాంపౌర్ణమాస్యాం చంద్రసూర్యగ్రహేద్విజః ॥ పుణ్యకాలేపుణ్యతీర్థే శయ్యాంచోపస్కరాన్వితామ్ ॥ రాజ్ఞస్సంపాదయేద్యస్తు తస్యమృత్యుభయంభవేత్ ॥ తతఃపిశాచోభవతి గోఖరత్వమవాప్నుయాత్ ॥ భవిష్యోత్తరే ॥ ఆషాఢశుద్ధద్వాదశ్యాం పుణ్యతీర్థేనరాధిప ॥ శయ్యాంసోపస్కరాం రాజ్ఞో ద్విజోయస్సంపరిగ్రహేత్ । సఖరత్వమవాప్నోతి మృత్యువక్త్రాద్విమోచితః ॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తితీర్థదానశతైరపి ॥ బ్రహ్మాండే॥ శయనోత్థానద్వాదశ్యాఃపుణ్యకాలేనదీతటే॥ సఖట్వాందామసంయుక్తాంశయ్యాం యస్సంపరిగ్రహేత్ ॥ షణ్మాసాన్మృత్యుమాప్నోతి గోఖరత్వమవాప్నుయాత్ । తస్యైషానిష్కృతిర్దృష్టా బ్రహ్మణాలోకవర్తినా ॥ చాతుర్భాగ్యవ్యయంవాపి యాగార్థందక్షిణాంవహన్। ఉభయాసంభవేరాజన్ శృణుఃనిష్కృతిముత్తమామ్ ॥ వసంతేతుజలేస్నాత్వా హ్యశ్వత్థం సముపాక్రమేత్॥ హస్తమాత్రంవిలిప్యాథో గోమయేనసువర్చసా ॥ ఉపవిశ్యాత్రదేశేవై నిత్యకర్మసమాప్యచ ॥ మానవ్రీతముపాస్థాయజపేదష్టమయావధి ॥ త్రియంబకంహోమమంత్రంన్యాసధ్యానపురస్సరం । మాధ్యాహ్నికంతతఃకృత్వా పునఃకర్మసమారభేత్ ॥ సాయంసంధ్యాముపాస్యాథ నిత్యహోమంసమాప్యచ। ఫలాహారంతతఃకృత్వా స్థండిలేస్వగృహేస్వపేత్॥ బ్రహ్మచర్యవ్రతంకుర్వన్ కృతంపాపమనుస్మరన్ ॥ ఏవంమాసద్వయంతీర్త్వా శుద్ధస్తల్పపరిగ్రహాత్॥

అన్యథాదోషమాప్నోతి పిశాచత్వంభవేదిహ ॥ సోపస్కరామితి ॥ శయ్యాద్యోశాఖ్యంశృంఖలాచతుష్టయం ॥ హస్తపాదనివేశనార్థం సూత్రమతల్పవదుపబర్హణం। సోత్తరచ్ఛదంతఏతత్సోపస్కరం । సోపస్కరంతల్పంద్విజైర్గ్రాహ్యక్షేత్రభిన్నిపాకరణాన్నప్రతిగృహ్యాం । ఉభయోరభావే మధుమాధవ మాసయోః। పూర్వోక్తంవ్రతంకృత్వా తల్పప్రతిగ్రహాచ్ఛుద్ధోభవతీత్యర్థః॥ఇతిహేమాద్రౌ శయ్యాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

(३८९) ఇకను శయ్యాదానప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నారు॥ పుణ్యకాలములయందును, పుణ్యతీర్థములయందును, రాజులవలన సకలసామగ్రులతో గూడిన శయ్యాదానమును ప్రతిగ్రహించినవాడు, ఆరుమాసములలోపల మరణమును బొందును. పిమ్మట మూడుజన్మములదనుక పిశాచత్వమును బొందును. అనంతరమందు మూడుజన్మములదనుక గోఖరమై పుట్టునని మాత్స్యమునందు చెప్పబడియె. స్కాందపురాణమునందు జెప్పబడియె. బ్రహ్మాండపురాణమునందును నిటులనే చెప్పబడియె. మఱియును శయ్యాదానము వలన బ్రతిగ్రహించుట వలన గలిగిన ధనమునందు నాల్గవభాగమును యాగాదులకొఱకుపయోగించినవాడు పావనుడగును. ఇట్టి కృత్యమును జేయజాలనివాడు వసంతఋతువునందు స్నానమును జేసి యశ్వత్థవృక్షము నాశ్రయించవలయును. మాధ్యాహ్నిక సమయమునందు మాధ్యాహ్నిక కృత్యములనుదీర్చికొని పిమ్మట నశ్వత్థవృక్షమునందు త్ర్యంబకమంత్రమునుజపముజేయవలయును. పిమ్మటసాయంసంధ్యావందనకృత్యములనుదీర్చికొని ఫలములనుభుజించి స్వగృహమునందుస్థండిలశాయియైతనదుపాపమును స్మరించుచు బ్రహ్మచర్యవ్రతము నాచరింపవలయును. ఇవ్విధముగ నాచరింపక పోయెనేని పిశాచత్వమును బొందు ననియును జెప్పబడియె.

—— కన్యాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ——

(३९०) అథకన్యాదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥దేవీపురాణే॥ బ్రాహ్మణోబ్రహ్మసమ్పన్నోబ్రహ్మచర్యపురస్కృతః । సముద్వహేత్స్వకులజాం కన్యాం బ్రాహ్మ్యాదిమస్థితాం॥ తయోఃప్రసూతః కులజః పితృభక్తిపరాయణః । సంతరేదుభయంలోకం సత్పుత్రఃపుత్రవాన్ద్విజః । బ్రాహ్మాదిషుపంచవిధవివాహేషుకన్యాస్వీకరణేనదోషః ॥ తదేవాహనారదీయే॥ బ్రాహ్మోదైవస్తథాచార్షః ప్రాజాపత్యస్తథాసురః॥ గాంధర్వోరాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోమతః । తేషాంత్రయఃప్రశస్తాస్స్యుశ్చేషాః పంచని

గర్హితాః॥ తస్మాద్బ్రాహ్మణేషు బ్రాహ్మో వివాహః పుణ్యలోకదః। ఏవంద్విజో యః కురుతే స పితౄంస్తారయేత్తదా ॥ ఏతం ముఖ్యతమం త్యక్త్వా యో విప్రో బాహుజాదిషు ॥ కన్యార్థం ధనమాదాయ కామలోభపరాయణః। తద్విక్రయేణ వివాహ్యానాం కన్యానాం యః స పాపభాక్॥ రతిమాత్రసుఖం తస్య సంతతి దాతురేవహి। తస్మాదేతత్పరిత్యాజ్యం ద్విజైస్సర్వత్ర సర్వదా। బ్రాహ్మణవ్యతిరిక్తజాతిభ్యః కన్యాధనసంగ్రహే దోషమాహ॥ కార్ష్ణే॥ ముఖజోన్యత్రజాతిభ్యో వివాహార్థం ధనం వహన్। తేనాత్మా తేన వసునా దత్తకన్యాం సముద్వహేత్॥ స విప్రః పతితో భూయాత్తత్పుత్రాః పతితా భవన్। తత్పత్నీ తత్సుతా రాజన్ విప్రో యత్ర ధనార్జనం। కలౌ యుగే విశేషేణ స్వజాతేస్సంపరిగ్రహః। ఇతరేషు యుగేష్వేషు అన్యజాతిపరిగ్రహః। తేషు ముఖ్యతమః ప్రోక్తః కలౌ నేచ్ఛంతి సూరయః॥ బ్రహ్మక్షత్రే। స్వజాతేరన్యజాతిభ్యో ద్విజః కన్యాపరిగ్రహం॥ దత్త్వాతు తాయాః కన్యాయాః పుంసదానం పరస్య చ ॥ సముద్రయాత్రాస్వీకారం కమండలువిధారణం। దీర్ఘకాలబ్రహ్మచర్యం వర్జయేత్తు కలౌ యుగే॥ తతః పాణిగ్రహార్థం వా నాహరేద్ధనమన్యతః। అపత్యార్థం వివాహశ్చ యాగార్థం చ స్త్రీపరిగ్రహః। బ్రాహ్మణ్యం పరలోకార్థం బ్రహ్మచర్యం తు ముక్తయే॥ పాతివ్రత్యం కులాధ్యక్షం జపః పాపప్రణాశనే। సత్యం ధర్మప్రతిష్ఠార్థమాచారః కులవృద్ధయే ॥ తస్మాత్కన్యా పరిత్యాజ్యా విప్రైరన్యకులోద్భవా। కన్యేతి కన్యార్థం ధనపరిగ్రహః ॥ తత్ప్రతిగ్రహే దోషం ప్రాయశ్చిత్తం చాహ॥ కార్ష్ణే॥ ముఖజః పుణ్యదేశేషు పుణ్యకాలేషు పర్వసు। జాతిత్రయాద్ధనం హృత్వా దారార్థం సుఖలిప్సయా॥ సా పత్నీ తత్కులోద్భూతా తత్సంతానం తదిష్యతే। తద్భర్తా చ త్రయం లోకే యావత్కాలం చరేదితః। తత్కులం తత్పతిః పుత్రాః పతితాస్స్యుర్న సంశయః। తత్రైవ వర్జయేత్పశ్చాద్విప్రో లోకపరాయణః। కన్యాదానం నమస్కారం భోజనం సహభాషణమ్ ॥ ఆమన్త్రణం పితృశ్రాద్ధే స్వప్నేపి చ న సంస్మరేత్॥ ప్రాయశ్చిత్తం యదీచ్ఛేత్స పశ్చాత్తాపసమన్వితః। పత్నీపుత్రాన్ పరిత్యజ్య ప్రాయశ్చిత్తం సమాచరేత్॥ పూర్వోక్తం పతితప్రాయశ్చిత్తముక్తమ్ ॥ తత్సర్వం కృత్వా శుద్ధిమాప్నోతి। నాన్యథా ॥ తత్పుత్రాణాం తత్పత్న్యాశ్చ ప్రాయశ్చిత్తం నేచ్ఛంతి ॥ పతితప్రాయశ్చిత్తం సమ్యక్కృత్వా స్వకులే కన్యాముద్వాహ్య లోకే సమ్యగ్వ్యవహరేత్॥ తత్పాపం ప్రకటయేత్ న గూహయేత్॥ తదాహ నారదః॥ గురురాత్మవతాం శాస్తా శాస్తా రాజా దురాత్మనామ్। ఇహ ప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః। తస్మాద్ద్విజః కులేన్యత్ర నాచరేద్ధనసంగ్రహం [illegible] ప్రాయశ్చిత్తమ్॥

(౩౮౮) ఇకను గన్యాదానప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ వేదవేదాంగములను సమగ్రముగ జదివినవిప్రునకు సత్కులప్రసూనురాలగు కన్నియను బ్రాహ్మాదివివాహముల చేత గ్రహింపవలయును. అట్టికన్యయందు సత్పుత్రుడు పుట్టెనేని యట్టిపుత్రుం డుభయ లోకములయందును సౌఖ్యమును గలుగజేయును. బ్రాహ్మాదిపంచవిధోపాయముల చేత కన్యాస్వీకరణమును జేయుటవలన దోషము లేదని దేవీపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము, అని వివాహము లెనిమిదివిధములు. ఇవ్వెనిమిదివివాహములలో బ్రాహ్మ్యవివాహము సర్వోత్తమమని యెఱుంగవలయును. రాజులవలన వివాహార్థముగ గన్యను గ్రహించి యాద్రవ్యముచేత నేవివాహమును జేసికొనినవాడు పాపవంతుడగును. ఇట్లు వివాహితురాలయిన కన్య సంభోగాదిసుఖములకు పయోగించును. ఇట్టికన్యకయందు గలిగిన సంతానాధికము ద్రవ్యదాతకు పయోగించును. కావున బ్రాహ్మణు లిట్టి వివాహమును జేసికొనంగూడదని నారదీయమునందు జెప్పంబడియె. బ్రాహ్మణుం డితరజాతులవారివలన ధనమును గ్రహించి వివాహమును జేసికొనె నేని పతితుండగును. అట్టివాని పుత్రాదులు గూడం బతితులగుదురు. కలియుగమునందు స్వజాతికన్యల నే గ్రహింపవలయును గాని యన్యజాతిస్త్రీలను పరిగ్రహింపగూడదని కూర్మపురాణమునందుం జెప్పంబడియె. ఒకజాతివాడు మరియొకజాతికన్యకను బెండ్లియాడగూడదు. దత్తాక్షతురాలగు కన్యకకు బునర్వివాహము, సముద్రయాత్రను జేయుట, కమండలువిధారణము, దీర్ఘకాలబ్రహ్మచర్యము, అనువానిని కలియుగమునందు వదలవలయును. మఱియును బాణిగ్రహణముకొఱకు కన్యలవలన ద్రవ్యమును గ్రహింపగూడదు. అపత్యముకొఱకు వివాహమును, యాగముకొఱకు దుష్ప్రతిగ్రహమును, పరలోకముకొఱకు దుష్ప్రతిగ్రహమును, ముక్తికొఱకు బ్రహ్మచర్యమును, కులాధ్యక్షత్వముకొఱకు బాతివ్రత్యమును, పాపశాంతికొఱకు జపమును, ధర్మప్రతిష్ఠకొఱకు సత్యమును, గ్రహించుట మిగుల నుచితముగాదు. అందువలన నితరజాతికన్యకలను పరిగ్రహింపగూడదని బ్రహ్మకైవర్తమునందు జెప్పంబడియె. బ్రాహ్మణుడు పుణ్యదేశములయందును, పుణ్యకాలములయందును, పర్వములయందును, క్షత్రియాదిజాతిత్రయమువలన ధనమును గ్రహించి వివాహమును జేసికొనెనేని యాభార్యయందు గలిగిన సంతానము ద్రవ్యదాతకు జేరును. మఱియు నట్టికన్యక, తత్పతి, తత్సుతులును, పతితులనంబడుదురు. అట్టి ... వివాహాదికృత్యములను జే

సికొనఁగూడదు. అట్టివారితో సంభాషణాదికమునుగూడ వదలవలయును. ఇట్టి వివాహమును జేసికొనినవాఁడు పత్నీపుత్రాదులను పరిత్యజించి పూర్వోక్తపతితప్రాయశ్చిత్తమును జేసికొనెనేని పావనుఁడగును. తత్పత్నీపుత్రులకుఁ బ్రాయశ్చిత్తమే చేయఁగూడదు. ఇట్టివివాహమును జేసికొనినపతితుఁడు తనదుపాపముఁ బ్రకటనను జేసికొని స్వకులమునందు వివాహమును జేసికొనవలయును. బుద్ధిమంతులకు గురువు, దురాత్ములకు శిక్షకుఁడు, ప్రచ్ఛన్నపాపాత్ములకు యముఁడు శిక్షకులగుదురని నారదీయమునందు జెప్పఁబడియె.

## ❀ కపిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ❀

(౩౮౯) అథకపిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ కపిలాం వత్ససహితాం రాజ్ఞా దత్తామలంకృతామ్॥ పుణ్యకాలేషు పుణ్యర్క్షే ద్విజో యస్సంపరిగ్రహేత్॥ తస్య వై జన్మవిఫలం విపినస్థైవ చంద్రికా। యావంతి ధేనురోమాణి తావన్నరకమశ్నుతే॥ హరివంశే॥ కపిలాం సంగ్రహేద్వత్సాం ద్విజో లోభపరాయణః॥ తద్రోమాణి హయావంతి తావన్నరకభాగిహ॥ మాత్స్యే॥ కపిలా బ్రాహ్మణాదత్తా లోకోపకరణాయహి॥ రాజ్ఞాదత్తా ద్విజేభ్యశ్చ దేహపాపాపనుత్తయే। ఇతీరితం తదావాక్యం మాంధాతృప్రముఖాన్నృపాః॥ తాం గృహీత్వా ద్విజాగ్ర్యేభ్యో దదుః పాపవిమోచనే। తదాప్రభృత్యసౌ ధేనుర్దాతౄణాం పుణ్యవర్ధనీ। తథైవ పుణ్యకాలేషు స్వర్గదా మోక్షదాయినీ॥ నారదీయే॥ కపిలాం సఫలజఃసృత్య సవత్సాం విధిపూర్వకం అర్చయిత్వా ద్విజాగ్ర్యాయ యో దద్యాత్సోపి పుణ్యభాక్। తాం తు యో ముఖజో నృత్వా వృథాతద్ద్రవ్యసంగ్రహీ॥ సోరణ్యే నిర్జలే దేశే వయో భవతి ధ్రువమ్॥ తస్యైవ నిష్కృతిర్నాస్తి త్రిషు జన్మసు పార్థివ॥ బ్రహాండే॥ ద్విజో దత్తాం పుణ్యకాలే రాజ్ఞా వత్సాన్వితాం సతీమ్। కపిలాం ద్రవ్యవాత్సల్యాత్సభ వేద్గవయో వనే। తస్యైవ నిష్కృతిరియం దృష్టా మునివరోత్తమైః। గాం సవత్సాం పరిత్యజ్య తద్ద్రవ్యం యాగపూర్తయే। వ్యయం కృత్వా బుధో వాపి సదోషః కపిలాగ్రహే॥ ప్రాజాపత్యసహస్రాణాం త్రయాణాం శుద్ధిరీరితా। పూర్వోక్తేనైవ మార్గేణ పరిషద్విధిపూర్వకమ్। ప్రాయశ్చిత్తే కృతే పూతాత్మా యాగమాత్రం సమాచరేత్॥ అథానీవాభవేత్సోపిదర్శపూర్ణాదికాః క్రియాః॥ నభవత్తస్యదోషోత్ర అగ్నిర్దహతి పాతకమ్॥ తదాహాపస్తంబః॥ అగ్నిరాధాస్యే సర్వత్రక్రత్వర్థ మితివచనబలాదాధానదీక్షామనుసరన్నగ్నిహోత్రాదికాన్సంచరన్ సర్వపాపేభ్యో ముక్తో భవేదితి వేదితవ్యమ్॥ ఇతి హేమాద్రౌ కపిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౮౯) ఇక ... పును ... చెప్పుచున్నాఁడు.

డు॥ పుణ్యకాలములయందును, పుణ్యక్షేత్రాదులయందును, దూడతోగూడి నకపిలధేనువును బ్రాహ్మణుడుక్షత్రియాదులవలనఁబ్రతిగ్రహించెనేని యట్టివా నిజన్మము వనమునందలి వెన్నెలవలె వ్యర్థమగును. ఆకపిలధేనువునకెన్నిరోమ ములుగలిగియుండునో యన్నివేలసంవత్సరములు నరకమును బొందియుండున ని దేవీపురాణమునందు జెప్పఁబడియె. హరివంశమునందును నిటులనే చెప్పబడి యె. కపిలగోవును దానముసేసీనరాజు పుణ్యలోకమును బొందునని మాత్స్య పురాణమునందుఁ జెప్పబడియె. దూడతోగూడినకపిలధేనువును చక్కఁగనలం కరించి విధిపూర్వకముగనర్చించి బ్రాహ్మణశ్రేష్ఠునికొఱకు దానముసేయవ లయును. అట్టిధేనువునుబ్రతిగ్రహించి యాద్రవ్యమును యాగాదులకొఱకుప యోగింపనివాడు నట్టిబ్రాహ్మణుడునరజ్జలారణ్యమునందు మహాసర్పయో నులుగవయా పృకమై పుట్టునని నారదీయమునందు జెప్పఁబడియె. వత్సతోగూ డినకపిలధేనువును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తార్థముగదద్దాన మువలనగలిగినద్రవ్యమును, యాగాదులకొఱకుపయోగింపవలయును. కాదే నియాద్రవ్యమువలన ఋణవిమోచనను జేసికొనవలయును. ఇవ్విధముగ జేయ నివాడు వేయిప్రాజాపత్యకృచ్ఛ్రములనాచరింపవలయును. ఇట్టిప్రాయశ్చిత్త ముచేత బవిత్రమైనయాత్మగలవాడు యజ్ఞమునుగూడ జేయవలయును. కాదే నియాధానాదిక్రియులనైనను జేయవలయును. దర్శపూర్ణమాసవ్రతములనై ననాచరింపవలయును. ఇవ్విధముగఁజేసిన మొదలటపవిత్రుడగునని బ్రహ్మపు రాణమునందుఁ జెప్పబడియె. ఆపస్తంబుడునునిటులనే చెప్పె.

## ✽ పృథ్వీదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ✽

(౩౯౦) అథ పృథ్వీదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ పృథివీభూమిపాలేనదత్తా శాలీక్షుసంభవా । యాగార్థమగ్నిహోత్రార్థం ప్రతిగ్రాహ్యాద్విజోత్తమైః॥ తత్రోద్భవేనధాన్యేనఆధానాదికమాచరేత్ ॥ ఆ ధానానంతరంపశుదర్శపూర్ణమాసాదిః ॥ బ్రహ్మాండే ॥ బ్రహ్మక్షత్రప్రసూ తౌయస్మాద్భువఃభూపాలవల్లభాత్॥ ప్రతిగృహ్యాగ్నిహోత్రాదీనతిథీంశ్చ పిప్రూజయేత్॥ మార్కండేయః ॥ కుటుంబపాలనేచైవక్రతో ర్వా యాతిచే భూః। సభూప్రిశ్చయయాభూమ్యాతాఃతీంస్మాఃపరిగ్రహేత్ ॥ రాజనిజ మే॥వృద్ధాచమాతాపితరౌసాధ్వీభార్యాసుతశ్శిశుః॥ సత్రిరాయాతిథ్యమా పన్నాథర్మోపేక్షీయతేయదా । తదాప్రతిగ్రహేభూమెర్ద్విజశ్చైవనదోష భాక్। అశీతివర్షాగూఢ్వాంపృద్ధః॥ యానారీస్వప్నేపిపరం నచింతయేన్న సంభావయేత్

ర్యాత్సా సాధ్వీ॥ షోడశవర్షాత్పూర్వం శిశుః॥ సత్క్రియా అగ్నిష్టోమాదయః॥ ధర్మాః త్యస్నానాదిః॥ తదాత్మా పరిగ్రహేవిప్రస్యనదోషః యావత్యాభువా ఏతేషాం పరిపూరణం భవతి తావద్భూమిపరిగ్రహేనదోషః ॥ విష్ణురహస్యే॥ పితృపత్నీసుతానాంచ అగ్నిష్టోమాదికర్మణామ్॥ లోపేసంరక్షణే రాజ్ఞః సదా షఃత్మాపరిగ్రహః। వినాప్యేతైర్నిమిత్తైర్యః పృథివీం సంగ్రహేద్ద్విజః॥ సభార్యాపుత్రసహితో నరకేవాసమశ్నుతే॥ మార్కండేయః॥ ధాన్యంప్రభూతం ముఖజస్తత్రజాతం వృధావ్యయే ॥ విక్రయిత్వాత్మభోగార్థం భవేయం ధనకోభువి। ఇత్యహంకారకృద్యస్తు సచండాలత్వమాప్నుయాత్॥ నివర్త్యేతి స్తస్యకథితావసిష్ఠేన మహాత్మనా॥ పాదత్రయేబ్దకృచ్ఛ్రం స్యాత్ తత్రైగుణ్యాద్వ్యధాన్యప్రతమ్। బీజానాం ప్రస్థమాత్రాణాం సమాప్తిర్యావతీక్షితిః ॥ తస్యాః పరిగ్రహే కాయం మునిభిః పరికీర్తితమ్। సమాప్తిర్ద్రోణబీజానాం పృథివీయావతీభవేత్॥ తస్యాః పరిగ్రహేచాంద్రం ప్రాయశ్చిత్తం విశోధనమ్ ॥ వింశత్యాదశభిర్ద్రోణైర్యావతీత్మామహీభుజా । దత్తావహేద్ద్విజోయస్తాం శతంచాన్ద్రాయణం చరేత్॥ అతఃపరం ద్విజస్యాస్య ప్రాయశ్చిత్తం నదృశ్యతే ॥ సవిప్రఃశూద్రతాం యాతిపృథాభూమేః పరిగ్రహాత్ । యదాపితార్జితం క్షేత్రం రాజాక్రాంతం హృతం భవేత్ ॥ ఆక్రాన్తం వా రాజేంద్ర సమాక్రాంతం నృపాత్మజైః। తదాప్రతిగ్రహం కుర్యాద్యావన్మాత్రేణజీవనమ్ । తావత్పరిగ్రహేదోషో నభవేత్తాం ప్రగృహ్ణతః॥ కౌర్మే॥ రాజాక్రాంతం జనాక్రాంతం క్షేత్రం పితార్జితం యది। తదాప్రతిగ్రహం కుర్యాద్యావన్మాత్రేణజీవనమ్॥ తావత్ప్రతిగ్రహేవిప్రో రాజ్ఞస్తేనసదోషభాక్॥ ఇతి హేమాద్రౌ పృథివీప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౩౯౦) ఇకను పృథివీదానప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ సస్యభూమింబట్టుచుగుభూమిని రాజులవలన బ్రాహ్మణుడు యాగార్థము గ్రహింపవలయును. అట్లుగ్రహించియాభూమియందలి ధాన్యము చేతనాధానాదికమును జేయువలయును. ఆధానానంతరమందు పశుదర్శపూర్ణమాసాదికమునాచరింపవలయునని దేవీపురాణమునందు జెప్పఁబడియె. బ్రహ్మవేత్తయగుబ్రాహ్మణుడు భూపాలునివలన భూమిదానమును బ్రతిగ్రహించి యందలిధాన్యాదులవలన నతిథులనునగ్నిహోత్రాదులను బూజింపవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. కుటుంబపాలనమునకును, క్రతువును జేయుటకును, తగినభూమిని రాజువలన బ్రతిగ్రహింపవలయునని మార్కండేయుడువచించె. వృద్ధులగునా తాపితృవులను, పతివ్రతయగుభార్య

ను, పసివాడగుశిశువును, సత్కారములను, బోషించుటకొఱకు భూమిదానమునుబ్రతిగ్రహింపవలయును. ఎనుబదిసంవత్సరములకు మిగిలినవయస్సుగలవాఁడువృద్ధుడనబడును. ఏయాడుదిస్వప్నమందుగూడ బరపురుషునిస్మరింపనిదియును, భర్తృపాదప్రక్షాళనాదికమును జేయుటయం దసహ్యమునుబొందనిదియునుగునో యదిపతివ్రతయనబడును. తల్లిదండ్రులసంరక్షణను, యాగాదులను జేయుటకునుదప్ప దక్కినకృత్యములకొఱకు భూదానమునుప్రతిగ్రహించినవాడు కుటుంబసహితముగనరకలోకమునుబొందునని విష్ణురహస్యమునందు జెప్పబడియె. భూధానమునుబ్రతిగ్రహించి యందలిధాన్యమునుదుర్వ్యయమును జేయువాడు చండాలత్వమునుబొందును. కావుననిట్టిదోషపరిహారముకొఱకు కబ్దకృఛ్రప్రాయశ్చిత్తమునాచరింపవలయును. ప్రస్థమాత్రపరిమితిగలబీజములుపట్టునట్టి భూమినిప్రతిగ్రహించినవాడు కాయకృఛ్రమును జేసికొనవలయును. ద్రోణమాత్రపరిమితిగలబీజములుపట్టునట్టి భూమినిపరిగ్రహించువాడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. పదిరెండు ద్రోణములవిత్తనములకు దగినభూమినిబరిగ్రహించినవాఁడు నూరుచాంద్రాయణవ్రతములనాచరింపవలయును. ఇంతకంటె నధికమగుభూమిని బరిగ్రహించినవానికిబ్రాయశ్చిత్తమేలేదు. కావుననిట్టివాడు శూద్రత్వమునుబొందును. పిత్రార్జితమైనభూమి రాజాక్రాంతమయినపుడును, స్వార్జితభూమిరాజాక్రాంతమైనపుడును, జీవనమునకుదగినంతభూమిని ప్రతిగ్రహింపవలయునని మార్కండేయుడువచించె.

## కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౩౯౧) అథేదానీంసప్తమహాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తం బ్రువన్ కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే। అచలంకనకంధృత్వా రాజ్ఞఃపుణ్యానువర్తినః। ద్విజోయదిహమోహాత్మాసభవేద్బ్రహ్మపిశాచకః॥ కనకస్వరూపమాహ॥ లైంగే॥ పదేష్వష్టసుసంశుద్ధంశోధితం వహ్నితాపనాత్॥ అతీవశుద్ధతాంయాతికనకంతదుదాహృతమ్ ॥ పాద్మే॥ కనకాద్రింద్విజోధృత్వా రాజ్ఞఃపుణ్యానువర్తినః॥ పుణ్యక్షేత్రేషుప్రత్యేప్సితసభవేత్పిశితాశనః॥ మార్కండేయః॥ కనకాద్రింనదీతీరేపుణ్యకాలేషురాజభిః ॥ దత్తంద్విజోయోగృహ్ణీయాత్సపిశాచాభవేద్ధ్రువమ్॥ శంభురహస్యే॥ నదీషుపుణ్యతీర్థేషు పుణ్యకాలేషుపర్వసు। కనకాద్రింద్విజోరాజ్ఞోధృత్వానిష్కారణంభువి॥ సభవేద్వింధ్యశైలేషుపిశాచఃకాంతివర్జితః । చతుర్థాంశవ్యయంకృత్వాయాగంవాసర్వదక్షిణమ్॥ ... ప్రాయశ్చిత్త ... మాత్రతః॥

శుద్ధిమాప్నోతిలోకేస్మిన్నహంతాం త్యక్త్వాసు । భిక్షాటనంవరంనృణాంమె తస్మాత్సంపరిగ్రహాత్। సంసారంవాత్యజేద్విద్వాం త్సన్న్యాసంవాఽపరిగ్రహమ్। కృత్వాముక్తిమవాప్నోతికనకాద్రింత్యజేదతః । అపరిగ్రహావిప్రస్యముక్తిదావృత్తిరీరితా॥ ఉంఛవృత్తిస్సిలావృత్తిఃకుంభవృత్తిఃకుసూలితా । చతుర్థావృత్తయఃప్రోక్తాఃకనకాద్రేఃప్రతిగ్రహాత్॥ ఏతేషాం పూర్వోక్తానామభావేకనకాద్రిప్రతిగ్రహీతుఃప్రాయశ్చిత్తమాహ। మార్కండేయః॥ కనకాద్రింద్విజోయస్తుకృత్వానిష్కారణంసుధీః॥ సతుశుద్ధిమవాప్నోతికృచ్ఛ్రాణ్యయుతసంఖ్యయా।కృచ్ఛ్రాణిప్రాజాపత్యాని॥ లైంగే॥కనకాద్రింద్విజోధృత్వా రాజ్ఞఃపుణ్యాగమేసుధీః॥పశ్చాత్తాపసమాయుక్తఃకృచ్ఛ్రాణామయుతంచరేత్॥ అద్రేరాధిక్యాత్కృచ్ఛ్రాధిక్యమ్॥ నృసింహపురాణే।కృచ్ఛ్రైరయుతసంఖ్యాకైః కనకాద్రింసముద్వహన్। శుద్ధిమాప్నోతిముఖజః పునస్సంస్కారపూర్వకమ్॥ బ్రాహ్మే॥ కనకాద్రింద్విజోయస్తు రాజ్ఞఃపుణ్యాగమేవృధా।కృచ్ఛ్రైరయుతసంఖ్యాకైశ్శుద్ధిమాప్నోతినాన్యథా॥ ఇతిహేమాద్రౌకనకాచల ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౧) ఇకనుకనకాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పుణ్యకాలాదులయందు కనకాచలమును రాజాదులవలనగ్రహించినబ్రాహ్మణుడు పిశాచజన్మమునుబొందునని దేవీపురాణమునందుజెప్పబడియె. బంగారమునగ్నియందుబెట్టి తాపనముసేయుటవలన బరిశుద్ధమగునని లైంగమునందుజెప్పబడియె. మార్కండేయుడును కనకాచలమునుబ్రతిగ్రహించినవాడు పిశాచజన్మమునుబొందుననియె. శంభురహస్యమునందునిట్లనేచెప్పబడియె. మఱియునట్టిదానమును బ్రతిగ్రహించుటవలన గలిగినద్రవ్యమునందు నాల్గవభాగమును వ్రయముసేయుటచే దోషముతొలగిపోవును. కాదేని సర్వద్రవ్యమునుదక్షిణనుగా జేసి యాగమునుజేయవలయును. ఇవ్విధముగజేయనివాడు నిత్యకర్మలకుగూడనర్హుడుగాడు. కనకాచలమునుబ్రతిగ్రహించితద్ద్రవ్యమువలనజీవించుటకంటె భిక్షమునెత్తికొనిజీవించుటయుత్తమము. కాదేనిసంసారమునువదలి సన్న్యాసమునవలంబించుట యత్యుత్తమము. పరిగ్రహమునుజేయనిబ్రాహ్మణునకు సర్వోత్తమమైనపుణ్యఫలముగలుగును. ఉంఛవృత్తి, శిలావృత్తి, కుంభవృత్తి, కుసూలికావృత్తి, అనునాలుగుకనకాచలప్రతిగ్రహముకంటె శ్రేష్ఠములనియెఱుంగవలయును. నిష్కారణముగ కనకాచలమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు పదివేలప్రాజాపత్యకృచ్ఛ్రములనాచరించుటచేత బవిత్రుడగుననిమార్కండేయుడుచెప్పె. లైంగమునం

దునునిటులనే చెప్పబడెను. నృసింహపురాణమునందుగూడ నిటులనే చెప్పబడెను. బ్రాహ్మమునందును నిటులనే చెప్పబడెను.

——* రజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(శ్లో) అథరజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ వామనపురాణే ॥ రాజతంయోనుగృహ్ణీయాదచలంరాజవల్లభాత్ । పూర్వజో భోగమోహాత్మా కాలపాశవశంగతః ॥ తత్పాపమనుభూయాశుబలాకస్సభవేద్ద్విజః। త్రిషుజన్మసుకంకస్స్యాచ్ఛ్వేతరోగీభవేత్తతః॥ శివపురాణే॥ రాజభిఃపుణ్యకాలేషుదత్తంయోరజతాచలమ్। వినానిమిత్తైర్బహుభిఃప్రతిగృహ్యాత్మభోగవాన్॥ శీఘ్రంకాలవశంగత్వాదుఃఖంతత్రానుభూయచ। బలాకస్సభవేత్పశ్చాచ్ఛ్వేతరోగీసజాయతే ॥ జన్మత్రయంతుకంకస్స్యాత్తతశ్చాముక్తిర్నజాయతే॥ స్కాన్దే॥ అచలంప్రతిగృహ్యాదౌప్రాయశ్చిత్తపరాఙ్ముఖః। బలాకస్సంభవేత్పశ్చాత్కంకస్స్యాత్త్రిషుజన్మసు । కథంచిన్ముక్తిమాసన్నశ్శ్వేతరోగీభవేత్తదా। ఏతదకృతప్రాయశ్చిత్తవిషయమ్॥ కృతప్రాయశ్చిత్తస్యనబలాకాదిజన్మ॥ తదేవాహ॥ గారుడపురాణే ॥ ప్రాయశ్చిత్తేనపూతస్య ద్విజస్యాస్య శృణుష్వయత్। తస్యైవనబలాకాదిదైవంహికీదృగీరితా । ప్రాయశ్చిత్తంపురాకృత్వాధర్మశాస్త్రోక్తమాగతః। తతఃపశ్చాత్పునఃకర్మణాపంచగవ్యమతఃపరమ్।ఏవంపూతస్యవిప్రస్యపక్షిజన్మనజాయతే॥కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తార్ధమత్రాపినిష్కృతిర్నాన్యథా॥ఇతిరజతాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(తా) ఇకను రజతాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమును దెల్పుచున్నాడు ॥ భోగమోహాదులతో గూడిబ్రాహ్మణుడు రాజులవలనరజతాచలమును ప్రతిగ్రహించెనేని కాలపాశవశమును బొంది నరకలోకమునందు కష్టములననుభవించిబలాకమై పుట్టును. పిమ్మటమూడుజన్మములదనుక కంకపక్షియై పుట్టును. అనంతరమందు శ్వేతరోగముగలవాడై పుట్టునని వామనపురాణమునందు జెప్పబడె- యాగాదులను జేయుటకుగాక యితరములగుకుటుంబ పోషణాదులకొరకు రాజాదులవలన గనకాచలమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు శీఘ్రముగ యమలోకమును బొందును. అనంతరమందుబలాకజన్మమును బొందును. పిమ్మటమూడుజన్మములదనుకకంకమగును. పిదప శ్వేతరోగియై పుట్టునని శివపురాణమునందు జెప్పబడినె. స్కాందమునందును నిటులనే చెప్పబడినె. గారుడపురాణమునందును నిటులనే చెప్పబడినె. కనకాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమునందర్ధభాగప్రాయశ్చిత్తమును రజతాచలప్రతిగ్రహదోషనివారణకై యనుష్ఠింపవలయును.

## రత్నాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్.

(౩౯౩) అథరత్నాచల ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ రత్నాచలంద్విజో గృహ్ణన్ ప్రాజ్ఞః పుణ్యాగమే దినే॥ నతస్య పునరావృత్తిర్నరకాద్దుఃఖదాయినః॥ బ్రహ్మాండే॥ గఙ్గాతీరేథ గౌతమ్యాం కృష్ణవేణీనదీతటే॥ శ్రీశైలే సంగమే వాపి భీమరథ్యా నదీతటే॥ అహోబిలే మహాక్షేత్రే వైద్యనాథస్య సన్నిధౌ। కాంచీస్థానే వేంకటాద్రౌ శ్రీరంగే కుంభఘోణకే॥ మధురాయాం మహారాజ చాపాగ్రే గన్ధమాదనే॥ ద్విజో యో ధనలోభేన రాజ్ఞా దత్తాన్ సిమాన్ గిరీన్। నముక్తిస్తస్య విప్రస్య పైశాచ్యాజ్జన్మనాం త్రయే। నిష్కారణతయా భూప నిమజ్జన్నరకార్ణవే॥ పిశాచానాం తే మర్త్యలోకే జాయతే పిటకాకృతిః। తేషాం మధ్యే యదా రాజన్ రత్నాచలపరిగ్రహః। అరణ్యే నిర్జలే దేశే పిశాచో భవతి ధ్రువమ్॥ స్కాందే॥ గ్రహణే సంక్రమే చైవ మన్వాదిషు యుగాదిషు॥ అయనద్వితయే చైవ వ్యతీపాతే చ వైధృతౌ॥ కృష్ణాంగారచతుర్దశ్యామమాయాం పూర్ణిమాదినే॥ ద్వాదశీషు స్వనక్షత్రే ద్విజో లోభపరాయణః। అచలాన్ రాజభిర్దత్తానేషు పుణ్యదినేష్విహ। ధృత్వేతి శేషః। అకృత్వా నిష్కృతిం తేషాం తత్తత్పాపవిముక్తయే। యమస్య సదనం గత్వా హ్యనుభూయ మహద్భయమ్॥ పిశాచో భవతి క్షిప్రం విజనే నిర్జలే వనే॥ భవిష్యోత్తరే॥ రత్నాచలమిమం ధృత్వా ద్విజో నిష్కారణాన్మనే। అకృత్వా నిష్కృతిం తస్య మృత్వా నరకమాప్నుయాత్॥ పిశాచానుభవం కృత్వా జాయతే పిటకాకృతిః। తస్యైవ నిష్కృతిరియం బ్రహ్మణా పరికల్పితా॥ అరణ్యం నిర్జనం గత్వా శూన్యం దేవాలయం విశేత్। కృత్వా త్రిషవణస్నానం భస్మకృష్ణాజినం వహన్ మౌనవ్రతముపాస్థాయ వీరాసనముపాశ్రితః। రుద్రాధ్యాయం జపన్నిత్యం తావత్సంఖ్యం సమాచరేత్। యావదస్తంగతో భానుర్విరమేత్తావతా జపాత్॥ అపి తస్మిన్ పయో వాపి హ్యశక్తః ఫలభోజనమ్। స్వపేచ్చ స్థండిలే రాత్రౌ ద్విజస్యైతస్య నిష్కృతిః। ఏవమృతుత్రయం నీత్వా శుద్ధిమాప్నోతి దైహికీమ్। అశక్తస్తద్ధనస్యార్ధం తదర్ధం వ్యయమాచరేత్॥ ఏవం చేన్నిష్కృతిర్భూప రత్నాచలపరిగ్రహాత్। పునస్సంస్కారమాత్రేణ శుద్ధో భవతి నిశ్చయ ఇతి। ప్రతిగ్రహధనస్య చతుర్థభాగవ్యయేన పూర్వవత్ప్రాయశ్చిత్తం కృత్వా పునస్సంస్కారకాలే బ్రహ్మోపదేశం గాయత్రీం గురుణా స్వీకృత్య శుద్ధిమాప్నోతి। నాన్యథా శుద్ధిరిత్యర్థః॥ ఇతి రత్నాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౩) ఇకను రత్నాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును దెల్పుచున్నాఁడు॥ పుణ్యదినములయందు రాజాదులవలన రజితాచలమును ప్ర

తిగ్రహించిన బ్రాహ్మణునకుఁ బునరావృత్తిరహితమైన నరకలోకవాసము గలుగునని మార్కండేయుఁడు చెప్పె. గంగాతీరము, గౌతమీతీరము, కృష్ణవేణీతీరము, శ్రీశైలము, సంగమము, భీమరథీతీరము, అహోబిలము, మహాక్షేత్రము, వైద్యనాథము, కాంచీవరము, వేంకటాచలము, శ్రీరంగము, కుంభఘోణము, మధుర, చాపాగ్రము, గంధమాదనము, అను స్థలములయందు, రత్నాచల, కనకాచల, రజితాచలములను, ప్రతిగ్రహించినబ్రాహ్మణులు నరకలోకమునుబొందుదురు. పిమ్మట మర్త్యలోకమునందుఁ బిశాచమై పుట్టును. అనంతరమందుఁ బిడకాకారమునుబొందును. రజతాచలమునుబ్రతిగ్రహించినవాఁడు మాత్రము నిర్జలారణ్యమునందు పిశాచమైపుట్టునని బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడియె. చంద్రసూర్యోపరాగము, మేషాది సంక్రమణములు, మన్వాదులు, యుగాదులు, అయనద్వితయము, వ్యతీపాతము, వైధృతి, కృష్ణాంగారచతుర్దశి, అమావాస్య, పూర్ణిమాదివసము, ద్వాదశి, పుణ్యదినము, అనునట్టి కాలములయందు రత్నాచలాదులను ప్రతిగ్రహించినబ్రాహ్మణుఁడు నిర్జలారణ్యమునందుఁ బిశాచమైపుట్టునని స్కాందపురాణమునందు జెప్పబడియె. భవిష్యోత్తరమునందును నిటులనేచెప్పబడియె. మరియును ప్రాయశ్చిత్తవిధానమును గూడ జెప్పె. ఎట్లనిన నిర్జనమైనయరణ్యమునకు బోయి శూన్యదేవాలయమునందుప్రవేశించి త్రిషవణస్నానములను జేయవలయును. భస్మకృష్ణాజినములను వహింపవలయును. అనంతరమందు మౌనవ్రతము నవలంబించి వీరాసనమునుధరించి రుద్రాధ్యాయమును జపింపవలయును. అనగా సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువఱకును జపింపవలయును. ఉదకమునుభుజింపవలయును. అశక్తుడయ్యెనేని ఫలభోజనమును జేయవలయును. అనంతరమందు స్థండిలశాయిగావలయును. ఈవిధముగా నారుమాసములకాలమును జరిపినవాఁడు పరిశుద్ధతనుబొందును- ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొనజాలనివాడు ప్రతిగ్రహించిన ద్రవ్యమునం దర్థభాగమును వ్రయముచేయవలయును. అనంతరమందు బునరుపనయన సంస్కారమును బొందవలయును. ఇట్లుగాదేని ప్రతిగ్రహమువలన లభ్యమైనద్రవ్యమునందు నాల్గవభాగమును వ్యయముచేసి పూర్వోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసికొని పునస్సంస్కారమును బొంది గాయత్రీమంత్రోపదేశమును గూడ బొందవలయును.

## ధాన్యాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౩౯౪) అథ ధాన్యాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపు

రాణే॥ శ్లో॥ ధాన్యాచలప్రదాతా చ పుణ్యక్షేత్రేషు పర్వసు। అర్చయిత్వా ద్విజాగ్ర్యాయ స వై లోకాధిపో భవేత్॥ కౌర్మే ॥ అర్చితాయ ద్విజాగ్ర్యాయ ధాన్యాచలమనుత్తమమ్। అర్చితం శాస్త్రమార్గేణ పుణ్యకాలేషు పర్వసు ॥ యో దద్యాత్పృథివీపాల స గచ్ఛేద్విష్ణుమందిరమ్ ॥ లైంగే ॥ ధాన్యాచలం ద్విజో మోహాత్పుణ్యకాలఉపాగతే। ప్రతిగృహ్యాన్నపశ్చాత్తాదకృత్వా ధర్మసంగ్రహమ్॥ ఆరామేష్వేషు దేశేషు పిశాచో దుర్భగో భవేత్ । తత్రానుభూయ నరకం పునర్మూషకతాం వ్రజేత్॥ స్కాందే॥ శృణుష్వ సమ్యగ్వక్ష్యామి ధాన్యాచలపరిగ్రహే। దోషం ప్రతిగృహీతుర్వై రాజ్ఞో ధర్మానువర్తినః ॥ శాలిక్షేత్రేష నేష్వేవమారామేష్వత సంకులే । పిశాచో దుర్భగో నామ త్రాసయన్వై ద్విజాన్ బహూన్॥ మహాన్తం నరకం భుక్త్వా హ్యకృత్వా ధర్మనిష్కృతిమ్। స భవేన్మూషకస్థూలస్త్రీషు జన్మసు సంగ్రహాత్॥ భవిష్యోత్తరే॥ ధాన్యాచలం ద్విజో ధృత్వా ద్రవ్యలోభపరాయణః । అకృత్వా నిష్కృతిం తస్య స భవేత్పిశితాశనః॥ తద్దోషపరిహారార్థం కృత్వా చాంద్రాయణత్రయమ్ । పునస్సంస్కారమాత్రేణ శుద్ధిమాప్నోతి దైహికీమ్॥ బ్రహ్మకైవర్తే ॥ పుణ్యకాలేషు సంక్రాంతౌ ద్విజో రాజ్ఞః పరిగ్రహాత్ । ధాన్యాచలస్య మహతస్తస్య నిష్కృతిరీరితా॥ యాగాదికం పరాకృత్య ప్రోక్తం చాంద్రాయణత్రయం। పునస్సంస్కారపూతాత్మా గాయత్రీమభ్యసేద్ద్విజాత్॥ తాం పఠన్ప్రయతో నిత్యం వర్జయేద్యదిశుద్ధిమాన్। అన్యథా నిష్కృతిర్నాస్తి పాపస్యైతస్య గౌరవాత్ ॥ విష్ణుపురాణే॥ సప్తాచలాస్సముద్రాశ్చ నిర్మితాశ్చక్రపాణినా । జనానాం పాపనాశాయ స్మరణాత్కీర్తనాదిహ॥ తేషాం ప్రతిగ్రహే రాజన్పతితస్స్యాద్ద్విజాధమః। అతస్తస్య పునః కర్మ మునిభిః పరికీర్తితమ్ । పునఃకర్మ పునస్సంస్కార ఇత్యర్థః॥ ఇతి హేమాద్రౌ ధాన్యాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౪) ఇకను ధాన్యాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును దెల్పుచున్నాము॥ పుణ్యకాలములయందైనను, పుణ్యక్షేత్రములయందైనను, బ్రాహ్మణోత్తమునకు ధాన్యాచలమును దానము సేయునట్టివాడు లోకముల కధిపతియగునని దేవీపురాణమునందు జెప్పబడియె. కూర్మపురాణమునందును నిటులనే చెప్పబడియె. పుణ్యక్షేత్రపుణ్యకాలములయందు ధాన్యాచలమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు, ఆరామములయందైనను, ఇతరదేశములయందైనను, దుష్టపిశాచమై సంచరించును. అనంతరమందు మూషకమై పుట్టునని లైంగమునందు జెప్పబడె. స్కాందమునందును నీవిధముగానే చెప్పబడియె. ధాన్యాచలమును ప్రతిగ్రహించినబ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తమును జేసికొన్న

కపోయెనేని పిశాచత్వమునుబొందును. కావున బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన ధాన్యాచలప్రతిగ్రహదోషనివారణ కొఱకు మూడు చాంద్రాయణవ్రతముల నాచరింపవలయును. పిమ్మట బునరుపనయన సంస్కారమును బొందవలయునని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె. ధాన్యాచలమును ప్రతిగ్రహించి యాద్రవ్యమువలన యాగాదికమును జేయునివాడు చాంద్రాయణవ్రతము నాచరించవలయునని బ్రహ్మకైవర్తమునందు జెప్పబడియె. నారాయణుడు స్మరణమాత్రముచేతనే పాపమును బోగొట్టునట్టి సామర్థ్యముగల సప్తాచలములను, సప్తసముద్రములను నిర్మించె. సప్తాచలములను, సప్తసముద్రములను బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు పతితుడగును. అందువలననే వీనినిగ్రహించువానికి బ్రాయశ్చిత్తాదులు సెప్పబడియెనని విష్ణుపురాణమునందు జెప్పబడియె.

## — తిలాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. —

(౩౯౫) అథతిలాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ నారదీయే॥
శ్లో॥ తిలాచలః కాలపురుషస్తిలధేనుస్తిలాస్తథా। తిలచక్రం ప్రతికృతిరార్ద్రకృష్ణాజినంతథా॥ తిలకృష్ణాజినంచైవ శకటంసయుగంతథా। ఏతానివిప్రవర్యాణాం మహానరకదానివై॥ నిష్కారణతయారాజ్ఞః ప్రతిగృహ్య ద్విజాధమః। మహాంతంనరకంభుక్త్వా స్త్రీజన్మతదనంతరం॥ పశ్చాత్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్తంయదీచ్ఛతి। ప్రాయశ్చిత్తేనమహతా పునస్సంస్కారమర్హతి॥ బ్రహ్మాండే॥ ధనలోభేనయోవిప్రః ప్రతిగృహ్యతిలాచలమ్। సప్తజన్మసునారీస్యాత్తత్రాపివిధవాభవేత్॥ నార్యేవనరకస్థానం కిమన్యైర్బహుభాషితైః। వైధవ్యసదృశందుఃఖం స్త్రీణామన్యన్నవిద్యతే॥ తత్రాపిబాలవైధవ్యం తిలాచలపరిగ్రహాత్॥ స్కాందే॥ పుణ్యకాలేషుయఃపుత్ర త్రిణ్యత్తీర్థేషు పర్వసు। తిలాచలంద్విజోధృత్వా మహాంతంనరకంవ్రజేత్॥ పశ్చాద్భవతినారీత్వం సప్తజన్మసుకుత్సితం। వైధవ్యదుఃఖితాహ్యేవ పశ్చాత్తంగ్దూతిమాన్భవేత్॥ అతోద్విజన్మనః పుత్రధిగతస్యప్రతిగ్రహం। కృత్వాప్రతిగ్రహంనిప్రాయాగాదిషుపరాఙ్ముఖః॥ అజాగళస్తనఇవతస్యజన్మనిరర్థకం॥భవిష్యోత్తరే॥విప్రస్తిలాచలంధృత్వా రాజభిఃపుణ్యపర్వసు। శుద్ధోయాగాదికంకృత్వా హ్యన్యథానిత్యసూతకీ॥ కాశ్మే॥ యావంతఃపర్వతారాజ్ఞః తిలారాశీకృతాన్నృభిః। తావంతిపాపజాతాని కర్తుఃపుత్రనసంశయః॥ అతోవిప్రవరాణాంహి గర్హితస్తత్పరిగ్రహః। యదిచ్ఛేన్మనసాశుద్ధిం తిలాచలపరిగ్రహాత్॥ అనుజ్ఞాతో ద్విజేంద్రాణాం [illegible] చ్ఛేత్। సద్యస్సముద్రగామిన్యాంపా

స్నాత్వాయథావిధి ॥ నిత్యకర్మసమాప్యాథ స్వగృహే దేవసన్నిధౌ। స్వగృహ్యాగ్నింప్రతిష్ఠాప్య హ్యాజ్యభాగాంతమాచరేత్ ॥ త్ర్యంబకేతిమంత్రిణతిలై రాజ్యవిమిశ్రితైః । ఆసాయంజుహుయాద్వహ్నౌ తావత్సంఖ్యాం సముద్వహన్ ॥ విరమయ్యతదాహోమం తమగ్నింనత్యజేద్బుధః। అక్షతిఘ్నతిలాన్భుక్త్వాస్వపేద్దేవగృహేముదా॥ పరేద్యుప్రాతరుత్థాయ పూర్వోక్తంధోమమాచరేత్ । ఉపోష్యరజనీమేకాం పునస్సంస్కారమాచరేత్ ॥ ఏషావిశుద్ధిరుదితా తిలాచలపరిగ్రహే । అన్యథానిష్కృతిర్నాస్తి దానైస్తీర్థావగాహనైః ॥ ప్రయుతందశలక్షమ్ ॥ తదుక్తంమహాభారతే ॥ అయుతందశసాహస్రం నియుతంలక్షముచ్యతే। ప్రయుతందశలక్షంస్యా దర్బుదంకోటిరుచ్యతే॥ ఏతత్ప్రాయశ్చిత్తాకరణవిషయం। స్వధనస్యచతుర్థభాగేన పూర్వవత్ప్రాయశ్చిత్తం కుర్యాదన్యథానిష్కృతిః ॥ ఇతి హేమాద్రౌ తిలాచల ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

(౩౯౫) ఇకనుదిలాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానము నుచెప్పుచున్నాడు ॥ తిలాచలము, కాలపురుషుడు, [illegible] ధేనువు, తిలలు, తిలచక్రము, ప్రతికృతి, ఆర్ద్రకృష్ణాజినము, తిలకృష్ణాజినము, [illegible] గముతోగూడినశకటము, అను నవిప్రతిగ్రహీతలకు గొప్పవగు నరకముల [illegible]ంచిన లుగజేయును, ఈవస్తువులను నిష్కారణముగఁ బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడుగొప్పదగు నరకమునను భవించును. అనంతరమందు స్త్రీజన్మమునుబొందును, కావునఁ బశ్చాత్తాపముతోగూడుకొని ప్రాయశ్చిత్తాదులను జేసికొన్ననేని పావనుడగునని నారదీయమునందు జెప్పబడియె. ధనలోభముచేతఁదిలాచలమును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు సప్తజన్మములదనుక విధవాంగనయై పుట్టునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. స్కాందపురాణమునందును నిటులనే చెప్పబడియె. రాజాదులవలన దిలాచలమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తాదులను జేసికొనకపోయెనేని నిత్యసూతకియనబడునని భవిష్యోత్తరమునందు జెప్పఁబడియె. రాజాదులవలననెన్నితిలరాసులను బ్రాహ్మణుడు ప్రతిగ్రహించునో యన్నిపాపములనుబొందును. అందువలన దిలాచలమును బ్రతిగ్రహింపగూడదు. ఒకవేళనవివేకమువలన బ్రతిగ్రహించినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన సముద్రగామియగు మహానదియందు స్నానమును జేసి స్వగృహమునందలి దేవసన్నిధియందు నిత్యకర్మలను సమాప్తిని బొందించి స్వగృహ్యాగ్నిని బ్రతిష్ఠించి యాజ్యభాగాంతమువరకును నాచరింపవలయును; త్ర్యంబక [illegible] మొదలు

కొని సాయంకాలమువఱకును హోమమును జేయవలయును, పరదినమునం దును నివ్విధముగానే హోమమును జేయవలయును, అనంతరమం దుపవ సించి పునస్సంస్కారమును బొందవలయును, ఇవ్విధముగ నాచరించినవాఁ డు పవిత్రుఁడగునని కూర్మపురాణమునందు జెప్పబడియె. ఆయుతమనగా బది వేలనియును, నియుతమనగా నొకలక్షయనియును, ప్రయుతమనగాబదిలక్ష లనియును. అర్బుదమనగా గోటియనియును మహాభారతమునందు జెప్పబడి యె. ఈపూర్వోక్తప్రాయశ్చిత్తమును జేసికొననివిషయమునందు దానప్ర తిగ్రహించినధనముయొక్క నాల్గవభాగమును వ్యయము సేయవలయును॥

——❋కార్పాసాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్❋——

(౩౯౬) అథకార్పాసాచల ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ మా ర్కండేయః॥ సబీజంకృమికీటాద్యైర్యుక్తంపుణ్యపర్వసు । కార్పాసంద్విజ వర్యాయయోదద్యాదఙ్గతోఽపి విముక్తిభాక్ ॥ బ్రహ్మాండే ॥ కార్పాసస్యాచలంరా జా పుణ్యక్షేత్రేషుపర్వసు। అర్చితంగంధపుష్పాద్యైశ్శాస్త్రమార్గేణధర్మతః॥ యోదద్యాద్ద్విజవర్యాయ సముక్తస్సంసృతేర్భయాత్। తద్బీజానీహయా వంతి తావత్కాలంవసేద్దివి సత్కార్యకృత్॥ కార్పాసస్యాచలంవిప్రఃప్రతిగృహ్య జనాధిపాత్ । సద్యఃక్షురతిక్షై॥ స్త్రీస్వం కతుణాఃపాపంచసంప్రశేత్॥ సవిప్రః ప్రతిగ్రహాద్భూయాదాత్మఘాతీనరేశ్వర । మృతఃకాలవశంగత్వా కాకోలంనర కంవ్రజేత్ ॥ తదంతేభువమాసాద్య శ్వేతరోగీదరిద్రవాన్ । పత్నీపుత్ర పరి త్యాగ దుఃఖితస్స్యాత్పునఃపునః ॥ బ్రహ్మాండే ॥ యోవిప్రఃపుణ్యకాలేషు గి రింకార్పాససంజ్ఞితం । అర్చితంగంధవస్త్రాద్యైః ప్రతిగృహ్యజనాధిపాత్ ॥ అకృత్వాతద్వ్రిష్కృతం సమ్యగ్యమపాశవశంగతః । కాకోలంనరకంగత్వాశ్వేత రోగీభవేన్నృప॥ అతస్తద్దోషశాంత్యర్థం ప్రాయశ్చిత్తంచరేద్బుధః॥స్కాం దే॥ కార్పాసస్యాచలేప్రోక్తం ప్రాయశ్చిత్తమిదంశృణు । పశ్చాత్తాపసమా యుక్తః ప్రాప్యానుజ్ఞాంద్విజోత్తమైః ॥ విపినంనిర్జనంగత్వా వపనంకార యేత్తతః॥ తత్రత్రిషవణస్నానం కృత్వావిష్ణుపరాయణః ॥ నాభిదఘ్నజలే స్థిత్వా ప్రాఙ్ముఖోదఙ్ముఖశ్శుచిః । పురుషసూక్తంజపన్భక్త్యా దానతృష్ణో జ్ఝితోనరః । తతోవిరమ్యసహసా సంఖ్యాంమనసిధారయన్। హస్తద్వయ మితాన్సక్తూన్భక్షయేద్గుడవర్జితమ్ ॥ స్వపేన్నారాయణస్యాగ్రే కేవలే స్థండిలేవ్రతీ। పునఃపరేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ తద్వదేవపూర్వ వత్సంఖ్యా యావత్కాలేనసాధ్యతే । తదావిరమ్యపూర్వేద్యు రుపోష్యవిధి పూర్వకం ॥ [illegible] జపేత్ । ఏతేనైవవిశుద్ధి

స్యైవ నాన్యథాశుద్ధిరిష్యతే ॥ ఏతత్ప్రాయశ్చిత్తాకరణే॥ పూర్వవత్స్వధనార్ధార్ధప్రాయశ్చిత్తంవిశుద్ధిదమ్ । స్వధనస్యచతుర్థభాగేన పూర్వవత్ప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధోభవతీత్యర్థః॥ నచాన్యథా॥ ఇతికార్పాసాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౬.) ఇకను కార్పాసాచల ప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ క్రిమికీటాదులచేత శోధితమైనకార్పాసమును బ్రాహ్మణునకు దానముసేసినవాడు ముక్తినిబొందునని మార్కండేయుడువచించె. పుణ్యక్షేత్రములయందయినను, పుణ్యపర్వములయందయినను, శాస్త్రోక్తప్రకారముగ గంధపుష్పాక్షతాదులచేత నలంకరితమైన కార్పాసాచలమును బ్రాహ్మణునకు దానపూర్వకముగ నిచ్చినవాడు చిరకాలమనగా నకార్పాసబీజములు భూమియందు వృద్ధియగుచున్నంతవరకు స్వర్గలోకము నందుండును. ఇట్టిదానమును బ్రతిగ్రహించినబ్రాహ్మణుడు కాకోలమను నరకమును బొందును, అనంతరమందు శ్వేతరోగముగలవాడును, దరిద్రుడును నైపుట్టును. మఱియును పత్నీపుత్రపరిత్యాగమువలన మాటిమాటికిని దుఃఖితుడగునని కూర్మపురాణమునందు జెప్పబడియె. బ్రహ్మాండమునందును నిటులనేచెప్పబడియె, కార్పాసాచలమును ప్రతిగ్రహించినవాడు ప్రాయశ్చిత్తముజేసికొనవలయును, అదిహెట్లనిన నిర్జనమగు వనమునకుబోయి యచ్చోట వసనమునుజేసికొని విష్ణుపరాయణుడై త్రిషవణస్నానమును జేసి బాహువులోతు నీళ్ళయందుండి ప్రాఙ్ముఖుడుగానయినను, ఉదఙ్ముఖుడుగానైననునుండి శుచియై పురుషసూక్తమంత్రపఠనమునుజేయుచు నక్షత్ర దర్శనమువఱకును నుండవలయును, అనంతరమందు రెండుదోసిళ్ళసక్తుపిండిని భుజింపవలయును, విష్ణునారాయణుని మోక్షస్థండిలమునందు శయనింపవలయును, అనంతరమందు మరుదినప్రాతఃకాలమునందు నిద్రనుమేల్కాంచి పూర్వదినమునందువలె జపమును జేయవలయును, ఇవ్విధముగ బూర్వోక్తసంఖ్యముగింపును బొందునంతవరకును జపించి జపావసానదినమునకు బూర్వదినమునందుపవాసమును జేసిదండ్యమౌంజ్యజినములు వినాగానుపనయనవ్రతము నాచరింపవలయును, ఇవ్విధముగనాచరించినయెడల బరిశుద్ధుడగును, ఇట్లుగాదేని పూర్వోక్తప్రకారముగ స్వధనార్ధప్రాయశ్చిత్తమును జేసి కొనవలయును, నాల్గవ భాగమునయినను వ్యయముచేయవలయుననిస్కాందపురాణమునందు జెప్పబడియె॥

## లవణాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౩౯౭) అథలవణాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ మార్కం
డేయపురాణే ॥ శ్లో॥ లవణాచలంనరపతిరాదరాత్కుర్యాన్నదీపుణ్యతటేషు
పర్వసు। విప్రాయవేదాధ్యయనాత్మశీలనేనతస్యభూమావునరాత్మసమ్భవః॥
స్కాందే ॥ పురాహిమవతఃపార్శ్వేకన్యకాకాచిదప్సరాః। సుకేశీసుతీసు
భ్రూర్నామసంతీసుందర స్తనీ ॥ విహారార్థంబహిర్గత్వా విచచారగృహాంకణే।
తదాతామవలోక్యాథ రావణోనామదైత్యరాట్ ॥ కామాతురస్తదాతస్యా
హస్తంజగ్రాహపాణినా । హస్తస్యస్పర్శమాత్రేణ తదాభూత్సాత్వికోద
యః॥ స్తంభప్రళయరోమాంచాః స్వేదోవైవర్ణ్యవేపథూ । అశ్రువైస్వ
ర్యమిత్యష్టౌ సాత్వికాఃపరికీర్తితాః ॥ స్వేదోదకంతదాతస్యానదీరూపాత్ప్ర
వర్తతే। తథాప్రభృత్యసాసింధుర్లావణీభువివిశ్రుతా ॥ సాతదాహిమవ
త్పార్శ్వాత్ప్రవృత్త్యేకంసాగరంగతా । స్వేదరూపప్రవాహేణ పత్నీభావపరి
ష్కృతః ॥ అంగీచకారసలిలం లావణ్యంలవణాంభసి । తదాప్రభృత్యసాసిం
ధురుదకేజలసంగమాత్ ॥ అత్యాపరతయారాజన్ లవణోదధిరీరితః । త
త్రోత్పన్నంతులవణం దోషాధికతయామునే ॥ నప్రతిగ్రహణంతస్య కేచిది
చ్ఛంతిసూరయః। లవణంచాణుమాత్రంవా ప్రతిగృహ్యాద్విజోయది॥తన్నిష్కృ
తింపరాకృత్యవింధ్యదేశేపిశాచతా॥ మార్కండేయః ॥ లవణస్యాచలంధృ
త్వా రాజ్ఞఃపుణ్యాగమేసకృత్ । విప్రోయదిహిదుష్టాత్మా యమపాశవశంగ
తః॥ మహాంతంనరకంభుక్త్వాపిశాచోభవతిధ్రువం। పశ్చాద్భువముపాగమ్య
స్వేదాంగోజాయతేసదా॥ బ్రహ్మకైవర్తే ॥ పూర్వజోహ్యచలంధృత్వాలా
వణంరాజవల్లభాత్ । పుణ్యతీర్థేపుణ్యదేశే పుణ్యకాలేషుపర్వసు ॥ నిష్కా
రణతయాలోభా ద్యమలోకముపాగతః। మహద్భయంతదాభుక్త్వా పునర్భు
వముపావిశత్ ॥ పిశాచజన్మతామేత్య తదంతేస్వేదదేహవాన్ । అతఃప్రతి
గ్రహస్తస్య గర్హితోలోకవర్జితః॥ శైవే॥ముఖజోబాహుజాద్ధృత్వాలావణ్య
మచలంభువి। పిశాచత్వంభవేత్తస్య స్వేదాంగోజాయతేపునః ॥ తస్యపాప
విశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తమిదంద్విజైః । దర్శితంలోకరక్షార్థం తదాహంకథ
యామితే॥ విప్రానుజ్ఞామవాప్యాథ పశ్చాత్తాపసమన్వితః । స్నాత్వాశుద్ధ
నదీతోయే గత్వాపర్వతగహ్వరం॥ కంటకం బాదరంధృత్వా స్వయంమా
ర్గ్యాత్మనస్తదా । శిఖాంస్తత్రజపేజ్జేనం సర్వపాపాపనుత్తయే ॥ నారాయ
ణంహృదాధ్యాయన్ సర్వపాపప్రణాశనం । ఆధారం సర్వమంత్రాణాం
యావదస్సంగతోరవిః॥ తద్దాపరస్యసహస్రా గణనాంహృదిధారయన్। హ

స్త్రవ్యాయ ప్రభూతేనపిబేద్గోదుగ్ధమాదరాత్ ॥ స్వపేన్నారాయణస్యాగ్రే స్థండిలే కేవలే శుచిః। తతః పరేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ ఏవం బహుశుద్ధ్యయం కృత్వానియుతంవిధిపూర్వకం। రుద్రాధ్యాయంపఠేజ్జప్త్వాఉతవిష్ణోరనుజ్ఞయా॥ ఏతద్ద్వయోరభావేఽపిప్రాయశ్చిత్తంసమాచరేత్। పూర్వవత్స్వధనాద్ధార్ధం ప్రాయశ్చిత్తంవిశుద్ధిదం ॥ అన్యథానిష్కృతిర్నాస్తిలవణాచలసంగ్రహే। నియుతంనమకచమకౌ అరణ్యకందశాధ్యాయాః నారాయణంసర్వమంత్రాణామాకరత్వాల్లవణాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తంభవతి।దశాధ్యాయంసకృజ్జప్త్వాసర్వపాపైఃప్రముచ్యతే॥ తదేవాహ॥ అత్యాశవాదతీపానాద్యచ్చఉగ్రాత్ప్రతిగ్రహాదితి॥ అత్యాశనంసపిండీకరణశ్రాద్ధాదిషు నిమిత్తస్థానేభోజనం ॥ అతిపానంశూద్రప్రపాదిషుపానం॥ ఉగ్రప్రతిగ్రహః శూద్రాదేర్లవణాచలాదిప్రతిగ్రహః ॥ ప్రాయశ్చిత్తపక్షేపునస్సంస్కారం పూర్వవత్కృత్వాశుద్ధోభవతి నాన్యథేతి॥ ఇతిలవణాచలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౭) లవణాచలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పుణ్యకాలాదులయందు లవణాచలదానమును జేసినవాడు మరలజన్మమునుబొందడని మార్కండేయపురాణమునందుజెప్పఁబడియె. తొల్లి మిగులలావణ్యవతియగు నొకదేవాంగనారత్నము హిమత్పర్వతప్రాంతములయందుసంచరించుచుండె. అచ్చోటునకు రావణుఁడనురాక్షసుడువచ్చె. వచ్చియయ్యంగననుజూచి కామాతురుడై దానిహస్తమునహస్తముచేతబట్టికొనియె. అట్లుపట్టుకొనినతోడనేయయ్యంగనకుసాత్వికభావోదయమయ్యె. అదికారణముగ దానిశరీరమునుండి స్వేదోదకముబయలువెడలె. అట్లుబయలువెడలిన స్వేదోదకము సింధువనునదీరూపముగ బ్రవహించె. అంతటనానదిహిమవత్ప్రాంతములనుండిబయలువెడలి సముద్రమునందుబ్రవేశించె. దానిసముద్రుడు భార్యగాస్వీకరించె. అట్టిసముద్రమునందు లవణముత్పన్నమయ్యె. ఆలవణదానమును ప్రతిగ్రహించినబ్రాహ్మణుడు మహానరకమునుబొందునని స్కాందపురాణమునందుజెప్పబడియె. పుణ్యకాలాదులయందురాజాదులవలనలవణాచలమునుప్రతిగ్రహించినవాడు మరణానంతరమందు యమలోకమునుబొంది పిమ్మటగొప్పదగునరకమునుబొంది పిశాచత్వమునుబొందును. అనంతరమందు మరలభూలోకమునందు స్వేదాంగుడైపుట్టునని మార్కండేయుడువచించె. బ్రహ్మకైవర్తమునందును నిటులనేచెప్పబడియె. లవణరాశిని ప్రతిగ్రహించినవాడు స్వేదోషనివృత్తికొఱకు బ్రాహ్మణానుజ్ఞనుబొంది

మేథావీ స్మరన్నారాయణంవిభుం॥ చతుర్థకాలఆయాతే యావకం భోజనంచరేత్। యావకమితిహస్తమాత్రయవాన్పక్త్వా భోజయేత్। పునరసంగతేభానౌ పూర్వవజ్జపమాచరేత్ ॥ జపేన్మృత్యుంజయస్యాన్యాసధ్యానపూర్వకం । అనాధారో బహిరేవనీహారే ఏవశతసహస్రసంఖ్యా ముద్వహన్ తిష్ఠేత్॥ ఏవంబుద్ధ్వాయంసీత్వాపంచగవ్యం పిబేత్తదా।ఏవంకృతే విశుద్ధస్స్యాన్నాన్యథాశుద్ధిమాప్నుయాత్॥ ఏతదాచరణాశక్తౌపూర్వవత్స్వధనచతుర్థభాగేనప్రాయశ్చిత్తంకృత్వాశుద్ధిమాప్నోతి॥ నపునస్స్నానాదిరాదిః ఇతి గుడధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౩౯౮) ఇకనుగుడధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ గుడధేనువు, తిలధేనువు, ఘృతధేనువు, జలధేనువు, క్షీరధేనువు, మధుధేనువు, శర్కరాధేనువు, రసధేనువు, అనునవిపదివిధములని మాత్స్యమునందుజెప్పబడియె. ఈపదివిధములధేనువులను ప్రతిగ్రహించినవానికి భిన్నభిన్నముగ ప్రాయశ్చిత్తముచెప్పబడియె. పుణ్యకాలాదులయందు గుడమయమైనధేనువును దానమును జేసినవాడు దేవరాట్టగునని మార్కండేయమునివరుడు చెప్పె. శైవమునందునునిటులనేచెప్పబడియె. గుడధేనువునువస్త్రాద్యలంకారములచేతనలంకరించి సుశీలుడగు బ్రాహ్మణునకివ్వవలయును. ఇట్టిదానమునుబ్రతిగ్రహించినవాడు మరణమునుబొందినపిదప యమలోకమునుబొందును. పిమ్మటభిల్లజన్మమునుబొందును. కావునన ట్టిదానమునుప్రతిగ్రహించినవాడు యాగాదికమును జేసెనేనిపావనుడగునని గారుడపురాణమునందుజెప్పబడియె. కూర్మపురాణమునందును నిటులనేచెప్పబడియె. మఱియును ప్రాయశ్చిత్తవిధానముగూడ జెప్పబడియె. అదియెట్లనినప్రాతఃకాలము మొదలుకొని సాయంకాలమువఱకును నారాయణుని స్మరింపవలయును. నాల్గవకాలమువచ్చినపుడు యావకాహారమును జేయవలయును. అనగాహస్తపరిమితిగల యవలను భుజింపవలయును. మరలసూర్యాస్తమయమైనతోడనేపూర్వమువలెజపమును జేయవలయును. ఇట్లునాలుగుమాసములకాలము వ్రతాచరణను జేసి పిమ్మటబంచగవ్యప్రాశనను జేసెనేనిపరిశుద్ధుడగును. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొనలేనివాడు ప్రతిగ్రహమువలన గలిగినద్రవ్యమునందు నాల్గవభాగమునువ్యయముచేయవలయుననియును కూర్మపురాణమునందు జెప్పబడియె.

——* తిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(౩౯౯) అథతిలధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ శైవేపురాణే॥

శ్లో॥ మహాపుణ్యనదీతీరే వ్యతీపాతే చ వైధృతౌ। గ్రహణే సంక్రమే చైవ మన్వాదిషు యుగాదిషు॥ రాజ్ఞా దత్తాం తిలమయీం ధేనుం గంధాక్షతైరలం॥ అర్చితాం యో ద్విజో ధృత్వా స వై మృత్యువశం గతః ॥ అనుభూయ మహాఘోరాం వేదనాం దూతనిర్మితాం। పశ్చాద్భవతి పాపాత్మా సప్తజన్మసు రోగవాన్ భువి ॥ కార్మే ॥ పుణ్యకాలేషు పుణ్యే హి జన్మర్క్షే జన్మసప్తమే। గంధాద్యైరర్చితాం దత్తాం రాజభిస్తిలరూపిణీం॥ యో ద్విజః ప్రతిగృహ్ణాతి స హ్యకృత్వా విశుద్ధిం శుభాం। తత్రైవ మృత్యుమాయాతి హ్యనుభూయ మహావ్యథాం ॥ పశ్చాత్ప్రాప్య మహాఘోరాన్ సప్తజన్మసు రోగవాన్ భవేత్। తిలాస్సంతి హి యావంతో హ్యజినే ధేనువత్సయోః ॥ తావద్యుగసహస్రాణి నరకే వాసమశ్నుతే। తస్యైవ సత్యకర్మాణి హరంత్యేతత్ప్రతిగ్రహాత్। తస్మాత్ప్రతిగ్రహో ధేనోస్తిలపాపాకరో నృప। గర్హితో ముఖజానాం హి తస్మాదేతత్పరిత్యజేత్ ॥ లైంగే॥ పూర్వోక్తేష్వేషు పుణ్యేషు దినేషు పృథివీపతేః। ధేనుం తిలమయీం ధృత్వా విప్రో భోగపరాయణః॥ తస్య నిత్యం చ కామ్యం చ ఇష్టాపూర్తాదికం చ యత్। సర్వం హరతి తత్కాలే దానమంత్రైర్యథా॥ తస్యైవ సమ్యక్ఫలం కథితాము నిపుంగవైః। తద్ధవ్యం సంపరిత్యజ్య దక్షిణామాత్రముద్వహేత్॥ ఆధానం వా క్రతుం వాపి కృత్వా సర్వస్వదక్షిణమ్। తతశ్శుద్ధిమవాప్నోతి పునస్సంస్కారపూర్వకమ్॥ అన్యథా నిష్కృతిర్నాస్తి పంచచాంద్రాయణైర్వినా॥ స్కాందే॥ రాజ్ఞా హస్తాన్నివృత్తస్య ధేనుం తిలమయీం ద్విజః। అగ్న్యాధేయం చ యాగం వా కృత్వా తన్నావశేషయేత్ ॥ ప్రధానం సంపరిత్యజ్య నదోషస్తత్ప్రతిగ్రహాత్। అథవా పంచభిశ్చాంద్రైశ్శుద్ధిమాప్నోతి వైదికీం ॥ పునస్సంస్కారమాత్రేణ నిత్యకర్మస్వి హార్హతా। ఉభయం యః పరిత్యజ్య కేవలం భోగలాలసః॥ తదంతే నిష్ప్రజో భూయాత్స మహారోగవాన్భువి॥ ఇతి తిలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౯౫౯) ఇకను తిలధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ మహాపుణ్యనదీతీరమునందును, వ్యతీపాతమునందును, వైధృతియందును, గ్రహణమునందును, సంక్రమణమునందును, మన్వాదులయందును, యుగాదులయందును, సద్బ్రాహ్మణునకు దానము సేసిన రాజు పుణ్యలోకమును బొందును. ఇట్టి దానమును ప్రతిగ్రహించినవాడు మిగుల ఘోరమగు నరకమును బొంది పిమ్మట భూలోకమునందు పుత్రరహితుడగును, రోగవంతుడును నగునని దేవీపురాణమునందు జెప్పబడియె. కూర్మపురాణమునందును నిటులనే జెప్పబడియె. లైంగమునందును నిటులనే జెప్పబడియె. మరియును ప్రాయశ్చి

త్తవిధానముగూడ జెప్పబడె. అదియెట్లనిన తిలధేనువును బ్రతిగ్రహించినందు వలన గలిగిన ధనమును సర్వమును దక్షిణనుగా జేసి యాథానము నైనను, క్రతువు నైనను జేయవలయును. ఇట్టికృత్యమును జేయజాలనివాఁ డైదు చాంద్రాయణముల నాచరింపవలయునని లైంగమునందు జెప్పఁబడియె. స్కాందమునందు నునిటులనే చెప్పబడియె.

—— ఘృతధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం. ——

(౪౦) అథఘృతధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ ధేనుంఘృతమయీంశుద్ధాం కృష్ణాజినపరిష్కృతామ్। స్వర్చితాంగంధపుష్పాద్యై ర్రాజభిఃపుణ్యసంగమే॥ పృథక్ప్రతిగ్రహంకృత్వాద్విజోయాగాదిభిర్వినా। యమలోకముపాగమ్యకుమ్భీపాకేనిమజ్జతి॥ తదంతేభువమాసాద్య శ్వానయోనిజాయతేభువి। అతోమహాదోషభయాత్పరిత్యాజ్యాద్విజన్మభిః॥ లైంగే॥ ధేనుమేకాంద్విజోరాజన్యాజ్జిఘ్నేఘృతనిర్మితాం। సంవత్సరంభూమిషణ్డైర్వాస్త్రైర్నిష్కారణతయావహేత్॥ కుమ్భీపాకేసిరుచ్ఛ్వాసఃపీడితోయమకింకరైః। తదంతే పృథివీమేత్య శ్వానవాయసలోద్భవః॥ హీనజాతిషుసర్వాసుభూత్వాభూత్వాననివర్తతి। యాగాదికమకృత్వాచదేతస్మాన్నవిముచ్యతే॥ గారుడే॥ కృష్ణాజినేషుపుణ్యేషునిర్మితాంఘృతరూపిణీం। పూజితాంరాజభిస్తస్మైర్ధేనుంయోముఖజోప్రహేత్॥ తస్యైవసరకోఘోరఃకుమ్భీపాకస్సముజ్జ్వలేత్। తత్ర పక్త్వాపునఃపాపీప్రాశ్వాన్వైణవజన్మతామ్। నానాయోనిషుసంభూయాద్యాగాదిషుపరాఙ్ముఖః। పశ్చాత్తాపసమాయుక్తఃప్రాయశ్చిత్తంభవేత్తతః॥ ప్రాయశ్చిత్తమాహబ్రహ్మాండే॥ ఘృతధేనుంరాజదత్తాంస్వర్చితాం వస్త్రభూషణైః। పుణ్యకాలేషుపుణ్యాహేప్రతిగృహ్యద్విజోయది॥ ద్రవ్యలోభపరీతాత్మా ప్రాయశ్చిత్తమిదంచరేత్। నదీముఖేతీర్థేషుస్నాత్వాప్రోక్తయథావిధి॥ స్వగృహంపునరాగమ్యస్వగృహ్యాగ్నౌవిశుద్ధయే। అగ్నీంధనాదికంకృత్వాఆజ్యభాగాంతమాచరేత్॥ తస్మిన్నగ్నౌసపత్నీకఃకూశ్మాండంజుహుయాద్ఘృతం। తదర్ధంగణహోమంచకృత్వా శుద్ధిమవాప్నుయాత్॥ నిరాహారస్తదాతిష్ఠేత్సయోవాధేనుసప్తకం। అథశ్శాయీభవేత్తత్రపత్నీభిశ్చవివర్జితః॥ ఏవంప్రతిదినంకుర్యాత్సంఖ్యాయావత్సమాప్యతే। తదంతేభోజయేద్విప్రాన్హోమశేషం విశుద్ధయే॥ బ్రాహ్మణాన్పూజయేత్పశ్చాత్పరిక్రమ్యప్రణమ్యచ। స్వయంచపారణంకుర్యాత్పత్నీపుత్రసమన్వితః। ఏవం కృత్వాద్విజశ్శుద్ధోహ్యన్యథాపాతకీ భవేత్। ఏతదాచరణేత్వసమర్థః॥ పూర్వవన్న్యధనాథాచార్ఛౌ ప్రాయశ్చిత్తేఃవిశుద్ధిదం॥ ప్రాయశ్చిత్తం

కృత్వా శుద్ధిమాప్నోతి॥ ఇతి హేమాద్ర్యుద్ధృత ధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౮౦౦) ఇక నుద్ధృత ధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నారు॥ బ్రాహ్మణుడు యాగాదినిమిత్తములను వదలి కృష్ణాజిన పరిష్కృతమైనదియును, పరిశుద్ధమైనదియును, అగునుద్ధృతమయ ధేనువును బ్రతిగ్రహించెనేని యముల లోకమునందలి కుంభీపాకనరకమున బడును. అనంతరమందు భూలోకమున వైణవుడై పుట్టును. కావున నిట్టి ఘృత ధేను దానమును బ్రతిగ్రహింపగూడదని స్కాందపురాణమునందు జెప్పబడినది. లైంగమునందు నుసిటుల నే చెప్పబడినది. గారుడపురాణమునందు నుసివిధముగా నే చెప్పబడె. పుణ్యకాలాదులయందు ఘృత ధేనువును బ్రతిగ్రహించిన రాజీ క్రిందనుదహరింపబడిన ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఎట్లనగా ప్రాతఃకాలమున బుణ్యనదులయం దుస్నానమును జేసి నిజమందిరమునకు వచ్చి పరిశుద్ధత కొఱకు స్వగృహ్యాగ్నియందు నగ్నీంధనాదికమును జేసి యాజ్యభాగాంతమాచరింపవలయును. అనంతరమందు యగ్నియందు భార్యతో గూడ కూశ్మాండహోమమును జేయవలయును. పిమ్మటగణ హోమమును జేయవలయును. అనంతరమందు నిరాహారిత్వమునైనను, గోక్షీరపానమునైనను జేయువలయును. పిమ్మటన ధశ్నాను గావలయును. ఇట్లు నియమిత సంఖ్యాపూర్ణమైన పిమ్మట బంచగవ్యప్రాశనను జేయవలయును. పిమ్మట బ్రాహ్మణసమారాధనను జేయవలయును. ఈప్రకారము చేసెనేని పరిశుద్ధుడగునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడినది. ఇట్లు గాదేని పూర్వము వలె బ్రతిగ్రహించిన ద్రవ్యమునం దర్ధభాగమును వ్యయము సేయవలయును. కాదేని స్వధనచతుర్ధభాగమునైనను వ్యయము సేయవలయును.

—— * జలధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. * ——

(౮౦౧) అథజలధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శృణు వత్స ప్రవక్ష్యామి జలధేను ప్రతిగ్రహే॥ అమాయాం పర్వసంక్రాంతౌ ద్వాదశీ పూర్ణిమాదినే। మహాక్షేత్రేషు పుణ్యేషు తథా పుణ్యాలయేషు చ। కృష్ణాజినే వినిర్మాయ ధేనుం జలమయీం శుభాం। అర్చితాం గంధపుష్పాద్యైర్యథోక్తేన మార్గేణ రాజభిః। తత్త్వాం ద్విజో వృథా గ్రాహీ ద్రవ్యలోభపరాయణః॥ ఆస్నానః పరలోకార్థమకృత్వా నిష్కృతిం యది। సోనుభూయ మహాత్యాపం యమలోకే తదాజ్ఞయా॥ పునర్భూభాగమాసాద్య జాయతే కచ్ఛపో మహాన్। అతః ప్రతిగ్రహాద్దోషః పూర్వజానామిహాన్యతః॥ కౌర్మే॥ కృత్వా జలమయీం ధేనుం ద్విజో లోభపరాయణః॥ అర్చితాం ప్రభుభిః పూతాం శాస్త్రరూపేణ వర్జనాం। యాగాదికం వర్జయిత్వా ప్రతిగృహ్య ... ॥ స్కందపురాణాద కేమా ప

తదంతే భువమావిశేత్॥ అగాధజలాయాంతే కూర్మగ్రాహాదిజలపరిష్కృతే। ఏతద్దోషభయాద్భూపత్యాజ్యో విప్రైః ప్రతిగ్రహః॥ మాత్స్యే॥ ప్రతిగృహ్యాద్విజోలోభాద్ధేనుం జలమయీం నృపాత్। యాగాదికం స్వశుద్ధిం వా హ్యకృత్వా భోగలోలుపః॥ యమలోకే మహాఘోరే పీత్వా పూయోదకం బలాత్। తదన్తేత్ర సమాగత్య జాయతే కృచ్ఛ్రభాజలే॥ ఏతద్దోషాపశాంత్యర్థం ప్రాయశ్చిత్తం సమాచరేత్। గంగాయాం వాథ గౌతమ్యాం కృష్ణవేణ్యాం నదీషు వై॥ కావేర్యాం తుంగభద్రాయాం చాపి గంధమాదనే। అస్మిన్నోదధితీర్థే పూర్వోక్తే స్వే మనస్సు వేత్॥ అనుజ్ఞాప్య ద్విజైస్సాకం గత్వా పుణ్యోదకం తదా। నిమిత్తం కీర్తయిత్వాథ స్నానం మాసలమార్గతః॥ త్రిసహస్రం చ ద్విశతం వింశత్యుత్తరమేవ చ। ఏతత్కృత్వా విశుద్ధాత్మా పరిషత్సన్నిధౌ తదా॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తం ద్విజన్మనామ్। నాన్యథా శుద్ధిమాప్నోతి జలధేనుప్రతిగ్రహాత్॥ పరిషత్సన్నిధావుదాశాస్త్రం పూర్వవత్కృత్వా పశ్చాత్స్నానాదికం కృత్వా పంచగవ్యం పీత్వా బ్రాహ్మణాన్భోజయేదితి॥ ఇతి జలధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౦౧) ఇకను జలధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పుణ్యకాలములయందు రాజాదులవలన జలధేనువును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు యమలోకమునందు బహువిధములగు నరకములననుభవించి పిమ్మట భూలోకమునందు కచ్ఛపమై పుట్టునని స్కాందపురాణమునందు జెప్పబడినది. కూర్మపురాణమునందును నిటులనే చెప్పబడినది. జలధేనుప్రతిగ్రహముచేసినవాడు యమలోకమున నానావిధములగు సంకటములనుబొందును. కావున నట్టిదోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లన జలధేనువును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు గంగయందైనను, గౌతమియందైనను, కృష్ణవేణియందైనను, కావేరియందైనను, తుంగభద్రయందైనను, ధనుష్కోటియందైనను, గంధమాదనమునందైనను, స్వదోషమును బ్రకటనను జేయుచు స్నానమును జేయవలయును. మాసలవిధానముచేత మూడువేలయిన్నూటయిరువది స్నానములను జేయవలయును. ఇవ్విధముగ నాచరించిన మొదలబావనుడగునని మాత్స్యపురాణమునందు జెప్పబడినది.

——— ✻ క్షీరధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ✻ ———

(౪౦౨) అథ క్షీరధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ పురా షణ్ముఖరా క్షీరాద్ధారమాజాతా సధేనుకా। సవత్సా క్షీరసంపన్నా సర్వావయవసుందరీ॥ ... పురుషోత్తమా

యస్తస్మిం తాం ప్రదదౌ సర్వసాక్షిణే॥ స ప్రాయశ్ఛిత్తత్వాప్తాం ధేనుం శక్రో వాత్సల్యా గౌరవాత్। యయాచే జలధిం ధేనుం వృత్రహా పాపమోచనీమ్॥ తథేతి ప్రదదౌ సింధుర్దత్వా తస్మై మంత్రివాచికం॥ తాం దుగ్ధధేనుమాదాయ పునః ప్రాయాత్స్వ మాలయం। ధిషణాయ స్వవృత్తాంతం కథయామాస దేవరాట్ ॥ పుణ్యకాలే పాపహాం తే దుగ్ధధేనుం సపుత్రిణీం। దాపయామాస విప్రాయ వృత్రహత్యావి ముక్తయే॥ తదా ప్రభృత్యసౌ ధేనుః బ్రహ్మహత్యావినాశినీ। రాజా యః ప్రదదౌ ధేనుమర్చితాం కృష్ణచర్మిణీం। సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకమవాప్నుయాత్। యో విప్రః స్వార్చితాం ధేనుం సర్చితాం దుగ్ధరూపిణీం ॥ ప్రత్యగృహ్ణాద్ధనైలోభాత్సం ప్రాప్తే పుణ్యపర్వణి। స కాలవశమాపన్నస్త్వనుభూయ మహద్భయం తదంతే భుపమాసాద్య మృతదారోభవేద్భువి॥ దేవీపురాణే॥ పుణ్యకాలేషు పుణ్యక్షే పుణ్యక్షేత్రే జనాధిప। యో రాజా స్వర్చితాం ధేనుం సిగ్మితాం దగ్ధ రూపిణీం॥ విప్రాయ వేదవిదుషే ప్రదద్యాత్సోపి ముక్తిభాక్ ॥ ఏతాదృశీం దుగ్ధ మయీం ద్విజో నిషాకరణాద్వహన్। తస్య హానిమ్కృతిర్నాస్తి పంచచాంద్రా యణాద్భృతే॥ తతశ్శుద్ధిమవాప్నోతి దుగ్ధధేనుప్రతిగ్రహాత్ ॥ త్రైంగ॥ పుణ్యకాలేషు రాజేంద్ర పుణ్యక్షేత్రేషు వా ద్విజః। దుగ్ధధేనుం ప్రగృహ్యాశు పృథాభోగపరాయణః। తస్యైవ పాపనిష్కృతిర్దృష్టా పంచభిశ్చాంద్రభక్షణైః॥ అథవా యాగప్రోక్తం ప్రాయశ్చిత్తం॥ పంచగవ్యప్రాశనమేవ॥ తథాహ॥ కౌర్మే॥ ద్విజో దుగ్ధమయీం ధేనుం ప్రతిగృహ్య జనాధిపాత్ । యాగాదికం ప్రకుర్వీత పంచగవ్యం పిబేత్తతః॥ అకృత్వా ద్రవ్యలోభేన వ్యాశక్తః పాపభీస్తదా। పంచచాంద్రాయణైశ్శుద్ధిర్నాన్యథా తీర్థసేవనైరితి॥ ఇతి క్షీరధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౫౦౩) ఇకను క్షీరధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ తొల్లి సముద్రమునుండి లక్ష్మీదేవి ధేనువుతోగూడ బుట్టె. ఆ ధేనువు మిగుల సుందరమైనదై యుండె. మఱియును దూడతోగూడుకొనియుండె. ఆ సముద్రుడు లక్ష్మీదేవిని నారాయణునకిచ్చె. ఆ సమయమునందు నింద్రుడు ధేనువును యాచించె. అనంతరమందు సముద్రుడా ధేనువును నింద్రునకు నొసంగె. అంతట నయ్యింద్రుడా ధేనువుతోగూడ స్వర్గపట్టణమునకుబోయె. పోయి యా వృత్తాంతమును సర్వమును బృహస్పతికి దెల్పె. పిమ్మట దనకు గలిగియున్న బ్రహ్మహత్యా నివృత్తికొఱకు బ్రాహ్మణునకు నొసంగె. అది కారణముగ నది మొదలుకొనియా దుగ్ధధేనువు బ్రహ్మహత్యాదోషనివృత్తికారిణియయ్యె. కావున కృష్ణచర్మము గల ధేనువును బ్రాహ్మణునకు దానము చేసినవాడు విష్ణులోకమును బొందును. ఇట్టి ధేనువును బ్రతిగ్రహించినవాడు యమలోకమునందు ఘోరనరకము

లనుబొందును. పిమ్మట భూలోకమునందు భార్యాహీనుఁడై పుట్టునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. పుణ్యకాలాదులయందు దుగ్ధధేనువును దానముచేసినవాఁడు ముక్తినిబొందును. అట్టిదానమును ప్రతిగ్రహించినవాఁడు ఘోరనరకములనుబొందును. కావున నిట్టిదోషనివృత్తికొఱకైదుచాంద్రాయణముల నాచరింపవలయునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. ఇట్టిదోషముగలుగుట నిశ్చయమనియును, కావుననిట్టిదోషనివారణకొఱకు దుగ్ధధేనుప్రతిగ్రహము వలనఁ గలిగినద్రవ్యమును యాగాదులయందుపయోగించినను, నాల్గవభాగమును వ్యయముసేసినను పావనుఁడగును. ఇట్లు చేసి పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేయవలయునని లైంగమునందుఁ జెప్పఁబడియె. కూర్మపురాణమునందును నిటులనే చెప్పఁబడియె.

——* మధుధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(౪౦౩) అథమధుధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ అథాపరంప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తం విశుద్ధయే। మధుధేనుగృహీతౄణాం ద్విజానాంహితకామ్యయా। నిషేకం తెప్రవృత్తానాం భాగచ్ఛావాంశ్శృణుష్వమే। పుణ్యకాలేషుసంక్రాంతౌ వ్యతీపాతాదిసమ్భవే॥ కల్పితాంమృన్మయైః పాత్రైరర్చితాంరాజవల్లభైః। మధుధేనుంసవత్సాంచ సర్వాలంకారభూషితాం॥ గృహ్ణీయాద్యోద్విజోలోభాత్సద్యః పాపమవాప్నుయాత్। యమశాలాంప్రవిశ్యాథ పునర్భవముపాగతః॥ మధువృక్షోభవేత్సోపి యదితన్నిష్కృతిర్నచేత్। కథంచిన్నిష్కృతిర్దృష్టా తేషాంపాపరతాత్మనాం॥ పంచచాంద్రాయణైశ్శుద్ధిర్నచాన్యైశ్శుద్ధిరీరితా॥ క్షౌద్రధేనుఃక్షుద్రజాతే ర్ద్విజైర్నప్రతిగృహ్యతే। దైవాద్యదిహాలభ్యేత పంచభిశ్చాంద్రభక్షణైః॥ శుద్ధిమాప్నోతిసర్వత్ర మధుధేనుప్రతిగ్రహాత్। ఏతద్విప్రాత్ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తం బాహుజేభ్యోద్విగుణం। ఊరుజేభ్యస్త్రిగుణం। పాదజేభ్యశ్చతుర్గుణం। సంకరజాతిభ్యః పంచగుణంవేదితవ్యం॥ తదాహ॥ బ్రహ్మకైవర్తే॥ ప్రాయశ్చిత్తంద్విజాతిభ్యః ప్రతిగృహ్యకథంచన॥ యావదుక్తంతదేవాలం బాహుజేభ్యోద్విధాస్మృతం। ఊరుజేభ్యస్త్రిధాప్రోక్తంపాదజేభ్యశ్చతుర్గుణం। ఏతేభ్యోప్యతిరిక్తేభ్యః పంచధాపరికీర్తితం॥ సర్వవర్ణేభ్యస్సర్వదాన ప్రతిగృహీతౄణామేవం ప్రాయశ్చిత్తంవేదితవ్యం॥ కలౌయుగసంకరజాతయోబహ్వ్యః। తత్ప్రతిగ్రహస్యనిషిద్ధత్వాత్ప్రాయశ్చిత్తబాహుళ్యముక్తం। ప్రాయశ్చిత్తవిహీనాద్విజాః శ్లేష్మమధ్యస్థమక్షికావన్నానాజాతిషుసమ్భవంతి॥ అతః ప్రాయశ్చిత్తమేవ ప్రతిగృహీతౄణాం సాధనంనచాన్యత్॥ యస్యాయస్య

ప్రతిగ్రహస్య ధర్మశాస్త్రే ప్రతిపదోక్తం యద్యత్ప్రాయశ్చిత్తం తత్తత్కర్తవ్యం ద్విజన్మభిః॥ నాన్యథాశుద్ధిరీరితేతి॥ ఇతి మధుధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౦౩) ఇకను మధుధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ మధుధేనువును ప్రతిగ్రహించిన బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్తమును విధింపవలయును. అదియెట్లనిన పుణ్యకాలములయందు మధుధేను ప్రతిగ్రహమును జేసిన దోషనివృత్తికొఱకై దుచాంద్రాయణములనాచరింపవలయును. ఈధేనువును క్షత్రియునివలన బ్రతిగ్రహించెనేని ద్విగుణాధికముగ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. వైశ్యునివలన బ్రతిగ్రహించినవాడు ద్విగుణాధికముగ విధింపవలయును. శూద్రునివలన బ్రతిగ్రహించినవానికి జతుర్గుణాధికముగ విధింపవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె. బ్రహ్మకైవర్తమునందును నిటులనే చెప్పబడియె.

—* శర్కరాధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౪౦౪) అథశర్కరాధేను ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ ధేనుంశర్కరయాకృత్వా సవత్సాంఛాజినేశుభాం। యోరాజాద్విజవర్యాయ దద్యాత్పుణ్యాగమేముదా । అర్చితాంగంధపుష్పాద్యైశ్చ బహుభిర్భూషణైర్వృతాం। సగచ్ఛేద్విష్ణుభవనం యావదాచన్ద్రతారకం ॥ శివధర్మోత్తరే॥ కృత్వాజినేషుయోధేనుం శర్కరాభిరలంకృతామ్। అర్చితాంగంధపుష్పాద్యైర్విప్రాయాధ్యాత్మవేదినే॥ దద్యాత్పుణ్యతమేకాలే తీర్థేషు గ్రహణేషుచ॥ నతస్యపునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన ॥ విష్ణుధర్మోత్తరే॥ కృత్వాశర్కరయాధేనుం పుణ్యకాలేషుపర్వసు। దద్యాద్దక్షిణయాసార్థంవిప్రాయాధ్యాత్మవేదినే॥ సనిస్తరతిసంసారం నావాబ్ధింనావికోయథా॥ ప్రతిగ్రహేదోషమాహ। మహానారదీయే॥ యోగృహ్ణీయాద్ద్విజోధేనుం పుణ్యాంశర్కరయాచితాం। పుణ్యకాలేషుతీర్థేషు ద్రవ్యలోభపరాయణః మహాంతంనరకంభుక్త్వా స్థావరత్వమవాప్నుయాత్। తస్యైషానిష్కృతిర్దృష్టా మునిభిర్బ్రహ్మవాదిభిః॥ స్నాత్వాప్రాతర్యథాచారందంతధావనపూర్వకం। విభూతింవిశ్వరూపంచ హ్యుర్ధ్వమాలమతఃపరం॥ జపన్ త్రిషవణస్నానంకృత్వానిత్యమతంద్రితః। ఆసాయంప్రాతరాభ్య సంఖ్యయాగణయన్ జపం। ఫలాహారోత్రకర్తవ్యః స్వపేద్దేవసమీపతః ॥ పునఃప్రభాతేద్యురుత్థాయ పూర్వవజ్జపమాచరేత్॥ యదాభవేత్తత్త్రయుతం తదాశుద్ధిమవాప్నుయాత్ । యద్దేవసంగ్రహేద్ధేనుం శర్కరాయాఃపృథగ్ద్విజః॥ తదా

పాపాన్యనేకాని ప్రవిశంతి ప్రతిగ్రహే। తత్పాపశోధనార్థాయ ప్రాయశ్చిత్తమిదం శుభం। ఆధానం వా ప్రకుర్వీత యాగసాధనముత్తమం। సర్వేషాం సప్తతంతూనామాధానం ప్రథమం విదుః॥ వర్ణానాం చ యథా విప్రో దేవానామపి వాసవః। భృగుర్ఋషీణాం ప్రవరో వాచాం సత్యం యథా భవేత్॥ తథైవ సర్వయజ్ఞానామాధానం మూలకారణం। ప్రాయశ్చిత్తమిదం వాపి హ్యాధానం వా ద్విజశ్చరేత్। తాభ్యాం పాపవినిర్ముక్తః ప్రయాతి పరమం పదం॥ ఇతి శర్కరాధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౦౪) ఇకను శర్కరాధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ దూడతో గూడిన ధేనువును శర్కరచేత జేసి బ్రాహ్మణోత్తమునకు దానమును జేయవలయును. ఇట్లు దానమును జేసినవాడు సూర్యచంద్రులున్నంతవఱకును విష్ణుభవనమునందు నివసించునని మార్కండేయమునివరుడు వచించె. శివధర్మోత్తరమునందుగూడ నివ్విధముగానే చెప్పబడియె. విష్ణుధర్మోత్తరమునందును నిటులనే చెప్పబడియె. మహానారదీయమునందును నిటులనే చెప్పబడియె. మఱియును ప్రాయశ్చిత్తవిధానముగూడ జెప్పబడె. అదియెట్లనిన ప్రాతఃకాలమునందు దంతధావనపూర్వకముగ స్నానమును జేయవలయును. అనంతరమందు జపమంత్రపూర్వకముగ నతంద్రితుడై త్రిషవణస్నానమును జేయవలయును. అనంతరమందు సాయంకాలమందను క సంఖ్యాపూర్వకముగ జపమును జేసి ఫలాహారుడై దేవసమీపమునందు నిదురను బొందవలయును. అనంతరమందు పరదినమునందుగూడ నిటులనే చేయవలయును. ఇట్లు మూడుదినములు చేసెనేని పావనుడగును. ఇట్లుగాదేని యాద్రవ్యమువలన యాగాదులను జేయవలయును. కాదేని నాల్గవభాగము ద్రవ్యమును వ్యయము చేయవలయుననియును జెప్పబడియె.

— దధిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం. —

(౪౦౫) అథ దధిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శృణు వత్స ప్రవక్ష్యామి దధిధేనుప్రతిగ్రహే। ప్రతిగృహీతుర్విప్రస్య దోషో భవతి సర్వదా। తద్ద్రవ్యత్యాగమాత్రేణ ఆధానం యజ్ఞమేవ వా। కృత్వా శుద్ధిమవాప్నోతి కర్మార్హో జాయతే భువి॥ శివధర్మోత్తరే॥ దధిధేనుమలంకృత్య గంధవస్త్రాదిభూషణైః। అభ్యర్చ్య విధివద్భక్త్యా దద్యాద్విప్రాయ పుంగవే। నతస్యాయమబాధాస్తి తద్గృహే వా ప్రవేశనం। తద్దర్శనం వా రాజేంద్ర నభవేజ్జన్మజన్మని॥ బ్రహ్మకైవర్తే॥ యో రాజా పుణ్యకాలేషు పుణ్యతీర్థేషు పర్వసు॥ కృష్ణాజినే దధిమయీం ధేనుం కృత్వా సవత్సకాం॥ అభ్యర్చ్య గంధవస్త్రాద్యైర్విప్రా

యాధ్యాత్మవేదినే ॥ నతంమృత్యురవాప్నోతి నవ్యాధిర్నచతస్కరః । అంతే
విష్ణుపదంయాతి యావదింద్రాశ్చతుర్దశ । బ్రాహ్మణో ధేనుమారాధ్య దద్యా
త్కృష్ణాజినేశుభాం । నతస్యపునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన॥ ప్రతి
గృహ్యద్విజోధేనుం రాజ్ఞః పుణ్యదినేష్వపి । ప్రాయశ్చిత్తం తదాకుర్యా
త్పూర్వవద్ధనభాగతః ॥ అథవాధానకంకర్మ యజ్ఞంవాసర్వదక్షిణం । ఋణ
నిర్మోచనంకుర్యా చ్ఛుద్ధస్స్యాత్తత్ప్రతిగ్రహాత్ ॥ మాత్స్యే॥ దధధిస్తుకృతాం
గ్గాను మర్చితాంసర్వభూషణైః । పూజితాంగంధపుష్పాద్యైః పుణ్యకాలేషు
పర్వసు ॥ తీర్థేషు దేశకాలేషు ప్రతిగృహ్యద్విజోయది । అకృత్వానిష్కృతిం
తస్య సభవేద్గంధమూషకః ॥ దేవీపురాణే॥ తద్దోషోపశమంరాజన్ శృణు
సర్వప్రయత్నతః । ప్రాతస్స్నాత్వానదీతోయే నిత్యకర్మసమాప్యచ ॥ నిత్య
హోమంచకుర్వీత వృక్షమూలముపాశ్రితః । కృత్వారుద్రజపంతత్ర యావ
దస్తమయోభవేత్ ॥ తదావిరమ్యమనసా ఫలాహారంసమాచరేత్ । గృహం
గత్వాస్వపేత్తత్ర నారాయణమనుస్మరన్ ॥ పునఃపశ్చాద్యుత్థాయ పూర్వ
వజ్జపమాచరేత్ । త్రియుతంపూర్ణతామేతి తావత్పారణమాచరేత్ ॥ అ
శక్తాసులభంతాత ఆధానంయజ్ఞమేవవా । తతశ్శుద్ధిమవాప్నోతి విప్రోధేను
ప్రతిగ్రహాత్ ॥ ఇతిదధిధేను ప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౦౫) ఇకను దధిధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచు
న్నాడు॥ దధిధేనుప్రతిగ్రహము వలన గలిగిన ద్రవ్యమును యజ్ఞమునకుప
యోగించినను, లేక యాద్రవ్యమును వ్యయము సేసినను దోషరహితుండగు
నని స్కాందపురాణమునందు జెప్పబడియె. గంధపుష్పాభూషణములచేత
దధిధేనువును నలంకరించి బ్రాహ్మణునకు దానముసేయవలయును- ఇవ్విధ
ముగ దానము సేసినవానికి యమబాధ గలుగనేరదని శివధర్మోత్తరమునం
దు జెప్పబడియె- పుణ్యకాలములయందైనను, పుణ్యక్షేత్రములయందయిన
ను, కృష్ణాజినమునందు దధిమయమగు ధేనువును దూడతో గూడ నిర్మించి
గంధపుష్పాదుల చేత నలంకరించి యధ్యాత్మవేత్తయగు బ్రాహ్మణుని కొ
కు దానము సేయవలయును. ఇట్టి దానమును జేసినవాడు శాశ్వతముగ
నింద్రలోకమును బొందును- ఇటువంటి దానమును బ్రతిగ్రహించినవాడు త
ద్ద్రవ్యమును వ్యయముసేసిన యెడల దోషరహితు డగునని బ్రహ్మకైవర్త
మునందు జెప్పబడియె. దధిధేనువును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు ప్రా
యశ్చిత్తమును జేసికొనని యెడల గంధమూషకమై పుట్టునని మాత్స్యపు
రాణమునందు జెప్పబడియె. దధిధేనువును ప్రతిగ్రహించినవాడు స్వదోషని

పారణ కొఱకు ప్రాతఃకాలమున నదీజలమునందు స్నానమును జేసి నిత్యకర్మలను సమాప్తిని బొందింపవలయును. అనంతరమందు నిత్యహోమమును జేసి వృక్షమూలమునందు గూర్చుండి సూర్యాస్తమయము వఱకును రుద్రజపమును జేయవలయును. పిమ్మట ఫలాహారమును జేయవలయును. ఇవ్విధముగానే ప్రతిదినమునందును నాచరింపవలయును. ఇటు ముప్పదివేల పర్యాయములు రుద్రజపమును జేసి పిమ్మట పారణను జేయవలయును. ఇట్లు సేయుటకు శక్తిలేకపోయెనేని యాధనమునైనను, యజ్ఞమునైనను, జేయవలయునని దేవీపురాణమునందు జెప్పబడియె.

——— * ఇక్షురసధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం. * ———

(౪౦౬) అథేక్షురసధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ వామనపురాణే ॥ యో రాజా పుణ్యకాలేషు ధేనుమిక్షురసోద్భవాం । అర్చితాం గంధపుష్పాద్యైర్భూషితాం సర్వభూషణైః ॥ విప్రాయ వేదవిదుషే శాంతాయాథ కుటుంబినే । దద్యాద్దక్షిణయా సార్ధం స రాజా విష్ణుమందిరం ॥ గత్వా స్థిత్వా చిరం కాలం భూమండలపతిర్భవేత్ । తత్రాపి జ్ఞానమాసాద్య దానధర్మపరాయణః ॥ కృత్వాథ ధ్యానయోగేన విష్ణుసాయుజ్యతాం వ్రజేత్ ॥ మహాభారతే ॥ శృణు ధర్మం ప్రవక్ష్యామి ధేనుమిక్షురసోద్భవాం । అర్చితాం శాస్త్రమార్గేణ భూషితాం బహుభూషణైః ॥ పుణ్యకాలేషు సంక్రాంత్యామయనద్వితయే తథా । అర్ధోదయే మహాపుణ్యే గ్రహణే చంద్రసూర్యయోః ॥ దత్వా జినే సమ్యగ్విప్రాయాధ్యాత్మవేదినే । దక్షిణాభిశ్చ బహుభిర్దద్యాత్ఫుల్లాననో ముదా ॥ తదా వైకుంఠమాప్నోతి పునరావృత్తివర్జితం ॥ నృసింహపురాణే ॥ కల్పితాం రాజపురుషైరిక్షూద్భవరసేన తాం ॥ అస్పృశ్య త్వావిధానేన హ్యర్చితాం యద్విజన్మనే ॥ దక్షిణాభిర్యథోక్తాభిర్దద్యాస్మనసి నిస్పృహః ॥ తస్య దేవః ప్రసన్నస్స్యాత్ప్రీతో దాయాద్ధాపురా ॥ తత్ప్రాయశ్చిత్తమాహ బ్రహ్మాండే ॥ పూర్వం ద్విజో బాహుజాద్ధృత్వా ధేనుమిక్షురసోద్భవాం । అకృత్వా నిష్కృతిం పశ్చాద్దానం వా క్రతుం చ వా ॥ యమలోకముపాగమ్య నరకాన్ వింశతిం । అనుభూయ స పాపాత్మా గోమాయుర్భవతి క్షితౌ ॥ మాత్స్యే ॥ విప్రో ధేనుం రసమయీం దత్తాం రాజకుమారకైః । గృహీత్వా పుణ్యకాలేషు తన్నిష్కృతిపరాఙ్ముఖః ॥ యాగాదికం పరాకృత్య గోమాయుర్భవతి ధ్రువం । తస్యైవ పాపనిష్కృతిర్దృష్టా విష్ణునా ప్రభవిష్ణునా ॥ ప్రాతరారభ్య నద్యాం వై స్నాత్వా నిత్యం సమాప్య చ । వృక్షమూలముపాగమ్య పఠేదుపనిషత్త్రయం ॥ సంఖ్యాం సముద్ధరన్ సన్న్యస్యావధ సంగతో రవిః । తావజ్జపాద్విరమ్య

థఫలాహారంసమాచరేత్ ॥ స్వాపేద్దేవసమీపేతుకృతంపాపమనుస్మరన్ ॥ ప్రరేద్యుః ప్రాతరుత్థాయ పూర్వవజ్జపమాచరేత్ ॥ ద్వ్యయుతంపూర్ణతామేతి తతశ్శుద్ధిమవాప్నుయాత్ । ఏతత్ప్రాయశ్చిత్తంయాగాద్యకరణవిషయంతత్ప్రాప్తౌ పంచగవ్యమాత్రం ప్రాయశ్చిత్తం ॥ ఇతీక్షురసధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥

(౭౦౬) ఇకను ఇక్షురసధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానముగ జెప్పుచున్నాడు॥ పుణ్యదేశములయందును, పుణ్యకాలములయందును, ఇక్షురసోద్భవమగుధేనువును, గంధపుష్పాక్షతాదులచేతనలంకరించి వేదవేత్తయగు బ్రాహ్మణునకు దక్షిణతోఁగూడ దానముసేయవలయును. ఇవ్విధముగదానముసేసినవాఁడు విష్ణులోకమును బొందును. అనంతరమందు భూమండలాధిపతియగును. ఈభూమండలాధిపత్యమును బొందియును జ్ఞానవంతుడగును. పిమ్మట విష్ణుసారూప్యమునుబొందునని వామనపురాణమునందు జెప్పబడియె. మహాభారతమునందును నిటులనేచెప్పబడియె. ఇక్షురసధేనువును దానముసేయుటవలన బ్రహ్మాదునకు నరసింహదేవుడు ప్రసన్నుడయ్యెనని నృసింహపురాణమునందు జెప్పబడియె. బ్రాహ్మణుడిక్షురసధేనువును ప్రతిగ్రహించెనేని యాద్రవ్యముచేత నాధానమునైనను, యజ్ఞమునయినను జేయవలయును, ఇట్లు సేయడేని యమలోకమును బొంది యిరువదొకవిధములగు నరకములను ననుభవించును, పిమ్మట భూలోకమునందు నకులమై పుట్టునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె, ఇక్షురసధేనప్రతిగ్రహమువలనఁగలిగిన ద్రవ్యముచేత యజ్ఞాదులనుజేయనివాడు గోమాయువై పుట్టును, కావునట్టి దోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన ప్రాతఃకాలమునందు స్నానమునుజేసి నిత్యకర్మలనుసమాప్తిబొందించి వృక్షమూలమున గూర్చుండి మూడుపరివర్తులనుసంఖ్యాపూర్వకముగ సాయంకాలమువఱకును జపముసేయవలయును, అనంతరమందు ఫలములను భుజింపవలయును, పిమ్మట దేవసమీపమునందుఁ బరుండి తనదుపాపమును స్మరించుచు నిద్రింపవలయును, పరదిన ప్రాతఃకాలమునందుమేలొంచి పూర్వదినమునందువలెనేచేయవలయును, ఇట్లుద్వయయుతసంఖ్యాపూర్ణముగునట్లును జపించినయెడల పావనుడగును, పిమ్మటబంచగవ్యప్రాశనను జేయవలయునని మాత్స్యపురాణమునందు జెప్పబడియె॥

— సాజ్యధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం. —



(౭౦౭) అథసాజ్యధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మాత్స్యే॥

ఏతాసాం దశధేనూనాం ప్రత్యక్షా పాపనాశినీ । మహాపాపవిశుద్ధ్యర్థం బ్రహ్మణా నిర్మితా పురా ॥ రాజా వా విప్రమాత్రో వా దశసాహస్రాధిపోఽపి వా । ధేనుమేకామలంకృత్య హ్యభ్యర్చ్య విధిపూర్వకం ॥ పుణ్యకాలేషు పుణ్యర్క్షే యో దద్యాద్విప్రపుంగవే । సయాతి విష్ణుభవనం దైవైస్సహ నరాధిప ॥ లైంగే ॥ ధేనుం యస్సమలంకృత్య పుణ్యకాలేషు పర్వసు । అభ్యర్చ్య గంధపుష్పాద్యై ర్యో దద్యాద్విప్రపుంగవే ॥ సయాతి బ్రహ్మణస్స్థానం యత్ర గత్వా న శోచతి । పశ్చాద్భువముపాగమ్య సభవేన్మండలాధిపః ॥ మహారాజవిజయే ॥ ధేనుమేకామలంకృత్య పుణ్యకాలేషు పర్వసు । పుణ్యర్క్షే తే: పుణ్యదినే వ్యతీపాతే చ వైధృతౌ ॥ యో దద్యాద్విప్రవర్యాయ సయాతి పరమాంగతిం । పునర్భువముపాగమ్య రాజా భవతి ధార్మికః ॥ స్కాందే ॥ ధేనుం ప్రతిగృహ్ణీయాద్యస్తు ధర్మభోగపరాయణః । అకృత్వా నిష్కృతిం లోభాద్వ్యాళీ భవతి కాననే ॥ తద్దోషపరిహారార్థం జపేద్రుద్రమథాయుతం । తదా దోషవినిర్ముక్త శ్శుద్ధిమాప్నోత్యనుత్తమాం ॥ భవిష్యోత్తరే ॥ యో ధేనుం సమలంకృత్య దశధేన్వః యాయినీం । గంధపుష్పాక్షతైర్వస్త్రై స్స్వర్ణాభరణభూషితాం ॥ దత్తాం రాజకుమారేణ పుణ్యకాలేషు పర్వసు । ప్రతిగృహ్యాద్విజో లోభాదకృత్వా నిష్కృతిం సుధాం ॥ వ్యాళీ భవతి దుష్టాత్మా యోగం వా దానమేవ వా । ఏతత్పాపవిశుద్ధ్యర్థం రుద్రం ద్వ్యయుతముచ్యతే ॥ ఉపక్రమ్య తదానీం వా పరేద్యుర్వా శేషేణ । స్నాత్వా ప్రాతర్యథాచారం నిత్యకర్మ సమాప్య చ ॥ రహస్స్థానం సమాగమ్య సంఖ్యాం మనసి ధారయన్ । ఆ భ్యుదయాద్భానో రస్తమేతి దివాకరః ॥ విరమ్య నియమం పశ్చాత్ ఫలాహారం ప్రకల్పయేత్ । స్వపేద్వా స్స్వగృహే దేవ సమీపే స్థండిలే వ్రతీ ॥ పరేద్యురేవం కుర్వీత యావత్సంఖ్యా సమాప్యతే । తతశ్శుద్ధిమవాప్నోతి యజ్ఞదానపరాఙ్ముఖః ॥ ఇతి సాక్షాద్ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౮౮౭) ఇకను సాక్షాద్ధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు ॥ మహాపాపవిశుద్ధికొఱకు తొల్లి బ్రహ్మదేవుని చేత దశధేనుదానములను నిర్మించె. రాజయినను, విప్రమాత్రుడైనను, పదివేలగ్రామముల కధిపతియైనను, ధేనువును గంధపుష్పాక్షతాదుల చేత నలంకరించి పుణ్యకాలములయందయినను, పుణ్యనక్షత్రములయందయినను బ్రాహ్మణునకు దానము సేయవలయును. ఇట్లు దానమును జేసినవాడు విష్ణుభవనమును బొందునని మాత్స్యపురాణమునందు జెప్పబడియె. ధేనుదానమును జేసినవాడు బ్రహ్మలోకమునందు గొంతకాలము నివసించి పిమ్మట భూలోకమున మండలాధిపతియై పుట్టునని లైంగమునందు జెప్పబడియె. మహారాజవిజయమునందును

నిటులనే చెప్పబడియె. భోగపరాయణుడై ధేనుదానమును ప్రతిగ్రహించి నవాడు స్వకీయదోషనివారణకొరకు ప్రాయశ్చిత్తము జేసికొనని యెడల నరకమునందు సర్పమై పుట్టును. కావునట్టి దోష నివారణకొఱకు పదివేల పర్యాయములు రుద్రమును జపించిన యెడల పావనుడగునని స్కాందపురాణమునందు జెప్పబడియె. భవిష్యోత్తర పురాణము నందును నిటులనే చెప్పబడియె. మఱియును ప్రాయశ్చిత్త విధానముగూడ జెప్పబడియె. అదియెట్లనిన ప్రాతఃకాలమునందు స్నానమును జేసి నిత్యకర్మలను సమాప్తి బొందించియేకాంతస్థానమును బొంది సంఖ్యాపూర్వకముగ సాయంకాలము దనుక రుద్రమును జపింపవలయును, అనంతరమనంతు దేవగృహమునందు నిద్రింపవలయును. ఇవ్విధముగ నిరువదివేల పర్యాయములు జపింపవలయును, ఇవ్విధముగ జేసినవాడు పావనుడగునని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె॥

— ఆర్ద్రకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తం —

(౪౦౫) అథార్ద్రకృష్ణాజిన ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శృణుపుత్ర ప్రవక్ష్యామి అర్ద్రకృష్ణాజినంశుభం। తిలై రాపూర్య తచ్చర్మ దద్యాద్విప్రాయ ధీమతే। సనరః పాపనిర్ముక్తో బ్రహ్మలోకంసమశ్నుతే। పశ్చాద్భువముపాగమ్య సప్తజన్మభవేద్ద్విజః॥ తత్రాధీత్యశ్రుతింసమ్యక్ ప్రాప్యజ్ఞానమవాప్యచ। తేనజ్ఞానేన మహతా నిర్వాణం సమవాప్నుయాత్। సూర్యసోమగ్రహే రాజన్ మన్వాదిషుయుగాదిషు। అయనద్వితయే చైవవ్యతీపాతేవవైధృతౌ సంక్రమేషు చజన్మర్క్షే నదీతీరేసురాలయే। స్వగృహేవాపిరాజేంద్రపుణ్యక్షేత్రే తేషుపర్వసు। నరోయస్సమ్యగభ్యర్చ్య ఆర్ద్రకృష్ణాజినందృఢమ్॥ తిలపూర్ణం ద్విజేంద్రాయ హ్యర్చితాయసుభూషణైః। దద్యాద్దక్షిణయాసార్ధం తస్యపుణ్యఫలంశృణు॥ యావంత్యజినరోమాణి యావత్తస్తత్రవై తిలాః। తావద్యుగసహస్రాణి బ్రహ్మలోకమవాప్నుయాత్॥ లింగపురాణే॥ తిలపూర్ణ పుణ్యకాలే ఆర్ద్రకృష్ణాజినంనరః। అభ్యర్చ్య గంధవస్త్రాద్యైస్స్వశక్త్యాలంకృతాదిభిః॥ యోదద్యాద్విప్రవర్యాయసగచ్ఛేద్బ్రహ్మణఃపదం॥ తత్ప్రతిగ్రహదోషప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ ఆర్ద్రకృష్ణాజినంరాజన్ పుణ్యకాలఉపాగతే। యోవిప్రఃప్రతిగృహ్ణీయాత్ససద్యఃపతితోభవేత్, నిత్యంనైమిత్తికంకామ్యం యాగాదికమనంతరం। తదానస్యంతి కర్మాణి గాయత్రీజపమేవచ॥ యమలోకముపాగమ్య భుక్త్వాతత్ర మహద్భయం। సపాపీభువమాసాద్య నారీత్వంసప్తజన్మసు॥ చతుర్వింశతిమతే॥ యోవిప్రఃపుణ్య... ...। తాంద్విజఃప్రతిగృ

ష్ణాయాద్వ్రథాభోగపరాయణః॥ తద్దానస్యాంతికర్మాణి ఇష్టాపూర్తాదికాని చ। తదామృత్యువశంయాతి పుణ్యాభ్రంశాద్యమాలయే॥ షష్ఠ్యంతం నరకంభుక్త్వాస్త్రీజన్మతదనంతరమ్॥ ప్రాప్నోతీతి శేషః॥ బ్రహ్మాండే॥ తిలపూర్ణంపుణ్యకాలే చర్మార్ద్రంరాజవల్లభాత్। ప్రతిగృహ్యద్విజో మోహాత్సప్తతంతుపరాఙ్ముఖః॥ యమలోకముపాగమ్య చరంనరకభాక్తతః। నానాజన్మానుభూయాశు కృకలాసోభవేచ్చవై॥ తస్యైషానిష్కృతిర్దృష్టా మునిభిర్బ్రహ్మవాదిభిః। అపమృత్యుత్రాణమార్గంపూర్వవత్కృత్వా తదనంతరం ప్రాయశ్చిత్తమ్॥ ప్రాతస్స్నాత్వా తిలైస్సమ్యగఘమర్షణపూర్వకమ్। ఆర్ద్రవాసాస్తటంగత్వా హ్యనుజ్ఞాప్యద్విజన్మనః॥ ప్రతిగ్రహవిశుద్ధ్యర్థం. క్షంతుమర్హథసజ్జనాః। ఇతిప్రార్థ్యద్విజాన్సర్వాన్ పరిక్రమ్యప్రణమ్యచ॥ తప్తకృచ్ఛ్రత్రయంకృత్వాశుద్ధిమాప్నోత్యనుత్తమామ్॥ ప్రాయశ్చిత్తైఃపూతాత్మా పునస్సంస్కారమాచరేత్ పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతిలౌకికః॥ కృచ్ఛ్రాచరణేన ప్రాయశ్చిత్తంపునఃకర్మపూర్వకంకృత్వా తదంగప్రాయశ్చిత్తైఃపూతోభూత్వాయాగాదికంకుర్యాత్। అన్యథాపునఃకర్మాసంభవేయాగాదికంనఫలతి। పునఃకర్మైవహ్యాచార్యర్త్విజాం సర్వకర్మసాధనమ్। నోచేన్మలముష్టిప్రక్షాళనవత్॥ అతఃపునఃకర్మైవ బలవత్తరం॥ ఇత్యార్ద్రకృష్ణాజినప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౦౮) ఇకను కృష్ణాజినప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ ఆర్ద్రకృష్ణాజినమును దిలలతో జేర్చి బ్రాహ్మణునకు దానముసేయవలయును. ఇట్లుదానముచేసినవాడు బ్రహ్మలోకమును బొందును. అనంతరమం డేడుజన్మముల దనుక బ్రాహ్మణుడైపుట్టి బ్రహ్మజ్ఞానము గలవాడై మోక్షమునుబొందునని స్కాందపురాణమునందు జెప్పబడియె. మఱియును సూర్యసోమగ్రహణములయందైనను, మన్వాదులయందైనను, యుగాదులయందైనను, ఉత్తరాయనదక్షిణాయణములందైనను, వ్యతీపాతమునందైనను, వైధృతియందైనను, సంక్రమణములయందైనను, జన్మర్క్షమునందైనను, నదీతీరములయందైనను, సురాలయమునందైనను, పుణ్యక్షేత్రముల యందయినను, పుణ్యపర్వములయందయినను, దృఢమయిన యార్ద్రకృష్ణాజినమును తిలలతోగూడ దానమును జేయవలయును. అట్టి యజినమున కెన్నిరోమములుండునో యన్నివేలసంవత్సరములు బ్రహ్మలోకమును బొందుననియును జెప్పబడియె. పుణ్యకాలాదులయందు దిలసంయుతమగు నార్ద్రకృష్ణాజినదానమును జేసినవాడు బ్రహ్మలోకమును బొందునని లింగపురాణమునందు జెప్పబ

డినది. ఆర్ద్రకృష్ణాజినమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు తత్క్షణమునందే పతితుడగును. మఱియు నట్టివానియొక్క నిత్యనైమిత్తిక యాగాది కర్మలన్నియును నాశమునుబొందును. గాయత్రీజపఫలము గూడ నాశమునుబొందును. కావున నట్టివాడు యమలోకమునుబొంది గొప్పదగు నరకములననుభవించును. పిమ్మట భూలోకమునందు సప్తజన్మములు స్త్రీత్వమునుబొందునని స్కాందపురాణమునందు జెప్పబడినది. చతుర్వింశతిమతమునందును నివ్విధముగానే చెప్పబడినది. బ్రహ్మాండపురాణమునందును నిటులనే చెప్పబడినది. మఱియును ప్రాయశ్చిత్తవిధానముగూడ జెప్పబడినది. అది యెట్లనిన ప్రాతఃకాలమునందు తిలలతోగూడ నఘమర్షణసూక్తములను పఠించుచు స్నానమును జేయవలయును. అనంతరమందు తటమునకుబోయి బ్రాహ్మణాజ్ఞను బొంది బ్రాహ్మణులకు నమస్కారమునుసల్పి తప్తకృచ్ఛ్రత్రయము నాచరింపవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసికొనిన పిమ్మట యాగాదికము నాచరింపవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడినది.

—— తిలకృష్ణాజినప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ——

(౪౦౯) అథతిలకృష్ణాజినప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ తిలైరాపూర్య యశ్చర్మ దద్యాత్పుణ్యాగమే నృప। నతస్య యమలోకోస్తి నైవ సంతాపనం క్వచిత్॥ కౌర్మే॥ పుణ్యకాలే చ పుణ్యే దినే సాంగే కృష్ణాజినే తిలాన్। నిక్షిప్య ప్రవరాయాథ యోదద్యాత్సతుపుణ్యభాక్॥ స్కాందే॥ పూర్వవత్తిలసంయుక్తం శుష్కంచర్మద్విజాతయే। పుణ్యకాలేషు పుణ్యాహే యోదద్యాత్సోపి వైహరిః॥ అజినం యోనుగృహ్ణీయాచ్ఛుష్కం విప్రస్తిలైర్యుతమ్। అపమృత్యుమవాప్నోతి నారీత్వం ప్రాప్నుయాదిహ॥ దానసాగరే॥ పుణ్యకాలేషు పుణ్యాహే పుణ్యతీర్థేనృపోత్తమ। తిలకృష్ణాజినం ధృత్వా వృథాభోగపరాయణః॥ యమలోకమవాప్నోతి స్థిత్వా భుంజన్మహద్భయం। పునర్నారీత్వమాప్నోతి తిలచర్మప్రతిగ్రహే॥ ఆర్ద్రకృష్ణాజినే పూర్వం ప్రాయశ్చిత్తం ప్రదర్శితమ్। పాదహీనం ద్విజః కుర్యాత్తిలకృష్ణాజినగ్రహే॥ పాదహీనం పంచోత్తరసప్తతితప్తకృచ్ఛ్రాణి కృత్వా పునస్సంస్కారం పూర్వవత్కృత్వా శుద్ధిమాప్నోతి నాన్యథేతి॥ ఇతి తిలకృష్ణాజిన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౦౯) ఇకను దిలకృష్ణాజిన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నారు. తిలలతోగూడిన శుష్క కృష్ణాజినమును పుణ్యాగమ కాల

ములయందు దానమును జేసినవాఁడు వైకుంఠలోకమునుబొందునని మార్కండేయుఁడు వచించెను. కూర్మపురాణమునందును నిటులనే చెప్పబడె. స్కాంద పురాణమునందును నిటులనే చెప్పబడియె. ఇట్టి దానమును ప్రతిగ్రహించిన వాఁడు యమలోకమునందు మిగుల ఘోరములగు నరకము ననుభవించును. కావున నిట్టి దోషనివారణకొఱకు నార్ద్ర కృష్ణాజిన దానమునకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధింపవలయునని దానసాగరమునందును నిటులనే చెప్పబడినది-

—✻ యోగవ్రతాదిషు కృష్ణాజినప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ✻—

(౪౧౦) అథయోగవ్రతాదిషు కృష్ణాజిన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త మాహ॥ మాత్స్యే॥ అర్ధనారీశ్వరేయోగె యోగెహరిహరాత్మకె, లక్ష్మీనారాయణేయోగె వ్రతేష్వన్యేషు షణ్ముఖ॥ కృష్ణాజినేవ్రతాంగత్వా న్నదోషఇతిగాధిప! తథాపిశృణువక్ష్యామి ప్రాయశ్చిత్తం విశుద్ధిదం॥ మహానారదీయే॥ యోగవృత్తికాలేషు అర్ధనారీశ్వరాదిషు। యోదద్యాదజినంప్రావృతంతస్యఫలప్రదం॥ పురానారాయణోదేవో లోకాన్ సంహృత్యచాత్మని। నిధాయజలధౌశిశ్యే దీర్ఘకాలమరిందమః॥ తన్నాభౌశైవలంజజ్ఞే తత్రోద్భూతప్రకజంమహత్। హిరణ్మయ బృహన్నాళం రక్తకుంకుమ కేసరం॥ సహస్రపత్రరుణం ప్రతప్తకనకోజ్జ్వలం। తత్రజజ్ఞేవిధాతాచ వ్యస్తాక్షిజ్జగతాంపతిం॥ హరిఃప్రసన్నవదనో బభాషేకమలాసనం। సృజవిశ్వ మిదంభద్రవేదాన్యజ్ఞాన్ ద్విజానపి॥ తేషాంచలోకరక్షార్థ మాలస్యంమాకురుష్వహ। ఇత్యుక్త్వాభగవాన్విష్ణు స్తత్రైవాంతరధీయత॥ బ్రహ్మతదవధార్యాథసృష్టవాన్విశ్వమోజసా । వేదాన్యజ్ఞాన్ ద్విజాన్గాశ్చ తన్మంత్రాంస్తత్రసాధకాన్॥ అరణింపరిస్రవంసర్వా ధరిత్రీంజుహ్వాంతదాయుధం। కృష్ణాజినంచముసలము లూఖలమతఃపరం॥ పాత్రాణ్యన్యానివిశ్వాత్మా ససర్జజగదీశ్వరః। వ్రతేషుయజ్ఞదానేషు బ్రహ్మచర్యవ్రతాదిషు॥ అజినంధానపూర్త్యర్థం దదానిపైభ్య ఆదరాత్.। తదాప్రభృత్యదశ్చర్మ ప్రసిద్ధిమగమన్నృప॥ యస్త్వేతచ్చస్మదానేషు వ్రతేషుని యమేషుచ పరిధానంకురుతే సోపిబ్రహ్మనిర్వాణమాప్నుయాత్॥ తత్ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ యోగాదిషు వ్రతేష్వేతత్ప్రతిగృహ్య ద్విజోత్తమః। ప్రాయశ్చిత్తంతదాకుర్యా త్పునస్స్నానం సంకల్పిత॥ దశాయుతానిగాయత్రీ మర్ధనారీశ్వరవ్రతే। తథాహరిహరేయోగె లక్ష్మీనారాయణేతథా॥ ఉగ్రవ్రతేషుదానేషు పుంవంధ్యత్వహరాదిషు। ఏతేవ్రతేషుకృష్ణాజినా న్యాంగత్వాల్లఘు ప్రాయశ్చిత్తమున్నత్తమం॥

ఆర్ద్రః కృష్ణాజినాదేస్స్వయం ప్రధానత్వాత్ప్రాయశ్చిత్తబాహుళ్యం ॥ పునస్సంస్కారశ్చ॥ ఏతేషునాభయం। ఉక్తప్రాయశ్చిత్తమేవాలం॥ ఇతియోగాదిషుకృష్ణాజినప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౧౦) ఇకను యోగవ్రతాదుల యందలి కృష్ణాజిన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నారు॥ యోగవ్రతాదులయందు, కృష్ణాజినమును బ్రతిగ్రహించుటవలన దోషముగలుగునని మాత్స్యపురాణమునందుజెప్పబడియె. యోగాదివ్రతములయందు కృష్ణాజినమును దానము సేయుటచేత నావ్రతము సఫలమగుననియును, ఈవిధిః భగవంతుడు గల్పించెననియును మహానారదీయమునందు జెప్పబడియె. యాగాది వ్రతముల యందు గృష్ణాజినమును ప్రతిగ్రహించుట మిగుల దోషము. కావున నిట్టిదోషనివారణకొఱకు బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనన సర్తనారీశ్వరవ్రతకాలమునందు కృష్ణాజినమును ప్రతిగ్రహించినవాడు పదివేల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును. ఇటులనే మహావ్రతమునందును, యోగవ్రతమునందును, లక్ష్మీనారాయణవ్రతమునందును కృష్ణాజినమును ప్రతిగ్రహించినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయుడు వచించెను.

— తిలపద్మప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. —

(౪౧౧) అథతిలపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేః యో రాజా పుణ్యకాలేషు పుణ్యతీర్థేషుపర్వసు। తిలపద్మంయథాశాస్త్రం మర్చయిత్వాద్విజన్మనే॥ దద్యాద్దక్షిణయాసార్ధం తస్యాన్తోనైవవిద్యతే। పునర్భవము హాగవ్యమండలాధిపతిర్భవేత్॥ బ్రహ్మాకైవర్తే ॥ తిలపద్మంద్విజోధృత్వా రాజ్ఞః పుణ్యాదినేషుయః। సతుదేహవిశుద్ధ్యర్థం షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ ॥ పునస్సంస్కారపూతాత్మా శుద్ధిమాప్నోతిదైహికీమ్॥ లైంగే॥ ప్రతిగృహ్యద్విజోలోభాద్భగత్కృష్ణాపరాయణః। తిలపద్మంసముత్సృష్టం రాజభిః పుణ్యసంగమే। పునఃకర్మప్రకుర్వీత తతఃపశ్చాచ్ఛృణువ్వమే॥ సమ్యగ్విప్రైరనుజ్ఞాతః షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ । తతఃపాపవిముక్తస్స్యాన్నదానైర్న్యకర్మభిః॥ ద్విజోలోభపరాయణోభోగేచ్ఛయాతిలపద్మంధృత్వాపూర్వం పునస్సంస్కారంకృత్వా పశ్చాత్పరిషదుపస్థానపూర్వకం ప్రాజాపత్యకృచ్ఛ్రాణాం షడబ్దమాచరేత్, తేనపూతోభవతి॥ నదానైర్నాన్యకర్మభిఃపూతస్స్యాత్॥ ఇతి తిలపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౧౨) ఇకను తిలపద్మప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జె

చున్నాడు ॥ పుణ్యకాలములయందయినను, పుణ్యతీర్థములయందయినను, పర్వములయందయినను. తిలపద్మమును బూజించి దక్షిణతోఁగూడ బ్రాహ్మణునకు దానము చేయవలయును, ఇట్లు దానమును జేసినవాడు రెండవ జన్మయందు మండలాధిపతియగునని స్కాందపురాణమునందుఁ జెప్పబడియె. పుణ్యదినములయందుఁ దిలపద్మమును ప్రతిగ్రహించినవాడు దేహశుద్ధికొఱకు పడబ్దకృచ్ఛ్రమునాచరించి పునరుపనయన సంస్కారమును బొందవలయును. బ్రహ్మకైవర్తమునందు జెప్పబడియె. లైంగమునందును నిటులనే చెప్పబడియె ॥

## రజతపద్మప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్.

(౪౧౨) అథరజతపద్మ ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ కమలం రాజతం దద్యా ద్యోరాజాపుణ్యసంగమే । అభ్యర్చ్య విధినా శస్త్రాద్విప్రాయాధ్యాత్మవేదినే॥ నతస్యపునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన॥ శైవే॥ సహస్రమనతయారాజ న్నుద్దిశ్యహరిమవ్యయమ్। హంసంవా ద్విజవర్యాయ దద్యాత్పుణ్యాగమేసుధీః ॥ సర్వపాపవినిర్ముక్తఃపుత్రపౌత్రపరిష్కృతః । ఇహైవవిపులాన్భోగా న్భుక్త్వాదేవపదంవ్రజేత్॥ చతుర్వింశతిమతే॥ యోధృత్వా రాజతంపద్మం పుణ్యకాలేషురాజభిః । దత్త-సర్వ్యగలంకృత్య తస్యశుద్ధిరనుత్తమా ॥ ప్రధానంసంపరిత్యజ్య కృత్వా చాంద్రాయణద్వయం । శుద్ధిమాప్నోతిమహతీ మేతత్పద్మప్రతిగ్రహాత్ ॥ ఆధానంవా బుధః కృత్వా తేనపాపినదోషభాక్ । ఆధానకరణేసర్వస్వ దక్షిణే ప్రాయశ్చిత్తం పంచగవ్యప్రాశనం॥ ఇతిరాజతపద్మప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౧౨) రజతపద్మప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు ॥ పుణ్యకాలములయందు రజతకమలమును శాస్త్రోక్తప్రకారముగ బూజించి వేదవేత్తయగు బ్రాహ్మణునకు దానము చేయవలయును, ఇట్టిదానమును జేసినవాడు శాశ్వతముగ బ్రహ్మలోకమును బొందునని మార్కండేయుఁడువచించె. శైవపురాణమునందును నిటులనే చెప్పబడియె. రజితపద్మమును ప్రతిగ్రహించినవాడు ప్రతిగ్రహమువలన గలిగినద్రవ్యమును సర్వమునువదలి రెండుచాంద్రాయణవ్రతముల నాచరించవలయును, పిమ్మట బంచగవ్యప్రాశనను జేయవలయునని చతుర్వింశతిమతమునందు జెప్పబడియె॥

## రోగప్రతికృతి ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౧౩) అథరోగప్రతికృతి ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ క్షయఃకాసశ్చ గుల్మశ్చ శిరోవాయుర్భగందరః । అర్శోరోగ స్తథాశూలం గండమాలాశిరోభ్రమిః ॥ ఏతేమహాపాతకజన్యాః ॥ వాతవ్యాధ్యశ్మరీకు

వాఁడును, రాజకృతపాపమును పురోహితుఁడును, ఋత్విక్కుల పాపము నునాచార్యుఁడును, గ్రామకృతపాపమును గ్రామయాజమానియును, పొం దును. పూర్వోక్తములగు శాంతికర్మలయం దాచార్యత్వమును వహించిన వానికిఁ బాపబాహుళ్యముగలదు గనుక ప్రాయశ్చిత్తమును జేసికొనవలయు ను. షడ్గ్రహపంచగ్రహ చాతుర్గ్రహ మేళనమునందు ప్రాయశ్చిత్తాంగ భూతమైన త్ర్యాయుతహోమమునందు పురుషసూక్తమంత్రము నేజపింపవల యును. నాలుగేసివాక్యములచేత నొక్కొక్క యాహుతిని జేయవలయును. ప్రతిదినమునందును సంఖ్యానుగణను జేయుచు హోమమును జేయవలయును. హోమపరిపూరణమునందుఁ బూర్వమువలె నాచరింపవలయును. ఈప్ర కారము నాలుగుగ్రహములయొక్క మేళనమునందు శాంతికర్మను జరిపించి నయాచార్యుఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ధేన్వంగత్వముచే త ప్రాయశ్చిత్తబాహుళ్యము. ప్రాయశ్చిత్తమును జేసికొనని యెడల పూర్వో క్తపాపమును బొందునని కౌర్మమునందుఁ జెప్పఁబడియె.

—— * రాశిచక్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. * ——

(౮౩౪) అధరాశిచక్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండే యః॥ రాశిచక్రం ద్విజో లోభాద్రాజ్ఞాదత్తం సుపూజితం। తస్యాన్యా నిష్కృ తిర్నాస్తి చాంద్రాయణచతుష్టయాత్॥ కౌర్మే॥ రాశిచక్రం ద్విజో ధృత్వా పూజితం చ ప్రభూపనైః వినానిమిత్తైర్బహుభిః పాపం మనసి ధారయన్॥ తన్నిష్కృతిమకృత్వా తు నరకం కాలచోదితం। అనుభూయ మహద్దుఃఖం చ క్రవాకో భవేద్భువి॥ లైంగ్యే॥ బ్రాహ్మణశ్చక్రధృల్లోభాత్స ప్రతంతు పరాఙ్ముఖః। భోగాసక్తః ప్రగృహ్ణీయాత్ రాశిచక్రం సుపూజితమ్॥ యథోక్తదక్షిణాభి శ్చ పాకం రాజ్ఞా వివర్జితం। తన్నిష్కృతిం పరాకృత్య చ కృత్వా నరకమశ్నుతే॥ త త్రానుభూయ నరకం తిలయంత్రం మహద్భయం। తదంతే భువమాసాద్య చ క్రవాకో భవేద్భువి॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థం క్రతుం సర్వస్వదక్షిణం। అథా నం నిత్యహోమం చ చరేత్పాపవిశుద్ధయే॥ ద్వయోరాసంగతః పాపమోచనం దేహశుద్ధిదం। చాంద్రాయణైశ్చతుర్మాసైః చతుర్భిః పాపమోచనమ్॥ కృ త్వాలోకవిశుద్ధస్స్యాచ్ఛ్రౌతస్మార్తేషు కర్మసు। నిత్యం నైమిత్తికం కామ్యం కృ త్వా తత్ఫలమశ్నుతే॥ అన్యథా దోషమాప్నోతి నగతిః పాపమోచనే। తస్మా దేతత్పాత్యాజ్యం ద్విజైర్లోకపరాయణైః॥ ఇతి రాశిచక్రప్రతిగ్రహ ప్రాయ శ్చిత్తం॥

(౮౩౫) ఇకను రాశిచక్రప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పె

చున్నాడు॥ రాజులచేత నివ్వబడిన రాశిచక్రమును లోభబుద్ధిచేత ప్రతిగ్రహించినవాడు స్వదోషనివృత్తికొఱకు నాలుగుచాంద్రాయణములనాచరింప వలయునని మార్కండేయుడువచించె. లోభబుద్ధిచేత రాశిచక్రమును ప్రతిగ్రహించినబ్రాహ్మణుడు నరకలోకమునుబొంది పిమ్మట భూలోకమునందు చక్రవాకమైపుట్టునని కౌర్మమునందు జెప్పబడెను. కౌర్మమునందుగూడ నిటులనేచెప్పబడి ప్రాయశ్చిత్తవిధానముగూడ జెప్పబడెను. అదియెట్లన రాశిచక్రమును ప్రతిగ్రహించినందువలన గలిగినద్రవ్యమువలన యాగాదికమునాచరింపవలయును. కాదేనినాలుగుచాంద్రాయణముల నాచరింప వలయును. ఇవ్విధముగ నాచరించిన యెడల సకలకర్మలయందును నర్హుడగును.

## నవగ్రహమఖేప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౩౭) అథ నవగ్రహమఖే ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాన్దపురాణే॥ అథాతస్సంప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తంద్విజన్మనామ్। గ్రహయజ్ఞే ప్రధానత్వం యఃకరోతిద్విజోత్తమః॥ గ్రహాణాందేవతానాంచ సంగ్రహఃపాపవృద్ధయే। హోమకర్మసుపూజాయాం నియమాతిక్రమేతథా॥ ఏకగ్రహస్య సంగ్రాహీస్వచ్ఛస్య సుఖాసనే। దేహాంతేనరకంయాతి ఇత్యువాచాంతమహద్భయం॥ సర్వేషాం మండలే పత్రే స్వచ్ఛతానాం స్పృభిఃక్రమాత్। ప్రతిగ్రహే మహద్దుఃఖమనుభూయ యమాలయే॥ తదంతేభువమాసాద్య నీలబిందుఃప్రజాయతే। ప్రతిగ్రహవిశుద్ధ్యర్థం పశ్చాత్తాపపరాయణః॥ బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతషడబ్దంకృచ్ఛ్రమాచరేత్। అన్యథా నిష్కృతిర్నాస్తిహ్యాదాసీనతయాన్వితాం॥ ఏతద్విప్ర ప్రతిగ్రహప్రాయశ్చిత్తవిషయం రాజప్రతిగ్రహే ద్విగుణం॥ ఊరుజప్రతిగ్రహేత్రిగుణం॥ శూద్రప్రతిగ్రహే చతుర్గుణం॥ సంకరజాతిప్రతిగ్రహేపంచగుణం॥ చతుర్దశ చండాలాత్ప్రతిగ్రహే పాతిత్యమేవ॥ సర్వదానప్రతిగ్రహేప్యేవమేవ వేదితవ్యం॥ చతుర్దశ చండాలస్వరూపం పూర్వముక్తం॥ జాతిభేదప్రతిగ్రహే ప్రత్యేకమాహ॥ కౌర్మే॥ పూర్వజైయత్త్రయప్రోక్తం ప్రాయశ్చిత్తం ద్విజోత్తమైః। తదేవ పూర్వజానాం చప్రాయశ్చిత్తంవిశోధనం॥ తద్ద్వైగుణ్యం బాహుజానామూరుజానాం తథాస్మృతం। చాతుర్గుణ్యంపాదజానాం సంకరాణాంతుపంచధా॥ చతుర్దశవిధానాంతు సంగ్రహేపతితోభవేత్। సర్వత్ర ప్రతిగ్రహప్రాయశ్చిత్తేష్వేవంవివేచనీయం॥ ఇతినవగ్రహమఖేప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౩౭) ఇకను నవగ్రహమఖమునందు ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ గ్రహయజ్ఞమునందు ప్రధానత్వమునువహించి

నవాడును, గ్రహదేవతలనుప్రతిగ్రహించినవాడును, దేహాంతరమందు ఘోరా రనరకములను బొందును. కావున నరకలోకవాసము రాకుండుటకు షడబ్ద కృఛ్రము నాచరింపవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె. రాజులవలన నీప్రతిగ్రహమును జేసినవాడీప్రతిగ్రహమును ద్విగుణముగ గ్రహింపవలయును. వైశ్యునివలన గ్రహించినయెడల త్రిగుణాధికముగను, శూద్రప్రతిగ్రహమునందు చతుర్గుణాధికముగను, సంకరప్రతిగ్రహమునందైదురెట్లధికముగను ప్రాయశ్చిత్తము నాచరింపవలయును. పదునాలుగువిధములయినచండాలురవలన బ్రతిగ్రహించినవాడు పతితుడగునని కౌర్మమునందు జెప్పబడియె.

— ధర్మవిక్రయిణస్సకాశాత్ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం. —

(౪౩౯) అథ ధర్మవిక్రయిణస్సకాశాత్ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ ఉత్తరఖండే॥ ధర్మవిక్రయిణః పుంసో నిత్యే కామ్యే తథా క్రతౌ। ప్రతిగ్రహే ద్విజస్యాస్య ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥ నిత్యంమాతాపిత్రోర్మృతాహాది। కామ్యంవ్రతాదికం। అపిచ నిత్యప్రాతస్స్నానసంధ్యాదికంకృత్వా కామ్యం వ్రతాదికం గంగాస్నానాదికంచ కార్యం॥ ఆరామస్థాపనకూపతటాక దేవాలయాధర్మాశ్చైవ నిత్యమవారితాన్నదానపరోపకారవస్త్రహిరణ్యరజతకాంస్యఅశ్వమహిషీభూదానాదికంధర్మాః ॥ తేషామేకంవాపి విక్రయిత్వా యోజీవేత్ సధర్మవిక్రయీ॥ ఏతద్విక్రయమాత్రేణ పాతిత్యంవిప్రస్యసూచితం॥ తదాహకూర్మపురాణే॥ ధర్మవిక్రయిణశ్చైవ సోమవిక్రయిణస్తథా। స్మృతివిక్రయిణశ్చైవ పునస్సంస్కార ఉచ్యతే॥ పాద్మపురాణే ॥ విక్రయిత్వాస్వధర్మాన్యః పత్నీపుత్రాన్ప్రవర్ధయేత్। సోఽక్షయ్యంనరకంభుక్త్వా మాతంగత్వమవాప్నుయాత్॥ ఏతస్యనిష్కృతిర్నాస్తి చాంద్రాయణశతైరపి। అథవాశృణురాజేంద్ర త్రిఃపరిక్రమ్యభూతలం॥ ఏతేనద్వివిధామాశు శుద్ధిమాప్నోతిదైహికీం। నాన్యథాశుద్ధిరస్తీహ పాపస్యైతస్యభూమిప॥ తస్మాత్ప్రతిగ్రహీతుః ప్రాయశ్చిత్తం తావదాహ॥ విష్ణురహస్యే॥ ధర్మవిక్రయిణోవిప్రః ప్రతిగృహ్యాధనాదికం। దానంవాపర్వకాలేషు సవిప్రస్తత్సమోభవేత్ ॥ చతుర్వింశతిమతే॥ ముఖజోధర్మవిక్రేతుః పర్వకాలేషు వై సకృత్। అణుమాత్రసువర్ణంవా దానంవాధర్మచోదితం॥ ప్రతిగృహ్యయమంగత్వా నరకాననుభూయచ। తదంతేభువమాసాద్య జలేవాసంసమశ్నుతే॥ తద్దోషోపశమాయాలంప్రాయశ్చిత్తంసమాచరేత్। పలాశసమిదాజ్యాన్నైః స్వగృహ్యాగ్నౌపృథక్పృథక్॥ సహస్రంహావయేన్నిత్యం ప్రాతస్స్నానాదిపూర్వకం। అచ్యుతా

మేతిసమిధమనంతాయేతి వైస్మృతం॥ చరుంగోవిందనామ్నాథ హ్యాయుతేనవిశుద్ధయే। సమిధోదశసాహస్రీమాజ్యహోమాస్తథైవచ ॥ చరురయుత సంఖ్యాయదాపూర్యతే తదాహోమంవిరమ్యదీక్షామధ్యే ఫలాహారఃకర్తవ్యః॥ అథ శ్శయనాదికంపూర్వవత్॥ తదంతేపంచగవ్యప్రాశనంచ। ఏతద్విశోధనంభవతినాన్యథా॥ ఇతిధర్మవిక్రయిణస్సకాశాత్ప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౩౯) ధర్మమును విక్రయించు వానిసమీపమున ప్రతిగ్రహించిన వానికిగలదోషనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ధర్మమును విక్రయించుపురుషునియొక్క నిత్యకర్మమునందైనను, కామ్యమునందైనను, యజ్ఞమునందైనను, ప్రతిగ్రహమును జేసినవానికి దోషముగలుగునని లింగపురాణమునందు జెప్పబడియె. ధర్మమును విక్రయించువానికిని, సోమమును విక్రయించువానికిని, స్మృతిని విక్రయించువానికిని, పునస్సంస్కారమును విధింపవలయునని కూర్మపురాణమునందు జెప్పబడియె. స్వధర్మములను విక్రయించి స్వకుటుంబమును పోషించువాడు శాశ్వతమగు నరకలోకమును బొందునని యును, ఇట్టిపాపనివృత్తికొఱకు నూఱుచాంద్రాయణము లాచరించినను బ్రయోజనములేదు. కావున మూడుపర్యాయములు భూప్రదక్షిణమును జేయవలయునని కూర్మపురాణమునందు జెప్పబడియె. ధర్మమును విక్రయించువానివలన దానాదికమును ప్రతిగ్రహించినవాడు ధర్మవిక్రయమును జేసిన వానికి సమానుడగునని విష్ణురహస్యమునందు జెప్పబడియె. ధర్మమును విక్రయించువానివలన దానాదికమును ప్రతిగ్రహించినవాడు ఘోరనరకములను బొంది పిమ్మట జలవాసియైపుట్టును. కావున నిట్టిదోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన బలాశసమిదాజ్యాన్నముల చేత స్వగృహ్యాగ్నియందు వేలువేలుగ వేయిపర్యాయములు హోమమును జేయవలయును. "అచ్యుతాయ,, అనిసమిత్తును, "అనంతాయ,, అనిఘృతమును, "గోవిందాయ,, అనిచరువును హోమమును జేయవలయును. ఇట్లునలుబదివేలపర్యాయములు హోమముముగియువఱకును హోమమును జేసి దీక్షామధ్యమునందు ఫలాహారుడుగావలయును. దీక్షాంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయునని విష్ణురహస్యమునందు జెప్పబడియె.

——* నామవిక్రయిణఃప్రాయశ్చిత్తమ్. *——

(౪౪౦) అథ నామవిక్రయిణఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే స్వపుత్రస్యాత్మనోవాపి దారాణాంభ్రాతురేవవా। నామధేయం విక్రయిత్వా జీవేద్యదినరాధమః॥ తస్యాన్యానిష్కృతిర్నాస్తి నరకాదేకవింశ

తే। తదంతేభువమాసాద్య భవేత్పారావతః క్షితౌ॥ శివధర్మోత్తరే॥ పుత్రీయపుత్రభార్యాణామన్నస్మిన్ భవేద్యదా। క్షేత్రార్థంవాధనార్థంవాతస్య జన్మనిరర్థకం॥ నరకాననుభూయాథ భువిపారావతోభవేత్ । తస్యైషానిష్కృతిర్దృష్టా మునిభిస్సత్యవాదిభిః॥ ఋతౌశరది హేమంతే ప్రాతస్స్నానసంయుతావిధి। ఆర్ద్రవాసాజపత్ విష్ణోర్మంత్రందశాక్షరం॥ ప్రత్యహంనియతాహారః క్షితిశాయీజితేంద్రియః। ఋతుద్వయంయదాపూర్ణం నిర్విఘ్నంజనాధిప॥ తదాశుద్ధిమవాప్నోతి పాపాదస్మాదిహాత్యయాత్ । తస్మాత్ప్రతిగ్రహీతుః ప్రాయశ్చిత్తమాహ॥ స్మృత్యంతరే॥ నామవిక్రయిణోయస్మాదాదానేవాప్రతౌతువా। దానంవాపుణ్యకాలేమప్రతిగృహ్యద్విజోత్తమః॥సువర్ణేబ్దంమునిప్రోక్తంప్రాయశ్చిత్తంవిశోధనం। భారమాత్రేతుధాన్యేహిప్రాజాపత్యముదీరితం॥ సువర్ణార్ధేతదర్ధంస్యాత్పాదేపాదంవిశోధనం ॥ పైతృకే భోజనేచైవ జ్ఞాత్వోపోష్యదినద్వయం। పంచగవ్యంపిబేత్పశ్చాద్దేతత్పాపవిశోధనం॥ నాన్యథాశుద్ధిమాప్నోతి ద్విజోభోగపరాయణః॥ ఇతినామవిక్రయిణఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౪౦) ఇఁకను నామమును విక్రయించినవానికిఁ బ్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ పుత్రునియొక్కయు, తనయొక్కయు, భార్యయొక్కయు, భ్రాతయొక్కయు, నామమును విక్రయించి జీవించువాఁడు ఘోరనరకములను బొందును. పిమ్మట భూలోకమునందుఁ బారావతమై పుట్టునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె. స్వపుత్రభార్యాదులనామములను విక్రయించి జీవించుమానవాధముఁడు ఘోరనరకములను బొంది పిమ్మట భూలోకమునందు పారావతమైపుట్టును. కావున నిట్టిదోషనివారణకొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన శరత్కాలమునందైనను, హేమంతమునందైనను, శాస్త్రోక్తప్రకారముగ స్నానమును జేసి తడిదగు వస్త్రమునుధరించి విష్ణుదేవునియొక్క దశాక్షరమంత్రమునుజపము సేయవలయును. మఱియుఁ బ్రతిదినమందును నియతాహారుఁడును, భూమియందుశయనించువాఁడును, జితేంద్రియుఁడును, నైయుఁడవలయును. ఇవ్విధముగ నాలుగుమాసములు చేయవలయును. ఇట్లాచరించెనేని పరిశుద్ధుఁడగునని శివధర్మోత్తరమునందుఁ జెప్పఁబడియె. నామమును విక్రయించినవానియొక్క యాగాదులయందు దానాదికమును ప్రతిగ్రహించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన సువర్ణమును ప్రతిగ్రహించినవాఁడు, అబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. భారమాత్రము

ను గ్రహించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. సువర్ణార్ధమును గ్రహించినవాఁ డర్ధప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. పాదగ్రహణమునందు పాదకృచ్ఛ్రము నాచరింపవలయును. అట్టివానియొక్క పితృకార్యములయందు భోజనమును జేసినవాఁడు రెండు దినము లుపవసించి పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేసికొనవలయునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె.

### —— స్మృతివిక్రయిణఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ——

(౪౪౧) అథ స్మృతివిక్రయిణః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురాణే॥ స్మృతివిక్రయిణోమర్త్యాదప్రతిగ్రహణంవరం। ప్రతిగృహ్యద్విజోలోభాద్ధాన్యంవా స్వర్ణమేవవా॥ ఆధానాదిషుకాలేషు సువర్ణం చ ప్రసూత్యగ్రహణకాలేషుధాన్యంత్వజైర్ద్రవ్యమపి నప్రతిగ్రాహ్యం॥ దోషాధిక్యాత్॥ స్మృతయః॥ మనుఃపరాశరశ్చైవ యాజ్ఞవల్క్యమహామునిః। జాబాలిరంగిరాః కణ్వోజాతుకర్ణోథగోభిలః॥ విశ్వామిత్రోవసిష్ఠోత్రిర్మరీచిఃకాశ్యపోభృగుః॥ విష్ణుఃపులస్త్యోధర్మాత్మా గౌతమఃపుణ్యవర్ధనః। ఏతేస్మృతికర్తారః॥ అష్టాదశపురాణాని॥ బ్రాహ్మ్యంపాద్మంవైష్ణవంచ. వారాహం వామనంతథా। భవిష్యంనారదీయాఖ్యం శైవంభాగవతంతథా॥ బ్రహ్మాండం బ్రహ్మకైవర్తం లైంగ్యంస్కాందంతథైవచ। మార్కండేయం మాత్స్యకౌర్మే చాగ్నేయంగారుడంతథా॥ ఇత్యష్టాదశపురాణాని వేదానుసారీణి॥ మునయఃపురాణేభ్యః సారముద్ధృత్యస్మృతీర్లిఖితవంత శ్చతుర్వర్ణోప కారార్థం తాస్స్మృతీర్విలిఖ్యయే విక్రయంతేతేస్మృతివిక్రయిణః। తేభ్యః ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయే॥ స్మృతివిక్రయిణోయేచ మూల్యం ధృత్వాద్విజాధమః। తైర్వైబ్రహ్మవినాంతారస్తేషాంశుద్ధిర్మనీషిభిః॥ తప్తకృచ్ఛ్రత్రయంకృత్వా శుద్ధిమాప్నోతిపౌర్వకీమ్। ఉపోష్యరజనీమేకాం పంచగవ్యంపిబేత్తతః॥ ఏతేభ్యోయోద్విజోదాన మణుమాత్రంప్రతిగ్రహేత్। ప్రాజాపత్యత్రయంకుర్యా దల్పస్వర్ణప్రతిగ్రహే॥ స్వర్ణప్రమాణప్రతిగ్రహే విశేషమాహ॥ కౌర్మే॥ స్మృతివిక్రయిణఃపాపాత్స్వర్ణమాత్ర ప్రతిగ్రహే। తప్తకృచ్ఛ్రత్రయంకృత్వా పంచగవ్యంపిబేత్తతః॥ నతేషుభోజనంకుర్యాన్నస్నానభ్యవహారకమేత్। సర్వధర్మవిక్రయిణాం పాపంయదస్తితత్పాపంస్మృతివిక్రయిణాప్రాప్నోతి॥ స్నేహరూపేణదానరూపేణవాదద్యాన్నతుమూల్యరూపేణ॥ తదేవాహ॥ స్కాందపురాణే॥ స్మృతింపురాణంశాస్త్రంవా జ్యోతిషంసూత్రమేవవా। లిఖిత్వాస్నేహరూపేణ దద్యాద్దోషంనచాప్నుయాత్ ॥ భ

రణమూల్యేన దోషస్స్యాద్దానార్థం న దోషభాక్। వృథా విక్రీత్వా విక్రీయ పూర్వోక్తం దోషమాప్నుయాత్॥ ఇతిస్మృతివిక్రయిణః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౪౧) ఇకను స్మృతివిక్రేతకు ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ స్మృతినివిక్రయించినవానివలన దానాదికమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అట్టి వానివలన నాధానాదికాలములయందు ధాన్యసువర్ణాదికమును, గ్రహణకాలములయందు ధాన్యాదులను గ్రహింపగూడదని దేవీపురాణమునందు జెప్పబడియె. మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు, జాబాలి, అంగిరోమునీశ్వరుడు, కర్ణుడు, జాతుకర్ణుడు, గోబిలుడు, విశ్వామిత్రుడు, అత్రి, మరీచి, కాశ్యపుడు, భృగువు, విష్ణువు, పులస్త్యుడు, గౌతముడు, అనువారలు స్మృతికర్తలనబడుదురు. వీరు సేసినగ్రంథములు స్మృతులనబడును. బ్రాహ్మ్యము, పాద్మము, వైష్ణవము, వారాహము, వామనము, భవిష్యము, నారదీయము, శైవము, భాగవతము, బ్రహ్మాండము, బ్రహ్మకైవర్తము, లైంగము, స్కాందము, మార్కండేయము, మాత్స్యము, కూర్మము, ఆగ్నేయము, గారుడము, అనుపదునెనిమిదియును పురాణములనబడును. మునులు పురాణసారమును సంగ్రహించి స్మృతులను జేసిరి. ఆస్మృతులు నాలుగువర్ణములవారికిని నుపకారకరములై విలసిల్లె. అట్టి స్మృతులనువ్రాసి విక్రయించువాడు స్మృతులను విక్రయించువాడగును. కావుననట్టివానివలననే ద్రవ్యమును బ్రతిగ్రహింప గూడదని దేవీపురాణమునందు జెప్పబడియె. స్మృతులను విక్రయించి జీవించువారలు బ్రహ్మనిహంతలనబడుదురు. కావున నట్టివారలు తప్తకృచ్ఛ్రత్రయమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరించి పిమ్మట నొకదినముపవసించి పంచగవ్యప్రాశనను జేయువలయును. ఇట్టివానివలన నణుమాత్రమయిన పదార్థమును దానపూర్వకముగ గ్రహించినను ప్రాజాపత్య కృచ్ఛ్రత్రయమును ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయునని మార్కండేయపురాణమునందు జెప్పబడియె- స్మృతులను విక్రయించి జీవించువానివలన నణుమాత్రసువర్ణాదికమును గ్రహించినను తప్తకృచ్ఛ్రత్రయము నాచరించి పిమ్మట పంచగవ్యప్రాశనను జేయువలయును- స్మృతులను విక్రయించిజీవించువానిగృహమున భోజనమును జేయగూడదు- మఱియును వానితో సంభాషణాదికమును జేయగూడదు- స్మృతులను విక్రయించువాడు స్వధర్మములను విక్రయించువాడు పొందిన పాపమును పొందునని కూర్మపురాణమునందు జెప్పబడియె- స్మృతుల

నయినను, పురాణములనైనను, శాస్త్రములనైనను, జ్యోతిషమునైనను, సూత్రగ్రంథములనైనను, వ్రాసి స్నేహరూపముచేత నిచ్చినవాడు దోషమును బొందడు. విక్రయించినవాడు దోషమును బొందునని స్కాందపురాణము నందు జెప్పబడెను.

—సోమవిక్రయిణఃప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్.—

(౪౪౨) అథసోమవిక్రయిణః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాన్దపురాణే॥ సోమఇతిసోమాత్మకోలతావిశేషః॥ సోమాహుతిసాధనభూతం సోమంపిబతీతిసోమపాః॥ ఏషశబ్దోఽధార్బ్రాహ్మణ్యానివర్తకః। తస్యయజ్ఞసాధనత్వాత్। తద్విక్రయోబ్రాహ్మణస్యపతనహేతుః॥ తంక్రీత్వా పూర్వ్వజశ్శుద్ధిమాప్నోతి। తద్విక్రేతాపతితోభవేత్। తదేవాహ ॥ దశభిర్వ్వత్సరైస్సోమంక్రీణాతి॥ దశపెయోభవతీతిశ్రుతివాక్యస్యప్రామాణ్యాత్॥ యజ్ఞంకుర్యాత్స్మహాత్ఫలమాప్నోతి తద్విక్రేతాపతితఏవ॥ తదాహవామనపురాణే ॥ సోమంక్రీత్వాద్విజోయస్తుమూల్యాధికతయానృప। సద్యఃపతతిపాపాత్మా ప్రాయశ్చిత్తీభవేత్తతః॥ నారదీయే॥ విక్రయేత్సోమరాజానం ద్విజోమోహవిగర్హితః। సచండాలసమోజ్ఞేయ స్సర్వథాతంపరిత్యజేత్॥ తస్యైషా నిష్కృతిర్దృష్టా పారాశర్యేణసూరిణా। తప్తకృచ్ఛ్రశతంకృత్వా వాపయిత్వా శిరోరుహాన్॥ పునస్సంస్కారకృచ్ఛుద్ధస్త్వన్యథాపతితోభవేత్ । పునస్సంస్కారపూర్వం తస్మాత్ప్రతిగ్రహే దోషమాహ॥ శ్రాద్ధదానేపుణ్యకాలేష్వన్నంవా స్వర్ణమేవవా। విప్రస్త్వజ్ఞానతోధృత్వా కుర్యాచ్చాంద్రాయణత్రయం। జ్ఞానాచ్చేద్ద్విగుణంకృత్వా హ్యన్నమాత్రేశిరోరుహాన్॥ వాపయిత్వాదినంసమ్యగుపోష్యప్రాతరేవహి। పంచగవ్యంప్రాశయిత్వాశుద్ధిమాప్నోతినాన్యథా॥ ఏతదల్పసువర్ణప్రతిగ్రహావిషయం ॥ సువర్ణమాత్రే ద్విగుణమతఊర్ధ్వంతుతత్సమః । తత్రప్రాయశ్చిత్తంకుర్యాత్పునస్సంస్కారంచ॥ ఇతిసోమవిక్రయిణః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౪౨) ఇకనుసోమమునువిక్రయించినవానివలన దానాదికమును ప్రతిగ్రహించినవానికి ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ సోమమనగా సోమాత్మకమైనలతావిశేషము. సోమాహుతిసాధనభూతమైన సోమమును పానముసేయువాడు సోమపాయియనబడును. ఈశబ్దమనగా సోమపాయియనుశబ్దమునుబొందువానికి బ్రాహ్మణ్యానివృత్తియగును. సోమమును విక్రయించినబ్రాహ్మణుడు పతితుడగును. సోమమునుకొనినద్విజుడుశుద్ధినిబొందును. యజ్ఞమునుచేసిన ... మహాఫలమును బొందునని స్కాందపురాణము

నందు జెప్పఁబడియె. ద్రవ్యాధికత్వముచేత యజ్ఞవిక్రేతత్వమునం జే పతి
తుఁడగును. కావున బ్రాయశ్చిత్తమును జేసికొనవలయునని వామనపురాణము
నందు జెప్పబడియె. సోమమును విక్రయించిన బ్రాహ్మణుఁడు చండాలసముఁడగు
ను. కావున నట్టివానిని బరిత్యజింపవలయును. అది యెట్లనఁ దప్తకృచ్ఛ్రశతమును జే
సి వపనమును జేయించుకొని పునరుపనయనసంస్కారమును జేసికొనవలయు
ను. ఇవ్విధముగ నాచరింపనివాఁడు పతితుఁడగును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసి
కొనకమునుపు, అట్టివానివలననే ద్రవ్యమును బ్రతిగ్రహించినను మూఁడు చాం
ద్రాయణముల నాచరింపవలయును. బుద్ధిపూర్వకముగ నట్టివానివలన దానాది
కము గ్రహించినవాఁ డారు చాంద్రాయణవ్రతముల నాచరింపవలయును.
అట్టివానివలన నన్నమాత్రమును గ్రహించినవాఁడు వపనమును జేయించుకొని
యొకదినముపవసించి పిమ్మట బ్రాతఃకాలమునందు బంచగవ్య ప్రాశనను జే
యవలయును. సువర్ణమాత్రమును గ్రహించినవాఁడు ద్విగుణాధికముగ బ్రా
యశ్చిత్తమును జేసికొనవలయును. సువర్ణమునకధికద్రవ్యాదులను బ్రతిగ్రహిం
చినవాఁడు తత్సముఁడగును. కావున వానికి విధించిన ప్రాయశ్చిత్తమునే యాచరిం
పవలయునని నారదీయమునందు జెప్పబడియె.

—— ※ సోమపాయినః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ※ ——

(౬౮౩) అథసోమపాయినః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపు
రాణే॥ సోమం పిబేద్ద్విజో యస్తు హ్యజ్ఞాతకులనామభిః। సాకం యజ్ఞేషు మో
హాత్మా స వృథా బ్రాహ్మణస్స్మృతః॥ వ్యర్థనామధేయః॥ ఘృతకోశగుడపర్వతా
దివత్॥ తస్యాన్యా నిష్కృతిర్నాస్తి పునస్సంస్కరణాదృతే। పశ్చాచ్చాన్ద్రాయ
ణం కుర్యాద్వాపయిత్వా శిరోరుహాన్॥ ఏతదజ్ఞాతకులగోత్రనామహీత్వ
భిస్సహసోమభక్షణవిషయం। స్వబంధుభిస్సహపీతస్య ప్రాయశ్చిత్తమాహ॥
కూర్మపురాణే॥ బంధుభిస్సహయో మోహాత్ పీత్వా సోమం మహాక్రతౌ। స్వ
మంత్రోచ్చారణం కృత్వా త్రివారం శుద్ధిమాప్నుయాత్॥ స్వమన్త్రైః నేష్టాహో
తా రాత్రికర్మణి నియుక్తః తత్ర యే మన్త్రాస్తాన్ త్రిరుచ్చార్య పశ్చాచ్ఛుద్ధిమా
ప్నోతి॥ స్వబాన్ధవాః॥ స్కాందే॥ సకుల్యశ్చ సనాభిశ్చ సపిండశ్చ సగోత్రవాన్।
మాతులస్తస్య పుత్రశ్చ భావుకో దుహితుః పతిః॥ శ్వశురస్తస్య పుత్రశ్చ భాగి
నేయస్తదాత్మజః। పితుః పితృష్వసుః పుత్రాః పితుర్మాతృష్వసుస్సుతాః॥ పితు
ర్మాతుల పుత్రాశ్చ జ్ఞేయాః పితృబాన్ధవాః॥ మాతుః పితృష్వసుః పుత్రా మాతు
ర్మాతృష్వసుస్సుతాః॥ మాతుర్మాతుల పుత్రాశ్చ విజ్ఞేయా మాతృబాన్ధవాః॥
సమానం కులం యస్య స కులః త్రిపురుషాదూర్ధ్వం। సమానా నాభిర్యస్య సనాభి

జ్యేష్ఠకనిష్ఠభ్రాత్రాదిః॥ సమానః పిండో యస్య సః సపిండః జ్యేష్ఠకనిష్ఠపితృవ్య స్తత్పుత్రాః॥ సమానం గోత్రం యస్య సః సగోత్రః పంచమాదూర్ధ్వం। ఏతే స్వబాంధవాః॥ ఏతైస్సహ సోమభక్షణే స్వమన్త్రం ప్రసః త్రిర్ధావర్త్యన దోషః॥ అజ్ఞాతబంధుభిస్సహ భక్షణే చాన్ద్రాయణం కృత్వా పునస్సంస్కారః। ఏతేభ్యః ప్రతిగ్రహే దోషః స్యాత్॥ లింగపురాణే। అజ్ఞాతగోత్రైః భిస్సార్థం యః కుర్యాత్సోమభక్షణం। తస్మాత్సువర్ణమన్నం వా ప్రతిగృహ్య ద్విజోత్తమః॥ ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్రం తిలమాత్రసువర్ణతః। పూర్వోక్తేన ప్రమాణేన షడబ్దం కృచ్ఛ్రమాచరేత్॥ ఉపోష్య రజనీమేకామన్నభుక్ఛుద్ధిమాప్నుయాత్। ఉపోష్య పంచగవ్యం పీత్వా శుద్ధిమాప్నోతి॥ ఇతి సోమపః ప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౪౩) సోమపానము వలన బ్రతిగ్రహమును జేసినవానికి బ్రాయశ్చిత్తమును విధించుచున్నాఁడు॥ అజ్ఞాతకులగోత్రములు గలవారలతో గూడ సోమపానమును జేసినవాడు వృథాబ్రాహ్మణుడనబడును. కావున నట్టివాడు చాంద్రాయణవ్రతము నాచరించి యనంతరము దువపనమును జేయించుకొని పునరుపనయనసంస్కారమును బొందవలయునని దేవీపురాణము నందు జెప్పబడెను. మహాక్రతువులయందు బంధువులతో గూడ సోమపానమును జేసి స్వమంత్రోచ్చారణను మూఁడుపర్యాయములు సేసినయెడల బరిశుద్ధుఁడగును. అనగా నట్టిక్రతువులయందే యేమంత్రముల నుచ్చరించునో యామంత్రములను మూఁడుపర్యాయములు జపించినయెడల బరిశుద్ధుఁడగునని కూర్మపురాణమునందు జెప్పబడెను. సకుల్యుడు, సనాభి, సపిండుడు, సగోత్రుడు, మాతులుడు, మాతులపుత్రుడు, భావుకుడును, దుహితృపతి, శ్వశురుడు, శ్వశురపుత్రుడు, భాగినేయుడు, భాగినేయపుత్రుడు తండ్రితోఁబుట్టువులపుత్రులు, తల్లితోఁబుట్టువులపుత్రులు, తండ్రిమేనమామకొడుకులు, అనువారలు పితృబంధువులనబడుదురు. తల్లియొక్క పినతల్లిపెదతల్లులపుత్రులు, తల్లియొక్క మాతృష్వస్రపుత్రులు, తల్లియొక్క మేనమామపుత్రులు, తల్లిబంధువులనబడుదురు సనాభి, జ్యేష్ఠకనిష్ఠభ్రాత్రాదులు, జ్యేష్ఠకనిష్ఠపితృవ్యులు, తత్పుత్రులు మొదలగువారు స్వబంధువులు. ఇట్టిబంధువులు, సేయుక్రతువునం దేయేమంత్రముల నుచ్చరింతురో యామంత్రములను యాగాంతమందు మూఁడుమార లుచ్చరించుటచేత బవిత్రత గలుగును. అజ్ఞాతబంధువులతో గూడ సోమపానమును జేసినవాడు చాంద్రాయణవ్రతము నాచరించి మరల నుపనయనసంస్కారమును బొందవలయునని స్కాందపురాణమునందు జెప్పబడెను. అజ్ఞాతకులగోత్రములు గలవారితో గూడ సోమభక్షణమును జేసినవానివలన సువర్ణాదికమును గ్రహింపగూడదు. తెలియకయును మాత్ర

మునగ్రహించినను ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును సువర్ణమును గ్రహించినయెడల షడబ్దకృచ్ఛ్రమునాచరింపవలయును. మఱియును నొకదిననుపవసించిపంచగవ్య ప్రాశనను జేయవలయునని లింగపురాణమునందు జెప్పబడెను.

## పశుపురోడాశభక్షణె ప్రాయశ్చిత్తమ్.

(౪౪౪) అథపశుపురోడాశభక్షణప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణె॥ యజ్ఞేషుసాధుప్రవృత్తేషుధర్మార్జితధనేషువా। తత్రైవభక్షయేన్మేధ్యంపశుం వృత్త్యర్థమాదరాత్॥ బ్రాహ్మణోబ్రహ్మవిత్పూతః పశుంయద్యభిహారయేత్। తస్యైషానిష్కృతిర్భూప వేదపారాయణంస్మృతం॥ ఏతద్బంధుకృతవిషయం॥ అన్యత్రభక్షణేద్విగుణం। అశ్రోత్రియయజ్ఞె పశుపురోడాశభక్షణేత్రిగుణం॥ శూద్రద్రవ్యగ్రహీతయజ్ఞేషు పశుభక్షణెపంచగుణం॥ పునస్సంస్కారశ్చ తదేవాహకౌర్మ్యే॥ స్వబంధుకృతయజ్ఞేషు ప్రాప్తంయస్తుభక్షణం। పారాయణాద్విశుద్ధిస్స్యాదన్యత్రద్విగుణంభవేత్॥ అశ్రోత్రియేతుత్రిగుణం-శూద్రె పంచగుణంభవేత్॥ పునస్సంస్కారకృత్యాత్ శుద్ధోభవతిసర్వదా। తత్రప్రతిగ్రహె ప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణె॥ పశుంభక్షయతోయస్యద్విజస్యాకృతనిష్కృతేః। ప్రతిగృహ్యసువర్ణంవా జ్ఞాత్వాన్నందోషభాగ్భవేత్॥ అజ్ఞాత్వాకృచ్ఛ్రమాత్రంస్యాజ్జ్ఞానెత్వేతద్ద్వయంస్మృతం। అన్నభుక్పంచగవ్యేనశుద్ధిమాప్నోతిపూర్వజః॥ స్వప్నసువర్ణప్రతిగ్రహెప్రాజాపత్యం। సువర్ణమాత్రప్రతిగ్రహేద్విగుణం॥ అన్నభక్షణెపంచగవ్యాచ్ఛుద్ధిః॥ ఇతిపశుపురోడాశభోక్తుఃప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౪౪) ఇకను పశుపురోడాశభక్షణ ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ సాధుజనులచేత న్యాయముగ సంపాదింపబడినధనముచేత జేయబడినయజ్ఞములయందు పశుపురోడాశమును భుజించినవాడు ప్రాయశ్చిత్తార్థముగ వేదపారాయణమును జేయవలయును. బంధువుగానివానియజ్ఞమునందు పశుపురోడాశమును భక్షించినవాడుద్విగుణముగ వేదపారాయణను జేయవలయును. శ్రోత్రియుడుగాని వానియజ్ఞమునందు, పశుపురోడాశమును భక్షించినవాడు మున్మారు వేదపారాయణను జేయవలయును. శూద్రద్రవ్యకృతయజ్ఞములయందు పశుపురోడాశమునుభక్షించినవాడైదుపర్యాయములు వేదపారాయణను జేయవలయును. మఱియును పునరుపనయన సంస్కారమును గూడబొందవలయునని దేవీపురాణమునందు జెప్పబడెను. కూర్మపురాణమునందును నిట్లులనే జెప్పబడెను. యజ్ఞములయందు పశుపురోడాశమును భక్షించి ప్రా

యశ్చిత్తమును జేసికొనని వానివలన నెద్దానిని ప్రతిగ్రహించినను ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన దెలియక చేసినవాడు కృచ్ఛ్రమాత్రము నాచరింపవలయును. తెలిసి చేసిన యెడల రెండు కృచ్ఛ్రముల నాచరింపవలయును. అట్టివాని యన్నమును భుజించిన యెడల పంచగవ్య ప్రాశనను జేయవలయును. స్వల్పసువర్ణప్రతిగ్రహమునందు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. సువర్ణమాత్ర ప్రతిగ్రహమునందు రెండు ప్రాజాపత్యముల నాచరింపవలయునని లింగపురాణమునందు జెప్పబడినది.

——॥ అయాజ్యయాజినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ॥——

(౪౪౫) అథ అయాజ్యయాజినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ స్కాన్దే॥ యాజయేన్నైవ యాజనేయోగ్యాన్ విప్రో వృత్త్యర్థమాదరాత్ । అన్యథా దోషమాప్నోతి నకర్మార్హో భవేదిహ॥ యాజనే అనర్హాః॥ కౌర్మే ॥ దేవాలకశ్చ గణకో వ్రాత్యో దుశ్శీలవాంజనః । శూద్రాపతిః కర్మహీనో లోకే కుత్సితవృత్తిమాన్॥ మహాపాతకిసంసర్గీ క్షయరోగీ భగందరీ। దుశ్చర్మా శూద్రసేవీ చ భిషక్ శూద్రాన్నభక్షకః। వృథాతులాదిసంగ్రాహీ మర్యాదాఘాతుకస్తథా। గ్రామదాహీ గ్రామణీశ్చ తథా దుస్సంగవాన్ జనః॥ ఏతే అనర్హాః। దేవాలకో- జీవనార్థం గ్రామదేవార్చకః॥ గణకః- గ్రామపురాద్యేషు ధనధాన్యాదికం నిత్యం లేఖయన్ వర్తతే స గణకః॥ వ్రాత్యః- గాయత్రీజపనాశకః॥ తదేవాహ మనుః॥ నగ్నో వేదపరిత్యాగీ వ్రాత్యో గాయత్రినాశక ఇతి ॥ సంధ్యాదినిత్యకర్మాణి త్యక్త్వా సర్వదా వర్తయన్॥ శూద్రాపతిః స్పష్టః। కర్మహీనః। విహితకర్మపరిత్యజ్య వ్యవహారాదిక మనువర్తమానః కర్మహీనః। కుత్సితవృత్తిః- పరేషామన్నపచనాదికృత్॥ మహాపాతకిసంసర్గీ చ స్పష్టః॥ క్షయరోగీ భగందరీ దుశ్చర్మా చ కర్మస్వనర్హాః॥ శూద్రసేవీ - సదా శూద్రసంసర్గి । భిషక్ - రసవిక్రయీ। శూద్రాన్నభోజీ- శూద్రకృతేషు సత్రేషు నిత్యభోజీ । తులాదీన్ గృహీత్వా ప్రాయశ్చిత్తపునస్సంస్కారపరాఙ్ముఖః - వృథాతులాదిసంగ్రాహీ ॥ మర్యాదాఘాతుకః- పితరం జ్యేష్ఠభ్రాతరం చ త్యక్త్వా అందోళికాద్యారోహణకృత్। గ్రామదాహీ గ్రామణీశ్చ స్పష్టః । దుస్సంగవాన్ దుర్జనైరాతతాయిభిస్సంసర్గవాన్। ఏతే నకర్మార్హాః ॥ ఏషాం యాజ్ఞే యాజనే ప్రాయశ్చిత్తమాహ॥ వామనపురాణే॥ అనర్హేషు చ యజ్ఞేషు విప్రో యాజయతే సకృత్। ప్రాయశ్చిత్తవిహీనశ్చేత్ స భవేత్ పాషండతాం వ్రజేత్॥ పాషండో నామ వేదశాస్త్రానుసారిణో విప్రాన్ దృష్ట్వా సదా నిందయతి। పితామహతాతప్పితా చ యేన మార్గేణావర్తంత తత సన్మార్గముత్సృజ్య తత్పథం దురాచారిణో వైష్ప్రాప్తాస్తే పాషండాః ॥ తదా

హావామనః॥ అనర్హాణాంచవ్రాత్యానాం భిషజామాతతాయినాం। యజ్ఞేషు
యెయాజయంతే తెపాషండాభవంత్యహో॥ శివపురాణే॥ మహాపాతకినాం
చైవభిషక్ఛూద్రోపజీవినాం। యజ్ఞేషు యేప్రవర్తంతే తె పాషండాఃప్రకీర్తితా
తెషాంప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ అనర్హాణామధ్వరేషు యేబ్రహ్మఋత్వి
గాదయః। తేషాంపాపవిశుద్ధ్యర్థంషడబ్దంకృచ్ఛ్రమీరితం॥ కేశానాంవపనం
కృత్వాపునస్సంస్కారమాచరేత్॥ పఞ్చగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతినాన్య
థా। ఏతేభ్యఃప్రతిగ్రహేదోషమాహ॥ లింగపురాణే॥ అనర్హాణాంతుయో
యజ్ఞేసోమపానాదికంచరేత్। తస్మాత్ప్రతిగ్రహంకృత్వాప్రాయశ్చిత్తాదధో
యది॥ ఏతత్పాపఫలంభుక్త్వాఏకంచాంద్రాయణంచరేత్। ప్రాయశ్చిత్తేకృతే
పశ్చాదతోదోషోనవిద్యతే। చాంద్రాయణంసువర్ణస్య తదర్ధంపాదమాచరే
త్॥ అన్నమాత్రంయదాప్రాప్తంగాయత్రీశతమాచరేత్। ఏతత్ప్రాయశ్చి
త్తంకృత్వాతత్ప్రతిగ్రహాచ్ఛుద్ధోభవతినాన్యథా॥ ఇత్యయాజ్యయాజినఃప్రతి
గ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౪౫) ఇకనయాజ్యయాజివలన బ్రతిగ్రహమును జేసినవానికిబ్రాయ
శ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడగువాడు ఋత్విక్కుగా
యజ్ఞమును జేయదగినవారలచేతనే యజ్ఞమును జేయింపవలయును గాని
యజ్ఞమును జేయదగనివారలచేత యజ్ఞమును జేయింపగూడదని స్కాందము
నందు జెప్పబడియె. దేవాలకుడు, గణకుడు, వ్రాత్యుడు, దుశ్శీలముగలవాడును,
శూద్రస్త్రీభర్తయును, కర్మహీనుడును, కుత్సితవృత్తిగలవాడును, మహాపా
తకులయొక్క సంసర్గముగలవాడును, క్షయరోగముగలవాడును, భగందర
రోగముగలవాడును, దుష్టమైనచర్మముగలవాడును, శూద్రులను సేవించువా
డును, వైద్యమును జేసి జీవించువాడును, శూద్రాన్నభక్షకుడును, వ్యర్థముగ
తులాదిసంగ్రాహముగలవాడును, మర్యాదాఘాతుకుడును, గ్రామదాహ
మును జేయువాడును, గ్రామణియును, దుస్సంగముగలవాడును, కర్మలకనర్హుల
నబడుదురని కూర్మపురాణమునందు జెప్పబడియె. అనర్హులగువారు చేయు
యజ్ఞములయందుఋత్విక్త్వమునువహించినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొ
ననియెడల పాషండత్వమును బొందును. పాషండుడనగా వేదశాస్త్రానుసారు
లగువిప్రులను సర్వకాలములయందునిందించువాడనుట. మఱియును లింగధరు
లుసర్వకాలములయందును సంచరించుమార్గమునువదలి తప్తముద్రాదులను
ధరించువాడును పాషండుడనబడును. అనర్హులయొక్కయు, వ్రాత్యులయొ
క్కయు, వైద్యులయొక్కయు, ఆతతాయులయొక్కయు, యజ్ఞములయం

దు ఋత్విక్త్వమును వహించినవాఁడు పాషండుఁడగునని వామనుఁడు వచించెను. ఇట్టివారలచే యజ్ఞములయందు ఋత్విక్త్వమును వహించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మఱియు వపనమును జేయించుకొని మరలనుపనయనసంస్కారమును బొందవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనను జేయించుకొనవలయునని కూర్మపురాణమునందు జెప్పఁబడియె. అనర్హులయొక్క యజ్ఞములయందు సోమపానము జేసినవానివలన ప్రతిగ్రహము జేయఁగూడదు. ప్రతిగ్రహించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. అట్టివానివలన నన్నమును మాత్రము గ్రహించిన యెడల నూఱుపర్యాయములుగా గాయత్రీజపమును జేయవలయునని లింగపురాణమునందు జెప్పఁబడియె.

## తప్తముద్రాధారిభ్యః ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమ్

(౪౮౬) అథతప్తముద్రాధారిభ్యః ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ॥ వామనపురాణే॥ బ్రాహ్మణో యది మోహాత్స్యాత్తాపయేద్వహ్నిముద్రయా। కర్మార్హో న భవేదత్ర స వై పాషండసంజ్ఞితః ॥ నారదీయే॥ బ్రాహ్మణస్య తనుర్జ్ఞేయా యా సర్వవేదమయీ యతః। సా చేత్సన్తాపితా యేన కిం వక్ష్యామి మహీపతే॥ చక్రాఙ్కితతనుర్యత్ర రాజన్ లిఙ్గాఙ్కితోఽపి వా। జపేచ్చ పౌరుషం సూక్తమన్యథా రౌరవం వ్రజేత్॥ లిఙ్గపురాణే॥ చక్రం శఙ్ఖం తాపయిత్వా యస్య దేహః ప్రదహ్యతే। స జీవఞ్ఛవపస్త్యాజ్యః సర్వకర్మబహిష్కృతః॥ ఆదిత్యపురాణే॥ వైదికేషు యజ్ఞభాగేషు యస్య నాస్త్యధికారితా। స తాపయిత్వా చక్రాదీన్ ధారయేత్స్వభుజద్వయే॥ బ్రాహ్మణో యది లోభేన ధారయేద్దగ్ధముద్రికాః। తస్య దర్శనమాత్రేణ కుర్యాత్సూర్యావలోకనమ్॥ వహ్నిపురాణే॥ పూర్వజః స్వతనుం దగ్ధ్వా శఙ్ఖచక్రాదిభిః పృథక్। ఏతస్య నిష్కృతిర్నాస్తి స్నానదానజపాదిభిః॥ తస్య నిష్కృతిరుత్పన్నా పారాశర్యేణ భాషితా। కేశానాం వపనం కుర్యాత్పునః కర్మ సమాచరేత్॥ గర్భగోళాత్సముద్ధృత్య గర్భాధానాదిపూర్వకం। షోఢా వృత్త్యైవ కృచ్ఛ్రాణాం ప్రాయశ్చిత్తముదీరితమ్॥ పరిషదుపస్థానపూర్వకం షడబ్దకృచ్ఛ్రాణి కృత్వా శుద్ధిమాప్నోతి॥ ప్రాయశ్చిత్తాకరణే తేభ్యః ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమాహ॥ కూర్మపురాణే॥ అజ్ఞాత్వా ముఖ్యజో యత్ర ముద్రాదగ్ధేభ్య ఆదరాత్। సువర్ణమాత్రం సంగృహ్య ప్రాజాపత్యం సమాచరేత్॥ తదర్ధం పునః కృత్వా హ్యన్నమాత్రము పోషణం। కృత్వా శుద్ధిమవాప్నోతి శుద్ధిర్నాన్యత్ర దృశ్యతే॥ ఇతి తప్తముద్రాధారిభ్యః ప్రతిగ్రహే ప్రాయశ్చిత్తమ్॥

(౪౪౬) ఇఁక నుతప్తముద్రల నుధరించినవారివలనఁ బ్రతిగ్రహము సేసినవానికి బ్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ వహ్నిముద్రచేతఁ దప్తుఁడైన బ్రాహ్మణుఁడు కర్మానర్హుఁడును, పాషండుఁడును నగునని వామనపురాణము నందు జెప్పఁబడియె. బ్రాహ్మణుని శరీరము సర్వదేవమయమైనది. కావున నట్టి శరీరమును నగ్నితప్తము సేసెనేని మహాపాపము గలుగును. చక్రాంకితశరీరము గలవాఁడును, లింగాంకితశరీరము గలవాఁడును, పురుషసూక్తమంత్రపఠనమును జేయవలయును. కాదేని రౌరవనరకమును బొందునని నారదీయమునందు జెప్పఁబడియె. శంఖచక్రములచేత దప్తమైన శరీరము గలవాఁడు జీవత్కుణపమనియును, సర్వకర్మబహిష్కృతుఁడనియును జెప్పఁబడెనని లింగపురాణమునందు జెప్పఁబడియె. వేదములయందును, యజ్ఞములయందును, అధికారము లేనివాఁడు భుజద్వయమునందు చక్రాదులచేత గాల్చుకొనవలయును. బ్రాహ్మణుఁడగువాఁడు లోభముచేత నీకృత్యమును జేసెనేని యట్టివానిని జూచినతోడనే సూర్యావలోకనమును జేయవలయునని యాదిత్యపురాణమునందుఁ జెప్పఁబడియె. శంఖచక్రాద్యాకారములచేత దప్తమైనశరీరము గలవాఁడు స్నానదానజపాదులచేత బవిత్రుఁడు గానేరఁడు. కావున బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన వపనమును జేయించుకొని మరల గర్భాధానాద్యుపనయనాంతసంస్కారమును బొంది యారువిధములగు కృచ్ఛ్రముల నాచరింపవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసికొనని యెడల నట్టివానివలన దానాదికమును బ్రతిగ్రహింపఁగూడదని వహ్నిపురాణమునందు జెప్పఁబడియె. ముద్రాదగ్ధులవలన ఔలియక సువర్ణమాత్రమును గ్రహించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. అన్నమాత్రమును గ్రహించినవాఁడుపవాసమును జేసి యర్ధప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడె.

### లింగధారిణాం ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౪౭) అథ లిఙ్గధారిణాం ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ లింగం ద్విజో ముధా ధృత్వా స్వదేహే భయవర్జితః । స ఏవ నరకస్థాయీ యావదాభూతసంప్లవం॥ స్కాన్దపురాణే॥ ద్విజో యదస్వదేహే తు లింగం ధృత్వా స్వకామతః। స భుక్త్వా నరకాననుగ్రానంతే మాతంగతాం వ్రజేత్॥ శైవే॥ ద్విజోఽతః స్వతనౌ ధృత్వా లింగం ముద్రాపితం ముదా। న తస్య నిష్కృతిర్దృష్టా సంసారైర్బహుభిర్ద్విజ॥ పాద్మపురాణే॥ శృణు రామ మహాబాహో లింగచక్రాదిధారిణాం। శూద్రధర్మరతానాం హి తేషాం నాస్తి పునర్భవః॥ వి

ప్రశస్తేభ్యస్తద్విగుణం హృత్వా ప్రాయశ్చిత్తముదీరితం। పశ్చాత్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్తమిదంచరేత్॥ అజ్ఞాత్వా యః పునః కర్మషడబ్దం కృచ్ఛ్రమాచరేత్ తేభ్యో గృహ్ణాతి ద్విజో యస్తు సువర్ణం పాదమేవవా॥ తత్ప్రతిగ్రహశుద్ధ్యర్థం ప్రాజాపత్యం సమాచరేత్। అర్ధార్ధప్రమాణం పూర్వవత్॥ అన్నపరిగ్రహణే చ॥ ఇతి లింగధారిణః ప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౪౭) ఇకను లింగధారులయొక్క ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ స్వశరీరమునందు లింగమును ధరించిన బ్రాహ్మణుడు ప్రళయకాలము దనుక నరకలోకమును బొందియుండునని దేవీపురాణమునందు జెప్పబడినది. లింగధారియగు బ్రాహ్మణుడు నరకలోకానుభవాంతమందు మాతంగత్వమును బొందునని స్కాందపురాణమునందు జెప్పబడినది. లింగధారియగు బ్రాహ్మణుడు నానావిధములగు ప్రాయశ్చిత్తములచేత బవిత్రుడగునని శైవపురాణమునందు జెప్పబడినది. లింగచక్రాదులనుధరించిన బ్రాహ్మణులు నింద్యులుగనుక ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన ముందుగ షడబ్దకృచ్ఛ్రమునాచరించి పిమ్మట కృచ్ఛ్రమునాచరింపవలయును. లింగధారణను చేసినవానివలన సువర్ణమును ప్రతిగ్రహించినవాడు పరిశుద్ధతకొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. అన్నమును ప్రతిగ్రహించినవాడర్ధ ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయునని పద్మపురాణమునందు జెప్పబడినది.

## ——— పునస్సంస్కారే గాయత్రీదాతుః ప్రాయశ్చిత్తం. ———

(౪౪౮) అథ పునస్సంస్కారే గాయత్రీ ప్రదాతుః ప్రాయశ్చిత్తమాహ॥ కార్ష్ణ్యే॥ నపితా నగురుర్భ్రాతా పితృవ్యశ్చపితామహాః। నదద్యాదదరాద్దేవీం పునస్సంస్కారకర్మణి॥ యదా ప్రతిగ్రహేత్స్వేషు తులాదిషు మహత్స్వపి। దానేషు పుత్రవాత్సల్యం సంత్యజేద్బుద్ధిమాన్పితా॥ నిత్యనైమిత్తికాదీని కర్మాణి విఫలం స్యథ। కర్మభ్రింశాత్పితా తస్య నదద్యాద్వేదమాతరం॥ క్రీత్వా ప్రతిగ్రహే మూల్యైః అన్యగోత్రం ద్విజోత్తమం। అభ్యర్చ్య గంధవస్త్రైశ్చ తైః తస్మాద్దేవీం సమభ్యసేత్॥ బ్రహ్మోపదేశం హోమంచ సర్వం తేనసమభ్యసేత్॥ లింగపురాణే॥ పితా భ్రాత పితృవ్యశ్చ తులాదీనాం ప్రతిగ్రహే। పుత్రాయ ధనవాత్సల్యాన్న దద్యాద్వేదమాతరం॥ పునః కర్మణి సంస్కారే క్రీత్వా తమూల్యేన భూయసా। బ్రాహ్మణం కర్మకుశల మన్యగోత్రం ప్రయత్నతః॥ తస్మాద్బ్రహ్మోపదేశంచ గాయత్రీం వేదమాతరం। అభ్యసేద్విధినా రాజన్ పాదపూర్వం హుదగ్రితః॥ గారుడపురాణే॥ యో విప్రో ధనలోభేన గాయత్రీం వేద

మాతరం। తులాప్రతిగ్రహీతృణాం దద్యాత్తస్యనిష్కృతిః॥ పశ్చాత్తాపసమాయుక్తస్త్ర్యహముపోష్యజపమాచరేత్। అన్యథాదోషమాప్నోతిసావిత్రీపతితోభవేత్॥ స్కాందే॥ తులాప్రతిగ్రహీతౄణాంయోవిప్రోవేదమాతరం। తత్రైవనిష్కృతింస్పష్ట్వా దద్యాదాదరపూర్వకం॥ జపిత్వాత్ర్యహమయుతందేవ్యాశ్శుద్ధిమాప్నోత్యనుత్తమాం। నాన్యథాశుద్ధిమాప్నోతి జపహోమ సురార్చనైః॥ విదిత్వాయోద్విజోమోహాత్ప్రాయశ్చిత్తపరాఙ్ముఖః। సపాపమనుభూయాశు చటకోభువిజాయతే॥ ఇతిపునస్సంస్కారే గాయత్రీప్రదాతుః ప్రాయశ్చిత్తమ్॥

(౭౭౬) పునస్సంస్కారమునందు గాయత్రీదాతకుఁ బ్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ పునరుపనయనసంస్కారకర్మయందుఁ దండ్రియును, భ్రాతయును, పితృవ్యుఁడును, పితామహుఁడును, గాయత్రీదానమును జేయఁగూడదు. తులాదులను బ్రతిగ్రహించినపుత్రాదులయందు వాత్సల్యమును వదలవలయును. అట్టిపుత్రుఁడు కర్మభ్రష్టుఁడు గనుక వేదమాతనుపదేశింపఁగూడదు. మఱియెట్లనిన ద్రవ్యదానముచేత నితరబ్రాహ్మణునిగాని యతనికిషోడశోపచారపూజలుసల్పి బ్రహ్మోపదేశహోమాదులను జేయింపవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడినది. తులాదులనుప్రతిగ్రహించినపునరుపనయన సంస్కారమునుబొందుచున్నవానికి, పితృభ్రాతృపితృవ్యాదులలో నెవ్వఁడును ధనలోభముచేత గాయత్రీమంత్రోపదేశమును జేయఁగూడదు. కావుననట్టివాఁడు ధనముచే నితరబ్రాహ్మణునిగాని యతనివలన గాయత్రీమంత్రోపదేశమును బొందవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడినది. ధనలోభముచేత, తులాదికమును ప్రతిగ్రహించినవానికి గాయత్రీమంత్రోపదేశమును జేసినవాఁడు ప్రాయశ్చిత్తార్థముగఁ బదివేలపర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును. ఇట్లు సేయనియెడల పతితుఁడగునని గారుడపురాణమునందుఁ జెప్పఁబడె. తులాప్రతిగ్రహాదులనుజేసినవానికి గాయత్రీమంత్రోపదేశమును జేసినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనకపోయినేని భూలోకమునందు, చటకమైపుట్టునని స్కాందమునందుఁ జెప్పఁబడినది.

—— * పరార్థంగాయత్రీజపకర్తౄణాం ప్రాయశ్చిత్తమ్. * ——

(౭౭౭) అథపరార్థం గాయత్రీజపకర్తౄణాం ప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ పరార్థంశృణురాజేన్ద్ర గాయత్రీజపకృన్నరః। మోహాద్వాధనలోభాద్వాసవైపాషండతాంవ్రజేత్॥ గారుడపురాణే॥ బ్రాహ్మ

లోభనలోభేన పరార్థంవేదమాతరమ్। జప్త్వానరకమాప్నోతి తంకదానా లపేద్బుధః॥ కూర్మపురాణే। వేదమాతాచగాయత్రీ జపతాం పాపనాశనీ। పరార్థంతాజపేద్యస్తు ససరోమాతృఘాతుకః॥ లైంగే॥ పాదపూర్ణాంజపే ద్యస్తు గాయత్రీంశుద్ధమానసః। సవై నారాయణస్సాక్షాద్ద్విబాహు రితివి శ్రుతిః॥ మహాభారతే॥ వేదమాతాతుగాయత్రీ లోకమాతాతుజాహ్నవీ। తయోర్యదిద్విజోభక్త్యా నిత్యంసేవేతబుద్ధిమాన్॥ తయోరేకాంపరిత్యజ్య ప రార్థంజనవల్లభ। సదవాక్తిర్తితుల్యస్స్యాన్మృత్వా నరకమశ్నుతే॥ తదంతే భువమాసాద్య పాదలంబీదివాన్ధవాన్। తస్యనిష్కృతిరత్రైవ దృష్టామునిప రాయణైః॥ దశకంజపతోదేవ్యాః పరార్థంకృచ్ఛ్రమీరితం। శతంపరార్థంజప తఃపరాకంపరికీర్తితం॥ సహస్రసంఖ్యయా న్యార్థం శుద్ధ్యర్థంచాంద్రమాచరే త్। అయుతంనియుతంవాపి పరార్థంధనలోభతః॥ జపతస్తస్యకర్మాణి స ద్యశ్శీర్యంతిదేహతః। తస్య్యపనయనంభూయ శ్చాంద్రాయణచతుష్టయం॥ ఔపాసనాగ్నిసంధానం గాయత్రీదానమేవచ। కేశానాంవపనంకృత్వా పం చగవ్యంతతఃపరం॥ పరార్థంయావతీసంఖ్యా గాయత్రీప్రణవాత్మికా। తస స్వార్థం జపేత్పశ్చాత్తతశ్శుద్ధిరవాప్యతే॥ ఏవంకృత్వాద్విజశ్శుద్ధ్యేదన్యథా జలకాకవత్। తస్యజన్మవృథాలోకే నామధారణమాత్రకం॥ ఇతి పరార్థం గాయత్రీజపకర్తౄణాం ప్రాయశ్చిత్తమ్॥

(౪౪౯) ఇఁకను పరులకొఱకు గాయత్రీజపకర్తలకు ప్రాయశ్చిత్తవిధానమును గుఱించి చెప్పుచున్నాఁడు॥ మోహమువలననైనను, ధనలోభమువలననైనను, పరులకొఱకు గాయత్రీమంత్రమును జపించినమానవుఁడు పాషండత్వమును బొందునని బ్రహ్మాండమునందుఁ జెప్పఁబడెను. పరులకొఱకు ధనలోభముచేత వేదమాతనుజపించినవాఁడు నరకమును బొందును. కావుననట్టివానితో మాటలాడఁగూడదని గారుడపురాణమునందుఁ జెప్పఁబడెను. గాయత్రీమంత్రమును జపించువారలకు పాపనాశనమగును. పరులకొఱకు గాయత్రీమంత్రమును జపించువాఁడు మాతృఘాతకుఁడగునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడెను. పరిశుద్ధమనస్కుఁడై చతుష్పాదగాయత్రీమంత్రమును జపించువాఁడు నారాయణతుల్యుఁడగునని లైంగమునందుఁ జెప్పఁబడెను. వేదమాతగాయత్రి, లోకమాతజాహ్నవి, కావుననీరెంటిని బ్రాహ్మణుఁడు భక్తిచేత సేవింపవలయును. ఈరెంటిలో దేనినిపరులకొఱకు ద్రవ్యలోభముచేత సేవించినవాఁడు మంగలవానికిఁ దుల్యుఁడగును. పిమ్మటనరకలోకమును బొంది యనంతరమంధుఁడువాంధ్యుఁడై పుట్టును. కావునప్రాయ

శ్చిత్తమును జేసికొనవలయును. అదిమొదలుగా నపరులకొఱకు పదిపర్యాయములు గాయత్రీమంత్రమునుజపించినవాఁడు కృఛ్రము నొకదానినాచరింపవలయును. నూఱుపర్యాయములుజపించినవాఁడు పరాకకృఛ్రము నాచరింపవలయును. వేయుపర్యాయములు జపించినవాఁడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. అయుతసంఖ్యచేతనైనను, నియుతసంఖ్యచేతనైనను, జపించినవాని శరీరమునుండి సకలకర్మలును దొలఁగిపోవును. కావున నట్టివాఁడు నాలుగు చాంద్రాయణములనాచరించి పునరుపనయన సంస్కారమును బొందవలయును. మఱియు నౌపాసనాగ్నిసంధానమును, గాయత్రీదానమును, వపనమును, పంచగవ్యప్రాశనను, చేసి పిమ్మటఁ దొలుతఁబరులకొఱకెన్నివేలపర్యాయములు గాయత్రీజపమునుజేసెనో యన్నివేలపర్యాయములుతనకొఱకు గాయత్రీజపమును జేసికొనవలయును. ఇవ్విధముగఁ జేయనివాఁడు పరిశుద్ధుఁడు గానేరఁడని మహాభారతమునందుఁ జెప్పఁబడె.

—* గ్రామప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౪౫౦) అథ గ్రామప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ ముఖజస్త్వాత్తభోగార్థం గ్రామంరాజ్ఞఃప్రతిగ్రహేత్ । వృత్తిదానం ద్విజాతీనాం తద్బుద్ధింవానసంస్మరేత్॥ నరకంకాలసూత్రాఖ్యంచిరంగత్వాతతోభువి। విడ్వరాహోభవేత్సోపి సర్వధర్మబహిష్కృతః ॥ గ్రామలక్షణమాహ॥ చతుర్వింశతిమతే॥ దశాగారంజనపదఃశతాగారంజనాలయః । అతఊర్ధ్వంతుపల్లిస్యాత్సహస్రంగ్రామఉచ్యతే॥ తతఃపరంరాజధానీసౌధప్రాకారశోభితా। జనపదాదీనాం ప్రతిగ్రహేవృత్తిదానక్రత్వాద్యభావేప్రత్యేకందోషంప్రాయశ్చిత్తంచాహ॥ కూర్మపురాణే॥ అకృత్వానిష్కృతింయాగం వృత్తిదానంద్విజన్మనాం। గృహ్ణీయాద్యోజనపదం తామ్రచూడోభవేద్భువి॥ జనాలయప్రతిగ్రాహే చండాలాదివిభూషితే। ప్రతిగ్రహీ ద్విజోయస్తు సభవేద్వాయసోభువి॥ పల్లిప్రతిగ్రహేరాజన్నానావర్ణసమాకులే । నరకంస్థాను భూయాథ ఖరజన్మాభవేద్భువి॥ గ్రామప్రతిగ్రహేవిప్రః పత్నీభోగపరాయణః। యమలోకముపాగమ్య స్థిత్వాతత్రైవయాతనాః॥ భుక్త్వాభువిమహాదీర్ఘః స్థూలస్సర్పోభవేద్భువి। అబ్దంషడబ్దంచాంద్రంచ తప్తకృచ్ఛ్రశతత్రయం॥ ప్రాయశ్చిత్తమిదంరాజన్ యథాక్రమముదీరితం । వృత్తితానక్రత్వాద్యభావేప్రాయశ్చిత్తంవిశోధనం॥ తయోర్మధ్యేకంసమ్భవేత్పంచగవ్యం బ్రాహ్మణభోజనంచ॥ ఇతిజనపదాదిప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౫౦) ఇఁకను గ్రామప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచు

న్నాఁడు॥ ఆత్మభోగము కొఱకు రాజువలన గ్రామమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు కాలసూత్రమను పేరుగలనరకమును బొందునని మార్కండేయుఁడు చెప్పె. పదిగృహములుగలది జనపదమనియును, నూరుగృహములు గలది జనాలయమనియును, నూరుగృహముల కధికముగనుండెనేని పల్లియనియును, నూరుగృహములుగలది గ్రామమనియును, సౌధప్రాకారాదులచేతఁ బ్రకాశించునది రాజధానియనియును, చెప్ప బడును జనపదాదులయొక్క ప్రతిగ్రహమునందు వృత్తిదానక్రత్వాద్యభావమునందు ప్రత్యేకముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయునని చతుర్వింశతి మతమునందుఁ జెప్పఁబడియె. గ్రామాదులను ప్రతిగ్రహించినవాఁడు తద్ద్రవ్యముచేత యాగాదికమును జేయనివాఁడు తామ్రచూడుఁడై పుట్టును- చండాలాదివిభూషితమైన జనాలయప్రతిగ్రహమును జేసినవాఁడు వాయసమైపుట్టును- నానావర్ణ సమాకులమైనపల్లిగ్రహించి యాద్రవ్యముచేత యాగాదులను జేయకపోయె నేని నరకలోకమునుబొంది పిమ్మట గాడిదెయైపుట్టును- భోగపరాయణుఁడై గ్రామమును ప్రతిగ్రహించినవాఁడు యమలోకమునందనేకములగు నరకములనుబొందును. పిమ్మట భూలోకమునందు స్థూలసర్పమైపుట్టును- ఈ కృత్యములయందు, క్రమముగనబ్దకృచ్ఛ్రము, షడబ్దకృచ్ఛ్రము, చాంద్రము, తప్తకృచ్ఛ్రశతత్రయము, అను వాని నాచరింపవలయును- వృత్తిదానమును ప్రతిగ్రహించి క్రత్వాదులను జేయనివాఁడీవిధమైన ప్రాయశ్చిత్తాదికమును జేసికొనవలయును- పిమ్మటఁ బంచగవ్యప్రాశన బ్రాహ్మణసమారాధనను జేయవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె.

— కూశ్మాండప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. —

(౪౩౧) అథకూశ్మాండ ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ లింగపురాణే॥ ఏకం ద్వయంత్రయంవాపి కూశ్మాండం యోనుమన్యతే । తిలాజ్యమిశ్రితం స్వర్ణవస్త్రమాల్యవిభూషితం ॥ మకరేసంక్రమేరాజన్ కార్తిక్యాం పౌర్ణమీదినే । దత్తం జనైర్దక్షిణయాసాకం తస్యశృణుత్విదం ॥ ప్రధానం సమ్పరిత్యజ్య సచేలంస్నానమాచరేత్ । గాయత్రీంచ జపేత్పశ్చాత్సహస్రం ప్రాణాయామపూర్వకం ॥ ద్వయోః ప్రతిగ్రహేతద్వద్ద్విసహస్రంమునీశ్వర। బాహుళ్యే సంఖ్యయాతాత తావత్సంఖ్యాప్రశస్యతే ॥ తదేవస్వర్ణరూపం చేత్ప్రతిగృహ్యద్విజోత్తమః । బ్రహ్మహత్యాసమత్వార్థముతపుత్రార్థమేవవా ॥ తథా ప్రధానం సంత్యజ్య గాయత్రీలక్షమాచరేత్ । ఏవంచైవ విశుద్ధస్స్యాన్నాన్యథా శుద్ధిమాప్నుయాత్ ॥ ఇతికూశ్మాండప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥

(౪౫౧) ఇఁకను కూశ్మాండప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు ॥ తిలలు, ఆజ్యము, స్వర్ణము, వస్త్రము, మాల్యము, అనువానితో మిశ్రితమైన కూశ్మాండములను మకరసంక్రమణమునం దైనను, కార్తికపౌర్ణమాస్యయం దయినను, ప్రతిగ్రహించుట మిగులదోషమని యెఱుంగవలయును. మఱియును నట్టిదానము వలనగలిగిన ప్రధానద్రవ్యమును వదలి సచేలస్నానమును జేసి గాయత్రీజపమును వేయిపర్యాయములు జేయవలయును రెండుకూశ్మాండములను ప్రతిగ్రహించినవాఁడు రెండువేల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, మఱియు నెన్నికూశ్మాండములను ప్రతిగ్రహించునో యన్నివేలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును-సువర్ణరూపమగు కూశ్మాండమును బ్రహ్మహత్యాపనుత్తికొఱకైనను, పుత్రార్థముగనయినను ప్రతిగ్రహించినవాఁడు ప్రధానద్రవ్యమునువదలి లక్షపర్యాయములు గాయత్రీ జపమును జేయవలయునని లింగ పురాణమునందుఁ జెప్పఁబడె ॥

— దశదానప్రతిగ్రహప్రాయశ్చిత్తం. —

(౪౫౨) అథ దశదానప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ కూర్మపురాణే॥ ప్రాయశ్చిత్తవ్రతే శాంతౌ ప్రతిష్ఠాసు మునీశ్వర । తటాకారామగ్రామాణాం తత్తత్పుణ్యప్రపూర్తయే ॥ దశదానానివిప్రేభ్యః ప్రత్యేకం ఫలసంఖ్యయా। దశదానాని ॥ గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడానిచ । రౌప్యంలవణమిత్యాహుః దశదానాన్యనుక్రమాత్ ॥ యేతత్ప్రతిగ్రహేవిప్రః ప్రాయశ్చిత్తం సుఖాప్తయే। తత్తదంగత్వాద్దోషబాహుళ్యం॥ తతఃప్రతిగ్రహీతౄణాం ప్రాయశ్చిత్తమాహ ॥ లైంగే॥ ధేనోఃప్రతిగ్రహేభూమేశ్చాన్ద్రమేకంవిశోధనం । తిలప్రతిగ్రహేతప్తకృచ్ఛ్రత్రయముదాహృతం ॥ పరాకంమునిభిఃప్రోక్తం సువర్ణస్యప్రతిగ్రహే । ఆజ్యప్రతిగ్రహేరాజన్ ప్రాజాపత్యంవిశోధనం ॥ వస్త్రప్రతిగ్రహేదేవీం జపేద్దశశతంబుధః। ధాన్యప్రతిగ్రహేతద్వత్ ॥ ద్రోణాదూర్ధ్వమేతత్ప్రాయశ్చిత్తం ॥ యస్య దానస్యయావత్పరిమాణముక్తం మయా పరిభాషాయాం తావత్పూర్ణంచేత్తదుక్తంప్రాయశ్చిత్తం ॥ అల్పంచేత్తత్తద్రవ్యస్య ప్రతిగ్రహే స్నాత్వాసహస్రంజపేత్॥ అత్రాపి ప్రత్యహం గోప్రతిగ్రహే పూర్వవత్ప్రాయశ్చిత్తంకుర్యాత్॥ భూదానేపి తథైవయోజనీయం॥ ఇతిదశదానప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౫౩) ఇకను దశదాన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు ॥ ప్రాయశ్చిత్తవ్రతమునందును, శాంతియందును, ప్రతిష్ఠలయం

దును, తటాకారామగ్రామముల యారంభాదికాలములయందును, దశదానములను జేయవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. గోవు, భూమి, తిలలు, హిరణ్యము, ఆజ్యము, వస్త్రము, గుడము, రౌప్యము, లవణము, ధాన్యము, అనుపదింటిని దానము చేయవలయును, ఇట్టి దానములను ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని యెఱుంగవలయును. ధేనుదాన భూదానములను ప్రతిగ్రహించిన వాఁడు చాంద్రాయణవ్రతము నవలంబింపవలయును, తిలప్రతిగ్రహమునందు మూఁడుతప్తకృచ్ఛ్రములనాచరింపవలయును, సువర్ణప్రతిగ్రహమునందుఁ పరాకకృచ్ఛ్రము నాచరింపవలయును, అజ్యప్రతిగ్రహమునందు ప్రాజాపత్య కృచ్ఛ్రమునాచరింపవలయును, వస్త్రప్రతిగ్రహమునందుఁ బదిసహారులపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, ధాన్యప్రతిగ్రహమునందును నిటులనే యాచరింపవలయును, ఏయే దానమున కెంత పరిమాణము చెప్పఁబడినదో యంత పరిమాణముగల దానిని ప్రతిగ్రహించినవాఁడే ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, అట్లుగాక యల్పపరిమితిగల దానమును ప్రతిగ్రహించిన వాఁడు స్నానమును జేసి వేయిపర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును, ప్రతిదినమునందును గోదాన భూదానములను ప్రతిగ్రహించిన వాఁడు పూర్వోక్తప్రాయశ్చిత్తమును ప్రతిదినమునందును నాచరింపవలయునని లైంగమునందుఁ జెప్పఁబడియె ॥

— చతుర్వింశతిమూర్తిప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. —

(౪౫౩) అథచతుర్వింశతి మూర్తి ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥

స్కాందే। బ్రహ్మహత్యాసురాపానం స్తేయంగుర్వంగనాగమః । విప్రద్రోహః ప్రజాద్రోహ ఆచండాలాద్ధనార్జనం ॥ ఉపేక్షా పాపినాం నృణాం పుణ్యకృత్సు శఠంతథా । చాపల్యం పరనారీషు పరద్రవ్యేషు లిప్సతా ॥ స్వజాతిం సమ్పరిత్యజ్య హ్యన్యజాతేః పరిగ్రహః । ద్విజిహ్వావార్తాశ్రవణే ప్రవృత్తిస్తత్ర సర్వదా ॥ హింసా పశుమృగాదీనాం మాతాపితృషు హింసనం । నిషిద్ధమృగమాంసానాం భక్షణం కుక్కుటస్యచ ॥ తథాదుర్జనసంసర్గస్సజ్జనత్యాగమేవచ । పుణ్యకాలేషు పుణ్యక్షేత్రేష్వదానం శ్రోత్రియేషు చ ॥ గీతనర్తనచాపల్యం సదా నిష్ఠురభాషణం । అగ్నిసాక్షిమదారేషు సత్స్వన్యస్యాః పరిగ్రహః ॥ ఉపవాసదినే భుక్తిస్తథా తాంబూలభక్షణం । పాషండజనసంసర్గో దేవబ్రాహ్మణదూషణం ॥ తీర్థదేవాలయే క్వాపి హ్యవిశ్వాసస్సదా భవేత్ । యేవమాదీని పాపాని రాజ్ఞాం పాపరతాత్మనాం ॥ విచార్య సహసా బుద్ధ్యా బ్రహ్మలోకపితా

మహాః । కృపయాపరయా తేషాంలోకానాం హితకామ్యయా ॥ చతుర్వింశతిమూర్తీనాం దానం పాపాపనుత్తయే । కల్పయామాస విశ్వాత్మా దక్షో రాజ్ఞాంముదాతదా ॥ కురుధ్వంపుణ్యకాలేషు దానాన్యేతానిసర్వదా । కరిష్యథమహత్పాపం నాలస్యంకర్తుమర్హథ ॥ ఓమిత్యుక్త్వాతథావాక్యం మాంధాతృప్రముఖాన్నృపాః । కుర్వంతివిప్రముఖ్యేభ్యో దానాన్యేతానిపత్రిశః ॥ తదాప్రభృతిలోకేస్మిన్ రాజానఃపుణ్యసంగమే । కుర్వంతిదానమఖిలంవిముక్తాఃపాపరాశిభిః ॥ కలౌయుగవిశేషేణ రాజానోదానశీలినః । భవేయుస్తే మహద్భ్యశ్చ పాపేభ్యోముక్తిమాప్నుయుః ॥ చతుర్వింశతి మూర్తీనామేకామేకాంయథేచ్ఛయా । యదికుర్వీతస్వర్ణేన సరాజాసుఖమశ్నుతే ॥ కూర్మపురాణే ॥ చతుష్పలప్రమాణేన మూర్తింకేశవరూపిణీం । సువర్ణేనైవరౌప్యేణ రాజా నిర్మితాంలక్షణాన్వితాం ॥ విప్రాయ వేదవిదుషే దరిద్రాయకుటుంబినే । అర్చితాంగంధవస్త్రాద్యైః పూజితాంనామభిఃపృథక్ ॥ దద్యాత్పుణ్యదినేప్రాప్తే సయాతిపరమాంగతిం । కేశవంపలమానేనసువర్ణేన విచక్షణః ॥ పూజయిత్వావిధానేన దద్యాద్విప్రాయధీమతే । స్వర్ణంవిమానమారుహ్యాప్సరోగణసేవితః ॥ ప్రాప్తేదైవైష్ణవంస్థానం పునరావృత్తిదుర్లభం । కేశవంప్రతిగృహ్ణీయాత్స్వామ్యం విప్రోదనాతురః ॥ దత్తంనృభిర్విధానేనసంసారకారణతయా నృప । అకృత్వాదానమపివా కుర్యాత్స్వోదరపూరణం ॥ తస్యైవపానివర్తార్థప్రష్టాస్నాత్వానిత్యంసమాహ్వచ । రహస్థానముపాగమ్య నామమంత్రయుజపంచరేత్ ॥ మాసందీక్షాముపాకృత్య భుంజన్యావకముత్తమం । ప్రత్యహంస్థండిలేసుప్త్వా మాసమాత్రేణశుద్ధ్యతి । జపేల్లక్షంతతఃపూత శ్శుద్ధోభవతిసర్వదా ॥ యేతద్దానస్యసామ్యత్వా ద్దానాభావే లక్షమాత్ర నామమంత్ర యుజపాత్పూతో భవతి ॥ ఏవంనారాయణాదీనాం మూర్తీనాంప్రతిగ్రహేఆధానాద్యకరణే లక్షమాత్రనామమంత్రయోణశుద్ధిః ॥ అథవాఇష్టాపూర్తాదికంకృత్వా నప్రాయశ్చిత్తం ॥ తటాకారామదేవాలయాద్యర్థం ప్రతిగ్రహః నస్వోదరపోషణార్థం ప్రతిగ్రహః ॥ ఇతిచతుర్వింశతిమూర్తిప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౫౩) ఇకను చతుర్వింశతి మూర్తిప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు ॥ బ్రహ్మహత్య, సురాపానము, దొంగతనము, గురుస్త్రీసంగమము, విప్రద్రోహము, ప్రజాద్రోహము, చండాలుర వలన ధనము నార్జించుట, పాపులగువారలయందు పేక్షను జేయుట, పుణ్యవంతుల యందు శఠత్వమునవలంబించుట, పరస్త్రీలయందు చాపల్యమును బొందుట పరద్రవ్యములయందాశను బొందుట, స్వజాతినివదలి యన్యజాతి పరిగ్రహము

నుజేయుట, ద్విజిహ్వవార్తాశ్రవణము, సర్వవిషయములయందును బ్రవర్తించుట, పశుమృగాదులనుహింసించుట, తల్లిదండ్రులనువిసిగించుట, నిషిద్ధములగు మృగమాంసాదులను భక్షించుట, కుక్కుట మాంసమును భక్షించుట, దుర్జనసంసర్గమును జేయుట, సజ్జనపరిత్యాగమును జేయుట, పుణ్యకాలములయందును, పుణ్యనక్షత్రమునందును, శ్రోత్రియులకు దానము సేయకుండుట, గీతనర్తనచాపల్యము, సర్వకాలములయందును గర్వముగ మాటలాడుట, అగ్నిసాక్షికముగవరించిన భార్యలుండఁగ నన్యస్త్రీలను బరిగ్రహించుట, ఉపవాసదినములయందు భోజనతాంబూలములను భక్షించుట, పాషండజనసంసర్గము, దేవబ్రాహ్మణనింద, తీర్థములయందును, దేవాలయములయందును, విశ్వాసములేకయుండుట, మొదలగు పాపములనువిచారించి బ్రహ్మదేవుఁడు చతుర్వింశతిమూర్తి దానములనునిర్మించె. అనంతరమందుఁ బుణ్యకాలములయందీ దానములను జేయవలయుననివిధించె. ఈవిషయమునకు మాంధాతాది భూమి పతులందఱును నంగీకారమును బొందిరి, అదిమొదలు కొని రాజులు పుణ్యకాలములయందు చతుర్వింశతి మూర్తిదానములను జేయుచున్నారు, ఇట్టిదానములను జేయుటచేతఁ బుణ్య లోకములను బొందుదురని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. నాలుగుపలముల ప్రమాణముగల బంగారముచేత కేశవమూర్తిని నిర్మించి వేదవేత్తయును, దరిద్రుఁడును, కుటుంబవంతుఁడును, నగుబ్రాహ్మణునకు దానము సేయవలయును, ఇట్టి దానమును జేసినవాఁడు పునరావృత్తి రహితమైన విష్ణులోకమును బొందును, నిష్కారణముగ ననఁగా, కేవలస్వోదర పోషణ కొఱకు నిట్టి దానమును ప్రతిగ్రహించిన వాఁడు స్నానమును జేసి నిత్యకర్మను సమాప్తినిబొందించి పిమ్మట నేకాంతస్థానమునఁగూర్చుండి నామత్రయజపమును జేయవలయును- ఇట్లు మాసముదినములు దీక్షనవలంబించి చేయుచు యావకాహారుఁడుగావలయును- ప్రతిదినము నందును స్థండిలశాయిగావలయును- ఇవ్విధముగ మాసము దినములలో లక్షపర్యాయములు జపమును జేసిన యెడల పరిశుద్ధుఁడగును- ఇట్లుగాదేని యిష్టాపూర్తాదికమును జేసినయెడలఁ బరిశుద్ధుఁడగునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె-

— దశావతారప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్- —

(౪౫౪) అథ దశావతార ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః॥ మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోథవామనః। రామో

రామశ్చరామశ్చబుద్ధఃకల్కీతథైవచ॥ జయంతీదివసేనాపి ఉతపుణ్యాగమేపి వా। శయనోత్థానద్వాదశ్యోర్మన్వాదిషుయుగాదిషు॥ దశరూపాణి కృత్వైవ సువర్ణేనవిచక్షణః। పలద్వయసువర్ణేన ప్రత్యేకంప్రతిమాస్తయోః॥ మత్స్యావతారమాలిఖ్య పూజయిత్వావిధానతః। దద్యాదధ్యాత్మవిదుషే తస్యపుణ్యంనిశామయ॥ మాతృతఃపితృతశ్చైవ కులకోటిసమన్వితః। వైకుంఠే నియతింకృత్వా తతోనిర్వాణమశ్నుతే॥ ఏవమన్యావతారాణాం తత్తదుక్తదినేషుచ। దద్యాద్యదీహవిప్రాయ పూర్వవత్పుణ్యమశ్నుతే॥ అర్చితాంప్రభుభిర్దత్తాం విప్రోభోగపరాయణః। ప్రతిగృహ్యాత్మభోగార్థం సవిప్రో భువినిందితః॥ ఆధానంవాతటాకాదీనకృత్వాదేవవంచకః। సయాతినరకంఘోరంకాలసూత్రమవాఙ్ముఖః॥ చతుర్వింశతిమతే॥ సౌమ్యప్రతిగ్రహస్త్వేషఇతిబుద్ధ్యావిచారయన్। అశనాచ్ఛాదనేదద్యో వృథాభోగపరాయణః॥ అకృత్వాధర్మనిలయం యోవిప్రస్తంనసంస్పృశేత్। తస్మాత్పాపవిశుద్ధ్యర్థం నిష్కృతింపాపమోచనీం॥ ప్రాతస్స్నాత్వాయథాకాలం నిత్యకర్మసమాప్యచ। సాలగ్రామేఽథవారాజన్ ప్రతిమాయాంవిధానతః॥ పంచామృతైఃపంచమన్త్రైః మత్స్యేమత్స్యేనివేదనం। అభిషిచ్యపునర్దేవం పంచవారందినేదినే॥ చతుర్థకాలేచర్వాశీస్వపేత్ స్థండిలదేశతః॥ పరేద్యుఃప్రాతరుత్థాయ పూర్వవద్విధిమాచరేత్॥ ఏవంమాసంవ్రతంకృత్వా పంచగవ్యంపిబేత్తతః। గోదానంతత్ర కుర్వీత ప్రాయశ్చిత్తాపపత్తమే॥ ఏకేనద్రవ్యేణాభిషిచ్యతతోజలేన స్నాపయిత్వామత్స్యే ధూపదీపనైవేద్యాంతం కృత్వాపునరన్యేనద్రవ్యేణ పూర్వవదభిషిచ్యసర్వం పూర్వవత్కుర్యాత్॥ ఏతత్ప్రాయశ్చిత్తం దశావతార ప్రతిమాప్రతిగ్రహే వేదితవ్యం॥ ఏకప్రతిమాప్రతిగ్రహే దినత్రయం ప్రత్యేకాభిషేకః॥ ద్వయోస్త్రయోశ్చైవం దినసంఖ్యాక్రమేణాభిషేచనీయం॥ ఏతద్దానస్యసౌమ్యప్రతిగ్రహత్వాదల్పప్రాయశ్చిత్తముక్తం॥ ఇతిదశావతారప్రతిమాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౫౪) ఇఁకను దశావతార ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ నారాయణుఁడు, మత్స్యకూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, రామ, రామ, బుద్ధ, కల్కులను నామములగల యవతారములనవలంబించె. ఇట్టి దశావతారప్రతిమలను బంగారముచేత నిర్మించి పుణ్యకాలములయందు దానమును జేయవలయును. ఇట్టి దానమును జేసినవాఁడు మాతాపితృకులములయందలి వారితోఁ గోటిమందితోఁగూడ వైకుంఠలోకమునందు నివసించును. ఇటువంటి దానములను లోభబుద్ధిచేత స్వభోగ

ముకొఱకుఁ బ్రతిగ్రహించినవాఁడు కాలసూత్రమను నరకమును బొందునని మార్కండేయుఁడు వచించె. దశావతారదానమును సౌమ్యమైనదని తలఁచిభోగపరాయణుఁడై ప్రతిగ్రహించిన బ్రాహ్మణుని స్పృశింపఁ గూడదు. కావున నిట్టిపాపనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనినఁ బ్రాతఃకాలమునందు స్నానమును జేసి నిత్యకర్మలను సమాప్తిని బొందించి సాలగ్రామమునకైనను, ప్రతిమకైనను పంచామృత స్నానమును జేయవలయును. మధ్యమధ్యనివేదనను జేయవలయును. ఇట్లు దినదినమందును నైదుపర్యాయము లభిషేచనమును జేసి నాల్గవకాలమునందు స్థండిలశాయిగావలయును. పరదినమునందును నిటులనేయాచరింపవలయును. ఇవ్విధముగ మాసముదినములు వ్రతమునాచరించి వ్రతాంతమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. పిమ్మట గోదానమును జేయవలయును. తొలుత నొకద్రవ్యముచేత నభిషేచనము సేసి పిమ్మట జలముచేత స్నాపనను జేసిమధ్యమందు ధూపదీపనైవేద్యములనిచ్చి మరల రెండవద్రవ్యముచేతఁ బూర్వమువలె నభిషేచనాది కృత్యములనన్నింటిని సమాప్తిని బొందింపవలయును. దశావతారప్రతిమాప్రతిగ్రహమునం దీప్రాయశ్చిత్తము నాచరింపవలయును. ఒకటేప్రతిమనుమాత్రము ప్రతిగ్రహించిన యెడల మూఁడుదినములు మాత్రము ప్రత్యేకాభిషేకమును జేయవలయును. రెండుప్రతిమలను ప్రతిగ్రహించిన యెడల నారుదినములాచరింపవలయును. ఈదానము సౌమ్యమైనది. కావున నల్పప్రాయశ్చిత్తము విధింపఁబడియెనని చతుర్వింశతి మతమునందుఁ జెప్పఁబడియె.

—— రామలక్ష్మణప్రతిమాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ——

(౮౫౫) అథ రామలక్ష్మణ ప్రతిమా ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ ద్విజో యో భోగలోభార్థం పత్నీపుత్రవశంగతః। చాతుర్మాస్యేపుణ్యకాలే గృహ్ణీయాద్రామలక్ష్మణౌ॥ అర్చితౌ గంధవస్త్రాద్యైః స్వర్ణరూపావరిందమౌ। కల్పోక్తవిధినా రాజన్ ప్రతిగృహ్యసుఖాప్తయే॥ తేనాథానంతటాకాదీన్ కృత్వాముక్తిపదం వ్రజేత్। అన్యథాదోషమాప్నోతి ప్రాయశ్చిత్తీభవేత్తదా॥ ఏతదుక్తప్రతిగ్రహవిషయం॥ తద్వ్యతిరిక్త ప్రతిమాప్రతిగ్రహవిషయే నత్వాధానాదికం। ఉక్తద్రవ్యప్రతిమాప్రతిగ్రహే తత్తద్ధర్మాకరణే ప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ ద్విజో యస్తూక్తమార్గేణ ప్రతిమాసమ్ప్రతిగ్రహే। ధర్మాదికం పరాకృత్య ప్రాయశ్చిత్తమిదంచరేత్॥ చైత్రశుద్ధనవమ్యాంతు ఉపస్నాత్వాజితేంద్రియః। నిత్యకర్మవిధాయాశు గంధపుష్ప

నివేదనైః॥ తథైవాష్టసుయామేషు పూజయేద్రామలక్ష్మణౌ। పరేద్యుః ప్రాతరుత్థాయ పూర్వవత్స్నానమాచరేత్॥ అభ్యర్చ్య పఠివద్భక్త్యా తతో హోమంసమాచరేత్ । స్వగృహ్యాగ్నిం ప్రతిష్ఠాప్యహ్యాజ్యభాగాంతమాచరేత్॥ తిలైశ్చవిరజాహోమం కృత్వాశుద్ధిమవాప్నుయాత్ । బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాద్యథావిభవసారతః॥ అల్పసువర్ణప్రతిగ్రహేనవమ్యామేకవారం పూజయిత్వాపరేద్యుర్విరజాహోమంకుర్యాత్ । ఏతేనమహాపాతకనివృత్తిర్భవతీతి॥ ఇతిరామలక్ష్మణప్రతిమాప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౫౫) ఇఁకను రామలక్ష్మణప్రతిమాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ పత్నీపుత్రాదివశంగతుఁడై లోభబుద్ధిచేతఁ బుణ్యకాలములయందు రామలక్ష్మణ ప్రతిమలను ప్రతిగ్రహించినబ్రాహ్మణుఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనిన యెడలఁ బావనుఁడగును. ఇట్టి దానమును విధ్యుక్తప్రకారముగఁ జేసినవాఁడు ముక్తిపదమునుబొందునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. పుణ్యకాలములయందు రామలక్ష్మణ ప్రతిమలనుప్రతిగ్రహించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనఁ జైత్రశుద్ధనవమినాటి ప్రాతఃకాలమునందు స్నానమును జేసి జితేంద్రియుఁడై నిత్యకర్మను సమాప్తినిబొందించి గంధపుష్పాక్షతాదులచేత నెనిమిది యామములయందును రామలక్ష్మణప్రతిమలను బూజింపవలయును. పరదినమునందును నిటులనే చేయవలయును. అనంతరమందు స్వగృహ్యసూత్రోక్తప్రకారముగ నాజ్యభాగాంత హోమమును జేయవలయును. అనంతరమందుఁ దిలలచేత విరజాహోమమును జేయవలయును. ఇవ్విధముగ నాచరించిన యెడల పరిశుద్ధుఁడగును. మఱియును బ్రాహ్మణ సమారాధనను జేయవలయును. అల్పసువర్ణప్రతిగ్రహమునందు నవమియందొకసారియము పూజను జేసి పరదినమునందు విరజాహోమమును జేయవలయునని లైంగమునందుఁ జెప్పఁబడియె.

## —— చక్రపాణిప్రతిగ్రహీతుఃప్రాయశ్చిత్తమ్. ——

(౪౫౬) అథచక్రపాణి ప్రతిగ్రహీతుః ప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ చక్రపాణిం ద్విజోయస్తు ప్రతిగృహ్యసమర్చయేత్। తన్మధ్యంకాశికాక్షేత్రం తద్గృహంద్వారకోపమం॥ తత్తీర్థంగంగయాతుల్యం తత్పిత్వాను నుజోభువి। సర్వపాపవినిర్ముక్త స్సయాతి పరమంపదమ్॥ చక్రపాణింద్విజో మోహాత్ప్రతిగృహ్యైవవిక్రయేత్। సమాత్యఘాతకఃప్రోక్త స్సర్వకర్మబహిష్కృతః॥ బ్రాహ్మణ [illegible] కావాం దేవం దేవమంద్విజో యది । విక్రీ

యిత్వా మహాపాప మవాప్నోతిసుదారుణం॥ చక్రపాణివిక్రయే సాలగ్రామవిక్రయవత్సర్వంప్రాయశ్చిత్తంకుర్యాత్॥ ఇతిచక్రపాణి ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౮౫౬) ఇఁకను చక్రిపాణిప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడు చక్రపాణిని ప్రతిగ్రహించి యర్చనను జేయవలయును. అట్టి చక్రపాణిని బూజించు గృహము ద్వారకోపమైనది. ఆతీర్థము గంగతోఁ దుల్యమైనది- కావున నాతీర్థమును దానము సేసినవాఁడు సర్వపాపరహితుఁడై పరమపదమును బొందును- చక్రిపాణిని బ్రతిగ్రహించి యవివేకముచేత నాచక్రిపాణిని విక్రయించినవాఁడు మాతృఘాతకుఁడగును- మఱియును సకల కర్మబహిష్కృతుఁడగును- బ్రహ్మసూత్రమును, గురువును, కన్యను, దేవుని, ధేనువును, విక్రయించిన బ్రాహ్మణుఁడు మిగుల దారుణమగు పాపమును బొందును- చక్రపాణి విక్రయమునందును, సాలగ్రామవిక్రయమునందును విధించిన ప్రాయశ్చిత్తమునే దీనియందును విధింపవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె-

శ్రీమూర్తిప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౮౫౭) అథశ్రీమూర్తిప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురాణే॥ విద్యమానధనోవిప్రస్త్వకించనఇవార్జనే। యాచయిత్వాశిలాంసాలగ్రామరూపాం మహ్యాన్మతిమ్॥ ప్రతిగృహ్యమహాయత్నాత్తత్పూజావిముఖో యది। విక్రయేద్యదిమూఢాత్మాభవేత్సోనరాధముఃఖలః॥ లింగపురాణే॥ సాలగ్రామశిలాంవిప్రః ప్రతిగృహ్యప్రయత్నతః। తదర్చనంపరాకృత్య విక్రయేద్యదిమూఢధీః॥ సవైనరకభుక్పాపీఘుణస్తమ్బేప్రజాయతే। తస్యపాపవిశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తంనిదర్శితం॥ పంచరాత్రముపస్నాత్వా ప్రాతస్సంధ్యాదికంచరేత్। పంచగవ్యంపిబేత్పశ్చాత్పంచమంత్రైరనుక్రమాత్॥ పృథక్ పృథక్ప్రాశయిత్వా శుద్ధోభవతినిశ్చయః। పలమేకంతుగోమూత్రం పలార్ధంచైవగోమయమ్॥ క్షీరమష్టపలందద్యాత్త్రిపలందధిసేవనమ్। సర్పిరేక పలంగ్రాహ్యం పంచరాత్రమతంద్రితః॥ గాయత్ర్యాచైవగోమూత్రంగంధద్వారేతిగోమయమ్। ఆప్యాయస్వేతిచక్షీరం దధిక్రావ్ణేతివైదధి॥ దేవస్యత్వేతిమంత్రేణపిబేదాజ్యమనంతరం ఏతేనశుద్ధిమాప్నోతి విక్రయిత్వాశిలాంద్విజః॥ నోచేదిదంనకర్తవ్యం తత్పూజాసర్వపాపహా। సాశిలాయస్యగేహస్థా గయాక్షేత్రంతు తద్గృహమ్॥ సాలగ్రామశిలాంయస్తు కోమలైస్తులసీదలైః। అర్చయేద్యదదుష్టాత్మా సర్వపాపైః ప్రముచ్యతే। [illegible] ప్రాయశ్చిత్తం తద్విక్రేతుర

వా॥న ప్రతిగ్రహీతుః॥ ఇతి శ్రీమూర్తిప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౮౫౭) ఇఁకను శ్రీమూర్తిప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ ధనవంతుఁడైన బ్రాహ్మణుఁడు మిగులగొప్పదగు సాలగ్రామశిలను యాచించి ప్రతిగ్రహించినవాఁడు పూజావిముఖుఁ డగును. అట్టి సాలగ్రామమును విక్రయించెనేని మిగుల దుర్మార్గుఁడైపుట్టునని దేవీపురాణమునందుఁ జెప్పఁబడియె- సాలగ్రామశిలను ప్రతిగ్రహించి యాసాలగ్రామశిలకుఁ బూజాదికమును జేయనివాఁడు ఘోరనరకము లనుభవించును. అటువంటి పాపవిశుద్ధికొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన నెనుదినములు ప్రాతఃకాలమునందు స్నానమునుజేసి ప్రాతస్సంధ్యావందనమును జేసి మంత్రపూర్వకముగఁ బంచగవ్యప్రాశనను జేయవలయును. అట్లు పంచగవ్యములలోఁ బ్రతిదానిని వేరువేరుగఁ బానమును జేయవలయును. గోమూత్రమును పలప్రమాణమును, గోమయమును నర్ధపలమును, క్షీరముల నెనిమిది పలములను, మూడుపలముల పెరుగును, ఒక్కపలము నెయ్యిని, పానముగ సేవింపవలయును. గాయత్రిచేత గోమూత్రమును, "గంధద్వారా,, అనుమంత్రముచేత గోమయమును, "ఆప్యాయస్వ,, అను మంత్రముచేత క్షీరమును, "దధిక్రావ్ణ్ణో,, అనుమంత్రముచేతఁ బెరుగును, "దేవస్యత్వ,, అను మంత్రముచేత నేతిని పానముసేయవలయును. సాలగ్రామశిలను ప్రతిగ్రహించి విక్రయించినవానికి ప్రాయశ్చిత్తము విధింపఁబడినదిగాని ప్రతిగ్రహించి పూజించువానికిఁ గాదని యెఱుంగవలయును. సాలగ్రామశిలలుగల గృహము గయాక్షేత్రమని చెప్పఁబడును. సాలగ్రామశిలను తులసీదళములచేతఁ బూజించినవాఁడు సర్వపాపరహితుఁడగునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె.

—— * శివలింగప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్- * ——

(౮౫౮) అథ శివలింగప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ మరకతంస్ఫటికంలింగం శిలారూపం ద్విజోత్తమ। ప్రతిగృహ్యప్రయత్నేనహ్యుభయోస్తారకంద్విజః॥ అవిక్రీయగృహేస్థాప్య పూజయిత్వాదినేదినే। తస్యపుణ్యంనిగదితుంమయా బ్రహ్మన్నశక్యతే॥ లింగంశిరోనతంశుద్ధం పంచసూత్రానుమోదితమ్। పూజయేద్యదిపూతాత్మాసపాపాత్పరిముచ్యతే॥ శివరాత్ర్యాంచతుర్దశ్యాం చాతుర్మాస్యవ్రతాదిషు। ప్రతిగృహ్య సమర్థోపివిక్రీణేద్యదిపాపధీః॥ తత్ఫలంనాశమాయాతి యమలోకమవాప్నుయాత్। లింగవిక్రేతుః ప్రా[illegible]  ద్య బహుభిర్య

త్రైణ ప్రతిగృహ్యానరో త్తమాత్ । విక్రయిత్వాద్విజో మోహాత్కాలకూటం సమశ్నుతే॥ నతస్యపునరావృత్తి ర్యమలోకాత్కదాచన। పారణ్ని నిర్జనంగత్వా స్నాత్వా ప్రాతర్యథావిధి॥ లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య సమిద్ధాగ్నౌహునేద్ధవిః । అయుతంప్రత్యహంచైవ చరుణాజ్యంతిలైస్సహ॥ త్రియమ్బకేన మన్త్రేణ నియమాశనపూర్వకం। యావదస్తమయంయాతి సంఖ్యాతావత్ప్రపూర్యతే॥ ఫలాహారంతతఃకుర్యాత్ స్వపేద్దేవమనుస్మరన్। ఏవంకుర్యాత్పంచరాత్రం పంచాయుతమతంద్రితః॥ పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవతినాన్యథా॥ ఇతిశివలింగప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౫౮) ఇఁకను శివలింగ ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ మరకత లింగము నైనను, స్ఫటికలింగము నైనను, ప్రతిగ్రహించి స్వగృహమునందు స్థాపించి దినదినమందును బూజించువాని పుణ్యమును జెప్పుటకు బ్రహ్మదేవుఁడు గూడ శక్తుఁడుగాఁడు. శివరాత్రియందైనను, చతుర్దశియందైనను, చాతుర్మాస్యవ్రతాదుల యందైనను, శివలింగమును విక్రయించినబ్రాహ్మణుని కులమంతయును నాశమును బొందును. మఱియు ననేక నరకముల ననుభవించునని స్కాంద పురాణమునందుఁ జెప్పఁబడియె. అనేకములగు ప్రయత్నములచేత లింగమును సంపాదించి యవివేకాదుల వలన విక్రయించినవాఁడు కాలకూటమను నరకమును బొంది యానరకమునుండి పునరావృత్తి లేనివాఁడగును. కావున నట్టి పాపశాంతి కొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన నిట్టికృత్యమును జేసినవాఁడు నిర్జనవనమునకుఁ బోయి ప్రాతఃకాలమునందు శాస్త్రోక్త ప్రకారముగ స్నానమును జేసి లౌకికాగ్నిని ప్రతిష్ఠఁ జేసి హవిర్హోమమును జేయవలయును. మఱియును దినదినమందును తిలలతోఁగూడఁ బదివేల పర్యాయములు చరుహోమమును జేయవలయును. ఇట్లు సూర్యాస్తమయమగునక "త్రియంబక,, అను మంత్రముచేత హోమమును జేయవలయును. ఇవ్విధముగ నైదుదినములుసేసి పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేసినఁ బరిశుద్ధుఁడగునని మార్కండేయుఁడు చెప్పె.

శంఖప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్-

(౪౫౯) అథశంఖప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ ప్రతిగృహ్యద్విజశ్శంఖం దేవపూజార్థమాదరాత్। సలక్షణంచసాగ్రంచ పుణ్యాలోకపర్వసు॥ విక్రీయొద్యాది మోహాత్మా యమలోకంసమశ్నుతే । శంఖదర్శనమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే॥ తం విక్రయిత్వా ... హేన సపాపీనభ

వేతిత్రిమ॥ ఏతస్యనిష్కృతిరియంకథితామునివల్లభైః॥ స్నాత్వాహరిదినేశుద్ధః కృతంపాపమనుస్మరన్। ఉపవిశ్యశుచౌదేశే విష్ణోర్నామ్నాం సహస్రకం॥ ప్రాతరారభ్యసహసా యావత్సూర్యోదయోభవేత్। తావజ్జపిత్వానామాని పఠేద్యురుదయేత్యజేత్॥ స్నాత్వాపునస్తుద్వాదశ్యాం పంచగవ్యంపిబేన్మదా। పారణాంచతతఃకుర్యాచ్ఛుద్ధిమాప్నోతిపార్థివః॥ ఇతిశంఖప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౮౪౯) ఇంకను శంఖప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడు శంఖమును దేవపూజను, అత్యాదరముచేతఁ బ్రతిగ్రహించి పుణ్యకాలములయందును, పర్వములయందు మోహాత్మునైౖ విక్రయించినబ్రాహ్మణుఁడు యమలోకమును బొందును. శంఖదర్శనమాత్రముచేత సర్వపాపములనుండి తొలఁగినవాఁడగును. కావున నట్టి శంఖమును విక్రయించినవాఁడు పాపవంతుఁడగు ననుటకు సందియములేదుగదా? కాఁబట్టి యిట్టివాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అది యెట్లనిన హరిదినమునందు స్నానమునుజేసి చేసినపాపమును స్మరించుచుఁ బరిశుద్ధమగు దేశమునందు విష్ణుదేవునియొక్క సహస్రనామములను ప్రాతఃకాలము మొదలుకొని మరల సూర్యోదయమగు వఱకును జపింపవలయును. మరుదినమునందనఁగా ద్వాదశియందు స్నానమునుజేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. అనంతరమందు పారణను జేయవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె.

——* ఘంటాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. *——

(౮౫౦) అథఘంటాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ ప్రతిగృహ్యద్విజోఘంటాం ధూపపాత్రంచసాధనం। వేదికాందేవపాత్రంచస్నానపాత్రంతథైవచ॥ సమర్థఃప్రతిగృహ్యాదౌ ధనార్థంవిక్రయేదిమాన్। సవైనరకమాసాద్య త్రిశోగోపాహిజాయతే॥ స్కాందే॥ ధూపపాత్రంచ ఘంటాంచ స్నానపాత్రంచవేదికాం। దీపసాధనపాత్రాణి సమర్థఃప్రతిగృహ్యచ॥ విప్రోధనవిమోహార్థీ విక్రయేద్యదిమూఢధీః। సవైనరకమాసాద్యత్రిశోగోపోహిజాయతే॥ తస్యనిష్కృతిరుత్పన్నా మునిభిస్సత్యవాదిభిః। ప్రాతస్స్నాత్వా శుచిర్భూత్వా దేవాగారంవిశేత్తతః॥ ఉపలిప్యతదగ్రేతు రంగవల్ల్యాద్యలంకృతమ్। పాలాశసమిధస్తత్రసనిషేచ్ఛతసంఖ్యయా॥ స్వగృహ్యాగ్నిం ప్రతిష్ఠాప్య హ్యాజ్యభాగాంతమాచరేత్। తద్విష్ణోరితిమంత్రేణ జుహుయాత్సమిధఃక్రమాత్॥ ఆజ్యంచతత్రహోతవ్యం చరుస్స్రావాంశ్చసంఖ్య

యా। యావద్భానుస్సాయమేతి తదాహారంసమాచరేత్॥ స్వపేద్దేవ సమీపేతు పునఃప్రాతఃప్రబోధయేత్ । తత్రాపిపూర్వవత్కృత్వా మండలం యత్రపూర్యతే॥ తదావిరమ్యనియమం పంచగవ్యంపిబేత్తతః। ఘంటాది విక్రయోత్తాత ప్రాయశ్చిత్తమిదంస్మృతమ్॥ నతస్మాత్ప్రతిగృహ్ణీయా దన్నంవాజలమేవవా। యదిమోహాత్ప్రతిగ్రాహీ పంచగవ్యంపిబేత్తతః॥ ఇతి ఘంటాదివిక్రేతుఃప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౬౦) ఇఁకను ఘంటాప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుండగువాఁడు, ఘంటను, ధూపపాత్రను, వేదికను, దేవపాత్రను, స్నానపాత్రనుప్రతిగ్రహించి పిమ్మట ధనలోభముచేత విక్రయించెనేని నరకలోకమును బొందును. అనంతరమందు గోపకుఁడయిపుట్టునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. స్కాందపురాణమునందును నిటులనే చెప్పఁబడియె. మఱియును ప్రాయశ్చిత్తవిధానముగూడఁ జెప్పఁబడియె. అదియెట్లనినఁ బ్రాతఃకాలమునందు స్నానమును జేసి దేవాలయమునకుఁబోయి యచ్చట రంగవల్లిచేత నలంకరించి పాలాశసమిధల నచ్చటనుంచిగృహ్యాగ్నిని బ్రతిష్ఠించియాజ్యభాగాంతమును నాచరింపవలయును. అనంతరమందు "తద్విష్ణోః,, అనుమంత్రముచేతఁ గ్రమముగసమిధలనుహోమముసేయవలయును. ఇటులనే యాజ్యచరుహోమములను జేయవలయును. సూర్యాస్తమయముదనుక నిట్లుసేసి దేవసమీపమునందే నిదురను బొందవలయును. మరల బ్రాతఃకాలమునందు నిద్రను మేలుకొంచి పూర్వదినమునందువలెనే చేయవలయును. ఇట్లునలుబదిదినములుసేసి పిమ్మట బంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్లు ఘంటాదులను విక్రయించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసి కొనకమునువు, అట్టి వానివలన నన్నోదకాదికమును గ్రహింపగూడదు. అవివేకమువలన గ్రహించెనేని పంచగవ్య ప్రాశనను జేయవలయునని యును స్కాంధపురాణమునందే చెప్పబడియె.

— తామ్రపాత్రప్రతిగ్రహీతుఃప్రాయశ్చిత్తమ్. —

(౪౬౧) అథ తామ్రాదిపాత్రప్రతిగ్రహీతుః ప్రాయశ్చిత్తమాహ॥ దేవీపురాణే॥ తామ్రపాత్రంద్విజోయస్తుపుణ్యకాలేమపర్వసు। ప్రభుమాత్రాత్వృధాగ్రాహీసవైనరకమశ్నుతే॥ తదంతేభువమాసాద్య బృహద్వృషణవాన్భవి॥ కౌర్మే॥ తామ్రంయదిద్విజోలాభాద్వృషాయఃకారణంవినా। పుణ్యకాలేమపుణ్యే(ష్వ)ర్క్షేవ్యతీపాతేచవైధృతౌ॥ ధృత్వానరకమాప్నోతిబృహదండస్సజాయతే॥ మత్స్య[illegible]సంక్రాంతౌ వ్యతీపాతేచవై

ధృతౌ । తామ్రపాత్రంరాజదత్తం క్రూరదానమథాపివా ॥ ప్రతిగృహ్యామ
హాదుఃఖమవాప్యసభువస్థలె । బృహదండోథ వైశ్యాపీత స్మాదేతత్పరిత్యజేత్॥
ప్రాయశ్చిత్తమిదంకృత్వా శుద్ధిమాప్నోతిపార్థివీమ్ । తద్ద్రవ్యస్య చతుర్భా
గంబ్రాహ్మణాయనివెదయేత్ ॥ తెనము క్తైరాభ వెత్పశ్చాత్పంచగవ్యంపిబెత్త
తః । అన్నంజలంవా దానంవా శుద్ధిమిచ్ఛన్నసంగ్రహేత్॥ యదిదైవాత్సము
త్పన్నం పంచగవ్యంపిబెత్తతః ॥ ఇతి తామ్రపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౮౬౧) ఇకను తామ్రపాత్రను ప్రతిగ్రహించినవానికి జేయదగిన ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ పుణ్యకాలములయందును, పుణ్యదినములయందును, నిష్ప్రయోజనముగా దామ్రపాత్రను ప్రతిగ్రహించినవాడు నరకలోకమునుబొందును, మఱియును భూలోకమునందు బృహద్వృషణముగలవాఁడైపుట్టునని దేవీపురాణమునందుఁజెప్పబడియె. కూర్మపురాణమునందును నిటులనేచెప్పబడియె. మత్స్యపురాణమునందును నిటులనేచెప్పఁబడి ప్రాయశ్చిత్తవిధానముగూడ జెప్పబడియె. అదియెట్లనిన ప్రతిగ్రహింపబడిన ద్రవ్యమునందలి నాల్గవభాగమును బ్రాహ్మణునకు నివేదింపవలయును, పిదప పంచగవ్యప్రాశనను జేయవలయును, ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొననివానివలన నన్నాదికము నవిచేకముచే గ్రహించినవాఁడు పంచగవ్యప్రాశనను జేయవలయునని చెప్పబడినది॥

——❋ కాంస్యపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ❋——

(౮౬౨) అథ కాంస్యపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపు
రాణె॥ ధనిష్ఠాపంచకమృతేహ్యర్ధోదయమహోదయే । పుణ్యకాలేషుయః
కాంస్యం ప్రతిగృహ్ణాద్ద్విజోయది ॥ రౌరవంనరకంఘోరమనుభూయనరేశ్వ
ర । తదంతేభువమాసాద్యఝషజన్మాభవేత్తదా॥ లింగపురాణె॥ అష్టాశీతి
పలంకాంస్యం తదర్ధంవాతదర్ధకమ్ । పుణ్యకాలేద్విజోలాభాత్ప్రతిగృహ్య
ధనాతురః ॥ యమలోకముపాగమ్య నరకాంతేభువస్థలే । పునర్జననమా
సాద్య ఝషోభవతినిశ్చయః ॥ తత్పాపస్యవిశుద్ధ్యర్థంతచ్చతుర్థాంశమాద
రాత్ । దద్యాద్విజాతయేతాతతస్మాత్పాపాత్ప్రముచ్యతె ॥ తేనాన్నంవా
సువర్ణంవా జలంవావస్త్రమేవవా । ప్రతిగృహ్యదాదైవాత్పంచగవ్యంపి
బెత్తదా ॥ ఇతికాంస్యప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౮౬౩) ఇకనుకాంస్యపాత్ర ప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ధనిష్ఠాపంచకమరణమునందును, అర్ధోదయమహోదయములయందును, పుణ్యకాలములయందును, కాంస్యపాత్రను ప్రతిగ్రహించి

నబ్రాహ్మణుడు రౌరవమను ఘోరనరకమును బొంది పిమ్మట మత్స్యమై పుట్టునని దేవీపురాణమునందుఁ జెప్పబడెను. ఎనుబదేఁ మిది పలములకంచునైనను, నలుబదినాలుగు పలములకంచునైనను, పుణ్యకాలములయందుఁ బ్రతిగ్రహించినవాడు యమలోకమును బొంది పిమ్మట మత్స్యమై పుట్టును, కావుననట్టి పాపశాంతి కొఱకు ప్రాయశ్చిత్తమును జేసి కొనవలయును, అది యెట్లనినఁ బ్రతిగ్రహింపఁబడిన కాంస్యమునందు నాల్గవ భాగమును వ్యయము సేసి యనంతరమం పంచగవ్యప్రాశనను జేసిన యెడల పరిశుద్ధుఁడగునని లింగపురాణమునందు జెప్పబడెను ॥

——✻ తిలపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ✻——

(౪౬౩) అథ తిలపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః ॥ విష్ణుప్రీత్యై యమప్రీత్యై మ్రియమాణో గృహీ యదా । గ్రహాణామనుసారార్థం రోగాణాం త్యర్థమాదరాత్ ॥ తిలపాత్రం ద్విజే దద్యాద్దచ్ఛేశం తిలపూరితం । ద్విజో లోభేన మహతా ప్రతిగృహ్యాధనాతురః ॥ తత్పాపఫలమాసాద్య జాయతే హరిరేవ సః ॥ హరిర్మండూకః ॥ తద్దోషపరిహారార్థమయుతం జపమాచరేత్ । ఏతదల్పద్రవ్యవిషయం ॥ యథా శాస్త్రపరికల్పితతిలపాత్రప్రతిగ్రహే దోషమాహ ॥ గారుడపురాణే ॥ పాత్రం వింశత్పలం పూర్ణం ప్రస్థమాత్రతిలైస్సహ । పూజితం గంధవస్త్రాద్యైర్దక్షిణాభిర్యథోక్తతః ॥ ప్రతిగృహ్య ద్విజః పాపశుద్ధ్యర్థం శాస్త్రచోదితం । నియుతేన జపేద్దేవ్యాస్సంఖ్యాపూర్ణమతంద్రితః ॥ శుద్ధో భవతి దుష్టాత్మా పాపాదస్మాన్నరాధిప । పంచగవ్యం పూర్వవత్ ॥ తత్రాన్న జలధాన్యసంగ్రహే విప్రస్య పూర్వవత్ప్రాయశ్చిత్తం ॥ ఇతి తిలపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౬౩) ఇకను తిలపాత్రప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధాదికమును జెప్పుచున్నాడు ॥ విష్ణుప్రీతికొఱకును, యమప్రీతికొఱకును, రోగనివృత్తికొఱకును, తిలపాత్రను బ్రాహ్మణునికొఱకు దానమును జేయవలయును, అట్టి తిలపాత్రి దానమును లోభబుద్ధిచేత బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు తత్పాప ఫలమును బొందును, పిమ్మట ననేకనరకములను భవించి మండూకమై పుట్టును, కావునఁ దద్దోషపరిహారముకొఱకు పదివేల పర్యాయములు గాయత్రీజపమును జేయవలయునని మార్కండేయుఁడు పచించె. ఇది యల్పతిలపాత్రప్రతిగ్రహవిషయమని తెలిసికొనవలయును. ఇరువదిపలముల పరిమాణముగలదియును, ప్రస్థపరిమితతిలలతోఁగూడినదియునునగు తిలపాత్రను ప్రతిగ్రహించినవాఁడు నియుతసంఖ్యాక గాయత్రీజపముచేతఁ బరిశుద్ధుఁడగును. ఇట్టిదుష్టకార్యమును జేసి

ప్రాయశ్చిత్తమును జేసికొననివానివలన నన్నాదికమును ప్రతిగ్రహించినవాడు పంచగవ్యప్రాశనను జేయవలయునని గారుడపురాణమునందుఁ జెప్పబడియె॥

—— * ఆజ్యావేక్షణప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. * ——

(౮౬౪) అథఆజ్యావేక్షణ ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥మార్కండేయః ॥ నిరీక్షితాజ్యం యోధృత్వా కాంస్యపాత్రస్థితంముదా । తస్యాలక్ష్మీర్భవేన్నిత్యం నిర్భాగ్యో జాయతేభువి ॥ తద్దోషపరిహారార్థం ప్రధానం సంపరిత్యజేత్ । స్నాత్వాతదానీమన్యత్ర సహస్రంజపమాచరేత్॥ ఉపోష్య రజనీమేకాం పంచగవ్యంపిబేత్తతః । ఏతదల్పాజ్యప్రతిగ్రహవిషయం॥శాస్త్రాదారాధితస్య నిరీక్షితాజ్యస్య ప్రతిగ్రహే అయుతగాయత్ర్యా శుద్ధిః॥ఇత్యాజ్యావేక్షణప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ ॥

(౮౬౪) ఇకను, ఆజ్యావేక్షణప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు ॥ నిరీక్షితాజ్యముతోఁ గూడిన కాంస్యపాత్రను ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు నిర్భాగ్యుఁడైపుట్టును, కావున దద్దోష పరిహారము కొఱకు ప్రధానమును వదలి యప్పుడే స్నానమును జేసి పిమ్మట వేయి పర్యాయములు గాయత్రీజపమును జేయవలయును, పిమ్మట నొక్కదిన ముపవసించి పంచగవ్య ప్రాశనను జేయవలయును, ఇది యల్పాజ్యప్రతిగ్రహ విషయమని యెఱుంగవలయు ననియును, మార్కండేయమునివరుఁడు చెప్పె. శాస్త్రముచేత నారాధితమైన నిరీక్షితాజ్యమైన యాజ్యము యొక్క ప్రతిగ్రహమునందు పదివేలపర్యాయములు గాయత్రీజపమును జేయవలయును॥

— హరిహరప్రతిమాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. —

(౮౬౫) అథహరిహరయోగె హరిహరప్రతిమాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ మార్కండేయః ॥ ఖరసంవత్సరే రాజన్ కార్తికే పూర్ణిమాదినే ; యోగో హరిహరోనామసర్వ పాపప్రణాశనః ॥ క్రతుకోటిసమోయోగః గంగా స్నానాయుతం సమం । మహాపాతక సంఘాతదావానలసమోమునే ॥ తత్రస్నానాని దానాని పితృశ్రాద్ధం మహత్తరం॥ యోగె తత్ర యదారాజన్ బ్రాహ్మణోవా జనాధిపః ॥ హరిం హరంస్వర్ణమయం గంధవస్త్రాక్షతాదిభిః । పూజయిత్వా జాగరిత్వా విప్రాయాధ్యాత్మవేదినే ॥ దద్యాద్యదిసపూతాత్మా ముక్తిమాప్నోతి పార్థివ॥ లింగపురాణే॥యోగె హరిహరె రాజన్ బ్రాహ్మణోవా జనాధిపః । యోవా కోవా ధనీ లోకె పూజయిత్వా హరిం హరమ్ ॥ జాగరిత్వా తదా రాత్రిం ప్రదద్యుర్విధిపూర్వకం । అస్పృయిత్వా ద్విజాగ్ర్యాయ దద్యాద్దక్షిణయాసహ ॥ తస్య

పుణ్యఫలం వక్తుంమయా బ్రహ్మన్నశక్యతే । సతస్యపునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన ॥ ముక్తిస్థానాని చత్వారి కలౌ పాపరతాత్మనామ్।అన్నమాత్రే పరిగ్రాహీ నచలౌకిక సాధనే ॥ పరిత్యజన్ లోకవార్తాంసవిప్రోముక్తిమాప్ తథా । అంత్యకాల ఉపాయాంతే మనసాన్యాన్నసంస్మరన్॥ నారాయణం సముచ్చార్య సవైముక్తిపదం వ్రజేత్। బ్రహ్మజ్ఞానీ సదాశాస్త్రం వేదాంతం పర్యాలోచయన్ ॥ సఏవ ముక్తిభాగ్విప్రోన్యాద్వయంసంస్మరన్ ముదా। ఉతయోగం హరిహరం సాధయేద్యద పుణ్యవాన్॥సఏవ ముక్తిమాప్నోతి యోవాకోవా భువస్థలే। చత్వార్యేతాని రాజేంద్ర ముక్తిస్థానాని సర్వదా ॥ ధనసాధ్యమిదంరాజన్ నకాయక్లేశ సాధనం। తతో హరిహరేయోగె యోవిప్రో భోగలోలుపః ॥ ప్రతిగృహ్యానరోయస్మాత్సప్తతంతుపరాఙ్ముఖః। సతు పాపం మహాఘోర మనుభూయ భువస్థలే ॥ స్థావరత్వ మవాప్నోతి తస్మాదె తత్పరిత్యజేత్ ॥ కౌర్మే ॥ యోగె హరిహరేవిప్రః ప్రతిగృహ్యధనాతురః। సతు పాపం మహాఘోర మనుభూయ భువస్థలే ॥ స్థావరత్వం భజెల్లోకే యావదా భూతసంప్లవంప్రాయశ్చిత్తమిదం రాజన్ మునిభిఃపరికీర్తితం ॥ ధాన్యం చర్మపత్యజ్య బ్రహ్మస్థానముపాగమన్ । తైరనుజ్ఞామవాప్యాథ కుర్యాచ్చాంద్రాయణద్వయం ॥ ఉపోష్యరజనీమేకాం పంచగవ్యం పిబెత్తతః। ఏతేన శుద్ధిమాప్నోతి నదానైర్బ్రాహ్మణార్చనైః॥ ఇతి హరిహరయోగె హరిహరప్రతిమాప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(ఈ.ఆ) ఇకను హరిహరప్రతిమాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ఖరసంవత్సరమునందలి కార్తికపూర్ణిమాదినము హరిహరనామకయోగము గలదియని చెప్పంబడును. ఇయ్యోగము సర్వపాపనాశనమైనదని యెఱుంగవలయును. మఱియు నక్రతుకోటిసమయోగమనియును, పదివేలపర్యాయములు గాయత్రీజపమును జేయుటకు సమానమనియును, అనేకములగు పాపములను నాశము సేయుటకుం గాలానలమువంటిదనియును, ఎఱుంగవలయును. కావుననట్టికాలమునందు జేసిన స్నానదానపితృశ్రాద్ధాదికములు మిగులఫలదాయకమగునని యెఱుంగవలయును. మఱియు నట్టికాలమునందు స్వర్ణమయమగుహరిహరప్రతిమను, అధ్యాత్మవేత్తయగు బ్రాహ్మణునకు దానము సేసినవాడు ముక్తినిబొందునని మార్కండేయమునివరుడు చెప్పె. హరిహరనామకయోగమునందు హరిహరప్రతిమను గంధపుష్పాక్షతాదులచే తనర్చించిపూజనుజేసి బ్రాహ్మణునకు దానము సేసినవాని పుణ్యమింతయని చెప్పుటకు బ్రహ్మదేవునకుశక్యముగాదు. అట్టిదానము జేసినవాడు బ్రహ్మలో

కమునందు బునరావృత్తిరహితముగనివసించును. ముక్తిస్థానములునాలుగని మునులుగీర్తించిరి. అపిమెవ్వియాసిన నన్నమునుమాత్రము పరిగ్రహించి యిత రములనుపరిగ్రహింపక లోకవార్తనువదలిసంచరించువాడు ముక్తిఁబొందు ననియెఱుఁగవలయును. అంత్యకాలమువచ్చినపుడు మనస్సుజేతనితరములగు వానినిస్మరింపక నారాయణునిస్మరించుటచే ముక్తిగలుగును. మఱియునుస ర్వకాలములయందును బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై వేదాంతశాస్త్రమును, విచా రించుచు నద్వైతభావనను జేయువాఁడును ముక్తినిబొందును. హరిహరయో గమునందు హరిహరప్రతిమనుబూజించి బ్రాహ్మణోత్తమునకు దానముసే యుటవలనముక్తిగలుగును. ఇయ్యదిధనముచేతసంపాదింపదగినది. ఇట్టిదాన మునుభోగలోలుఁడైప్రతిగ్రహించినవాఁడు ఘోరనరకములనుబొందును. కా వుననట్టిదోషముపోవుటకొఱకు బ్రతిగ్రహించినద్రవ్యమువలన యజ్ఞాదికమును జేసినవాఁడుపవిత్రుఁడగును. ఇట్లుయజ్ఞమునుజేయనివాఁడు ఘోరనరకములనను భవించినపిమ్మట స్థావరజన్మమునుబొందునని మార్కండేయుఁడు వచించె. హరిహరయోగమునందు ధనాతురుఁడైప్రతిగ్రహించినవాఁడు ఘోరనరకము లననుభవించి స్థావరత్వమునుబొందును. కావునమునులచేత జెప్పబడినవిధ ముగ ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన ధాన్యమునుచర్మను వదలి బ్రాహ్మణులుండుసభకుబోయి వారియనుమతమునుబొంది రెండుచాం ద్రాయణవ్రతములనాచరింపవలయును. పిమ్మటనొక్కదినముంతయునునుపవ సించి పంచగవ్యప్రాశనము జేయవలయును. ఇవ్విధముగనాచరించినవాఁడుపవి త్రుఁడగుననికూర్మపురాణమునందు జెప్పబడె.

—— ॥ అర్ధనారీశ్వరయోగప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ॥ ——

(౮౬౬) అథఅర్ధనారీశ్వరయోగప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ బ్ర హ్మాండే॥ ఖరసంవత్సరేమాఘేపౌర్ణమీయోగయుగ్యదా। తత్రాపిభగవా౯ శమ్భురర్ధనారీశ్వరోఽవ్యయః॥ పూజనీయోనృభిఃపాపమోచనే నాన్యసాధ నమ్। తత్రదానంమహాపుణ్యంస్నానంవావిప్రభోజనం॥ పితృనిర్వాపణంవాపి దీపోవాదేవతాలయే। శ్వోమహోవాతిలసమ్మిశ్రః స్సర్వపాపాపనుత్తయే॥ పౌర్ణమ్యాంప్రతిమాంకృత్వా సాఽర్ధనారీశ్వరాం। పౌర్ణమ్యామిత్యా ర్షం। పూజయిత్వాప్రదోషేతాంజాగరత్వానిశామిమాం॥ పశ్యేద్యోపునరభ్యా ర్చ్యపూర్వవద్విధిపూర్వకం। యోదద్యాద్ద్విజవర్యాయపూర్వవన్ముక్తిభాగ్భ వేత్॥ మనుష్యాజన్మాధికపుణ్యంమలమాత్రపరిగ్రహితం। సర్వపాపాలయంహే యమస్థిత్వఙ్మాంసపూరితం॥ మనుష్యజననాద్ధాన్యజపాపాణత్వంవరంసదా।

అతస్సాన్వర్జితవిత్తేనయోగమేనంసమాచరేత్॥ సయాతిబ్రహ్మణస్థానంనరఃక ల్మషపూరితః। అత్రయోబ్రాహ్మణోలోభాద్వృథాకుర్యాత్ప్రతిగ్రహం॥ స ఏవనరకస్థాయీయావదాభూతసంప్లవం। ఏతత్సాత్త్వికదానంహివృథాతస్య పరిగ్రహే॥ ప్రాయశ్చిత్తిభవేద్వాపియాగాదికమథాపివా। ఉభయోర్యదిలా పస్స్యాన్నరకంప్రతిపద్యతే॥ తస్మైవ్యపానిష్కృతిర్దృష్టాపూర్వవత్సర్వమాచ రేత్। లక్ష్మీనారాయణచంపానష్ఠియోగవిపదుత్తారనరనారాయణయోగేషు ప్రతిగ్రహేత్వేవమేవప్రాయశ్చిత్తంనివేదనీయం॥ నచాన్యథా॥ ఇత్యర్థనారీ శ్వరయోగప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౬౬) ఇకను అర్ధనారీశ్వరయోగమునందలి ప్రతిమాప్రతిగ్రహదో షనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ఖరసంవత్సరమాఘశు క్లపూర్ణిమ అర్థనారీశ్వరయోగముగలదియని చెప్పబడును. ఇట్టియోగము నందు, అర్ధనారీశ్వరప్రతిమనుబూజించి బ్రాహ్మణునకుదానమును జేయవ లయును. ఇట్టిదానమునుజేసినవాడుముక్తినిబొందును. మఱియునిట్టియోగము నందు, అనేకములగుదానములనుజేయవలయును. ఇట్టిదానములనుస్వార్జితద్ర వ్యముచేతజేయవలయును. ఇటువంటిదానమునుప్రతిగ్రహించి యాద్రవ్యము నుయజ్ఞాదులనుజేయక స్వోదరపోషణాదికమున కుపయోగించుకొనువాడు బ్రహ్మప్రళయమువఱకు ఘోరనరకములనుబొందును. కావుననిట్టిదోషనివార ణకొఱకు హరిహరప్రతిమాప్రతిగ్రహమునకు విధించినప్రాయశ్చిత్తమునేవి ధింపవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడినది.

—* దుర్జనప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౪౬౭) అథదుర్జనప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ వే దమార్గంపరిత్యజ్యసదావేశ్యాపరాయణః। కర్మహీనోవృథాద్వేషీదేవబ్రా హ్మణనిన్దకః॥ సన్ధ్యాదినిత్యకర్మాణిత్యక్త్వాగ్రామ్యమాచరన్। వృథాహిం సామృగాదీనాంసన్తాపోహ్యదిసాధుషు॥ పత్నీపుత్రపితృభ్రాతృదేవతారాధ నంత్యజన్। పరవిత్తపరక్షేత్రపరదారాపహారిణం॥ వేదశాస్త్రపురాణేషుక థాసుమహతీషుచ। అవిశ్వాసోహేతువాదశ్చాటువాకపరస్తథా॥ ఇదంపాప మిదంపుణ్యమిదంవైవిప్రసాధనం। అయంపరోపకారశ్చాప్యయంవిష్ణుశ్శివోప్య యం॥ ఉపవాసవ్రతాదీనాంజయంతీనామనాస్తికః। కచ్ఛమేకంపూర్వతశ్చ పశ్చాదేకంతథావహన్॥ కర్ణమూలేగన్ధరేఖాంశిరోష్ణీషంచవక్రకం। నాసి కాగ్రేలలాటేవాతిలకంవాప్రకాశనం॥ శుకంకపోతంగృధ్రంవాధారయన్ శ్యే నమేవవా। చండాలంవిప్రసంగ్రామంపశ్యన్॥ సర్వకాలేపిత

శ్రాద్ధేసోమసూర్యగ్రహేపివా। ద్విభుక్తంపాపమనసాకన్యాంనారీంవరాంగనాం॥ అపేక్షమాణశ్చమేద్యమభోజ్యంభోజయన్ముదా । పంచార్ద్రింభోజనేత్యక్త్వాపితామాతాసుతైస్సహ ॥ భోజనంకురుతేవిప్రఃపాపమాత్రంనచింతయన్। అయందుర్జనసంజ్ఞస్స్యాత్తంకదానాలపేద్బుధః ॥ శకటంపంచహస్తేనదశహస్తేనవాజినం। హస్తినంశతహస్తేనదుర్జనందూరతస్త్యజేత్॥ అతోదుర్జనసంసర్గఃపరిత్యాజ్యస్సుఖేప్సుభిః । పుణ్యకాలేషుపుణ్యాహేనదీతీరేషుసర్వదా॥ విప్రఃపరిత్యజేద్యత్నాద్దుర్జనస్యప్రతిగ్రహం। అన్నంవాసలిలంవాపిహిరణ్యంధాన్యమేవవా॥ మహాదోషమవాప్నోతితస్మాదేతత్పరిత్యజేత్। యదిదైవాత్సముత్పన్నస్తస్మాద్ద్విజః పరిగ్రహః॥ తదామనసిసంస్మృత్యహేయవజ్జనవల్లభ। స్నాత్వాసచేలఃసహసాప్రాజాపత్యంసమాచరేత్॥ సువర్ణమాత్రే ద్విగుణమన్నేపాదంజలేతథా ॥ ఇతిదుర్జనప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౮౬౭) ఇకనుదుర్జన ప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ వేదమార్గమునువదలి సర్వకాలములయందును వేశ్యాపరాయణుడును, కర్మహీనుడును, వ్యర్థముగా ద్వేషించువాడును దేవబ్రాహ్మణులను నిందించువాడును, సంధ్యాదినిత్యకర్మల వదలి సర్వకాలములయందును, గ్రామ్యకర్మలను జేయువాడును, నిర్నిమిత్తముగమృగాదులనుహింసించువాడును, పరదార, పరధన, పరక్షేత్రములను, అపహరించువాడును, భార్య, తల్లిదండ్రులు, భ్రాతలు, పుత్రులు, అనువానినివదలువాడును, దేవతారాధనను జేయనివాడును, వేదశాస్త్రపురాణములయందును, మఱియునుగొప్పవగు కథలయందును, విశ్వాసములేనివాడును, హేతువాదములను జేయువాడై చార్వాకమతమునవలంబించినవాడును, ఉపవాసాదివ్రతములయందు, ప్రియములేనివాడును, పూర్వపశ్చిమములయందు కచ్ఛలనువదలి వస్త్రమునుధరించువాడును, కర్ణమూలమునందుగంధరేఖను, వక్రముగుతలపాగను, నాసికాగ్రలలాటములయందు, చిన్నచుకలను బెట్టువాడును, శుకమునైనను, కపోతమునైనను, గృధ్రమునైనున, శ్యేనమునైనను, ధరించువాడును, చండాలాదులసంసర్గమునందుండి తాంబూలభక్షణను జేయువాడును, పర్వకాలములు, పితృశ్రాద్ధదివసములు, చంద్రసూర్యగ్రహణకాలములుమొదలగుదివసములయందు రెండుమారులుభోజనమును జేసి స్త్రీసంగమమునపేక్షించువాడును, అయిదగునార్ద్రవస్తువులనువదలి భోజనమును జేయువాడును, నగువాడు దుర్జనుడనబడును. ఇట్టివానితో నెప్పుడును మాటలాడగూడదు. మఱియునిట్టిదుర్మార్గుని జూచినతోడనే బహుదూరముగదొలగిపోవలయును. ఇటువంటిదుర్మార్గునివ

లననేపదార్థమును ప్రతిగ్రహింపగూడదు. అవివేకమునఁబలన ప్రతిగ్రహించినవాఁడు వెంటనే స్నానమును జేసి ప్రాజాపత్యకృఛ్రముసాచరింపవలయును. సువర్ణమాత్రమును బ్రతిగ్రహించినయెడల రెండు ప్రాజాపత్యకృఛ్రముల నాచరింపవలయును. అన్నపానములను గ్రహించినయెడల ప్రాజాపత్యకృఛ్రమునందు నాల్గవభాగమును నాచరింపవలయునని లింగపురాణమునందు జెప్పబడియె.

——* ఆతతాయినః ప్రతిగ్రహప్రాయశ్చిత్తం. *——

(౪౬౮) అథ ఆతతాయినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ లింగపురాణే॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః। క్షేత్రదారహరశ్చైవ షడేతే హ్యాతతాయినః॥ ఏతత్ప్రతిగ్రహం కృత్వా విప్రో నరకమాప్నుయాత్। దుర్జనం వృశ్చికం సర్పం భిషజం చాతతాయినమ్॥ పాపిష్ఠం దుర్భగం వ్రాత్యం నగ్నముత్కృత్తనాసికమ్। ప్రాతర్న పశ్యేద్దృష్ట్వా తాంస్తు దృష్ట్వా పశ్యేద్దివాకరమ్॥ చన్దనం రోచనం హేమ మృదంగం దర్పణం మణిమ్। గురుమగ్నిం తథా సూర్యం ప్రాతః పశ్యేత్ప్రయత్నతః॥ అగ్నిచిత్కపిలా సత్రీ రాజా భిక్షుర్మహోదధిః। దృష్టమాత్రాః పునన్త్యేతే తస్మాత్పశ్యేత్ప్రయత్నతః॥ భర్తృఘ్నీం పుష్పిణీం నారీం పుత్రహీనాం నిరాశ్రయామ్। సవాహనం యతిం దృష్ట్వా సచేలం స్నానమాచరేత్॥ పతితం భషకం చాషం దుర్జనం చాతతాయినమ్। కపిం సర్పం ఖరం స్పృష్ట్వా సచేలం స్నానమాచరేత్॥ ఏతత్ప్రతిగ్రహే రాజన్ పూర్వముక్తం మనీషిభిః। ప్రాయశ్చిత్తం ద్విజః కుర్యాదన్నపానే జలే తథా॥ నాన్యథా శుద్ధిమాప్నోతి దానైర్వా బహుభిర్నరః॥ ఇత్యాతతాయినః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౬౮) ఇకను, ఆతతాయివలన బ్రతిగ్రహించినవానికిగల దోషనివారకప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ గృహములను దగులబెట్టినవాఁడును, విషమును బెట్టిచంపువాఁడును, శస్త్రమును ధరించి జీవించువాఁడును, ధనమును నపహరించువాఁడును, పరక్షేత్రపరదారల నపహరించువాఁడును, ఆతతాయియని చెప్పబడును, ఇట్టివానివలన బ్రతిగ్రహముసేసినవాఁడు నరకమును బొందును, దుర్జనుని, వృశ్చికమును, వైద్యుని, ఆతతాయిని, పాపిష్ఠుని, దుర్భగుని, వ్రాత్యుని, నగ్నుని, భిన్నమైన నాసికగలవానిని, ప్రాతఃకాలమునందుఁ జూడఁగూడదు. ఒకవేళఁ జూచినయెడల సూర్యునిజూడవలయును. చందనమును, రోచనమును, బంగారమును, మృదంగమును, దర్పణమును, మణిని, గురువును, అగ్నిని, సూర్యుని, ప్రాతఃకాలమునందు జూడవలయును, పెనిమిటిని జంపినదానిని, రజస్వలమైయున్నదానిని, పుత్రహీనురాలిని, నిరాశ్రయురాలగు నాడుదానిని, వాహనారూఢుఁడగు యతిని, జూచినయెడల సచేలస్నానమును

జేయవలయును. మఱియును, పతితుని, భషజుని, చాషుని, దుర్జనుని, ఆతతాయిని, కోతిని, సర్పమును, గాడిదెను, స్పృశించిన యెడల సచేలస్నానము జేయవలయును. ఇట్టివారలవలనఁ బ్రతిగ్రహించినవాఁడు పూర్వోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె.

—✻ కుండగోళకప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ✻—

(౪౬౯) అథకుండగోళకప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ జీవద్వాపతింత్యక్త్వా కుమారంసూయతేఽన్యతః। సపుత్రఃకుండసంజ్ఞస్స్యాల్లోకద్వయబహిష్కృతః॥ సామాతాజారిణీనామ సపుత్రః పతితోభవేత్। మృతేభర్తరియానారీ ప్రాప్తాపుత్రంతథాన్యతః॥ సశిశుర్గోళకోనామసర్వకర్మబహిష్కృతః। ననామకరణంచాపి నమౌంజీ బన్ధనంతయోః॥ కుండగోళకయోర్నామ దర్శనాత్పాపవర్ధనా। స్పర్శనాత్స్నానదానిత్యంకీర్తనాత్పుణ్యహారిణా॥ నిత్యేనైమిత్తికేకామ్యేస్నానదానజపాదిషు। ఏతయోర్దర్శనంభాషాంక్షుతంజృమ్భణమేవచ॥ సంత్యజేద్దర్శనాత్కర్మకృత్వాతజ్జృమ్భణాదికం। విరమ్యభోజనంపశ్చాన్మార్తండమవలోకయేత్॥ ఏతయోః పాపినోర్యస్తు ద్విజస్సంస్కారకర్మసు। ఆచార్యత్వంయదాకుర్యాత్సవిప్రస్తత్సమోభవేత్॥ తస్యోపనయనంభూయః కేశానాం వపనంతథా। ప్రాయశ్చిత్తంతదాకుర్యాత్షడబ్దంవిధిపూర్వకం॥ త్యక్త్వాప్రతిగ్రహేరాజన్ సువర్ణంధాన్యమేవవా। అన్నంవాజలమాత్రంవా ప్రాయశ్చిత్తమిదంశుభం॥ సువర్ణసంగ్రహేతాభ్యాం ప్రాజాపత్యద్వయంచరేత్। ధాన్యేతదర్ధమర్ధం స్యాదన్నతోయప్రతిగ్రహే॥ ఏవంశుద్ధిమవాప్నోతి హ్యన్యథావైననిష్కృతిః। కుండగోళకయోఃకేచిత్ప్రాయశ్చిత్తంవదంతిహి॥ పరాశరాదయస్సర్వే ఇతియత్తదసాంప్రతం॥ ఇతికుండగోళకప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౬౯) ఇఁకను కుండగోళకప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ భర్తజీవించియుండఁగా మరియొక పురుషునివలనఁ గనఁబడినపుత్రుఁడు కుండుఁడనఁబడును. అట్టివాఁడు ఉభయలోకభ్రష్టుఁడును, పతితుఁడునునగును. అయ్యాడుది జారిణియనఁబడును. భర్తమరణమునుబొందిన పిదప రెండవపురుషునివలనఁ బుట్టినవాఁడు గోళకుఁడనఁబడును. ఈకుండగోళకసంజ్ఞగల యిరువురకును, నామకరణమౌంజీబంధనాదికమును జేయఁగూడదు. కుండగోళకులనుజూచినతోడనే స్నానమును జేయవలయును. స్పృశించినయెడల పాపము సంప్రాప్తమగును. అట్టివారలను స్మరించినవా

నిపుణ్యమంతయును నాశమునుబొందును. నిత్యనైమిత్తికములయందును, కామ్యకర్మములయందును, స్నానదానజపాదులయందును, కుండగోళకుల దర్శనాదులను జేయఁగూడదు. దైవవశముచేత నట్టివారలదర్శనము గలిగినయెడల సూర్యునిజూడవలయును. కుండగోళకులయొక్క సంస్కారములయందాచార్యత్వమునువహించినవాఁడు వారికిఁ దుల్యుఁడగును. కావున నయ్యాచార్యుఁడు వపనమును, పునరుపనయనమును జేయించుకొని పిమ్మట షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును శాస్త్రోక్తప్రకారముగ నాచరింపవలయును. కుండగోళకుల వలన నన్నాదికమును ప్రతిగ్రహించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. సువర్ణప్రతిగ్రహమునందు రెండుచాంద్రాయణములనాచరింపవలయునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె.

— పాషండప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. —

(౪౭౦) అథ పాషండప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ శూద్రధర్మరతో వాపి తప్తముద్రాఙ్కిత స్తదా। లింగధారీతుముఖజః కుతర్కానువాదవాన్॥ విష్ణుం వేదం ద్విజం గాం చ యజ్ఞం శాస్త్రం పతివ్రతాం। ఉపోషణాదికాన్ త్యక్త్వా హ్యాత్మభోగపరాయణః॥ శివం ద్వేష్టి పరం దృష్ట్వా దేవపూజాం వ్రతం తథా। దానం వా నియమం వాపి కుర్వాణం ద్వేష్టి యో నరః॥ ఏతే పాషండినః ప్రోక్తాః దుర్జనే ష్వేవ భాగశః। పాషండినః ప్రగృహ్ణీయా ద్ద్విజో లోభపరాయణః॥ కుర్యా ద్దేహవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యద్వయం సకృత్। హిరణ్యాదిసమ్భవే పూర్వవద్ద్రష్టవ్యం॥ ఇతి పాషండినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౭౧) ఇఁకను పాషండప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ శూద్రధర్మములయందాసక్తిగలవాఁడును, తప్తముద్రాంకితుఁడును, లింగధారియునగువాఁడును, కుతర్కములనువాదించువాఁడును, విష్ణుదేవుని, వేదమును, ద్విజుని, గోవును, యజ్ఞమును, శాస్త్రమును, పతివ్రతను, ఉపోషణాదికమును, వదలి యాత్మభోగపరాయణుఁడగువాఁడును, దేవపూజాది నియమవ్రతములను నిందించువాఁడును. పాషండుఁ డనఁబడుదురు. ఇట్టిపాషండునివలనఁ బ్రతిగ్రహమును జేసినవాఁడును దేహశుద్ధికొఱకు ప్రాజాపత్యద్వయము నాచరింపవలయును. హిరణ్యాదిప్రతిగ్రహమునందు పూర్వోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయుఁడు చెప్పె.

— వేశ్యాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. —

(౪౭౧) అథవేశ్యాప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే ॥ వేశ్యాపరిగ్రహే. రామపైతృకేపుణ్యపర్వసు। ఆమంసువర్ణంరజతం ప్రతిగృహ్యాద్విజోయది। తేనజీవన్మహాపాపీమృత్వానరకమాప్నుయాత్ ॥ స్కాందే॥ నదీతీరే పుణ్యకాలేపైతృకేషుచ పర్వసు। వేశ్యాప్రతిగ్రహంకుర్వన్ద్విజశ్చండాలతాంవ్రజేత్। అన్తేనరకమాసాద్యసర్వధర్మబహిష్కృతః॥ మహాభారతే॥ దశసూనాసమశ్చక్రీ దశచక్రీసమోధ్వజీ। దశధ్వజిసమావేశ్యా దశవేశ్యాసమోనృపః॥ వేశ్యాప్రతిగ్రహస్స్పర్శోదానమన్నంవచస్తథా। ఏతాని తస్యపుణ్యానిహరంతి క్షణమాత్రతః॥ తస్మాద్విప్రైః పరిత్యాజ్యో వేశ్యాయాస్సంపరిగ్రహః। యదిప్రతిగ్రహేద్రామప్రాయశ్చిత్తంశృణుష్వమే ॥ కేశానాంవపనంకృత్వా సంస్కారంపునరాచరేత్। ప్రాజాపత్యత్రయంకుర్యాత్తండులానాంప్రతిగ్రహే॥ సువర్ణమాత్రసంగ్రాహే షడబ్దంకృచ్ఛ్రమాచరేత్। అన్నేజలేచవస్త్రేచ ప్రాజాపత్యంసమాచరేత్॥ఏతత్సకృత్ప్రతిగ్రహవిషయం॥ అభ్యాసేద్విగుణం॥ అత్యంతాభ్యాసేచతుర్గుణం॥ సంవత్సరాదూర్ధ్వం తత్సమఇతిసూచితం॥ ఇతివేశ్యాప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౭౧) ఇఁకను వేశ్యాప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ పితృకార్యములయందును, పుణ్యకాలములయందును, పర్వములయందును, ఆమమునైనను, సువర్ణమునైనను, రజతమునైనను ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు మరణానంతరమందు ఘోరనరకములను బొందునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. నదీతీరములయందును, పుణ్యకాలములయందును, పితృకర్మలయందును, పర్వములయందును, వేశ్యాప్రతిగ్రహమును జేసినబ్రాహ్మణుఁడు చండాలత్వమును బొందును. పిమ్మట సర్వకర్మబహిష్కృతుఁడై ఘోరనరకములననుభవించునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. చక్రియనువాఁడు పదిమందిసూనులకు సమానుఁడు. ధ్వజిపదిమంది చక్రులకు సమానుఁడు. పదిమందిధ్వజులకు వేశ్యసమానురాలు. రాజుపదిమందివేశ్యాస్త్రీలకు సమానుఁడు. వేశ్యాప్రతిగ్రహ స్పర్శాదులు సకల పుణ్యములను నశింపఁజేయును. అందువలన వేశ్యాపరిగ్రహమునువదలవలయును. అవివేకాదులవలనఁ బ్రతిగ్రహమును జేసినవాఁడు వపనమును జేయించుకొని పునరుపనయన సంస్కారమును జేసికొనవలయును. సువర్ణమును ప్రతిగ్రహించిన యెడల షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అన్నోదకములను ప్రతిగ్రహించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవ

లయును- ఈప్రాయశ్చిత్త మొకమాటు ప్రతిగ్రహించినవాని విషయమని యును, అభ్యాసముగ, ప్రతిగ్రహించినవాఁడు ద్విగుణాధికముగఁ జేసికొనవ లయును- సంతతాభ్యాసమయ్యేనేని చతుర్గుణాధికముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును- సంవత్సరానంతరమందుఁగూడ నిట్టి కృత్యమును జేయు వాఁడు తత్సముఁడగునని మహాభారతమునందుఁ జెప్పఁబడియె-

— వ్యభిచారిణీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్- —

(౪౭౨) అథ వ్యభిచారిణీప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ లైంగే॥ అటనంభాషణం దృష్టిర్హాసొలజ్జావిమోక్షణం। ఏతాని పంచనారీణాం వ్యభిచారఉదాహృతః॥ మైథునమష్టవిధం॥ స్మరణంకీర్తనం కేళీః ప్రేక్షణం గుహ్యభాషణం। సంకల్పోధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవచ॥ ఏతన్మైథునమష్టాంగం ప్రవదంతిమహర్షయః। కృతేస్మరణతోగర్భ స్త్రేతాయాందర్శనాద్భవేత్॥ ద్వాపరేస్పర్శతోగర్భః కలౌసమ్పర్కతఃక్రమాత్। అష్టవిధం మైథునమితి కలియుగవ్యతిరిక్తవిషయం॥ కలౌస్మరణాదికం సమ్భవత్యేవ॥ క్రియానిర్వృత్తిస్సాక్షాత్సంసర్గఏవ గర్హితః॥ శేషంరజస్వలావత్ ॥ తదేవాహవామనపురాణే॥ స్త్రీణాంస్మరణజంపాపం మాసిమాసిరజఃస్థలాత్। నాశ్యతేపురుషసంసర్గే గర్భేత్యాగోవిధీయతేఇతి॥ కౌర్మే॥ స్త్రీణామాహరహః పాపంస్మృతిజందృష్టిజంతథా। నష్టత్వంయాతిరాజేంద్ర మాసిమాసిరజఃస్థలాత్॥ పరసంసర్గజోదోషో నక్షీణత్వమవాప్నుయాత్। తదపేక్షణతాం యాతి గర్భేత్యాగోవిధీయతే॥ అతస్సాక్షాద్వ్యభిచారస్త్రీణాం యదాసమ్భవతి। సతుసాక్షాత్స్వయమెవదర్శయతి॥ నతువార్తామాత్రేణ॥ తదాహ కాత్యాయనః॥ స్వానుభూతంసదృష్టాంతం నతుప్రష్టవ్యనిగ్రహం। తథాపియత్నతోరక్షే ద్గర్భేత్యాగోవిధీయతే॥ గర్భసమ్భవేసాయదాభర్త్రాత్యక్తా॥ తదాతత్ప్రతిగ్రహేదోషమాహ॥ లైంగే॥ వ్యభిచారెయదాదృష్టేత్యాజితాయాధవాదిభిః। తస్యాఃప్రతిగ్రహస్త్యాజ్యో ముఖ్యైఃపాపభీరుభిః॥ తథాపిదైవాత్ప్రాప్తంచేత్సువర్ణంధాన్యమేవవా। ప్రాజాపత్యంచరేత్స్వర్ణే తదర్థంధాన్యసంగ్రహే॥ పాదంచరేత్తతఃపశ్చాదన్నతోయాదిసమ్భవే॥ ఇతివ్యభిచారిణీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౭౨) ఇకను వ్యభిచారిణీ ప్రతిగ్రహప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు ॥ అన్యగృహాదిసంచారము, అన్యపురుషసంభాషణము, అన్యులనుజూచుట, అన్యులతోనవ్వుట, సిగ్గునువదలుట, అను నైదును స్త్రీలకు వ్యభిచారమని చెప్పఁబడును. స్మరణము, కీర్తనము, కేళి, ప్రేక్షణము, గుహ్యభాషణ

ము, సంకల్పము, అధ్యవసాయము, సంభోగక్రియ, అనిమైథునకర్మమేఁమి దివిధములనిచెప్పబడును. కృతయుగమునందు స్మరణవలనను, త్రేతాయుగమునందు దర్శనమువలనను, ద్వాపరయుగము నందు స్పర్శవలనను, కలియుగమునందు సంపర్కమువలనను, గర్భోత్పత్తియగును. కలియుగము నందు స్మరణాదికము సంభవించును గనుక స్మరణాదికము వ్యభిచారము గాదనియును, పరపురుషునితో సంభోగక్రియలను సల్పుటయే వ్యభిచారమనియును లైంగమునందుఁ జెప్పఁబడియె. స్త్రీలకు పరపురుష స్మరణవలనఁగలిగిన పాపము ప్రతిమాసమునందును గలుగునట్టిరజోదోషముతో నివర్తించిపోవును- పరపురుషసంపర్కమువలన గర్భవతియగు స్త్రీని పరిత్యజింపవలయునని వామనపురాణమునందుఁ జెప్పఁబడియె, కూర్మపురాణమునందును నివ్విధముగానే చెప్పఁబడియె. కాత్యాయనుడును నిటులనే చెప్పి స్త్రీలను బహు విధములచేత గాపాడవలయుననియె. వ్యభిచారమును జేసి భర్తచేతవదలబడినయాడుదానివలన నే వస్తువును, ప్రతిగ్రహింపగూడదు, అవివేకమువలన ప్రతిగ్రహించినవాఁడు ప్రాజాపత్యకృఛ్రము నాచరింపవలయును, ధాన్యమును ప్రతిగ్రహించినవాఁడు ప్రాజాపత్యకృఛ్రమునందర్ధము నాచరింపవలయును, అన్నోదకములను ప్రతిగ్రహించినవాడు ప్రాజాపత్యకృఛ్రమునందు నాల్గవభాగమును నాచరింపవలయునని లైంగమునందుఁ జెప్పబడె॥

— భర్తృఘ్నస్త్రీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

(౪౭౩) అథ భర్తృఘ్నస్త్రీప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ క్రాన్మే ॥ భర్తారం హంతియానారీ గృహదాహాదిభిర్విషైః। పరప్రేరణయావాపి సానారీభర్తృఘాతినీ ॥ శివధర్మోత్తరే ॥ యానారీ బహుభిర్విప్రంపతిం హంతివిషాదిభిః । జారాసక్తాఽన్యతో వాపి కథా తాం నావలోకయేత్ ॥ చతుర్వింశతిమతే॥ గృహదాహేనపాషాణరజ్జుదండాదిభిర్గృహే। భర్తారంహంతియాపాపా కరణాదినిపీడయా ॥ యమదూతైస్తదా బద్ధా పీడితాయాతికింకరైః । క్రోశంతీస్వకృతంకర్మ నిందంతీ జననంస్వకం ॥ కర్మణా మనసా వాచా భర్తారంనానుమన్యతే। తదాజ్ఞాంయాపరిత్యజ్య తస్యాఃప్రోక్తావ్యధోగతిః ॥ భర్తృఘ్నీబ్రహ్మహన్త్రాచహ్యభయం యాతిరౌరవం । తతఃపరిగ్రహస్త్యాజ్యో భర్తృఘ్న్యాఃపాపశంకయా ॥ దోషంబుద్ధ్వాయదావిప్రః తస్యాఃకుర్యాత్ప్రతిగ్రహం । మహాంతంనరకంగత్వా భవేద్భువి తపోదరః॥ పుణ్యకాలేషుసంక్రాంతౌ వ్యతీపాతేచవైధృతౌ । తత్ప్రతిగ్రహణంకుర్యాత్తదాపాపవిశుద్ధయే ॥ సువర్ణైరజతైవస్త్రైః అన్నైజలపరిగ్రహే। తప్తంతద

ర్ధం పాదోనం క్రమాత్కృత్వా విశుద్ధ్యతి ॥ ఏతదజ్ఞానవిషయం॥ జ్ఞాత్వాప్రతిగ్రహే ॥ ద్విగుణం॥ అభ్యాసేత్రిగుణం ॥ సంవత్సరాదూర్ధ్వం సోపితత్సమః॥ ఇతిభర్తృఘ్నస్త్రీప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౪౭౩) ఇకను పెనిమిటిని జంపినయాడుదానివలన బ్రతిగ్రహము చేసినదోషనివారణకొరకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ గృహదాహవిషాదులచేతనయినను, పరప్రేరణచేతనయినను, భర్తనుజంపిన యాడుది భర్తృఘాతినియని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె. శివధర్మోత్తరమునందును నిటులనేచెప్పబడియె. విషశస్త్రాదులచేతభర్తనుజంపినయాడుదానిని యమదూతలు తీసికొనిపోయి యనేకవిధములగునరకములనుబొందింతురు, భర్తనునిందించినయాడుది ఘోరనరకమునుబొందును. అట్టియాడుదానివలన ద్రవ్యాదికమును ప్రతిగ్రహించినవాడు వ్యభిచారిణీప్రతిగ్రహమునకు విధించినప్రాయశ్చిత్తమునేఆచరింపవలయును. తెలిసి ప్రతిగ్రహించినవాడు ద్విగుణాదికముగఁ బ్రాయశ్చిత్తమునుఆచరింపవలయును, అభ్యాసముగాబ్రతిగ్రహించువాడు త్రిగుణాధికముగఁ బ్రాయశ్చిత్తము నాచరింపవలయును, సంవత్సరానంతరమందుఁ గూడనిట్టిప్రాయశ్చిత్తము నాచరించినవాఁడుతత్సముడగునని చతుర్వింశతి మతమునందుఁ జెప్పఁబడియె ॥

— చండాలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

(౪౭౪) అథ చండాలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ ॥ దేవీపురాణే ॥ చండాలాద్యోద్విజోమోహాత్ప్రతిగృహ్య ధనాదికం। తేనసత్కర్మకృద్యశ్చ తత్సర్వంతదవాప్నుయాత్ ॥ భోక్తారోనరకంయాంతి కర్తాచండాలతాం వ్రజేత్ । చండాలేన కృతంవస్త్రం వర్జయేత్పుణ్యకర్మసు ॥ స్నానే దానేదపే హోమే స్వాధ్యాయేపితృకర్మణి । తస్యస్మరణమాత్రేణతత్సర్వం నిష్ఫలంభవేత్॥ తదాహాపస్తమ్బః ॥ చండాలోపస్పర్శనే సమ్భాషాయాం దర్శనేచదోషః ॥ తత్ప్రాయశ్చిత్తం అవగాహనమపాముపస్పర్శనే సమ్భాషాయాం బ్రాహ్మణసంభాషాదర్శనే జ్యోతిషాందర్శనమితి ॥ తత్ప్రతిగ్రహదోషమాహ ॥ చండాలాత్ప్రతిగృహ్ణీయా ద్విప్రోఽకనపరాయణః । తస్యాన్యానిష్కృతిర్నాస్తిచాంద్రాయణచతుష్టయాత్ ॥ సకృత్ప్రతిగ్రహే తావత్ప్రాయశ్చిత్తంవిశోధనం । అభ్యాసేద్విగుణంప్రోక్తం తత్సమస్తు తతఃపరం॥ ఇతి చండాలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం ॥

(౪౭౫) ఇకను చండాలప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెలుపుచున్నాడు ॥ మోహాముచేత చండాలాదుల ధనాదికమును ప్రతిగ్రహించి

నబ్రాహ్మణుఁడు సేయుసత్కర్మలన్నియును నాశమునుబొందును, అట్టిబ్రా హ్మణుఁడు సేయుకర్మలయందు భోజనాదుల నాచరించినవారుచండాలత్వ మును బొందినవారగుదురు, చండాలునిచేతఁ జేయబడినవస్త్రమును పుణ్య కర్మలయందు ధరింపఁగూడదు, పుణ్యకర్మాదులయందు చండాలురను స్మరిం చుటచేత నాపుణ్యకర్మాదులన్నియును నాశమునుబొందునని దేవీపురాణము నందుఁ జెప్పఁబడెను. చండాలురతో సంభాషించుట, స్పర్శను జేయుట దర్శ నము సేయుట, అనునవిదోషమును గలుగజేయును, చండాలురనుస్మరించుట చేతసకలపుణ్యకర్మలన్నియును నాశమునుబొందును, ఈ చెప్పఁబడిన వానికి స్నాన, ఉదకోపస్పర్శన, సంభాషణ, బ్రాహ్మణసంభాషణ, సూర్యదర్శన ము,అనువానిని ప్రాయశ్చిత్తార్థముగ నాచరింపవలయును, చండాలాదులవ లనద్రవ్యాదులను ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు నాలుగుచాంద్రాయణవ్రత ములనాచరింపవలయును, అట్టిబ్రాహ్మణునివలన ప్రతిగ్రహించినవాడుగూ డనాలుగు చాంద్రాయణవ్రతములనాచరింపవలయును, అభ్యాసముగ నీకృ త్యమును జేయువాడు ద్విగుణాధికముగఁ బ్రాయశ్చిత్తము నాచరింప వల యును. సంవత్సరకాల మీకృత్యమును జేయువాడు చండాల తుల్యుడగునని యాపస్తంబుడువచించె॥

## — పరివేత్తృప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్ —

(౮౭౪) అథ పరివేత్తృప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥మార్కం డేయః ॥ అనూఢేభ్రాతరిజ్యేష్ఠే యవీయాన్పరిణయేద్యది। పూర్వజఃపరివి త్తిస్స్యాత్పరివేత్తాద్వితీయజః । పరివిన్నస్తుతత్పుత్రోద్వితీయఃపరివిందకః॥ కా ర్యె॥ జ్యేష్ఠోయద్యంగహీనస్స్యాన్మూకోఽపస్మారవాన్ యది। తదనుజ్ఞామ వాప్యాథ భరణంపరికల్ప్యచ ॥ స్నాతకాదివ్రతంకృత్వా కదళ్యాథ వివా హ్యచ । ద్వితీయఃపరిణయేత్తత్రహ్యన్యథాపతితోభవేత్॥ ఏవంసశాస్త్రదో షస్స్యాదర్హోభవతిలౌకికే । తయోఃపుత్రాస్తయోర్దారాః పతితాస్స్యుర్నసం శయః ॥ నిత్యేకామ్యేవ్రతేదానే నకర్మాహ్యాన్నపిత్తమ । తస్మాదేతేపరిత్యాజ్యాఃదర్శనేభాషణేతదా ॥ ప్రతిగ్రహఃపరిత్యాజ్యోవిప్రైర్ధర్మపరాయణైః । తథాపిలోభవాన్విప్రః కుర్యాదేతత్ప్రతిగ్రహం ॥ నతేనశుద్ధిమాప్నోతి సురాభాండోదకంయథా । యాగార్థంభరణార్థంవాద్విజోయస్తత్ప్రతిగ్రహేత్ ॥ పరాకత్రయమాత్రేణ శుద్ధోభవతినాన్యతః । భోగార్థం ధనబాహుళ్యే తత్కృచ్ఛ్రత్రయంచరేత్ ॥ పరాకఃస్వల్పమాత్రేణహ్యన్నెవస్తేభవేత్తతః ॥ ఇతిపరివేత్త్రాదిప్రతిగ్రహప్రాయశ్చిత్తం ॥

(౮౭౫) ఇకను పరివేత్తృప్రతిగ్రహ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు ॥ జ్యేష్ఠ భ్రాత వివాహము గాకమునుపు వివాహమును జేసికొనినవాఁడు పరివేత్తయనబడును, అట్టి జ్యేష్ఠుఁడు పరివిత్తియనఁబడును పరివిత్తియొక్క పుత్రుఁడు పరివిన్నుఁడనియును, పరివేత్తయొక్క పుత్రుఁడు పరివింపకుఁడనియును జెప్పఁబడునని మార్కండేయుఁడు వచించె. జ్యేష్ఠభ్రాత, అంగహీనుఁడైనను, మూకుఁడయినను, అపస్మార రోగము గలవాఁడైనను, అయ్యేనేని యట్టి జ్యేష్ఠ భ్రాతయొక్క యనుమతమును బొంది యతనికి భరణమును గల్పించి మఱియును స్నాతకాది వ్రతమును, కదలీవివాహమును, జేయించి పిమ్మట రెండవవాఁడు వివాహమును జేసికొనవలయును, ఇవ్విధముగా వివాహమును జేసికొనిన కనిష్ఠుఁడు దోషవంతుఁడుగానేరఁడు, ఇట్లు చేసికొననివారల పుత్రులుగూడఁ బతితులగుదురు, కావుననట్టివారలను సత్కర్మలయందుఁ జేర్పఁగూడదు. మఱియు నట్టివారివలన ధర్మపరాయణులగు బ్రాహ్మణులు పరిగ్రహమును జేయఁగూడదు, ఒకవేళ లోభబుద్ధిచేత నట్టివానివలన ప్రతిగ్రహము సేసెనేని యట్టివాడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, అదియెట్లనిన యాగము కొఱకయినను, భరణముకొఱకయినను, ద్రవ్యాదికమును ప్రతిగ్రహించినవాఁడు పరాకత్రయమాత్రముచేత బరిశుద్ధుఁడగును, భోగముకొఱకు ప్రతిగ్రహించినవాఁడు మూడు తప్తకృచ్ఛ్రములనాచరింపవలయును అన్నవస్త్రములను ప్రతిగ్రహించినవాఁడు పరాకము నాచరింపవలయునని కూర్మపురాణమునందుఁ జెప్పఁబడియె॥

## ✽ పుస్తకప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ✽

(౮౭౬) అథపుస్తకప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ శాస్త్రంపురాణంకావ్యంచస్మృతింనాటకమేవచ। యోదద్యాత్పుణ్యకాలేషువ్యతీపాతేచవైధృతౌ॥ ద్విజాయాధ్యాత్మవిదుషేఫలకంవాథలేఖనం। సప్తజన్మసువిద్యావాన్సర్వశాస్త్రార్థతత్త్వవిత్॥ కౌర్మే॥ పురాణంధర్మశాస్త్రంచస్మృతింకావ్యంసనాటకం। పుణ్యకాలేషుసంక్రాంతౌ గ్రహణేచన్ద్రసూర్యయోః॥ యోదద్యాద్విప్రవర్యాయసభవేత్సర్వశాస్త్రవాన్। యోద్విజోద్రవ్యలోభేనప్రతిగృహ్యాసరస్వతీం॥ సోపిజన్మాన్తరేరాజన్విద్యావాన్సంప్రజాయతే। ప్రతిగృహ్యాథనార్థంతువిక్రయంమోహబుద్ధితః॥ కుర్యాద్యదిసపాపాత్మాప్రాజాపత్యత్రయంచరేత్। ఉపోష్యరజనీమేకాంపంచగవ్యంపిబేచ్చుచిః॥ అస్యాధాదోషమాప్నోతిప్రాత్యోభవతిభూతలే ॥ ఇతిపుస్తకప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౮౭౭) ఇకనుపుస్తకప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచు

న్నాడు ॥ పుణ్యకాలములయందును, వ్యతీపాతమునందును, వైధృతియందు ను, శాస్త్రమునైనను, పురాణమునైనను, కావ్యమునైనను, స్మృతినైనను, నాటకమునైనను, ఫలకమునైనను, లేఖనమునైనను, వేదవేత్తయగుబ్రాహ్మణునకు దానముసేసినవాడు, ఏడుజన్మములదనుక సకలశాస్త్రార్థవేత్తయైపుట్టునని స్కాందపురాణమునందు జెప్పబడియె. కూర్మపురాణమునందును నిష్ఫలముగానే చెప్పబడియె. మఱియుసట్టిప్రతిగ్రహమును లోభబుద్ధిచేత జేసినవాడుప్రాయశ్చిత్తమును జేసికొనవలయుననియె. అదియెట్లనినధనాశచేతప్రతిగ్రహించి యాగ్రంథములనువిక్రయించి ధనమునార్జించుపాపాత్ముడుమూడుప్రాజాపత్యకృచ్ఛ్రములనాచరింపవలయును. మఱియునొకదినముపవసించి పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్లుసేయనివాడు వ్రాత్యుడైపుట్టుననియును కూర్మపురాణమునందు జెప్పబడియె.

——* వ్రాత్యాదిభ్యోపవీతప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *——

(౬౬౨) అథవ్రాత్యాదిభ్యోయజ్ఞోపవీతప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ బ్రహ్మాండే॥ అనధ్యాయేతుయత్సూత్రం యత్సూత్రంరండయాకృతమ్॥ యత్సూత్రందాహసమ్భూతం క్రీతంయద్బ్రహ్మసూత్రకమ్॥ వ్రాత్యాదిభిశ్చయద్దత్తంతత్సూత్రంపరివర్జయేత్। అపుచ్ఛగ్రంథిసంయుక్తం స్థూలంసూక్ష్మంసబర్బరం॥ ప్రమాణహీనమథికంనధార్యంతద్ద్విజాతిభిః। నాభేరూర్ధ్వమనాయుష్యమధస్తాచ్చేత్తపఃక్షయః॥ తస్మాన్నాభిసమంకుర్యాదుపవీతంవిచక్షణః॥ ఏకావృతంగార్హపత్యంద్వితీయందక్షిణానలం॥ తృతీయంచాహవనీయంస్యాద్వ్యాహృత్యైదమయీంశుభా। గ్రంథిస్తస్యాపరంబ్రహ్మాతద్ధృత్వావిప్రపుఙ్గవః॥ నిత్యనైమిత్తికాదీనికర్మాణీహసమాచరేత్। దినేదినేక్రతుఫలంసమ్ప్రాప్నోతినసంశయః॥ ఏతద్దుర్మార్గవృత్తిభ్యఃప్రతిగృహ్యద్విజాతయః। యద్యత్కర్మయదాకుర్యాత్తత్తదాప్నోతినిష్ఫలం॥ పూర్వవల్లక్షణోపేతముపవీతంద్విజోత్తమః। ధృత్వానిత్యంయదాకుర్యాత్తదానన్తాయకల్పతే॥ యాజ్ఞవల్క్యః॥ అష్టోత్తరశతంసూత్రమేతద్వ్యాజననైయినామ్। ఇతరేషుచసర్వత్రషణ్ణవత్సూత్రముచ్యతే॥ అంగుళ్యగ్రేణ్వనాయుష్యంఅంగుళ్యాద్వాతపఃక్షయః। తస్మాదంగుళిమధ్యేతుతత్తన్తుంకారయేద్బుధః॥ కేశవాదిచతుర్వింశనామసంఖ్యాచతుష్టయాం। షణ్ణవతేతిముఖ్యత్వంయాజ్ఞవల్క్యమితిస్మృతిః॥ బ్రహ్మచారిణామేకంస్యాద్గృహస్థాబహుధారయేత్। ద్వాదశాష్టాగృహస్థస్య చత్వారిచవనవాసినః॥ భుక్త్వాత్తమనధ్యాయంవిక్రీతంవిధవాకృతం। పతితంతోరణంఛిన్నంతత్సూత్రంసప్తవివర్జయేత్॥ పూర్వోక్తైభ్యస్తునాన్యేభ్యః ప్రతిగృహ్యోపవీత

శ్లో॥ కుర్యాద్యది ద్విజః కర్మ సమహాదోషమాప్నుయాత్॥ తద్దోషాపశమాయాలం ప్రాజాపత్యం సమాచరేత్। అన్యథా ప్రత్యవాయసుఖధూయా దన్యథా దుఃఖవాన్భవేత్॥ ఇత్యుపవీతప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౭౭) ఇకను వ్రాత్యాదులవలన యజ్ఞోపవీతమును ప్రతిగ్రహించిన దోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ అనధ్యాయనదినములయందు జేయబడిన యజ్ఞోపవీతమును, దండచేత జేయబడిన యజ్ఞోపవీతమును, దారుసంభూతమైన యజ్ఞోపవీతమును, క్రయమునకు దీయబడిన యజ్ఞోపవీతమును, వ్రాత్యాదులచేత నివ్వబడిన యజ్ఞోపవీతమును ధరింపగూడదు. పుచ్ఛగ్రంథులతో గూడుకొననిదియును, మిగుల స్థూలమైనదియును, మిగుల సూక్ష్మమైనదియును, బర్బరముతో గూడినదియును, ప్రమాణహీనమైనదియును, అధికప్రమాణముగలదియును నగు యజ్ఞోపవీతమును ధరింపగూడదు. నాభికూర్ధ్వభాగమునందుండెనేని యాయుర్నాశమగును. అధోభాగమునందుండెనేని తపోనాశమగును. అందువలన యజ్ఞోపవీతము నాభికి సమముగనుండవలయును. ఏకావృతము గార్హపత్యాగ్నియనియును, రెండవది దక్షిణాగ్నియనియును, మూడవదియావహనీయాగ్నియనియును నెఱుంగవలయును. యజ్ఞోపవీతముయొక్క ముడి బ్రహ్మయజ్ఞమనియును నెఱుంగవలయును. కావున నిత్యనైమిత్తికాదికర్మలను యజ్ఞోపవీతములను ధరించియాచరింపవలయును. ఇట్లు యజ్ఞోపవీతమును ధరించి నిత్యనైమిత్తికకర్మలనాచరించెనేని దినదినమందును క్రతుఫలమును బొందునని యెఱుంగవలయును. దుర్మార్గప్రవర్తనగలవారివలన గ్రహించిన యజ్ఞోపవీతమును ధరించి చేసినకర్మలన్నియును నాశమును బొందును. కావున బూర్వోక్తలక్షణములతో గూడిన యజ్ఞోపవీతమును ధరించి నిత్యనైమిత్తికకర్మలనాచరింపవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పబడియె. నూటయెనిమిదంగుళములుగల యజ్ఞోపవీతము వాజసనేయులకు పయుక్తమగును. తొంబదారంగుళములుగల యజ్ఞోపవీతమితరులు గ్రహింపదగినది. అంగుళ్యగ్రమునందనాయుష్యము. అంగుళ్యాదియందు తపోనాశమగును. కావున సంగుళులమధ్యయందు తంతువును జేయవలయును. కేశవాదిచతుర్వింశతినామములను నాలుగుపర్యాయములు తిరిగివచ్చుటచేత దొంబదారంగుళములుగల యజ్ఞోపవీతము ప్రశస్తమైనదని యాజ్ఞవల్క్యుడు వచించె. బ్రహ్మచారి, ఒకట యజ్ఞోపవీతమును ధరింపవలయును. గృహస్థుడు రెండు యజ్ఞోపవీతములు మొదలుకొని పది రెండువఱకును ధరింపదగును. భోజనోత్తరమునందు జేయబడిన యజ్ఞోపవీతమును, అనధ్యాయనదినములయందు జేయబడిన యజ్ఞోపవీతమును

విధవాకృతయజ్ఞోపవీతమును, ఛిన్నతంతువులుగలయజ్ఞోపవీతమును, మఱియునుబూహ్వోక్తములగు యజ్ఞోపవీతములనుధరింపగూడదు. అవివేకాదుల వలనదుష్టలక్షణములుగల యజ్ఞోపవీతముసుధరించినవాడు ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరింపవలయును. ఇట్లుసేయడేని దుఃఖవంతుడగునని యాజ్ఞవల్క్యుడు చెప్పె.

——— ❋ నటవిటగాయకేభ్యఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ❋ ———

(౪౭౮) అథనటవిటగాయకేభ్యః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ నటశ్చవిటవృత్తిశ్చ గాయకఃపరిహాసకః। చారువాకశ్చపంచైతేనకర్మార్హాఃకలౌయుగే॥ దేవాగారేరాజభవనేవృత్తింప్రాప్య దినేదినే। కుమారీంభగినీంవాస్యాంనర్తయేద్యస్సవైనటః॥ వేదశాస్త్రంపరిత్యజ్యనిత్యంనైమిత్తికంతథా। విసృజ్యపరనారీగస్సపుమాన్విటవృత్తిమాన్॥ హరీశ్వరంకథాంత్యక్త్వాప్రబన్ధాన్పురుషకల్పితాన్। పఠన్యోవర్తతేనిత్యంసగాయకఇతీరితః॥ మాతరంభగినీంశ్వశ్రూంశ్వశురంపితరంగురుం। దేవంవహ్నింతథా ధేనుంయస్సదాపరిహాసమేత్॥ యస్సదావర్జయంతీహసాధవస్సాధువత్సలాః॥ పరిహాసజనస్సోహితంకదానావలోకయేత్॥ అవాచ్యంవాసువాచ్యంవాసదాదుర్భాషణంవదన్। సర్వాన్సాధూన్సమాలోక్యచారువాకైర్విహాసయేత్॥ స సర్వధర్మసంత్యాగీచారువాకఇతీరితః। ఏతేభ్యోయదియోవిప్రః ప్రతిగ్రహణముత్తమమ్॥ కుర్వీతదేహశుద్ధ్యర్థంప్రాజాపత్యంవిశోధనమ్। ఉపోష్యరజనీమేకాంచ పంచగవ్యంపిబేత్తతః॥ ప్రాయశ్చిత్తమిదంప్రోక్తం సర్వపాపప్రణాశనం॥ ఇతినటవిటగాయకేభ్యఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౭౮) ఇకసునటవిటగాయకులవలన ప్రతిగ్రహముసేసినదోషనివారక ప్రాయశ్చిత్తవిధానమునుజెప్పుచున్నాడు॥ నటుడు, విటుడు, గాయకుడు, పరిహాసకుడును, చారువాకుడునునను నైదుగురును, కలియుగమునందు గర్హ్యులుగారనిమెఱుంగవలయును. రాజగృహమునందును, దేవాగారమునందును, దినదినమందుసువృత్తినవలంబించి కుమార్తెనైనను, తోబుట్టువునైనను, మఱియొకర్తెదానినైనను, నాట్యమునందుపయోగించుచు జీవించువాడు నటుడనిచెప్పబడును. వేదశాస్త్రములనువదలి నిత్యనైమిత్తికములనువదలి పరస్త్రీలనుబొందువాడు విటుడనిచెప్పబడును. మఱియునుహరీశ్వరకథనువదలి పురుషకల్పితములగు ప్రబంధములను పఠించుచుజీవించువాడు గాయకుడనబడుదురు. తల్లిని, అక్కను, అత్తను, మామను, తండ్రిని, గురువును, దేవతను, అగ్నిని, ధేనువును, సర్వకాలములయందును, పరిహాసమును జేయువాడు

పరిహాసకుడనబడును. ఇట్టిపరిహాసకునితో మాటలాడగూడదు. చెప్పదగినమాటలైనను, చెప్పదగనిమాటలైనను, దుర్భావములైనను, పలుకుచు, సాధుజనులను జూచి పరిహాసముచు జేయువాడును, సర్వధర్మములను పరిత్యాగము సేయువాడును, చాటువాకుడని చెప్పబడును. ఇట్టివారివలన ధనాదికమును ప్రతిగ్రహించినవాడు దేహశుద్ధికొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. మఱియు నొకదినముపవసించి పిమ్మట పంచగవ్యప్రాశనను జేయవలయును. ఈప్రాయశ్చిత్తము సర్వపాపములను నశింపజేయునని మార్కండేయుడు వచించెను.

## ఆభీరప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౭౯) అథ ఆభీరప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ సూతప్రోక్తే॥ బ్రాహ్మణః ప్రతిగృహ్ణీయాత్సర్వతో భీరవర్జితమ్। ఏతస్య నిష్కృతిర్నాస్తి హ్యాభీరాణాం ప్రతిగ్రహే॥ స్కాందే॥ భాషాన్తరం న జానాతి స్వభాషాయాం న సంవదేత్। అయం విప్రస్త్వయం దేవ ఇదం పాపమిదం ఫలం॥ కుటీరే వర్తులాకారే అజధేనుప్రపోషకః। తత్క్షీరాదీని విక్రీయ జీవేచ్చాపి సదా భువి॥ ఆభీర ఇతి విఖ్యాతస్సర్వకర్మబహిష్కృతః। తస్మాద్ధనం వా ధాన్యం వా పుణ్యకాలేఽపి నాగతే॥ ప్రతిగృహ్య స్వజో లోభాత్పశ్చాన్నరకమశ్నుతే। తద్దోషపరిహారార్థం ప్రాజాపత్యద్వయం చరేత్॥ అన్యథా దోషమాప్నోతి నతస్మాన్నాచ్యతేఽధునా॥ ఇత్యాభీరప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౭౯) ఇకను ఆభీరప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ బ్రాహ్మణుడగువాడు ఆభీరునివలన ద్రవ్యాదికమును ప్రతిగ్రహమును జేయగూడదు. ఆభీరప్రతిగ్రహమునందు ప్రాయశ్చిత్తము లేదని సూతప్రోక్తమునందు జెప్పబడియె. భాషాంతరము నెఱుఁగక స్వభాషనుగూడ మాటలాడజాలక వీడు బ్రాహ్మణుడనియును, వీడు దేవుడనియును, ఇది పాపమనియును, ఇది పుణ్యమనియును, తెలియక వర్తులాకారముగల కుటీరమునందు గోవులను, మేకలను, పోషించుచు, వానిక్షీరాదులను విక్రయించుచు జీవించువాడు ఆభీరుడనబడును. మఱియు నట్టివాడు సర్వకర్మబహిష్కృతుడనబడును. కావున నట్టివానివలన పుణ్యకాలాదులయందు ధనాదికమును ప్రతిగ్రహింపగూడదు. అవివేకాదులవలన ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు నరకలోకమును బొందును. కావున దద్దోషపరిహారముకొఱకు రెండు ప్రాజాపత్యముల నాచరింపవలయునని స్కాందమునందు జెప్పబడియె.

## చాతుర్మాస్యవ్రతాదిషుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౮౦) అథచాతుర్మాస్యవ్రతాదిషుప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః ॥ శాకంజీరకతాంబూలం గోధూళిస్నానమేవచ। గోశృంగోదకసంస్నానం సంధ్యాయాం మానమేవచ॥ త్రికటుకంధనంధాన్యంహారిద్రాదానమేవచ। విప్రపాదోదకస్నానం విప్రవందనమేవచ॥ శివవిష్ణ్వోర్వాశ్చస్మరణం పురాణపఠనంతథా। పురాణశ్రవణంశాస్త్రపఠనంతులసీదళైః॥ విష్ణుపూజాంతథాశంభోర్బిల్వపత్రైశ్చనామభిః। అథశ్శయ్యాపత్ర భుక్తిః బ్రహ్మసూత్రంచచందనం॥ తులసీదళదానంచ దూర్వాధారణమేవచ। శ్రీమూర్తిదానం ద్వాదశ్యాంసూర్యార్ఘ్యంప్రత్యహంతథా॥ మృష్టాన్నభోజనం విప్రే పాత్రస్నానంతథైవచ। సహస్రనామపఠనం విష్ణోరార్వా శంకరస్య వా॥ అఖండదీపదానంచ శాకత్యాగంతథైవచ। శ్రావణేవర్జయేచ్ఛాకందధి భాద్రపదేత్యజేత్॥ ఆశ్వినేవర్జయేత్క్షీరం కార్తికేద్విదళంత్యజేత్। త్యజ్యాన్నలంపల్లవంపుష్పం ఫలంకోశంచజీరకం॥ శుంగంబీజంచనిర్వాసందశధాశాకఉచ్యతే। ధాత్రీఫలం సచాగ్రాహ్యం విష్ణుప్రీతికరం మహత్॥ శాకత్యాగంతథావిష్ణోఃప్రతిదినేపాపవర్జితం। క్షీరాబ్ధిపూజారాజేంద్రదివానిద్రావివర్జనః॥ పంచగవ్యప్రాశనంచద్వాదశీద్వాదశీదినే। తథాతైస్స్నపనంశంభోర్హరేర్వాప్రత్యహంవ్రతీ॥ రజ్జవల్లీవ్రతంతద్వద్గోష్ఠేబృందావనేపివా। ప్రతిమాస చతుర్థ్యాంతుగణనాథస్యపూజనం॥ ప్రతిపక్షంతృతీయాయాంగౌరీపూజామహాప్రదం। ద్వాదశ్యాంప్రత్యహంవాపిగోదానంపాపనాశనం॥ ఏతాని చాతుర్మాస్యవ్రతాని॥ ఏతేషాంతువ్రతానాంచమహత్సూద్యాపనేషుచ। ప్రతిగృహ్యద్విజోలోభాత్తత్తద్దానంసుఖాప్రదే॥ తత్తత్పాపఫలంభుక్త్వాయమలోకమవాప్నుయాత్। ఏతత్పాపవిశుద్ధ్యర్థంప్రాయశ్చిత్తమనుదాహృతం॥ గవాంప్రతిగ్రహేచాంద్రంసుక్లైతప్తమేవచ। ప్రాజాపత్యంతథావస్త్రే అన్నే గవ్యంపిబేత్తతః॥ ఏతేషాంద్రవ్యబాహుళ్యేపూర్ణప్రాయశ్చిత్తముక్తం॥ అల్పే తదర్ధం॥ అత్యన్తాల్పేపాదం॥ అతోన్యూనంచేన్నగ్రాహ్యః॥ ఇతిచాతుర్మాస్యవ్రతోద్యాపనేషుప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౮౦). ఇకనుచాతుర్మాస్యవ్రతాదులయందలిప్రతిగ్రహదోషనివారకప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ శాకమును, జీరకమును, తాంబూలమును, గోధూళిస్నానమును, గోశృంగోదకసంస్నానమును, సంధ్యాకాలములయందలి స్నానమును, త్రికటుకములను, ధనమును, ధాన్యమును, హారిద్రాదానమును, విప్రపాదోదకస్నానమును, విప్రవందనమును, శివకేశ

షస్మర్ణ్ణా పురాణపఠనము, పురాణశ్రవణము, శాస్త్రపఠనము, తుల సీపత్రములచేత విష్ణుపూజను జేయుట, శివనామముల నుచ్చరించుచు బిల్వద ళములచేత శివుని పూజించుట, అధశ్శయ్య, పత్రభుక్తి, బ్రహ్మసూత్రము, చందన ము, తులసీదళపానము, ఊర్ధ్వధారణము, ద్వాదశియందు శ్రీమూర్తిదాన ము, ప్రతిదినమునందును సూర్యార్ఘ్యము, వృష్టాన్నభోజనము, ప్రాతస్స్నా నము, శివకేశవులయొక్క సహస్రనామపఠనము, అఖండదీపదానము, శాక త్యాగము, భాద్రపదమునందు దధి, అశ్వయుజమాసమునందు క్షీరమును, కా ర్తికమునందు ద్విదళమును వదలవలయును. మఱియును త్వక్కులమును, పల్లవ మును, పుష్పమును, ఫలమును, కోశమును, జీరకమును, అంగమును, బీజమును, ని ర్యాసమును, పదివిధములగు శాకమును, ధాత్రీఫలమును సర్వకాలములయందు ను వదలవలయును. శాకత్యాగము, విష్ణుదేవునియొక్క మహాదినములయందు నుపవాసవర్జితము, క్షీరాబ్ధిపూజ, పగటియందు నిద్రను వదలుట, ప్రతిద్వాదశియం దును పంచగవ్యప్రాశనము, పంచగవ్యస్నానము, ప్రతిదినమునందును శివ వ్రత మునైనను, విష్ణువ్రతమునైనను, ఆచరించుట, బృందావనమునందైనను, గోష్ఠము నందైనను, రంగవల్లివ్రతమునాచరించుట, ప్రతిమాసమునందలి చతుర్థియం దును, గణనాథపూజనము, ప్రతిమాసమునందలి తృతీయయందును, గౌరీపూ జావ్రతమును, ద్వాదశియందు పాపనాశమును జేయునట్టి గోదానమును, చేయ వలయును. ఇవియన్నియును చాతుర్మాస్యవ్రతములని యెఱుంగవలయును. ఇట్టివ్రతములనాచరించి వ్రతోద్యాపనకాలములయందు లోభబుద్ధిచేత దాన ము ప్రతిగ్రహించినవాడు యమలోకమును బొందును. కావున ప్రాయశ్చిత్త మును జేసికొనవలయును. అదియెట్లనిన గోదానమును ప్రతిగ్రహించినవాడు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. సువర్ణప్రతిగ్రహమునందు తప్త కృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరింపవలయును. వస్త్రమును ప్రతిగ్రహించినవా డు ప్రాజాపత్యకృచ్ఛ్రమును జేసికొనవలయును. అన్నమును బ్రతిగ్రహించిన వాడు పంచగవ్యప్రాశనను జేయవలయును. ఈ దానములయందు ద్రవ్యబా హుళ్యముగలిగియుండెనేని పూర్ణప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయుఁడు వచించె.

—(*) కార్తికమాసవ్రతోద్యాపనప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. (*)—

(౪౮౧) అథ కార్తికమాసవ్రతోద్యాపనప్రతిగ్రహప్రాయశ్చిత్త మాహ॥ మార్కండేః॥ నవలక్షార్చనం శమ్భోర్విష్ణోర్వాపుష్పజాతిభిః। తత్పూర్ణ మ్యాం వృషోత్సర్గో నక్తవ్రతమతః పరం॥ సర్వశాకపరిత్యాగో దమ్పత్యో

ర్భోజనం తథా॥ ఆకాశదీపం ద్వారే చ శిఖరే దీపమేవ చ॥ అఖండదీపం కార్తిక్యాం ధాత్రీపూజనమేవ చ। ధాత్రీదానం తథా విప్ర తులస్యర్చనమేవ చ॥ ప్రాతస్స్నానం మాసపూర్ణం శివవిష్ణ్వోః ప్రపూజనం। తాంబూలదానం కార్తిక్యాం ఫలదానం మహాఫలం॥ పురాణపఠనం చైవ పురాణశ్రవణం తథా। వేదపారాయణం చైవ ధర్మశాస్త్రం తథైవ చ॥ ప్రత్యహం సాయమాకాశదర్శనం పాపనాశనం। పంచగవ్యాభిషేకం చ పంచగవ్యస్య భక్షణం॥ స్మరణం కీర్తనం శమ్భోర్విష్ణోర్నామసహస్రకం। ప్రత్యహం శాకదానం చ బ్రహ్మపత్రేషు భోజనం॥ పాషండజనసంగం చ పాషండాలాపనం తథా। వర్జయేత్సర్వథా విప్రః కార్తికే తు విశేషతః॥ పరాన్నం పరశయ్యాం చ పరవస్త్రం పరాంగనాం। సర్వదా వర్జయేత్ప్రాజ్ఞః కార్తికే తు విశేషతః॥ కార్తికే వర్జయేత్తంద్రం మృషావాదం విశేషతః। సాలగ్రామశిలావారిస్నానం పాపప్రణాశనం॥ హవిష్యాన్నం వ్రతీ భుంజన్ చాంద్రాయణఫలం లభేత్। అవ్రతేన త్వపెద్యస్తు మాసం దామోదరప్రియం॥ పుమాన్మహాపరీతాత్మా సూకరేష్వభిజాయతే। న కార్తికసమో మాసో న దైవం కేశవాత్పరం॥ తావుభాయాదిసన్త్యజ్యావర్తేన్మాత్రపాపధీః గోపీచందనదానం చ తులసీదానమేవ చ॥ ప్రత్యహం ధాన్యదానం చ వృశ్చికే కార్తికే ముదా। ఏతాని కార్తికవ్రతాని॥ ఉద్యాపనే మమ సర్వేషాం వ్రతానాం పుణ్యకర్మసు। ప్రతిగృహ్య ద్విజో యస్తు వర్తయన్నాత్మపోషణం॥ మహాదోషమవాప్నోతి యమలోకే భయంకరే। ప్రాయశ్చిత్తమిదం తస్య దర్శితం విప్రపుంగవైః దీపప్రతిగ్రహే చాంద్రం పరాకం స్వర్ణసంగ్రహే। వస్త్రే కాంస్యే తథా తామ్రే ప్రాజాపత్యం విశోధనం॥ అన్నే జలే చ మృష్టే చ తదర్ధం పరికీర్తితం। ద్రవ్యాధిక్యేఽల్పే చ పూర్వవద్వేదితవ్యం॥ ఇతి కార్తికవ్రతోద్యాపనే ప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౮౮౧) ఇకను కార్తికమాస వ్రతోద్యాపనములయందు ప్రతిగ్రహమును జేసిన దోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ శివునకైనను, విష్ణుదేవునకైనను, పుష్పాదులచేతనవలక్షార్చనమును జేసి కార్తికపూర్ణమాస్యయందు వృషత్యాగమును జేయవలయును. పిమ్మట నక్తవ్రతమునాచరింపవలయును. మఱియును సర్వశాకపరిత్యాగమును, దంపతీభోజనమును, ఆకాశదీపమును, ద్వారశిఖరములయందుదీపమును, అఖండదీపమును, ధాత్రీపూజనమును, ధాత్రీదానమును, తులసీపూజనమును, ప్రాతస్స్నానమును, మాసపూర్ణవ్రతమును, శివవిష్ణుపూజను, తాంబూలదానమును, ఫలదానమును, పురాణపఠనమును, పురాణశ్రవణమును, వేదపా

రాయణను, ధర్మశాస్త్రమును, పంచగవ్యాభిషేచనమును, పంచగవ్యభక్షణను, శివునియొక్క సహస్రనామపఠన స్మరణకీర్తనములను, ప్రతిదినమునందును, శాకదానమును, బ్రహ్మపత్రభోజనమును, పాషండజనసంబంధపరిత్యాగమును, పాషండాలాపనరాహిత్యమును, జేయువలయును. మఱియును సర్వకాలములయందును, పరాన్న, పరశయ్యా, పరవస్త్ర, పరాంగనలను వదలవలయును. కార్తికమాసమునందు క్షౌద్రమును, మృషావాదమును వదలవలయును. సాలగ్రామశిలోదక స్నానమును జేయువలయును. హవిష్యాన్నమును భుజింపవలయును, ఇట్లు సేసినవాడు చాంద్రాయణఫలమును బొందును. దామోదరప్రియమగు కార్తికమాసవ్రతము నాచరింపనివాడు సూకరయోనియందు బుట్టును. కార్తికమాసమునకు సమమైన మాసము, కేశవునకుదుల్యుడగు దేవుడును లేడు. కార్తికమాసమునందు గోపీచందనదానమును, తులసీదానమును ధాన్యదానమును జేయువలయును. కార్తికమాసవ్రతోద్యాపనమునందు లోభబుద్ధిచేత దానాదులను బ్రతిగ్రహించిన బ్రాహ్మణుడు మిగుల బాపవంతుడగును. కావున నట్టిదోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తవ్రతము నాచరింపవలయును. దీపప్రతిగ్రహమునందు చాంద్రాయణవ్రతమును, స్వర్ణప్రతిగ్రహమునందు పరాకకృచ్ఛ్రమును. వస్త్రకాంస్యతామ్రముల ప్రతిగ్రహమునందు, ప్రాజాపత్యకృచ్ఛ్రమును, అన్నోదకప్రతిగ్రహమునందు, అర్ధప్రాజాపత్యకృచ్ఛ్రమును, ఆచరింపవలయును. ద్రవ్యాల్పాధిక్యములయందు పూర్వోక్తప్రకారముగ దెలిసికొనవలయునని స్కాందపురాణమునందు జెప్పబడియె.

——మాఘమాసవ్రతోద్యాపనప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.——

(౮౭౩) అథమాఘమాసవ్రతోద్యాపన ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లింగపురాణే॥ తిలహోమశ్చ తద్దానం తత్స్నానం తర్పణం తథా। తద్భక్తిశ్చ తదాలేపష్షష్ఠద్విధం పాపనాశనం॥ మార్తాండోదయవేళాయాం స్నానం సర్వాఘనాశనం। పురాణపఠనంచైవ పురాణశ్రవణం తథా॥ బదరీఫలదానంచ తిలపిష్టం మహాఫలం। తథాన్యఫలదానంచ పూజనం శంకరే హరౌ॥ సాలగ్రామశిలాతీర్థం ప్రత్యహం ధారయేత్సదా। సూర్యస్యార్ఘ్యం వందనంచ తులసీపూజనం తథా॥ సాలగ్రామశిలాదానం మాసమేకం నిరంతరం। వందనం విప్రముఖ్యానాం తథా బ్రాహ్మణభోజనం॥ గోదానం ప్రత్యహం విష్ణోః ప్రీతయే పాపనాశనం। తిలతండులదానంచ కుంభదానమతః పరం॥ సహస్రనామపఠనం శివవిష్ణ్వోర్నిరంతరం। వస్త్రదానం తదానూనం జపఫలమేవచ॥ గోపీచందనదానంచ

స్తథా॥ దేవాలయేవా రాజేన్ద్ర దేవతారాధనంతథా। విదుషఃపూజనంపాప నాశనంపుణ్యదాయకం॥ చూతపల్లవపుష్పైశ్చ పూజనంప్రత్యహంతథా। సూపౌదనంతథామాఘే భోజయేచ్ఛ్రీపదంముదా॥ అఖండదీపదానంచస్వగృహే దేవసన్నిధౌ। దేవాలయేవా రాజేంద్రదీపదానంప్రబుద్ధిదం॥ చూతకోశప్రదానంచతథాలవణమేవచ। తామ్బూలదానంవిప్రాణాం మేకంవాబహుశోపివా॥ మృష్టాన్నదానంవిప్రాణాంవిప్రయోరేకమేవవా। తథాచకింశుకైఃపుష్పైరుభయోఃపూజనంతథా॥ ఉభయోః- హరిహరయోః॥ కింశుకైర్లింగపూజాచ తథాదానంవిశేషతః॥ ఇతిమాఘమాసవ్రతాని॥ వ్రతేష్వేతేషుసర్వేషువిప్రోయఃప్రతిగృహ్యచ। సగచ్ఛేద్యమసాన్నిధ్యంమహాభీతిప్రదంనృణాం॥ ప్రాయశ్చిత్తమిదంరాజన్ సర్వపాపప్రణాశనం। ధేనుప్రతిగ్రహేతప్తకృచ్ఛ్రత్రయమథాచరేత్॥ సువర్ణప్రతిమాగ్రాహీప్రాజాపత్యద్వయంచరేత్। తామ్రకాంస్యతిలానాంచస్వీకారేకృచ్ఛ్రయాచరేత్॥ అన్నేజలేచవస్త్రేచతదర్ధంకృచ్ఛ్రమాచరేత్। ఏతేషాంవ్రతానాముద్యాపనేషుప్రతిగ్రహే ప్రధానపరిత్యాగకర్మసాధనేవానప్రాయశ్చిత్తం। నోచేత్ప్రాయశ్చిత్తమేవేతివేదితవ్యం॥ ఇతిమాఘమాసవ్రతోద్యాపనేప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౭౬౬) ఇకను మాఘమాసవ్రతోద్యాపనప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమునుజెప్పుచున్నాడు॥ తిలహోమ, తిలదాన, తిలస్నాన, తిలతర్పణ, తిలభుక్తి, తిలభుక్తులనువారును పాపనాశకములని యెఱుంగవలయును. సూర్యోదయకాలమునందలిస్నానము సర్వపాపములనునశింపజేయును. పురాణపఠనము, పురాణశ్రవణము, బదలీఫలదానము, తిలపిష్టము, సాలగ్రామశిలాతీర్థము, అనువానినిదినదినమందును జేయవలయును. సూర్యునకర్ఘ్యవందనములను, తులసీపూజనమును, చేయవలయును. మాఘమాసమునందలి ప్రతిదినమునందును, సాలగ్రామశిలాదానమును జేయువలయును. బ్రాహ్మణసమస్తాకారభోజనములను జేయువలయును. మఱియునుదినదినమందును, విష్ణుప్రీతికొఱకుగోదానమును జేయవలయును. మఱియును, తిలతండులదానమును, కుంభదానమును, శివకేశవులయొక్క-సహస్రనామపఠనమును, వస్త్రదానమును, జంబీరఫలదానమును, గోపీచందనదానమును, గంధపూజనమును, పుస్తకదానమును, స్వగృహమునందైనను, దేవసన్నిధియందైనను, దేవాలయమునందైనను, దేవతారాధనను జేయవలయును.విద్వత్పూజనము, పాపనాశనమును, పుణ్యదాయకమునని యెఱుంగవలయును. చూతపల్లవపుష్పములచేత ప్రతిదినమందును బూజను జేయువలయును. మఱియును సూపోదనభోజనమును జేయు

వలయును. స్వగృహమునందైనను, దేవసన్నిధియందైనను, దేవాలయమునందైనను, అఖండదీపదానమును జేయవలయును. చూతకోశప్రదానమును, లవణదానమును తాంబూలదానమును జేయవలయును. మఱియు బహుమంది బ్రాహ్మణులకైనను, ఇరువురిబ్రాహ్మణులకైనను, అన్నదానమును జేయవలయును. మఱియు నాబ్రాహ్మణులకు కింశుకాదులచేత బూజను జేయవలయును. ఇట్టివైశాఖమాసవ్రతమునందు ప్రతిగ్రహమును జేసినవాడు యమలోకమును బొందును. కావుననిట్టిదోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును, అదియెట్లనిన ధేనుప్రతిగ్రహమునందు తప్తకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. సువర్ణమును మాత్రము బ్రతిగ్రహించినవాడు రెండు ప్రాజాపత్యములనాచరింపవలయును. తామ్రకాంస్యతిలలను బ్రతిగ్రహించినవాడొకకృచ్ఛ్రమునాచరింపవలయును. అన్నోదకవస్త్రములనుప్రతిగ్రహించినవాడు, అర్ధకృచ్ఛ్రము నాచరింపవలయును. ఇట్టిప్రతిగ్రహములయందుప్రధానద్రవ్యమును పరిత్యాగమును జేసినవాడీ ప్రాయశ్చిత్తముల నాచరింపనక్కఱలేదని లింగపురాణమునందు జెప్పబడియె.

—— ❋ వైశాఖమాసవ్రతోద్యాపనేప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ❋ ——

(౪౮౩) అథవైశాఖమాసవ్రతోద్యాపనేప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ ప్రపాశయ్యాచపుష్పాణాముశీరాణాంసురేశ్వర। పుష్పప్రవాళపర్ణానివ్యజనంవేణుసమ్భవం॥ ఛత్రంపుష్పంతథాగంధఃపాదుకాద్వయమేవచ। దధ్యన్నంఫలసంయుక్తంతథాచైవగుడోదకం। తథైవచమ్పకాశోకముశీరంశర్కరాతథా॥ లవంగమేలకంచైవజాతీకుసుమమేవచ। కర్పూరంశీతలంతోయంసైకతంజలసేకజం॥ హేమామ్బుదానంపుష్పాణాంపటీంకాసుమ్భరంజితాం। తక్రంజమ్భీరనీరేణయుక్తంలవణసంయుతం॥ ప్రాశనంచవైశాఖేతథామాధవపూజనం। వసంతమాధవప్రీత్యైదద్యాదేతానిపార్థివ॥ ఏతేషాందానమాత్రేణనరాయాంతీంద్రసమ్పదం। తతస్తుభువమాసాద్యమండలాధిపతిర్భవేత్॥ వైశాఖేప్రత్యహంకృత్వాద్వాదశ్యాంపౌర్ణమీదినే। సర్వపాపవిముక్త్యర్థంకుర్యాద్వాపంచపర్వసు॥ వ్రతస్యోద్యాపనంకుర్యాత్సద్వ్రతస్యపరిపూర్తయే। ఉద్యాపనేషువైశాఖేయఃకుర్యాత్తత్ప్రతిగ్రహం॥ ససర్వనరకాన్భుక్త్వాపికోభూయాత్తతఃపరం। ధేనుప్రతిగ్రహేరాజన్తత్రప్రధానంపరిత్యజేత్॥ కుర్యాచ్చాంద్రాయణంసమ్యక్ శయ్యాయాంద్విగుణంస్మృతం। పుష్పప్రవాళోశీరశయ్యాస్వేవంవేదితవ్యం॥ సువర్ణరజతేథాన్యేపూర్వవత్సుసమాహితః। తతోర్ధార్ధప్రమాణేనప్రాయశ్చిత్తంవిశోధనం॥ ప్రాయశ్చి

త్తమకృత్వా చనశుద్ధః పూర్వజోన్యతః। తస్మాత్ప్రతిగ్రహస్త్యాజ్యస్సాత్త్వికేషువ్రతేష్వపి॥ ఇతి వైశాఖమాసవ్రతోద్యాపనప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౮౩) ఇకను వైశాఖమాస వ్రతోద్యాపనమునందలి ప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ వైశాఖమాసమునందు, ప్రాతఃకాలమున స్నానమును జేసి వసంతమాధవుని పూజించి తత్ప్రీతికొఱకు, చలిపందిరిని, పుష్పశయ్యను, పుష్పప్రవాళపర్ణములను, వ్యజనమును, ఛత్రపుష్పగంధములను, పాదరక్షలను, ఫలాదులతోగూడుకొనిన దధ్యన్నమును, గంధోదకమును, చంపకాశోకోశీరశర్కరలను, లవంగమును, ఏలకులను, జాతీకుసుమమును, కర్పూరమును, చల్లనియుదకములను, జలసేకమువలనగలిగిన సైకతమును, హిమాంబుధానమును, జంబీరనీరముతోగూడినతక్రమును, బ్రాహ్మణార్థముగను పయోగింపవలయును. ఇప్పుడు చెప్పినవానిని వైశాఖమునందలి ప్రతిదినమునందైనను, లేక ద్వాదశీపూర్ణిమలయందైనను, పంచపర్వములయందైనను, ఆచరించి వ్రతోద్యాపనను జేయవలయును. ఇట్టి వ్రతోద్యాపనములయందు ప్రతిగ్రహమును జేసినవాడు ఘోరనరకములను బొందును. ధేనుప్రతిగ్రహమునందు ప్రధానద్రవ్యమును వదలి చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. శయ్యాధానమునందు రెండు చాంద్రాయణముల నాచరింపవలయును. పుష్ప ప్రవాళోశీరశయ్యలయందును నిటులనే యనుగ్రహింపవలయును. సువర్ణ, రజత, ధాన్యాదులను ప్రతిగ్రహించినవాడు పూర్వోక్తముగ ప్రాయశ్చిత్తము నాచరింపవలయును. ప్రాయశ్చిత్తమును జేసికొననివానివలన నేవస్తువును గూడ ప్రతిగ్రహింపగూడదని మార్కండేయమునివరుడు సెప్పె.

## —— నానావిధఫలప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. ——

(౪౮౪) అథ నానావిధఫలప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ కదళీం మాతులింగంచ నారికేళం ఫలం తథా। ఖర్జూరం పనసం చైవ ద్రాక్షాఫలమనుత్తమం॥ చూతం కపిత్థం జమ్బీరం జమ్బూ దాడిమమేవవా। క్షీరపూర్వఫలం చైవ తింత్రిణీఫలమేవచ॥ ఉర్వారుకఫలం చైవ ఎరండకఫలం తథా। ఫలాని యానిలోకేస్మిన్నానానామాని పార్థివ॥ యోదద్యాత్తాని సర్వాణి రాశీకృత్య ఫలార్థయే। బ్రహ్మహత్యాది పాపానాం వినాశార్థం ద్విజర్షభ॥ వస్త్రేణ వేష్టితం రాశిం దక్షిణాభిర్యథేచ్ఛయా। హేమం తైశ్శైకరేవాపి సర్వపాపైః ప్రముచ్యతే॥ దత్వేతి శేషః॥ తత్ఫలాని ద్విజోయస్తు ప్రతిగృహ్యాధనాతురః। అథానార్థం తటాకార్థం ద్వయం కుర్యాత్ప్రయత్నతః॥ తతోదోషాత్ప్రముచ్యేత హ్యన్యథా పాపమశ్నుతే। సత్కర్మఫలనాశంచ ఫలదానం మహత్తరం॥ తస్మాత్పాపవిశుద్ధ్య

ర్థం ప్రాయశ్చిత్తముదాహృతం॥ రాశీభూతంఫలందివ్యంగృహీత్వా ద్విజనాయకః। అకృత్వానిష్కృతింతస్యహ్యాధానంకర్మసాధనం॥ ఆధానంసమ్పరిత్యజ్యవిప్రానుజ్ఞామవాప్యచ। కేశానాంవపనంకృత్వా షడబ్దంకృచ్ఛ్రమాచరేత్॥ ఉపోష్యరజనీమేకాంపంచగవ్యేనశుద్ధ్యతి। నాన్యథాశుద్ధిమాప్నోతిఫలబాహుల్యసంగ్రహే॥ కేచిదిచ్ఛంతిసంస్కారంనిత్యకర్మవినాశనాత్। యదాభూదాశిసంగ్రాహాఃఫలానాంఫలనాశకః॥ తస్యకర్మాణినశ్యంతితదాఫలసుఖేచ్ఛయా। బ్రహ్మోపదేశఃకర్తవ్యోగాయత్రీదానమేవచ॥ ఏతదల్పప్రతిగ్రహవిషయేన॥ కింతురాశీకృతనానావిధఫలప్రతిగ్రహే। కర్తుఃబ్రహ్మహత్యావినాశార్ధం దానేతస్యపాపాన్య శేషాణిబ్రాహ్మణమావిశంతి। తతఃపునస్సంస్కారః॥ ప్రాయశ్చిత్తబాహుల్యం॥ ఏకద్రవ్యపరిగ్రహేమైవం ప్రాజాపత్యకృచ్ఛ్రమాత్రం। రాశిప్రతిగ్రహేప్రతిపదోక్తప్రాయశ్చిత్తాద్యసన్ప్రవేశ్యభయమస్తి॥ ఇతిరాశీకృతనానావిధఫలప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౮౪) ఇకనునానావిధఫల ప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమునుజెప్పుచున్నాడు॥ కదళీమాతులుంగాదిసర్వఫలములు సముదాయముగజేసినవానికి బ్రహ్మహత్యాదిపాపములన్నియునునశించును. ఫలములనన్నింటినిరాశిగాజేసిసదక్షిణాకముగ హేమంతఋతువునందైనను, శిశిరఋతువునందైననుదానముచేయవలయును. ఇట్టిదానమునుజేయువాడు సర్వపాపములునునశించును. అటువంటిఫలములను ధనాతురుడై ప్రతిగ్రహించినవాడు పాపవంతుడగును. అట్టిఫలములనుబ్రతిగ్రహించి సత్కార్యములయందు బ్రాహ్మణోపయోగముచేసినవానికి బాపముగలుగనేరదు. ఇట్లుసేయనివాడు ప్రాయశ్చిత్తమునుజేసికొనవలయును. అదియెట్లనినఫలరాశినిబ్రతిగ్రహించి యాఫలాధికమును బ్రాహ్మణోపయోగమునుజేయనివాడు వపనమునుజేయించుకొని షడబ్దకృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మఱియునొకదినముపవసించి పంచగవ్యప్రాశనమునుజేయవలయును. ఇట్లుచేయనివాడు సేసినపుణ్యకర్మలన్నియునునాశమునుబొందును. కావునబ్రహ్మోపదేశ గాయత్రీమంత్రోపదేశాదికమునుబొందవలయును, ఇదియల్పప్రతిగ్రహవిషయము. అధికద్రవ్యప్రతిగ్రహమునందు ప్రాయశ్చిత్తమునుగూడ నధికముగజేసికొనవలయును. ఏకద్రవ్యప్రతిగ్రహమునందు ప్రాజాపత్యకృచ్ఛ్రమునుమాత్రమాచరింపవలయును. ఫలరాశిబ్రతిగ్రహమునందు యథోక్తప్రాయశ్చిత్తమునుజేసికొనవలయునని మార్కండేయమునివరుడుచెప్పె.

## ——— * మకరసంక్రాంతివ్రతేషు ప్రతిగ్రహప్రాయశ్చిత్తం. * ———

(౮౮౫) అథ మకరసంక్రాంతివ్రతేషు ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ మార్కండేయః॥ ముద్గదీపంతిలానాంచసధాన్యంమాషదీపకం। తథాచలావణందీపంమహాదీపమనంతరం॥ శృంగబేరంతథాకన్దం హరిద్రాదానమేవచ। అన్యాఃసంతిదానానికానిచిత్ప్రథితానిచ ॥ ఏషువ్రతేషుపూర్ణేషుతదోద్యాపనమాచరేత్। మోక్షదీపంమహాపుణ్యంనరకోత్తారణంనృణాం॥ దీపాస్త్వేతేయదారాజన్పరిపాకంభజంత్యథ। తావత్సధాన్యపాత్రాణాం దానంకుర్యాద్ద్విజాతయె ॥ పారణంతత్రకుర్వీతవ్రతీవ్రతఫలాప్తయే। తత్పాత్రంయోద్విజోధృత్వాదీపధాన్యసమన్వితం॥ ఉద్యాపనేయదామోహాత్ప్రతిగృహ్య సుఖాప్తయె। తస్యైవయమలోకశ్చయావదాభూతసంప్లవం॥ దీపపాత్రాణియావంతిసవర్తీనిసధాన్యకం। ఉద్యాపనేద్విజోధృత్వా యమలోకశ్చశాశ్వతః॥ లైంగే॥ మహాదీపావసానేషుతత్పాత్రంయోద్విజోహరేత్। తస్యైవయమలోకశ్చశాశ్వతఃపుణ్యనాశనః॥ మహాదీపఫలంయావత్తావద్యుగసహస్రకమ్। యమలోకమవాప్నోతిపునరావృత్తిదుర్లభమ్॥ భవిష్యోత్తరే॥ యోద్విజోదేవతాగారేమహాదీపవ్రతేషుచ। తత్పాత్రాణిప్రగృహ్ణీయాద్వృథాయాగాదికంవినా॥ తస్యైవనరకేవాసోయావచ్చంద్రదివాకరౌ పశ్చాత్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్తంకరోమ్యహం॥ ఇతిసఙ్కల్ప్యమనసా ప్రాయశ్చిత్తంసమాచరేత్। గోధూళిరజసాస్నాత్వాతథాకృత్వాఘమర్షణమ్॥ బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతఃతప్తకృచ్ఛ్రచతుష్టయమ్। కృత్వాశుద్ధిమవాప్నోతి చాంద్రాయణమథాచరేత్॥ ముద్గదీపేపరాకంస్యాల్లవణేచాంద్రభక్షణమ్। మాషదీపేతిలానాంచ ఏకాంతప్తంసమాచరేత్॥ ప్రాజాపత్యంధాన్యదీపేపఞ్చగవ్యంతతఃపిబేత్। సర్వదీపప్రతిగ్రహప్రాయశ్చిత్తాదనంతరం పంచగవ్యప్రాశనంకర్తవ్యమ్ ॥ ఇతి మకరసంక్రాంతౌదీపప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౮౮౫) ఇకను మకరసంక్రాంతివ్రతములయందలిప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ ముద్గదీపముతిలదీపము, ధాన్యదీపము, మాషదీపము, లవణదీపము, మహాదీపము, శృంగిబేరము, కంద, హరిద్రాదానము, మఱియు నితరములగు దానములును గలవు. వీనినన్నింటిని దానముచేసి యీ వ్రతములు పూర్ణములైనపిమ్మట వ్రతోద్యాపనలను జేయవలయును, మోక్షదీపము నరకలోకమును బొందనీయక సంరక్షించును. ఇటులనే సకలదీపములును నరకోత్తారకములగును. వ్రతావసానమునందు వ్రతసిద్ధికొఱకు, పారణను జేయవలయును. ఇట్టివ్రతోద్యాపనకాలమునందు లోభబుద్ధిచేత, ప్రతిగ్రహమును జేసిన బ్రాహ్మ

ణుడు శాశ్వతముగునరకలోకమునుబొందునని మార్కండేయుఁడువచించె. మహానదీపావసానమునందు తత్పాతనుహరించినబ్రాహ్మణుడు యమలోకమునుబొందునని లింగపురాణమునందుజెప్పఁబడియె. దేవతాగారములయందును, మహావ్రతములయందును, యాగాదులకొఱకుగాక సర్నిమిత్తముగగ్రహించినవాడు యమలోకమునుబొందును. కావునసేతద్దోషనివారణకొఱకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనినసంకల్పమునుజేసి గోధూళిరజస్సుచేత నఘమర్షణస్నానమును జేయవలయును. పిమ్మటబ్రాహ్మణానుజ్ఞనుబొంది నాలుగుతప్తకృచ్ఛ్రముల నాచరింపవలయును. అనంతరమందు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును. ముద్గదీపమునందు పరాకమునాచరింపవలయును. లవణదీపమునందు చాంద్రాయణవ్రతము నాచరింపవలయును, మాషదీపతిలదీపములయందొక్కతప్తకృఛ్రము నాచరింపవలయును. ధాన్యదీపమునందుప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించి పిమ్మటబంచగవ్యప్రాశనముజేయవలయును. సర్వదీపప్రతిగ్రహ ప్రాయశ్చిత్తానంతరమందు పంచగవ్యప్రాశననుజేయవలయునని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె.

—— ❋ కారణంవినాపత్నీత్యాగినఃప్రాయశ్చిత్తం. ❋ ——

(౪౮౬) అథ కారణంవినాపత్నీత్యాగినః ప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ స్వపత్నీంయోద్విజో మోహాత్సంత్యజేత్కారణంవినా। తస్యాన్యానిష్కృతిర్నాస్తింపుంసకభవాదృతే॥ యస్త్యజేత్కులజాంసాధ్వీం లోకవార్తాపరాయణః। ఏతస్యనిష్కృతిర్నాస్తినపుంసకభవాదృతే॥ సతీత్యాగహేతుమాహ॥ లైంగే॥ అప్రజాందశమేవర్షేస్త్రీప్రజాంద్వాదశేత్యజేత్। మృతప్రజాంపంచదశేసద్యస్త్వప్రియవాదినీమ్॥ అప్రియవాదఃసాక్షాద్వ్యభిచారఃస్వదృష్టఃనతువార్తాశ్రవణమాత్రేణ। అప్రియాణిబహూనిసన్తిప్రతివార్తా। నిష్ఠురవచనం। నాభ్యుత్థానం।నపాదప్రక్షాళనాదికం। సర్వదాశాఠ్యం।దరిద్రాగమేనిన్దా। మనస్యపూర్ణేభర్తరినప్రీతిః। ఏవమాదీన్యప్రియవచనాని। ఏతేషుసత్సునసతీత్యాగః॥ కలియుగత్వాత్। వ్యభిచారస్సాక్షాత్స్వయమేవదృష్టశ్చేత్త్యాజ్యా॥ తదాహగౌతమఃస్వానుభూతం సదృష్టాంతంనతుప్రష్టవ్యనిగ్రహం। నప్రమాణంలోకవార్తా జనవాదోమృషాక్వచిత్॥ అతోభర్త్రాశ్రవణమాత్రేణనత్యాజ్యా। వృథాత్యాగేప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ దారన్యతిక్రమిలోకే నిష్కారణతయాద్విజః। ఖరాజినంబహిర్లోమధృత్వా భిక్షాటనంచరేత్॥ దారసంత్యాగినభిక్షామితివార్తాంవదన్సదా। సప్తాగారాణిభిక్షార్థంపర్యటేత్తద్భుతత్రయం॥ తతశ్శుద్ధిమవాప్నోతివాక్యంతథా రఘునందన।

భర్తృసంత్యాగమహాపాతకేన వినాస్త్రీణామప్యేవం ప్రాయశ్చిత్తంష ణ్మాసాత్కృత్వాతతశ్శుద్ధిమాప్నోతి। మహాపాతకలిప్తోభర్తాత్యాజ్యఏవ। నాన్యత్ర॥ తదాహభాగవతే॥ దుర్వృత్తోవాసువృత్తోవా రోగీవాప్యథవాపివా। స్త్రీభిఃపతిర్నహాతవ్యఃలోకేప్సుభిరపాతకీ॥ పాతకంబ్రహ్మహత్యాదికం। వ్యభిచారాదిదుర్గుణాన్ దృష్ట్వానత్యాజ్యః॥ తదాహాపస్తమ్బః॥ దారవ్యతిక్రమీ ఖరాజినంబహిర్లోమపరిధాయ దారవ్యతిక్రమిణేభిక్షామితి సప్తాగారాణిచరేత్సావృత్తిష్షణ్మాసాన్। స్త్రియాస్తుభర్తృవ్యతిక్రమే కృచ్ఛ్రద్వాదశరాత్రాభ్యాసస్తావంతంకాలమితి॥ అతోనిష్కారణతయాపరిత్యాగోదోషహేతుః॥ ఇతికారణంవినాపత్నీత్యాగినఃప్రాయశ్చిత్తమ్॥

(౪౮౬) ఇకను కారణములేక భార్యనువదలినవానికి ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాడు॥ నిష్కారణముగభార్యను మోహామువలన వదలినవాడు శాశ్వతముగనరకలోకమును బొందుననిలైంగమునందుజెప్పబడియె. సంతానములేనిదానిని పదియవసంవత్సరమునందును, స్త్రీలనుప్రసవించునట్టియాడుదానిని పదిరెండవసంవత్సరమునందును, మృతసంతానముగలదానినిపదునైదవ సంవత్సరమునందును అప్రియముగ మాటలాడుదానిని తత్కాలమునందును, వదలవలయును. అప్రియముగ మాటలాడడమనగా వ్యభిచారమును జేయుటను భర్తచూచుటయనియెఱుంగవలయునని లైంగమునందుజెప్పబడియె. భార్యవ్యభిచారమును జేసినట్లు లోకులుచెప్పుటచేత వదలగూడదనియును, తానుచూచినయెడలవదలవలయుననియును గౌతముడుచెప్పె. నిష్కారణముగభార్యను పరిత్యజించినవాడు గాడిదెచర్మను లోమములుబయలునుండునట్లుకప్పుకొని భార్యనువదలిన పాపాత్ముడనైననాకు భిక్షనుపెట్టుడనియడుగుచు భిక్షాటనమును జేయవలయును. ఇవ్విధముగ నేడుగృహములయందుభిక్షమునెత్తియీయన్నముజాలినను, చాలకున్నను భుజింపవలయును. ఇట్లు ఆరుమాసముల కాలముచేసినవాడు పావనుడగును. మహాపాతకుడుగానిభర్తనువదలిన యాడుదియును నీవిధముగానే ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని మార్కండేయుడువచించె. ఆపస్తంబుడును నీవిధముగానేవచించె.

—* అశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౪౮౭) అథాశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥ సోమసూర్యగ్రహేవాపివ్యతీపాతేచవైధృతౌ। సంక్రమేవిషువేచైవమన్వాదిషుయుగాదిషు॥ అశ్వప్రతిగ్రహేరాజన్నిష్కారణతయాద్విజః। యమలోకముపాగమ్యభుక్త్వాతత్రైవయాతనాః॥ పునర్భువముపాగమ్యపుచ్ఛయుక్తోహ

రేచ్ఛవేత్॥ లింగపురాణే॥ అశ్వప్రతిగ్రహీ విప్రః పుణ్యకాలేషు పర్వసు। కారణేన వినా రామ యమలోకముపాగమత్ ॥ పశ్చాద్భవతి భూలోకే మండూకః పుచ్ఛసంయుతః। సచేద్విక్రయమాపన్నః పాతకాన్న విముచ్యతే ॥ అశ్వవిక్రయదోషమాహ॥ కౌర్మే॥ మేరుమందరతుల్యాని పాపాని వివిధాని చ । రుద్రజాపీ హరేత్పాపం న కన్యాహయవిక్రయీ॥ ధృత్వాశ్వం విక్రయేద్యస్తు వృథా భోగేచ్ఛయా నృప। ఉభయోస్సమ్భవే తాత షడబ్దం కృచ్ఛ్రమాచరేత్ ॥ ప్రతిగ్రహేత్వర్ధం స్యాద్విక్రయే పూర్ణమాచరేత్॥ గారుడపురాణే॥ పాపాని సంతి యావంతి హతావంతి భువి పార్థివ । రుద్రజాపీ హరేత్తాని న కన్యాహయవిక్రయీ ॥ వృథాశ్వం ప్రతిగృహ్యాదౌ ద్విజో విక్రయితుం పునః। తయోః పాపవిశుద్ధ్యర్థం షడబ్దం కృచ్ఛ్రమాచరేత్॥ నాచేత్తదర్ధం కుర్వీత సమ్భవే పూర్ణమాచరేత్। అశ్వవిక్రయిణః పాపం దేహమావృత్య తిష్ఠతి॥ ప్రాయశ్చిత్తవిశుద్ధాత్మా తత్పాపాన్ముచ్యతే ఘునా॥ ఇత్యశ్వప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్॥

(౪౮-౭) ఇకను, అశ్వప్రతిగ్రహప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాడు॥ సోమసూర్యగ్రహణములయందైనను, వ్యతీపాతమునందైనను, వైధృతియందైనను, సంక్రమణములయందైనను, విషువత్పుణ్యకాలము నందైనను, మన్వాదులయందైనను, యుగాదులయందైనను, నిష్కారణముగ నశ్వమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు శాశ్వతముగ యమలోకమును బొందును. పిమ్మట పుచ్ఛయుక్తమైన హరిణమై పుట్టునని మార్కండేయుడు వచించె. పుణ్యకాలములయందు నిష్కారణముగ నశ్వమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు తోకగలకప్పయై పుట్టునని లింగపురాణమునందు జెప్పబడియె. మేరుమందరతుల్యములును, నానావిధములునునగు పాపములు రుద్రమంత్రమును జపించుటచేత నాశమును బొందును. అట్టి మంత్రము గూడ కన్యాహయములను విక్రయించువాని పాపమును బోగొట్టజాలదు. అశ్వమును ప్రతిగ్రహించి ద్రవ్యాశచేత విక్రయించినవాడు షడబ్దకృచ్ఛ్రము నాచరింపవలయును. ప్రతిగ్రహమును మాత్రము సేసినవాడు పూర్వోక్త ప్రాయశ్చిత్తమునందు సగము ప్రాయశ్చిత్తము నాచరింపవలయునని కౌర్మమునందు జెప్పబడియె. లోకములో నెన్నివిధములైన పాపములుగలవో యాపాపములనన్నింటిని హయవిక్రేత పొందును. నిష్కారణముగ నశ్వమును ప్రతిగ్రహించి విక్రయించువాడు స్వదోషశాంతికొఱకు షడబ్దకృచ్ఛ్రము నాచరింపవలయును. ఇట్టి దుష్కృత్యమును జేసినవాడు ప్రాయశ్చిత్తమును జేసికొనకమును పు, అట్టివానివలన నేవస్తువును గ్రహింపగూడదని గారుడపురాణము నందు జెప్పబడియె.

## మహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౭౯) అథమహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ లైంగే॥ యో విప్రో మహిషీంధృత్వా కుటుమ్బభరణాయవై। పుణ్యకాలేషు సంక్రాన్త్యాం వ్యతీపాతేచ వైధృతౌ॥ సయాతినరకం ఘోరం కాలసూత్రంసుదారుణం। పశ్చాద్భవతి పాపాత్మావాయసః కృష్ణవర్ణవాన్॥ గారుడపురాణే॥ మహిషీమనుగృహ్ణాతి ద్విజో మహతిసంగమే। సయాతినరకం ఘోర మనుభూయమహత్తరం॥ పశ్చాద్ధ్వాంక్షో భవేత్పాపీ క్షీరలోభాత్ప్రతిగ్రహే। తస్మాదేతత్పరిత్యాజ్యంమహిషీగ్రహణంద్విజైః॥ ప్రాయశ్చిత్తేనపూతాత్మా తరేద్దోషమిమంద్విజః। తత్ప్రతిగ్రహేప్రాయశ్చిత్తమాహ ॥ సౌపర్ణే॥ మహిషీమాత్మభోగార్థంప్రతిగృహ్యద్విజోఽనుహాన్। తస్యపాపవిశుద్ధ్యర్థం పరాకంకృచ్ఛ్రమాచరేత్॥ విక్రయేద్ద్విగుణంకృత్వా తస్మాత్పాపాత్ప్రముచ్యతే। పంచగవ్యంపిబేత్పశ్చాత్తత్తన్మంత్రపురస్సరం॥ ఇతిమహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౮౦) ఇఁకను మహిషీప్రతిగ్రహప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ కుటుంబపోషణ కొఱకు, పుణ్యకాలములయందు మహిషీదానమును ప్రతిగ్రహించినవాఁడు కాలసూత్రమను నరకమును బొందును. అనంతరమందు మిగుల నైల్యముగలకాకమైపుట్టునని లైంగమునందుఁ జెప్పఁబడియె. గారుడపురాణమునందును నిటులనే చెప్పఁబడియె. మహిషీదానమును ప్రతిగ్రహించినవాఁడు స్వదోషశాంతికొఱకు పరాకకృచ్ఛ్రము నాచరింపవలయును. ప్రతిగ్రహించి విక్రయించినవాఁడీ ప్రాయశ్చిత్తమును ద్విగుణాధికముగ నాచరింపవలయునని సౌపర్ణమునందుఁజెప్పఁబడియె.

## ధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్.

(౪౮౧) అథధేను ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ కౌర్మే॥ ధేనుం యఃపూర్వజోధృత్వా సమిత్తైర్బహుభిర్వినా। పుణ్యకాలేపుణ్యతీర్థేవస్త్రాదిభిరలంకృతామ్॥ సవత్సాందోహసంయుక్తాం ముక్తావాలోపశోభితామ్। తామ్రపృష్ఠాంస్వర్ణశృంగీం స్వర్ణఘంటోపశోభితామ్ ॥ సురూపాం సాధువృత్తాంచ ధేనుంరాజ్ఞస్సుఖాప్తయే। మహాపాపఫలంభుక్త్వా నరకాయోపపద్యతే॥ తస్మాద్ధేనుస్తునగ్రాహ్యా ద్విజైరధ్యాత్మవేదిభిః॥ లింగపురాణే॥ పుణ్యకాలేషుయోధేనుంసమభ్యర్చ్యద్విజాతయే। దద్యాదీశ్వరతుష్ట్యర్థం సవై నారాయణస్స్మృతః॥ ధేనవోబ్రహ్మణాసృష్టాః యజ్ఞార్థం యాగసాధనాః। మహాపాతకహారిణ్యః పుణ్యకర్మఫలప్రదాః॥ విప్రాదీనాస్సదాసర్వా ధేనవోలోకపూజితాః। తాంగృహ్ణీయాద్ద్విజోయస్తుద్రవ్యార్థీ పాపసంగ్రహీ॥

నసంకీర్తయతి స్తస్య ధేనుగోమాణి సంతిహి। అతః ప్రాయశ్చిత్తమాహ॥ నాగరఖండే॥ ధేనుప్రతిగ్రహీతాయః పుణ్యకాలేషు పర్వసు । హేమార్థవభిషేకార్థం న తేన హి సదోషభాక్॥ ఉభయోరప్యభావేతు ప్రాజాపత్యత్రయంచరేత్। ఉభయోర్యదిసమ్ప్రాప్తిః పంచగవ్యంపిబేత్తతః॥ తతశ్శుద్ధి మవాప్నోతి నాన్యథా రఘునందన । ఉభయతోముఖీధేనుప్రతిగ్రహవద్దుష్టప్రతిగ్రహత్వాభావాత్ప్రాయశ్చిత్తమల్పముక్తం॥ అన్యత్ర ప్రాయశ్చిత్తబాహుళ్యం దోషాధిక్యాత్॥ ఇతిసౌమ్యధేనుప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్॥

(౪౭౯) ఇకను ధేనుప్రతిగ్రహ ప్రాయశ్చిత్తవిధానమును జెప్పచున్నాఁడు॥ పుణ్యకాలములయందైనను, పుణ్యతీర్థములయందైనను, నానావిధములగు నిమిత్తములచేత, అలంకృతధేనువును ప్రతిగ్రహించినవాఁడు నరకలోకమును బొందును. కావున ధేనుదానమును ప్రతిగ్రహింపఁగూడదని కౌర్మమునందుఁ జెప్పఁబడియె. పుణ్యకాలములయందు నానావిధములగు నలంకారములను జేసిన ధేనువును బ్రాహ్మణునకు దానమును జేసినవాఁడు శాశ్వతముగ విష్ణులోకమును బొందియుండును. ధేనువులు బ్రాహ్మణుల కొఱకు యజ్ఞసాధనములుగా సృజింపఁబడినవి. కావున ధేనువులు మహాపాతకములను బోఁగొట్టును. నానావిధములగు పుణ్యముల నొసంగును. విప్రాధీనములై గోవులుసర్వకాలములయందును బూజ్యములై యుండును. అట్టిగోవులను ద్రవ్యాశచేతఁ బ్రతిగ్రహించినబ్రాహ్మణుఁడు గోరోమములెన్నిగలవో యన్నివేలసంవత్సరములు నరకలోకమునందు నివసించునని లింగపురాణమునందుఁ జెప్పఁబడియె. హేమాభిషేకములకుఁ గాక యన్యవిషయములయందాసక్తిచేత ధేనుప్రతిగ్రహమును జేసినవాఁడు మూఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రముల నాచరింపవలయును. హేమాభిషేకములకు ధేనుప్రతిగ్రహమును జేసినవాడు పంచగవ్యమునుమాత్రము ప్రాశనచేయవలయును. ఉభయభాగములయందును మోముగల ధేనుప్రతిగ్రహమునకు వలెనే యల్పప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని నాగరఖండమునందుఁ జెప్పఁబడియె.

—* సన్యాసినఃప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. *—

(౪౮౦) అథ సన్యాసినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ స్కాందే॥ సర్వసంగవిహీనస్యధర్మార్థత్యాగినోయతేః। పరబ్రహ్మణిసక్తస్యనిస్పృహస్యైవవస్తుషు॥ తస్యప్రతిగ్రహంయస్తు ద్విజోలోభపరాయణః। కృత్వా తస్మాద్యదాజీవేత్సవృథా బ్రాహ్మణస్స్మృతః॥ రాజవిజయే॥ పరబ్రహ్మణిసక్తస్య సర్వవస్తుష్వసంగినః। సర్వసంగవిహీనస్యధర్మార్థత్యాగినోయతేః॥ శి

శూద్రస్యాపి రాజేన్ద్ర సువార్తాభిర్ద్విజో యది అన్నమాత్రం రూపకం వా నత స్మై ఫలపరాగతిః। ప్రతిగృహ్యాయ దాజీవేన్నాన్యథా జన్మ తస్యహి ॥ మహాభారతే॥ అన్నం వా శాకమాత్రం వా రూపకం వస్త్రమేవ వా। కర్మందినో ద్విజో యస్తు స పాపీ నరకం వ్రజేత్॥ తస్య దోషవినాశార్థం ప్రాజాపత్యం తు రూపకే। అతః పరం తు చాన్ద్రం స్యాదన్నమాత్రే హ్యుపోషణం ॥ పరేద్యుః పంచగవ్యం చ పీత్వా శుద్ధిమవాప్నుయాత్। స్త్రీణామప్యేవం॥ ఇతి సన్యాసినః ప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౪౯౦) ఇఁకను సన్యాసివలనఁ బ్రతిగ్రహమును జేసినదోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ సర్వసంగహీనుఁడును, ధర్మార్థములను వదలినవాఁడును, పరబ్రహ్మయందాసక్తిగలవాఁడును, స్పృహలేనివాఁడును, అగు యతియొక్క ద్రవ్యమును లోభబుద్ధిచేతఁ బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు వృథాబ్రాహ్మణుఁడనఁబడునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. యతులకు శుశ్రూషాదులను జేసిగూడ రూపికాన్నములను ప్రతిగ్రహింపఁగూడదని రాజధర్మమునందుఁ జెప్పఁబడె. యతివలన ద్రవ్యాదికమును బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు నరకలోకమును బొందును. కావునఁ దద్దోషపరిహారము కొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. రూప్యములను బ్రతిగ్రహించినవాఁడు ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరింపవలయును. అన్నమును బ్రతిగ్రహించినవాఁడుపవాసమును మాత్రము చేయవలయును. పిమ్మట మరుదినమునందుఁ బంచగవ్యప్రాశనను జేయవలయునని మహాభారతమునందుఁ జెప్పఁబడియె.

## —— పతితయతేః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్. ——

(౪౯౧) అథ పతితయతేః ప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ ॥ దేవలః॥ స్నానాదినిత్యకర్మాణి బ్రహ్మవిద్యామథాపి వా। దండాదికం పరిత్యజ్య పట్టణేవ ర్తయన్యతిః॥ నానాగృహేషు భిక్షాన్నం వ్యవహారేషువత్సలః । గ్రాసార్థం శిష్యరక్షార్థం ధనార్జనపరాయణః॥ పతితస్య యతేస్సర్వం దీనతం సముద్భవ యతః క్వచిత్। స దుస్సాక్షరం న కుర్వీత యదికుర్యాత్స పాతకీ॥ గౌతమః॥ దండహీనో వృథా ముండీ ధృత్వా కాషాయమాత్రకమ్। పట్టణేవ ర్తయన్వా పి వ్యవహారపురస్సరం॥ శిష్యసమ్పాదనార్థాయ ధనార్జనపరాయణః। ప్రణవం సంపరిత్యజ్య ఛత్రోపానహయుగ్యతిః॥ సపవిత్రన్న మస్కార్యః నభిక్షా దానపాత్రకః। మాయానీసతుకర్మందీ యతవేషో యథానటః॥ పరాశరః॥ అగ్రదానం గృహస్థానాం తాంబూలం బ్రహ్మచారిణే। యతయే కాంచనం దత్వా

చాతాతునరకంవ్రజేత్॥ సురాపూరితభాండశ్చ పటహశ్చర్మపూరితః। కర్మహీనస్తుకర్మందీత్రయస్త్వేతే వృథావృథా॥ ఏకరాత్రంస్థితి స్త్యక్త్వా స్వధర్మాన్నవర్తమేద్యది। ఏతస్యనిష్కృతిర్నాస్తి ఇహలోకేపరత్రచ॥ తస్మాద్యతేర్ద్విజో యస్తు ప్రతిగృహ్యాధనాదికం। జీవేద్యదిహపాపాత్మా చాన్ద్రింతస్యవిశుద్ధయే॥ ద్రవ్యప్రతిగ్రహేచాన్ద్రింకాయంచాన్నస్యసంగ్రహే। క్షేత్రప్రతిగ్రహే తాతమహాచాన్ద్రిముదీరితమ్॥ వస్త్రాదిసంగ్రహేవిప్రో మహాసాంతపనంచరేత్। స్త్రీణామప్యేవం॥ ఇతిపతితయతేః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తం॥

(౪౯౧) ఇఁకను పతితుఁడైన యతివలన ద్రవ్యమును ప్రతిగ్రహించి నదోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ స్నానాదినిత్యకర్మలను, బ్రహ్మవిద్యను, బ్రహ్మదండమును, వదలి పట్టణములయందుఁ దిరుగుచు నానాగృహములయందు భిక్షాన్నమును భుజించుచు వ్యవహారములయందు వాత్సల్యముగలవాఁడై గ్రాసముకొఱకును, శిష్యరక్షణకొఱకును, ధనమును సంపాదించుటయందాసక్తిగలవాఁడై సంచరించు యతిపతితుఁడనఁబడును. కావున నిట్టియతితో సంభాషింపఁదగదు. మఱియు నతనికి నమస్కారాదులను జేయఁగూడదు. అవివేకము వలనఁ జేసినవాఁడు పాతకము గలవాఁడగునని దేవలుఁడు చెప్పె. గౌతముఁడును నివ్విధముగానే చెప్పె. గృహస్థునకు నగ్రదానమును, బ్రహ్మచారి కొఱకు తాంబూలమును, యతికొఱకు కాంచనమును, దానమును జేసినవాఁడు నరక లోకమునుబొందును. కల్లుచేత నిండింపబడినభాండము, చర్మపూరితమైన పటహము, కర్మహీనుఁడైన యతియును, స్పృశించుటకు దగవని యెఱుంగ వలయును. ఒక్క రాత్రియైనను, నిత్యధర్మములను సంచరించునట్టి యతికి నిహపరలోకములయందు భ్రష్టుఁడనబడును. కాబట్టి యట్టియతివలన ద్రవ్యాదికమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుఁడు నరకలోకమును బొందును. కావున స్వదోషపరిహారము కొఱకు చాంద్రాయణ వ్రతము నాచరింపవలయును. అన్నమును మాత్రము ప్రతిగ్రహించినవాఁడు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. క్షేత్రప్రతిగ్రహమునందు మహాచాంద్రము నాచరింప వలయును. వస్త్రాదులను ప్రతిగ్రహించినవాఁడు మహాసాంతపనము నాచరింపవలయునని పరాశరుఁడువచించె. స్త్రీలకును నిటులనేయని యెఱుంగవలయును.

### మఠపతేస్సన్న్యాసినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమ్.

(౪౯౨) అథమఠపతేస్సన్న్యాసినః ప్రతిగ్రహ ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ సర్వసంగ[illegible] ఏతస్యాన్యానిష్కృతిర్నా

స్త్రీచండాలాజ్జనగర్హితాత్॥ మార్కండేయః॥ యతిర్యస్తుమహారాజసర్వ సంగపరిగ్రహః। భోగాసక్త్యాయదాలోకేమఠాపత్యంకరోతియః॥ తపాశ్చ న్యాసిప్రవృత్తిర్నాస్త్రీయమలోకాత్సుదారుణాత్। తదంతేభువమాసాద్యదివా కీర్త్యోభవేన్నృపః॥ అథవాయోగినామేవకులేభవతిధీమతాం। ఇతిగీతావాక్య స్యనవిరోధః॥ కులేభవతిధీమతామితియోగభ్రష్టస్యోక్తం। మఠపతేర్యతేశ్చం డాలజన్మైవ॥ తదాహాంగిరాః॥ సర్వసంగవిహీనశ్చయతిర్భవతిమాఠకః। ఏ తస్యజన్మనాస్త్రీహచాండాలాత్కులగర్హితాత్॥ తస్మాద్యతేర్ద్విజోయస్తు ప్రతిగ్రహపరాయణః। తస్యైవనివృత్తిరియంషడబ్దంవిధిపూర్వకం॥ కృత్వా శుద్ధిమవాప్నోతినాన్యథాశుద్ధిరస్తిహి। స్త్రీణామప్యేవం॥ క్షేత్రవస్త్రాదిసం గ్రహేపూర్వవత్॥ ఇతిమఠాధిపతియతేః ప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౯౫౨) ఇకనుమఠపతియగుసన్యాసివలన ప్రతిగ్రహించినదోషనివార కప్రాయశ్చిత్తవిధానమునుజెప్పుచున్నాడు॥ సర్వసంగపరిత్యాగమైనయతిమ ఠాధిపతియయ్యేనేని యట్టివానికిప్రాయశ్చిత్తముగూడలేదని దేవలుడువచిం చె. సర్వసంగపరిత్యాగియగు యతిభోగాసక్తుడై మఠాధిపత్యమునవలంబిం చెనేని యట్టివాడు యమలోకమునుండి పునరావృత్తిరహితుడగును. అంత గొంతకాలమునకు భూలోకమునమంగలవాడైపుట్టునని మార్కండేయుడు చెప్పె. యోగభ్రష్టుడుపండితకులమునందైనను, రాజకులమునందైననుబుట్టు నని యెడుభగవద్వచనము యోగభ్రష్టునివిషయముగాని మఠాధిపతియైనచం డాలునివిషయముగాదు. మఠాధిపతియైనయతికి జండాలజన్మము గలుగుననుట కుసందియము లేదు. సర్వసంగపరిత్యాగమునుజేసినయతి మఠాధిపత్యమునవ లంబించెనేనిచండాలుడైపుట్టును. కావునయట్టియతివలన నేవస్తువునుప్రతిగ్ర హింపగూడదు. అవివేకమువలనప్రతిగ్రహించినవాడు షడబ్దప్రాయశ్చిత్తము నాచరింపవలయును. స్త్రీలునునీవిధముగానే ప్రాయశ్చిత్తము నాచరింపవల యును. క్షేత్రవస్త్రాదిసంగ్రహమునందు బూర్వమువలె ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని యంగిరోమునివరుడువచించె.

—— * పాపపురుషస్యప్రతిగ్రహప్రాయశ్చిత్తమ్. * ——

(౯౫౩) అథపాపపురుషస్యప్రతిగ్రహప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ మనుజానాంనాభిరంధ్రాదధోభాగేషడంగులే। ఆశ్రిత్యతత్రపాపీయాన్ పురు షావర్తతేసదా॥ మార్కండేయః॥ నృణాంతుక్షరధోభాగేనాభిదేశాత్షడం గులే। పాపాఖ్యఃపురుషఃసమ్యగాశ్రిత్యప్రాదివర్ధయన్॥ గౌతమః॥ నృణాం నాభేరధోభాగేపాపపురుషస్సదావసేత్। పాపానివర్ధయన్ధర్మంభక్షయన్

ర్వ్యమంగళం॥ తస్యైవనాశకరణందానందద్యాత్సఖా ప్రయే । తద్దానంబ్రాహ్మణోధృత్వాతజ్జాయాయాత్పిశాచతాం॥ మరీచిః ॥ పాపపురుషంవ్రజోధృత్వాపృథగ్ధానాదిభిర్వినా। మహాంతంనరకంభుక్త్వాతదంతేస్యాత్పిశాచతా॥ తద్దోషపరిహారార్థంప్రాతస్స్నాత్వావిధానతః । నాభిదఘ్నజలేస్థిత్వాపిధాయార్ద్రేణవాససా ॥ పురుషసూక్తంజపేత్పశ్చాద్యదాపంచదాయుతేరవిః । ధృత్వావైతావతీంసంఖ్యాంమనసాప్రత్యహంముదా ॥ పర్ణాహారోంతదాకుర్యాత్ఫలాహారమథాపివా। స్వపేద్దేవసమీపేతునారాయణమనుస్మరన్॥ పరేద్యుః పూర్వవత్కృత్వామాసమాత్రేణశుద్ధ్యతి। అయుతంజపసంఖ్యాస్యాత్పునస్సంస్కారతశ్శుచిః॥ పంచగవ్యంపిబేత్పశ్చాత్పాపాదస్మాత్ప్రముచ్యతే॥ ఇతిపాపపురుషప్రతిగ్రహప్రాయశ్చిత్తం॥

(౬౫౩) ఇకను పాపపురుషప్రతిగ్రహప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాము॥ మనుష్యులయొక్క నాభిరంధ్రమున కధోభాగమున నాలుగంగుళములదూరమున పాపపురుషుడు నివసించియుండునని దేవలుడు చెప్పె. మార్కండేయుడును నివ్విధముగా నే వచించె. మనుష్యులయొక్క నాభిదేశమున కధోభాగమున కారంగుళములదూరమున పాపపురుషుడు వర్తించును. వాడు సర్వసుకృతములను భక్షించుచుండును. కావున నట్టి పాపపురుషుడు నశించుటకొరకును, సౌఖ్యములుగలుగుటకొరకును దానాది పుణ్యకార్యములను జేయవలయును. అట్టి దానమును బ్రతిగ్రహించినవాడు పిశాచత్వమును బొందువాడగునని గౌతముడు వచించె. పాపపురుషుడుగలవానివలన దానాదులను బ్రతిగ్రహించినవాడు పిశాచత్వమును బొందును. కావున నట్టిదోషశాంతికొరకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన బ్రాతఃకాలమునందు స్నానమును జేసి బొడ్డులోతు జలమునందుండి పురుషసూక్తమంత్రపఠనమును సూర్యాస్తమయమువరకు చేయవలయును. సాయంకాలమునందు పర్ణాహారుడు గావలయును. అనంతరమందు నారాయణుని స్మరించుచు దేవసమీపమునందు నిదురనుబొందవలయును. ఇట్లు మాసము దినములాచరించుటచేత బరిశుద్ధుడగును. మాసము దినములలోపల బదివేలపర్యాయములు జపమును జేయవలయును. అనంతరమందు, బంచగవ్యప్రాశనను జేయవలయునని మరీచి చెప్పె.

## ॥ పతితస్యప్రాయశ్చిత్తమ్. ॥

(౬౫౪) అథపతితస్యప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ పతితస్తుద్విధాప్రోక్తో మహాపాతకసంగవాన్। నిత్యకర్మపరిత్యాగీద్వితీయస్సద్భిరుచ్యతే॥ పూర్వజస్యమహాపాతకప్రాయశ్చిత్తముదీరితం॥ ద్వితీయస్యవిశేషమాహ॥ దేవ

లః॥ నిత్యకర్మపరిత్యాగాన్నానాయోనినిషేవణాత్ । గీతవాద్యానురాగాచ్చ కుండగోళకసంగమాత్॥ దేవద్విజవిరోధాచ్చ నానాసత్రాదిభోజనాత్ । చరణాయుధయుద్ధైనబస్తయుద్ధైనవారతః॥ ద్యూతాసక్తస్సదా కామీ హాస్యైర్వీణాదివాదవాక్। గన్ధతామ్బూలవస్త్రాద్యైర్దైవదీనానసన్తృప్తైః॥ విటగాణుకసంయుక్తః పతితోఽయం ద్వితీయకః। మహాపాతకసంసర్గాన్మహాపతిత ఉచ్యతే॥ తస్య మరణాన్తా నిష్కృతిః॥ కుత్రచిద్దయయా మునిభిర్ద్వ్యయుతగోదానైరుక్తా। కర్మభ్రష్టస్య పతితస్య ప్రాయశ్చిత్తమాహ॥ మరీచిః॥ పూర్వోక్తలక్షణైర్యుక్తః పతితః కర్మహీనవాన్। పశ్చాత్తాపసమాయుక్తః ప్రాజాపత్యం విశుద్ధయే॥ త్రిగుణే తు పరాకం స్యాత్ షష్ఠే తప్తం విధీయతే। మాసే చాన్ద్రం తతః పశ్చాద్వర్షాదూర్ధ్వం న నిష్కృతిః॥ అసౌ పతిత ఇత్యుక్తస్సర్వదా వర్జ్యతే జనైః। కర్మభ్రష్టస్య నాస్తీహ వర్షాదూర్ధ్వం సతాం గతిః॥ యత్ర యత్ర ధర్మశాస్త్రేషు పతితప్రాయశ్చిత్తముక్తం॥ తత్ర తత్రైవమేవ యోజనీయం। పంచమహాపతితసంసర్గీ మహాపతితో మరణాన్తప్రాయశ్చిత్తీ॥ అయం తు దోషబాహుళ్యాపేక్షితసదోక్తం ప్రాయశ్చిత్తం కృత్వా శుద్ధిమాప్నోతి॥ ఇతి కర్మభ్రష్టస్య పతితస్య ప్రాయశ్చిత్తం॥

(౪౯౪) ఇకను పతితప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు॥ మహాపాతకసంబంధముగలవాడనియును, నిత్యకర్మపరిత్యాగియనియును, పతితుడు రెండువిధములుగనుండును. మొదటివానికి మహాపాతకప్రాయశ్చిత్తమునే యాచరింపవలయునని దేవలుడువచించె. నిత్యకర్మపరిత్యాగమువలనను, నానాయోనినిషేవణమువలనను, గీతవాద్యానురాగమువలనను, కుండగోళకసంగమమువలనను, దేవద్విజవిరోధమువలనను, నానాసత్రాదిభోజనమువలనను, పతితుడగును. మఱియును చరణాయుధయుద్ధముచేతను, బస్తయుద్ధముచేతను, గూడపతితుడగును. ఇంతయగాక ద్యూతాసక్తుడును, నిరంతరకామియును, హాస్యవీణాదులవలనజీవించువాడును, గంధతాంబూలవస్త్రాదులను దేవాదులకర్పింపనివాడును, విటగాణుకసంయుక్తుడును, పతితుడనబడును. మహాపాతకసంబంధముగలవాడు మహాపతితుడుగనుక, అట్టివానికి మరణాంతప్రాయశ్చిత్తమునే విధింపవలయును. కొందఱుమునివరులుదయచేత నట్టివానికిద్వ్యయుతగోదాన ప్రాయశ్చిత్తమును విధించిరని దేవలుడువచించె. పూర్వోక్తములగులక్షణములతో గూడినవాడును, కర్మహీనుడునునగు పతితుడు పశ్చాత్తాపముతో గూడినవాడై పరిశుద్ధికొఱకు ప్రాజాపత్యకృచ్ఛ్రమును ప్రాంత్రార్థముగనాచరింపవలయును. ఈకృత్యములనుమూడుదినములు సేసిన బరాకకృచ్ఛ్రమునాచరింపవలయును. పదునైదుదినముల చరించినవా

కృచ్ఛ్రమును జేసికొనవలయును. మాసముదినములు సేసినవాడు చాంద్రాయణ వ్రతమునాచరింపవలయును. సంవత్సరానంతరమందుగూడ నిట్టిదుష్కృత్యమును జేసినవాడు పతితుడగును. కర్మభ్రష్టునకు సంవత్సరానంతరమందు ప్రాయశ్చిత్తము లేదని యెఱుంగవలయును. ధర్మశాస్త్రములయందెక్కడెక్కడ పతితప్రాయశ్చిత్తము సెప్పబడినదో యక్కడక్కడనావిధముగానే యోజనను జేసికొనవలయును. పంచమహాపాతకసంసర్గము గలవాడు మహాపతితుడుగావున నట్టివానికి మరణాంతప్రాయశ్చిత్తమును విధింపవలయును. ఇచ్చటగూడ దోషబాహుళ్యమయ్యేనేని బ్రతిపదోక్తప్రాయశ్చిత్తమును జేసికొనుటజేత బరిశుద్ధుడగునని మరీచి వచించె.

—— * రహస్కృతబ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమ్- * ——

(౪౯౫) అథ రహసికృతబ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ అరణ్యే స్వగృహే రాజన్ మత్సరాద్ద్రవ్యలోభతః। యోవిప్రో హంతియః విప్రం రజ్జుదండాదిపీడనైః॥ మార్కండేయః॥ అరణ్యే స్వగృహే యత్నాత్కంఠఃపీడనాదిభిః। హన్యాద్విప్రం ద్విజో యస్స మహాంతం నరకం వ్రజేత్॥ రహసికృతం పాపం చతుర్దశధా ప్రకటితం భవతి॥ తదాహ మనుః॥ ఆదిత్యచంద్రావనిలోనలశ్చ ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ। అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తం॥ తథా చ శ్రుతిః॥ తం భూతాన్యభ్యక్రోశన్ బ్రహ్మహాస్మీతి॥ అతో రహసి పాపం న కారయేత్॥ గాలవః॥ రహః పాపం న కుర్వీత కర్మణా మనసా గిరా। యది కుర్యాద్విమోహేన ప్రకాశాద్ద్విగుణం భవేత్॥ తస్యైవ నిష్కృతిర్నాస్తి జన్మభిర్బహుభిర్నృప॥ గౌతమః॥ పూర్వజో రహసి స్థానే విప్రం హన్యాద్ధనాతురః। అథవా మత్సరాక్రాంతస్తస్య నాస్తీహ నిష్కృతిః॥ బ్రహ్మహత్యాసమం పాపం ద్విజానాం నాస్తి నారద। పాపరాట్ బ్రహ్మహత్యేయం తు యరోగశ్చ రోగరాట్॥ కృచ్ఛ్రరాజస్తు వేధాస్స్యాత్తులాస్యాద్దానరాట్తథా। వేధాః ప్రాజాపత్యకృచ్ఛ్రః॥ అతో రహసి విప్రస్య న కుర్యాద్ధింసనం బుధః॥ పరాశరః॥ రహసి ద్విజహత్యా యా సర్వేషాం కులనాశినీ। ఆత్మనశ్చ మహత్పాపకరీ పుణ్యస్య నాశినీ॥ ఉభయోర్లోకయోర్హంత్రీ సర్వపాపవివర్ధినీ। తత్ర ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ విప్రహత్యాం రహః కృత్వా పశ్చాత్తాపపరాయణః। తటాకం వా హ్రదం గత్వా ప్రాతస్స్నానం సమాచరేత్॥ మనసా నిత్యకర్మాణి అర్ఘ్యదానం సమంత్రకం। కృత్వా జలముపాగమ్య కంఠదఘ్నజలే వసన్॥ ఆర్ద్రేణ వాససాచ్ఛాద్య మూర్ధానం స్వేన పాణినా। ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాపి ప్రత్యహం యావతీస జపేన్నారాయణాత్మకం॥ సహస్రశీర్షమిత్యనువాకం।

జప్యామనసా తాంనిధాయచ। జపేదస్తంయు చాభాసు స్త్రావత్ప్రత్యంతమాచరేత్॥ తత్త్రిరాత్రంకృత్వా నారాయణపరాయణః। ప్రత్యహం కబళంభుంజన్ నారాయణనివేదితం॥ స్వపేచ్ఛస్థండిలే తత్ర సాలగ్రామసమీపతః। పునః ప్రభాతేవిమలే పూర్వవన్నియమంచరేత్॥ ఏవంబుతుత్రయంకృత్వా పునస్సంస్కారపూర్వకమ్। శుద్ధిమాప్నోతి రాజేంద్ర తస్మద్ధ్యమ్రియతేజసః॥ అన్యథాదోషమాప్నోతి క్షయరోగీభవేద్ధ్రువమ్। ఏతస్యనిష్కృతిర్నాస్తి జన్మజన్మని భూమిప॥ ఇతి రహసికృతబ్రహ్మహత్యాప్రాయశ్చిత్తం॥

(౮౯౫) ఇఁకను రహస్యముగఁ జేసిన బ్రహ్మహత్యాదోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ అరణ్యమునందైనను, స్వగృహమునందైనను, మాత్సర్యమువలననైనను, ద్రవ్యలోభమువలననైనను, రజ్జుదండాదిపీడలచేత నితరులకుఁ దెలియకుండునటుల బ్రాహ్మణునిఁ జంపినవాఁడు రహస్యముగ బ్రహ్మహత్యను జేసినవాఁడగునని దేవలుఁడు వచించె. మార్కండేయుఁడును నీవిధముగానే వచించె. సూర్యుఁడు, చంద్రుఁడు, వాయువు, అగ్ని, అంతరిక్షము, భూమి, ఉదకము, హృదయము, యముఁడు, పగలు, రాత్రి, ప్రాతస్సంధ్య, సాయంసంధ్య, ధర్మము, అనుపదునాలుగును రహస్యముగఁ జేసిన పాపములను దెలిసికొనుచుండునని మనువు వచించె. వేదమునందును నీవిధముగానే చెప్పఁబడియె. మనోవాక్కాయకర్మలచేత రహస్యముగఁ బాపమును జేసినవాఁడు విస్పష్టముగఁ జేసినపాపమునకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తమునకు ద్విగుణాధిక ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మఱియు నట్టివానికిఁ బ్రాయశ్చిత్తమే లేదని నొక్కంగవలయునని గాలవుఁడు వచించె. బ్రాహ్మణుఁడు రహస్యస్థానమునందు ధనాతురుఁడై బ్రాహ్మణునిఁ జంపెనేని యట్టివానికిఁ బ్రాయశ్చిత్తము లేదనియును, బ్రహ్మహత్యకుఁ దుల్యమైన పాపమేదియును లేదనియును, బ్రహ్మహత్యాపాపములలో నధికమైనదనియును, రోగములలో క్షయరోగము సర్వోత్తమరోగమనియును, వేధయనునది కృచ్ఛ్రరాజనియును, దానములలో తులాదానమధికమైనదనియుచు, గౌతముఁడు వచించె. వేధయనఁగాఁ బ్రాజాపత్యకృచ్ఛ్రమనఁబడును. రహస్యమునందుఁ జేసిన బ్రహ్మహత్య సర్వజనులయొక్కయు కులమును నశింపఁజేయును. మఱియు రెండులోకములయందును హానిని గలుగఁజేయునని పరాశరుఁడు వచించె. రహస్యముగ బ్రహ్మహత్యను జేసి పశ్చాత్తాపమును బొందినవాఁడై తటాకమునకైనను, హ్రదమునకైనను, బోయి ప్రాతఃకాలమునందు స్నానమును జేయవలయును. మనస్సుచేత ని

త్యకర్మలను, సమంత్రకముగ నర్ఘ్యదానమును జేసి గొంతులోతు నీళ్ళలో నుండి తడివస్త్రముచేత శిరస్సునుగప్పికొని తూర్పునకైనను, ఉత్తరమునకైనను, అభిముఖముగానుండి "సహస్రశీర్షం,, అను మంత్రమును జపింపవలయును. ఇట్లు సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయముదనుక యెన్నిపర్యాయములు జపింపఁబడునో గణనను జేయవలయును. ఆనీటియొడ్డున శిబిరమును నిర్మించుకొని నారాయణపరాయణుఁడై నారాయణనివేదితమైన కబళమును భుజించవలయును. అనంతరమందు సాలగ్రామ సమీపమునందు స్థండిలశాయిగావలయును. మరలఁ బ్రాతఃకాలమునకు ముందుగ మేలొంచి పూర్వదినమునందుఁ జేసినవిధముగాఁ జేయవలయును. ఇవ్విధముగ నారుమాసములు సేసి యనంతరమందు పునరుపనయన సంస్కారమును బొందవలయును. ఇట్టి వ్రతము ముగియకమునుపు మరణమును బొందెనేని పవిత్రుఁడగును. ఇట్టి ప్రాయశ్చిత్తమును జేసికొననివాఁడు క్షయరోగియై పుట్టును. అట్టివాఁడెన్నిజన్మములనెత్తినను పాపరహితుఁడు గానేరఁడని దేవలుఁడువచించె.

— రహసికృతసురాపానప్రాయశ్చిత్తమ్. —

(౪౯౬) అథ రహసికృత సురాపానప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ రహసిబ్రాహ్మణః పీత్వామద్యమేకాదశంయది। నతస్యపునరావృత్తిర్యమలోకాత్కదాచన॥ మరీచిః॥ మద్యమేకాదశంప్రోక్తం గౌడీత్యాది మహద్భయమ్। తేషాంమధ్యేద్విజోలోభాద్రహస్యేకం పిబేద్యది॥ తస్యైవనిష్కృతిర్దృష్టామరణాన్తాహినాన్యథా। రహస్యేతానిమద్యాని ఘ్రాత్వాపీత్వాద్విజః పతేత్॥ మహాభారతే॥ శృణుధర్మజయత్నేన మద్యంరహసియఃపిబేత్। ఏతస్యనిష్కృతిర్నాస్తి మరణాంతంవినానృప॥ భవిష్యోత్తరే॥ స్వాస్థ్యహేతోర్గణేరణ్యేమద్యమేకాదశంవిధమ్। తన్మధ్యేయోద్విజోమోహాద్రహస్యేకం పిబేద్యది॥ సద్యఃపతతిదుష్టాత్మా మరణాన్తాహినిష్కృతిః॥ జాబాలిః॥ గౌడీమాధ్వీచపైష్టీచ విజ్ఞేయాస్త్రివిధాస్సురాః। తాళపింతాళజంచైవ ఖార్జూరం నారికేళజమ్॥ ద్రాక్షాజంచైవమైరేయ మెలాజంచలవంగకమ్। మద్యమేకాదశంప్రోక్తంమునిభిస్తత్వదర్శిభిః॥ ఏతేషాంయోరహోభుంక్తే ఏకంవాద్విజనాయకః। తస్యాన్యానిష్కృతిర్నాస్తి మరణాన్తాజ్జనాధిప॥ కథంచిన్నిష్కృతిర్దృష్టామునిభిశ్శాస్త్రవర్త్మసు। అరణ్యేనిర్జనేదేశే స్నానంకృత్వాయథావిధి। సంధ్యాదినిత్యకర్మాణి పూర్వవన్మనసాచరేత్। నవంకుటీరమాసాద్య స్వగృహ్యోక్త[illegible]యావదస్తంగతో

రవిః। తావద్విరమ్యతం హోమసంఖ్యాంచ నసిఘారయన్॥ అవ్రతఘ్నం పయఃపీత్వా స్వపేద్దేవసమీపతః। తతః ప్రాతస్సముత్థాయ పూర్వవన్నియమంచరేత్॥ ఏవం ఋతుత్రయంకృత్వా పునఃకర్మతతఃపరమ్। కృత్వాశుద్ధిమవాప్నోతి నోచేద్దోషామహాన్ భవేత్॥ అథవా రాజదండేన మృత్వాశుద్ధిమవాప్నుయాత్। ఋతుత్రయే అయుతకూశ్మాండహోమః। తదర్ధం గణహోమః। ఋతుత్రయావసానే పునస్సంస్కారః। పంచగవ్యంచపీత్వాశుద్ధిమాప్నోతి॥ ఇతిరహసికృతమద్యపానప్రాయశ్చిత్తం॥

—* రహసికృతస్వర్ణస్తేయప్రాయశ్చిత్తమ్. *—

(౪౯౬) ఇఁకను రహస్యముగఁ జేసిన సురాపాన దోషనివారక ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణుఁడు రహస్యముగఁ బదునొకండు విధములగు మద్యములలో దేనిని పానము సేసినను యమలోకమును బొంది మరలివచ్చువాఁడు గాఁడని దేవలుఁడు వచించె. మరీచియును నిటుల నేవచించి యట్టిమరణాంతప్రాయశ్చిత్తము కంటె నన్యమగు ప్రాయశ్చిత్తము లేదనియును, పతితుఁడగుననియును చెప్పె. మహాభారతమునందును నీయర్థమే బోధింపఁబడియె. స్వగృహమునం దైనను, పట్టణమునం దైనను, అరణ్యమునం దైనను, అవివేకాదులవలన రహస్యముగ మద్యపానమును జేసినవాఁడు తత్క్షణమునందపతితుఁడగునని భవిష్యోత్తరపురాణమునందుఁ జెప్పఁబడియె. గౌడి, మాధ్వి, పైష్టి, తాళజము, హింతాళజము, ఖార్జూరము, నారికేళజము, ద్రాక్షాజన్యము, మైరేయము, ఏలాజన్యము, లవంగకము, అనిమద్యము పదునొకండు విధములచేనుండును. ఈపదునొకండు విధములగు మద్యములలో దేనిని రహస్యముగఁ బానము సేసినను, మహాపాతకుఁడును, మరణాంతప్రాయశ్చిత్తపాత్రుఁడును నగును. మునులు దయచేత నిట్టివానికిఁ బ్రాయశ్చిత్తమును విధించిరి. అదియెట్లనిన నిర్జనమైన యరణ్యప్రదేశమునందు స్నానమును జేసి పూర్వోక్తప్రకారముగ నిత్యకర్మలను మనస్సుచేత స్మరింపవలయును. పిమ్మట నూతనమగు కుటీరమును నిర్మించుకొని స్వగృహ్యాగ్నియందు శాస్త్రోక్త ప్రకారముగ సూర్యాస్తమయము దనుక కూశ్మాండ హోమమును జేయుచుండవలయును. పిమ్మట హోమసంఖ్యను మనస్సునందుఁ బెట్టికొని పయఃపానమును జేసి దేవసమీపమునందు నిద్రనుబొందవలయును. మరల ప్రాతఃకాలమునందు నిద్రను మేలొంచి పూర్వమువలె నియమము నాచరింపవలయును. ఇవ్విధముగ నాఱుమాసముల కాలము జరిపి పిమ్మటఁ బునరుపనయన సంస్కారమును బొందవలయు.

ఇట్లాచరింపనివాఁడు గోవధదోషమును బొందునని యెఱుంగవలయును. ఇట్లు చేయఁజాలఁడేని రాజదండనచే హతుఁడయినచోఁ బావనుఁడగును. కూశ్మాండహోమము పదివేలపర్యాయములు. గణహోమము దానిలో సగము. ఆఱుమాసములయొక్క కడపట పునస్సంస్కారము. పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేయవలయునని జాబాలివచించె.

## రహసికృతస్వర్ణస్తేయప్రాయశ్చిత్తమ్.

(౪౯౭) అథరహసికృతస్వర్ణస్తేయప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ రహస్యముషిత్వా పారక్యం సువర్ణం ద్విజపుంగవః। ప్రాయశ్చిత్తం ప్రకర్తవ్యంమరణాంతంద్విజోత్తమ॥ మరీచిః॥ యోహరేద్రహసిస్వర్ణం పారక్యం ముఖజస్సకృత్। తస్యాన్యానిష్కృతిర్నాస్తి కుమ్భీపాకాద్భయంకరాత్॥ హారీతః॥ పారక్యంరహసిస్వర్ణం ద్విజోహృత్వాపతేత్తదా। ఏతస్యనిష్కృతిర్దృష్టామునిభిర్ధర్మలిప్సుభిః॥ సువర్ణాదిప్రమాణంచ సువర్ణస్తేయప్రకరణేఽభిహితమ్॥ గాలవః॥ యోహృత్వారహసిస్వర్ణంద్విజోరాజ్యమథాపివా। తస్యాన్యానిష్కృతిర్నాస్తి కుమ్భీపాకనిమజ్జనాత్॥ కథంచిన్నిష్కృతిర్దృష్టా మునిభిర్ధర్మదర్శిభిః। అరణ్యంనిర్జనంగత్వా తత్రస్నాత్వాయథావిధి॥ నిర్మాయపర్ణశిబిరం తత్రస్థాప్యహుతాశనం। సమిద్భిఃప్రజ్వలంకృత్వా సాత్యర్థంపరికల్ప్యచ॥ ఊర్ధ్వాననోజపేన్మంత్రం కృష్ణస్యద్వాదశాక్షరం। ప్రాతరారభ్యమధ్యాహ్నే జపసంఖ్యాచయావతీ॥ తావతీంమనసాస్థాప్యమాధ్యాహ్నికమథాచరేత్। తతఃపరంజపేదేవం మంత్రరాజమనుత్తమం॥ అస్తంయాతియదాభానుస్తావన్మౌనంపరిత్యజేత్। సంఖ్యాంతాం మనసాస్థాప్యతమగ్నింధారయేద్బుధః॥ తండులైర్హస్తమాత్రైశ్చ గోజలాక్తైఃపచేత్తదా। పూర్వంనివేద్యదేవాయ పశ్చాద్భుక్త్వాస్వయంముదా॥ స్వపేద్దేవసమీపేతు నారాయణపరాయణః। తతఃప్రాతస్సముత్థాయ పూర్వవన్నియమాస్థితః॥ జపేత్పూర్వవదాసీనో హుతాశనసమీపతః। ఏవంమాసద్వయంకృత్వా నవలక్షజపంతథా॥ పటగర్భవిధానేనపునస్సంస్కారమాచరేత్। పంచగవ్యంపిబేత్పశ్చాచ్ఛుద్ధోభవితుమర్హతి॥ నాన్యథాశుద్ధిమాప్నోతి బహుభిస్తీర్థమజ్జనైః। లోకసాదృశ్యకథనైర్నశుద్ధోభవతిద్విజః॥ గంగాసేతుః ప్రయాగశ్చ గంగాసాగరసంగమః॥ గౌతమీకృష్ణవేణీచ కావేరీచ మహానదీ। దర్శనాత్సర్వదాన్యేషాం స్నానాన్మోక్షప్రదాయినీ॥ తానద్యోపిమహాపాపకృతంవిప్రమనిష్కృతిమ్। నపునంతిహిరాజేంద్రసురాభాండమివాపగాః॥ వహ్నేఃకృతంమహాపాపం ప్రాయశ్చిత్తేనశుద్ధ్యతి। పాపశుద్ధిర్నజలైర్గాత్రైః మ

హాప్రస్థానగైరపి॥ అతోరహఃకృతస్యపాపస్యప్రాయశ్చిత్తమేవ। నాన్యత్॥ ఇతిరహసికృతసువర్ణస్తేయప్రాయశ్చిత్తమ్॥

(౪౯౭) ఇఁకను రహస్యముగఁజేసిన స్వర్ణస్తేయ ప్రాయశ్చిత్త విధానమును జెప్పుచున్నాఁడు॥ పరుల సంబంధమైన బంగారమును దొంగతనముగ నపహరించిన బ్రాహ్మణునకు మరణాంతప్రాయశ్చిత్తముకంటెఁబవిత్రతను గలుగఁజేయునది యేదియును లేదని దేవలుఁడు వచించె. రహస్యముగఁబరులబంగారమును హరించిన బ్రాహ్మణుఁడు కుంభీపాకమను నరకమును బొందునని మరీచివచించె. పరుల సంబంధమైన బంగారమును హరించినవానికిఁ బ్రాయశ్చిత్తము మునులచేతఁ జెప్పఁబడెనని హారీతుఁడు వచించె. సువర్ణాది ప్రమాణము సువర్ణస్తేయప్రకరణమునందుఁ జెప్పఁబడియె. బంగారమునైనను, వెండినైనను, దొంగిలించినవాఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. అదియెట్లనిన నిర్జనమగునరణ్యప్రదేశమునకుఁబోయి విధ్యుక్తప్రకారముగ స్నానమును జేసి యాకుటిల్లును వేసికొని యచ్చట నగ్నినిప్రతిష్ఠించి సమిత్తులచేత సాత్యర్థముగ నగ్నినిప్రతిష్ఠించి యగ్న్యాధానముఁజేసి కృష్ణద్వాదశాక్షరమంత్రమును జపింపవలయును. ప్రాతఃకాలము మొదలుకొని మధ్యాహ్నము వఱకును నెన్నిపర్యాయములు జపమును జేసెనో యాసంఖ్యను మనస్సునందుఁ బెట్టుకొని పిమ్మట మాధ్యాహ్నికకృత్యము నాచరింపవలయును. అనంతరమందు సర్వోత్తమమగు మంత్రరాజమును మరల జపింపవలయును. ఇట్లుసూర్యాస్తమయమగు వఱకును జపించి పిమ్మట మౌనమును వదలి యాజపసంఖ్యను మనస్సునందుఁ బెట్టికొని, గోమాత్రములచేతఁ దడపఁబడినవియును, హస్తమాత్రపరిమితములును నగు తండులములనువండి యయ్యన్నమును ముందుగ దేవునకు నివేదించి పిమ్మటఁ దాను భుజింపవలయును. ఇట్లుచేసి యనంతరమందు దేవసమీపమునందు నిదురను బొందవలయును. పిమ్మట మరుదినప్రాతఃకాలమునందు నిదురను మేల్కాంచి పూర్వదినమునందుఁ జేసినవిధముగఁ జేయవలయును. ఇవ్విధముగ రెండుమాసములకాలము తొమ్మిదిలక్షలపర్యాయములు జపమును జేయవలయును. పిమ్మటఁ బటగర్భ విధానముచేతఁ బునరుపనయనసంస్కారమును జేసికొనవలయును. అనంతరమందుఁబంచగవ్యప్రాశనను జేయవలయును. ఇంతకంటె నన్యమగు మార్గముచేతఁ బరిశుద్ధత గలుగనేరదు. లోకసాదృశ్యకథనములచేతఁ బరిశుద్ధుఁడుగానేరఁడు. గంగ, సేతువు, ప్రయాగ, గంగాసాగరసంగమము, గౌతమి, కృష్ణవేణి, కావేరి, అనునవిదర్శనస్పర్శనమజ్జనాదు

లచేత సకల పాపములను హరించును. అట్టి మహానదులుగూడ మహాపాతకులను బరిశుద్ధులను జేయఁజాలవు. రహస్యముగఁ జేసిన మహాపాపము ప్రాయశ్చిత్తముచేత నశించునుగాని యన్యకారణములచేత నశింపవు. కావునఁ బ్రాయశ్చిత్తమునే చేసికొనవలయునని గాలవుఁడు సెప్పె.

—— రహసికృతగురుతల్పగమనప్రాయశ్చిత్తమ్. ——

(౪౧౮) అథ రహసికృత గురుతల్పగమన ప్రాయశ్చిత్తమాహ॥ దేవలః॥ యోఽరిమోహాజ్జననీంగత్వా తత్సపత్నీమథాపివా। ప్రజావతీం గురోర్దారాన్ విప్రః కామాతురోయది॥ స్వముష్కంరహసిచ్ఛిత్వా పూర్వపద్ధక్షిణాముఖః। గచ్ఛన్మృత్వావిశుద్ధోభూదన్యథాపతితోభవేత్॥ మహాభారతే॥ శృణుధర్మజవక్ష్యామి పాపమేతన్మహత్తరం। యోవిప్రోరహసిస్త్వానె మాతరంతత్సఖీమపి॥ గురోఃపత్నీంభ్రాతృజాయాం యభేతాత్మమాతుఃస్వసృత్। స్వముష్కంస్వేనహస్తేన అసినాతీక్ష్ణధారయా॥ ధృత్వాంజలౌనిరాహారో దక్షిణాందిశమన్వగాత్। యదాత్యజేదసూన్విప్రస్తదాశుద్ధిమవాప్నుయాత్॥ అన్యథాహీనశుద్ధస్స్యాత్ దృష్ట్వాహ్మహేవశ్వసన్ద్విజః॥ గౌతమః॥ స్వమాతరంరహోగత్వా పుత్రఃకామాతురస్సకృత్। తత్సపత్నీంగురోర్దారాన్ భ్రాతృపత్నీమథాపివా॥ కృపాణేన స్వయంఛిత్వా ముష్కద్వయమశంకితః। నిధాయస్వాంజలౌగోప్యం గచ్ఛేద్యామ్యాం దిశంశుభాం॥ నిరాహారోథమృత్వాచ తదాశుద్ధిమవాప్నుయాత్। ప్రాయశ్చిత్తమిదంతస్య మునిభిఃపరికీర్తితమ్॥ అరణ్యంనిర్జనంగత్వా తత్రస్నాత్వావిధానతః। కుటీం పూర్వంతత్కృత్వా తత్రమౌనముపాశ్రితః॥ యవానంజలిమానాంశ్చ పాచయేద్బ్రహ్మతోఘటాత్। యవాగూంతాంపునఃపాత్రే ధృత్వాగ్నింప్రజ్వాల్యతతః॥ దారుమయ్యాస్రుచాధృత్వా జుహుయాన్మంత్రపూర్వకం॥ తథాచశ్రుతిః॥ యవాగూరాజన్యస్యవ్రతం కూరిరవవైయవాగూఃకూరిణఇవేతిమంత్రేణ ద్విసహస్రంహుత్వా హోమంసమాప్యహోమావశిష్టాంతాం యవాగూంస్వయంపిబేత్॥ తదాహగౌతమః॥ రహోమాతృగమఃపక్త్వా యవానంజలిపూరితాన్। తద్యవాగూంబృహత్పాత్రేనిధాయాగ్నిసమీపగః॥ సమిద్భిరగ్నింప్రజ్వాల్య స్రుచాపాలాశమిశ్రయా। గృహీత్వాతాంయవాగూంచ యవాగూరాజన్యమంత్రతః॥ కూరిరఇత్యంతముక్త్వాతాం జుహుయాన్మంత్రపూర్వకమ్। ప్రత్యహంద్విసహస్రంచ హుత్వాహోమం సమాపయేత్॥ అవశిష్టయవాగూంచ స్వయంపీత్వాస్వపేద్వ్రతీ। పరేద్యుః ప్రాతరుత్థాయ పూర్వేద్యుస్తద్వదాచరేత్॥ ఏవంమాసద్వయంకృత్వా శుద్ధిమవాప్నోతి పాత

కీ॥ నాన్యథాశుద్ధిమాప్నోతి మలముష్టిర్యథాన్యథామ్॥ ఇతిరహస్యకృతగురుతల్పగమనప్రాయశ్చిత్తమ్॥

(౮౯౮) ఇకను రహస్యముగఁ జేసిన గురుతల్పగమన ప్రాయశ్చిత్తవిధానమును జెప్పుచున్నాఁడు॥ తల్లిని, సవతితల్లిని, అన్నభార్యను, గురుభార్యను, కామాతురుఁడై రహస్యముగ భోగించినవాఁడు మహాపాతకుఁడనఁబడును. అట్టివాఁడు తనదు వృషణములను ఛేదించుకొని దక్షిణాభిముఖుఁడై పోవుచు మరణమును బొందెనేని పరిశుద్ధుఁడగును. ఇట్లు సేయఁడే నిపతితుఁడగునని దేవలుఁడు వచించె. మహాభారతమునందును నిటులనే చెప్పఁబడెను. గౌతముఁడును నివ్విధముగానే మఱియు నిట్లనెను. నిర్జనమగు నరణ్యప్రదేశమునకుఁబోయి పూర్వోక్త ప్రకారముగ శరీరమును వేసికొని మౌనము నవలంబించి పెద్దఘటమునందు యవలనువండి యాయవాగును పాత్రయందుఁబెట్టి యగ్నియందుఁ బ్రజ్వలింపఁజేసి దారుమయమగు స్రుచముచేత మంత్రపూర్వకముగ హోమమును జేయవలయుననెను. శ్రుతియును నీవిధముగానే వచించె. గౌతముఁడును నివ్విధముగానేవచించిహోమావశిష్టయవాగును స్వయముగఁ బాసమును జేయవలయును. పరదినమునందును నిటులనే చేయవలయును. ఇట్లు రెండు నెలలు సేసినయెడల పవిత్రుఁడగుననెను.

## —— చాన్ద్రాయణాదికృచ్ఛ్రలక్షణమ్. ——

(౮౯౯) అథ చాంద్రాయణాది కృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ బ్రహ్మహత్యాసురాపానం స్తేయంగుర్వంగనాగమః। తత్సంయోగశ్చపంచైతన్మహాపాతకమీరితమ్॥ ఏతేషాంపాతకానాం మరణాంతప్రాయశ్చిత్తమ్। నకృచ్ఛ్రాది॥ గోవధోగుర్వధిక్షేపః భృతకాధ్యాపనాదికం। ఏతదుపపాతకం। కృచ్ఛ్రచాంద్రాయణాదిభిఃపరిశుద్ధం॥ తిలానాంధాన్యరాశీనాం విక్రయస్త్వన్యవస్తునాం। ఏతత్సంకలీకరణం। కృచ్ఛ్రసాధ్యం॥ కన్యాపహారణం చైవ ధేనుభూహరణాదికం। మలినీకరణంచైతత్కృచ్ఛ్రసాధ్యం ప్రయత్నతః॥ చండాలగమనాదీని అపాత్రీకరణానిచ। కృచ్ఛ్రైర్విశోధనీయాని పాపైర్దోషపరాఙ్ముఖైః। దురన్నభోజనంచైవ దుష్టభక్షణమేవచ॥ దుష్టశాకాదికంచైవ జాతిభ్రంశకరంమహత్। ఏతదపికృచ్ఛ్రసాధ్యం॥ దుర్మరణాదికం ప్రకీర్ణకం కృచ్ఛ్రసాధ్యం। గర్భాధానాదికర్మణాం తత్తత్కాలాతిక్రమేకృచ్ఛ్రైరేవశోధనం॥ తులాదిప్రతిగ్రహీతౄణాంబిహ్మరాతుసత్వం కృచ్ఛ్రైరేవ నివారణీయం॥ ఏతేషాంకృచ్ఛ్రాణాంలక్షణమాహ॥ మార్కండేయః॥

యవమధ్యంమందమధ్యం యతిశిశ్వోర్మహత్తరం। మహాచాంద్ర మితిప్రోక్తం
పంచధాపరికీర్తితం । ప్రాజాపత్యం తప్తకృచ్ఛ్రం పరాకంయావకంతథా।
తతస్సాంతపనంకృచ్ఛ్రం మహాసాంతపనంతథా॥ ఔదుమ్బరంచపార్ణంచ
ఫలకృచ్ఛ్రమతఃపరం । కృచ్ఛ్రంమాహేశ్వరంచైవ బ్రహ్మకృచ్ఛ్రం తథైవ
చ॥ ధాన్యస్వర్ణమయంకృచ్ఛ్రం దశత్రిధాప్రకీర్తితమ్ । ఏతేషాం స్వరూప
మాహ॥ పరాశరః ॥ యవమధ్యస్య కృచ్ఛ్రస్య స్వరూపం ప్రవదామ్య
హం। యత్కృత్వా సర్వపాపేభ్యో ముచ్యతేమనుజోత్తమః ॥ శుక్లప్రతిప
దారభ్య వ్రతీనియమపూర్వకం। ప్రాతస్స్నాత్వా యథాచారం దంత
ధావనపూర్వకం॥ ధౌతవస్త్రంపరిధాయ నిత్యకర్మసమాప్యచ। జపేత్త్రాన
స్మసామానీ యావన్మందాయతేరవిః ॥ తదాహరింసమారాధ్య గంధపుష్పా
దిభిశ్శనైః । మయూరాండప్రమాణేన గ్రాసంకృత్వా వ్రతీతథా ॥ విష్ణవే
తంనివేద్యాశు తంగ్రాసం భక్షయేత్స్వయం। ఏకవారమశక్యత్వా ద్ద్విత్రిధా
కృత్వైవభక్షయేత్॥ ఉత్తరాపోశనంకృత్వా బహిర్గత్వాథవాగ్యతః। ప్రక్షా
ళ్యపాణీతోయేన గండూషైర్ద్వాదశాత్మకైః॥ పాదౌప్రక్షాళ్యచాచమ్యాపు
నర్గత్వాస్వమాలయం । స్వయమేవపునఃకృత్వా శుద్ధింగోమయవారిభిః॥ పు
నఃప్రక్షాళ్యతంపాణిం దేవంనత్వాథసంవిశేత్ । పాషండాదీన్నపశ్యేత్తు
నసమ్భాషేత్కదాచన॥ సాయంసంధ్యాముపాసిత్వా సాయంహోమ
మథాచరేత్। స్వపేచ్చస్థండిలేదేవ సమీపేనియతోవ్రతీ॥ తతఃప్రాతస్సము
త్థాయపరేద్యుస్స్నానమాచరేత్ । పూర్వవన్నియమంకృత్వా భక్షయేదే
కవృద్ధితః॥ ఏకోత్తరేణవైరాజన్ వృద్ధ్యాప్రతిదినంబుధః । భక్షయేత్కబ
ళాందివ్యాన్ యావదాపౌర్ణమీదినం॥ దశపంచైవకబళాన్ భుక్త్వాతత్రవ
తీక్రమాత్। ఏకైకంహ్రాసయేద్గ్రాసం కృష్ణపక్షేవ్రతీముదా॥ పూర్వవన్ని
యమంకృత్వా యదామాసంప్రవర్తతే తత్రాపిభక్షయేదేకం హరిధ్యానప
రాయణః ॥ వ్రతాంతేగాః ప్రదాతవ్యా వ్రతస్యపరిపూర్తయే । పంచగ
వ్యంపిబేత్పశ్చా ద్యవమధ్యముదాహృతం॥ ఏతదాచరణేనైవ బ్రహ్మహత్యా
వ్యపోహతి। ఇతరాణిచపాపాని నశ్యంతీతికిమద్భుతం ॥ మయూరాండప్ర
మాణమాహ॥ దేవలః॥ అప్రమాత్రతృతీయాంశైస్తండులైః పాచయేద్ధ
విః। తావదన్నంమయూరాండమితిసంతోవదంతిహి॥ ఇదంచాంద్రాయణం
కృత్వా యవమధ్యంసుపావనం। బ్రహ్మహత్యాదిభిఃపాపైర్ముక్తోభవతితత్క్ష
ణాత్॥ యవమధ్యమిదంచాంద్రం కర్తుంయస్తదుపక్రమేత్। తస్యపాపానిన
శ్యంతి కింపునర్వ్రతచారిణః ॥ విష్ణుప్రియకరంచైతత్సర్వపాపప్రణాశనం।

నారీణాంవిధవానాంచ యతీనాంబ్రహ్మచారిణాం ॥ గృహస్థానాంవిశేషేణ మహాపాతకనాశనం। వృద్ధిక్షయౌహిచంద్రస్యవర్తేతే తద్వదత్రహి ॥ అతఏతద్వ్రతంశాన్నాముధేయం॥ చంద్రస్యశుక్లపక్షేవృద్ధిః కృష్ణపక్షేక్షయః॥ తన్నామధేయమేతద్యవమధ్యకృచ్ఛ్రం ॥ ఇతియవమధ్యచాంద్రాయణప్రకారః॥

(౪౯౯) ఇకనుచాంద్రాయణాది కృఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ బ్రహ్మహత్య, సురాపానము, స్తేయము, గురుభార్యాసంగమము, అట్టివారియొక్క సాంగత్యము, అనునైదునుమహాపాతకములనబడును. ఇట్టిపాతకములనుజేసినవారలకు మరణాంతప్రాయశ్చిత్తమునువిధింపవలయును. కృఛ్రాదికమువలన పావనత్వముగలుగనేరదు. గోవధ, గుర్వధిక్షేపము, భృతకాధ్యాపనాదికము, అనునవియుపపాతకములనబడును. ఇట్టియుపపాతకములుకృఛ్రచాంద్రాయణాదులచేతనశించును. తిలలను, ధాన్యరాసులను, మఱియుసితరములగువస్తువులను విక్రయించుటయనునవి సంకీర్ణకరణమనబడును. ఈపాపములు కృఛ్రముచేతసాధ్యములగును. కన్యాపహరణము, ధేనుభూహరణాదికము, మలినీకరణము, ఇవిగూడకృఛ్రసాధ్యములనబడును. చండాలగమనాదికములపాత్రీకరణములు, దురన్నభోజనః దుష్టశాకాదభక్షణముమొదలైనవి జాతిభ్రంశకరములనబడును. ఇప్పాపములుగూడ కృఛ్రములచేతనివర్తించును, దుర్మరణాదికము ప్రకీర్ణకమనబడును. ఇదియునుకృఛ్రసాధ్యమగును. గర్భాధానాదికర్మలకు తత్తత్కాలాతిక్రమమయ్యేనేని కృఛ్రములచేతబరిశుద్ధిగలుగును. తులాదిదానములనుబ్రతిగ్రహించినవారలకుగల బ్రహ్మహత్యాదికమును కృఛ్రములచేతసాధ్యమగునని దేవలుడువచించె. యవమధ్యము, మంచమధ్యము, యతిశిశుకృఛ్రములు, మహత్తరకృఛ్రము. అనిమహాచాంద్రమయిదువిధనులుగ నియమింపబడినది. ప్రాజాపత్యము, తప్తకృఛ్రము, పరాకకృఛ్రము, యావకకృఛ్రము, సాంతపనకృఛ్రము, మహాసాంతపనము, ఔదుంబరము, పార్ణము, ఫలకృఛ్రము, మాహేశ్వరకృఛ్రము, బ్రహ్మకృఛ్రము, ధాన్యస్వర్ణమయకృఛ్రము, అనికృఛ్రములుపదివిధములుగ విభజింపబడినవని మార్కండేయుడువచించె. యవకృఛ్రమునాచరించినవాడు సకలపాపములనుండివిముక్తుడగును. దీనిస్వరూపమునువివరించిచెప్పెదను, అదియెట్లనిన శుక్లప్రతిపత్తుమొదలుకొని ప్రతిదినమునియమపూర్వకముగ, ప్రాతస్స్నానమునుజేసి ధౌతవస్త్రమునుధరించి నిత్యకర్మలనుసమాప్తినొందించి సూర్యాస్తమయమువఱకు జపమునుజేయుచు గంధపుష్పాదులచేతనారాయణునకారాధననుజేసి మయూరాండప్రమాణముగలగ్రాసమును ముందుగనా

రాయణునకు నివేదించి యాగ్రాసమును భక్షింపవలయును. మయూరాండప్రమాణముగల పిండము నొక్కమాటుగ భుజించుట కష్టముగనుక రెండుభాగములుగ జేసికొని భుజింపవలయును. అనంతరమం దుత్తరాపోశనను జేసి పిమ్మట పాదపాణిప్రక్షాళనమును జేసికొని పదిరెండు పర్యాయములు గండూషమును జేయవలయును. అనంతరమందు మరల పాణిపాదప్రక్షాళనమును జేసికొని తాను భుజించిన ప్రదేశమును గోమయాదులచేత బరిశుద్ధముసేసి యాచేతిసి మరలగవుగుకొని దేవునకు నమస్కారమును జేసి నిజాలయములోపల బ్రవేశింపవలయును. అనంతరమందు పాషండాదులను జూడక వారితో మాటలాడక సాయంకాలీనసంధ్యావందనము నాచరించి సాయంహోమమును జేయవలయును. పిమ్మట దేవసమీపమునందు స్థండిలశాయిగావలయును. మరలమరుదిన ప్రాతఃకాలమునందును నిట్టులనే యాచరించి యొక్కొక్కదినమున కొక్కపిండమున భివృద్ధిగ జేసి భుజింపుచుండవలయును. ఇట్లు పౌర్ణమివఱకును భుజింపుచుండవలయును. పిమ్మట కృష్ణపక్షమునం దొక్కొకపిండమును దగ్గించుచు రావలయును. ఇవ్విధముగ మాసాంతము దనుక వ్రతాచరణను జేసి వ్రతాంతమందు గోదానమును జేయువలయును. పిమ్మట బంచగవ్యప్రాశనను జేయవలయును. ఇయ్యది యవమధ్యమని చెప్పబడును. దీనినాచరించుటచేత బ్రహ్మహత్యాదిపాపములన్నియును నాశమును బొందును. కావున నితరములగు పాపములు నశించు ననుటకు సంశయము లేదని పరాశరుడు వచించె. అప్రమాత్రత్రుటీయాంశతండులములచేత బచనముచేయబడిన యన్నపు ముద్ద మయూరాండప్రమాణముగలదని యెఱుంగవలయును. ఇట్టి చాంద్రాయణవ్రతము నాచరించి బ్రహ్మహత్యాదిపాపములనుండి తొలగినవాడగును. ఇట్టి యవమధ్యచాంద్రాయణవ్రతము నాచరించుటకు యత్నించుటమాత్రముచేతనే సకలపాపములును నశించును. ఇక నువ్రతము నాచరించినవానికి సకలపాపములును నశించును. మఱియును విష్ణుప్రీతికరమగును. ఇయ్యది స్త్రీవృద్ధవిధవాంగన బాలాదులకందఱికిని పాపనాశకరమగునని దేవలుడు వచించె.

——— ॥ పిపీలికామధ్యచాంద్రాయణమ్. ॥ ———

(౫౦౦) అథ పిపీలికామధ్యచాంద్రాయణమాహ॥ దేవలః॥ పూర్వవత్కృష్ణపక్షస్య ప్రతిపద్దివసే వ్రతీ। ప్రాతస్స్నానాదికంతోమే దంతధావనపూర్వకం॥ కృత్వా ధౌతం పరీధాయ సంధ్యావందనమాచరేత్। బ్రహ్మయజ్ఞాదికాన్ కృత్వా దేవపూజాపరాయణః॥ పఠేదుపనిషద్వాక్యం నారాయణమథాపి వా। సహస్రనామస్తోత్రం వా గజేంద్రస్య చ మోక్షణం॥ జపేన్నారాయ

ణంధీమూర్ఘ్ని యదా మందాయతే రవిః । తత్రైవ దేవతాపూజాం పురుషసూక్తవి
ధానతః ॥ కృత్వా పంచదశ గ్రాసాన్ నివేద్య పరమాత్మనే । తతస్తాన్ భక్షయేత్ప
శ్చాన్మౌనవ్రతపరాయణః ॥ ప్రక్షాళ్య పూర్వవత్పాణీ గండూషాదీన్ సకల్పయే
త్ । స్వ నమేవ పునః కృత్వా శుద్ధిం గోమయవారిణా ॥ పునః ప్రక్షాళ్య తం పాణిం
దేవం నత్వాఽథ సంవిశేత్ । పాషండాదీన్న పశ్యేచ్చ న సమ్భాషేత్ కదాచన ॥
సాయం సంధ్యాముపాసిత్వా సాయంహోమమథాచరేత్ । స్వపేచ్చ స్థండిలే
దేవసమీపే నియతో వ్రతీ ॥ తతః ప్రాతస్సముత్థాయ పరేద్యుః స్నానమాచరేత్ ।
పూర్వవన్నియమం కృత్వా భక్షయేదేకహీనతః । ఏకైకహ్రాసతో భక్షేద్గ్రాసాంబ
లాత్తాన శేషతః । అమాయాం కబళైకాశీ పూర్వవన్నియతో వ్రతీ ॥ పరేద్యుః
ప్రతిపద్దివసే కృత్వా నియమమాదరాత్ । గ్రాసమేకం తథా భుక్త్వా పూర్వవద్వి
ధిపూర్వకం ॥ ద్వితీయాయాం ద్వయం భక్ష్యేత్తృతీయాయాం త్రయం తథా । ఏ
కవృద్ధిక్రమేణాజ్ఞ యావదాపౌర్ణమీదినం ॥ తావత్పంచదశాన్ భుక్త్వా వ్ర
తశేషం సమాపయేత్ । వ్రతాంతే గౌః ప్రదాతవ్యా వ్రతస్య పరిపూర్తయే ॥ పం
చగవ్యం పిబేత్పశ్చాన్మంత్రవన్మధ్యముదాహృతం । ఏతదాచరణాన్నైవ బ్రహ్మహ
త్యాద్యఘో హతి ॥ ఇతరాణి చ పాపాని నశ్యంతీతి కిమద్భుతం । అత్రాపి గ్రాసపరి
మాణం మయూరాండవత్ ॥ లక్షణం తూక్తం ॥ పిపీలికామధ్యచాంద్రాయణాచ
రణే ఫలం పూర్వవద్వేదితవ్యం ॥ వ్రతోపక్రమకాలే మహతామనుజ్ఞాం వాక్య పు
ణ్యాహవాచనం కృత్వా సంకల్పకాలే మంత్రమేవముదీరయేత్ ॥ దేవలః ॥ గృ
హీతేస్మిన్ వ్రతే దేవ పంచత్వం యది మే భవేత్ । తదా భవతు సంపూర్ణం త్వత్ప్ర
సాదాజ్జగద్గురో ॥ ఇతి సంకల్పమంత్రః ॥ ఇతి పిపీలికామధ్యచాంద్రాయణం ॥

(౫౦౦) ఇకను పిపీలికా చాంద్రాయణమును గురించి చెప్పుచున్నాడు॥
పూర్వోక్తప్రకారముగ కృష్ణపక్షప్రతిపత్తు మొదలుకొని వ్రతాచరణను జేయు
టకు సంకల్పించి దంతధావనాదినియమపూర్వకముగ ప్రాతస్స్నానమును జే
యవలయును. అనంతరమందు ధౌతవస్త్రమును ధరించి సంధ్యావందనమును
జేయవలయును. పిమ్మట బ్రహ్మయజ్ఞాది దేవపూజాంతకర్మను జేయవలయు
ను. అనంతరమందుపనిషద్వాక్యము నైనను, నారాయణమంత్రము నైనను, ఆ
లోచింపవలయును. ఇట్లుగాదేని విష్ణుసహస్రనామములనైనను, గజేంద్రమో
క్షమునైనను, సూర్యాస్తవము మొదలుగ జపించుచుండవలయును. పిమ్మట
పురుషసూక్తవిధానముచేత దేవతాపూజను జేసి పదునైదు గ్రాసములను నా
రాయణునకు నివేదించి తానాపదిగ్రాసములను భుజింపవలయును. పిమ్మట
పాణిపాదప్రక్షాళనాదికమును పూర్వోక్తప్రకారముగ నాచరింపవలయు

ను. పాషండులతో నేవిధమైన సంబంధమును బొందగూడదు. పిమ్మట సాయం సంధ్యావందనమును జేసికొని సాయంహోమమును జేయవలయును, పిమ్మట దేవసమీపమునందు స్థండిలశాయియై నిద్రను బొందవలయును. అనంతరము దుమరుదినప్రాతఃకాలమునకు ముందుగ నిద్రను మేల్కాంచి పూర్వోక్తప్రకారముగ సకలనియమములను నాచరింపవలయును. ఇట్లు కృష్ణపక్షప్రతిపత్తు మొదలుకొని ప్రతిదినము నందును నొక్కొక్క కబళమును దగ్గించుచువచ్చి అమావాస్యయందొక్కకబళమును భుజింపవలయును. శుక్లపక్షప్రతిపత్తుమొదలుకొని యొక్కొక్కదినమున కొక్కొక్క కబళమును నధికముగ జేయుచు రావలయును. ఇవ్విధముగ వ్రతమును పరిసమాప్తినొందించి వ్రతాంతమందు గోదానమును జేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్టి ప్రాయశ్చిత్తమునాచరించుటచేత బ్రహ్మహత్యాదిపాపములు దొలగును. ఇతరములగు పాపములును నశించును. ఇక్కడగూడ గ్రాసములను మయూరాండప్రమాణము గలిగి యుండవలయును. పిపీలికామధ్యచాంద్రాయణాచరణమునందు ఫలమును పూర్వోక్తప్రకారముగ దెలిసికొనవలయును. ప్రయోగక్రమకాలమునందు మహాత్ములయనుమతమును బొంది పుణ్యాహవాచనమును జేయించి సంకల్పకాలమునందు మంత్రోచ్చారణను జేయవలయును. అమ్మంత్రమెద్దియనిన నీవ్రతము పూర్తినిబొందకమునుపు మరణమును బొందితినేని నాదు వ్రతము మాత్రము పూర్తి అయినట్టులనే భగవంతుడనుగ్రహింపవలయునని దేవలుడు వచించె.

❋ యతిచాంద్రాయణవిధిః. ❋

(౫౦౧) అథ యతిచాంద్రాయణస్వరూపమాహ॥ దేవలః॥ యతిచాంద్రాయణం వక్ష్యే సర్వపాపప్రణాశనం। స్వపాతిత్యశమనమగమ్యగమనాశనం॥ పతితప్రాహాన్యాహ॥ అపస్తమ్బః॥ స్తైనమాభిశస్త్యం పురుషవధో బ్రహ్మోజ్ఝంగర్భశాతనం। మాతుః పితురితి యోనిసమ్బన్ధ సహాపత్యస్త్రీగమనం సురాపానమసంయోగసంయోగౌ గుర్వీసఖీ గురుసఖీం చ గత్వాన్యాని చ పరతల్పాని ఇతి పతనీయహేతూని। అథాశుచికరాణి॥ శూద్రగమనమార్యస్త్రీణాం ప్రతిషిద్ధానాం మాంసభక్షణం శునో మనుష్యస్య చ కుక్కుటసూకరాణాం గ్రామ్యాణాం క్రవ్యాదానాం మనుష్యాణాం మాత్రపురీషప్రాశనం శూద్రోచ్ఛిష్టమపపాత్రగమనమార్యాణామపి తాన్యపి పతనీయానీత్యేకే। అథ ధర్మనాశహేతూని॥ క్రోధో హర్షో రోషో లోభో మోహో దమ్భో ద్రోహో మృషోద్యమత్యాశాపరివాదావసూయాకామమన్యూ అనాత్మ్యమయోగ ఇతి॥ ఏతేషాం పూర్వోక్తానాం [illegible] ధర్మనాశహేతూ

నాం యతిచాంద్రాయణం శోధనం॥ తదేవాహ మనుః॥ స్తేయాదిసర్వపాపానాం తథైవాశుచినామపి। ధర్మనాశకరాణాంచ యతిచాంద్రాయణం వరం॥ ఏతస్యాచరణేనైవ సర్వపాపం ప్రణశ్యతి। యతిచాంద్రాయణంనామ యతిలోకప్రదాయితత్॥ తత్స్వరూపమాహ॥ గౌతమః॥ మాసాదౌ ప్రతిపద్దివసే ప్రాతర్వ్యుత్థాయ యథావిధి। కృత్వా మూత్రపురీషే తు శౌచం కుర్యాద్యథావిధి॥ దంతాన్సంశోధ్య యత్నేన హ్యపామార్గస్య శాఖయా। స్నానం కృత్వా నదీతోయే తటాకే వా హ్రదేపి వా॥ ధృత్వా ధౌతంచోత్తరీయం త్యక్త్వా సమాపయేత్। ఔపాసనాదికం కృత్వా దేవపూజాం యథాచరేత్। సంకల్పమేవం కుర్వీత పూర్వమంత్రమనుస్మరన్। తావద్ధ్యాయేన్మహావిష్ణుం యావన్మందాయతే రవిః॥ కుక్కుటాండప్రమాణేన పంచైవ కబళాన్సుధీః। భక్షయేద్విష్ణువేదత్వా పూర్వవత్ప్రాళయేత్కరౌ॥ పాదౌ ప్రక్షాళయేత్పశ్చాద్ద్విరాచమ్య శుచిర్భవేత్। సాయంసంధ్యాముపాసీత స్వపేన్నారాయణాగ్రతః॥ తతః ప్రాతస్సముత్థాయ సర్వం పూర్వవదాచరేత్। తావత్తావదుపోషణం కృత్వా యావచ్ఛుక్లాష్టమీ భవేత్॥ తత్రైవ పూర్వవత్పిండాన్ భక్షయేత్పూర్వసంఖ్యయా। పౌర్ణమ్యాం బహుళాష్టమ్యాం తథా మాయాం యథాక్రమం॥ భక్షయేత్పంచ పంచైవ కబళాన్పక్షిపూర్వతః। అనశ్నీయాద్భవేన్నిత్యం గంధతాంబూలవర్జితః॥ మాసాంతే గాః ప్రదాతవ్యా వ్రతస్య పరిపూర్తయే। పంచగవ్యం పిబేత్పశ్చాద్యతిచాంద్రాయణం స్మృతం॥ అనేనవిధినా యస్తు యతిచాంద్రాయణం పరమ్। కుర్యాత్స పాపశుద్ధాత్మా ప్రాప్నుయాత్పరమాంగతిం॥ విధవా వా యతిర్వాపి వ్రతీ వా పాపనాశనం। గృహీ వా కురుతే సమ్యక్సర్వపాపైః ప్రముచ్యతే॥ ఇతి యతిచాంద్రాయణవిధిః॥

(౫౦౩) ఇక యతిచాంద్రాయణమును గురించి చెప్పుచున్నాడు॥ యతిచాంద్రాయణము, సకలపాపములను నశింపజేయునట్టిదియనియును, సకలపాతిత్యములను బోగొట్టునదియనియును, అగమ్యాగమనాశమును జేయునదియనియును, దేవలుడు వచించెను. దొంగతనము, అభిశస్త్యము, పురుషవధ, బ్రహ్మవధ, గర్భశాతనము, మాతాపితృయోనిసంబంధము, గుర్వాదిస్త్రీసంబంధము, పరతల్పము, అనునవి పతితపాపములని యాపస్తంబుడు వచించెను, శూద్రస్త్రీలను, ఆర్యస్త్రీలను, నిషిద్ధస్త్రీలను, బొందుటయును, కుక్క, మనుష్యుడు, కుక్కుటసూకరములు, గ్రామ్యజంతువులు, క్రవ్యాదములు, మొదలగువానియొక్క మాంసములను దినుట, మనుష్యాదులయొక్క మూత్రపురీషప్రాశనము, శూద్రోచ్ఛిష్టభోజనము, మొదలగునవిగూడ పతనీయములని కొందఱందురు. ఇట్టి పాపములన్నియును యతిచాంద్రాయణముచేత నాశములగునని

యాపస్తంబుఁడువచించె- మనువుగూడస్త్రీయాదిసకలపాపములును, యతిచాంద్రాయణమువలననశించుననియును, యతిచాంద్రాయణముయతిలోకమునొసంగుననియునుజెప్పె. శుక్లపక్షప్రతిపత్తునాఁటప్రాతఃకాలమునందు నిదురను వదలిమూత్రపురీషాదిశౌచకర్మలను నియమపూర్వకముగనాచరించి నదీతోయమునందుస్నానమునుజేయవలయును,అనంతరము-ధౌతవస్త్రమునుధరించి నిత్యకర్మమునుసమాప్తినిబొందింపవలయును.పిమ్మటనౌపాసనాదిదేవపూజాంతకర్మలనుజేయవలయును. అనంతరమందు బూర్వోక్తప్రకారముగ సంకల్పమునుజేసి విష్ణుదేవతాకమగుమంత్రమును సూర్యాస్తమయమువఱకును జపింపవలయును. పిమ్మటకుక్కుటాండప్రమాణముగల మైదుకబళములనువిష్ణుదేవునకునివేదించిభుజింపవలయును, అనంతరమందు బాదప్రక్షాళనాదికృత్యములనుపూర్వోక్తప్రకారముగజేసికొని సాయంసంధ్యావందనకర్మనుజేసి నారాయణసమీపమునందు స్థండిలశాయియైనిదురనుబొందవలయును. పూర్వోక్తప్రకారముగసంఖ్యనుదెలిసి పిండములనుభుజింపవలయును. పున్నమనాఁడును, అష్టములయందును, అమావాస్యయందును నైవేద్యపిండములనుభుజింపవలయును, ముప్పదిదినములుగంధతాంబూలాదులను వదలవలయును. మాసాంతమందు గోదానమునుజేయవలయును. పిమ్మటబంచగవ్యప్రాశననుజేయవలయును.ఇత్యాదియతిచాంద్రాయణమనబడును, ఇట్టియతిచాంద్రాయణమునాచరించుటచేత సకలపాపములునశించును, విధవాదిసకలజనులునునీయతిచాంద్రాయణమునాచరించుటచేత బాపరహితులగుదురనిగౌతముఁడువచించె.

—— శిశుచాన్ద్రాయణలక్షణమ్. ——

(౫౦౨)అథశిశుచాన్ద్రాయణలక్షణమాహ॥దేవలః॥శృణు రామమహాబాహో శిశుచాన్ద్రాయణంపరం । శిశుచాన్ద్రాయణంనామసర్వర్షిగణసేవితమ్॥ పురాతూద్దాలకోనామమాతుర్గర్భాద్వినిర్గతః । నాభినాళముపాదాయ స్వాంజలౌ పర్యటన్మహీం॥ గర్భస్థమేనమాయాతే స్వర్గాత్తేన విశంచరన్। తదాప్రభృత్యసౌయోగీసాయంప్రాహ్ణే భైక్షమాచరేత్॥ శ్రోత్రియాణాం ద్విజాతీనాంత్రిషు వేశ్మసుసంచరన్। కబళత్రయమానీయప్రక్షాళ్య శుచిభిర్జలైః॥ భాగత్రయంతదాకృత్వా భాగమేకంహరేర్దదౌ । ద్వితీయమగ్నౌనిక్షిప్యతృతీయంచాత్మనిన్యసేత్॥ రాత్రౌస్వపేత్ స్థండిలేసౌ గన్ధపుష్పాదివర్జితః॥ ఏవంవైప్రత్యహంకుర్వన్యావత్పునస్సమాగమమ్ ॥ నాచికేతూపత్త్రిపర్యంతమిత్యర్థః॥ తదాప్రభృతిలోకేస్మిన్ శిశుచాన్ద్రాయణంస్మృతమ్। కిలాయుగవిశేషేణమహాపాతకనాశనమ్॥ మహాపాతకయుక్తస్య సర్వ...

త్తమమ్॥ గౌతమః॥ శిశుచాన్ద్రాయణం సమ్యజ్మాసమేకంనిరంతరం। కృత్వా
శుద్ధిమవాప్నోతి మహాపాతకవానపి॥ జాబాలిః॥ శిశుచాన్ద్రాయణంకుర్యాద్ద్వి
జోయః పాపముక్తయే। ససద్యః పాపనిర్ముక్తః ప్రయాతి పరమాంగతిమ్। తత్ప్ర
కారమాహ॥ దేవలః॥ మాసాదౌ ప్రతిపద్దివసే పూర్వవత్స్నానమాచరేత్। ద
న్తధావనస్నానధౌతవస్త్ర సంధ్యావందనాదికంపూర్వవత్కృత్వా చతుర్థ
యామే॥ పటేపర్ణపుటేవాపిహ్యా వశ్యస్యాపివః ఖలాన్। శ్రోత్రియాణాంద్వి
జాతీనాంత్రిషు వేశ్మసు సంచరన్॥ కబళత్రయమానీయ ప్రక్షాళ్య శుచిభిర్జలైః।
భాగత్రయంతదాకృత్వా భాగమేకం హరౌ క్షిపేత్॥ ద్వితీయమగ్నౌ నిక్షిప్య
అవశిష్టం స్వయం హరేత్। ప్రక్షాళ్యపూర్వవద్ధస్తావాచమ్య శుచిర్భవేత్॥
రాత్రౌ స్వపేద్ధరేర్గేహే స్థండిలే గంధవర్జితః। పునః పరేద్యురేవంహి కుర్యాత్స్వా
పవిశుద్ధయే॥ ఏవంరూపంవ్రతం కృత్వా మాసాంతే గార్యధార్థతః। దేయావి
ప్రాయ సహస్రా పంచగవ్యంపిబేత్తతః॥ ఏవంకుర్యాన్నరో యస్తు సర్వపాపైః
ప్రముచ్యతే। శిశుచాన్ద్రాయణం సమ్యక్కుర్యాద్యః పూర్వజన్మచిః। సర్వా
న్కామానవాప్నోతి ప్రాప్నుయాద్విష్ణుమందిరం॥ ఇతిశిశు చాన్ద్రాయణం॥

(౫౦౨) ఇకను శిశుచాంద్రాయణవ్రతమును జెప్పుచున్నాడు॥ శిశుచాం
ద్రాయణమనునది సమస్తఋషులచేతను నాచరింపబడినది. తొల్లియుద్దాలకు
డనియెడువాడు తల్లిగర్భమునుండి బయలువెడలి నాభినాళమును గ్రహించి తనదు
దోసిలియందు బెట్టుకొని భూమియందంతటను, తిరుగుచు గర్భమాసములతో
గూడ నెనిమిదవ సంవత్సరము వచ్చినపుడు వ్రతము నాచరించె. అది మొదలుకొ
ని సాయంకాలమునందు భిక్షము నాచరించెను. మఱియును శ్రోత్రియులగు బ్రాహ్మ
ణులగృహములయందు మూడింటియందు భిక్షము నెత్తి మూడు కబళములను సంపా
దించి యా మూడు భాగములలో నొక భాగమును నారాయణున కీవ్వవలయు
ను. మఱియొక భాగమును, అగ్నియందుంచి మూడవదానిని దానుపయోగింప
వలయును. రాత్రికాలమునందు స్థండిలశాయియైనిదురను బొందవలయునని
యెడు విధులనన్నింటిని దెలిసి నాచికేతువను పుత్రుడు పుట్టువఱకు నాచరించె.
అది మొదలుకొని శిశుచాంద్రాయణమని యెన్నబడియె. ఈ శిశుచాంద్రాయణము
కలియుగమునందు సకలపాపములను హరించునట్టిదియని దేవలుడు వచించె. మ
హాపాతకవంతుడు గూడ మాసముదినములు శిశుచాంద్రాయణము నాచరించెనే
ని పావనుడగునని గౌతముడు వచించె. పాపశాంతికొఱకు శిశుచాంద్రాయణము
నాచరించినవాడు పుణ్యలోకమును బొందునని జాబాలి వచించె. మాసాదియందలి
ప్రతిపద్దివసమునందు, పూర్వోక్తప్రకారము స్నానము నాచరింపవలయును.

దంతధావనస్నానధౌతవస్త్రసంధ్యావందనాదికములుబూర్వోక్త ప్రకారముగనాచరించి పగటియొక్క నాల్గవజామునందు పైనచెప్పబడినప్రకారముగ భిక్షాటనాదికృత్యములనాచరింపవలయును. మాసాంతమందు గోదానమును జేయవలయును. అనంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇవ్విధముగ శిశుచాంద్రాయణము నాచరించినవాడు సకలపాపముక్తుడై విష్ణుమందిరమును బొందునని దేవలుడు చెప్పెను.

మహాచాంద్రాయణవిధిః

(౫౦౩) అథ మహాచాంద్రాయణవిధిమాహ। దేవలః॥ శృణురామప్రవక్ష్యామిమహాచాంద్రాయణంపరం। బ్రహ్మహత్యాదిపాపానాం శోధనంసర్వసంకరం॥ గురుద్రోహేచయత్పాపంయత్పాపంపరవంచనే। యత్పాపంపుత్రహత్యాయాంయత్పాపంపశుమారణే॥ పిత్రోరబ్దపరిత్యాగేవిష్ణుద్రోహేచయద్భవేత్। యత్పాపంశివనిందాయాంయత్పాపంచక్రధారణే॥ యత్పాపంశివనిర్మాల్యభక్షణేస్వధారణే। లింగధారణఇత్యర్థః॥ చండాలీగమనేచాపంయత్పాపంవిధవాగమే। పరస్త్రీషుచయత్పాపంయత్పాపంపరభోజనే॥ యత్పాపంవృషలీసంగేయత్పాపంకుండగోళయోః। శూద్రాపత్యేచయత్పాపంయత్పాపంరసవిక్రయే॥ పురోహితస్యయత్పాపంయత్పాపంపరదారగే। యత్పాపంపతితసంసర్గేయత్పాపంధేనువిక్రయే॥ యత్పాపంరజకీసంగేయత్పాపంతిలనిందయా। యత్పాపంవిప్రనిందాయాంకన్యాసందూషణేపిచ॥ ఏవమాదీనిపాపానిగురూణిచలఘూనిచ। అర్థాణిచైవసూక్ష్మాణియానిపాపాన్యనేకశః॥ తేషాంనాశకరంచేదంమహాచాంద్రమహాఫలం। యత్కృత్వాముచ్యతేపాపైర్గురుభిర్లఘుభిస్తథా॥ తత్ప్రకారమాహ॥ గౌతమః॥ శుక్లప్రతిపదిస్నాతఃపూర్వవచ్ఛుద్ధతోయతః। పూర్వవన్నియమంకృత్వాచతుర్థేకాలఆగతే॥ విష్ణుపూజాపరోభూత్వాపూర్వసంకల్ప్యమాచరేత్। పూర్వవన్మంత్రముచ్చార్యనిరాహారఃస్వపేత్తతః॥ తతఃప్రభాతఉత్థాయస్నాత్వాచవ్యయథావిధి। పూర్వవన్నిత్యకర్మాణిసమాప్యవిధిపూర్వకమ్। చతుర్థకాలఆయాతేపూర్వవద్దేవమర్చయేత్। తదాప్రాశ్యయథాపూర్వంపూర్వవన్నియతఃస్వపేత్॥ ఏవంప్రతిదినంకార్యంరాకాయావత్ప్రవర్తతే। తతోపిపూర్వవత్కృత్వానిత్యకర్మాణిసర్వశః॥ తత్రైవతిథౌమెత్పఇచ్ఛదశగ్రాసాన్వ్రతాప్తయే। తత్రాపిహరిసాన్నిధ్యేస్వపేద్గంధాదివర్జితః॥ ఉపోషణంప్రకర్తవ్యమమాయావత్ప్రవర్తతే। తత్రాపిపూర్వవత్పిండాన్భక్షయేత్పూర్వసంఖ్యయా॥ శుక్లప్రతిపదిస్నాత్వాగార్హ్యేయావ్రతపూర్తయే। పంచగవ్యంపిబేత్పశ్చాన్మహాచాంద్రమహోత్సవమ్॥ అశక్యస్సర్వలోకానాం

న్నత్యాగో మహత్తరః। కృతేచర్మాశ్రితాః ప్రాణాస్త్రేతాయాం కీకసాశ్రయాః ॥ ద్వాపరే రక్తమాశ్రిత్య కలావన్నాశ్రయాస్సదా। మహాచాన్ద్రస్య మహిమా కథితోఽయం మయానఘ ॥ యత్కృత్వా ముచ్యతే పాపైః మహద్భిరుపపాతకైః। ఇతి మహాచాన్ద్రాయణవిధిః॥

(౫౦౩) ఇఁకను మహాచాంద్రాయణ విధానమునుగురించి చెప్పుచున్నాఁడు॥ మహాచాంద్రాయణమనునది బ్రహ్మహత్యాది సకలపాపములను నశించును. గురుద్రోహ, పరవంచన, పుత్రహనన, పశుమారణ, పితృశ్రాద్ధపరిత్యాగ, విష్ణుద్రోహ, శివనింద, శివనిర్మాల్యభక్షణ, లింగధారణ, చండాలస్త్రీగమన, విధవాసంగమ, పరస్త్రీగమన, పరభోజన, వృషలీసంగమ, కుండగోళకత్వ, శూద్రాపతిత్వ, రసవిక్రయ, పురోహితత్వ, పరదారగమన, పత్వసంసర్గ, ధేనువిక్రయ, రజకీసంగమ, విప్రనిందా, కన్యాదూషణాదిపాపములన్నిటియును, మఱియునితరములగు పాపములును, మహాచాంద్రాయణమును దానివలన నశించునని దేవలుఁడువచించె. శుక్లపక్ష ప్రతిపత్తునందుఁ బ్రాతఃకాలమునకు ముందుగ నిదుర మేల్కాంచి నియమపూర్వకముగ శౌచాదికృత్యముల నాచరించి స్నానమునుజేసి పూర్వోక్త ప్రకారముగసంకల్పమునుజేసి మంత్రోచ్చారణాదికము నుచ్చరించి నిరాహారుఁడై నిదురను బొందవలయును. మరల మరుదినప్రాతఃకాలమునందు స్నానమును జేసి శాస్త్రోక్తప్రకారముగ నాచమనమును జేసి పూర్వోక్తప్రకారముగ నిత్యకర్మలనుసమాప్తినిబొందించి పగటియొక్క నాల్గవభాగమునందుఁ బూర్వోక్తప్రకారముగ దేవునిబూజించి యుపవసించి పూర్వోక్తప్రకారముగ నిద్రాదికమును బొందవలయును. ఇట్లు నిండుపున్నమదినమువఱకును ప్రవర్తింపవలయును. పున్నమదినమునందుఁ బదునైదుకబళములను భుజింపవలయును. అదిమొదలమావాస్యదనుక, ఒక్కొక్కకబళమును దగ్గించికొని భుజించుచు వచ్చి మరల నమావాస్యయం దుపవాసమును జేయవలయును. ఇట్లుముప్పదిదినములును వ్రతమునాచరించి వ్రతాంతమందు గోదానమును జేసి పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇయ్యది మహాచాంద్రాయణమనఁబడును. సర్వలోకములవారికిని నన్నత్యాగమును జేయుట కడుదుర్లభము. కృతయుగమునందుఁ బ్రాణములు చర్మాశ్రితములై యుండును. త్రేతాయుగమునం దుఁ బ్రాణములు నెమ్ములనాశ్రయించి యుండును. ద్వాపరయుగమునం దుఁ బ్రాణములు రక్తమునాశ్రయించియుండును. కలియుగమునం దన్నము నాశ్రయించి ప్రాణములుండును. మహాచాంద్రాయణవ్రతము నిఖిలపాప

నాశమనుటకు సందియములేదని గౌతముఁడువచించె.

—— పఞ్చవిధచాన్ద్రాయణప్రత్యామ్నాయః ——

(౫౦౪) అథపంచవిధచాంద్రాయణ ప్రత్యామ్నాయమాహ ॥ దేవలః॥ అథవక్ష్యామి రాజేన్ద్ర మహాపాతకనాశనమ్। ప్రత్యామ్నాయంహి చాన్ద్రస్య విష్ణులోక ప్రదాయకమ్।అశక్తత్వాద్దుర్బలత్వా త్తథాయు ర్నాశహేతుతః। భక్తిశ్రద్ధాదిహీనత్వా దాలస్యాన్నాస్తికాదపి॥ చాన్ద్రాయణేకృతారమ్భే రాజవిడ్వరశఙ్కయా। పురాదేవేంద్రసదనే దేవానాహాఙ్గిరం దరః॥ చాంద్రాయణేప్యశక్తశ్చే త్ప్రత్యామ్నాయంకురుష్వహ। శుక్లప్రతిపదిస్నాత్వా నిత్యకర్మసమాప్యచ॥ సంకల్పంపూర్వవత్కృత్వా కరిష్యే హామిదంవ్రతమ్। ఇతిసంకల్ప్యమనసా పూర్వవద్విధిపూర్వకమ్॥ గావో దేయాః ప్రయత్నేన పంచాశత్స్వర్ణరూపిణీః। సవత్సాబహుక్షీరిణ్యో విప్రేభ్యోజలపూర్వకమ్॥ అనేనకృతవాన్చాంద్రం శాస్త్రమార్గేణధేనుదః॥ మార్కండేయః॥ అశక్తో యదిచాన్ద్రస్య భక్షణే రాజవల్లభ। ప్రత్యామ్నాయం తదా కుర్యా త్సవత్సాగాః స్వలంకృతాః॥ పంచాశత్సంఖ్యయా పూతస్సర్వ పాపాన్నసంశయః॥ గౌతమః॥ చాంద్రాయణస్యవిప్రోసౌ ప్రత్యామ్నాయం సమాచరేత్। అర్చితాగన్ధపుష్పాద్యై ర్భూషితాస్స్వర్ణభూషణైః॥ పంచాశద్గాః ప్రయత్నేన విప్రేభ్యశ్చపృథక్పృథక్। ప్రత్యామ్నాయైర్హరిస్సాక్షాత్సంతుష్టస్స్యాన్నసంశయః॥ అశక్తౌచాంద్రవిషయే ప్రత్యామ్నాయం తదాచరేత్। ఏతేనశుద్ధిమాప్నోతి చాంద్రాయణఫలంలభేత్॥ మహాచాంద్ర ప్రత్యామ్నాయస్తుశతంగావో దేయాః॥ మహాచాంద్రాయణ ఫలమాప్నోతీత్యర్థః॥ ఇతిపంచవిధచాంద్రాయణప్రత్యామ్నాయాః॥

(౫౦౪) ఇఁకను పంచవిధ చాంద్రాయణవ్రతములను జెప్పుచున్నాఁడు॥ అయిదు విధములగు చాంద్రాయణములయొక్కయు ప్రత్యామ్నాయములు, విష్ణులోకము నొసంగునట్టి సామర్థ్యముగలయవి. తొల్లియింద్రుఁడుచాంద్రాయణముల నాచరించుటకుఁ దగిన సామర్థ్యములేనపుడు ప్రత్యామ్నాయమును జేయుఁడు. అదియెట్లనిన శుక్లప్రతిపత్తునందు స్నానమును జేసి నిత్యకర్మలను సమాప్తిని బొందించి పూర్వమునందువలె సంకల్పమును జేసి సువర్ణరూపములగు గోవులను నేబదింటిని దానముసేయవలయును. (అనఁగా సువర్ణాలంకృతగోవులననుట) ఆగోవులు దూడలుగలవియును, అధికముగక్షీరములనొసంగునట్టివియునునై యుండవలయును. ఇట్టి గోవులను దానమును జేసినవాఁడు ... చాంద్రాయణ వ్రతము నాచరించినవాఁడగునని దేవ

లుఁడువచించె. మార్కండేయుఁడును నివ్విధముగానే వచించె. గౌతముఁడునుని ట్లేచెప్పె. మహాచాంద్రప్రత్యామ్నాయముగ నూరుగోవులను దానముసేయవలయును.

## ✻ ప్రాజాపత్య కృచ్ఛ్రలక్షణమ్. ✻

(౫౦౫) అథ ప్రాజాపత్య కృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ త్రిదినం తు దివాశ్నీయాత్త్రిదినం రాత్రిభోజనమ్। అయాచితంస్యాత్త్రిదినం నిరాహారోదినత్రయమ్॥ కృచ్ఛ్రమేతద్విజానీయాద్గోదానం గవ్యభక్షణం। బ్రహ్మహత్యాదిపాపానామేతత్కృచ్ఛ్రంవిశోధనమ్॥ మార్కండేయః॥ ఏకభుక్తేన నక్తేనతథైవాయాచితేనచ। ఉపవాసేనచైకేన గోదానం గవ్యభక్షణమ్॥ ఏతత్త్రిరావృతం యేనకృచ్ఛ్రంస్యాత్పరిపూరితమ్। బ్రహ్మహత్యాదిపాపానామితరేషాం విశుద్ధిదమ్॥ గౌతమః॥ ప్రాజాపత్యఃకృచ్ఛ్రమిదంసర్వపాపప్రణాశనమ్। త్రిదినంస్యాద్దివాభుక్తిః త్రిదినం రాత్రిభోజనమ్॥ అయాచితంస్యాత్త్రిదినం త్రిదినంవాయుభక్షణమ్। గోదానంపంచగవ్యాంతే శుద్ధిమాప్నోత్యనుత్తమామ్॥ తదాహాపస్తంబః॥ త్ర్యహంనక్తాశ్యదివాశీతతస్త్ర్యహంత్ర్యహమయాచితవ్రతస్త్ర్యహం నాశ్నాతికించనేతికృచ్ఛ్రద్వాదశరాత్రస్యవిధిః॥ జాబాలిః॥ బ్రహ్మహత్యాదిపాపానామితరేషాం మునీశ్వరాః। తులాదిదానంయంత్రాణాం పాపానాంసాధనంనృణామ్॥ ప్రజాపతిరిదంసాక్షాత్సృష్టవాన్ దేవసన్నిధౌ। సర్వలోకోపకారాయ సర్వపాపనుత్తమే॥ దినత్రయందివాభుక్తిస్తథారాత్రౌదినత్రయమ్। అయాచితంస్యాత్త్రిదినం నిరాహారోదినత్రయమ్॥ పంచగవ్యంతతఃపశ్చాద్గోదానకావిశోధనీ। ఏవంకుర్యాద్ద్విజోయస్తు సర్వపాపవిముక్తవాన్॥ ఇతిప్రాజాపత్యకృచ్ఛ్రలక్షణమ్॥

(౫౦౫) ఇఁకను ప్రాజాపత్య కృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు॥ మూఁడుదినములు పగటియందు భోజనమును జేయవలయును. మూఁడుదినములు రాత్రులయందు భోజనమును జేయవలయును. మూఁడుదినముల యాచితాన్నమును భుజింపవలయును. మూఁడుదినములు నిరాహారుఁడై యుండవలయును. ఇట్లు వ్రతమును జరిపిన పిమ్మట గోదానమును జేసి పిమ్మటఁ బంచగవ్యప్రాశనను జేయవలయును. ఇట్టి ప్రాజాపత్యకృచ్ఛ్రమునాచరించుట చేత బ్రహ్మహత్యాది పాపములన్నియును నాశమునుబొందుననని దేవలుఁడు వచించె. ఒకనాఁడేకభుక్తము, మఱియొకనాఁడు రాత్రిభోజనము, మఱియొకనాఁడయాచితాన్నభోజనము, ఒకనాఁడుపవాసము, ఈ

క్రమముగఁ బదిరెండు దినములు వ్రతాచరణను జేసి గోదానమును జేసి పం
చగవ్య ప్రాశనను జేసినవానికి బ్రహ్మహత్యాది పాపములు నాశమునుబొం
దునని మార్కండేయుఁడువచించె. గౌతముఁడును, దేవలునివచనానుసార
ముగఁబలెను. ఆపస్తంబుఁడును నీవిధముగా సెవచించె. బ్రహ్మహత్యాద్యనే
కపాపముల శాంతికొఱకుఁ బ్రాజాపత్యకృఛ్రము నిర్మింపఁబడినదని జాబాలి
వచించె.

## ✻ ఏతదాచరణాశక్తానాం ప్రత్యామ్నాయః. ✻

(౫౦౮) ఏతదాచరణాశక్తానాం ప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥
ధేనుర్మహానదీస్నానం ద్వాదశబ్రాహ్మణార్చనమ్। సంహితామాత్రపార
శ్చ ద్విశతంప్రాణరోధనమ్॥ తిలహోమసహస్రంస్యాదయుతం జపఉచ్య
తే। ఏతేప్రాజాపత్యకృచ్ఛ్ర ప్రత్యామ్నాయాః॥ తదాహ లైంగేఈశ్వరః॥
ప్రాజాపత్యేతుగౌరేకా ద్వాదశబ్రాహ్మణార్చనమ్। సముద్రగనదీస్నానం
సంహితామాత్రముచ్యతే॥ ప్రాణాయామాశ్చద్విశతం అయుతం జపఉచ్య
తే। తిలహోమసహస్రంస్యాత్ప్రత్యామ్నాయస్తుసప్తధా॥ గారుడపురా
ణే॥ యత్ప్రోక్తంమునిభిఃకృచ్ఛ్రం ధర్మశాస్త్రేషుగౌరవాత్। సర్వత్రైతద్వి
జానీయాద్ద్వాదశాహోభిరీరితమ్॥ యత్రయత్రమునిభిఃకృచ్ఛ్రమిత్యుక్తంత
త్రతత్రప్రాజాపత్యమేవ॥ ద్వాదశరాత్రసాధ్యత్వం చాంద్రాయణైర్వినాస
ర్వకృచ్ఛ్రేషుయోజనీయమ్॥ తదేవాహ గౌతమః॥ కృచ్ఛ్రం ద్వాదశరాత్రం
స్యాన్మునిభిఃపరిభాషితమ్। సర్వత్రైతద్విజానీయాత్ప్రాజాపత్యంమనీషిభి
రితి॥ పరాశరః॥ అకామతఃకృతంపాపం వేదాభ్యాసేనశుద్ధ్యతి। కామతస్తు
కృతేపాపే ప్రాజాపత్యంసమాచరేత్॥ ప్రత్యామ్నాయాచరణప్రకారమా
హ॥ దేవలః॥ విప్రస్స్నాత్వాతుపూర్వాహ్ణే నద్యాంవాన్యత్రవాజలే। వ
స్త్రాదిచ్చంద్రకంధృత్వా నిత్యకర్మసమాపయేత్॥ ఔపాసనాదికంకృత్వా త
తోదేవార్చనాత్పరం। చతుర్భిర్బ్రాహ్మణైస్సాకం పుణ్యాహం వాచయేత్త
తః॥ దేశకాలౌచసంకీర్త్య స్వపాపమనుసంవదేత్। ఏతత్పాపవిశుద్ధ్యర్థం
కామాత్కృతమకామతః। ప్రాజాపత్యస్యకృచ్ఛ్రస్య సాక్షాత్కర్తుమశ
క్తవాన్॥ ప్రత్యామ్నాయమహంకుర్యాం భవంతఃతుంతుమర్హథ। ఇత్యుక్త్వా
గాంసవత్సాంచ సుశీలాంచపయస్వినీమ్॥ పూజయిత్వా విధానేన బ్రాహ్మ
ణంచయథార్థతః। హేగౌస్త్వంసర్వలోకానాం మాతేతిపరికీర్తితా॥ అ
స్త్వాంపూజయిష్యామి సర్వపాపానుత్తయే। ఇతి సర్వత్రకృచ్ఛ్రప్రత్యా

మ్నాయగోదానేషుపూజామంత్రః। వేదాధ్యాయిఇ సదాపూజ్యో దానే

ష్వేతేషు పావనః॥ తత్త్వామారాధయామ్యద్య పాపాదస్మా ద్విమోచయ। ఇతివిప్రపూజామంత్రః॥ ప్రత్యామ్నాయేషు హోమజపస్నానదక్షిణాదాన గోదానేషుచ। గవామంగేషుతిష్ఠంతిభువనానిచతుర్దశ । యస్మాదస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే॥ యజ్ఞసాధనభూతాయా విశ్వస్యాఘప్రణాశినీ। విశ్వరూపధరోదేవః ప్రీయతామనయాగవా॥ ఇతి సర్వత్రగోదానేషు మంత్రః॥ తత్రాపిదక్షిణాదేయా యథావిత్తానుసారతః। ఏవంకుర్యాన్నగోయస్తు ప్రత్యామ్నాయమనుత్తమమ్॥ సమ్పూర్ణఫలమాప్నోతి ప్రాజాపత్యస్యకృచ్ఛ్రతః । కృచ్ఛ్రస్యేత్యర్థః । ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయత్వేన గోంభావేతన్మూల్యమాహ॥ దేవలః॥ గవామభావే నిష్కం స్యాత్తదర్ధం పాదమేవవా। దరిద్రఃకురుతేపాదం ధనికః పూర్ణమాచరేత్॥ అన్యథాతత్ఫలంనాస్తి ప్రాజాపత్యంనసిద్ధ్యతి। నిష్కశబ్దోద్వివిధః॥ వరాహస్తదర్ధమేకః పక్షఃముఖ్యః। తదన్యఃపక్షఃకనీయాన్ ॥ తదప్యంగీకృతమస్మాభిః॥ తదాహమార్కండేయః॥ ప్రభూణాంపూర్వపక్షస్స్యాదుత్తమః పరికీర్తితః। మధ్యమాచరణంనాస్తిప్రభూణాంతత్ఫలంచవా॥ మధ్యమానాం వరాహస్స్యాదుత్తమఃపక్షఉచ్యతే। ఉత్తమంయఃపరిత్యజ్య మధ్యమంసముపాశ్రితః॥ నదానఫలమస్యాస్తి మధ్యమోమధ్యమంచరేత్ । కనీయసోవరాహార్ధముత్తమః పరికీర్తితః॥ ఏతస్యమధ్యమంనాస్తి నైతత్కృచ్ఛ్రఫలంలభేత్। అకించనానాంసర్వేషాం ధరణంగౌరుదాహృతా॥ అతోహీనంనకర్తవ్యం గోమూల్యేషుహిసర్వదా। ఏవంయఃకురుతేభక్త్యా హ్యుత్తమాధమమధ్యతః॥ తత్తత్ఫలమవాప్నోతి నాన్యథాఫలమస్తిహి। సర్వత్రసర్వేషాంగోదానప్రత్యామ్నాయ మూల్యేష్వేవమేవవేదితవ్య ముత్తమమధ్యమలఘుభావేన । ఉత్తమఃప్రభుర్నమధ్యమంకుర్యాత్ । కించిద్ధనాఢ్యో మధ్యమఃకనీయాంసంనకుర్యాత్। అకించనస్యకనీయాన్పక్షఉత్తమః। అతఃస్వశక్తిపురస్సరయాప్రత్యామ్నాయంకుర్యాత్॥ అన్యథానిష్ఫలత్వమాప్నోతీత్యర్థః॥ ఇతిప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయస్యగోదానస్యప్రత్యామ్నాయగోమూల్యమ్॥

(౫౦౬) ఇకను ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించుటకు శక్తిలేనివారికి, ప్రత్యామ్నాయ విధులను జెప్పుచున్నాఁడు॥ ధేనుదానము, మహానదీస్నానము, పదిరెండుమంది బ్రాహ్మణులనర్చించుట, సంహితామాత్రపాఠము, రెండునూరులప్రాణాయామములు, తిలహోమసహస్రము, పదివేల పర్యాయములుజపము, అనునవి ప్రాజాపత్య కృచ్ఛ్రప్రత్యామ్నాయములని దేవలుఁడువచించె. లింగపురాణమునందు నీశ్వరుఁడును నివ్విధముగానే నిరూపిం

చిచెప్పె. శాస్త్రములయందుఁ జెప్పఁబడిన కృఛ్రములన్నియును ద్వాదశదినాత్మకములని యెఱుంగ వలయును. చాంద్రాయణములయందు మాత్రమీ నియమములేదని గారుడపురాణమునందుఁ జెప్పఁబడియె. గౌతముఁడునునివ్విధముగానే వచించె. అపేక్షారహితముగఁ జేసినపాపము, అనఁగా, చేయవలయునను తలంపులేకఁ జేయనిపాపముచేత వేదాధ్యయనముచేత నశించును. బుద్ధిపూర్వకముగఁ జేసినపాపము ప్రాజాపత్యకృఛ్రము నాచరించుటచేత శాంతమగునని పరాశరుఁడువచించె. బ్రాహ్మణుఁడు పూర్వాహ్ణమునందు, మఱియు నితరములగు జలములయందైనను, స్నానమును జేయవలయును. అనంతరమందు వస్త్రపుండ్రాదికమును ధరించి నిత్యకర్మను సమాప్తిని బొందింపవలయును. పిమ్మట నౌపాసనాదికము నాచరించి దేవతార్చనను జేయవలయును. అనంతరమందు నలుగురు బ్రాహ్మణులతోఁగూడపుణ్యాహవాచనరూపకకర్మను జేసికొనవలయును. పిమ్మట దేశకాలసంకీర్తనమును జేసి తనయొపాపమునుచ్చరించి స్వపాపశాంతికొఱకు ప్రాజాపత్యకృఛ్రప్రత్యామ్నాయముల నాచరించెదనని సభికానుమతిని బొందవలయును. పిమ్మట సకలలక్షణసంపన్నమగు గోవునకును, బ్రాహ్మణునకును శాస్త్రోక్తప్రకారముగఁ బూజలను సలుపవలయును. అనంతరమందు విధ్యుక్తప్రకారముగ గోదానాదికను నాచరింపవలయును. గోవులేనిసమయమునందు దానికి దగిన మూల్యమును దానము సేయవలయునని దేవలుఁడువచించె. గోవులేనపుడు తన్మూల్యము నొకనిష్కము నిప్పింపవలయును. కాదేని యర్ధనిష్కము నైనను, పాదనిష్కము నైనను నిప్పింపవలయును. ధనికుఁడయ్యేనేని గోవునైనను, నిష్కము నైనను నివ్వవలయును. కాదేని ప్రాజాపత్యము సిద్ధినిబొంద నేరదని దేవలుఁడు వచించె. ప్రభువులగువారు సకలకార్యములయందును మొదటిపక్షమునే యాచరింపవలయును. మధ్యమాధమ పక్షముల నవలంబింపఁగూడదు. మధ్యముఁడు మధ్యమపక్షమును, అధముఁడు, అధమపక్షమును నవలంబింపవలయును. మఱియును గోదానాదులయందు శక్త్యనుసారముగ మూల్యమును గోదానాదులకు బదులుగ నివ్వవలయునని మార్కండేయమునివరుఁడు వచించె.

—(*) సముద్రగనదీస్నానరూప ప్రత్యామ్నాయః. (*)—

(౫౦౭) అథసముద్రగనదీస్నానరూప ప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ సముద్రగానద్యః॥ భాగీరథీచయమునానర్మదాచసరస్వతీ।గోదావరీకృష్ణవేణీతుఙ్గభద్రాపినాకినీ॥ మలాపహారిణీనదీమంజులాభవనాశినీ। అఖండాచైవ

కావేరీ తామ్రపర్ణీ మహానదీ॥ ధనుష్కోటిః ప్రయాగశ్చ గఙ్గాసాగరసంగమః॥ ఏతాః పుణ్యతమానద్యః దర్శనాత్పాపహారిణీః॥ స్పర్శనాన్మోక్షదాన్నౄణాం స్నానేముక్తిప్రదాస్మృతాః। వింశతియోజనగామహానదీసముద్రగాచ। ఏతాసుస్నానమాత్రేణ మనుజః పూతోభవతి। ప్రాజాపత్యకృచ్ఛ్రచరణేఅశక్తస్యతత్ప్రత్యామ్నాయగోదానాచరణేచాశక్తస్య నదీస్నానరూపమేవకలౌయుగసమీచీనమ్। అతోనదీస్నానమేవవయంబ్రూమః॥ గఙ్గాయాం మాసలం స్నానం ప్రాజాపత్యసమంవిదురితిభవిష్యోత్తరోక్తత్వాత్। గఙ్గాస్నానంవిశుద్ధిదమితి॥ పంచవిధాగంగా॥ స్కాందే॥ భాగీరథీగౌతమీచ కృష్ణవేణీపినాకినీ। అఖండాచైవకావేరీ పంచగంగాఃప్రకీర్తితాః॥ అన్యాస్సముద్రగానద్యోనౄణాంపాపాపహారిణీః। ఏతాసుమహానదీషు స్నాతౄణాం ఏతాఃప్రతియాతౄణాం పృథక్పృథక్ఫలమాహ॥ గౌతమః॥ స్వర్గామస్య చయాసింధుర్యాపద్యోజనమాత్రగా। తాముద్దిశ్యయదాగంతుం స్నానార్థం దర్శనాయవా॥ యావంతియోజనానీహ తావత్కృచ్ఛ్రఫలంలభేత్। పరార్థంయోనుగచ్ఛేత్తాం స్నానమాత్రఫలంలభేత్॥ భృతింగృహీత్వాయోగచ్ఛేన్నతస్యఫలమస్తిహి। విష్ణుపాదోద్భవాగంగాదశకృచ్ఛ్రఫలప్రదా॥ యమునాచతథానౄణాందశకృచ్ఛ్రఫలప్రదా। గౌతమీకృష్ణవేణీచ నవకృచ్ఛ్రఫలప్రదా॥ పినాకినీచకావేరీ హ్యష్టకృచ్ఛ్రఫలప్రదా। తుంగభద్రాభీమరథీ సప్తకృచ్ఛ్రఫలప్రదా॥ వంజులాభవనాశీచ ఋతుకృచ్ఛ్రఫలప్రదా। ఫల్గునీతామ్రపర్ణీచనవకృచ్ఛ్రఫలప్రదా॥ చాపాగ్రేస్నానమాత్రేణ హ్యబ్దకృచ్ఛ్రఫలప్రదం। శ్రీశైలసంగమేచైవ గంగాసాగరసంగమే॥ వింశత్కృచ్ఛ్రఫలంస్నానమతోనద్యశ్చపావనీః॥

(౫౦౭) ఇకను సముద్రగములగు నదులయందలి స్నానములకుఁ బ్రత్యామ్నాయములను జెప్పుచున్నాఁడు॥ భాగీరథి, యమున, నర్మద, సరస్వతి, గోదావరి, కృష్ణవేణి, తుంగభద్ర, పినాకిని, మలాపహారి, భీమరథి, వంజుళ, భవనాశిని, అఖండకావేరి, తామ్రపర్ణి, ధనుష్కోటి, ప్రయాగ, గంగాసాగరసంగమము, అనునవి పుణ్యనదులు. ఇవ్వి దర్శనమువలనఁ బాపమును నశింపఁజేయును. స్పర్శవలన మోక్షమునొసంగును. స్నానముచేత ముక్తినొసంగును. ఇరువదామడ పొడవుగలిగి సముద్రమును బొందిన నదులు మహానదులనఁబడును. ఇటువంటి నదులయందు స్నానమును జేయుటమాత్రముచేతనే పావనులగుదురు. ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించుటకును, తత్ప్రత్యామ్నాయముల నాచరించుటకును శక్తిలేనివాఁడు సముద్రగ నదీస్నానమునా

చరింపవలయును. గంగానదియందలి మాసలస్నానము ప్రాజాపత్యకృఛ్రసమమని దేవలుఁడు వచించె. భాగీరథి, గౌతమి, కృష్ణవేణి, పినాకిని, అఖండకావేరి, అను నైదును పంచనదులనఁబడును. వీనికంటె యితరములగునదులును, పాపనాశకము లనుటకు సందియము లేదు. ఇటువంటి మహానదులయందు స్నానమును జేసినవారలకు మహాఫలముగలుగునని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియె. తనదు గ్రామము మొదలుకొని మహానదీస్నానమును జేయఁదలఁచి యెన్నియోజనములు నడచిపోవునో యన్నికృఛ్రముల నాచరించినవాఁడగును. ఇతరులకొఱకుఁబోయినవానికి స్నానఫలము మాత్రము గలుగును. గంగానదిపదికృఛ్రములకుఁ దగినఫలమునిచ్చును. యమునయును పదికృఛ్రములఫలము నొసంగును. గౌతమియును, కృష్ణవేణియును, తొమ్మిదికృఛ్రములఫలమునిచ్చును. పినాకినియును, కావేరియును, ఎనిమిదికృఛ్రముల ఫలమునిచ్చును. తుంగభద్రయును, భీమరథియును, ఏడుకృఛ్రముల ఫలమునిచ్చును. వంజుళయును, భవనాశియును, ఆఱుకృఛ్రముల ఫలమునొసంగును. ఫల్గునియును, తామ్రపర్ణియును, తొమ్మిదికృఛ్రములఫలమునిచ్చును. ధనుష్కోటియందలిస్నానము, అబ్దకృఛ్రఫలమునిచ్చును. శ్రీశైలసంగమమునందును, గంగాసాగరసంగమమునందును, ఇరువదికృఛ్రఫలము నిచ్చునని గౌతముఁడు చెప్పె.

—ప్రాజాపత్యకృఛ్రప్రత్యామ్నాయనదీస్నానప్రకారమాహ.—

(౫౦౮) అథపూర్వవత్పుణ్యాహ వాచనసంకల్పాదికంకృత్వా ఋత్విజో(?)వృత్వానదీస్నానాభిముఖో భూత్వాయాయాత్॥ నదీంగత్వాకర్తాపూర్వంస్నాత్వాస్నాతాన్ గంధపుష్పాద్యైరభ్యర్చ్యమయాపరిషత్సన్నిధౌసంకల్పితస్య సర్వప్రాయశ్చిత్తస్య సమగ్రఫలావాప్త్యర్థం పరిషన్నిర్ణీతప్రాజాపత్యకృఛ్రప్రత్యామ్నాయ స్నానరూపమబ్దంద్వ్యబ్దం త్ర్యబ్దంచతురబ్దం పంచాబ్దం షడబ్దంషడ్గుణితషడబ్దం త్రేధావర్తితం యెనయెనప్రకారేణయేనయేనసంకల్పితం తత్తత్ప్రాజాపత్యకృఛ్రప్రత్యామ్నాయ భూతమబ్దాదిసంఖ్యాకంఅహంవాబ్రాహ్మణైర్వా మహానదీస్నానరూపమాచరిష్యే ఇతి సంకల్ప్యబ్రాహ్మణాన్ప్రేషయేత్। ఋత్విజస్తు। యజమానగోత్రనక్షత్ర రాశిశాఖానామధేయానివక్ష్యన్త్యేవసముచ్చార్య ఏతేనయజమానే నాముకగోత్రేణాముకనక్షత్రే అముకరాశౌజాతేనాముకశాఖాధ్యాయినాముకనామధేయేన భగవత్సన్నిధౌ సంకల్పితస్యసర్వప్రాయశ్చిత్తస్యపరిషన్నిర్ణీతస్య ప్రాజాపత్యకృఛ్రప్రత్యామ్నాయ పరికల్పితాని మహానదీస్నానాని మాసలవదాచరిష్యా

మ ఇతి ఋత్విక్సంకల్పః। మహానద్యాంనదీముఖస్సన్ మంత్రవర్జం మాసలమజ్జ నవత్స్నానంకృత్వా తటమాగత్య పునర్ద్విరాచమ్య ధౌతవస్త్రం పరిధా యతదభావే ద్వాదశసంఖ్యయావస్త్రావధూననం కృత్వాచ్ఛాద్య ద్విరాచ మ్యపూర్వవత్ స్నాయాత్। ఏవంసంకల్పితాబ్దాదిసంఖ్యాభవతి। యజమానః స్నానకర్తృభ్యఋత్విగ్భ్యోనిష్కంవాతదర్ధంవా పాదంవాస్నానఫలస్వీకర ణార్థందద్యాత్। నిష్కశబ్దోదేవమానేన వరాహద్వయమ్ । ఋషిమానేన తదర్ధమ్ । మానుషమానేనతదేవగ్రాహ్యమ్। ప్రభూణా ముక్తప్రకారమే వ॥ సమర్థస్యనమధ్యమం। అకించనస్యతదర్ధమ్। సువర్ణప్రమాణంయథోక్తం తత్రైవనాన్యత్॥ గౌతమః॥ గంగాయాంమాసలస్నానం ప్రాజాపత్య సమం విదుః। ఏతత్పంచగంగాస్నానవిషయమ్॥ ఇతరాసుసముద్రగాసు నదీషుప్రతి స్నానంసంకల్పః॥ కుల్యాయాంతటాకపుష్కరిణ్యాదిషు పృథక్సంకల్పఃఖండా నువాకపఠనమ్॥ సూర్యాభిముఖస్సన్ సమ్మార్జనంకృత్వా తటాకంగత్వా ధౌతవస్త్రాదికంధృత్వా అష్టోత్తరశతం గాయత్రీంజపేత్। ఏతత్ ప్రాజాప త్యకృచ్ఛ్రాత్మకంభవతి। స్నానమేకమేవకృచ్ఛ్ర ఫలదం తేభ్యశ్చ దక్షిణాదే యా॥ ఏవమబ్దాదిసంఖ్యయాకృత్వాపూతోభవతి॥ ఇతిప్రాజాపత్య ప్రత్యా మ్నాయనదీస్నానమ్॥

(౫౦౮) ఇకను ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయ నదీస్నాన ప్రకా రమును జెప్పుచున్నాడు॥ పూర్వోక్తప్రకారముగ బుణ్యాహవాచన సంక ల్పాదికమును జేసి ఋత్విజులతోగూడ నదీస్నానాభిముఖుడై పోవలయును. నదియొద్దకుబోయి కర్తయగువాడు స్నానమునుజేసి స్నాతులగు ఋత్విజు లను గంధపుష్పాక్షతాదులచేత బూజించి తొలుత సభాసమ్ముఖమునందు సంకల్పితమైన సర్వప్రాయశ్చిత్తము యొక్క సమగ్రఫలావాప్తి కొఱకు ప రిషన్నిర్ణీతమైన నదీస్నానరూప ప్రాయశ్చిత్తము నాచరించెదనని వచింపవ లయును. పిమ్మటి విషయమంతయును ప్రయోగరూపము గనుక వివరింపనైై తిని. గంగయందలి మాసలస్నానము ప్రాజాపత్య తుల్యమనియును, ఇయ్యా దిపంచగంగాస్నానవిషయమనియును గౌతముడు వచించె. ఇతరములగు స ముద్రగనదులయందు స్నానమును జేయునపుడు పూర్వోక్తప్రకారముగ సం కల్పమును జేయవలయును. కుల్యయందును, తటాకపుష్కరిణ్యాదులయందు ను, సంకల్పమును వేఱుగా జేయవలయును. అదియెట్లనిన సూర్యాభిముఖు డగుచుబోయి సమ్మార్జనమును జేసి తటాకమునకుబోయి ధౌతవస్త్రాదికము ధరించి నూటయెనిమిది పర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవల

యును. ఇది ప్రాజాపత్యకృచ్ఛ్రాత్మకమగుచున్నది. స్నానమొకటియే కృచ్ఛ్రఫలమునిచ్చునట్టిదియగును. అయినను ఋత్విజులకు దక్షిణనివ్వకపోయినయెడల పరిశుద్ధుఁడుగానేరఁడు. ఈప్రకారం వబ్దాదిసంఖ్యచేత నాచరించినవాడు పవిత్రుఁడగుననియును గౌతముఁడే వచించె.

## —— ప్రాజాపత్యప్రత్యామ్నాయ బ్రాహ్మణార్చనమ్. ——

(౫౦౯) అథ ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయత్వేన పరికల్పిత ద్వాదశబ్రాహ్మణభోజనవిధిమాహ॥ దేవలః॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయమిమం శృణు। యం కృత్వా ముచ్యతే పాపైర్మహద్భిరపి నారద ॥ పూర్వవత్సంకల్పాదికం కృత్వా ద్వాదశబ్రాహ్మణాన్నిమంత్రయేత్॥ పరాశరః॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయం ద్విజార్చనమ్ । కృత్వా సిద్ధిమవాప్నోతి ప్రాజాపత్యఫలం లభేత్॥ విప్రాన్ శాంతాన్ సపత్నీకాన్ వేదశీలపరిష్కృతాన్। సదాచారాన్ శుచీన్నిత్యం కృచ్ఛ్రార్థం తాన్నియోజయేత్॥ తథాహాపస్తంబః॥ శుచీన్మంత్రవతః ప్రాజ్ఞాన్ సర్వకృత్యేషు భోజయేత్ । దేశతః కాలతశ్చైవ తస్య వ్యక్త్వా పరిగ్రహీతృత ఇతి ॥ ఏవం విప్రాన్నిమంత్ర్యాథ భోజయేద్బహుభిస్తతః । తేభ్యశ్చ దక్షిణా దేయా యథావిత్తానుసారతః॥ ఏవం యః కురుతే సమ్యక్ ప్రాజాపత్యఫలం లభేత్॥ ఇతి ప్రాజాపత్యప్రత్యామ్నాయ ద్వాదశబ్రాహ్మణార్చనమ్॥

(౫౦౯) ఇకను, ప్రాజాపత్యప్రత్యామ్నాయబ్రాహ్మణార్చనను గురించి చెప్పుచున్నాడు॥ ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయముల నాచరించినవాడు పుణ్యలోకమును బొందుననని దేవలుడువచించె. ప్రాజాపత్యకృచ్ఛ్రమునకు ప్రత్యామ్నాయముగ ద్విజార్చనను జేయవలయును. అట్టి ప్రత్యామ్నాయమును జేసినవాడు ప్రాజాపత్యఫలమును బొందును. శాంతులును, సపత్నీకులును, వేదశీలపరిష్కృతులును, సదాచారసంపన్నులును, పరిశుద్ధులును, అగు బ్రాహ్మణులను బూజార్థముగ గ్రహింపవలయునని పరాశరుడువచించె. ఆపస్తంబుడును నిప్పథముగానే వచించె. ఈప్రకారము బ్రాహ్మణులనునిమంత్రించి వారలకు మిగుల దృప్తికరమగు నన్నదానమును జేయవలయును. మఱియును తనదు శక్త్యనుసారముగ దక్షిణనుగూడ నివ్వవలయును. ఇట్లు జేసినవాడు ప్రాజాపత్యఫలమును బొందును.

## —— తత్ప్రత్యామ్నాయపారాయణప్రకారః. ——

(౫౧౦) అథతత్ప్రత్యామ్నాయ పారాయణప్రకారమాహ॥ దేవలః॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య వేదపారాయణం యథాత్ । ప్రత్యామ్నా

యం ప్రశంసంతి శాఖామాత్రం సహారణమ్। పారాయణేన భగవాన్ కృతకృత్యో భవేత్తదా। ఫలం సంపూర్ణకృచ్ఛ్రస్య ప్రదదాతి న సంశయః॥ ప్రాతఃకాలే శుచిర్భూత్వా నిత్యకర్మ సమాప్య చ। స్వగృహే దేవతాగారే నద్యాం వా ప్రావతాలయే॥ ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాపి సఙ్కల్పం పూర్వవచ్చరేత్। పారాయణాదౌ ప్రణవం కృత్వా పారాయణం చరేత్॥ దిశస్త్వనవలోక్యైవ వ్యాసమ్భాష్యైవ పాపినః। మౌనవ్రతం సమాగమ్య పఠేద్వేదం శనైశ్శనైః॥ శీఘ్రీ పాఠీ శిరఃకమ్పీ తథా లిఖితపాఠకః। గద్గదః సర్వహీనశ్చ పంచైతే పాఠకాధమాః॥ తతశ్శనైశ్శనైర్విద్యామభ్యసేదాత్మశుద్ధయే। యావత్సమాప్తిర్భవతి తావత్కృచ్ఛ్రఫలం లభేత్॥ స్వయమేవ పఠేద్వేదముత్తమం పరికీర్తితమ్। ప్రత్యామ్నాయో ఽధ్యమస్స్యాద్భృతకేనిష్ఫలం భవేత్॥ ఇతి సంహితా ప్రత్యామ్నాయః॥

(౫౧౦) ఇకను ప్రత్యామ్నాయ పారాయణ ప్రకారమును జెప్పుచున్నాడు॥ ప్రాజాపత్యకృచ్ఛ్రమునకు బ్రత్యామ్నాయముగ స్వశాఖోక్త వేదమును పారాయణను జేయవలయును. వేదమును పారాయణను జేయుటచేత కృతకృత్యుడగును. ఇది సంపూర్ణమగు కృచ్ఛ్రఫలమునిచ్చును. కావున ప్రాతఃకాలమునందు పరిశుద్ధుడై నిత్యకర్మను సమాప్తిని బొందించి స్వగృహమునందైనను, దేవాలయమునందైనను, నదియందైనను, ప్రాఙ్ముఖముగా నైనను, ఉదఙ్ముఖముగా నైనను గూర్చుండి పూర్వోక్తప్రకారముగ సంకల్పమును జేయవలయును. పారాయణాదికమునందు బ్రణవమునుచ్చరించి పారాయణను జేయవలయును. దిక్కులను జూచుచుండకయును, పాపులతో సంభాషింపకయును, మౌనవ్రతమునవలంబించి మెల్ల మెల్లగ వేదపారాయణను జేయవలయును. శీఘ్రముగ పాఠమును జేయువాడును, శిరస్సును కంపించుచు పఠించువాడును, గద్గదస్వరముతో పఠించువాడును, స్వరహీనముగ పఠించువాడును, పాఠకాధములనబడుదురు. అందువలన నాత్మశుద్ధి కొఱకు మెల్లమెల్లగ విద్యాభ్యాసమును జేయవలయును. వేదపారాయణము సమాప్తమగు వఱకును కృచ్ఛ్రఫలము లభ్యమగును. స్వయముగా వేదమును పఠించుటవలన నుత్తమఫలము గలుగును. కృచ్ఛ్రప్రత్యామ్నాయము కొఱకు పఠించుటచేత మధ్యమఫలము గలుగును. భృతకాధ్యయనము నిష్ఫలమగునని దేవలుడు వచించె.

—— అయుతగాయత్రీజపరూపప్రత్యామ్నాయః. ——

(౫౧౧) అథాయుతగాయత్రీజపరూపప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయో జపో మహాన్। అయుతం వేదమాతుశ్చ సర్వపాపైః ప్రముచ్యతే॥ ప్రాతస్స్నాత్వా యథాచారం దంతధావ

నపూర్వకమ్। అగ్నిహోత్రాలయే దేవగృహేవాపి నదీతటే॥ గోష్ఠే బృన్దావనే దేశే జపేదయుతసంఖ్యయా । పర్వభిర్జపమాలాభిః కుశగ్రన్థిభిరేవవా ॥ స్వయం మౌనముపాస్థాయ దిశశ్చానవలోకయేత్ । జపేన్మహాపాపజాలదహనార్థం దినేదినే॥ అవ్యగ్రచిత్తః ప్రజపేదన్యథా దోషమశ్నుతే॥ మార్కండేయః॥ సందిగ్ధస్తు హతో మన్త్రో వ్యగ్రచిత్తో హతో జపః। అబ్రహ్మ...ంహతం శ్రాద్ధమనాచారం కులం హతమ్॥ తతో మనసి జప్తవ్యం మానసం కోటిరుచ్యతే। అయుతమన్త్రే జపే పూర్ణే ప్రాజాపత్యఫలం లభేత్॥ అంగుల్యగ్రేణ యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనే। ద్విధాచిత్తేన యజ్జప్తం తత్సర్వం నిష్ఫలం భవేత్॥ పరాశరః॥ హస్తస్యానామికామధ్యపర్వాదారభ్య యత్నతః॥ తద్ద్వితీయాంకనిష్ఠాయాః పర్వత్రయమనుక్రమాత్। అనామికోర్ధ్వపర్వాథ మధ్యమాయాశ్చ తర్జనీ॥ పర్వత్రయం తథా కృత్వా తదేవాక్రమ్య పూర్వవత్ । మేరురంగుష్ఠ ఏవ స్యాత్తస్యనాతిక్రమం చరేత్॥ పర్వభిర్గణయేద్యస్తు గాయత్రీం వాన్యదేవవా। ఏకైకస్య శతం ప్రోక్తం గణనం మునిభిః పరైః॥ అయుతేన జపేనాశు ప్రాజాపత్యఫలం లభేత్ । జపతో నాస్తి పాతకమితి స్మరణాచ్చ॥ ఇతి ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయాయుతగాయత్రీజపవిధిః॥

(౩౧౧) ఇకను, అయుతగాయత్రీజపరూపప్రత్యామ్నాయవిధానమును జెప్పుచున్నాడు॥ ప్రాజాపత్యకృచ్ఛ్రమునకు బదులుగ, పదివేలపర్యాయములు గాయత్రీమంత్రమును పఠించుటచేత సకలపాపములును నశించును. జపవిధానమెట్లనగా ప్రాతఃకాలమునందు విధ్యుక్తప్రకారముగ స్నానమును జేసి యగ్నిహోత్రాలయమునందైనను, దేవగృహమునందైనను, నదీతటమునందైనను, గోష్ఠమునందైనను, బృందావనమునందైనను నయుతసంఖ్యచే తజపింపవలయును. పర్వములచేతనైనను, జపమాలచేతనైనను, కుశగ్రంథులచేతనైనను, జపమును జేయుచు మౌనమునవలంబించి దిక్కులను జూడక జపింపవలయును. మహాపాపోపశమనముకొఱకు దినదినమందును జపమును జేయవలయును. మఱి యనవ్యగ్రచిత్తుడై జపమును జేయవలయునని జెప్పలుడు వచించెను. సందిగ్ధుడయ్యేనేని మంత్రము హతమగును. వ్యగ్రచిత్తుడయ్యేని జపము హతమగును. కావున మనస్సునందు జపింపవలయును. అయుతమంత్రజపము పూర్ణమయ్యేనేని ప్రాజాపత్యఫలమును బొందును. పర్వములయందు శాస్త్రోక్తవిధినివదలి జపించెనేని నిష్ఫలమగునని మార్కండేయుడు వచించెను. పర్వసంఖ్యచేత శాస్త్రోక్తప్రకారముగ జపమును జేయుటచేత ప్రాజాపత్యకృచ్ఛ్రఫలమును బొందును. జపముచేత పాతకము నశించునని పరాశ

రుడువచించె.

— తిలహోమసహస్రరూపప్రత్యామ్నాయః —

(౫౧౨) అథ తిలహోమసహస్రరూప ప్రత్యామ్నాయమాహ దేవలః ॥ ప్రాజాపత్యస్యకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయవిధిస్త్వయం । హోమస్తిలైస్సహస్రం చ ఘృతాక్తైః పాపనాశకృత్ ॥ మృత్యుంజయేతి మంత్రేణ న్యాసధ్యానపురస్సరం । మన్త్రాంతేనహుతేన్యహ్నా వాహుతిర్బీజపూరకైః॥ సహస్రహోమం కృత్వాపి పూతో భవతితత్క్షణాత్। స్వయంవాఋత్విగ్ద్వారా వా తిలహోమసహస్రకమ్ ॥ కుర్యాన్మౌనేనమేధావీ ప్రాజాపత్యఫలంలభేత్ । అప్రమాత్రతిలైర్హోమస్సర్వపాపవినాశకృత్ ॥ ప్రాజాపత్యస్యకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయోమహత్తరః ॥ ఇతిప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయసహస్రతిలహోమః ॥

(౫౧౨) ఇకనుతిలహోమసహస్రరూపప్రత్యామ్నాయ విధానమును జెప్పుచున్నాడు ॥ ఘృతాక్తములగు తిలలచేత వేయిపర్యాయములు హోమమును జేయుటవలన ప్రాజాపత్యకృచ్ఛ్రఫలములను బొందును, మృత్యుంజయ మంత్రముచేత న్యాసధ్యాన పురస్సరముగ జపింపవలయును, మంత్రాంతముచేత హోమమును జేయవలయును, ఈతిలహోమమును స్వయముగానయినను యేకఋత్విక్సహాయముగానైనను, జేయవలయును, మౌనవ్రతమునవలంబించి చేయువాడు ప్రాజాపత్యఫలమునుబొందును, మఱియును దిలహోమము సకలపాపములను నశింపజేయునని దేవలుడువచించె॥

— ప్రాజాపత్య కృచ్ఛ్రప్రత్యామ్నాయశతద్వయ ప్రాణాయామవిధిః —

(౫౧౩) అథ ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయశతద్వయ ప్రాణాయామానాహ ॥ దేవలః ॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయో మహత్తరః । ధర్మశాస్త్రోక్తమార్గేణ ప్రాణాయామశతద్వయమ్॥ మహాపాతకయుక్తైర్వాయుక్తైర్వాసర్వపాతకైః । సద్యఃపునాతివిప్రేంద్రప్రాణాయామశతద్వయమ్ ॥ జపసంకల్పహోమేషు సంధ్యావందనకర్మసు । ప్రాణాయామాంశ్చ కుర్వీతస్తదానంత్యాయకల్పతే ॥ మార్కండేయః ॥ వామేనపూరయేద్వాయుం పూరణాత్పూరకస్స్మృతః । సమ్పూర్ణకుంభవత్తిష్ఠేత్కుంభనాత్కుంభకస్స్మృతః॥ సవ్యేనరేచయేద్వాయుం రేచనాద్రేచకస్స్మృతః । వాయుమాపూరయేద్రంధ్రాద్గాయత్రీంమనసాస్మరేత్ ॥ పూరణే కుంభనేచైవ రేచనే తాంజపేత్త్రిధా । ఎవం త్రివారంజపస్స్యాత్ప్రత్యేకం తుభవేదియమ్ ॥ పరాశరః ॥ వామేనవాయుమాపూర్య గాయత్రీం మనసా స్మ

రన్ । సమ్పూర్ణే కుంభవత్తిష్ఠే త్పునస్తామనువర్తయన్ ॥ రేచయన్నన్యరంధ్రేణ పునస్తామేవ సంస్మరన్ । ఏవం పూరణకుమ్భాభ్యాం రేచకేన సహామునా॥ యోఽపతర్పయేత్త్రిధా బ్రహ్మన్ ప్రాణాయామ ఇతీరితః । శ్రాద్ధే దానే చ హోమే చ సంధ్యాకర్మసు సర్వదా ॥ యోఽవర్తయేత్ప్రతిదినం పరబ్రహ్మ స ఉచ్యతే ఏవం శతద్వయం కృత్వా పూర్వోక్తవిధినా ద్విజః ॥ ప్రాజాపత్యస్య కృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయో నిగద్యతే । సర్వపాపవినిర్ముక్తస్స యాతి పరమం గతిమ్॥ ఇతి శతద్వయప్రాణాయామవిధిః ॥

(౫౧౩) ఇకమీద ప్రాజాపత్యకృచ్ఛ్ర ప్రత్యామ్నాయశతద్వయ ప్రాణాయామవిధానమును జెప్పుచున్నాడు ॥ ప్రాజాపత్యకృచ్ఛ్రమునకు బదులుగ రెండునూర్ల పర్యాయములు ప్రాణాయామములను జేయవలయుననియును, ఇట్టి ప్రత్యామ్నాయము సకలవిధులను నశింపజేయుననియును, జపసంకల్పహోమములయందును, సంధ్యావందనకర్మలయందును, ప్రాణాయామముల నాచరింపవలయునని యును, దేవలుడు వచించెను. వామనాసికచేత వాయువును పూరింపవలయును, అట్లు పూరించి పిమ్మట కుంభింపవలయును, అనంతరమందు సవ్యనాసికచేత రేచనము సేయవలయును, ఇట్టి పూరక కుంభక రేచకములయందు క్రమముగ మూడు పర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయునని మార్కండేయుడు వచించెను. పరాశరుడును నిట్లే ధనముగా నే చెప్పి యీ ప్రాణాయామమును సంధ్యావందనాది కర్మలయందు జేయవలయుననియె. ఇట్లు ప్రాణాయామము చేయుటచేత సకలపాపములును నశించుననియె॥

## ——— ❋ తప్తకృచ్ఛ్రలక్షణమ్ ❋ ———

(౫౧౪) అథ తప్తకృచ్ఛ్రలక్షణమాహ ॥ దేవలః ॥ వార్యుష్ణం త్రిదినం విప్రః పయ ఉష్ణం దినత్రయం । త్రిదినం ఘృతముష్ణంచ పీత్వా శుద్ధిమవాప్నుయాత్ ॥ మార్కండేయః ॥ విషముష్ణం పయస్తప్తం ఘృతముష్ణం దినత్రయమ్। విషం జలం । పీత్వా శుద్ధిమవాప్నోతి బ్రహ్మహాపి ద్విజర్షభః ॥ గౌతమః ॥ ఉష్ణం పయః పయస్తప్తముష్ణం ఘృతమనంతరం । చతుర్ణామపి పాపానాం పావనం మునిభిస్స్మృతమ్ ॥ ఆపస్తమ్బః ॥ త్ర్యహముష్ణం పిబేద్వారి త్ర్యహముష్ణం పిబేత్పయః । పలమేకం పిబేత్సర్పి రేతత్తప్తం విధీయతే ॥ పలసంఖ్యామాహ॥ జాబాలిః ॥ షట్పలంచ పిబేద్వారి త్రిపలంచ పిబేత్పయః । దినత్రయం పిబేత్సర్పి రేతత్తప్తం విధీయతే ॥ గ్రంథాంతరే ॥ త్ర్యహముష్ణం పిబేద్వారి త్ర్యహముష్ణం పిబేత్పయః । త్ర్యహముష్ణం పిబేత్సర్పిర్వాయుభక్షో దినత్రయమ్॥ యవాయుభక్షః ఇత్యుక్తనయు స్తంభావా ద్వాదశదివసపరిపూర్ణత్వం కర్తవ్యమ్ ॥ య

త్రయత్రకృచ్ఛ్రమితి మునిభిరుపదిష్టం తత్రతత్రద్వాదశదినం కదితవ్యం ॥ తదా
హబృహస్పతిః ॥ మునిభిఃకృచ్ఛ్రమిత్యుక్తం శాస్త్రేషుద్విజవల్లభ. । తత్కృ
చ్ఛ్రం ద్వాదశాహేనాభిసాధ్యం దేహవిశుద్ధిదం ॥ యత్రయత్రాబ్దమిత్యుక్తం
కృచ్ఛ్రేషుతత్త్రింశదిసంఖ్యాసాధ్యమ్ ॥ తదేవాహామరీచిః ॥ ప్రాజాపత్యే
షుకృచ్ఛ్రేషు అబ్దమిత్యుచ్యతే బుధైః । త్రింశత్సంఖ్యాంవిజానీయాత్ప్రాజా
పత్యస్యలక్షణమ్ ॥ ప్రాజాపత్యస్యకృచ్ఛ్రస్యైవనాన్యస్య । అబ్దసంవత్సరేకృ
చ్ఛ్రగణనాయాం మహాశాపథఇతి ॥ రజస్వలాసంస్పర్శాదిషు తప్తకృచ్ఛ్రమే
వ విశుద్ధిదం సర్వేషాం పాపానామితి ॥ విష్ణుః ॥ సర్వేషామేవపాపానాం
తప్తకృచ్ఛ్రంవిశుద్ధిదం । అతఃపరమమిత్యుక్తం మునిభిస్తత్వదర్శిభిః ॥ ఇతిత
ప్తకృచ్ఛ్రం ॥

(౫౧౪) ఇకనుతప్తకృఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ మూడుదిన
ములుష్ణోదకమును, మూడుదినములుష్ణక్షీరమును, మూడుదినములుష్ణ ఘృత
మును పానముసేయుటచేత పావనుడగునని దేవలుడువచించె. మార్కండే
యుడును నిటులనేచెప్పి యిట్టిప్రాయశ్చిత్తముచేత బ్రహ్మఘ్నుడుగూడ పా
వనుడగుననియె. గౌతముడును నీవిధముగానేవచించె. ఆరుపలములుదకము
ను, మూడుపలములనేతిని. మూడుపలములపాలను పానముసేయవలయున
నియాపస్తంబుడువచించె. జాబాలియును నిటులనేచెప్పె. గ్రంథాంతరమం
దును దేవలవచనమునందువలెనేచెప్పంబడియె. మఱియు బదిరెండుదినము లు
నుబూర్తియగుటకు మూడుదినములు వాయుభక్షణను జేయవలయుననియు
నుజెప్పబడెను. కృఛ్రములన్నియును ద్వాదశదినాత్మకములని యెఱుంగవల
యును, ప్రాజాపత్యకృఛ్రములయందబ్దమని యాజ్ఞ్యవల్క్యరి. ప్రాజాప
త్యమునకు త్రింశత్సంఖ్యను లక్షణమునుగాం దెలియవలయును, రజస్వలాసం
స్పర్శాదులయందు తప్తకృఛ్రముచేతనే పరిశుద్ధతగలుగునని మనువువచించె
సకలపాపములకును తప్తకృఛ్రము తగియున్నదని విష్ణువువచించె ॥

—— ✱ తప్తకృచ్ఛ్రప్రత్యామ్నాయః ✱ ——

(౫౧౫) అథ తప్తకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ అథాత
స్తప్తకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయోమనీషిభిః । అశక్తానాంచకృపయాకర్తుము
క్తఃపురానఘ ॥ తమేవాహంబ్రవీమ్యద్య శృణుధ్వంద్విజసత్తమాః । కలౌయు
గేవిశేషేణహ్యన్నత్యాగాల్లయంగతాః॥ పరాశరః॥ కృతేచర్మాశ్రితాఃప్రా
ణాస్త్రేతాయాంకీకసాశ్రితాః ॥ ద్వాపరేరక్తమాశ్రిత్యకలావన్నాశ్రితాస్థి
తాః ॥ ఇతి ॥ కలౌయుగే ద్వాదశరాత్రసాధ్యమానసాధ్య కృచ్ఛ్రాణ్యాచ

రితునశక్తాః జనాన్నిరీక్ష్యబుునయః ప్రత్యామ్నాయాను క్తవంతః ॥ తమె వాహ తత్రైవగౌతమః॥ అహత ప్తకృచ్ఛ్రేబ్రహ్మహత్యానివారిణః। తు లాప్రతిగ్రహీతౄణాంశోధకస్యమహామునే ప్రత్యామ్నాయ స్తదాప్రోక్తా యదా దేవసమాగమః। స్వయంభూఃకృపయాస్మాణాం గవాంవింశతిమాద శాత్॥సవత్సాంబహుదుగ్ధాంచ సుశీలాంచ ద్విజాతయే। ద్విజాతిభ్యఇత్యర్థః॥ జాతావేకవచనం॥ మరీచిః॥ పాపనాశస్యకృచ్ఛ్రస్య త ప్తస్య ప్రత్యామ్నాయః దద్యాద్ద్విజాతయేసమ్యగ్గవాంవింశతిమాదరాత్ ॥ పరాశరః॥ మహా ప్తకృచ్ఛ్రస్యవిప్రాయాధ్యాత్మవేదినే। సాలంకారాంసవత్సాంచధేనూనాంవిం శతింవదత్ ॥ శుద్ధిమాప్నోతిరాజేంద్రత ప్తకృచ్ఛ్రఫలంలభేత్ । అత్రద్విజాతి భిఃకార్యస్త ప్తకృచ్ఛ్రైస్త ప్తరూపిణః॥ ప్రత్యామ్నాయఇతిశేషః ॥ పంచగవ్యం పి బెత్పశ్చాత్ప్రత్యామ్నాయఇతీరితః। తులాదిప్రతిగ్రహీతౄణా మిదమేవపరా గః స్తత్తత్ప్రాయశ్చిత్తాకరణవిషయే॥ ఇతిత ప్తకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౧౫) ఇక నుత ప్తకృఛ్రప్రత్యామ్నాయములను జెప్పుచున్నాడు॥ క లియుగమునందున్న త్యాగమును జేయుటచేత బ్రాహ్మణులుపోవును గనుకత ప్తకృచ్ఛ్రప్రత్యామ్నాయము చెప్పబడెనని దేవలుడువచించె- కృతయుగమునం దు, ప్రాణములుచర్మాశ్రితములైయుండును, త్రేతాయుగమునందు నెమ్ముల నాశ్రయించియుండును, ద్వాపరయుగమునందు రక్తమునాశ్రయించి యుం డును, కలియుగమునందన్నమునాశ్రయించియుండునని పరాశరుడువచించె. కలియుగమునందు ద్వాదశరాత్రసాధ్యములును, మాససాధ్యములునునగుకృ చ్ఛ్రములనాచరింపశక్యము గానివారలనుజూచి ఋషులు ప్రత్యామ్నాయముల నునిర్ణయించిరి. బ్రహ్మహత్యను, తులాప్రతిగ్రహాది జన్యమగుదోషమును, నివ ర్తింపజేయునట్టితప్తకృచ్ఛ్రమునకు బ్రత్యామ్నాయమునాచరింపవలయును, అ ది యెట్లనినతప్తకృచ్ఛ్రమునకు బహులుగ దూడలతోడను, క్షీరముతోడను గూడి నగోవుల నిరువదింటిని దానము సేయవలయునని గౌతముడు చెప్పె. ఇట్టిప్ర త్యామ్నాయముల నాచరించినపిమ్మట బంచగవ్యప్రాశనను జేయవలయును॥

—— * పరాకకృచ్ఛ్రలక్షణం * ——

(౫౧౬) అథపరాకకృచ్ఛ్రలక్షణమాహ ॥ అథవక్ష్యామి కృచ్ఛ్రస్య ప రాకస్య మహాత్మనః। సర్వదోషనివృత్తస్య సర్వశాస్త్రానువర్తినః॥ పరాక కృచ్ఛ్రఇత్యుక్తోవిష్ణునా ప్రభవిష్ణునా। యస్యాచరణమాత్రేణసర్వపాపైః ప్రముచ్యతే॥ బ్రహ్మహత్యాసురాపానం స్తేయం గుర్వంగనాగమః। సంక రీకరణంచైవ మలినీకరణంతథా॥ అపాత్రీకరణంచైవ జాతిభ్రంశకరంతథా।

ఉపపాతకమిత్యేతన్నవధా పరికీర్తితం॥ తులాహిరణ్యగర్భశ్చ బ్రహ్మాండో యంఘటస్తథా। తథాకల్పతరుశ్చైవ గోసహస్రమనంతరం॥ హిరణ్యకామధేనుశ్చ హిరణ్యాశ్వస్తథైవచ। హిరణ్యాశ్వరథశ్చైవ హేమహస్తిరథస్తథా॥ పంచలాంగలకంచైవ ధరాదానమతఃపరం। విశ్వచక్రంకల్పలతా సప్తసాగరమేవచ॥ చర్మధేనుశ్చ మహతీ మహాభూతఘటస్తథా। కాలపురుషఃకాలచక్రం రాశిచక్రమనంతరం॥ కోటిలక్షతిలైర్హోమోద్వేముఖీ సురభిస్తథా। ఆర్ద్రకృష్ణాజినంచైవ శకటంసర్వసంగమే॥ భాగాదిపంచకంచైవ లక్ష్మీవదశధేనవః। తథాదశమహాదానమచలాస్సప్తనామకాః॥ రహస్యకృతపాపాని బ్రహ్మహత్యాదికానిచ। పాపానాంనవవిధానాంహి ఇతరేషాం మునీశ్వరాః॥ తులాదిసంగ్రహీతృణాంపరాకఃకృచ్ఛ్రఈరితః। సర్వపాపహరోనృణాం దేవర్షీణాంప్రియంకరః॥ సర్వేష్వేతేషుకృచ్ఛ్రేషుమహాన్ ప్రోక్తః స్వయంభువా॥ గౌతమః॥ ప్రత్యహంఘృతమాత్రంచ ద్వాదశాహం గవాద్భవం। పీత్వాపలంద్విజశ్శుద్ధ్యేత్పరాకఇతివిశ్రుతః॥ సర్వపాపప్రశమనస్సర్వోపద్రవనాశనః। సర్వలోకప్రదోయస్మాద్భగవానాహవిశ్వసృక్॥ వ్యాసః॥ ప్రత్యహంగోఘృతంవిప్రో ద్వాదశాహంపలంముదా। పీత్వాశుద్ధిమవాప్నోతి పాపేభ్యోనాన్యథాద్విజఇతి॥ లౌగాక్షిః॥ ద్వాదశాహంఘృతంతప్తం పలమాత్రంగవాంపిబన్। ద్విజశ్శుద్ధిమవాప్నోతి సర్వపాపైఃప్రముచ్యతే॥ పరాకోనామయత్రతప్తంగోఘృతంపలమానేన ద్వాదశరాత్రం చతుర్థకాలేనియమానంతరంపీత్వాశుద్ధిమాప్నోతి॥అయమేవపరాకః॥ ఇతి పరాకకృచ్ఛ్రలక్షణం॥

(౫౧౬) ఇకను పరాకకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు ॥ పరాకకృచ్ఛ్రము సకలపాపములను నశింపఁజేయునని విష్ణుచేతఁజెప్పఁబడియె. బ్రహ్మహత్య, సురాపానము, స్తేయము, గుర్వంగనాసంగమము, సంకలీకరణము, మలినీకరణము, అపాత్రీకరణము, జాతిభ్రంశకరము, ఉపపాతకము, అనిపాపములుతొమ్మిదివిధములుగఁ జెప్పఁబడియె. మఱియును తులాదానము, బ్రహ్మాండము, ఘటము, కల్పతరువు, గోసహస్రము, హిరణ్యకామధేనువు, హిరణ్యాశ్వము, హిరణ్యాశ్వరథము, హేమహస్తిరథము, పంచలాంగలకము, భూదానము, విశ్వచక్రదానము, కల్పలతాదానము, సప్తసాగరదానము, చర్మధేనుదానము, మహాభూతఘటదానము, కాలపురుషదానము, కాలచక్రదానము, రాశిచక్రదానము, కోటితిలహోమము, లక్షతిలహోమము, ఆర్ద్రకృష్ణాజినము, శకటము, సర్వసంగమము, భాగాది

పంచకము, దశధేనువులు, దశమహాదానములు, సప్తాచలములు, రహస్య కృతపాపములు, బ్రహ్మహత్యాదిపాపములు, మొదలగునవి యన్నియును పరాకకృఛ్రముచేత నాశమును బొందును. సర్వకృఛ్రములయందును బరాకకృఛ్రము శ్రేష్ఠమైనదని చెప్పఁబడెనని దేవలుఁడు వచించె. పదిరెండు దినములు గోఘృతము నాకొక్కొక్క పలము పరిమాణముగఁ బానమును జేయుచు వ్రతాచరణను జేయుట పరాకకృఛ్రమనఁబడుననియును, దీనివలనసకలపాపనాశము గలుగుననియును, గౌతముఁడు వచించె. వ్యాసుఁడును నీవిధముగానే పలికె. లౌగాక్షియును నిటులనే చెప్పె.

—✻ పరాకకృచ్ఛ్రప్రత్యామ్నాయః. ✻—

(౫౧౭) అథ పరాకకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ ప్రత్యామ్నాయం పరాకస్య వక్ష్యామ్యహమనుత్తమం। సర్వపాపోపశమనం మహాపాపనికృంతనం॥ పరాకంనామయత్కృచ్ఛ్రం తత్కర్తుంమనుజోత్తమః॥ అశక్తస్తస్యకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయంసమాచరేత్॥ తస్యాచరణమాత్రేణపరాకస్యఫలంలభేత్। ప్రత్యామ్నాయంగవాందద్యాద్దశపంచసవత్సకాః॥ సర్వపాపవినిర్ముక్తః ప్రయాతిపరమంపదం। మహాపాతకజాలానిహ్యుపపాతకమేవచ॥ తత్సర్వంనాశయత్యాశుతూలరాశిమివానలః॥ మరీచిః॥ ప్రత్యామ్నాయంపరాకస్య దశపంచగవాంద్విజః। దద్యాత్పాపవిశుద్ధ్యర్థంసర్వశ్రేయోభివృద్ధయే॥ మహాపాతకయుక్తోవా యుక్తోవాసర్వపాతకైః। ప్రత్యామ్నాయేన కృచ్ఛ్రస్య పరాకస్యజనాధిప॥ సర్వకృచ్ఛ్రఫలంలబ్ధ్వా ప్రయాతిపరమంపదం॥ పరాకకృచ్ఛ్రచరణాశక్తస్తు తత్ప్రత్యామ్నాయం పంచదశగవాంవిప్రేభ్యః పృథక్పృథక్దత్వాశుధ్యతీతివాక్యార్థః॥ ఇతిపరాకకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౧౭) ఇఁకను పరాకకృఛ్రప్రత్యామ్నాయమును జెప్పుచున్నాఁడు॥ పరాకకృఛ్రమును, ఆచరింపఁ దగిన సామర్థ్యములేనివాఁడు తత్ప్రత్యామ్నాయవ్రతము నాచరింపవలయును. అదియెట్లన సవత్సములగు గోవులను బదునైదింటిని దానము చేయవలయును. ఇట్లు సేయుటచేత సకలపాపములును నశించునని దేవలుఁడు వచించె. పరాకకృఛ్రమునకు బదులుగఁ బదునైదు గోవులను దానము సేయవలయును. ఇట్లు సేసినవాఁడు సకలపాపవినిర్ముక్తుఁడగునని మరీచివచించె.

——✻ యావకకృచ్ఛ్రలక్షణం ✻——

(౫౧౮) అథ యావకకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ అథాతస్స

ప్రవక్ష్యామి కృచ్ఛ్రం యావకసంజ్ఞకం । యస్యాచరణ మాత్రేణముచ్యతే బ్రహ్మహత్యయా ॥ మరీచిః ॥ శృణుధ్వమృషయస్సర్వే యావకంకృచ్ఛ్రమీరితం । ఏవమానేచయత్పాపం యత్పాపంగృహదాహనే॥ శస్త్రాఘాతేచయత్పాపం యత్పాపం విప్రవఞ్చనాత్ । విధవాప్రతలోపేన ప్రతిసన్న్యాసినోఽపి॥ గృహస్థస్యసదాచారత్యాగేయత్పాపముచ్యతే॥ అన్యతేపచయత్పాపం తపోవిఘ్నేయత్తథా॥ దానస్యకీర్తనాద్యచ్చతథావిప్రోపమానతే॥ యత్పాపంవిప్రనిందాయాం యత్పాపం మాతృభర్త్సనాత్ ॥ భగినీపుత్రౌ కన్యాకలత్రం। యత్పాపంధేనుఃస్తాయాం యత్పాపంశవభర్త్సనే॥ యత్పాపం విష్ణునిన్దాయాం యత్పాపంక్రతుకుత్సనే। అస్నానభోజనే పాపసమన్వ్యానేమపాతనే॥ దుస్సంగతేశ్చయత్పాపం యత్పాపంధనగర్వతః॥ యత్పాపంవయసా దృష్ట్యైయత్పాపం దారమోచనే ॥ యత్పాపంబుధుసన్న్యాగేయత్పాపం భాండపక్రమే । సకేశాస్నానరహితా విధవాకాంస్యభోజనీ ॥ పునర్భుక్తా సతాంబూలాసదా నిందాపరాయణా। సదాభ్రమతియానారీ పతిద్వేషపరాయణా॥ సపుత్రఃపితృవిద్వేషీ సదావిప్రఃపరాన్నభుక్ ॥ కుచేలస్సర్వదా త్వైదసంతతుశ్శ్రవనానసః। బహ్వాశీమృష్టరంవక్తావిప్రదానేషు విఘ్నకృత్॥ ఏతేషాంపాపనాశార్థాయ యావకంకృచ్ఛ్రమాచరేత్ ॥ పరాశరః ॥ సర్వపాపవిశుద్ధ్యర్థం యావకంకృచ్ఛ్రమీరితం । తదాచరణమాత్రేణ విప్రోభవతిశుద్ధిమాన్ ॥ అప్రతప్యయవాన్పక్త్వా స్వగృహ్యాగ్నావతిశుచిః । తద్యవాగూం సమాధాయ బ్రహ్మపత్రపుటేవశీ ॥ యవాభావేవ్రీహయోవా శ్యామాకాస్తస్యమానతః । తదన్నంప్రతినేదత్వా యవాగూంపిష్టవర్జయేత్॥ నిత్యకర్మాదికంకృత్వాపూర్వవచ్ఛుద్ధమానసః । పూర్వవదిత్యనేనాత్ర ప్రాతస్స్నానవిధ్యాః స్నానదికం కృత్వాయావన్మందాయతేరవిః తావత్పర్యుషితం పూర్వవద్విష్ణుపాదకం పరిక్షిప్త్వా నారాయణమనుస్మృత్య యవాగూంపచేత్।తదాహగౌతమః॥ బ్రహ్మపత్రపుటేరాజన్ ధృత్వాస్వయమతంద్రితః । తావత్తామనసావిష్ణుం స్మరన్మందాయతేరవిః ॥ యవాగూంపక్వతైలపత్రపాత్రేస్వయంముదా । పూర్వపక్షాశనం కృత్వా పాదపాణ్యోర్ధాత్వా రాచమ్యశుచిర్భూత్వా స్వపన్నారాయణాగ్రతః । అజస్రంధ్యాయన్ యావత్కృచ్ఛ్రంసమాప్యతే॥ పరేద్యురేవంకుర్వీతబ్రాహ్మణాభోజనం। తదంతేగాఃప్రదాతవ్యాః పంచగవ్యంపిబేత్తతః । ఏవంకృత్వాద్విజోయస్తు సద్యఃపాపాత్ప్రముచ్యతే ॥ఇతియావకకృచ్ఛ్రలక్షణమ్॥

(౫౧౮) ఇకను యావకకృఛ్రలక్షణమును జెప్పుచున్నాడు ॥ యావ

కకృచ్ఛ్రమునాచరించుటచేత బ్రహ్మహత్యాది సర్వపాపములును నశించునని దేవలుఁడు వచించెను. విషదానమువలనఁగలిగినపాపము, గృహదహనము వలనఁ గలిగినపాపము, శస్త్రఘాతమువలనవచ్చినపాపము, విప్రవంచన వలనసనుత్పన్నమైనపాపము, విధవావ్రతలోపమువలనఁ బుట్టిన పాపము, వ్రతసన్న్యాసులకుఁగలపాపము, సదాచార త్యాగమువలనగృహస్థునకుఁగలిగినపాపము, అనృతమువలనగలిగినపాపము, మఱియునితరములగు ననేకదుష్కార్యముల వలనఁగలిగినపాపము, మొదలగువానినాశముకొఱకు యావకకృచ్ఛ్రమునాచరింపవలయునని మరీచివచించెను. సర్వపాపనాశముకొఱకు యావకకృచ్ఛ్రము చెప్పఁబడినది. కావునదానినాచరించుటచేత పరిశుద్ధతగలుగును, వ్రతవంతుఁడును, శుచియునునై స్వగృహ్యాగ్నియందు వ్రతఘ్నములగు యవలనుపచనముసేసియాయవాగును బ్రహ్మపత్రపుటమునందుఁబెట్టుకొని జితేంద్రియుఁడై నిత్యకర్మాదికమును సమాప్తిఁబొందించి పూర్వోక్తప్రకారముగ శుద్ధమనస్కుఁడై చతుర్థకాలమునందువిష్ణువునకునివేదించి విశ్వరూపాదికమునుపఠించి నారాయణునిస్మరించుచు పానముచేయవలయును. యవలులభ్యముగాకపోయెనేని వ్రీహులనయినను, శ్యామాకములనయినను గ్రహింపవచ్చును, ఇట్లనిపరాశరుడువచించెను. బ్రహ్మపత్రపుటమునందు యవాగునుబెట్టి స్వయముగనతంద్రితుఁడై విష్ణుస్మరణను జేయుచు సూర్యుడుమందతనుబొందిన సమయమునందు, బ్రహ్మపత్రపుటస్థయవాగును విష్ణువునకునివేదించి పిమ్మటఁదానుపానమును జేయవలయును, అనంతరమందు పాదప్రక్షాళనాదికమును పూర్వోక్తముగనాచరింపవలయును, పరదినమందునునిట్లనే చేయవలయునని గౌతముడువచించెను॥

## ❋ యావకకృచ్ఛ్రప్రత్యామ్నాయః ❋

(౫౧౯) అథయావకకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ ॥ దేవలః ॥ కృచ్ఛ్రస్యయావకస్యాస్య ప్రత్యామ్నాయమిమంశృణు । సకృత్తుర్యాద్విజోయస్తు ససద్యఃపాపముక్తిమాన్ ॥ యోగీశ్వరః ॥ ప్రత్యామ్నాయప్రదాస్యామియావకస్యమహాత్మనః । సర్వపాపప్రశమనం సర్వకృచ్ఛ్రఫలంనృణామ్ ॥ గావోదశప్రదాతవ్యాః ప్రత్యామ్నాయాః ప్రకీర్తితాః । సవత్సా దుగ్ధసమ్పన్నాస్సుశీలాస్సమలంకృతాః ॥ విప్రేభ్యః ప్రతిదాతవ్యా వ్రతినాతు పృథక్పృథక్ । పంచగవ్యం తతఃపశ్చాత్పిబేద్దేహవిశుద్ధయే । ఎతత్కృచ్ఛ్రస్యచఫలం యావకస్యసుఖాప్తయే ॥ గౌతమః ॥ యావకస్యమహాపాప హారిణఃఫలదాయినః । సర్వపాపాపహమవం మహాపుణ్యప్రదాయకం ॥ ప్రత్యామ్నాయాశ

ణ్యేతి శేషః। సంపూర్ణవస్త్రాభరణాః ఖురశృంగోపశోభితాః॥ సవత్సాయువతీస్సాధ్వీర్గవాం సంఖ్యాదశస్మృతాః। యస్త్వన్యాద్విజాగ్రేభ్యః ప్రదాతవ్యాః ఫలాప్తయే॥ పంచగవ్యం పిబేత్పశ్చాచ్ఛుద్ధో భవతి మానవః॥ ఏవం కుర్యాన్నరో యస్తు యావకస్య స్వరూపిణీమ్॥ గవాం సంఖ్యా ద్విజాగ్ర్యాయ దత్వా ఫలం వాప్నుయాత్॥ ఇతి యావకకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౧౯) ఇకను యావకకృచ్ఛ్రప్రత్యామ్నాయ విధులను జెప్పుచున్నాడు॥ యావకకృచ్ఛ్రప్రత్యామ్నాయ విధులనాచరించుటచేత సకల పాపవిముక్తుండగునని దేవలుడు వచించె. యావకకృచ్ఛ్రప్రత్యామ్నాయము సకల పాపములను నశింపజేయును, యావకకృచ్ఛ్రమునకు బదులుగ వత్సలతో గూడినవియును, శ్రీమనోసంగునవియునునగు పదిగోవులను దానము సేయవలయును, అనంతరమందు పంచగవ్యప్రాశనను జేయవలయునని యోగీశ్వరుడు వచించె. గౌతముడును నీవిధముగానే వచించె॥

—— సాంతపనకృచ్ఛ్రలక్షణమ్ ——

(౫౨౦) అథ సాంతపనకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ కృచ్ఛ్రస్య సాంతపనస్యాస్య లక్షణం సర్వపాపహమ్। శ్రీశైలం కాశికాక్షేత్రం గయాక్షేత్రం మహత్తరమ్॥ ప్రయాగం యమునాం సింధుం గంగాసాగరసంగమమ్। తథా సప్తనదీం రంగం గౌతమీం పాపహారిణీమ్॥ కృష్ణవేణీం తుంగభద్రాం హేమకూటే త్రిలోచనమ్। మార్కండేయం సింహగిరిం తథా ధర్మపురీశ్వరమ్॥ ద్రాక్షారామం జయాటవ్యాం మల్లికార్జునమేవ వా। అహోబలం నృసింహం చ తత్రైవ భవనాశనీమ్॥ పినాకినీనదీతీరే వైద్యనాథం హరిం తథా। వేంకటాద్రిం స్వర్ణముఖీం కాళహస్తీశ్వరం తథా॥ సాక్షాద్వరదరాజం చ వరభూతం స్వయంభువః॥ ఏకామ్రం చ తథా లింగం సర్వతీర్థం మహత్తరమ్॥ మధ్యార్జునేశం పాపఘ్నం కుంభఘోణం తదుద్భవమ్। శ్రీరంగం చ మహాక్షేత్రం జంబునాథమతః పరమ్॥ కావేరీం పాపశమనీం మధురావిశ్వమేశ్వరమ్। సుందరేశం చ తత్పశ్చిమం తత్రైవాఘవతీం నదీమ్॥ తతోఽగ్నేయస్య దిగ్భాగే పర్వతో గంధమాదనః। రామలింగం ధనుష్కోటిం సర్వతీర్థపరిష్కృతామ్॥ తత్రైవ దర్భశయనం నంపత్రత్యం చ మహత్సరః। తామ్రపర్ణీ మహాక్షేత్రం తత్రత్యా విష్ణుదేవతాః॥ అనంతాఖ్యం మహాక్షేత్రం కాంతిన్యాయత్ర భాగ్యవాన్॥ జనార్దనం మహాక్షేత్రం గోకర్ణం పాపనాశనమ్॥ తథా హరిహరక్షేత్రం సుబ్రహ్మణ్యం మహత్తరమ్। ఏతాని పుణ్యక్షేత్రాణి దృష్ట్వా పాపహరాణి చ॥ నీరోగీ సుఖభోగస్తు ఏతేషామేకమేవ వా। స స్నాయాద్వావశ్యేద్వా కౌన్యస్తస్మాదచేతనః॥ ధర్మహీనస్య

మత్త స్యకర్మహీనస్య పాపినః । అజాగళ స్తనమివతస్యజన్మనిరర్థకం॥ యోమర్త్యోజన్మదివసాత్షష్టివర్ష ప్రవర్తతే । నపశ్యేద్యదిశ్రీశైలం తస్మజ్యేసతుగర్దభః ॥ ద్విజన్మాస్వజన్మదినసాదారభ్య షష్టివర్ష మధ్యేశ్రీశైలచానాగ్ర వేంకటాచలవరదరాజ శ్రీరంగాదికం నాస్తికతయానపశ్యేత్ తర్హేతేన సర్వపాపభోగానంతరం గర్దభోభవతీతి వామనపురాణోక్తిశ్రవణాత్ ॥ తదాహమరీచిః॥ శ్రీశైలం వేంకటాద్రించ కాంచీం శ్రీరంగనాయకం । రామేశంచ ధనుష్కోటిం స్వభవాత్షష్టీవర్షగః ॥ నపశ్యేన్నాస్తికతయాగర్దభోభువిజాయతే । తస్యాన్యానిష్కృతిర్నాస్తి కృచ్ఛ్రాత్సాంతపనాధృతే॥ బృహస్పతిః ॥ పుణ్యాలయాన్ పుణ్యనదీర్నపశ్యేత్షష్టీవర్షగః । మహాంతంనరకంగత్వా పశ్చాద్రాసభతాంవ్రజేత్ ॥ తస్యదోషోపశాంత్యర్థం కృచ్ఛ్రం సాంతపనం చరేత్ । పంచగవ్యంపిబేత్పశ్చాద్దోషాదస్మాత్ప్రముచ్యతే ॥ తల్లక్షణమాహ॥ దేవలః ॥ ప్రత్యహంమాషమగ్నంచ ద్వాదశాహం పయఃపిబేత్ । శుద్ధిమాప్నోతిరాజేంద్రయోగినామపిదుర్లభం ॥ ప్రజాపతిః ॥ పూర్వవత్ప్రాతరారభ్య స్నానంసంకల్పమేవచ । నిత్యకర్మతథాకృత్వా పూర్వోక్తం మనసాస్మరన్ విధూతాత్మా ఏకమిత్యర్థః ॥ యావన్మందాయతే భానుస్తావద్దుగ్ధమాదదేత్ । విష్ణవేతన్నివేద్యాథ మాషమగ్నంపిబేద్వ్రతీ ॥ స్వాపేద్దేవ సమీపేతు గంధతాంబూలవర్జితః। తతఃప్రభాతవేళాయామేవం కృత్వామహద్వ్రతం॥ ద్వాదశాహైరాభిరేతైశ్చ శుద్ధోభవతిపూర్వజః । పంచగవ్యం పిబేత్పశ్చాత్స సాంతపనఈరితః ॥ ఇతిసాంతపనకృచ్ఛ్రలక్షణం ॥

(౫౯౦) ఇకను సాంతపన కృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ సాంతపనకృచ్ఛ్రము సకలపాపములను నశింపజేయును, శ్రీశైలము, కాశీక్షేత్రము గయాక్షేత్రము, ప్రయాగ, యమున, సింధు, గంగాసాగరసంగమము, సప్తనదిసంగము, గౌతమి, కృష్ణవేణి, తుంగభద్ర, హేమకూటము, త్రిలోచనము, మార్కండేయము, సింహాచలము, ధర్మపురి, ద్రాక్షారామము, జయావటి, మల్లికార్జునము, అహోబలము, భవనాశని. పినాకినీనదీతీరము, వైద్యనాథము, హరిక్షేత్రము, వేంకటాద్రి, స్వర్ణముఖి, కాళహస్తీశ్వరుడు, వరదరాజు, ఏకామ్రేశ్వరుడు, మధ్యార్జునేశుడు, కుంభకోణము, శ్రీరంగము, జంబునాథము, కావేరి, మధురాపురమునందలి సుందరేశ్వరుడు, సుందరేశ్వరునిభార్య, ఓఘవతినది, గంధమాదనపర్వతము, రామలింగము, ధనుష్కోటి, దర్భశయనము, తామ్రపర్ణి నామక మహాక్షేత్రము, అనంతశయనము, కౌండిన్యము, జనార్దనము, గోకర్ణము, [illegible] క్షేత్రము, సుబ్రహ్మణ్యము,

అనునవిపుణ్యక్షేత్రములు, ఈక్షేత్రములను చూచినమాత్రముచేత నేసకలపాపములునునశించును, రోగరహితుండైన బ్రాహ్మణుండెట్టి స్థలములయం దుస్నానమునుజేయకపోయినను, ఇట్టిస్థలములనుజూడకపోయినను, అచేతను డనదగినవాండగును. మఱియును ధర్మహీనుండును, కర్మహీనుండును, పాపియనునగువానిజన్మ, మేకమెడయందలిచన్నులవలె నిష్ప్రయోజనములగును, అరువదిసంవత్సరములవఱకును జీవించినవాండు, అఱువదిసంవత్సరములలో నెప్పుడును శ్రీశైలమును జూడకపోయెనేని గర్దభమగును. మఱియు శేషాచలాదిపుణ్యస్థలములలో నేనిఁచూడనివాడు నరకభోగానంతరమందు గాడిదెయై పుట్టుననిదేవలుఁడుచెప్పెను. శ్రీశైలము, వేంకటాద్రి, కాంచి, శ్రీరంగము, రామేశము, ధనుష్కోటి, అనునష్టపుణ్యస్థలముల నరువదిసంవత్సరముకాలముజీవించినవాడు తనదుజీవితకాలములోపలఁ జూడకుండెనేని యట్టివాండు గార్దభమైపుట్టుననియును, తత్పాపోపశమనముకొఱకు కృచ్ఛచాంద్రాయణాదివ్రతములనాచరింపవలయునని మరీచిచెప్పెను. బృహస్పతియును నీవిధముగానేచెప్పెను. పదిరెండుదినములు దినదినమందును మాషవర్గము క్షీరమునుపానమునుజేయుచు వ్రతాచరణనుజేయుట సాంతపనకృచ్ఛ్రమనఁబడునని దేవలుఁడు చెప్పెను. పూర్వోక్తప్రకారముగ నిద్రనుమేల్కాంచి స్నానసంకల్పములనుజేసి నిత్యకర్మలనుపరిసమాప్తినొందించి పూర్వోక్తమగు విభూత్యాదికమును మనస్సుచేతస్మరించుచు సూర్యుడునుందతను బొందినసమయమునందు ఆదరముతోఁ బూర్వోక్తమైనపరిమితిగలక్షీరమును విష్ణువునకునివేదించి పానమునుజేయవలయును, పిమ్మట దేవసమీపమునందు దాంబూలాదులనువదలిని దురను బొందవలయును, పిమ్మటమఱునాఁప్రాతఃకాలమునను ముందుగనిద్రను మేల్కాంచియీవిధముగానేయాచరింపవలయును, ఇట్లుపదిరెండుదినములును, అయిన పిమ్మట పంచగవ్యప్రాశనను జేసెనేని పరిశుద్ధుడగునని ప్రజాపతిచెప్పె॥

—— సాంతపనకృచ్ఛ్రప్రత్యామ్నాయః ——

(౫౨౧) అథసాంతపనకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ ॥ దేవలః॥ ప్రత్యామ్నాయం ప్రవక్ష్యామికృచ్ఛ్రస్యైతస్య పాపహం । సర్వపాపోపశమనం సర్వకృచ్ఛ్రఫలప్రదం ॥ మహాపాపప్రశమనం ధర్మకామార్థ సిద్ధిదం। వ్యాసేనకథితంపూర్వం కృష్ణాయామితతేజసే ॥ సరిస్వహారిణోయేచ పరదారరతాశ్చయే । మద్యపానరతాయేచ అగమ్యాగమనాశ్చయే॥ అసచ్ఛాస్త్రరతాయేచ యేచదుష్టప్రతిగ్రహాః । మిథ్యాభివాదివాదినోయేచ యేచ

మిత్రవిభేదినః ॥ దీపనిర్వాపణాశ్చైవ యేచకూశ్మాండభేదినః। దివాకపిత్థచ్ఛాయాసు రాత్రౌచదలశేషుచ ॥ తమాలవృక్షచ్ఛాయాసు రాత్రౌవా యదివా దివా । గచ్ఛతా పాపనాశాయ ప్రత్యామ్నాయో మహత్తరః ॥ సదాసిష్ఠురవక్తారస్సదా యాచ్ఞాపరాయణాః॥ పరాన్ననిరతాశ్చైవ నిత్యకర్మవిరోధినః॥ తేషామయంవిశుద్ధిస్స్యాత్ప్రత్యామ్నాయః పరాత్పరః ॥ గౌతమః॥ సర్వపాపవిశుద్ధ్యర్థం సర్వదోషవివర్జితం । ప్రత్యామ్నాయం తదా కుర్యాత్సదా పాపసముద్భవః ॥ పరాశరః ॥ సాంతపనస్యాస్యకృచ్ఛ్రస్యప్రత్యామ్నాయో గవాం దశ । సర్వాలంకారసంయుక్తః పక్షీరస్సాధువృత్తిమాన్। మరీచిః ॥ ప్రత్యామ్నాయంప్రశంసంతిగవాం దశమునీశ్వరాః । సాంతపస్యైవకృచ్ఛ్రస్య సర్వపాపాపనుత్తయే ॥ వ్యాసః ॥ సాంతపాఖ్యస్య కృఛ్రస్య మునిభిఃపరికీర్తితః । ప్రత్యామ్నాయ ఇతిశేషః ॥ సర్వాలంకారసంయుక్తాః గవాం దశమహాన్తా ఇతి॥ ఇతి సాంతపనకృఛ్రప్రత్యామ్నాయః ॥

(౫౨౧) ఇకను సాంతపనకృఛ్రప్రత్యామ్నాయమును జెప్పుచున్నాఁడు ॥ సాతపనకృఛ్రప్రత్యామ్నాయము సర్వపాపములను నాశము నొందించును, మఱియును సర్వపాపములను నశింపఁజేయును, సర్వకృఛ్రఫలములనిచ్చును, మహాపాపములను బోగొట్టును, ధర్మకామార్థసిద్ధులనిచ్చును, పరధనముల నపహరించినవారును, పరదారరతులును, మద్యపానరతులును, అగమ్యాగమనమును జేసినవారలును, అసచ్ఛాస్త్రముల యందాసక్తిగలవారును, దుష్ట ప్రతిగ్రహముగలవారును, అసత్యముగ మాటలాడువారును, మిత్రులను భేదించువారును, దీపనిర్వాపణమును జేసినవారలును, కూశ్మాండమును భేదించినవారలును, పగటియందు కపిత్థవృక్షచ్ఛాయయందు నివసించినవారును, రాత్రియందు చదళములయందు నివసించినవారును, రాత్రియందయినను, బగటియందయినను, తమాలవృక్షచ్ఛాయయందు నివసించిన వారును, పాపశాంతికొఱకుఁ బ్రయత్నమును జేయుచున్నవారలకు విఘ్నములను గలిగించినవారును, సర్వకాలములయందును నిష్ఠురముగ మాటలాడు వారును, సర్వకాలములయందును యాచ్ఞాపరాయణులును, పరాన్ననిరతులును, నిత్యకర్మనిరోధులును, అగు వారలయొక్క పాపమును, సాంతపనకృఛ్రమునకు బదులుగ సర్వాలంకారములతో గూడిన బదిగోవులను దానము సేయవలయునని పరాశరుఁడువచించె. మరీచియును నిటులనే చెప్పె. వ్యాసుఁడును నీవిధముగానే పలికె ॥

## ——(*) మహాసాంతపనకృచ్ఛ్రలక్షణమ్. (*)——

(౫౨౨) అథమహాసాంతపన కృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ మహాసాంతపనంనామ కృచ్ఛ్రంసర్వఫలప్రదమ్। పురాపురందరస్స్నాతుం గౌతమస్య సతీంవ్రజన్॥ తేనశాపేనమహతాసపాపఫలదూషితః। వృక్షమూలముపాగమ్యవృద్ధభావముపాశ్రితః॥ తదాప్రసన్నోవరదశ్చక్రపాణిస్స్వయంహరిః। దృష్ట్వాపురందరం ప్రాహదయయాభక్తవత్సలః॥ ఏతత్పాపవిశుద్ధ్యర్థంమహాసాంతపనంచరన్। గురుదారాభిగామీచ చండాలీగమనంచరన్॥ స్వసారంగమనంకృత్వాభగినీంయఃప్రధర్షయేత్। చరేద్వారజకీగామీ గ్రామచండాలదారగః॥ విప్రచండాలదారేషు రేతస్సేకాద్ద్విజాధమః। ఏతేషాం నిష్కృతిరియం మహాసాంతపనంపరం॥ అసభ్యభాషణేపాపమసత్యానాంచభాషణే। పరదత్తాపహారేచ స్వదత్తాపహారేతథా॥ అసూయానిరతేచైవసదాభైషజ్యవర్తిని। వ్రతకాలేశ్రాద్ధకాలే తథాదేవార్చనేయది॥ పాషండం పతితంవ్రాత్యంతులాస్వకృతనిష్కృతిమ్। నస్మరేదితిశేషః॥ షోడశమహాదానమధ్యేయత్రయత్రప్రతిగ్రహః ప్రాప్తఃతస్యతస్యఆచార్యాదీనామపి స్మరణాదినిషేధార్థంతులాస్వితిబహువచనం॥ తదాహమరీచిః॥ చండాలంపతితంవ్రాత్యంతులాస్వకృతనిష్కృతిం। నస్మరేత్తత్కర్మకాలేషు నపశ్యేద్వాకదాచన॥ ఏతేషాం పాపరాశీనాం మహాసాంతపనంపరం॥ గాలవః॥ ద్విదినంసముపోష్యైవ ద్విదినంపూర్వవత్పయః। పూర్వవన్నియమంకృత్వా ద్వాదశాహేనశుద్ధ్యతి॥ పరాశరః॥ మాషమగ్నింపిబేత్క్షీరం ద్విదినంసముపోషయేత్। ఏవంకుర్యాద్ద్వాదశాహం పూర్వవన్నియమాశ్రితః॥ మనుః॥ పూర్వవత్ప్రాతరారభ్యద్విజోనియమపూర్వకం। యదామందాయతేభానుస్తదానియమముత్సృజన్॥ మాషమగ్నింపిబేత్క్షీరం విజ్ఞేయేతన్నివేదితం। దినద్వయంపయఃపీత్వా ద్విదినంసముపోషయేత్॥ స్వపేచ్చపూర్వవద్దేవసమీపేవ్రతమాచరన్। ఏవంద్వాదశరాత్రంచ కృత్వాశుద్ధిమవాప్నుయాత్॥ దినద్వయముపోషణం దినద్వయంపయోభక్షణం। ఏవంక్రమేణద్వాదశాహంమహాసాంతపనం॥ ఇతిమహాసాంతపనకృచ్ఛ్రలక్షణం॥

(౫౨౨) ఇకను మహాసాంతపన కృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ మహాసాంతపనమను కృచ్ఛ్రము సర్వఫలములను నొసంగును. తొల్లి యింద్రుడు గౌతమునిభార్యనపహరించిన దోషనివారణకొఱకు మహాసాంతపన కృచ్ఛ్రమునాచరించె. గురుభార్యనుబొందినవాడును, చండాలస్త్రీని బొందినవాడును, అక్కచెల్లెండ్రను బొందినవాడును, రజకస్త్రీనిబొందినవాడును, గ్రామ

చండాలునిభార్యను బొందినవాడును, విప్రచండాలురభార్యలకుత్పన్నులయందు శిశు తన్నికమును జేసినవాడును, మహాసాంతపనకృచ్ఛ్రమునాచరించి శేసిపాపను లగుదురు. అసత్యాకరములగు వచనములను బలుకువాడును, అసత్యవచనములను బలుకువాడును, పరదత్తాపహారమును జేయువాడును, స్వదత్తాపహారమును జేయువాడును, అసూయానిరతుడును, సర్వకాలములయందును వైద్యమువేత జీవించువాడును, వ్రతకాల, శ్రాద్ధకాల దేవార్చనకాలములయందు పాషండపతితవ్రాత్య, తులాదానాదిప్రతిగ్రహీత్రాదులనుస్మరించువాడును, మహాసాంతపనకృచ్ఛ్రము నాచరింపవలయునని దేవలుడువచించె. కర్మకాలములయందు తులాదిదానములనుబ్రతిగ్రహించి ప్రాయశ్చిత్తమునుజేసికొననివారలతోడను, చండాలపతితవ్రాత్యాదులతోడను,సంభాషింపదగదు. మఱియును నట్టివారలజూడదగదు. తెలిసియైనను, తెలియకనైనను, ఇట్టిదుష్కృత్యములను జేసినవాడు మహాసాంతపనకృచ్ఛ్రమును జేసికొనవలయునని మరీచివచించె. రెండుదినము లుపవాసము పిమ్మట రెండుదినములు పూర్వోక్తప్రకారముగ క్షీరపానమును జేయుచు మఱియును బూర్వోక్తములగు నియమములనాచరించుచు నీవిధముగా బదిరెండుదినములు వ్రతాచరణను జేసినవారు పవిత్రులగుదురని గాలవుడువచించె. మొదట రెండుదినములుపవాసమును జేసి పిమ్మట మూడుదినములు మాషమగ్నపరిమితిగల క్షీరమునుపానముసేసి యీప్రకారము పదిరెండుదినములవఱకు వ్రతాచరణను జేయవలయునని పరాశరుడువచించె. పూర్వోక్తప్రకారముగ ప్రాతఃకాలముమొదలుకొని నియమములాచరించి సూర్యుడుపొడచుసమయమునందుమాషమగ్నక్షీరమును విష్ణుదేవునకునివేదించి పిదప దానుపానమును జేయవలయును. పిమ్మట రెండుదినములుపవాసమును జేయవలయును. ఇట్లుపదిరెండుదినములాచరించినవాడు పరిశుద్ధతనుబొందును. ఇట్లుసేయుటయే మహాసాంతపనకృచ్ఛ్రమనబడునని మనువువచించె.

——— మహాసాంతపనప్రత్యామ్నాయః. ———

(౫-౩౩) అథ మహాసాంతపన ప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ మహాసాంతపనకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయంశృణుష్వమె। యస్యాచరణమాత్రేణవిప్రఃపాపాత్ప్రముచ్యతే॥ మహారాజవిజయే॥ మహాసాంతపనస్యాస్య ప్రత్యామ్నాయోమహానయం। తస్యాచరణమాత్రేణ మహాసాంతపనవ్రతం॥ కృతంభవేదితిశేషః॥ చతుర్వింశతిమతే॥ మహాసాంతపనంనాముకృచ్ఛ్రంపాపహారంపరం। బ్రహ్మహత్యాదిశమనముపపాతకనాశనం॥ కృచ్ఛ్రస్యైతత్

స్యచరణైర్విప్రస్సన్న్యశ్చేదశక్తిమాన్। ప్రత్యామ్నాయంప్రకుర్వీత తత్కృచ్ఛ్రస్యఫలాప్తయే॥ గావోదేయాఃప్రయత్నేన విప్రేభ్యఃషోడశామలాః। అలంకృతాస్సుపుష్టాద్యైర్వస్త్రాభరణభూషితాః॥ సుసాధ్వ్యశ్చ పయస్విన్యస్సవత్సాఃపాపహారిణీః। పాపహారిణ్యఇత్యర్థః॥ పరాశరః॥ మహాసాంతపనస్యాస్య ప్రత్యామ్నాయంవిదుర్బుధాః। గావఃషోడశవిప్రేభ్యోదేయాస్సమ్యక్సుఖాప్తయే। అలంకృతాశ్చవస్త్రాద్యైఃపయస్విన్యఃపృథక్పృథక్। సవత్సాస్సాధుశీలాశ్చ ప్రత్యామ్నాయఉదీరితః॥ ఇతి మహాసాంతపన ప్రత్యామ్నాయః॥

(౫౨౩) ఇకను మహాసాంతపనకృచ్ఛ్ర ప్రత్యామ్నాయమును జెప్పుచున్నాడు॥ మహాసాంతపనకృచ్ఛ్ర ప్రత్యామ్నాయము సకల పాపములనునశింపజేయునని దేవలుడువచించె. మహారాజవిజయమునందును నీవిధముగానే చెప్పబడెను. మహాసాంతపనకృచ్ఛ్రము బ్రహ్మహత్యాది పాపములను నాశము సేయును. ప్రత్యామ్నాయముగూడ దత్తుల్యమేయగును. మహాసాంతపనకృచ్ఛ్రమునకు బదులుగ సర్వాలంకారశోభితములును, పరిశుద్ధములును, క్షీరమునొసంగునవియును, దూడలతోగూడినవియునునగు పదునారు గోవులనుదానముచేయవలయునని చతుర్వింశతిమతమునందు జెప్పబడెను. పరాశరుడునునీవిధముగానేవచించె.

## — కాయకృచ్ఛ్రలక్షణమ్. —

(౫౨౪) అథకాయకృచ్ఛ్రస్వరూపమాహ॥ దేవలః॥ ప్రాజాపత్యంతప్తకృచ్ఛ్రం పరాకంయావకంతథా। తతస్సాంతపనంకృచ్ఛ్రం మహాసాంతపనంతథా॥ కాయకృచ్ఛ్రమిదంప్రోక్తమతికృచ్ఛ్రంవిశుద్ధిదం। ఔదుమ్బరంచపర్ణంచ ఫలకృచ్ఛ్రమతఃపరం॥ కృచ్ఛ్రంమాహేశ్వరంచైవ బ్రహ్మకూర్చంతథైవచ। ధాన్యంస్వర్ణమయంకృచ్ఛ్రందశపంచైకకీర్తితం॥ పూర్వంత్రయోదశకృచ్ఛ్రాణిశ్యుక్తం॥ ఇదానీంలింగపురాణోక్తత్వాదతికృచ్ఛ్రకాయకృచ్ఛ్రాభ్యాంసహ పంచదశధాభవంతి। సర్వేషాముపకారకత్వాత్తైఅపిలిఖ్యేతే। కాయకృచ్ఛ్రాతికృచ్ఛ్రలక్షణం లింగపురాణోక్తంవిశినష్టి। కాయకృచ్ఛ్రం ప్రవక్ష్యామి మహాపాతకశుద్ధయే। ఉపపాతకశుద్ధ్యర్థం మునిభిఃపరికీర్తితం॥ భవిష్యోత్తరే॥ తులాధేనుసహస్రేచ అష్టమాబ్దే ద్విజోత్తమ। దాతాప్రతిగృహీతాచ అన్యోన్యంనావలోకయేత్॥ యదిచైవాదనుప్రాప్తం తీర్థేషుచ మహోగ్రవే। తదాతద్దోషశాంత్యర్థం కాయకృచ్ఛ్రంసమాచరేత్॥ ద్వితీయోజపకృత్పూతస్సహస్రంవిధిపూర్వకం। ఉభయోర్దానయోరాజా తదాబ్రహ్మ

సదస్యయోః॥ చత్వార్యేవతువర్షాణితన్ముఖంనావలోకయేత్ । దాతుఃకాయకృచ్ఛ్రంఇతరయోః బ్రహ్మసదస్యయోః చతుస్సహస్రగాయత్రీజపః। అస్యాభావేదోషః॥ బృహస్పతిః॥ దాతుఃప్రతిగృహీతుశ్చకాయకృచ్ఛ్రంజపోమహాన్। అన్యోన్యావలోకనే రాజన్ తద్దానంనిష్ఫలంభవేత్ ॥ తస్మిన్ప్రత్యేకకృతాచేదిత్యర్థః॥ సర్వత్రమహాదాన ప్రతిగ్రహేషు దాతృప్రతిగ్రహీత్రోర్బ్రహ్మసదస్యయోరేవముక్తం వేదితవ్యమ్॥ ప్రాయశ్చిత్తంసర్వత్ర॥ లాంగలేపంచపూర్వేచ విశ్వచక్రేమహత్తరే। సప్తహాబ్దాంతదా రాజన్ తన్ముఖం నావలోకయేత్॥ సప్తసాగర దానేచ చర్మధేనోః ప్రతిగ్రహే। మహాభూతఘటేచైవతులావన్నావలోకయేత్॥ ఉక్తేషుసప్తస్వపిప్రతిగ్రహేషు దాత్రాచార్యబ్రహ్మసదస్యానాంప్రాగ్వత్ కాయకృచ్ఛ్రాదికంవేదితవ్యం। హిరణ్యగర్భబ్రహ్మాండేతదాకాయంహిపూర్వవత్। అన్యోన్యాలోకనే రాజన్నదానఫలమశ్నుతే॥ ఆచార్యబ్రహ్మసదస్యానాంపూర్వవత్॥ కల్పపాదపదానేచ తథాకల్పలతాగ్రహే। షడబ్దంతన్ముఖం రాజావిప్రోవా నావలోకయేత్॥ కాయకృచ్ఛ్రంగాయత్రీజపశ్చ తత్తత్సంఖ్యాక్రమేణ వేదితవ్యమ్॥ హిరణ్యధేనుదానేచ హిరణ్యాశ్వప్రతిగ్రహే। పూర్వవదృతుసంఖ్యాబ్దమన్యోన్యం నావలోకయేత్ ॥ కృచ్ఛ్రాదికంపూర్వవత్॥ హిరణ్యాశ్వరథేచైవ హేమహస్తిరథేతథా । అష్టమాబ్దాదథాయత్నాదన్యోన్యంనావలోకయేత్॥ పూర్వవత్కృచ్ఛ్రాదికం। ధరాదానే కాలపురుషేకాలచక్రేతథైవచ। తిలగర్భేరాశిచక్రేపంచాబ్దంనావలోకయేత్॥ యదిదైవాత్సముత్పత్తిరతికృచ్ఛ్రం చరేద్వ్రతీ। పునస్సంస్కారకృద్విప్రఃపటగర్భేవిధానతః॥ అన్యథా దోషమాప్నోతి దాతానఫలమశ్నుతే। కోటిహోమేలక్షహోమే పాపపూరుషసంగ్రహే॥ ఆచార్యస్యముఖందాతాయుగాబ్దంనావలోకయేత్ ॥ తత్రాప్యతికృచ్ఛ్రందాతుః ॥ ఇతరేషాంపునస్సంస్కారః॥ శ్వేతాశ్వేమృతశయ్యాయాం గజదానప్రతిగ్రహే।త్రిసాబ్దంతన్ముఖందాతా దైవాద్వానావలోకయేత్॥ అతికృచ్ఛ్రంచరేద్దాతాబ్రాహ్మణాః పటగర్భతః। ఆర్ద్రకృష్ణాజినేచైవ సప్తశైలప్రతిగ్రహే॥ ద్వ్యబ్దంతన్ముఖందాతా పూర్వవన్నావలోకయేత్। బ్రహ్మకృచ్ఛ్రంచరేద్దాతా ఇతరేపటగర్భతః॥ కపిలాద్విముఖిదానే దాసీగృహపరిగ్రహే। అబ్దమేకంద్వ్యబ్దంతాపూర్వవన్నావలోకయేత్॥ పర్ణకృచ్ఛ్రంతతఃప్రోక్తమితరేషాంతుపూర్వవత్। అలింగనేత్రైలఘటేమహాపూరుషభోజనే। షణ్మాసంనావలోకేద్వాపర్ణకృచ్ఛ్రంహిపూర్వవత్ । తులాదిసప్తదానేషుఋత్విజోజాపకానపి ॥ తద్వద్వ్యపేక్షానావలోకేన్నఫలకృచ్ఛ్రము దాహృతమ్॥ మాసత్రయమిత్యర్థః॥ స

ర్వేషామృత్విజాం ప్రోక్తస్సహస్రజపఆదరాత్ । ఆజ్యాలంకారధేనూనాము నడ్వాహాదిసంగ్రహే॥ మహిషీభాగబస్తానాం మాసమేకంనిరంతరమ్। ఋత్విజాంశతగాయత్రీదాతాధేనుంసమాచరేత్ ॥ సాత్త్వికేషుచతుర్వింశతిమూర్తిదానేషు దాతాప్రతిగ్రహీతారమవలోకయేన్నతత్రదోషః॥ తదాహగాలవః॥ చతుర్వింశతిమూర్త్యాదిదానేషు ద్విజవల్లభః। దశావతారదానేషుఅర్ధనారీశ్వరాదిషుప్రభో॥ ముఖావలోకనందాతృగృహీత్రోర్నతుదోషకృత్ । అర్ధనారీశ్వరలక్ష్మీనారాయణో మామమహేశ్వరప్రతిమాదానేషు కృష్ణాజినతిలంహేతేషు దాతృప్రతిగ్రహీత్రోర్ముఖావలోకనం నదోషహేతుః॥ కృష్ణాజినతిలప్రతిగ్రహే దోషమాహ॥ జాబాలిః॥ దశస్వేతేషుయోగేషు ముక్తిమత్సు నృపోత్తమ। తిలాజినప్రదానేషుషణ్మాసంనావలోకయేత్ ॥ ఉత్క్రాంతిర్వైతరణ్యాశ్చతథా ప్రతికృతేనృప। అన్నప్రతిగ్రహేతాతఏకాహేభోజనేతథా॥ ఉగ్రశాంతిషుసర్వత్రతథా మహిషసంగ్రహే। కర్తానాలోకయేద్విప్రంకాయకృచ్ఛ్రంసమాచరేత్॥ షణ్మాసమితిశేషః॥ శిశూనాంజననేమూలాదయోఽభుక్తాస్తత్సంధయశ్చ స్త్రీణాంప్రథమార్తవే మఖాదయస్తూగ్రాః। తేషాంశాంతిషు ప్రతిగ్రహే షణ్మాసంనావలోకయేత్ ॥ కాయకృచ్ఛ్రలక్షణమాహమరీచిః॥ చత్వార్యహాని గ్రాసాస్స్యురేకైకం ప్రత్యహంవ్రతీ। నిరాహారస్తథాతేషు చతుష్వేతేషుభోజనమ్॥ తదంతేవ్రతిభిర్దేయాగౌరేకాగవ్యభక్షణమ్। కాయకృచ్ఛ్రమిదంప్రోక్తంమునిభిస్తత్త్వదర్శిభిః॥ప్రజాపతిః॥ చతుర్ష్వహస్సుగ్రాసాస్స్యుర్నిరాహారస్తథాపునః। చతుర్షుగ్రాసభక్షస్స్యాత్ కాయకృచ్ఛ్రమిదంపరమ్॥ మరీచిః॥ ఆసాయంప్రాతరారభ్య స్నాత్వావిప్రోయథావిధి। అభ్యర్చ్య విష్ణుంగంధాద్యైరవిరస్తంగతోయదా। తదాగ్రాసంసమశ్నీయాద్విపక్షవర్జితమముంసుధీః। ప్రక్షాళ్యపూర్వవత్సర్వం ద్విరాచమ్యశుచిస్తదా॥ స్వపేద్దేవసమీపేతునారాయణమనుస్మరన్। పునఃప్రాతస్సముత్థాయకృత్వానియమపూర్వకమ్॥ తత్రాపిభక్షయేద్గ్రాసమేవం చతురహంవ్రతీ। తతఃపరంనిరాహారస్తథాచతుర్షుభోజనమ్॥ గోదానంవ్రతపూర్త్యర్థంపంచగవ్యంపిబేత్తతః। కాయకృచ్ఛ్రమిదందేవ ద్విజానాంపావనంస్మృతమ్॥ఇతి కాయకృచ్ఛ్రలక్షణం॥

(౫౨౮) ఇకను కాయకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ ప్రాజాపత్యకృచ్ఛ్రము, తప్తకృచ్ఛ్రము, పరాకకృచ్ఛ్రము, యావకకృచ్ఛ్రము, సాంతపనకృచ్ఛ్రము, మహాసాంతపనకృచ్ఛ్రము, కాయకృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, ఔదుంబరకృచ్ఛ్రము, పర్ణకృచ్ఛ్రము, ఫలకృచ్ఛ్రము, మహేశ్వరకృచ్ఛ్రము, బ్రహ్మ

కూర్చము, ధాన్యకృచ్ఛ్రము, స్వర్ణకృచ్ఛ్రము, అని కృచ్ఛ్రములు పదునైదని నిర్ణయింపబడె. కాయకృచ్ఛ్రము, మహాపాతకములను, ఉపపాతకములను నశింపజేయునని యెఱుంగవలయునని దేవలుడు వచించె. తులాధేను సహస్రమునందును, ఎనిమిది సంవత్సరములలోపల దాత ప్రతిగ్రహీతయును పరస్పరావలోకనమును జేయగూడదు. ఒక వేళ తీర్థములయందును, మహోత్సవములయందును దర్శనము గలిగెనేని తద్దోషశాంతికొఱకు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. అయ్యిరువురిలో రెండవవాడు వేయిపర్యాయములు నియమపూర్వకముగ గాయత్రీజపమును జేయుటవలన బరిశుద్ధుడగును. ఈ రెండు దానములయందును బ్రహ్మసదస్యులు నాలుగుసంవత్సరములు పరస్పరావలోకనమును జేయగూడదు. ఈవిషయమునందు దాత కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. ఇతరులగు బ్రహ్మసదస్యులు నాలుగువేలపర్యాయములు నియమపూర్వకముగ గాయత్రీమంత్రమును జపింపవలయునని భవిష్యోత్తరపురాణమునందు జెప్పబడియె. దాతృప్రతిగ్రహీతలకన్యోన్యావలోకమునందు కాయకృచ్ఛ్రజపములు సెప్పబడియె. ఇట్లు సేయనియెడల చేసిన దానములు నిష్ఫలములగును. మహాదానప్రతిగ్రహములయందు బ్రహ్మసదస్యులకు గూడ నీవిధముగానే చెప్పబడియె. పంచలాంగలదానమునందును, విశ్వచక్రదానమునందును, ఏడుసంవత్సరములదనుక పరస్పరావలోకనదానమును జేయగూడదు. సప్తసాగరదానమునందును, చర్మధేనుప్రతిగ్రహమునందును, మహాభూతఘటదానమునందును తులాదానమునకుబోలెనవలోకనమును జేయగూడదు. ఇప్పుడు సెప్పబడిన సప్తవిధదానములయందును దాతాచార్యబ్రహ్మసదస్యులకు బూర్వోక్తప్రకారముగ కాయకృచ్ఛ్రాదికమును దెలియవలయును. హిరణ్యగర్భమునందును బ్రహ్మాండదానమునందును, పూర్వోక్తప్రకారముగనాచరింపవలయును. నియమితకాలమునకు బూర్వము పరస్పరావలోకనమును జేసిరేని దానఫలము వ్యర్థమగును. హిరణ్యధేనుదానమునందును, హిరణ్యాశ్వప్రతిగ్రహమునందును, పూర్వోక్తప్రకారముగ బహుసంఖ్యకలయొకరయబ్దము పరస్పరావలోకమును జేయగూడదు. కృచ్ఛ్రాదికమును పూర్వోక్తప్రకారముగ నాచరింపవలయును. హిరణ్యాశ్వరథమునందును, హేమహస్తిరథమునందును, ఎనిమిదిసంవత్సరములలోపల పరస్పరావలోకనమును జేయగూడదు. కృచ్ఛ్రాదికమును బూర్వోక్తప్రకారముగ నాచరింపవలయును. భూదానమునందును, కాలపురుషదానమునందును, కాలచక్రదానమునందును, తిలగర్భదానమునందును, విశ్వచక్రదానమునందును, అయిదుసం

వత్సరములు పరస్పరావలోకనమును జేయఁగూడదు. దైవయోగముచేతబరస్పరావలోకనము గలిగెనేని యతికృచ్ఛ్రము నాచరింపవలయును. మఱియును పటగర్భ విధానాను సారముగ బునరుపనయన సంస్కారమునుబొందవలయును. ఇట్లు సేయఁ జేని దాతయగువాఁడు దానఫలమునుబొందనేరఁడు. కోటిహోమమునందును, లక్షహోమమునందును, పాపపూరుషసంగ్రహమునందును, రెండుసంవత్సరములకాలము దాతృప్రతిగ్రహీతలు పరస్పరావలోకనమును జేయగూడదు. ఈవిషయమునందు దాతయగువాఁడతికృచ్ఛ్రము నాచరింపవలయును. ఇతరులకు బునరుపనయనసంస్కారమును విధింపవలయును. శ్వేతాశ్వదానప్రతిగ్రహమునందును, మృతశయ్యయందును, గజదానప్రతిగ్రహమునందును, దాతయగువాఁడు మూఁడుసంవత్సరముల కాలము ప్రతిగ్రహీతయొక్క ముఖమును జూడఁగూడదు. ఒకవేళ నాకస్మాకరుచూచిరేని యతికృచ్ఛ్రము నాచరించి పటగర్భవిధానాను సారముగ బునరుపనయన సంస్కారమును బొందవలయును. ద్విముఖియగు కపిలగోవుయొక్క దానమును ప్రతిగ్రహించినవాని ముఖమును దాతయగువాఁడొక్కసంవత్సరము చూడఁగూడదు. చూచినయెడల పర్ణకృచ్ఛ్రము నాచరింపవలయును. ఆలింగనమునందును, తైలఘటమునందును, మహావ్రరుషభోజనమునందును, ఆరుమాసములకాలము ముఖావలోకనను జేయఁగూడదు. ఒకవేళఁజూచినయెడల పర్ణకృచ్ఛ్రము నాచరింపవలయును. తులాదిసప్తదానములయందు, ఋత్విజులను, జాపకులను, ద్వారస్థితులను, చూడఁగూడదు. ఒకవేళఁజూచినవాఁడుఫలకృచ్ఛ్రము నాచరింపవలయును. అనఁగా మూఁడుమాసములకాలము చూడఁగూడదనుట. ఋత్విజులకందఱకును వేయిపర్యాయములు గాయత్రీజపమును విధింపవలయును. ఆజ్యాలంకారధేనువులయొక్కయు, అనడ్వాహముయొక్కయు, మహిషీభాగబస్తములయొక్కయు దానమునందు దాతయగువాఁడొక్కమాసము ప్రతిగ్రహీతయొక్క ముఖావలోకనను జేయఁగూడదు. ఈవిషయమునందు ఋత్విజులును, దాతయును, నూఱుపర్యాయములు గాయత్రీజపమును జేయువలయును. సాత్వికములగు నిరువదినాలుగు మూర్తిదానములయందు దాతయగువాఁడు ప్రతిగ్రహీతయొక్క ముఖావలోకమును జేయఁగూడదు. ఇట్లని బృహస్పతి వచించె. చతుర్వింశతిమూర్త్యాదిదానములయందును, దశావతారదానములయందును, అర్ధనార్యాదులయందును, దాతృప్రతిగ్రహీతలు పరస్పరముఖావలోకనమును జేయుటవలన దోషము లేదు. అర్ధనారీశ్వరలక్ష్మీనారాయణో మామహేశ్వరదానములయందును, తిలరహితకృష్ణా

జనధానములయందును, దోషములేదని గాలవుడు వచించె. దశ స్వేతముల యం
దును, రోగములయందును, ముక్తిగలవానియందును, తిలాజినప్రదానముల
యందును, ఆరుమాసములకాలము ముఖావలోకనను జేయగూడదు. ఇతి
యునితరములగు నుగ్రదానములయందు నియమిత కాలమునకులోపల ముఖా
వలోకనను జేసినవాడు కాయకృచ్ఛ్రము నాచరింపవలయును. శిశుజననమునం
దు భుక్తములుగాని మూలాదినక్షత్రములును, వానిసంధికాలములును, ప్ర
థమరజస్వలయందు మఖాదినక్షత్రములును, ఉగ్రనక్షత్రములుగావున నాలు
మాసములకాలము ముఖావలోకనను జేయగూడదని జాబాలి వచించె. నా
లుగుదినములొక్కొక్కగ్రాసమును భుజించి పిమ్మట నాలుగు దినములు భు
జింపక పిమ్మట నాలుగుదినములొక్కొకగ్రాసమును భుజించి యనంతరమం
దొకగోదానమును జేయవలయును. ఇయ్యది కాయకృచ్ఛ్రమనబడునని మరీ
చి వచించె. ప్రజాపతియును నివ్విధముగానే వచించె. ప్రాతఃకాలమునకు ముం
దుగ స్నానమును జేసి సాయంకాలము దనుక గంధపుష్పాదులచేత విష్ణువు
నర్చించి సూర్యుడు మందగతిని బొందినపిమ్మట విష్ణువునకు నివేదితమైనగ్రాస
ము భుజింపవలయును. ప్రక్షాళనాదికృత్యములను పూర్వోక్తప్రకారముగ
జేయవలయును. అనంతరమందు దేవసమీపమునందు నారాయణుని స్మరించు
చు నిద్రను బొందవలయును. మరలమరుదినమునందును నిట్టే ప్రకారము చేయవ
లయును. పిమ్మట నాలుగుదినములు భోజనరహితుడై యుండవలయును. అ
నంతరమందు మరల నాలుగుదినము లొక్కొకగ్రాసము చొప్పున భుజిం
పవలయును. పిమ్మట పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇది కాయకృచ్ఛ్ర
మనబడు. దీని నాచరించుటచేత సకలపాపములును నాశమును బొందునని మరీచి
వచించె.

—* కాయకృచ్ఛ్ర ప్రత్యామ్నాయః. *—

(౫-౨౫)అథ కాయకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ శృణురా
మప్రవక్ష్యామి కాయకృచ్ఛ్ర వ్రతంత్వతః। ప్రత్యామ్నాయం మహాపుణ్య శృణ్వ
తాంపాపనాశనమ్॥ దశగావః ప్రదాతవ్యా స్సవత్సాభూషితా నృభిః। పయ
స్విన్యస్సుశీలాశ్చ స్వర్ణశృంగా మహాత్తరాః॥ ఏతస్య కాయకృచ్ఛ్రస్య ప్రత్యా
మ్నాయో మహర్షిభిః॥ గాలవః॥ సర్వపాపహరస్యాస్య కాయకృచ్ఛ్రస్య వైన్నె
ప। ప్రత్యామ్నాయోదశగవాంసవత్సాస్సాధువృత్తయః॥ అలంకారయుతస్సా
ధుఃపయస్సాపరిపూర్ణా వా। ఏతదాచరణేనైవ కాయకృచ్ఛ్రఫలంలభేత్॥ కణ్వః॥
సర్వపాపహరస్యాస్య కాయకృచ్ఛ్రస్య సర్వదా। రాజ్ఞః ప్రతిగ్రహీతౄణాం

సర్వపాపహరంపరమ్॥ స్నాత్వా పుణ్యేన విప్రస్సుసంకల్ప్యైవ పూర్వవత్। విప్రాన్ అభ్యర్చ్య గన్ధాద్యైర్దశ ధేనూః పృథక్ పృథక్॥ దద్యాత్ప్రీత్యా మహాయభూతాస్సర్వపాపాపనుత్తయే। ఏతస్యాచరణే పూర్ణే కాయకృచ్ఛ్రఫలం లభేత్॥ ఇతికాయకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౨౫) ఇఁకను కాయకృచ్ఛ్రప్రత్యామ్నాయ విధానమును జెప్పుచున్నాఁడు॥ కాయకృచ్ఛ్రప్రత్యామ్నాయము కాయకృచ్ఛ్రమువలె సకల పాపములను నశింపఁజేయును. దూడలతోఁగూడినవియును, సకలభూషణములచేతను నలంకరింపఁబడినవియును నగు పదిగోవులను కాయకృచ్ఛ్రమునకుబదులుగ దానముసేయవలయును. ఇదియేకాయకృచ్ఛ్రప్రత్యామ్నాయమని దేవలుఁడువచించె. గాలవుఁడును నీవిధముగా నేవచించె. కణ్వుఁడును నీవిధముగా నే నిర్వచించె.

## ❋ అతికృచ్ఛ్రలక్షణమ్. ❋

(౫౨౬) అథాతికృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ అథాతికృచ్ఛ్రం వక్ష్యామి సర్వపాపాపశాంతిదమ్। సర్వకృచ్ఛ్రప్రదం స్వర్గాణాం శృణు రామ ప్రయత్నతః॥ అతికృచ్ఛ్రస్య మాహాత్మ్యం వర్ణితుం నైవ శక్యతే। పురా హి కౌశికో నామ ఋషిర్ధర్మపరాయణః॥ వసిష్ఠాత్మజఘాతీ స్యాత్తస్మాత్తారణతః ప్రభో। తేషాం హత్యా వినాశార్థం కృచ్ఛ్రమాహ ప్రజాపతిః॥ బ్రహ్మహత్యా గురోర్హత్యా భ్రూణహత్యా సుహత్తరా। కన్యాహత్యా సతీహత్యా తథా స్త్రీయా మహత్యపి॥ వీరహత్యా ధేనుహత్యా గజాశ్వమహిషీవధః। తృణకాష్ఠద్రుమచ్ఛేదస్సస్యారామాదిభేదనమ్॥ తటాకకూపకాసారభేదనం దేవవేశ్మనామ్। గృహదాహాద్ధ్వజక్షేత్రహరణం పాపవర్ధనమ్। ధాన్యారామాదిదహనం దాహనం మహిషీగవామ్॥ శృంగలాంగూలవిచ్ఛేదః తథా తేషాం చ మర్దనమ్। శుకచాషభుజంగానాం మీనహంసశునామపి॥ కుక్కుటానాం చ కాకానాం హింసనం మృగమారణం। దారుచ్ఛేదః కవాటస్య వాపీనాం చ విభేదనం॥ దాహనం వనపర్ణానామార్ద్రాణాం మహాభూమిప। సర్వేషామేవ హింసానామతికృచ్ఛ్రం విశోధనమ్॥ సర్వకృచ్ఛ్రప్రదం చైవ సర్వోపద్రవనాశనమ్॥ గాలవః॥ అతికృచ్ఛ్రస్య మహాతః తత్ప్రకార ఇహోచ్యతే। అప్రమాత్రయవాన్ ముద్గాన్ శ్యామాకాన్ తండులానపి॥ ఏకద్రవ్యం సమాదాయ వ్రతాదౌ పూర్వవచ్చరేత్। పూర్వవదితి స్నానసంకల్పాది॥ భాగత్రయం తదా కృత్వా తండులాన్ పూర్వమానతః। వ్రతాదావమధ్యదివసే వ్రతాంతే పాచయేత్తు యః॥ వ్రతాదౌ భక్షయేద్భాగం సంపూర్వవద్వ్రతమాచరేత్। చతుర్థకాలభోజీ యాతే ప్రక్షాళ్య స్నానపూ

ర్వవత్॥ స్వపేద్దేవసమీపేతు నారాయణమనుస్మరన్ । తతఃప్రభాతేవిమలే సంధ్యాదీన్పూర్వవచ్చరేత్ ॥ నిరాహారస్తథాభూత్వా యావత్ప్రిస్రాది నాంతతా। తత్రైవభక్ష్యమోద్గ్రాసం ద్వితీయోక్తంవిచక్షణః॥ తత్రాపిపూర్వవత్కృత్వా ద్వాదశేఽహ్ని సెశుభమ్। తృతీయోక్తంతథాభుక్త్వా గౌరేకాంప్రసాతకృతా॥ బ్రహ్మకూర్చంతతఃపీత్వాశుద్ధిమాప్నోతిపూర్వజః । అతికృఛ్రమిదంస్వామునుక్తంమునిభిరాదరాత్॥ ఏతస్యాచరణేనైవ సర్వదోషాత్ప్రముచ్యతే॥ ఇత్యతికృచ్ఛ్రలక్షణమ్॥

(౫౨౬) ఇఁకనతికృఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు॥ అతికృచ్ఛ్రము సర్వపాపములను నశింపఁజేయును. మఱియును సర్వకృచ్ఛ్ర ఫలముల నిచ్చును. వసిష్ఠునిపుత్రులఁజంపినవాఁడగు కౌశికుఁడు స్వపాపనాశముకొఱకు నతికృచ్ఛ్రము నాచరించె. బ్రహ్మహత్య, గురుహత్య, భ్రూణహత్య, కన్యాహత్య, గజాశ్వమహిషీవధ, తృణకాష్ఠద్రుమచ్ఛేదము, ఆరామాదివిభేదనము, తటాకకూపకాసారభేదనము, దేవాలయనాశము, గృహదాహము, బ్రాహ్మణక్షేత్రహరణము, పాషండవర్ధనము, ధాన్యారామాదులనుదగులఁబెట్టుట, మహిషీగవాదులకొమ్ములకు ఘాతసేయుట, మఱియునట్టిపశువులనుగొట్టుట, శుకచాషభుజంగములను, మీనహంసశునకములను, కుక్కుటములను, కాకములను, మఱియు నితరములగుమృగములనుజంపుట, మొదలగు దుష్కృత్యములవలనఁ గలిగినపాపమును నతికృచ్ఛ్రముశాంతినిబొందించును. మఱియు నుసర్వోపద్రవములను నశింపఁజేయునని దేవలుఁడు వచించె. శుభ్రములగు యవలనైనను, శ్యామాకములనైనను, తండులములనైనను, పూర్వోక్తప్రకారముగ సంపాదించి వ్రతాదియందు మునుపటివలె సంకల్పాదికమును జేసి యాతండులములను మూఁడుభాగములను జేసి వ్రతాదియందును, వ్రతమధ్యమందును, వ్రతాంతమునందును పచనముచేయవలయును. సూర్యుఁడు మందగతి బొందిన పిదప భుజించి దేవసమీపమునందు నారాయణ స్మరణను జేయుచు భుజింపవలయును. ఇట్లు పదిరెండుదినములదనుక పూర్వోక్తప్రకారముగ వ్రతాచరణను జేసి వ్రతాంతమందుగోదానమును జేసి పిమ్మటబ్రహ్మకూర్చపానమును జేయవలయును. ఇట్లు సేసినవాఁడు పావనుఁడగుననియు ను, ఇదియేయతికృచ్ఛ్రమనియును గాలవుఁడుచెప్పె.

—— అతికృచ్ఛ్రప్రత్యామ్నాయః. ——

(౫౨౭) అథాతికృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ అతికృచ్ఛ్రస్యమహాతః ప్రత్యామ్నాయోమునీషిభిః। ప్రోక్తస్సర్వహితార్థాయసర్వపాప

ప్రణాశనః॥ సంకలీకరణానాంచ కన్యాధన్యాదివిక్రయే। తిలతండులధాన్యానాం ఫలానాంరసవిక్రయే॥ మహాపాతకజాతానాం శోధనంపాపనాశనమ్॥ ప్రత్యామ్నాయమాహ॥ మార్కండేయః॥ ప్రత్యామ్నాయమిమంరాజన్ వక్ష్యామిశృణుపార్థివ। యదాచరణమాత్రేణ అతికృచ్ఛ్రఫలంలభేత్॥ దశగావఃప్రదాతవ్యావస్త్రైస్సమలంకృతాః। సాధువృత్తాఃపయస్విన్యో విప్రేభ్యశ్చపృథక్పృథక్॥ మనుః॥ అతికృచ్ఛ్రస్యమహతః ప్రత్యామ్నాయం శృణుష్వమే। విప్రేభ్యోదశగావస్తాః పూర్వతస్సాజితాశ్శుభాః॥ స్వర్ణశృంగాదిభిస్సమ్యగ్భూషయిత్వాపృథక్పృథక్। శుచిభిశ్చప్రదాతవ్యావిప్రేభ్యో వేదవిత్తమైః॥ ఇమముక్తేనమార్గేణకృత్వాకృచ్ఛ్రఫలంలభేత్॥ ఇత్యతికృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౨౭) ఇఁకనతికృచ్ఛ్ర ప్రత్యామ్నాయమును జెప్పుచున్నాఁడు॥ సర్వజనులయొక్కయు హితముకొఱకు గొప్పదగునతికృచ్ఛ్రమునకుఁ బ్రత్యామ్నాయముచెప్పఁబడినది. అయ్యది సర్వపాపములను నశింపఁజేయునని దేవుఁడుఁడువచించె. వస్త్రాదులచేత నలంకరింపఁబడిన పదిగోవులను దానముసేయుటయే, అతికృచ్ఛ్రప్రత్యామ్నాయమని మార్కండేయుఁడువచించె. మనువున నీవిధముగానే వచించె.

## ఔదుమ్బరకృచ్ఛ్రలక్షణమ్.

(౫౨౮) అథఔదుమ్బరకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ ఔదుమ్బరస్యకృచ్ఛ్రస్యలక్షణం వచ్మితత్త్వతః। కృచ్ఛ్రంమహత్తరంభూప సర్వపాపహరంపరమ్॥ పితృమాతృపరిత్యాగసోదరాశ్చాపిబాలిశాః। భగినీభాగినేయాద్యాగర్భిణ్యాతురకన్యకాః॥ బాలాశ్చకులవృద్ధాశ్చ తిథయోభ్యాగతాఃప్రభో। సామర్థ్యేపతిబంధూనాం త్యాగదోషోమహత్తరః॥ బ్రహ్మహత్యామవాప్నోతి యతోపేక్షాపరాయణః। భగినీంచస్వసారంచ హ్యనాథాంగతభర్తృకామ్॥ పుత్రీమనాథాంవిధవాం యస్త్యజేత్కారణంవినా। పితుర్మాతుశ్చభగినీమపుత్రాంగతభర్తృకామ్॥ అనాథాంయఃపరిత్యజ్య స నైనరకమశ్నుతే॥ మహాభారతే॥ పితారక్షతికౌమారే భర్తారక్షతియౌవనే। పుత్రస్తుస్థావిరేభావే నస్త్రీస్వాతంత్ర్యమర్హతి॥ ఉన్మత్తంపతితంక్లీబంకానీనంబధిరమేవచ। పుత్రార్థీయత్నతోరక్షేదన్నవస్త్రాదిభిశ్శనైః॥ గౌతమః॥ అరక్షణీయాన్యాంస్తేషుప్రక్షణీయాన్పరిత్యజేత్। సనైనరకమాప్నోతి తిర్యగ్యోనిషుజాయతే॥ వేశ్యాదాసీతన్మాతరస్తత్పుత్రాఃకుండగోళకాః నటనర్తకగాయకాశ్చారువాకాశ్చారక్షణీయాః॥ అనాథాగతభర్తృకాః నిష్పుత్రాఃపితృవ్యజ్యే

ష్ఠభాగ్రిత్రాదయః నిష్పుత్రాఃసిద్ధరాః కాణకుబ్జాదయః॥ ఏతేవై యత్నతోరక్ష్యాః। ఏతేషాంపరిత్యాగే దోషంతత్ప్రాయశ్చిత్తంచాహ ॥ మార్కండేయః॥ సామర్థ్యేసతియస్త్వేతేష్యేదేతాన్బంధుజనాన్స్వకాన్। కాకయోనింసమాసాద్య దుఃఖభూయాత్పునఃపునః॥ మాసంత్యక్త్వాపంచగవ్యం షణ్మాసం స్వర్ణకృచ్ఛ్రకృత్ । వర్షంత్వౌదుమ్బరంప్రోక్తం తతశ్చాంద్రాయణంస్మృతమ్॥ ఔదుంబరకృచ్ఛ్రమాహ॥ పరాశరః॥ అప్రపన్నయంతండులాన్వా శ్యామాకాంత్స్యాయవానపి। సంవిభజ్యద్వాదశధా ప్రత్యహంపాచయేద్వ్రతీ॥ ఔదుమ్బరైఃపుష్పపర్ణైః పాచయేన్నాన్యదారుభిః । ఔదుమ్బరైరార్ద్రపర్ణైః కృత్వార్ణపుటంముదా॥ తత్రనిక్షిప్యసంగ్రాహ్యంనిష్ణవేపూర్వమాదిశేత్ । చతుర్థకాలఆయాతే పూర్వవన్నియమంచరేత్॥ భక్షయేదుత్తమంగ్రాసంమానవ్రతపరాయణః। పాదౌప్రక్షాల్యపాణీచ ద్విరాచమ్యవిధానతః॥ సాయాహ్నికంతతఃకృత్వా స్వపేన్నారాయణాగ్రతః। పునఃప్రభాతేవిమలే ద్వితీయంపూర్వవచ్చరేత్॥ గ్రాసపచననియమాదికమిత్యర్థః॥ ఏవంద్వాదశగ్రాసాంశ్చ ద్వాదశాహస్సుభక్షయేత్। తత్రైగ్రికాగాఃప్రదాతవ్యాఃపంచవస్త్రాణి చేత్తః॥ ఏవమౌదుంబరంకృచ్ఛ్రం కృత్వాశుద్ధిమవాప్నుయాత్ ॥ ఇత్యౌదుమ్బరకృచ్ఛ్రలక్షణమ్॥

(౫౭౮) ఇఁకను, ఔదుంబరకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు. ఔదుంబరమను కృచ్ఛ్రము సర్వపాపములను నశింపఁజేయును. తగినసామర్థ్యముగలిగియున్నప్పుడు తల్లిదండ్రులను, బాలురను, కులవృద్ధులను, అతిథులను, అభ్యాగతులను, బంధువులనువదలినవాఁడు బ్రహ్మహత్యకుఁదుల్యమైన పాపమునుబొందును. నిష్కారణముగ భర్తృరహితను నక్క సెల్లెండ్రను, పుత్రికనువదలినవాఁడు నరకలోకమునుబొందునని దేవలుఁడువచించె. స్త్రీలను బాల్యమునందుఁ దండ్రియును, యౌవనమునందు భర్తయును, ముసలితనమునందు పుత్రులును, రక్షింపవలయును. ఉన్మత్తుని, పతితుని, క్లీబుని, కాణుని, బధిరుని, పుత్రార్థియగువాఁడు మెల్లఁగఁగాపాడవలయునని మహాభారతమునందుఁ జెప్పఁబడినది. రక్షింపఁదగనివారలను, రక్షించువారలను, రక్షింపఁదగినవారల వదలువారును, ఘోరనరకములననుభవించి పిమ్మటతిర్యగ్యోనులయందుఁబుట్టుదురు. వేశ్య, దాసి, వారలతల్లులు, వారిపుత్రులు, గండగోళకులు, నటనర్తకగాయకులు, చారువాకులును, రక్షింపఁదగిన వారుగాను అనాథలును, గతభర్తృకులును, నిష్పుత్రులును, పితృవ్యజ్యేష్ఠ భ్రాతృ లును, నిర్ధనులును, [illegible]  [illegible] ప్రయత్నపూర్వ

కముగ రక్షింపఁదగినవారు. ఇట్లని గౌతముఁడువచించె. సామర్థ్యము గలిగి యుండియును, బంధుజనులనువదలినవారు, కాకయోనియందుఁబుట్టుదు రని చెప్పఁబడియుండవలయును. నెలదినములు వదలినవాఁడు పంచగవ్య ప్రాశనను జే యవలయును. ఆరుమాసములు వదలినవాఁడు స్వర్ణకృచ్ఛ్రమునాచరింపవ లయును. సంవత్సర కాలము వదలినవాఁడౌదుంబరకృచ్ఛ్రము నాచరింపవ లయును. సంవత్సరానంతరమందుఁగూడ వదలినవాఁడు చాంద్రాయణవ్రత మునాచరింపవలయును. ఇట్లని మార్కండేయుఁడువచించె. అపద్వయతం డులములనైనను, శ్యామాకములనైనను, యవలనైనను, పదిరెండుభాగము లుగవిభజించి ప్రతిదినమునందును బచనమును జేయవలయును. ఔదుంబరప ర్ణపుష్పాదులచేతఁ బచనమును జేయవలయును. పిమ్మట నౌదుంబర పర్ణము లచేత దొప్పనునిర్మించి దానియందాగ్రాసమునువైచి విష్ణువునకు నివేదించి సూర్యోదయమందగనిబొందినపిదపఁ బూర్వోక్తప్రకారముగ నియమవ్రత ములనవలంబించి మౌనవ్రతపరాయణుఁడై యుత్తమగ్రాసమును భుజింప వలయును. అనంతరమందు, పాదపాణిప్రక్షాళనమును జేసికొని రెండుప ర్యాయములాచమనమును జేసి పిమ్మట సాయాహ్నికము నాచరించి నారా యణసమీపమునందు నిద్రనుబొందవలయును. మరల మరుదినప్రాతఃకాల మునందును నిటులనే యాచరింపవలయును. ఒక్కొక్కదినమున నొక్కొ క్కగ్రాసముచొప్పునఁ బదిరెండుదినములకుఁ బదిరెండుగ్రాసములనుభక్షిం పవలయును. వ్రతాంతమందొక్క గోవును దానము సేయవలయును. ఇవ్వి ధముగ నౌదుంబరకృచ్ఛ్రమును జేసినవాఁడు పరిశుద్ధతనుబొందునని పరా శరుఁడువచించె.

—— ఔదుమ్బరకృచ్ఛ్రప్రత్యామ్నాయః. ——

(౫౬౯) అథౌదుమ్బరకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ ఔ దుమ్బరస్యకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయంపరంశృణు । వక్ష్యామీతి శేషః॥ య స్యాచరణమాత్రేణ సమ్పూర్ణఫలమశ్నుతే॥ మార్కండేయః॥ ప్రత్యామ్నా యఃపురారామభాషితో జమదగ్నినా । మాతృహత్యావిశుద్ధ్యర్థం కిముతా న్యస్యపాపినః॥ రాజవిజయే॥ కృచ్ఛ్రస్యౌదుమ్బరస్యాస్య ప్రత్యామ్నాయో మ హానయమ్ । సర్వపాపవిశుద్ధ్యర్థంస్మృతఃపద్మభువాపురా ॥ చతుర్వింశతిను తే॥ ఔదుమ్బరస్యకృచ్ఛ్రస్యప్రత్యామ్నాయంసలక్షణమ్। అష్టగావః ప్రదాత వ్యాస్సాలంకారాస్సలక్షణాః॥ హేమశృంగారౌప్యఖురాః కాంస్యదోహన సంయుతాః। తామ్రపృష్ఠాస్వర్ణఘంటా వస్త్రాభరణభూషితాః॥ ద్విజేభ్య

స్తాః ప్రదాతవ్యాస్సర్వలక్షణసంయుతాః। సర్వపాపవినిర్ముక్తస్సమ్పూర్ణఫలమశ్నుతే॥ కృచ్ఛ్రాచరణాసమర్థస్తత్ప్రత్యామ్నాయాచరణే సమ్పూర్ణకృచ్ఛ్రఫలమాప్నోతి॥ ఇత్యౌదుమ్బరకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౨౯) ఇఁకను, ఔదుంబరకృచ్ఛ్ర ప్రత్యామ్నాయమును గురించి చెప్పుచున్నాఁడు॥ ఔదుంబరకృచ్ఛ్రప్రత్యామ్నాయము నాచరించుట చేత సకల పాపక్షయముగునని దేవలుఁడు వచించె. మాతృహత్యవలనఁ గలిగిన పాపముగూడ నౌదుంబరకృచ్ఛ్ర ప్రత్యామ్నాయము నాచరించుటచేతశాంతింబొందునని మార్కండేయుఁడు వచించె. సకల పాపశాంతికొఱకు నౌదుంబరకృచ్ఛ్రప్రత్యామ్నాయము విధింపఁబడెనని రాజవిజయమునందుఁ జెప్పఁబడియె. ఔదుంబరకృచ్ఛ్రమునకు బదులుగ సర్వాలంకార శోభితములగు గోవుల నెనిమిదింటిని దానము చేయవలయునని చతుర్వింశతిమతమునందుఁ జెప్పఁబడియె.

## —* పర్ణకృచ్ఛ్రలక్షణమ్. *—

(౫౩౦) అథపర్ణకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ పర్ణకృచ్ఛ్రం ద్విజశ్రేష్ఠాశ్శృణ్వంతు పరమంశుభమ్। సర్వపాపప్రశమనం సర్వదోషాపశాంతిదమ్॥ బ్రహ్మహాక్షయరోగీస్యాత్సురాపీ శ్యావదంతకః। స్వర్ణస్తేయీతుకునఖశ్చర్మాగురుతల్పగః॥ అన్నహర్తాభవేద్గుల్మీ శాకస్తేయీతుదర్దురః। స్తేయినో ధాన్యరాశీనాం కండూతిస్సతతం ద్విజాః॥ తామ్రస్తేయీ దీర్ఘవృషణః ప్రమేహీపర్వమైథునీ। శిరోవ్రణీస్నానహీనః పిత్తవాక్ త్రపుసీసహా॥ కాంస్యస్తేయీదీర్ఘవృషణః శ్వేతవాక్ వస్త్రహా భువి। గజచర్మానాగహర్తా అశ్వహర్తామహావ్రణీ॥ కర్ణభూషణహారీస్యాద్గండమాలీమహాన్ భువి। రక్తప్రమేహీమనుజః పుష్పచస్యాంగనాగమః॥ భగినీగమనాద్భూయాత్ మధుమేహీభవేన్నరః। మాతుస్సపత్నీంభగినీం వ్రజేత్తాం మాతురోనరః। సపాపమనుభూయాశు రోగీభూయాద్భగందరీ॥ స్వసారం యః పుమాన్ గచ్ఛేజ్జాయతే మూత్రకృచ్ఛ్రవాన్। ధేనుహన్తామహాపాపీ హ్యశ్మరీరోగీభవేద్భువి॥ గోవత్సహననాన్మర్త్యస్సభూయాదర్శవాన్ భువి। శివనిర్మాల్యభోక్తాపిజాయతే హి కఫవాన్సదా॥ అజీర్ణరోగీశఠకృద్గృహదాహీప్రసూలిమాన్। బంధిగ్రహణజాద్దోషాజ్జాయతే శ్వాసకాసవాన్॥ స్త్రీ గర్భాభవేత్సాతు బాలకంహంతియావిషైః। అన్యమాలింగతేనారీ సావైస్ఫోటస్తనీభవేత్॥ క్షీరంముష్ణాతియానారీ తేనహీనాస్యజన్మని। పతివ్రతాపహారీచకషణవ్రణరోగవాన్॥ వినవాసంగజాద్దోషాచ్ఛిన్నజిహ్వా ... పురస్తేయీవానక్రనాసః కోశ

స్తేయీతు పెటవాన్॥ గన్ధస్తేయీతు దుర్గన్ధః కాముకస్సంతతజ్వరీ । వివాహవిఘ్నకృన్మర్త్యో జాయతే నాసహీనవాన్॥ మయూరహననాన్మర్త్యః జాయతే కృష్ణబిందుకః । తటాకారామవిచ్ఛేదీ సదాదుఃఖభవేన్నరః॥ ఇత్యేవమాదయో దోషాః మహానరకదాన్నృణామ్। ఏతేషాం శోధనార్థాయ పర్ణకృచ్ఛ్రం సమాచరేత్॥ మార్కండేయః॥ మహాపాతకజాలానాం లఘూనాం చ గరీయసామ్। ఆర్ద్రాణాం చైవ శుష్కాణాం పర్ణకృచ్ఛ్రః శోధనమ్ ॥ పర్ణకృచ్ఛ్రలక్షణమాహ॥ పరాశరః॥ బ్రహ్మవృక్షస్య పర్ణాని మధ్యమాని ద్విజోత్తమః। ద్వాదశాహాబ్దపర్యంతం నిత్యం శుచిరలంకృతః॥ పూర్వవద్విష్ణుమభ్యర్చ్య రవిరస్తంగతో యదా। త్రిభిః పత్రైః బ్రహ్మభూతైః కృత్వా చైవ పుటత్రయమ్॥ త్రీణి వేశ్మాని విప్రాణాం వేదాధ్యయనశాలినామ్ । భిక్షాత్రయం సమానీయ త్రిషు పత్రపుటేష్వపి। ఏకం పుటస్థం దేవాయ పిత్రే చైకం సమర్పయేత్ । అవశిష్టం తదాశ్నీయాద్ధరినామపరాయణః॥ స్వపేద్దేవసమీపేతు సంచింత్య మనసా హరిమ్। తతః ప్రభాతవేళాయాం పూర్వవత్సకలంచరేత్॥ ప్రాయదేయాగారేకా పంచగవ్యం పిబేత్తతః । పర్ణకృచ్ఛ్రమిదం భూప శోధనం పాపకర్మిణామ్॥ యస్యాచరణమాత్రేణ చాంద్రాయణఫలం లభేత్ ॥ ఇతి పర్ణకృచ్ఛ్రలక్షణమ్॥

(౫౩౦) ఇఁకను పర్ణకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు॥ పర్ణకృచ్ఛ్రము సకలపాపములను నశింపఁజేయును. బ్రహ్మహత్యచు జేసినవాఁడు క్షయరోగముగలవాఁడగును. మద్యపానమును జేసినవాఁడు శ్యావదంతకుఁడగును. బంగారమును దొంగిలించినవాఁడు కుత్సితములైన గోళ్లుగలవాఁడగును. గురుతల్ప గమనమును జేసినవాఁడు దుశ్చర్మగలవాఁడగును. అన్నమును దొంగిలించినవాఁడు గుల్మరోగము గలవాఁడగును. కూరను దొంగిలించినవాఁడు దర్దురరోగము గలవాఁడగును. ధాన్యరాసులను దొంగిలించినవాఁడు సర్వకాలములయందును కండూతిగలవాఁడగును. తామ్రమును దొంగిలించినవాఁడు దీర్ఘవృషణములు గలవాఁడై పుట్టును. పర్వములయందు మైథునమును జేయువాఁడు ప్రమేహరోగముగలవాఁడై పుట్టును. స్నానహీనుఁడు శిరోవ్రణముగలవాఁడగును. పైత్రపుసీసములను దొంగిలించినవాఁడు పైత్యరోగము గలవాఁడగును. కంచును దొంగిలించిన వాఁడు దీర్ఘవృషణములు గలవాఁడగును. వస్త్రములను దొంగిలించినవాఁడు శ్వేతకుష్టుగలవాఁడగును. ఏనుగును దొంగిలించినవాఁడు, ఏనుఁగు చర్మముగలవాఁడైపుట్టును. అశ్వము నపహరించినవాఁడు మహావ్రణము గలవాఁడగును. కర్ణభూషణ

ములను దొంగిలించినవాఁడు గండమాలరోగము గలవాఁడగును. పుష్పవతి యగు నంగనను బొందినవాఁడు రక్తమేహరోగము గలవాఁడగును. భగినీ గమనమును జేసినవాఁడు మధుమేహరోగముగలవాఁడై పుట్టును. సవతితల్లి ని బొందినవాఁడు భగందరరోగముగలవాఁడగును. చెలియలిని బొందినవాఁడు మూత్రకృచ్ఛ్రరోగము గలవాఁడగును. ధేనువును జంపినవాఁడు...రోగముగ లవాఁడగును. గోవత్సమును జంపుటవలనను గూడ నక్ష్మరోగముగలవాఁడగు ను. శివనిర్మాల్యము నపహరించినవాఁడు హిక్కారోగము గలవాఁడగును. శరకృత్తకుఁడు...జీర్ణరోగము గలవాఁడగును. గృహమును దగులఁబెట్టువాఁడు శూలరోగము గలవాఁడగును. బందీగ్రహణమువలనఁ గలిగినదోషముచే త శ్వాసకాస రోగము గలవాఁడగును. గర్భస్రావమును జేసికొనిన యాఁడుదియును, భాతరను జంపినదియును, అన్యపురుషసంయోగమునుబొందిన దియును, నగు నాఁడుది విస్ఫోటస్తనములు గలదియగును. క్షీరమును దొంగిలిం చినయాఁడుది వేరొకజన్మమునందు క్షీరములు లేనిదియగును. పతివ్రతను న పహరించినవాఁడు కషణవ్రణరోగముగలవాఁడగును. విధవాసంగమమును జేసినందువలన శిశ్నదేశమునందు వ్రణముగలవాఁడగును. పుష్పములను దొంగిలించువాఁడు వక్రనాసుఁడగును. కోశమును దొంగిలించినవాఁడు పేట వంతుఁడగును. గంధమును దొంగిలించినవాఁడు దుర్గంధము గలవాఁడగును. కాముకుఁడు సర్వకాలములయందును జ్వరముగలవాఁడగును. వివాహము నకు విఘ్నమును గలుగఁజేసినవాఁడు భార్యాహీనుఁడగును. నెమళులను జం పినవాఁడు కృష్ణబిందుకుఁడై పుట్టును. తటాకారామములను భేదించువాఁడు దుఃఖవంతుఁడై పుట్టును. ఈదోషములన్నియును గొప్పవగు నరకములనుగ లుగఁజేయును. కావున నీదోషములన్నియు శాంతినిబొందుటకు పర్ణకృచ్ఛ్ర మునాచరింపవలయునని దేవలుఁడు వచించె. మహాపాతకసముదాయము లను, లఘుపాతకములను, గురుపాతకములను, ఆర్ద్రపాతకములను, శుష్క పాతకములను, పర్ణకృచ్ఛ్రమునాశమునుబొందించునని మార్కండేయుఁడు వచించె. పదిరెండు సంవత్సరముల కాలము శుచియైయుండి బ్రహ్మవృక్ష మునొక్క మధ్యమపర్ణముల చేత మూఁడుదొన్నెలను నిర్మించి పూర్వోక్త ప్రకారముగ విష్ణువునర్చించి సూర్యుఁడస్తమయమును బొందునపుడు మూఁ డగుబ్రాహ్మణగృహములకుఁబోయి యామూఁడు పాత్రలయందును భిక్షాన్న ము నుబెట్టి యొక్కపాత్రను విష్ణువునకునివేదించి రెండవపాత్రనతిథికొ సంగి మూఁడవపాత్రలోని యన్నమును దానుభుజింపవలయును. ఇట్లుప

దిరెండుసంవత్సరములు వ్రతాచరణను జేసి వ్రతాంతమందు గోదానమును జేయవలయును, పిమ్మటఁబంచగవ్యప్రాశనను జేయవలయును, ఇయ్యదిపర్ణకృఛ్రమని చెప్పఁబడియె. దీనినాచరించుటచేత చాంద్రాయణఫలముగలుగునని పరాశరుఁడువచించె ॥

## —— పర్ణకృచ్ఛ్రప్రత్యామ్నాయః ——

(౫౩౧) అథపర్ణకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ ॥ దేవలః ॥ పర్ణకృచ్ఛ్రస్యరాజర్షే ప్రత్యామ్నాయం వదామితే। సర్వపాపాపశమనం సర్వోపద్రవనాశనం ॥ సర్వకామప్రదం నృణాం సర్వకృచ్ఛ్రఫలప్రదం । పంచగావః ప్రదాతవ్యాస్సాలంకారాస్సవత్సకాః ॥ హేమశృంగాశ్శాప్యఖురాః కాంస్యదోహనసంయుతాః । సాధుశీలా యువత్యశ్చవిప్రేభ్యశ్చ పృథక్పృథక్॥ పర్ణకృచ్ఛ్రస్యవిప్రర్షే ప్రత్యామ్నాయోమహత్తరః ॥ ఇతిపర్ణకృచ్ఛ్రప్రత్యామ్నాయః ॥

(౫౩౧) ఇకనుపర్ణకృఛ్రప్రత్యామ్నాయ విధానమును జెప్పుచున్నాడు ॥ పర్ణకృఛ్రప్రత్యామ్నాయము సర్వపాపములను నశింపఁజేయును, మఱియును సర్వోపద్రవములనునశింపజేయును, సమస్తాభీష్టములనునొసంగును, సర్వకృఛ్రఫలమునునిచ్చును, సర్వాలంకారములతోడను, వత్సలతోడను గూడినయైదుగోవులను దానముచేయవలయును, ఇయ్యదిపర్ణకృఛ్రప్రత్యామ్నాయమని దేవలుఁడువచించె॥

## —— ఫలకృచ్ఛ్రలక్షణం ——

(౫౩౨) అథఫలకృచ్ఛ్రలక్షణమాహ ॥ దేవలః॥ ఫలకృచ్ఛ్రస్యదేవర్షేలక్షణం కథ్యతేమయా । శృణు బ్రహ్మమునే చిత్రం సర్వపాపప్రణాశనం॥ యే మాతృఘాతినో లోకే యేవావైపితృఘాతకాః । యేవాన్యభ్రాతృహంతారస్తేషామేతద్వినిష్కృతిః ॥ యాశ్చనార్యః పతింత్యక్త్వాపరమంతేఽన్యాన్జనానాశ్రితాః । తాసామపీదం శుద్ధ్యర్థం పురాసృష్టంస్వయంభువా॥ యేవాగర్భవిభేత్తారో యేవాస్యుర్గరదాయినః । యేవాగ్రామవిభేత్తారో యేవాకులజభేదినః । యేబ్రహ్మఘాతాఃపిశునాలోకేస్యుస్తేయినస్తథా। యేవాబాలవిభేత్తారస్తేషామేతద్వినిష్కృతిః ॥ ఉచ్ఛిష్టభోజినోయేచ యేచమిథ్యాభివాదినః । యేవైరుణపహంతారస్తేషామేతద్వినిష్కృతిః ॥ మద్యపానరతానిత్యం నిత్యంకర్మవిభేదినః। పితృశ్రాద్ధవిభేత్తారస్తేషామేతద్వినిష్కృతిః॥ మహాపాతకయుక్తోవా యుక్తోవాసర్వపాతకైః । కృచ్ఛ్రేణైతేనమహాత్మా సర్వపాపైఃప్రముచ్యతే ॥ మహాంతిపాపకర్మాణి మహాపాపరతాస్సదా।

యే తేనకృచ్ఛ్రరాజేన పునంతిసతతంద్విజాః ॥ ఫలకృచ్ఛ్రంమహాపాపహారి సమ్పత్ప్రవర్ధనం । దినేదినేమునీంద్రాశ్చ కృత్తైవతచ్ఛుద్ధిమాప్నుయుః ॥ కాయశుద్ధిప్రదంకృచ్ఛ్రం సర్వకృచ్ఛ్రఫలప్రదం । సర్వపాపహరంచైదం ఫలకృచ్ఛ్రంమహత్తరం ॥ ఫలకృచ్ఛ్రప్రకారమాహ॥ దేవలః ॥ ప్రాతస్స్నాత్వా శుచిర్భూత్వా పూర్వవచ్ఛుద్ధిహేతవే । తావజ్జపన్సదాతిష్ఠేద్యావదస్తమితోరవిః ॥ తావద్రాత్రౌస్థిరమనానిత్యకర్మసమాపయేత్ । కదళీఫలమేకంచవిష్ణవే తన్నివేదయేత్ ॥ తదేవభక్షయేత్పూర్వం తద్రాత్రౌమౌనపూర్వకమ్ । ఏకైకబీజసమ్పూర్ణం భక్షయిత్వాఫలత్రయం ॥ చూతఫలైర్వినా । ఏవం ద్వాదశరాత్రాణి స్వపేన్నారాయణాగ్రతః। గోర్దేయావిప్రవర్యాయబ్రహ్మకూర్చంపిబేత్తతః ॥ ఫలకృచ్ఛ్రమిదంసర్వం కథితంబ్రహ్మణోదితం । కృచ్ఛ్రస్యైతస్య మాహాత్మ్యన్నశక్యత్యేవమహాద్భయం ॥ ఇతి ఫలకృచ్ఛ్రలక్షణం॥

(౫౩.౨) ఇకఫలకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు॥ ఫలకృచ్ఛ్రముసర్వపాపములను నశింపఁజేయుటకు సమర్థమైనదగును, మాతృఘాతకులును, పితృఘాతకులును, భ్రాతృఘాతకులును, ఫలకృచ్ఛ్రము నాచరించుటచేతఁ బావనులగుదురు, భర్తనువదలియన్యపురుషులను బొందునట్టి స్త్రీలుగూడ ఫలకృచ్ఛ్రమునాచరించుటచేతఁ బావనులగుదురు. మఱియును, గర్భములకు భేదమును గలుగఁజేయువారును, విషమునుబెట్టువారును, గ్రామములను బ్రద్దలుసేయువారును, కులమునందుఁబుట్టినవారలను భేదించువారును, బ్రహ్మహత్యను జేయువారును, పైశున్యముగలవారును, దొంగతనమును జేయువారలును, బాలఘాతకులును, ఉచ్ఛిష్టమునుభుజించువారును, మిథ్యావాదములను జేయువారలును, కుణపఘాతకులును, మద్యపానరతులును, నిత్యకర్మలను భేదించువారును, పితృశ్రాద్ధవిభేత్తలును, మహాపాతకయుక్తులును, సర్వపాతకయుక్తులును, ఫలకృచ్ఛ్రమునాచరించుటచేతఁ బావనులగుదురు, మరియు నీఫలకృచ్ఛ్రము కాయకృచ్ఛ్రమునుగలుగఁజేసి సర్వకృచ్ఛ్రఫలమును నొసంగునని దేవలుఁడువచించె. ప్రాతఃకాలమునందు స్నానమును జేసి పరిశుద్ధుఁడై పూర్వోక్తప్రకారముగ సూర్యుఁడుముదమును బొందువరకును జపమును జేసి యొక కదళీఫలమును విష్ణువునకునివేదించి మౌనపూర్వకముగ భక్షణను జేయవలయును, ఈప్రకారముపదిరెండుదినములు సేయుచు నారాయణసమీపమునందు నిదురను బొందవలయును, వ్రతాంతమందు గోదానమును జేసి బ్రహ్మకూర్చమును పానముసేయవలయును, ఇట్టిఫలకృచ్ఛ్రమువలన సకలపాపములును నశించునని దేవలుఁడువచించె ॥

—— ఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయః ——

(౫౩౩) అథఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ ॥ దేవలః॥ కృచ్ఛ్రస్యతస్యమునయః ప్రత్యామ్నాయం మహత్తరం । శృణ్వంతుసర్వపాపఘ్నం సర్వశ్రేయఃప్రదంనృణాం॥ పురాహిగాలవోనామ బ్రహ్మహత్యాభయాతురః । విష్ణుంశరణమాపేదే సర్వలోకహితైషిణం ॥ అనుగ్రాహ్యోస్మిభగవన్ త్వయాలోకహితైషిణా । రక్షమాందేవదేవేశత్వదంఘ్రింశరణాగతం॥ బ్రహ్మహత్యాదిపాపానాంస్మరణంనాశహేతుకం। అతస్త్వత్పాదయుగళం ద్రక్ష్యామిపురుషోత్తమ॥ విప్రహత్యా మహత్యాసీన్మయిదుర్నిందయాప్రభో। నాస్తినిందాసమంపాపం నాస్తిక్రోధసమోరిపుః ॥ నాస్తిమోహసమఃపాపో నదైవంకేశవాత్పరం ॥ విష్ణుః ॥ నాస్తిక్రోధసమోమృత్యుః నాస్త్యకీర్తిసమంభయం । నాస్తికీర్తేస్సమంధర్మ్యం తపోనానశనాత్పరం ॥ ప్రత్యహం త్రిషవణస్నానం కృత్వామాం మనసిస్మరన్ । ఫలకృచ్ఛ్రం పురా కుర్యాదశక్తోయది గాలవ ॥ ప్రత్యామ్నాయమిమం కృత్వాశుద్ధోభవతిపాతకాత్। గోత్రయం సాధుసంయుక్తం ధూపదీపనివేదనైః ॥ పరిక్రమ్యనమస్కృత్యసవత్సాంపయస్విం తాం । యోదద్యాద్విప్రవర్యాయ ప్రత్యామ్నాయం ఫలప్రదం ॥ సంపూర్ణఫలకృచ్ఛ్రస్యహ్యఖండం లభతేనరః । ఏవంకురుత్వంవిప్రషేపూతోభవసితత్క్షణాత్ ॥ ఇత్యాజ్ఞప్తస్తదాతేన ప్రత్యామ్నాయంతదాచరన్ । శుద్ధిమాప్నోత్సమహతీం యోగినామపిదుర్లభాం॥ ఇతిఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయః ॥

(౫౩౩) ఇఁకనుఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయ విధానమును జెప్పుచున్నాఁడు॥ ఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయము ఫలకృచ్ఛ్రమువలె సకలపాపములనునశింపజేయును, తొల్లి గాలవుఁడను బ్రాహ్మణుఁడుబ్రహ్మహత్యాభయాతురుఁడైసర్వలోకములకును మేలునుఁ జేయునట్టి నారాయణునిశరణునుబొంది, పిమ్మటనారాయణుననేకవిధముల బ్రార్థించెనని దేవలుఁడువచించె. అట్లుప్రార్థించుటచేత నారాయణుఁడు సంతోషమునుబొంది యతనిపాపనాశమునకు ఫలకృచ్ఛ్రప్రత్యామ్నాయమునాచరించె. ఆదియెట్లనిన దూడతోఁగూడినదియును, క్షీరములనిచ్చుచున్నదియును, సర్వాలంకారశోభిత మైనదియునగు నాకఁగోవును దానముసేయువలయును, ఇట్లుసేసితివేని పవిత్రుఁడవగుదువని విష్ణుదేవుఁడువచించె. అనంతరమందాగాలవుఁడట్లొనరించి పావనుఁడయ్యెనని దేవలుఁడువచించె ॥

## మాహేశ్వరకృచ్ఛ్రలక్షణం

(౫౩౪) అథ మాహేశ్వరకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ కృచ్ఛ్రం మాహేశ్వరం నామ సర్వపాపప్రణాశనం। పురా కందర్పదహనే మహాదోషో భవచ్ఛివే॥ తద్దోషపరిహారార్థం బ్రహ్మాణం పర్యపృచ్ఛత। పంచబాణస్య దహనాన్మహాదోషోమయి స్థితః॥ తద్దోషపరిహారార్థం నిష్కృతిర్దేవ కథ్యతాం॥ బ్రహ్మ॥ సర్వదోషప్రశమనం సర్వోపద్రవనాశనం। సర్వపుణ్యఫలం నృణాం సర్వస్నానఫలం మహత్॥ ప్రాతస్స్నాత్వా యథాచారం దంతధావనపూర్వకం। శుద్ధవస్త్రమలంకృత్య ధృత్వా పుండ్రాదికం ముదా॥ నిత్యకర్మసమాప్యాదౌ సంకల్పం పూర్వవచ్చరేత్। తావన్నారాయణం స్మృత్వా పూర్వవత్పాపమోచనం॥ యదా మందాయతే భానుస్తదా కాపాలమద్వహేత్। శ్రోత్రియాణాం చ విప్రాణాం గృహేషు త్రిషు సంఖ్యయా॥ శాకం భైక్షం ఫలం వాపి యథాసమ్భవమాదరాత్। ఆనయిత్వాథ దేవాయ సమర్ప్య విధిపూర్వకం॥ భక్షయేత్తాని సర్వాణి వాగ్యత ఉత్తరాన్ముఖః। హస్తౌ చ పాదౌ ప్రక్షాళ్య ద్విరాచమ్య శుచిస్తతః॥ సాయంకాలే స్వపేద్దేవసమీపే నియతో వశీ। తతః ప్రాతస్సముత్థాయ పూర్వవత్సర్వమాచరేత్॥ గౌరేకా ద్విజవర్యాయ దేయా కర్మఫలాప్తయే। పంచగవ్యం పిబేత్పశ్చాత్ కృచ్ఛ్రం మాహేశ్వరం త్విదం॥ కురుష్వ మే త్వం భగవన్ సర్వదోషోపశాంతయే। సర్వపాపవినిర్ముక్తస్సర్వశ్రేయోపపత్తయే॥ ఏవం శ్రుత్వా మహాదేవో మహేశానస్తథాకరోత్। ఏతస్యాచరణేనైవ ద్విజః పాపాత్ప్రముచ్యతే॥ ఇతి మాహేశ్వరకృచ్ఛ్రలక్షణం॥

(౫౩౪) ఇకను మాహేశ్వర కృచ్ఛ్ర విధానమును జెప్పుచున్నాడు॥ మాహేశ్వరకృచ్ఛ్రము సర్వపాపములను నశింపజేయును, తొల్లి శివదేవుడు మన్మథుండు తనదు పాపము వోవుటకు బ్రహ్మ నడిగె. అంతట బ్రహ్మదేవుడిట్లనియె. అయ్యా మన్మథా। సర్వదోషములను బోగొట్టునదియును, సర్వోపద్రవములను నశింపజేయునదియును, సర్వపుణ్యఫలము నిచ్చునదియును, సర్వతీర్థస్నానఫలమునొసంగునదియును, నగు మహేశ్వర కృచ్ఛ్రమునాచరింపవలయును, అది యెట్లనిన ప్రాతఃకాలమునకు ముందుగ స్నానమును జేసి పరిశుద్ధమగు వస్త్రమును ధరించి పుండ్రాదికమును ధరింపవలయును. పిమ్మట నిత్యకర్మలను సమాప్తినిబొందించి పూర్వోక్తప్రకారముగ సంకల్పమును జేసి పాపనివృత్తి కొరకు నారాయణస్మరణను జేయవలయును, పిమ్మట ననగా సూర్యుడు మందగతినిబొందిన పిమ్మట గపాలమును ధరించి శ్రోత్రియులగు బ్రాహ్మణులయొ

కల గృహములయందు మూడింటియందు భిక్షమునెత్తి యా మూడుగృహములలో లభ్యములైన శాకభక్ష్యాదులనుగొనివచ్చి విష్ణువునకు నివేదించి పిమ్మట వాజ్ఞియమము నవలంబించి వానినిభుజింపవలయును. పిమ్మటహస్త పాదప్రక్షాళనాదికమును పూర్వోక్తప్రకారముగ నాచరించి నారాయణ సమీపమునందు నిదురను బొందవలయును. మరల మరుదిన ప్రాతఃకాలము నందును నీవిధముగానే చేయవలయును. ఇట్లు పదిరెండుదినములు వ్రతమును సల్పిన పిమ్మట నొకకపిలగోవును దానముసేసి యనంతరమందుఁబంచగవ్యప్రాశనను జేయవలయును. ఇయ్యది మహేశ్వరకృచ్ఛ్రమనఁబడును. ఇయ్యది సర్వ పాపములనునశింపఁజేయునని బ్రహ్మదేవుఁడుసెప్పఁగానే మన్మథుఁడీమహేశ్వరకృచ్ఛ్రమునాచరించి సకలపాపవిముక్తుఁడయ్యె. కావునఁ దత్కృచ్ఛ్రమునాచరించినవాఁడు సకలపాపవిముక్తుఁడగునని దేవలుఁడువచించె.

## మాహేశ్వరకృచ్ఛ్రప్రత్యామ్నాయః.

(౫౩౫) అథమాహేశ్వర కృచ్ఛ్రప్రత్యామ్నాయమాహ॥ దేవలః॥ మాహేశ్వరస్యకృచ్ఛ్రస్య ప్రత్యామ్నాయంశృణుష్వమే। సర్వపాపాపశమనంసర్వకృచ్ఛ్రఫలప్రదం॥ బ్రహ్మహత్యాదిశమనంసర్వగ్రహనివారణం। తులాప్రతిగ్రహీతౄణాం పాపనాశనహేతుకం॥ సంధ్యాదినిత్యకర్మాణి పరిత్యక్తానిసూరిభిః। తేషాంవిశోధనేదత్తం సర్వపాపహరంనృణాం॥ గావోదేయా ద్విజాతిభ్యోహ్యర్చితావస్త్రభూషణైః। హేమఘంటాదిభిశ్శుభ్రైరలంకారైరలంకృతాః॥ స్వర్ణశృంగ్యోరౌప్యఖురాః కాంస్యదోహనసంయుతాః। రుద్రసంఖ్యాస్సవత్సాశ్చ పయస్విన్యఃపృథక్పృథక్॥ ప్రత్యామ్నాయేనధేనూనాం రుద్రసంఖ్యామహత్తరా। రుద్రకృచ్ఛ్రఫలప్రాప్త్యైసర్వపాపనుత్తయే॥ ఏవంకుర్యాద్ద్విజోయస్తు ప్రత్యామ్నాయం యథాగ్రహతః। తస్యసమ్పూర్ణకృచ్ఛ్రస్యఫలంమునిభిరీరితమ్॥ ఇతిమాహేశ్వరకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౩౫) ఇఁకను మాహేశ్వరకృచ్ఛ్రప్రత్యామ్నాయవిధిం జెప్పుచున్నాఁడు॥ మాహేశ్వరకృచ్ఛ్రప్రత్యామ్నాయము సకల పాపములనునశింపఁజేయును. మఱియును సర్వకృచ్ఛ్రఫలమునిచ్చును. బ్రహ్మహత్యాది పాపములను, సర్వగ్రహములను నివారించును. తులాప్రతిగ్రహము మొదలగువాని వలనఁ గలిగినదోషము శాంతమగును. సంధ్యాది నిత్యకర్మలనువదలుటచేతఁ గలిగినపాపమునుగూడ నాశమునుబొందించును. సర్వాలంకారములచేతను నలంకరింపఁబడిన పదునొకండుగోవులను దానముసేయవలయును. అనంత

రమందు పంచగవ్యప్రాశనను జేయవలయును. ఇదియే మాహేశ్వరకృచ్ఛ్ర ప్రత్యామ్నాయమని చెప్పఁబడును.

## ——— బ్రహ్మకృచ్ఛ్రలక్షణమ్. ———

(౫౩౮) అథ బ్రహ్మకృచ్ఛ్రలక్షణమాహ॥ ఉశనాః॥ శృణుధ్వమృషయస్సర్వే బ్రహ్మకృచ్ఛ్రస్యలక్షణమ్। దురన్నే నైవ యత్పాపం యత్పాపం దుష్ప్రతిగ్రహే॥ అపేయపానే యత్పాపం యత్పాపం దుష్టభోజనే। శాంత్యన్నేషు చ యత్పాపం యత్పాపం శూద్రభోజనే॥ సన్యాసినో మఠపతేర్భోజనేయద్భవేన్నృణామ్। యత్పాపం రజకస్యాన్నే పాపం వృషలభోజనే॥ యత్పాపం పుష్పవత్యన్నే యత్పాపం విధవాకృతే। అమంత్రికే పైతృకాన్నే తథా నారాయణే బలౌ॥ చౌలే చ పైతృకే చైవ దీక్షితస్యైవ భోజనే। దన్తపత్యోశ్చ యదుచ్ఛిష్టం తథా సన్యాసినో ద్విజాః॥ ప్రేతసంస్థితవిద్యాయాం యదన్నభోజనే నృప। సూతకద్వితయే చైవ తథా దుష్పంక్తిభోజనే॥ తథైవ దుష్టసంఘాన్నే తథా క్రీతాన్నభోజనే। పాపం పర్యుషితాన్నే చ తద్రసస్యతు భోజనే॥ యత్పాపం పూతిగంధే చ యత్పాపం క్షీరభోజనే। యత్పాపమన్యతే ప్రోక్తమాపాసనవివర్జనే॥ ఏవమాదీని పాపాని లఘూని చ మహాంతి చ। శుష్కాణ్యార్ద్రాణి పాపాని మనోవాక్కాయకర్మభిః॥ సర్వేషాం పాపనాశాయ బ్రహ్మకృచ్ఛ్రం ప్రకల్పితమ్। తత్స్వరూపమాహ॥ మార్కండేయః॥ గోమూత్రం గోమయం క్షీరం దధిసర్పిః కుశోదకమ్। సమ్పాద్య పూర్వమానేన ప్రత్యహం శుద్ధిపూర్వకమ్॥ ద్వాదశాహం చరేత్కృచ్ఛ్రం పూర్వవత్సాధనమాచరేత్। ప్రాతస్స్నాత్వా యథాకాలం నిత్యకర్మ సమాప్య చ॥ దేవాగారేఽథవా గోష్ఠే పఞ్చగవ్యం పిబేద్వ్రతీ। గోమూత్రం మాషకాణ్యష్టౌ గోమయస్య తు షోడశ॥ క్షీరం మాషాష్టకం జ్ఞేయం దధిమాషత్రయం తథా। ఘృతం మాషత్రయం ప్రోక్తం తథా శుచిజలం మునే॥ తత్తన్మంత్రేణ సంయోజ్య తత్తన్మంత్రేణ హావయేత్। హోమశేషం పిబేత్పశ్చాద్రవౌ మధ్యాహ్నగే సతి॥ ఆసాయం మనసా విష్ణుం స్మరన్ సర్వేశ్వరం విభుమ్। స్వపేద్దేవసమీపే తు గంధతాంబూలవర్జితః॥ తతః ప్రాతస్సముత్థాయ పూర్వవద్వ్రతమాచరేత్। ఏవం ద్వాదశరాత్రాణి చరేద్వ్రతమనుత్తమమ్॥ మహాపాపం చోపపాపం యద్యత్పాపమనుత్తమమ్। తత్సర్వం విలయం యాతి పావకే తూలరాశివత్॥ ఇతి బ్రహ్మకృచ్ఛ్రలక్షణమ్॥

(౫౩౮) ఇఁక ను బ్రహ్మకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాఁడు॥ మునికులోత్తములారా బ్రహ్మకృచ్ఛ్రలక్షణమును జెప్పెదను. సావధానులరై వి

నుఁడు. దురన్నభోజనమువలనఁ గలిగినపాపమును, దుష్ప్రతిగ్రహమువలనఁ గలిగినపాపమును, అపేయపానమువలనఁ గలిగినపాపమును, దుష్టభోజనమువలనఁ గలిగినపాపమును, శాంత్యన్నమును భుజించుటవలనఁ గలిగినపాపమును, మఠాధిపతియగు సన్యాసియొక్క యన్నమును భుజించుట వలనఁ గలిగినపాపమును, రజకాన్నభోజనపాపమును, వృషలాన్న భోజనపాపమును, పుష్పవత్యన్నభోజనపాపమును, పైతృకాన్నభోజనమును, నారాయణబలిభోజనమును, చౌల, పైతృకకార్యములయందు భోజనమును జేయుట వలనఁ గలిగినపాపమును, దంపతులయుచ్ఛిష్టాన్నభోజనమును, సన్యాసియొక్క యన్నమును దినుటవలనఁ గలిగినపాపమును, ప్రేతాన్నభోజనపాపమును, ద్వివిధసూతకాన్నభోజనపాపమును, దుష్పంక్తిభోజనపాపమును, దుష్టసంఘాన్నభోజనపాపమును, క్రీతాన్నభోజనపాపమును, పర్యుషితాన్నభోజనపాపమును, పర్యుషితరసభోజనపాపమును, పూతిగంధపాపమును, క్షారభోజనపాపమును, అసత్యమాడుటవలనఁ గలిగినపాపమును, ఇంకననేకములగులఘుగురుపాపములను బ్రహ్మకూర్చము నశింపఁజేయునని దేవలుఁడువచించె. పూర్వోక్తప్రకారముగ గోమూత్రమును, గోమయమును, గోక్షీరమును, గోదధిని, గోసర్పిని, కుశోదకమును, సంపాదించి ప్రతిదినమునందును, పానముసేయవలయును. ఇట్లు పదిరెండుదినములు పూర్వోక్తప్రకారముగ స్నానాదికమును జేయవలయును. ప్రాతఃకాలమునందు స్నానమునుజేసి సకాలమునందు నిత్యకర్మను సమాప్తినిఁ బొందించి దేవాగారమునందును, గోష్ఠమునందును, వ్రతమునవలంబించినవాఁడై పంచగవ్య ప్రాశనను జేయవలయును. ఎనిమిదిమాషముల గోమూత్రమును, పదునాలుమాషముల పరిమితిగల గోమయమును, ఎనిమిది మాషములక్షీరమును, మూఁడుమాషముల పెరుగును, మూఁడుమాషముల పరిమితిగల ఘృతమును, అటులనే పరిశుద్ధమైనజలమును, అప్యోమంత్రములచేత సంయోజననుజేసి యప్యోమంత్రములచేత హోమమునుజేయవలయును. సాయంకాలము దనుక విష్ణుదేవునిస్మరించుచుఁ బిమ్మట హోమశేషమును పానముసేయవలయును. దేవసమీపమునందు గంధతాంబూలాది వర్జితుఁడై నిదురను బొందవలయును. మరుదినమునందును నీవిధముగానే చేయవలయును. ఇట్లు పదిరెండు దినములు వ్రతముల నాచరించవలయును. ఇవ్విధముగ సకల పాపములును నశించునని మార్కండేయుఁడువచించె.

## —— బ్రహ్మకృచ్ఛ్రప్రత్యామ్నాయః. ——

(౫౩౭) అథబ్రహ్మకృచ్ఛప్రత్యామ్నాయమాహ॥ దేవలః ॥ శృణు బ్రహ్మమునేచిత్రం ప్రత్యామ్నాయంప్రజాపతేః। యత్కృత్వాముచ్యతేపాపైర్మహద్భిరుపపాతకైః॥ ఆచరేద్బ్రహ్మకృచ్ఛాఖ్యంమహాపాతకశోధనమ్। అసమర్థఃప్రకుర్వీత ప్రత్యామ్నాయం ఫలాప్తయే॥ ప్రత్యామ్నాయే మహాకృచ్ఛ్రఫలమాప్నోతి మానవః। అష్టగావఃప్రదాతవ్యాః పూర్వవత్స్వర్ణభూషితాః॥ విప్రేభ్యోవేదవిద్భ్యశ్చ పృథక్పృథగలంకృతాః।పయస్విన్యశ్శీలవత్యస్సర్వదోషవిముక్తయే॥ మార్కండేయః॥ ప్రత్యామ్నాయంతదాకుర్యాద్యద్యశక్తఃప్రజాపతౌ। అష్టగావఃప్రదాతవ్యాః స్వర్ణశృంగ్యఃపయస్వినీః॥ విప్రేభ్యోవేదవిద్భ్యశ్చసర్వకృచ్ఛ్రఫలాప్తయే । ఏవంకృత్వాద్విజస్సమ్యక్ఫలమాప్నోతికృత్స్నశః॥ ఇతిబ్రహ్మకృచ్ఛ్రప్రత్యామ్నాయః॥

(౫౩౭) ఇఁకను బ్రహ్మకృచ్ఛ్ర ప్రత్యామ్నాయ విధానమును జెప్పుచున్నాఁడు॥ బ్రహ్మకృచ్ఛ్రప్రత్యామ్నాయము సకల పాపములను నశింపఁజేయును. బ్రహ్మకృచ్ఛ్రమును నాచరింపశక్తిలేనివాఁడు ప్రత్యామ్నాయమును నాచరింపవలయును. అనఁగా సర్వాలంకార భూషితములగు గోవులనెనిమిదింటిని దానము సేయవలయునని దేవలుఁడు వచించె. మార్కండేయుఁడు నునీవిధముగానే వచించె.

## —— ధాన్యకృచ్ఛ్రలక్షణమ్. ——

(౫౩౮) అథ ధాన్యకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః ॥ ధాన్యకృచ్ఛ్రస్యరూపంచ లక్షణంప్రవదామివః। సర్వేషామేవకృచ్ఛ్రాణా మశక్తో ధాన్యమాచరేత్॥ మార్కండేయః॥ తప్తాదిసర్వకృచ్ఛ్రాణి కర్తుంయదిహనప్రభుః। ధాన్యకృచ్ఛ్రంతదాకుర్యాద్యద్యత్కృచ్ఛ్రంయథేరితమ్॥ ఖారీధాన్యస్యమూలతః పంచధాభాగమాచరేత్। కృచ్ఛ్రస్యైకస్యయోభాగః కృచ్ఛ్రంధాన్యమితీరితమ్॥ తద్ధాన్యంభాగశోదద్యాత్తత్కృచ్ఛ్రంమునిభిస్స్మృతం। తత్కృచ్ఛ్రమాచరేద్విప్రః సమ్పూర్ణఫలమశ్నుతే॥ ధాన్యమధ్యేమహారాజ్ఞః కృచ్ఛ్రంపాపవిముక్తయే॥ మరీచిః॥ ఖారీధాన్యస్యపంచాంశో ధాన్యకృచ్ఛ్రముదాహృతమ్। అతోన్యూనంనకర్తవ్య మన్యథా దానమీరితమ్॥ లౌగాక్షిః॥ పంచమాంశోధాన్యకృచ్ఛ్రం ఖారీధాన్యస్యభూయసః। అన్యథాధాన్యదానంస్యాత్కృచ్ఛ్రశబ్దానపుణ్యభాక్॥ మరీచిః॥ సమ్పూర్ణంధాన్యకృచ్ఛ్రస్య పంచమాంశోనిగద్యతే। హీనేహీనం ధాన్యదానం సకృచ్ఛ్రఫలమశ్నుతే॥ కృచ్ఛ్రస్యైతస్యవిప్రశ్రేప్రత్యామ్నాయోనవిద్యతే।స్వర్ణకృచ్ఛ్రస్యధాన్యస్య సమర్థస్యమహాత్మనః॥

ప్రత్యామ్నాయోనిగదితో మునిభిర్ధర్మవత్సలైః ॥ ధాన్యశబ్దేన వ్రీహయఏవ సర్వకృచ్ఛ్రాణాం నధాన్యాంతరం ॥ కేచిచ్ఛ్యామాకధాన్యమితివదంతి ॥ కేచిన్నీవారాఇతి॥ మనుః॥ నీవారాఃవ్రీహయోధాన్యం శ్యామాకాః కృచ్ఛ్రసాధనం । నధాన్యాంతరమస్తీహ ప్రఘాతంకృచ్ఛ్రసాధనమితి ॥ ఇతి ధాన్యకృచ్ఛ్రలక్షణమ్ ॥

(౫౩౮) ఇకను ధాన్యకృచ్ఛ్రలక్షణమును జెప్పుచున్నాడు॥ ధాన్యకృచ్ఛ్రలక్షణమును వివరించి చెప్పెదను. ఏకృచ్ఛ్రమును జేయజాలనివాడు ధాన్యకృచ్ఛ్రమును జేయవలయును. ఇత్యాదిసకలపాపములను నాశమునొందించునని దేవలుడు వచించెను. తప్తాదిసర్వకృచ్ఛ్రములను జేయజాలనివాడు ధాన్యకృచ్ఛ్రమునాచరింపవలయును. అది యెట్లనగా నపుష్టేడు ధాన్యమును నైదుభాగములుగా జేయగా నందొకభాగమునకు గ్రాసమని నామధేయము. ఆ ధాన్యమును భాగక్రమముగ నివ్వవలయును. ఇత్యాదిధాన్యకృచ్ఛ్రమనియును, దీనివలన సంపూర్ణ ఫలమునొసంగునని యును మునులు వచించిరని మార్కండేయుడు వచించెను. మరీచియును నీవిధముగా నేవచించె. లౌగాక్షియును నీవిధముగా నేవచించెను. మరీచియును నిట్లనే చెప్పి ధాన్యకృచ్ఛ్రమునకు, ప్రత్యామ్నాయము లేదనియె. కొందఱు ప్రత్యామ్నాయమును చెప్పిరి. అది యెట్లనగా ధాన్యమునకు బదులు యవలనుపయోగింపవలయుననిరి. మఱికొందఱు సర్వవిధ ధాన్యమును పయోగింపవచ్చునని రి. నీవారములనైనను, వ్రీహులనైనను, శ్యామాకములనైనను ధాన్య కృచ్ఛ్రమునందుపయోగింపవలయుననియును, ధాన్యాంతరమును పయోగింప గూడదనియును మనువు వచించెను.

## —— ❋ స్వర్ణకృచ్ఛ్రలక్షణమ్. ❋ ——

(౫౩౯) అథస్వర్ణకృచ్ఛ్రలక్షణమాహ॥ దేవలః॥ బ్రహ్మహత్యాదిపాపానామితరేషాం మునీశ్వరాః। తులాదిష్విహ దానేషు గృహీతానాం విశోధనమ్॥ స్వర్ణకృచ్ఛ్రం బ్రహ్మమయం బ్రహ్మణా పరికీర్తితమ్। పురాహి జాహ్నవీతీరే ఋషిభ్యః పాపనాశనమ్॥ మహాప్రభో వరాహస్య తదర్ధం మధ్యమస్య తు। తదర్ధమితరేషాం వ తతోన్యూనం నకారయేత్ ॥ తతోన్యూనం సువర్ణదానమాత్రమ్॥ నకృచ్ఛ్రశబ్దః॥ మరీచిః॥ వరాహస్య తదర్ధం చ తదర్ధం కృచ్ఛ్రమీరితం। తతోన్యూనం దానమాత్రం కృచ్ఛ్రశబ్దోనవిద్యతే॥ వరాహాదిప్రమాణం ॥ మార్కండేయపురాణే॥ గవాక్షాంతర్గతో యత్రవాయునాసప్రదృశ్యతే । పరబ్రహ్మస్వరూపం యత్ త్రసరేణురుదాహృతః॥ త్రసరేణ్వష్టసంలిక్షా త్రిసంయుక్తా చ్యతే। తత్త్రియం గుంజమాత్రం స్యాద్ధ కం వా శ్వేతమునవా॥ షడ్గుంజల

గరసంగ్రాహీ ఘోరో భవతి రాక్షసః । తన్నిష్కృతింపరాంకృత్యమహాంతంసర
కంవ్రజేత్ ॥ షడ్భిఃకృచ్ఛ్రైరయుతప్రాతైర్వాశుద్ధో భవతిసంగ్రహాత్ । మహా
భూతఘటేచర్మధేనోర్విప్రః ప్రతిగ్రహే॥ పూర్వవద్వాపి నేరాదిక్ ఘోరో భవ
తి రాక్షసః । తస్య పాపవిశుద్ధ్యర్థం త్ర్యయుతంకృచ్ఛ్రమాచరేత్ ॥ కాలపూ
ర్షేకాలచక్రతిలగర్భేతిలాచలే। రాశిచక్రేద్విజఃకుర్యాత్స్వయుతంకృచ్ఛ్రమా
దరాత్॥ క్రాటిహోమేలక్షహోమే పాపపూర్వ ప్రతిగ్రహే। ద్వ్యయుతంస్వ
ర్ణకృచ్ఛ్రాణామన్యథావైనసంష్కృతిః ॥ శ్వేతాశ్వేమృతశయ్యాయాంగజదాన
ప్రతిగ్రహే। అయుతంస్వర్ణకృచ్ఛ్రాః స్యాద్గృహీతుర్దేహశుద్ధయే॥ ఆర్ద్రకృష్ణా
జినేచైవసప్తశైలప్రతిగ్రహే। కృచ్ఛ్రంసహస్రంతత్కృత్వా తస్మాద్దోషాత్ప్ర
ముచ్యతే। కపిలాద్విముఖీదానే దాసీగృహపరిగ్రహే। సహస్రంపూర్వవత్కృ
త్వాశుద్ధిమాప్నోత్యసంశయః॥ ఆలింగనేతైలఘటేమహాపూర్ణాదిభోజనే। ష
ట్చకృచ్ఛ్రంశతంకృత్వాదోషాదస్మాత్ప్రముచ్యతే ॥ తులాదిసప్తదానేషుబు
త్వాజో హిరణ్యకాలాపి। తేషాంవిశుద్ధిర్యాభపాలద్వాత్రైర్నసహామునీశ్వరైః
సహస్రంస్వర్ణకృచ్ఛ్రంచప్రోక్తంలోకానుసంధయా। ఆజ్యాలంకారధేనూనా
మనడ్వాహాదిసంగ్రహే॥ మహిషీఛాగవస్త్రానాంశతకృచ్ఛ్రంవిశోధనమ్! అ
న్యేషుదుష్టదానేషుదుష్టశాంతిషుసర్వదా॥ ఉగ్రశాంతిషు తైర్వతరణ్యోశ్చశతకృ
చ్ఛ్రముదీరితమ్। ఏకాహాదిషుభోక్తౄణాంశూద్రసత్రానువర్తినామ్॥ దశ
కృచ్ఛ్రంసువర్ణాఖ్యంమునిభిశ్శుద్ధిరీరితమ్। చండాలాంగనాదిగమనాద్యత్ప్రతి
పదోక్తప్రాయశ్చిత్తముక్తం సర్వేషాంపాపానాం తదాచరణాసమర్థానాం
నస్సంసాహారపూర్వకం యస్యయస్యమిత్రస్య యావంతికృచ్ఛ్రాణ్యుక్తానితా
వంతిస్వర్ణకృచ్ఛ్రాణికృత్వాశుద్ధిమాప్నుయుః । సర్వేషాంపూర్వోక్తానాంకృ
చ్ఛ్రాణాంప్రత్యామ్నాయోపద్యతే ॥ స్వర్ణకృచ్ఛ్రధాన్యకృచ్ఛ్రయోః ప్రత్యా
మ్నాయోనాస్తి॥ ఉత్తమమధ్యమాద్యధికారికతయా కల్పనీయఃహిరణ్యకృచ్ఛ్ర
మత్రప్రత్యామ్నాయస్స్వరూపాదిద్వయం పూర్వముక్తంసమ్పూర్ణమేవయో
జనీయం॥ తదాహమనుః॥ ఉభయోఃకృచ్ఛ్రయోస్తాత ప్రత్యామ్నాయోనవిద్య
తే। సమ్పూర్ణంకృచ్ఛ్రమేవాత్రకర్తవ్యంతారతమ్యతఇతి॥ ఇతిస్వర్ణకృచ్ఛ్రల
క్షణం॥ ఇతిహేమాద్రివిరచితేధర్మశాస్త్రేప్రాయశ్చిత్తాధ్యాయే చాంద్రా
యణప్రాజాపత్యాదికృచ్ఛ్రలక్షణమ్॥

(౫౩౯) ఇకను స్వర్ణకృచ్ఛ్ర లక్షణమును జెప్పుచున్నాడు ॥ బ్రహ్మహ
త్యాది పాపములును, దుష్టదానములను బ్రతిగ్రహించుటవలన గలిగిన పాపములు
ను, స్వర్ణకృచ్ఛ్రముచేత నాశమునుబొందును. [illegible] మును బ్రహ్మ

దేవుడు జాహ్నవీతీరమునందలి ఋషులకు జెప్పె, వరాహపరిమితిసువర్ణమైనను, దానియందు సగమైనను, నాల్గవభాగము నయినను కృచ్ఛ్రమునందు ప్రయోగింపవలయును. ఈపరిమాణమునకు దగ్గింపగూడదు. సువర్ణదానాదులయందు మాత్రము శక్త్యనుసారముగ నివ్వవచ్చును. ఇట్లని దేవలుఁడు వచించె. మరీచియును నీవిధముగా నేవచించె. త్రసరేణ్వష్టకము లిక్షయనియును, మూడులిక్షలు యవయనియును. మూడుయవలు గుంజయనియును, అయిదు గుంజలుమాషమనియును. ఇవియే మాషకమనియును, తొమ్మిదిరూపకములు వరాహమనియును, నెఱుంగవలయును, స్వర్ణకృచ్ఛ్రమునందు వరాహపరిమితిగల సువర్ణమునివ్వవలయును, దీనియందర్ధపరిమితిగల సువర్ణమును దానమునయినను, నాలుగవభాగమునయినను దానముచేయవలయును. పాదహీనముగ నెప్పటికిని నివ్వఁగూడదు, సువర్ణకృచ్ఛ్రము మహాపాతకములను బోగొట్టును, తులాదానాదులను బ్రతిగ్రహించుటవలనఁ గలిగినపాపముగూడ నశించును, మఱియు ననేకపాపములను నాశమునొందించునని మార్కండేయపురాణమునందుఁ జెప్పఁబడియె. ప్రమాదవశముచేత బ్రహ్మహత్య జేయుటవలనఁ గలిగినపాపమును, మఱియు నితరములగు పాపములను ప్రమాదవశమున జేసినవారలకు గలిగినపాపములను స్వర్ణకృచ్ఛ్రము నశింపజేయును, స్వర్ణము బ్రహ్మమయమయమని యెఱుంగవలయును, సువర్ణకృచ్ఛ్రాచరణమువలన సకలపాపములును నశించునని మార్కండేయుడు వచించె. రహస్యముగ జేసిన బ్రహ్మఘాతుకపాపము మూడువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరించుటచేత నాశమునుబొందును, రహస్యముగ మాతృగమనమును జేయుటవలన గలిగిన పాపము నాలుగువేల స్వర్ణకృచ్ఛ్రముల నాచరించుటచేత నాశమునుబొందును, రహస్యముగ మద్యపానమును జేసినందువలనఁ గలిగినపాపము మూడువేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరించుటచేత నాశమునుబొందును, రహస్యముగ విప్రధనమును దొంగిలించినందువలనఁ గలిగినపాపముగూడ మూడువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరించుటచేత నాశమునుబొందును, ఈ పూర్వోక్తపాపములను నెల్లవారలకును దెలియునట్లుసేసిన పాపమునకు మరణాంతప్రాయశ్చిత్తమును జేసికొనఁజాలనివాఁడు నాలుగువేల స్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయునని గౌతముడు వచించె. విస్పష్టముగ నెల్లవారలకును దెలియునట్లు బ్రహ్మహత్యాదిచతుర్విధపాపములనాచరించినవారలు జపయాగాభిషేచనముల చేతను, నదీస్నానాదులచేతను, పరిశుద్ధులగుదురు. తులాదిదానములను బ్రతిగ్రహించినవారు [illegible] ప్రతిగ్రహింపబడి

నద్రవ్యమునందు నాల్గవభాగమును వ్యయము సేయవలయును, కాదేని నాలుగువేల స్వర్ణకృచ్ఛ్రములను నాచరింపవలయునని మనువు చెప్పె. ప్రభువులగువారుత్తమవిధానముచేతను, మధ్యములు మధ్యమవిధానముచేతను, అధములు పాదప్రమాణముచేతను, ప్రాయశ్చిత్తార్థకృచ్ఛ్రముల నాచరింపవలయును, ఉపపాతకములకును, మఱియునితరములగు పాతకములకును, ఏయేకృచ్ఛ్రములు విధ్యుక్తప్రకారముగ జెప్పబడెనో యట్టివానినాచరించుటయందు సామర్థ్యములేనివారలు స్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయునని యాజ్ఞవల్క్యుడు చెప్పె. సంకీలీకరణాదిపాపములయందు యథోక్తప్రాయశ్చిత్తమును జేసికొనినవారలకు సర్వోత్తమమగు ఫలమును బొందును, యథోక్త ప్రాయశ్చిత్తమును చేసికొనుటకు శక్తిలేనివారలు కృచ్ఛ్రములనాచరింపవలయును, అనఁగా నేయేపాపమునకేయే కృచ్ఛ్రము విధింపఁబడినదో యన్ని కృచ్ఛ్రముల నాచరింపవలయును, హిరణ్యకృచ్ఛ్రాదికమును నాచరించుటయందు ప్రభుమధ్యమదరిద్రతారతమ్యమును గని పెట్టవలయును, ఇటుల నేదుర్నోద్బంధన మరణాదులయందును, ఉపనయనాదికర్మలకు ముఖ్యకాల మతిక్రమించినపుడును, గౌణకాలములయందును, ప్రాయశ్చిత్తము నిరూపింపబడినది. కావున యథోక్తస్వర్ణకృచ్ఛ్రాదికము నాచరింపవలయునని మరీచి వచించె. తులాదానాదిదానములను ప్రతిగ్రహించినవాడు యాగమును జేయవలయును. కాదేని యాద్రవ్యమునందలి నాల్గవభాగద్రవ్యమును వ్యయము సేయవలయును, అభిషేకమునైనను, జపమునైనను, జేయవలయును, మఱియును బ్రహ్మరాక్షసత్వవిముక్తికొఱకు నాలుగువేల స్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, ఇట్లు సేసినవాఁడు పిశాచత్వములేనివాఁడై సర్వపాపవిముక్తుఁడగును, హిరణ్యగర్భసంధానమునందు ధర్మనిష్కృతి నాచరింపనివాఁడు నాలుగువేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, బ్రహ్మాండఘటమును ప్రతిగ్రహించినవాఁడు పూర్వోక్తప్రాయశ్చిత్తము నాచరింపవలయు లేనియెడల మూఁడువేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, గోసహస్రదానమును ప్రతిగ్రహించినవాఁడు పూర్వోక్తప్రాయశ్చిత్తము నాశ్రయింపజాలనియెడల నేబదివేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, ఇట్లు చేయనియెడల, పశులోమములెన్ని గలవో యన్నివేలసంవత్సరములు బ్రహ్మరాక్షసత్వమును బొందియుండును, హిరణ్యధేనువును ప్రతిగ్రహించినవాఁడు పూర్వోక్తప్రాయశ్చిత్తము నాచరింప లేకపోయెనేని యేబదివేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, హిరణ్యాశ్వమును ప్రతిగ్రహించినవాఁడు గూడ నేబదివేల స్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, హిరణ్యాశ్వ

రథదానమును బ్రతిగ్రహించినవాడు, ఆరునూరుల స్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, పంచలాంగలదానమును ప్రతిగ్రహించినవాడు మూడువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, విశ్వచక్రమును ప్రతిగ్రహించిన వాడును నైదువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, కల్పలతాప్రతిగ్రహమునందు గల్పతరుదానప్రతిగ్రహమునకు విధించినప్రాయశ్చిత్తమునువిధింపవలయును, సప్తసాగర దానమును ప్రతిగ్రహించి ప్రాయశ్చిత్తమును జేసికొనని వాడు ఘోరనరకమునుబొందును, కావున నేతద్దోషవిముక్తికొరకు నాలుగువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, మహాభూతఘటమును, చర్మధేనువును, ప్రతిగ్రహించినవాడు మూడువేలస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, కాలపురుషదాన, కాలచక్రదాన, తిలగర్భదానములనుప్రతిగ్రహించినవాడును రాశిచక్రదానమును ప్రతిగ్రహించినవాడును, ఇరువదివేలస్వర్ణకృచ్ఛ్రములను నాచరింపవలయును, కోటిహోమమునందును, లక్షహోమమునందును, పాపపురుషప్రతిగ్రహమునందును, ఇరువదివేలస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, శ్వేతాశ్వదానమును, మృతశయ్యాదానమును, గజదానమును ప్రతిగ్రహించినవాడు పదివేలస్వర్ణకృచ్ఛ్రములను నాచరింపవలయును, అర్ధకృష్ణాజినదానమును, సప్తశైలదానమును, ప్రతిగ్రహించినవాడు వేయిస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, ద్విముఖియగు కపిలధేనుదాన ప్రతిగ్రహమునందును వేయిస్వర్ణకృచ్ఛ్రముల నాచరింపవలయును, దాసీప్రతిగ్రహమునందునునట్టులనేయాచరింపవలయును, ఆలింగనమునందును, తైలఘటమునందును, మహాపూర్ణాదిభోజనమునందును, అయిదునూరుల స్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, తులాదిసప్తదానములయందు, ఋత్విజులును, హోతలును, ద్వారస్థితులును, వేయిస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, ఆజ్యాలంకార ధేనువులయొక్కయు, అనడ్వాహాదులయొక్కయు, ప్రతిగ్రహము నందును, మహిషభాగబస్తములయొక్క ప్రతిగ్రహమునందును, నూరుకృచ్ఛ్రముల నాచరింపవలయును. మఱియు నితరములగు దుష్టదానములయందును, దుష్టశాంతులయందును, ఉత్క్రాంతివైతరణీనామక గోదానములయందును నూరుస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, ఏకాహాదులయందు భోజనమును జేసినవారలకును, శూద్రసత్రమునందన్నమును భుజించువారలకును, పదిస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును. చండాలాంగనాది గమనములయందెట్టి ప్రాయశ్చిత్తమువిధింపబడినదో యట్టిప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మఱియు నట్టిప్రాయశ్చిత్తమును జేసికొనుటకు శక్తిలేనివారల్లు, ప్రత్యమ్నిమిత్తమునగ నె

స్నికృచ్ఛ్రములువిధింపబడినవో యన్నిస్వర్ణకృచ్ఛ్రములనాచరింపవలయును, మ
ఱియును బునరుపనయనాది సంస్కారములను బొందవలయును, సకలకృచ్ఛ్ర
ములకును ప్రత్యామ్నాయములు గలవుగాని స్వర్ణకృచ్ఛ్రధాన్యకృచ్ఛ్రములకు
ప్రత్యామ్నాయములులేవని యెఱుంగవలయును, హిరణ్యకృచ్ఛ్రము నుత్తమ
మధ్యమాల్పాధికారాను సారముగనాచరింపవలయునని పైఠీనసివచించె, ధా
న్యకృచ్ఛ్రస్వర్ణకృచ్ఛ్రములకు ప్రత్యామ్నాయములేదు, మఱియునీకృచ్ఛ్రములను
సంపూర్ణముగ నాచరింపవలయునని మనువువచించె ॥

——— ❋ కదళీవివాహః ❋ ———

(౫౮౦) అథ కదళీవివాహమాహ ॥ మార్కండేయః ॥ పతితంక్లీబ
మున్మత్తంకుబ్జం కాణం రుజార్దితం । అపస్మారం పరిత్యజ్య వివాహేతు న
దోషభాక్ ॥ కాత్యాయనః ॥ కాణం రుజార్దితం కుబ్జం పతితం క్లీబమేవచ।
అపస్మారం వివాహ్యాశు కదళ్యాశుభవృద్ధయే ॥ తదనుజ్ఞామవాప్యాథ వివా
హేనసదోషభాక్ ॥ జాతూకర్ణిః ॥ కాణం రుజాన్వితం కుబ్జం పతితం క్లీబ
మేవచ । అపస్మారం పూర్వజాతం కదళ్యాస్తు వివాహయేత్ ॥ పశ్చాదను
జ్ఞయా రాజన్ వివాహే నసదోషభాక్। వివాహ ఇత్యుపలక్షణం ॥ యజ్ఞాం
దోళికారోహణాదావప్యేవం వేదితవ్యః । కదళీవివాహ ప్రకారమాహ ॥
మార్కండేయః ॥ కార్తికే మార్గశీర్షేవా మాఘేవా ఫాల్గునేపివా। వైశా
ఖేజ్యేష్ఠమాసేవా వివాహం రమ్భయాసమం ॥ ప్రశంసంతిమునిశ్రేష్ఠాః పుత్ర
పౌత్రఫలప్రదం । వివాహశ్శుభనక్షత్రే చంద్రతారాబలాన్వితే ॥ దివసేపివి
వా రాజన్ ప్రశస్తశ్శుభకర్మణి । జ్యేష్ఠంక్లీబాదిషు త్వేకం పాత్రరభ్యజ్య స్నా
పయేత్ ॥ గంధపుష్పాదిభిస్సమ్యగలంకృత్య ప్రయత్నతః । సువాసినీభిర్గీతా
ని శృణ్వన్నారామసన్నిధిం ॥ గత్వాచకదళీమూలం పుణ్యాహం వాచయేత్త
తః । నాంద్యాహ్వానం తతఃకుర్యాద్యథావర్ణంయథావిధి ॥ ఉన్మత్తమేనం
పాపిష్ఠం కదళ్యాపరిణయేముదా । ఇతిసంకల్ప్యమనసా బృహత్సామేతిమం
త్రతః ॥ కదళ్యాఃకంకణంబద్ధ్వా విశ్వేత్తాతేతి మంత్రతః । విశ్వేత్తాతేతి
పుమాన్ బృహత్సామేతి కదళీచకంకణే ధారయేత్తాం ॥ పరిత్వాగిర్వణేతి
మంత్రేణకదళ్యాఃవస్త్రబంధనం । ఆశాసానేతిమంత్రేణ యోక్త్రం దర్భమ
యందృఢం॥ బద్ధ్వాస్వర్ణమయీం తాళీం మాంగల్యేనేతి మంత్రతః। బద్ధ్వా
కాంస్యమయే పాత్రేతండులైస్తిలమిశ్రితైః ॥ స్వహస్తాభ్యాం వరోధృత్వా
వృక్షస్యోపరిన్యసేత్ । ఏవంత్రివారం కృత్వాతు వృక్షమూలముపావిశేత్ ॥
లౌకికాగ్నింప్రతిష్ఠాప్య హవ్యజ్యభాగాంతమాచరేత్ । వనస్పతిభ్య ఇత్యాగ్నా

 ఉల్కా

కోక్త్వాన్ స్వాహాకారానుక్త్వాఆజ్యాహుతీర్హుత్వా జయాది బ్రహ్మావిసర్జనాంతే। వరస్త్వగ్నింపరిక్రమ్యహస్త్యేపాసనమథాచరేత్। లౌకికాచారమాపన్నః కదళీంతాంపరిత్యజేత్॥ తామ్బూలాదికమాసాద్య పూర్వవద్గృహమావిశేత్। సగృహస్థోనసందేహశ్శుభకర్మసమాచరేత్॥ పరివేత్త్రాదిదోషాత్రనభవేద్వైకదాచన। యజ్ఞంవాథవివాహంవా రాజ్యంవా పాలయేత్తతః॥ ఉభయోర్వృద్ధిరభవత్పరివిత్త్యాదిహీయతే। అన్యథాదోషమాప్నోతి నరకంచాధిగచ్ఛతి॥ తత్కాలంసంకరీభూయాత్సంకరోనరకాయవై। యుగాంతేతు న ముక్తిస్స్యాదపుత్రస్యయథాతథా॥ ఇతికదళీవివాహః॥

(౫౮౦) ఇఁకను కదళీవివాహమును జెప్పుచున్నాఁడు॥ పతితుని, క్లీబుని, ఉన్మత్తుని, కుబ్జుని, కాణుని, రుజార్దితుని, అపస్మారరోగముగలవానిని, వదలి కనిష్ఠుఁడు వివాహమును జేసికొనుట దోషముగాదని మార్కండేయుఁడు వచించె. కాణుఁడు, రుజార్దితుఁడు, కుబ్జుఁడు, పతితుఁడు, క్లీబుఁడు, అపస్మారరోగముగలవాఁడు, అగుజ్యేష్ఠభ్రాత కదళీవివాహమును జేసి యతని యనుజ్ఞనుబొంది కనిష్ఠుఁడు వివాహమును జేసికొనుట వలన దోషములేదని కాత్యాయనుఁడువచించె. జాతూకర్ణ్యుఁను నివ్విధముగానే వచించె. యజ్ఞాందోళికాద్యారోహమునందును నిటులనే జ్యేష్ఠానుమతమును బొందవలయును. కార్తికమాసమునందును, మార్గశీర్షమాసమునందును, మాఘమాసమునందును, ఫాల్గునమాసమునందును, వైశాఖమాసమునందును, జ్యేష్ఠమాసమునందును గదళీవివాహము శుభప్రదమనియును, శుభనక్షత్రాదులతోఁగూడుకొనినకాలమునందు వివాహము శుభప్రదమనియును, నెఱుంగవలయును. క్లీబత్వాదిదోషవిశిష్ఠుఁడగువానికిఁ గదళీవివాహమును జేయఁదలఁచినపుడు ప్రాతఃకాలమునందభ్యంజనస్నానమును జేయింపవలయును. గంధపుష్పాదులచేతఁ జక్కఁగ నలంకారమును జేయవలయును. సువాసినీ స్త్రీలయొక్కమంగళగీతములను వినుచు నారామ సమీపమునకుఁ బోవలయును. పోయి కదళీమూలమునందుఁ బ్రవేశించి పుణ్యాహవాచనమును జేయవలయును. అనంతరమునందు నాంద్యాహ్వానమును జేయవలయును. పిమ్మటను స్మత్త్వాదిదోషవిశిష్టుఁడనైన నేనుగదలీవివాహమును జేసికొనియెదనని సంకల్పమును జేయవలయును. అనంతరమందు "బృహత్సామ,, అను మంత్రముచేత కదళియందుఁ గంకణమును బంధింపవలయును. "పరిత్వాగిర్వణో,, అను మంత్రముచేత వస్త్రమును గట్టవలయును. "ఆశాసానా,, అను మంత్రముచేత యోక్త్రమును నమర్పవలయును. "మాంగల్యేన,, అను మంత్రముచేత

సువర్ణమయమగు తాళినిగట్టవలయును. అనంతరమందు వరుఁడు కాంస్య పాత్రయందు శుభ్రాక్షతలనుబోసి కదలీశిరస్సునందుంచవలయును. ఇట్లు మూఁడుపర్యాయములు బోసి వృక్షమూలమునందుఁ గూర్చుండ వలయును. అనంతరమందులౌకికాగ్నిని ప్రతిష్ఠించి యాజ్యభాగాంత మాచరింపవలయు ను. "వనస్పతిభ్యః,, అనునట్టి యనువాకములయందుఁ జెప్పఁబడిన స్వాహా కారములను జెప్పి యాజ్యాహుతులను హోమముచేసి జయాదిబ్రహ్మావిస ర్జనాంతకర్మనాచరింపవలయును. వరుఁడగ్నినిజుట్టి యౌపాసన నాచరింప వలయును. లౌకికాచారమును బొందినవాఁడు, ఆకదలీవృక్షమును నాలింగ నమును జేసికొనవలయును. అనంతరమందు తాంబూలాదికమును బొంది మునపటివలె గృహమునందుఁ బ్రవేశింపవలయును. అట్టివాఁడు గృహస్థుఁ డనుటకు సందేహములేదు. కావున సకల శుభకర్మలను నాచరింప వలయు ను. ఇట్టి విషయమునందు పరివేత్త్రాదిదోషను కొంచెమైనను లేదు. అనం తరమందు కనిష్ఠుఁడు యజ్ఞమునైనను, రాజ్యమునైనను, వివాహమునైనను, బొందవచ్చును. ఇట్లు కదలీవివాహమును జేయింపని యెడల జ్యేష్ఠకనిష్ఠులు దోషవంతులగుదురు. మఱియు నానావిధములగు పాపములుగలుగునని మా ర్కండేయుఁడువచించె.

—— దుర్మృతానాం నారాయణబలిప్రకారః. ——

(౫౮౧) అథదుర్మృతానాం నృణాంవర్ణత్రయస్థానాం పరలోకో పక్రమకాలే కర్తవ్యాంశం నారాయణబలిప్రకారమాహ॥ దేవలః ॥ విషా గ్నిజలపాషాణైర్దుర్మృతస్యప్రమాదతః। కర్మాదౌ దేహశుద్ధ్యర్థం నారా యణబలించరేత్॥ మార్కండేయః॥ దంష్ట్రిభిశ్శృంగిభిర్వాపి శృంగిభిర్వ్యాధిదైవ తః। వృక్షైర్జలైశ్చపాషాణైః దైవతోయఃప్రమీయతే॥ తస్యైవదేహశుద్ధ్య ర్థంకర్మాదౌలోకకాంక్షయా। నారాయణబలింకుర్యాత్సర్వపాపాపనుత్తమే॥ పరాశరః॥ దుర్మృతస్యవిషాద్యైర్వా చోరైశ్శస్త్రైర్మృగాదిభిః। క ర్మాదౌలోకసాత్యర్థం నారాయణబలించరేత్॥ నారాయణోజగత్కర్తాస ర్వపాపాపహోనృణాం। దుర్మృతానాంవిశేషేణ మహాపాప ప్రణాశనః॥ మరీచిః॥ దుర్మృతస్యఖరోష్ట్రైశ్చ పశుభిర్వృక్షపాతనైః। జలైఃపాషాణ లగుడైర్మృతస్యప్రమాదతః॥ కర్మాదౌ లోకమన్విచ్ఛన్నారాయణబలించరే త్। తత్ప్రకారమాహ॥ దేవలః॥ కర్మాదౌపూర్వదివసే మృతస్యైతద్దినే జన్మనః। ప్రాయశ్చిత్తం తదాకృత్వా ధర్మశాస్త్రోక్తమార్గతః॥ ఆహూ యవిప్రాన్గుణశశ్చతుర్వింశతిమాదరాత్। తదర్ధంవాతదర్ధంవా సమ్పాద్యత్రి

తిపారగాన్॥ అభ్యర్చ్య గంధవస్త్రాద్యై రామం వా స్వర్ణమేవ వా। కరిష్యే
హం మృతస్యాస్య బలిం నారాయణాత్మకమ్॥ ఇత్యుక్త్వా తాన్నమస్కృత్య
హ్యుపవేశ్య సుఖాసనే। లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య పరిస్తీర్య విధానతః॥ స్రువే
ణాజ్యం సమాదాయ వ్యాహృతీరుచ్చరన్ హృది। పృథక్పృథక్కృతం హుత్వా
సంఖ్యామేకాం సముద్వహన్॥ వ్యాహృతీనాం త్రయం హుత్వా పృథగగ్నౌ వి
ధానతః। సంఖ్యామేకాం త్రయాణాం కృత్వా హ్యష్టోత్తరశతం క్రమాత్॥ హుత్వైవ
వం విధివద్విప్రో హోమశేషం సమాపయేత్। బ్రాహ్మణాన్ సమలంకృత్య పూ
ర్వోక్తేన విధానతః॥ చతుర్వింశతి నామాని కేశవాదీని వైక్రమాత్। చతుర్విం
శతి విప్రపక్షే ప్రత్యేకం వినియోజయేత్॥ ద్వాదశ బ్రాహ్మణపక్షే నామద్వ
యమ్॥ షడ్బ్రాహ్మణపక్షే చతుష్టయమ్॥ తదసంభవే సర్వాణి నామాని య
థాసంఖ్యం నియోజయేత్॥ తండులాంశ్చైవ ముద్గాంశ్చ మాషాంశ్చాకం ఘృ
తం దధి। తాంబూలం దక్షిణాం చైవ విప్రేభ్యః పరికల్పయేత్॥ నాన్నేన తోష
యేద్విప్రాన్ అధికారో న దృశ్యతే। యదా సపిండనం భూయాద్దుర్మృతస్య ద్విజ
న్మనః॥ న తావదన్నం కర్తవ్యం విప్రైరధ్యాత్మవేదిభిః। తదా విప్రైర్న భోక్త
వ్యం యది భుంక్తే స పాతకీ॥ జాతకర్మణి విప్రస్య దుర్మృతస్య ద్విజన్మనః। నా
రాయణబలౌ చైవ నాన్నశ్రాద్ధం సమాచరేత్॥ హిరణ్యేనైవ ధాన్యైర్వా కు
ర్యాచ్ఛ్రాద్ధం విధానతః। అన్నేన కారయేద్యస్తు స చండాలసమో భవేత్॥
దుర్మృతానాం ద్విజన్మనాం పరలోకహితార్థం కర్మాదౌ ఆమేన హిరణ్యేన
వా నారాయణబలిం కరిష్యామీతి సంకల్ప్య॥ లౌకికాగ్నౌ ఘృతేన వ్యాహృతి
భిస్తిసృభిః ప్రత్యేకం హుత్వైకైకసంఖ్యాముద్వహన్ అష్టోత్తరశతం హు
త్వా బ్రాహ్మణానభ్యర్చ్య యథాసంభవం యథాసంఖ్యం తోషయిత్వా నా
రాయణబలిం కృత్వా పారలౌకికీం క్రియాం కుర్యాత్॥ ఇతి దుర్మృతానాం క
ర్మాదౌ నారాయణబలిః॥

(౫౪౧) ఇఁకను దుర్మరణమును బొందినవారలకు నారాయణ బలి ప్రకారమును జెప్పుచున్నాఁడు॥ విషాగ్నిజలపాషాణాదులచేత మరణమును బొందినవారికిఁ గర్మాదియందు దేహశుద్ధికొఱకు నారాయణబలిని జేయవలయునని దేవలుఁడు వచించె. కోరపన్నులుగల మృగములచేతను, గోళ్లుగల మృగములచేతను, శృంగములుగల మృగములచేతను, జలవృక్షపాషాణాదులచేతను మరణమును బొందినవారలకు దేహశుద్ధికొఱకు కర్మాదియందు లోకకాంతుచేత పాపనాశముకొఱకు నారాయణబలిని జేయవలయునని మార్కండేయుఁడు వచించె. పరాశరుఁడును సవిధముగా సవచించె. మరి

చియును నీవిధముగానే వచించె. దుర్మరణమును బొందినవానికిఁ గర్మలనాచరించుటకు నిర్ణయించిన దినమునకుఁ బూర్వదినమునందు ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడిన ప్రకారము ప్రాయశ్చిత్తమును జేసికొని యిరువదినలుగురు బ్రాహ్మణులను బిలువవలయును. ఇరువదినలుగురు లభింపనియెడల బన్నిద్దఱ్నైనను, ఆర్గురినైనను సంపాదింపవలయును. పిమ్మట వారలకు గంధపుష్పాక్షతాదుల చేత బూజను జేసి మృతుడైన వానికి నారాయణబలిని జేసెదనని సంకల్పమును జేసి యాబ్రాహ్మణులకు నమస్కారములనుజేయవలయును. అనంతరమందు లౌకికాగ్నిని ప్రతిష్ఠించి విధ్యుక్త ప్రకారముగ పరిస్తరణను జేసి స్రువముచేత నాజ్యమును గ్రహించి మనస్సున వ్యాహృతుల నుచ్చరించుచు నూరేసి హోమములను జేయవలయును. పిమ్మట సష్టోత్తరం శతహోమమునుజేసి పిదప హోమశేషమును సమాప్తిసిబొందింపవలయును. పూర్వోక్తవిధానముచేత బ్రాహ్మణులను జక్కగ నలంకరించి కేశవాది చతుర్వింశతి నామములచేత నిరువదినల్గురు బ్రాహ్మణులను బూజింపవలయును. ద్వాదశ బ్రాహ్మణపక్షమునందు రెండేసి నామముల చేత బూజింపవలయును. షడ్బ్రాహ్మణ పక్షమునందు నాలుగేసి నామములతో బూజింపవలయును. అదియును సంభవింపనప్పుడు సంభవానుసారముగ గేశవాదినామములతో బూజింపవలయును. తండులములను, పెసలను, మినుములను, కూరను, పెరుగును, నేతిని, తాంబూలమును, దక్షిణను, బ్రాహ్మణులకు నొసంగవలయును. అధికారము లేకపోవుట వలన నన్నముచేత బ్రాహ్మణులకు దృప్తిని గలిగింపగూడదు. దుర్మరణమును బొందినవానికి సపిండనమగు వఱకును నన్నదానమును జేయగూడదు. జాతకర్మయందును, దుర్మరణమును బొందినవానియొక్క నారాయణ బలియందును, అన్నశ్రాద్ధమును జేయగూడదు. హిరణ్యముచేత నైనను, ధాన్యముచేత నైనను, శ్రాద్ధమును జేయవలయును. అట్టి సమయములయందు బ్రాహ్మణులును శ్రాద్ధాన్నమును భుజింపగూడదు. జాతకర్మయందును, నారాయణ బలియందును, అన్నశ్రాద్ధమును జేసినవాడు చండాలసమానుడగును. దుర్మరణమును బొందినబ్రాహ్మణులకు, పరలోకహితముకొఱకు కర్మాదియందా ద్రవ్యముచేతనైనను, హిరణ్యముచేతనైనను, నారాయణబలిని జేయగలనని సంకల్పము జేసి లౌకికాగ్నియందు నేతితో వ్యాహృతిత్రయమును ప్రత్యేకముగ నుచ్చరించుచు నూటయెనిమిదిపర్యాయములు హోమమును జేయవలయును. బ్రాహ్మణులను సంతోషపరచి నారాయణబలిని జేసి పిమ్మట పరలోకక్రియలను జే

యవలయునని దేవలుడువచించె.

## —— వైష్ణవశ్రాద్ధవిధిః ——

(౫౮౨) అథవైష్ణవశ్రాద్ధవిధిరుచ్యతే॥ దేవలః ॥ యాగాదౌ చ తులాదానే ప్రాయశ్చిత్తేషు కర్మసు। శ్రాద్ధం కుర్యాద్వైష్ణవాఖ్యం సర్వదోషాపశాంతిదమ్॥ గౌతమః॥ ప్రాయశ్చిత్తేషు సర్వేషు జీవత్స్వపి తులాసు చ। తత్కాలే వైష్ణవశ్రాద్ధం కృత్వా కర్మ సమాపయేత్॥ పరాశరః ॥ ప్రాయశ్చిత్తేషు దానేషు తులాదిషు మహత్స్వపి। యః కుర్యాద్వైష్ణవశ్రాద్ధం స తత్కర్మ ఫలం లభేత్॥ సర్వత్ర వ్యాపకో విష్ణుః ప్రాయశ్చిత్తేషు కర్మసు। విష్ణ్వర్పితం తు యత్కర్మ తదానన్త్యాయ కల్పతే॥ హరివంశే॥ వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా। ఆదావన్తే చ మధ్యే చ హరిః సర్వత్ర గీయతే॥ విష్ణుధర్మోత్తరే॥ ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః। త్రీఀల్లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః॥ అతస్సర్వత్ర విష్ణుం హి తానికర్మాణి సఫలంతి ॥ సంకల్పానంతరం వాపి వపనానంతరం చ వా॥ యః కుర్యాద్వైష్ణవశ్రాద్ధం తదానన్త్యాయ కల్పతే। జీవత్సు ప్రాయశ్చిత్తేషు ప్రాయశ్చిత్తానంతరం పూర్వశాలా హోమానంతరం ఆమేన హిరణ్యేన వాపి ష్ణుభక్తియుక్తం పంచోపచారైరభ్యర్చ్య విష్ణుప్రీతయె ఆమం వా హిరణ్యం వా దద్యాత్॥ మనుః॥ భోజనం తృప్తిపర్యంతమామం ద్విగుణమాచరేత్। హిరణ్యం త్రిగుణం ప్రోక్తం సర్వకర్మస్వయం విధిః॥ విప్రే విష్ణ్వర్పితే తుష్టే సర్వాస్తుష్యంతి దేవతాః । తాసు తుష్టాసు రాజేంద్ర తత్తత్కర్మ శుభం భవేత్॥ అతః ప్రాయశ్చిత్తేషు వైష్ణవశ్రాద్ధమవశ్యం ప్రాయశ్చిత్తిభిః కర్తవ్యం॥ నాన్యథా ఫలమాప్నోతి॥ ఇతి వైష్ణవశ్రాద్ధవిధిః॥

(౫౮౨) ఇకను వైష్ణవశ్రాద్ధవిధిని దెలుపుచున్నాడు॥ యాగాదికమునందును, తులాదానమునందును, ప్రాయశ్చిత్తకర్మలయందును, సర్వదోషశాంతికొఱకు వైష్ణవశ్రాద్ధమును జేయవలయునని దేవలుడు వచించె. గౌతముడు నునీవిధముగా సెలవిచ్చె. ప్రాయశ్చిత్తాదికర్మలయందును, తులాదిదానములయందును, వైష్ణవశ్రాద్ధమును జేసినవాడు తత్కర్మఫలమును బొందును. విష్ణుదేవుడు సర్వస్థలములయందును వ్యాపించినవాడు గావున విష్ణ్వర్పితమైనది సర్వోత్తమఫలప్రాప్తికొఱకగునని పరాశరుడు వచించె. వేదమునందును, రామాయణమునందును, పురాణమునందును ఆదిమధ్యావసానములయందు హరికీర్తనమును జేయవలయునని హరివంశమునందు జెప్పబడియె. విష్ణుదేవుడొకఁడయ్యును, ననేకభూతస్వరూపుఁడయ్యెను. మఱియును విష్ణువు ముల్లోకములయందును వ్యాపించి సకలభూతాత్మఁడగుచు సర్వమును భుజించుచు

న్నాడు. అందువలనవిష్ణుపూజితమయిన కర్మలేవియును ఫలింపవని యెఱుంగ వలయును. సంకల్పానంతరమునందైనను, వపనానంతరమందైనను వైష్ణవ శ్రాద్ధమును జేసినయెడలనయ్యాది యనంతఫలమునొసంగునని యెఱుంగవలయును. జీవించియుండగ జేసికొనియెడుప్రాయశ్చిత్తములయందు ప్రాయశ్చిత్తమైనపిమ్మట పూర్వశాలాహోమానంతరమందు, ఆమద్రవ్యము చేతనైనను, హిరణ్యముచేతనైనను, విష్ణుభక్తుడైనయొకవిప్రుని పంచోపచారములచేతనర్చించి విష్ణుప్రీతికొఱకామమున్నైనను, హిరణ్యమునైనను నివ్వవలయునని విష్ణుధర్మోత్తరమనుగ్రంథమునందు జెప్పబడియె. తృప్తిగలుగువఱకును భోజనమును బెట్టవలయును. ఆమమునుద్విగుణాధికముగనివ్వవలయును. హిరణ్యమును త్రిగుణాధికముగనివ్వవలయును. విష్ణుప్రీతవిప్రుడుతృప్తుడయ్యెనేనిసర్వదేవతలునుదృప్తులగుదురు. సర్వదేవతాతృప్తిగలిగెనేని కర్మలునుశుభఫలమునొసంగునవియగును. కావున, ప్రాయశ్చిత్తములయందు వైష్ణవశ్రాద్ధమును ముఖ్యముగజేయవలయునని మనువువచించె.

## ——✽ నాందీశ్రాద్ధప్రకారః. ✽——

(౨౮౩) అథనాందీశ్రాద్ధప్రకారమాహ॥ దేవలః॥ ప్రాయశ్చిత్తేషు దానేషువివాహాదిషుకర్మసు। నాందీశ్రాద్ధంతదాకార్యంసర్వకర్మాభివృద్ధయే॥ మరీచిః॥ ప్రాయశ్చిత్తేవివాహాదౌతులాదానాదికర్మసు। పూర్వేద్యుర్వాతదానీంవానాందీశ్రాద్ధంసమాచరేత్॥ అంగిరాః॥ ప్రాయశ్చిత్తేషుశాన్త్యాదౌ తులాదానాదికర్మసు। మహోత్సవేషుసర్వేషుప్రతిష్ఠాసువ్రతేషుచ॥ వివాహాదిషుసర్వత్రనాందీశ్రాద్ధంసమాచరేత్। పూర్వేద్యుర్వాతదానీంవాశుభకర్మఫలాప్తయే॥ అన్నేనామేనవారాజన్హిరణ్యేనయథావిధి। ద్వాదశబ్రాహ్మణాన్భక్త్యాహ్యష్టౌవాపియథావిధి॥ పిత్రూనుద్దిశ్యయత్నేనసూపాపూపాజ్యపాయసైః। అశ్రుపితరః॥ గారుడపురాణే॥ పితాపితామహశ్చైవతథైవప్రపితామహః। మాతామాతామహీచైవతథైవప్రపితామహీ॥ మాతామహాస్సపత్నీకాః పృథక్పృథగనువ్రతాః। విశ్వేదేవాస్సత్యవసూమూర్తాస్తుపితరస్త్రయః॥ తతఃపరమమూర్తాస్స్యుః నాగచ్ఛంతీహకర్మసు॥ ద్వాదశవర్గోమూర్తః తతఃపరమమూర్తః॥ యేయేపితరశ్శ్రాద్ధేషు భోక్తారస్తేమూర్తసంజ్ఞాః॥ యేయేపితరశ్శ్రాద్ధేషునభుంజతేతేఽమూర్తాః॥ తదాహగాలవః॥ పిత్రాదిపితరోమూర్తాస్త్రయస్తేవైసుపూజ్యదాః। తతఃపరమమూర్తాస్స్యుస్సర్వేస్మరణాత్పాపహారిణః॥ అతస్సర్వత్రవృద్ధికర్మసునాందీశ్రాద్ధంకర్తవ్యం ప్రాయశ్చిత్తాభివృద్ధికరమ్॥ తదాహగౌతమః॥ ప్రాయశ్చిత్తంవివాహాదివ్రతందానం తులా

భిధం। దూరయాత్రాసుసర్వాసునాందీశ్రాద్ధంప్రశస్యతే ॥ అతస్త్వవశ్యంకరణీయత్వాదత్రాపినాంద్యాహ్వానంకర్తవ్యమ్॥ ఇతినాందీశ్రాద్ధవిధిః॥

(౫౪౩) ఇకను నాందీశ్రాద్ధప్రకారమును జెప్పుచున్నాడు ॥ ప్రాయశ్చిత్తములయందును, దానములయందును, వివాహాదికర్మలయందును, శుభాభివృద్ధికొఱకు నాందీశ్రాద్ధమును జేయవలయునని దేవలుడువచించె. మరీచియు నీవిధముగానేవచించె. ప్రాయశ్చిత్తాదికర్మలయందు శుభావాప్తికొఱకు పూర్వదినమునందైనను, ఆరంభకాలమునందైనను, నాందీశ్రాద్ధమును, అన్నముచేతనైనను, ఆమముచేతనైనను, హిరణ్యముచేతనైనను, పన్నిద్దఱుబ్రాహ్మణులకుదృప్తికలుగునట్లు పితృదేవతలనుద్దేశించి నాందీశ్రాద్ధమును జేయవలయునని యంగిరోమునివరుడువచించె. పితృపితామహప్రపితామహులు, వీరిభార్యలు, మాతామహతత్పితృపితామహులు, వీరిభార్యలు, విశ్వేదేవులు, సత్యవసువులనువారు మహార్హులనబడుదురని గారుడపురాణమునందు జెప్పబడియె. గాలవుడును నీవిధముగానేవచించె. వీరినుద్దేశించియే నాందీశ్రాద్ధమునాచరింపవలయునని యెఱుంగవలయును. ప్రాయశ్చిత్తవివాహాదికర్మలయందు నాందీశ్రాద్ధమును జేయవలయునని గౌతముడువచించె.

## ——❋ రామలక్ష్మణప్రతిమాదానవిధిః.❋——

(౫౪౪) అథరామలక్ష్మణప్రతిమాదానవిధిమాహ ॥ వరాహపురాణే॥ ఇదమన్యత్ప్రవక్ష్యామిసర్వపాపహరంపరం। సర్వసంపత్ప్రదంనౄణాం పుత్రదంపుత్రకామినామ్॥ ధనదంధనకామానాంరాజ్యదంరాజ్యకామినామ్। ఆషాఢమాసశుక్లేతుద్వాదశ్యాంపౌర్ణమీదినే ॥ వ్యతీపాతేచసంక్రాంతౌదద్యాద్దానమనుత్తమం। బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంపుణ్యవర్ధనమ్॥ పౌర్ణమాస్యాంప్రాతరుత్థాయ స్నాత్వాచవ్యయథావిధి। నిత్యకర్మాణిసర్వాణ్యస్వగృహేదేవతాలయే॥ గోమయేనవిలిప్యాథ రంగవల్ల్యాద్యలంకృతే। తస్మిన్నష్టదళంపద్మంరచయిత్వాసుశోభనమ్ ॥ తత్రనిక్షిప్యధాన్యంచతండులాన్పూర్వసంఖ్యయా। అమత్రంస్థాపయేత్తత్రదశాష్టపలసంయుతమ్ ॥ తండులైఃపూరయిత్వాతుతత్రపద్మంలిఖేత్సునః॥ వస్త్రేణవేష్టయేత్తాంస్యతత్రదేవాప్రపూజయేత్॥ పలద్వయేనస్వర్ణేనతదర్ధేనవిచక్షణః। రామంశ్యామంవిశాలాక్షంసర్వాభరణభూషితమ్॥ సింహాసనేసమావిశ్యధ్యాయేత్తంముద్రయాసహ। తేనైవస్వర్ణమానేనలక్ష్మణంకారయేత్తదా॥ తిష్ఠంతమంజలింబద్ధ్వాకక్షేచాపధ్వయంముదా। దధతంరామపార్శ్వేతు నిర్మలంనియతేంద్రియమ్॥ ఏవంకృత్వోభయోర్దేవౌక్షీరస్నపనమాచరేత్। నిక్షిపేత్పాత్రమధ్యేతుపూజ

యేదుపచారకైః॥ రామరాఘవమహాబాహోకౌసల్యాగర్భసమ్భవ। పూజామిమాంగృహీత్వాశుఋద్ధిఫలదోభవ॥ ఇతిరామపూజామంత్రః॥ సౌమిత్రేలోకసౌమిత్రేసర్వపాపహరావ్యయ। పాపంమేసకలంఛిందిపుత్రందేహిసువర్చసమ్॥ ఇతిలక్ష్మణపూజామంత్రః॥ గంధపుష్పాక్షతైర్ధూపైర్దీపైస్తైర్నైవేద్యవందనైః। మహోపహారుపచారైశ్చపూజయిత్వాయథాక్రమమ్॥ ప్రదక్షిణమనుప్రజ్యనమస్కారంసమాచరేత్ । బ్రాహ్మణాయసుశీలాయపత్నీపుత్రవతేముదా॥ అభ్యర్చ్యగంధపుష్పాద్యైర్దద్యాద్రామంసలక్ష్మణం! ఉదఙ్ముఖాయవిప్రాయస్వయమింద్రాననశ్శుచిః॥ వామేనకాంస్యంసంగృహ్ణాన్దక్షిణేనాక్షతాన్వహన్। అమంత్రంసర్వపాపఘ్నంపుత్రప్రదమపుత్రిణాం॥ సర్వపాపహరంయస్మాదతశ్శాంతింప్రయచ్ఛమే॥ అథరామప్రతిమాదానమంత్రః॥ అయోధ్యాధిపతేవీరశ్రీరామకరుణాసిన్ధో। పూర్వజన్మసముద్భూతమిహజన్మసమ్భవమ్॥ తత్సర్వంనాశమాయాతుత్వత్ప్రసాదాజ్జగద్గురో। రామత్వామహమభ్యర్చ్యసర్వపాపాపనుత్తయే॥ దాస్యామివిప్రవర్యాయసర్వక్లేశయోభివృద్ధయే। అనయాపూజయాస్వామిన్ప్రసన్నోభవమేసదా॥ పుత్రందేహియశోదేహిరాజ్యందేహిజనార్దన। అనేనదానమాత్రేణ పాపంసంహర్తుమర్హసి॥ సర్వపాపహరోయస్మాదతశ్శాంతింప్రయచ్ఛమే॥ అథలక్ష్మణప్రతిమాదానమంత్రః॥ రామానుజజగద్బంధోగృహాణేదంతవార్చనమ్। సర్వపాపహరంయస్మాదతశ్శాంతింప్రయచ్ఛమే॥ తతస్సుదక్షిణాదేయావిత్తశాఠ్యవివర్జితమ్। సపద్వ్రఫలమాసాద్యపుత్రమాప్నోతిసర్వదా॥ దరిద్రోలభతేవిత్తంబ్రహ్మచారీతుకన్యకామ్। సువాసినీపుత్రకామాపుత్రమాప్నోతిసర్వదా॥ మోక్షకామోలభేన్మోక్షంరోగీరోగాత్ప్రముచ్యతే। ఆషాఢశుద్ధపౌర్ణమాస్యాంస్రోమనస్సమైస్మనీషిభిః। ద్వాదశ్యామథవారాజన్కార్యమేతద్వ్రతంముదా॥ ఇతిహేమాద్రౌవారాహోక్తరామలక్ష్మణప్రతిమాదానవిధిః॥

(౨౮౮) ఇకనురామలక్ష్మణప్రతిమాదానవిధినిదెలుపుచున్నాము॥ సర్వపాపములనుబోగొట్టునదియును, సర్వసంపదలనుగలుగజేయునదియును, పుత్రప్రదమును, ధనకాములకుధనమునిచ్చునదియును, రాజ్యకాములకురాజ్యమునిచ్చునదియును, నగురామలక్ష్మణప్రతిమాదానమును, ఆషాఢశుక్లద్వాదశియందైనను, పూర్ణిమాదివసమునందైనను, వ్యతీపాతమునందైనను, సంక్రాంతియందైనను, జేయవలయును. ఇద్యాది బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులకునలుగురికిని పుణ్యమునుగలుగజేయును- పౌర్ణమియందుప్రాతఃకాలమునకుముందుగస్రసనుమేల్కాంచి శాస్త్రోక్తప్రకారముగ నాచమనమును జే

సినిత్యకర్మలనాచరింపవలయును. పిమ్మటస్వగృహమునందైనను, దేవాలయమునందైనను గోమయముచేతనలికి రంగవల్లులను బెట్టవలయును. ఆరంగవల్లులమధ్యయందు, అష్టదళపద్మమునురచించి దానియందు ధాన్యమునుంచి పూర్వోక్తప్రకారముగ దండులములనుబోసి పదునెనిమిదిపలములపరిమాణముగలప్రతిమను దానియందుస్థాపనను జేయవలయును. పిమ్మట, తండులములచేత బూరించియచ్చట, పద్మమునులిఖింపవలయును. అనంతరమందు కాంస్యమును వస్త్రముచేతజుట్టి యచ్చటదేవతలనుబూజింపవలయును. పిమ్మట రెండుపలములసువర్ణముచేతఁ జేయబడినదియును, సర్వాభరణభూషితమును నైనరామవిగ్రహమునుసింహాసనమునందుంచి ముద్రాపూర్వకముగ ధ్యానమును జేయవలయును. లక్ష్మణవిగ్రహమునుగూడ రెండుపలముల సువర్ణముచేత జేయింపవలయును. ఆలక్ష్మణవిగ్రహమును దోసిలియొగ్గియున్న విధముగాను, కక్షయందుధనుర్ద్వయమును ధరించియున్నవిధముననునిర్మించి రామునిసమీపమునందుంచవలయును. ఇట్లు రామలక్ష్మణులనిరువురనుస్థాపించి పిమ్మటక్షీరాభిషేకమును జేయవలయును. అనంతరమందావిగ్రహములను పాత్రమధ్యయందుబెట్టి షోడశోపచారపూజనుసలుపవలయును. "రామరామమహా... ఫలదోభవ,, అనునదిరామపూజామంత్రము. "సౌమిత్రేలోకసౌమిత్రే... జేహిసువర్చసమ్,, అనునదిలక్ష్మణపూజామంత్రము. అనంతరమందుప్రదక్షిణనమస్కారములను జేసి మిగుల శాంతుడును, పత్నీపుత్రవంతుడును, నగుబ్రాహ్మణుని గంధపుష్పాదులచేత బూజించి యుదఙ్ముఖుడగునట్లు సేసి యారామలక్ష్మణవిగ్రహమును దానముసేయవలయును. దానమునుజేయునపుడు మూలగ్రంథమునందు జెప్పబడిన దానమంత్రములనుచ్చరింపవలయును. ఇట్టివ్రతము నెవ్వరో కాంతులో జేయునో యాశోకరోగము తీరునని తాత్పర్యము. ఇట్లనివరాహపురాణమునందు జెప్పబడెను.

——❋ అఘమర్షణమ్. ❋——

(౫౫౫) అథాఘమర్షణవిధిమాహ॥ దేవలః॥ ఆత్మదేహవిశుద్ధ్యర్థం కర్తవ్యమఘమర్షణమ్। ప్రాయశ్చిత్తేచక్రత్వాదౌతులాదానాదిషుద్విజః॥ వ్రతేషూద్యాపనవిధౌకర్తవ్యమఘమర్షణమ్। పంచగంగాసురాజేన్ద్రనకుర్యాదఘమర్షణమ్॥ సముద్రగాసుసర్వత్రనకుర్యాదఘమర్షణమ్। వాపీకూపతటాకేషుకర్తవ్యమఘమర్షణమ్॥ పరాశరః॥ క్రత్వాదౌచతులాదానె ప్రాయశ్చిత్తేషుకర్మసు। చండాలాదిషుసంస్పర్శే స్వదారేషుదివాగమే॥ దురన్నెదుష్ప్రతిగ్రాహెదుష్టసంసర్గసంగమే। [illegible] సర్వత్రాఘమర్షణమీరితమ్॥

స్త్రైమేతత్పేహ్యేవప్రాప్తేతులాచార్యాదిసంగ్రహే। దుర్జనైస్స్పర్శసమ్భాషేత్వఘమర్షణమీరితమ్॥ సంధ్యాదినిత్యకర్మాణిపరిత్యజ్యాయదావసేత్ । శాన్తియాదిషుమంత్రేషుజప్యంచైవాఘమర్షణమ్ ॥ అకార్యకర్మకర్తుశ్చమహాపూర్ణాదిభోజనే। సర్వపాపవిశుద్ధ్యర్థమఘమర్షణమీరితమ్ ॥ ఏకోద్దిష్టేషుశ్రాద్ధేషుసపిండీకరణాదిషు। యోభోక్తాసద్విజఃకుర్యాదఘమర్షణమాదరాత్॥ పితాపితామహశ్చైవతథైవప్రపితామహః। యదాచరంతితేత్సుత్రాస్తస్యథాహ్యఘమర్షణమ్॥ సూతకద్వితయేభోక్తాభోక్తావైచౌళకర్మణి । యజ్ఞకర్మణిభోక్తాచాప్యఘమర్షణమాచరేత్ ॥ యానియానిహనింద్యానికర్మాణిసుబహూనిచ। తాన్యాచరన్సదాప్రస్సకుర్యాదఘమర్షణమ్ ॥ అఘమర్షణప్రకారమాహ॥ మార్కండేయః॥ మనసాపాపసంచయం పూర్వజన్మహితమాచరన్। తటాకేదీర్ఘికాంవాపిగత్వాశుచిరతన్ద్రితః ॥ పురీషమూత్రేసంత్యజ్యశౌచంకుర్యాత్తదంద్రితః। ద్విరాచమ్యశుచిర్భూత్వా నారాయణమనుస్మరన్ మలాపకర్షణంకృత్వానిత్యకర్మసమాప్యచ । ప్రాయశ్చిత్తేతథాన్యేవాసంకల్ప్యవిధిపూర్వకమ్॥ నాభిదఘ్నజలంగత్వాసూర్యస్యాభిముఖశ్శుచిః । సపవిత్రోదర్భపాణిస్స్నానాంతేమంత్రముచ్చరేత్ ॥ మంత్రాన్నైమార్జనేద్ద్వైబర్బ్రాహ్మదేహవిశుద్ధయే। పవమానస్సువర్జనః॥ హిరణ్యశృంగమిత్యనువాకః। సర్వేషువాఏషలోకేష్విత్యనువాకః। ప్రజాపతేరతసోష్వేత్యనువాకః। దేవస్యత్వేతిమార్జనంసమాప్యతత్రదేవర్షిపితౄన్తర్పయిత్వాద్విరాచమ్యధౌతవస్త్రంపరిధాయమౌనీభవేత్। స్నానవస్త్రంనిష్పీడ్యవామప్రకోష్ఠే నిక్షిప్యద్విరాచమ్యశుచిర్భవేదితి॥ మనుః॥ వస్త్రంచతుర్గుణీకృత్యకూలైః పీడయేత్తథా।వామప్రకోష్ఠేనిక్షిప్యద్విరాచమ్యశుచిర్భవేత్ ॥ ఇత్యఘమర్షణంకృత్వాప్రాయశ్చిత్తార్థమాగతాంపరిషదం నత్వానారాయణమనుస్మరన్ కృతంపాపంమనసినిధాయపుత్రాదికం ధృత్వాపత్నీపుత్రపరివేష్టితస్తదనుమతః పరిషదంగచ్ఛేత్ప్రాయశ్చిత్తి। ఇతరస్తునిత్యకర్మాదికంకృత్వాదోషబుద్ధింనాచరేత్ ॥ ఇత్యఘమర్షణస్నానవిధిస్సర్వేషామ్॥

(౫౫౫) ఇకనఘమర్షణవిధిని దెల్పుచున్నాడు ॥ ఆత్మదేహశుద్ధికొఱకునఘమర్షణమును జేయవలయును. తులాదానాదులయందును ముందుగ ప్రాయశ్చిత్తమును జేసికొని వ్రతావసానకాలమునం దఘమర్షణము నాచరింపవలయును. పంచగంగలయందును, సముద్రమునుబోంచెడినదులయందును, అఘమర్షణమును జేయనక్కఱ లేదు. వాపీకూపతటాకములయం దఘమర్షణమును జేయవలయునని దేవలుఁ డువచించె. క్రత్వాదియందును, తులాదానమునందు

ను, ప్రాయశ్చిత్తకర్మలయందును, చండాలాదిసంస్పర్శయందును, స్వభార్యలతో బగటియందురతికేళినిసల్పినపుడును, దురన్నదుర్దానములను ప్రతిగ్రహించినసమయమునందును, పానముచేయదగనివానిని బానముసేసినకాలములయందును, అఘమర్షణము నాచరింపవలయును. దొంగతనమునందును, శయ్యాదానమునందును, తులాదానాదులయందును, దుర్జనులతోగూడసంభాషణయందును, అఘమర్షణమును జేయవలయును. సంధ్యాదినిత్యకర్మలనువదలినవాడును, శాస్త్రీయాదిమంత్రములయందు గోర్కెచేత జపమును జేయువాడును, అఘమర్షణమునాచరింపవలయును. అకార్యకర్మలను జేయువాడును, మహాపూగ్యాదిభోజనమును జేయువాడును, స్వదోషనివృత్తికొఱకఘమర్షణమునాచరింపవలయును. ఏకోద్దిష్టశ్రాద్ధములయందును, సపిండీకరణాదులయందును, భోజనమును జేసినవాడఘమర్షణమునాచరింపవలయును. పితృపితామహప్రపితామహులవలంబించిన యాచారానుసారముగ సంచరించనివాడఘమర్షణమునాచరింపవలయును. సూతికద్వితయమునందు భోజనమును జేసినవాడును, చౌలకర్మయందు భోజనమును జేయువాడును, యజ్ఞకర్మయందుభోజనమును జేయువాడును, అఘమర్షణమునాచరింపవలయును. మఱియు నింద్యములగుకర్మలలో నేదైనను నాచరించినను, అఘమర్షణమును జేయవలయునని పరాశరుడువచించె. బుద్ధిపూర్వకముగ బాపకృత్యము నాచరించినబ్రాహ్మణుడుతటాకమునకైనను, దీర్ఘికకైననుబోవలయును. పోయిశుచియైరెండుపర్యాయములాచమనమును జేసి నారాయణునిస్మరించుచు మలాపకర్షణమును జేసి నిత్యకర్మలనుసమాప్తినిబొందించి శాస్త్రోక్తప్రకారముగ సంకల్పమును జేసికొని బొడ్డులోతుగలనీళ్ళలోనికిబోయి సూర్యాభిముఖుడును, పవిత్రుడును, దర్భహస్తుడును, నైస్నానమును జేసి స్నానాంతమునందు మంత్రముచ్చరింపవలయును. మంత్రాంతమునందు దేహశుద్ధికొఱకు దర్భలచేత మార్జనమును జేసికొనవలయును. మంత్రములు "పవమానస్సువర్జనః, అనుమంత్రలోకానువాకము లేయని గ్రహింపవలయును. ఈమంత్రములచేతమార్జనమును జేసికొని దేవర్షిపితృతర్పణమును జేసి రెండుపర్యాయము లాచమనమును జేసి ధౌతవస్త్రమునుధరించి మౌనిగావలయును. స్నానవస్త్రమునిష్పీడనమును జేసి వామప్రకోష్ఠమునందుంచినవాడు రెండుపర్యాయములాచమనమును జేయవలయునని మార్కండేయుడువచించె. వస్త్రమును చతుర్గుణముగ జేసినూలమునందు నిష్పీడనమును జేయవలయును. వామప్రకోష్ఠమునందుంచి రెండుపర్యాయము లాచమనమును జేసినవాడు శుద్ధుడగునని వృషవచించె

ఇట్లు అఘమర్షణమును జేసి ప్రాయశ్చిత్తమునకుగావచ్చిన పరిషత్తునకు నమస్కారమును జేసి నారాయణుని స్మరించుచు, చేసినపాపమును మనస్సునందుంచుకొని పుండ్రాదికమును ధరించి పత్నీపుత్రపరివేష్టితుడై వారియనుమతమును బొందినవాడై పరిషత్తును బొందవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసికొనినవాడాచరింపవలయును. ఇతరుడై తే నిత్యకర్మాదికమును జేసి దోషబుద్ధినాచరింపగూడదు. ఇట్లు అఘమర్షణవిధానము సమాప్తము.

——✻ ప్రాయశ్చిత్తప్రమాణవచనాని.✻——

(౫౫౬) వందే రమాపతిం స్మృత్వా సర్వపాపహరం హరిమ్ । సర్వేషాం పాపసఙ్ఘానాం ప్రాయశ్చిత్తవిధిః కృతః॥ ఆలోడ్య సర్వశాస్త్రాణి యథాశక్తి యథామతి। క్రియతే సాధుబోధార్థం ప్రాయశ్చిత్తస్య పద్ధతిః ॥ అత్రిస్స్మృతిప్రామాణ్యమాహ॥ మనుః॥ శ్రుతిం పశ్యన్తి మునయః స్మరన్తి చ తథా స్మృతిమ్। తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైః ప్రమితం భువి। యోఽవమన్యేత తే తూభే హేతుశాస్త్రాశ్రయాన్నరః॥ స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిన్దకః విష్ణుః॥ పురాణం మానవో ధర్మస్సాఙ్గో వేదశ్చికిత్సకమ్। ఆజ్ఞాసిద్ధాని చత్వారి న హన్తవ్యాని హేతుభిః। యస్తాని హేతుభిర్హన్యాత్సోఽన్ధే తమసి మజ్జతి॥ ఇతి ప్రాయశ్చిత్తానామశాస్త్రీయత్వాభిధానే దోషోఽభిహితః॥ వ్యాసః॥ జ్యోతిషం వ్యవహారం చ ప్రాయశ్చిత్తం చికిత్సకమ్। వినా శాస్త్రేణ యో బ్రూయాత్తమాహుర్బ్రహ్మఘాతకమ్॥ తత్రాధికారిణమాహ॥ మనుః॥ అకుర్వన్విహితం కర్మ నిన్దితం చ సమాచరన్। ప్రసక్తశ్చేన్ద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః॥ యాజ్ఞవల్క్యః విహితస్యాననుష్ఠానాన్నిన్దితస్య చ సేవనాత్। అనిగ్రహాచ్చేన్ద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥ ప్రత్యవాయీ భవతి॥ నరగ్రహణం ప్రతిమలోమజాతీనామపి ప్రాప్త్యర్థం। తస్మాత్తేనేహ కర్తవ్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥ ఏవమస్యాన్తరాత్మా చ లోకశ్చైవ ప్రసీదతి। ఏవం। ప్రాయశ్చిత్తే కృతే। అస్యాన్తరాత్మా శుద్ధతయా ప్రసన్నో భవతి। లోకశ్చ సంవ్యవహర్తుం ప్రసీదతీత్యర్థః॥ ప్రాయశ్చిత్తాకరణే దోషమాహ స ఏవ॥ ప్రాయశ్చిత్తమకుర్వాణాః పాపేషు నిరతా నరాః। అపశ్చాత్తాపినః కష్టాన్నరకాన్యాన్తి దారుణాన్॥ తామిస్రం లోహశఙ్కుం చ మహానిరయశాల్మలీ। రౌరవం కుడ్మలం పూతిమృత్తికం కాలసూత్రకం॥ సంఘాతం లోహితోదం చ సవిషం సమ్ప్రపాతనం। మహానరకకాకోలం సఞ్జీవనమహాపథం॥ అవీచిమన్ధతామిస్రం కుమ్భీపాకం తథైవ చ। అసిపత్రవనం చైవ తాపనం చైకవింశకమ్॥ మహాపాతకజైర్ఘోరైరుపపాతకజైస్తథా। అన్వితా యాన్త్యచరితప్రాయశ్చిత్తా నరాధమాః॥ ఇతి॥ ఏకవింశకమిత్యేతత్ప్రాధాన్యేన నరకాపేక్షయో

క్తమ్॥ మహాపాతకజైత్యాదిపాపమాత్రోపలక్షకమ్। తథాచపాపతారత
మ్యాత్ఫలతారతమ్యందర్శితం॥ విష్ణుధర్మోత్తరే॥ అష్టావింశతికోట్యస్తు ఘోరా
ణాంనరకాణివై। మహాపాతకినశ్చాపి సర్వేషునరకేష్వపి॥ ఆచంద్రతారా
కంయావత్పీడ్యంతేవివిధైర్వధైః। ఉపపాతకినశ్చాన్యే నిరయార్ణవకోటిషు॥ ఏ
కవింశతిసంఖ్యేషు పాదోనబ్రహ్మకల్పకమ్। చతుర్దశసుపచ్యంతే కల్పార్ధంస
మపాపినః॥ ఉపపాతకినశ్చాపి తదర్ధంయాంతిమానవాః। శేషైఃపాపైస్తద
ర్ధంచ కాలక్లప్తిరియంస్మృతేతి॥ ఇదంప్రకాశకృతపాపఫలం॥ రహసికృత
పాపఫలమాహ॥ పరాశరః॥ పాతకేతుసహస్రంస్యాన్మహతి ద్విగుణంభవె
త్। ఉపపాతకేతురీయంస్యాన్నరకంవర్షసంఖ్యయేతి॥ అత్రచతుఃపంచషే
షు పాతకేషుఇతరేతరతారతమ్యమూహ్యమ్॥ మహాపాతకే వర్షసహస్ర
ద్వయంనరకపాతః॥ అతిపాతకేత్వధ్యర్ధంసహస్రమ్॥ సమపాతకే సహస్ర
మ్॥ ఉపపాతకేసహస్రార్ధమ్॥ సంకలీకరణాదిషుఅధ్యర్ధశతద్వయమితి॥ య
త్తుపంచవిధపాపాన్యాహకాత్యాయనః॥ మహాపాపంచాతిపాపం తథా
పాతకమేవచ। ప్రాసంగికంచోపపాపమిత్యేవం పంచకోగణఇతి॥ అత్రపా
తకమితిసమపాపాన్యుక్తాని॥ ఉపపాతకేషు కానిచిదగమ్యాగమనాదీనిఅవా
న్తరభేదావివక్షయా ప్రాసంగికమిత్యుక్తాని॥ అత్రపాతకపాపనిర్వచనంభవి
ష్యోత్తరే॥ అధోధఃపాతనాత్పుంసాం పాతకంపరికీర్తితమ్। నరకాగ్నిషు
ఘోరేషు పాచనాత్పాపముచ్యతేఇతి॥ ప్రాయశ్చిత్తశబ్దార్థమాహాంగిరాః॥
ప్రాయోనామతపఃప్రోక్తం చిత్తంనిశ్చయఉచ్యతే॥ తపోనిశ్చయసంయుక్తం
ప్రాయశ్చిత్తంతదుచ్యతఇతి॥ అనుష్ఠితేనద్వాదశవార్షికవ్రతాదినా అవశ్యం
పాపంనివర్తతేఇతి విశ్వాసయుక్తంవ్రతానుష్ఠానలక్షణం తపఃప్రాయశ్చి
త్తమ్॥ భాష్యకారస్తు ప్రాయోవినాశః చిత్తంసంధానంవినష్టస్య సంధాన
మితి॥ విజ్ఞానయోగినా ప్రాయశ్చిత్తశబ్దః పాపక్షయార్థేనైమిత్తికేకర్మవిశే
షేరూఢఇత్యుక్తమ్॥ ఇహ తావత్కలియుగే ఆపద్బాహుళ్యాదవర్జనీయత
యాపాపసమ్భవాత్ప్రతినిమిత్తం ప్రాయశ్చిత్తస్య కర్తుమశక్యత్వాచ్ఛరీర
స్యాస్థిరత్వాత్పాపఫలానుభవే చిరకాలంఘోరతీవ్రనరకవేదనాయాస్సోఢు
మశక్యత్వాత్పాపభీరుణాపశ్చాత్తాపినా పురుషేణైకవేళయా సర్వపాపా
పనోదకం ప్రాయశ్చిత్తంసర్వథా ఆచరణీయమేవ। తత్రకాలాదర్శే మల
మాసగురుశుక్రమౌఢ్యాదిదోషదుష్టకాలే ప్రతిషిద్ధత్వాత్ శుద్ధకాలేఏకాద
శ్యామన్యస్యాం వాతిథౌ కార్యమ్॥ అగ్న్యాధానాదిశ్రౌతే వా సనాదిస్మా
ర్తేషుచ పురుషా[illegible]శుద్ధికారసిద్ధ్యర్థంచ కార్య

మేవ॥ తదుక్తంమనునా॥ శుచినాకర్మకర్తవ్యమితి॥ అంగిరసాచ॥ శౌచం స్మార్తంచకర్తవ్యం కృత్వాపావనమాత్మనః। జపంతపశ్చహోమంచ చదానంచార్చనమేవచ॥ జపఃవేదపారాయణాది॥ తపఃకృచ్ఛ్రచాంద్రాయణాది॥ హోమఃకూశ్మాండాది॥ దానంగవాదేః॥ అర్చనంవిష్ణ్వాదీనామ్॥ స్మృతిసంగ్రహకారైర్నోక్తమ్॥ విశోధ్యకాయంవిధివస్తుకృచ్ఛ్రైరితి। ఆతురస్యతుశుద్ధకాలప్రతీక్షానైవకార్యా। అశౌచాదదోషేరాత్రావపి సద్యఏవకార్యం తదుక్తంచంద్రికాయాం॥ దానైర్విశేషాదార్తస్య విధినాశుద్ధిరుచ్యతే। అనిత్యత్వాత్సద్యస్తు దానహోమాదివాంఛితః॥ వారాహపురాణే॥ వ్యతీపాతోర్ధసంక్రాంతిస్తథైవగ్రహణంరవేః। పుణ్యకాలాస్తదాసర్వే యదామృత్యురుపస్థితః॥ తదాగోభూహిరణ్యాదిదత్తంతత్క్షణాన్మియాత్॥ భవిష్యోత్తరే॥ వ్రతైర్యేపాపనిచయాస్తూలానాంకపోతవః। తేసమాసేనకథ్యంతే మనోవాక్కాయసాధనాః॥ మనుః॥ బ్రహ్మహత్యాసురాపానంస్తేయం గుర్వంగనాగమః। మహాంతిపాతకాన్యాహుః సంయోగశ్చైవతైస్సహేతి॥ యాజ్ఞవల్క్యః॥ బ్రహ్మహామద్యపస్తేన స్తథైవగురుతల్పగః। ఏతేమహాపాతకినోయశ్చతైస్సహసంవసేత్॥ మనుః॥ బ్రహ్మహాద్వాదశసమాః కుటీంకృత్వావనేవసేత్। భైక్షాశ్యాత్మవిశుద్ధ్యర్థం కృత్వాశవశిరోధ్వజమితి॥ నాగేతః॥ ద్వాదశభిర్వర్షైర్మహాపాతకినః పూయంత ఇతి॥ ఇదమజ్ఞానతఃకరణే॥ జ్ఞానతఃకరణేత్వంగిరాః॥ యఃకామతోమహాపాపం నరఃకుర్యాత్కథంచన। నతస్యశుద్ధిర్నిర్దిష్టాభృగ్వగ్నిపతనాదృత ఇతి॥ తథాతిపాతకాని పతితసంసర్గాదీన్యాహ॥ వ్యాసః॥ యోయేనసంవసేద్వర్షం సోపితత్సమతామియాత్। సతస్యైవవ్రతంకుర్యాత్తత్సంసర్గవిశుద్ధయే ఇతి॥ ఏతద్వ్యగాంగీరవిషయమ్॥ సుమంతుః॥ బ్రహ్మహత్యాసురాపానం స్తేయంగుర్వంగనాగమః। మహాపాతకసంజ్ఞాని చత్వార్యేవకలౌయుగే ఇతి॥ అతశ్చతుర్గ్రహణాదేవకాగాచ్ఛకలియుగే మహాపాతకిసంసర్గిణోన మహాపాతకిత్వం। తస్యాపి సాక్షాన్మహాపాతకిత్వే తత్సంసర్గిణోపి మహాపాతకిత్వంస్యాత్ తస్యాపిసాక్షాన్మహాపాతకిసంసర్గిత్వాత్తతః పరమప్యేవమిత్యనవస్థాస్యాత్। తస్మాత్కలియుగే సాక్షాన్మహాపాతకిసంసర్గిణోపి నమహాపాతకిత్వం। తథాచోక్తంపరాశరేణ॥ కృతేతు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమస్యతు। ద్వాపరేశాంఖలిఖితాః కలౌపారాశరాస్మృతాః॥ త్యజేద్దేశంకృతయుగే త్రేతాయాంగ్రామముత్సృజేత్। ద్వాపరేకులమేకంతు కర్తారంతు కలౌయుగే॥ వ్యాసః॥ కృతేసంభాష్యపతతి త్రేతాయాంస్పర్శనేనతు। ద్వాపరేత్వన్న

మహాపాతకలోపపాతకకర్మణా॥ స్మృతికామధేనౌ॥ సంసర్గదోషో నైవాస్యా
న్మహాపాతకినః కలౌ। ఘటికాః షట్ తథా సంసర్గదోషస్తేనాత్రైవ మహాపాతకాని
షట్ స్మృతాః॥ స్మృత్యర్థసారే॥ కలియుగే సంసర్గదోషో నాస్తీత్యుక్తమ్। ఏవం బ
హుస్మృతివచనార్థపర్యాలోచనయా పతితసంసర్గిణో దోషాభావకథనం
పాతిత్యాభావపరం సంసర్గప్రాయశ్చిత్తం తు పాదోనద్వాదశవార్షికం
కార్యమేవేతి। తస్మాత్సంసర్గిణః కలియుగేపి పాపమేవేతి సుష్ఠూక్తమ్॥ యదు
క్తం మనునా॥ సంవత్సరేణ పతతి పతితేన సహాచరన్। యాజనాధ్యాపనా
ద్యౌనాత్సద్యో నశయనాసనాత్। యాజనాధ్యాపనయానానాం నిత్యసం
బంధాత్సద్యః పతతీత్యర్థః॥ యో యేన పతితేనైషాం సంసర్గం యాతి మానవః।
స తస్యైవ వ్రతం కుర్యాత్తత్సంసర్గవిశుద్ధయే ఇతి॥ ఏతద్యుగాంతరవిషయం॥
మనుః॥ బహూనామేకకార్యాణాం సర్వేషాం శస్త్రధారిణామ్। యద్యేకో
ఘాతయేత్తత్ర సర్వే తే ఘాతకాః స్మృతాః॥ ఉపరుంధన్ పరం హంతుం సమ
ర్పయతి యః పుమాన్। యశ్చానుగ్రాహకస్సోపి బ్రహ్మఘాతక ఇష్యతే। విష్ణుః॥
రాగాద్ద్వేషాత్ప్రమాదాద్వా స్వతః పరత ఏవ వా। ఘాతయేద్బ్రాహ్మ
ణం కశ్చిత్స భవేద్బ్రహ్మఘాతకః॥ భృతకో యది తం హన్యాత్సోపి స్యాద్బ్ర
హ్మఘాతకః। సోపి భృతేః ప్రదాతా భృతకశ్చ బ్రహ్మఘాతక ఇత్యర్థః॥ ఉప
దేష్టా హ్యర్థయితా ప్రేరకశ్చేతి స త్రిధా। అనుమంతానుమననాత్సోపి ఘాతక
ఇష్యతే॥ విష్ణుః॥ ఆక్రుష్టస్తాడితో వాపి ధనైర్వా విప్రయోజితః। యముద్దిశ్య
త్యజేత్ప్రాణాన్ తమాహుర్బ్రహ్మఘాతకమ్॥ స్మృత్యంతరే॥ హంతా
మంత్రోపదేష్టా చ తథా సమ్ప్రతిపాదకః। ప్రోత్సాహకస్సహాయశ్చ తథా
మార్గానుదేశకః॥ ఆశ్రయశ్శస్త్రదాతా చ భక్తదాతా చ కర్మిణామ్। ఉపేక్ష
కశ్శక్తిమాంశ్చేద్దోషవక్తానుమోదకః॥ అకార్యకారిణాం తేషాం ప్రాయశ్చి
త్తం ప్రకల్పయేదితి। ఏవం సురాపానసువర్ణస్తేయగుర్వంగనాగమనేషు య
థాయోగం మనుగ్రాహకాదయో బోద్ధవ్యాః॥ ఏషాం పాపతారతమ్యాత్ఫల
తారతమ్యం కల్ప్యమ్॥ అతిపాతకాన్యాహ మనుః॥ హత్వా గర్భమవిజ్ఞాతమే
తదేవ వ్రతం చరేత్। రాజన్యవైశ్యౌ చేజానావాత్రేయీమేవ చ స్త్రియమ్॥
ఈజానా యాగదీక్షామధ్యవర్తినా ఆత్రేయీ అత్రిగోత్రజా। అంగిరసా ఋతు
మతీ। ఉశనసా కదాప్యపుష్పవతీ। మరీచినా పతివ్రతా॥ తథా॥ ఉక్త్వా చైవా
నృతం సాక్ష్యే ప్రతిరుధ్య గురుం తథా। అపహృత్య చ నిక్షేపం కృత్వా చ స్త్రీసు
హృద్వధమ్॥ అనృతం సాక్ష్యే వర్ణివధప్రాప్తికరమ్। ప్రతిరోధః క్రోధావేశః।
నిక్షేపో బ్రాహ్మణసంబంధీ। స్త్రీ [illegible] త్యాదిగుణయుక్తా

స్వవర్ణస్థావా॥ తథాయాజ్ఞవల్క్యః॥ చరేద్వ్రతమహత్వాపి ఘాతార్థం చే
త్సమాగత ఇతి॥ అత్ర స్మృతిః॥ ధర్మార్థసన్నిపాతేఽర్థగ్రాహిణ ఏతదేవేతి॥ వి
ష్ణుః॥ నృపతివధే మహావ్రతమితి॥ భవిష్యోత్తరే॥ దుస్థితం సుస్థితం వాపి శివలిం
గం నచాలయేత్ । అన్యథాతు కృతే లింగే అతిపాతకమాప్నుయాత్॥ ఉత్త
మానాంచామరాణా మస్యథాగంబణెసతి । విప్రస్యైవ వ్రతం కుర్యాద్విప్ర
దేవాసమాస్మృతా॥ అగ్నిహోత్రార్థకపిలాం హత్వా బ్రహ్మహణో వ్రతం।
యాజ్ఞవల్క్యః॥ పితుస్స్వసారం మాతుశ్చ మాతులానీం స్నుషామపి। మా
తుస్సపత్నీం భగినీమాచార్యతనయాం తథా॥ ఆచార్యపత్నీం స్వసుతాం గచ్ఛం
స్తు గురుతల్పగః। లింగం ఛిత్వా వధస్తస్య సకామాయాస్స్త్రియా అపి॥ నార
దః॥ మాతా మాతృష్వసా శ్వశ్రూర్మాతులానీ పితృష్వసా। పితృవ్యసఖిశి
ష్యస్త్రీ భగినీ తత్సఖిస్నుషా॥ దుహితాచార్యభార్యా చ సగోత్రా శరణాగ
తా। రాజ్ఞీ ప్రవ్రాజితా ధాత్రీ సాధ్వీ వర్ణోత్తమా చ యా। ఆసామన్యతమాంగ
చ్ఛన్ గురుతల్పగ ఉచ్యతే। శిశ్నస్యోత్కర్తనాత్తత్ర నాన్యో దండో విధీయతే॥
అత్ర మాతా మాతృసపత్నీ తస్యా అపి మాతృత్వవ్యపదేశాత్॥ వ్యాసః॥ గ
ర్భిణ్యుదక్యా విజ్ఞాతాః కన్యామార్తామనిచ్ఛతీమ్। గురుతల్పం చరేద్గత్వా గాం
స్వయోనిం సఖిస్త్రియమితి॥ వ్యాఘ్రః॥ ఆశ్రితస్యాపి దుష్టాత్మా ఆహితాగ్నే
శ్చ యోగినః। ఏషాం పత్నీం సుతాం గత్వా గురుతల్పవ్రతం చరేదితి॥ ఉశ
నా॥ చండాల్యాం గర్భమాధాయ గురుతల్పవ్రతం చరేదితి॥ అత్రావిజ్ఞాతగ
ర్భహననాదీనామతిపాతకత్వం॥ తథా చోక్తం॥ అతిదిష్టం తు యత్పాపమతి
పాతకముచ్యతే । అతిపాతకమావృత్తం మహాపాతకతామియాత్॥ అతి
దిష్టస్యాపదిష్టాన్న్యూనత్వాత్తద్వ్రతం సహ । అతిదిష్టేషు సర్వత్ర పాదో
నం తద్వ్రతం చరేత్ ఇతి॥ పతితసంసర్గ్యనుగ్రాహకప్రయోజకానుమంత్రని
మిత్తకర్త్రాదీనాం తత్తన్నిమిత్తనిశ్చయక్రమేణ యథాయోగం నవవార్షికం ష
డ్వార్షికం సార్ధచతుర్వార్షికం త్రైవార్షికం చ వ్రతం కల్పనీయమ్॥ అథ పతనీ
యాని॥ యమః॥ మాతృష్వసా మాతృసఖీ దుహితా చ పితృష్వసా। మాతులా
నీ స్వసా శ్వశ్రూర్గత్వా సద్యః పతేద్ద్విజః॥ గౌతమః॥ మాతృపితృయోని సంబం
ధాగస్తేననాస్తికనిందితకర్మాభ్యాసి పతితాత్యాగ్యపతిత త్యాగినః పతితాః
పాతకసంయోజకాశ్చేతి॥ బౌధాయనోపి॥ అథ పతనీయాని॥ సముద్రయా
నం బ్రహ్మస్వన్యాసాపహరణం భూమ్యనృతవదనం సర్వపణ్యైర్వ్యవహార
ణం శూద్రసేవనం శూద్రాభిగమనం యశ్చ శూద్రాయామభిప్రజాయతే తద
పత్యం చ భవతి॥ స్త్రీణాం విశేషపతనీయాన్యాహ॥ యాజ్ఞవల్క్యః॥ నీచాభిగమ

నంభర్తృఘాతనం గర్భనాశనమ్। విశేషపతనీయాని స్త్రీణామేతాన్యపిధ్రువమ్॥ చాంద్రస్తు పరిత్యాజ్యా శిష్యగా గురుగా చ యా। పత్నీఘ్నీ చ విశేషేణ జుంగితోపగతా చ యా॥ జుంగితః ప్రతిలోమసంగతో హీనవర్ణో వా ॥ బ్రహ్మహత్యాసమాన్యాహ మనుః॥ అనృతంచ సముత్కర్షే రాజగామి చ పైశునమ్। గురోశ్చాలీకనిర్బంధస్సమాని బ్రహ్మహత్యయా॥ విష్ణుః ॥ యాగస్థక్షత్రియవైశ్యవధో రజస్వలాయాశ్చాంతర్వత్న్యాశ్చ ఆత్రేయ్యా అవిజ్ఞాతగర్భస్య శరణాగతస్య చ ఘాతనం బ్రహ్మహత్యాసమానీతి॥ శివధర్మోత్తరే॥ యస్తు విద్యాభిమానేన నీచో జల్పతి సద్ద్విజమ్। ఉదాసీనం సభామధ్యే బ్రహ్మహా స ప్రకీర్తితః॥ పరదోషమవిజ్ఞాయ నృపకర్ణేజపైస్తు యః। పాపీయాన్పిశునః క్షుద్రః స చైవ బ్రహ్మహా స్మృతః॥ దేవద్విజగవాం భూమిం పూర్వదత్తాం హరేత యః। ప్రణష్టామపి కాలేన తమాహుర్బ్రహ్మఘాతకమ్॥ సురాపానసమాన్యాహ॥ మనుః॥ బ్రహ్మోజ్ఝతా వేదనిందా కౌటసాక్ష్యం సుహృద్వధః। గర్హితానాద్యయోర్జగ్ధిస్సురాపానసమాని షడితి॥ స్వర్ణస్తేయసమాని॥ నిక్షేపస్యాపహరణం నరాశ్వరజతస్య చ। భూమివజ్రమణీనాం చ స్వర్ణస్తేయసమం స్మృతమ్॥ తత్ర యాజ్ఞవల్క్యః॥ స్త్రీధేనుహరణం బ్రాహ్మణక్షేత్రహరణం సువర్ణస్తేయసమం॥ దేవబ్రాహ్మణరాజ్ఞాం తు విజ్ఞేయం ద్రవ్యముత్తమమిత్యుక్తత్వాదిమాని దేవబ్రాహ్మణరాజసంబంధీని॥ గురుతల్పసమాని॥ రేతస్సేకస్స్వయోనీషు కుమారీష్వంత్యజాసు చ। సఖ్యుః పుత్రస్య చ స్త్రీషు గురుతల్పసమం విదుః॥ అంత్యజాస్తు॥ రజకశ్చర్మకారశ్చ నటో బురుడ ఏవ చ। కైవర్తమేదభిల్లాశ్చ చర్మకారశ్చ సౌచికః॥ తక్షకస్తిలయంత్రీ చ సూనుశ్చక్రీ తథాధ్వజీ। నాపితో లోహకారశ్చ త ఏతే షోడశాంత్యజాః॥ విష్ణుః॥ మాతామహమాతులనృపపత్నీగమనం గురుదారసమానం॥ పితృష్వసుర్మాతృష్వసుర్గమనం శ్రోత్రియర్త్విగుపాధ్యాయమిత్రపత్న్యభిగమనమ్ స్వసుస్సఖ్యాస్సగోత్రాయా వర్ణోత్తమాయాః ప్రవ్రజితాయా నిక్షిప్తాయా గమనమితి॥ స్వయోనిః భగినీ॥ సగోత్రా జ్ఞాతిస్త్రీ॥ పురాణసారే॥ అథవా మాతరం గచ్ఛేత్స్నగచ్ఛేద్దేవదారికామ్। యదిగచ్ఛేద్గురుదారసమమితి॥ ఏవమాదీని సమపాతకాని పరిగణితాని॥ తేషాం చిత్తతోపపాతకత్వవచనం ప్రాయశ్చిత్తవికల్పార్థం। సమేత్యర్థమితి తేషాం త్రైవార్షికం వ్రతం॥ ఉపపాతకాన్యాహ మనుః॥ గోవధోఽయాజ్యసంయాజః పారదార్యాత్మవిక్రయః॥ గురుమాతృపితృత్యాగస్స్వాధ్యాయాగ్న్యోస్సుతస్య చ। పరివిత్తితానుజేన పరివేదనమేవ చ। తయోర్దానంచ కన్యాయాస్తయోరేవ తు యాజనమ్॥ కన్యాయా దూషణం చైవ వార్ధుష్యం వ్రతలోపన

మ్। తటాకారామదారాణా మపత్యస్య చ విక్రయః॥ వ్రాత్యతా బాన్ధవత్యా గో భృత్యాధ్యాపన మేవ చ। భృతాచ్చాధ్యయనాదాన మపణ్యానాం చ విక్రయః॥ సర్వాకరేష్వధీకారో మహాయన్త్రప్రవర్తనం। హింసౌషధీనాం స్త్ర్యాజీవాభిచారో మూలకర్మ చ॥ ఇన్ధనార్థ మశుష్కాణాం ద్రుమాణా మవపాతనమ్। ఆత్మార్థం చ క్రియారమ్భో నిన్దితాన్నాదనం తథా॥ అనాహితాగ్నితా స్తేయమృణానా మనపక్రియా। అసచ్ఛాస్త్రాధిగమనం కౌశీలవ్యస్య చ క్రియా॥ ధాన్యకుప్యపశుస్తేయం మద్యపస్త్రీనిషేవణమ్। స్త్రీశూద్రవిట్ క్షత్రవధో నాస్తిక్యం చోపపాతకమ్॥ యాజ్ఞవల్క్యః॥ లవణక్రియా వధజీవన హింస్రయన్త్రవిధాన శూద్రప్రేష్యహీనసఖ్యహీన యోనినిషేవణా నాశ్రమనాసపరాన్నపరిపుష్టతా సర్వాకరాధికారా సత్ప్రతిగ్రహాదీని॥ విష్ణుః॥ అనృతవచనం సముత్కర్షే రాజగామి పైశున్యం గురోశ్చాలీకనిర్బన్ధః అభక్ష్యాణాం చ భక్షణమిత్యాదీః॥ శంఖలిఖితౌ॥ కృతఘ్నకూట వ్యవహారబ్రాహ్మణవృత్తిఘ్నమిథ్యాభిశంసి పత్నీత్యాగీత్యాది॥ వరాహపురాణే॥ బ్రాహ్మపంక్తిభేదక ఇతి పంక్తిభేదాదికం దోషాధిక్యం ప్రతిపాదితం విద్వద్బ్రాహ్మణపంక్తిభేదాచరణవిషయమ్॥ అన్యథాపంక్తిభేదాచరణదోషస్య ప్రకీర్ణకత్వాత్॥ స్మృత్యన్తరే॥ విధవాదేవదాసీ వేశ్యావర్ధకీదాసీగమనాదీన్యపపాతకానీతి॥ సంకలీకరణాన్యాహ॥ మనుః॥ ఖరాశ్వోష్ట్రమృగేభానామజావికవధస్తథా। సంకలీకరణం జ్ఞేయం మీనాహిమహిషస్య చ॥ మలినీకరణాని॥ మనుః॥ కృమికీటవయోహత్యా మద్యానుగతభోజనమ్। ఫలైధఃకుసుమస్తేయమధైర్యం చ మలావహం॥ గోధాదిహననం చ॥ అపాత్రీకరణాని॥ మనుః॥ నిన్దితేభ్యో ధనాదానం వాణిజ్యం శూద్రసేవనం। అపాత్రీకరణం జ్ఞేయమసత్యస్య చ భాషణం॥ జాతిభ్రంశకరాణి॥ మనుః॥ బ్రాహ్మణస్య రుజఃకృత్వా ఘ్రాతిరఘ్రేయమద్యయోః। జైహ్మ్యం పుంసి చ మైథున్యం జాతిభ్రంశకరం స్మృతం॥ పశుగమనమయోనౌ నిషేచనం చ॥ అవశిష్టం సర్వం ప్రకీర్ణకశబ్దవాచ్యం॥ తథా చ విష్ణుః॥ యదనుక్తం తత్ప్రకీర్ణకమితి॥ ఏవం మూలవచనబోధితాని ప్రాయశ్చిత్తనిమిత్తభూతాని పాపాని నవవిధాని। మహాపాతకాన్యతిపాతకాని సమపాతకాన్యుపపాతకాని సంకలీకరణాని మలినీకరణాని అపాత్రీకరణాని జాతిభ్రంశకరాణి ప్రకీర్ణకానీతి॥ యథాహ విష్ణుః॥ పురుషస్య కామక్రోధలోభాఖ్యం రిపుత్రయం సుఘోరం భవతి। తేనాయమాక్రాన్తో మహాపాతకాతిపాతకసమపాతకోపపాతకేషు ప్రవర్తతే। సంకీర్ణకరణేషు మలినీకరణేషు అపాత్రీకరణేషు జాతిభ్రంశకరణేషు ప్రకీర్ణకరణేషు చేతి॥ తాని

చ పాపాని ప్రత్యేకం ద్వివిధాని రహస్యకృతాని ప్రకాశకృతాని చేతి॥ యత్పాపం కర్తృవ్యతిరిక్తేన కేనచిదపి న జ్ఞాతం తద్రహస్యం॥ తస్య ప్రాయశ్చిత్తమపి రహస్యమేవ కర్తవ్యం॥ తథా చ యమహారీతౌ। రహస్యే రహస్యం ప్రకాశే ప్రకాశమితి॥ రహస్యత్వాదేవ నాస్తి పరిషదనుమత్యపేక్షా। తదాహతుర్బృహస్పతి యాజ్ఞవల్క్యౌ॥ విఖ్యాతదోషః కుర్వీత పర్షదోనుమతం వ్రతం। అనభిఖ్యాతదోషస్తు రహస్యవ్రతమాచరేదితి॥ నచ పరిషదం వినా ప్రాయశ్చిత్తజ్ఞానాభావ ఇతి శంకనీయం। శాస్త్రజ్ఞస్య స్వత ఏవ తద్విజ్ఞానసంభవాత్। ఇతరేణాపి బుద్ధిమతా విద్వద్భ్యో వ్యాజేనావగంతుం శక్యత్వాత్॥ రహస్యపాపం స్వల్పేనాపి జపాదినా నివర్తతే॥ అత ఏవ ప్రాజాపత్యాదివ్రతానాం జపాదీనాం చ వ్యవస్థామాహ॥ మనుః॥ ఏతైర్ద్విజాతయః శోధ్యా వ్రతైరావిష్కృతైనసః। అనావిష్కృతపాపాంస్తు మంత్రైర్హోమైశ్చ శోధయేదితి॥ ప్రకాశకృతానాంతు పరిషదనుమత్యా ప్రాయశ్చిత్తం కార్యం విఖ్యాతదోషః కుర్వీత పర్షదోనుమతం వ్రతమిత్యుక్తబృహస్పతియాజ్ఞవల్క్యవచనాత్॥ పరాశరః॥ వేదవేదాంగవిదుషాం ధర్మశాస్త్రం విజానతాం। స్వకర్మరతవిప్రాణాం స్వకం పాపం నివేదయేదితి॥ మనుః॥ ఖ్యాపనేనానుతాపేన తపసాధ్యయనేన చ। పాపకృన్ముచ్యతే పాపాత్తథా దానేన చాపది॥ యథా యథా నరోఽధర్మం స్వయం కృత్వానుభాషతే। తథా తథా త్వచేవాహిస్తేనాధర్మేణ ముచ్యతే॥ యథా యథా మనస్తస్య దుష్కృతం కర్మ నిందతి। తథా తథా శరీరం తత్తేనాధర్మేణ ముచ్యత ఇతి॥ పరిషల్లక్షణమాహ॥ మనుః॥ దశావరా వా పరిషద్యం ధర్మం పరికల్పయేత్॥ త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్ త్రైవిద్యో హైతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః। త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా॥ ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ। త్ర్యవరా పరిషజ్జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే॥ ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ద్విజోత్తమః। స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానాముదితోఽయుతైరితి॥ యాజ్ఞవల్క్యః॥ చత్వారో వేదధర్మజ్ఞాః పర్షత్త్రైవిద్యమేవ వా। సా బ్రూతే యం స ధర్మః స్యాదేకో వాధ్యాత్మవిత్తమ ఇతి॥ పరాశరః॥ చత్వారో వా త్రయో వాపి యం బ్రూయుర్వేదపారగాః। స ధర్మ ఇతి విజ్ఞేయో నేతరైస్తు సహస్రశః॥ చత్వారో వా త్రయో వాపి వేదవంతోఽగ్నిహోత్రిణః। బ్రాహ్మణానాం సమర్థా యే పరిషత్సాభిధీయతే॥ అనాహితాగ్నయో యేఽన్యే వేదవేదాంగపారగాః। పంచ త్రయో వా ధర్మజ్ఞాః పరిషత్సా ప్రకీర్తితా॥ మునీనామాత్మవిద్యానాం ద్విజానాం యజ్ఞయాజినాం। వేదవ్రతేషు స్నాతానామేకోఽపి పరిషద్భవేత్॥ ప్రమాణమార్గం మార్గంతో యో ధర్మం ప్ర

వదంతి వై। తేషాముద్విజతే పాపం సద్భూతగుణవాదినాం॥ యథాశ్మనః స్థితం తోయం మారుతార్కేణ శుష్యతి। ఏవం పరిషదాదేశాత్ప్రణశ్యతి దుష్కృతం॥ నైవ గచ్ఛతి కర్తారం నైవ గచ్ఛతి పర్షదం। మారుతార్కాదిసంయోగాత్పాపం నశ్యతి తోయవత్॥ అమేధ్యాని తు సర్వాణి ప్రక్షిప్య ఉదకే యథా। తత్రైవ క్షిప్తం సర్వం ప్రక్షిపేచ్ఛ ద్విజానలే॥ యే పఠంతి ద్విజా వేదం పంచయజ్ఞరతాశ్చ యే। త్రైలోక్యం తారయంత్యేతే పంచేంద్రియరతా అపి॥ ధర్మశాస్త్రరథారూఢా వేదఖడ్గధరా ద్విజాః। క్రీడార్థమపి యద్బ్రూయుస్స ధర్మః పరమస్స్మృతః॥ చాతుర్వైద్యో వికల్పీ చ అంగవిద్ధర్మపాఠకః। వృద్ధాశ్చాశ్రమిణో ముఖ్యాః పర్షదేషా దశావరేతి॥ చతుర్ణాం వేదానాం పారగాశ్చాతుర్వైద్యాః। వికల్పాన్యోఽస్య రూపముక్తమంగిరసా॥ ధర్మస్యార్థదర్శకశ్చ ప్రాయశ్చిత్తక్రమస్య చ। త్రయాణాం యః ప్రమాణజ్ఞస్స వికల్పీ భవేద్ద్విజః॥ శబ్దశ్ఛందసి కల్పే చ శిక్షాయాం చ సునిశ్చితః। జ్యోతిషాంగణితే చైవ సనైరుక్తోంగవిద్భవేత్॥ వేదవిద్యావ్రతస్నాతః కులశీలసమన్వితః। అనేకధర్మశాస్త్రజ్ఞః పఠ్యతే ధర్మపాఠకః॥ బ్రహ్మచర్యాశ్రమాదూర్ధ్వం వానప్రస్థో వృద్ధశ్చోచ్యతే ఇతి। చాతుర్వైద్యాద్యుక్తవిశేషణవిశిష్టా గార్హస్థ్యాశ్రమవర్తినో దశసంఖ్యాకాః పరిషచ్ఛబ్దవాచ్యాః॥ యే చత్వారో వా త్రయో వాపీత్యాదిపక్షాః పూర్వముక్తాస్తే సర్వే మహాపాపేభ్యోర్వాచీనవిషయాః॥ యుగాంతరవిషయా వా॥ యథాహ దేవలః॥ పాపానాం తారతమ్యేన విప్రాణాం గురులాఘవం। ఏకో నార్హతి తత్కర్తుం సూచానాప్యనుగ్రహం॥ సుశాంతానాం చ విదుషాం కలౌ సంఘః ప్రశస్యతే। ధర్మజ్ఞా బహవో విప్రాః కర్తుమర్హంత్యనుగ్రహం॥ స్నేహాద్వా యది వా లోభాద్భయాదజ్ఞానతోపి వా। కుర్వంత్యనుగ్రహం యే తు తత్పాపం తేషు గచ్ఛతి॥ దుర్బలేనుగ్రహః కార్యస్తథైవ శిశువృద్ధయోః। అతోన్యథా భవేద్దోషస్తస్మాన్నానుగ్రహీ భవేత్॥ యత్తూక్తమంగిరసా॥ పాతకేషు శతం పర్షత్సహస్రం మహదాదిషు ఉపపాతకేషు పంచాశత్స్వల్పే స్వల్పం తథా భవేదితి॥ తదభ్యాసవిషయం॥ అంగిరాః॥ ఆర్తానాం మార్గమాణానాం ప్రాయశ్చిత్తాని యే ద్విజాః। జానంతో న ప్రయచ్ఛంతి తే తేషాం సమభాగినః॥ తస్మాదార్తం సమాసాద్య బ్రాహ్మణం తు విశేషతః। జానద్భిర్ధర్మసంధానం సభావ్యం తు పరాఙ్ముఖైః॥ అనర్థిత్వైరనాహూతైరస్పృష్టైశ్చైవ సంసది। ప్రాయశ్చిత్తం దాతవ్యం జానద్భిరపి సర్వథా॥ యత్పుణ్యముద్ధృతే పుంసి మ్రియమాణే జలాదిషు। తత్పుణ్యం తారితే పాపాత్ప్రాయశ్చిత్తైస్తు మానవే॥ ప్రాయశ్చిత్తవిధానేన దుష్కృతాన్మోచయేన్నరం। ఇహాముత్ర సుఖం విందేద్దద్యాద్వాయుర్యశో బలమితి॥ విష్ణుః॥ కర్తాం దేశ

కాలౌచ ప్రమాణం కారణం క్రియాం । అవేక్ష్య చ బలంచైవ ప్రాయశ్చిత్తం వదేద్బుధః॥ శరీరబలమాయుశ్చ వయః కాలంచ కర్మచ । పరీక్ష్యధర్మవిద్బుద్ధ్యా ప్రాయశ్చిత్తం ప్రకల్పయేత్॥ ఊనైకాదశవర్షస్య పంచవర్షాత్పరస్య చ । ప్రాయశ్చిత్తంచరేద్భ్రాతా పితా వాన్యస్సుహృజ్జనః ॥ విష్ణుః ॥ అశీత్యుత్తరవృద్ధోయః బాలోవాప్యూనషోడశః। ప్రాయశ్చిత్తార్ధమర్హంతి స్త్రియోవ్యాధిత ఏవ చేతి నామధారకవిప్రాణాం పరిషత్త్వం నాస్తీత్యాహ॥ పరాశరః॥ అత ఊర్ధ్వంతు యే విప్రాః కేవలంనామధారకాః। పరిషత్త్వం న తేష్వస్తి సహస్రగుణితేష్వపి అతః వర్ణితగుణవద్బ్రాహ్మణేభ్యః ఊర్ధ్వం తద్వ్యతిరిక్తాగుణరహితా ఇతియావత్॥ స ఏవ॥ సావిత్ర్యాశ్చైవ గాయత్ర్యాస్సంధ్యోపాస్త్యగ్నికార్యయోః। అజ్ఞానాత్కృషికర్తారో బ్రాహ్మణా నామధారకాః॥ యథా కాష్ఠమయోహస్తీ యథాచర్మమయోమృగః। బ్రాహ్మణోప్యనధీయానః త్రయస్తే నామధారకాః॥ ప్రాయశ్చిత్తం ప్రయచ్ఛంతి యే ద్విజానామధారకాః। తే ద్విజాః పాపకర్మాణస్సమేతానరకం యయుః॥ యయుః- యాంతీత్యర్థః॥ స ఏవ ॥ అవ్రతానామమంత్రాణాం జాతిమాత్రోపజీవినాం। సహస్రశస్సమేతానాం పరిషత్త్వం న విద్యతే॥ యద్వదంతి తమోమూఢా మూర్ఖా ధర్మమతద్విదః । తత్పాపం శతధా భూత్వా తద్వక్తౄనధిగచ్ఛతి అజ్ఞాత్వా ధర్మశాస్త్రాణి ప్రాయశ్చిత్తం దదాతి యః। ప్రాయశ్చిత్తీ భవేత్పూతః కిల్బిషం పరిషద్వ్రజేత్ ॥ యద్వినా ధర్మశాస్త్రేణ ప్రాయశ్చిత్తం విధీయతే। న తేన శుద్ధిమాప్నోతి ప్రాయశ్చిత్తే కృతేపి సః॥ రాజ్ఞశ్చానుమతే స్థిత్వా ప్రాయశ్చిత్తం వినిర్దిశేత్ । స్వయమేవ న కర్తవ్యం కర్తవ్యా స్వల్పనిష్కృతిః॥

(౫౫౬) ఇకను ప్రాయశ్చిత్తప్రమాణవచనములను జెప్పుచున్నాఁడు॥ సకల పాపములను నశింపఁజేయువాఁడును, లక్ష్మీపతియును, అగు నారాయణునకు నమస్కారములను సల్పి సకల శాస్త్రములను నాలోచించి చక్కఁగఁ దెలియుట కొఱకుఁ బ్రాయశ్చిత్తముయొక్క పద్ధతి చెప్పఁబడుచున్నది. మునులు సర్వకాలములయందును శ్రుతిస్మృతులను నాలోచింతురు. కావున శ్రుతిస్మృతులు రెండును ప్రమాణములని యెన్నవలయును. హేతుశాస్త్రములనాశ్రయించి శ్రుతిస్మృతులనవమానించువాఁడు వేదనిందకుఁడనియును, నాస్తికుఁడనియును జెప్పఁబడునుగాన నట్టివానిని సాధువులగువారు బహిష్కారమును జేయవలయునని మనువు వచించెను. పురాణములు, మనుధర్మశాస్త్రము, శిక్షావ్యాకరణాదులతోఁగూడిన వేదచతుష్టయము, చికిత్సకశాస్త్రము, అను నాల్గును ప్రమాణసిద్ధములనియును, ఈ

నాల్గింటిని హేతువాక్యములచేత దూషింపఁగూడదనియును, ఈనాలుగువిధములగు వాక్యములను నిందించువాఁడంధతామిస్రమను నరకమునందుఁబడి మిగులఁ గష్టముల ననుభవింపుననియును విష్ణువుసెప్పె. జ్యోతిషమును, వ్యవహారమును, ప్రాయశ్చిత్తమును, వైద్యమును, శాస్త్రవిహీనముగఁ జెప్పువాఁడు బ్రహ్మఘాతకుఁ డనఁబడునని వ్యాసుఁడు వచించె. విహితమైన కర్మను జేయనివాఁడును, నిందితమైనకర్మను జేయువాఁడును, ఇంద్రియార్థములయందు సక్తుఁడును నగు మానవుఁడు ప్రాయశ్చిత్తమును జేసికొనఁదగినవాఁడగునని మనువచించె. విహితకర్మలను జేయక పోవుటవలనను, నిందిత కర్మలను జేయుట వలనను, ఇంద్రియములనిగ్రహింపలేక పోవుటవలనను, మానవుఁడు నరకమును బొందునని యాజ్ఞవల్క్యు వచించె. మానవుఁడని చెప్పుటచేత నీవిషయమునకు ప్రతిలోమజాతివారు గూడ లోఁబడుదురని నెఱుంగవలయును. కావునఁ బరిశుద్ధతకొఱకుఁ బ్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ప్రాయశ్చిత్తమును జేసికొనుటచేత, అంతరాత్మయును లోకమును బ్రసన్నమగును. అట్లుగా లోకులందఱును నట్టివానితోఁగూడ భోజనాది వ్యవహారములను జరుపుదురనుట. ప్రాయశ్చిత్తమును జేసికొననివారును, పాపకృత్యములయందాసక్తిగలవారును, పశ్చాత్తాపదగ్ధులుగానివారును, దారుణములగు నరకములను బొందుదురు. నరకములను వివరించెదను. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుడ్మలము, పూతిమృత్తిక, కాలసూత్రకము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రవనము, తాపనము, అనినరకములిరువదొకవిధములై యుండును. మహాపాతకోపపాతకములు మొదలగువానినాచరించినవారిట్టినరకములనుబొందుదురని యాజ్ఞవల్క్యుఁడు వచించె. నరకములిరువదెనిమిదికోట్లవిధములుగలిగియున్నవి. మహాపాతకోపపాతకాదులను జేసినవారీనరకములయందు, సూర్యుఁడును, చంద్రుఁడునున్నంతవఱకును బాధనుబొందుచుందురని కాలనిర్ణయము విష్ణుధర్మోత్తరమునందుఁ జెప్పఁబడినది. మహాపాతకములను జేసినవారు రెండువేలసంవత్సరములు నరకములననుభవింతురు. అతిపాతకములయందు నైదునూఱులసంవత్సరములు నరకలోకమునందుందురు. సమపాతకములను జేసినవారు వేయిసంవత్సరములు నరకములననుభవింతురు. ఉపపాతకములను జేసినవా రైదునూఱులసంవత్సరములు నరకములననుభవింతురు. సంకలీకరణాదులయందు రెండునూఱుసంవత్సరములు నరకములనను

